# తుపాను

(సాంఘిక నవల)

అడివి బాపిరాజు




త్రివేణి పబ్లిషర్సు
మచిలీపట్టణము

రు. 4-8-0

3 AA\ 01 B 2461 225
H!-8.3
W!-5.3

# అంకితము

## శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావుగారికి

మంచిగంధం చెట్టువోయీ
ఓ నేస్తకాడా
ముంచి తేల్చే పరిమళావృతుడా!

పసలపట్టి చేరవచ్చును
మిసమిసలుగా వెలిగిపోతూ
మేలి సర్పము లెన్నొ నీకడకూ
ఓ రామకోటీ
శిల్పపతులట కావ్యపతులంటా!

నీకు నాకూ పూర్వబంధము
నీకు నాకూ నేటి స్నేహము
నిత్య నిర్మల కాంతి పుంజమురా
ఓ రామకోటీ!
నీకు ఇది నా ప్రేమచిహ్నమురా

నీ ప్రియమిత్రుడు
అడివి బాపిరాజు
కృతికర్త

# తుపాను

## ప్రస్తావన

### 1

పూర్వకాలం వాళ్లంటికి ప్రణయతత్వం ఏమి తెలుసునా అని నా అనుమానం. ఏమీ తెలియదని నా దృఢనమ్మకం. పూర్వనాయికలు ప్రేమించారు. నాయకులకై విరహవేదన పడినారు. మదనజ్వర తాపోపచారాలు చేయించుకున్నారు. లేత అరటాకు వీవనలు, చిగురుటాకు పాన్పులు. 'ఆ మన్మథాకారుని చూడలేని కళ్లు గాజురాళ్లు' అనుకున్నారు. అలాగే ఏమేమో కాంక్షలతో కుంగిపోయేవారు. వాళ్ళ ప్రేమ రైలుపట్టాప్రేమ. ఒక మనిషిని ప్రేమించడంఅంటే వాడితో దాంపత్యధర్మం అనుభవించాలన్న మాటేనా? తక్కిన వాళ్ళంతా అన్నలూ, తమ్ములూనా? అంతే! కాని యీ రోజుల్లో నాబోటి యువతులకు 'విచిత్ర భావసంకీర్ణత' ఉన్నది. ఆనాటి యువతీ చరిత్రలో మా నాటి యువతీ చరిత్ర ఒక అధ్యాయంకాలేదు. నాబోటి చదువుకున్న, నవయవ్వనంలో ఉన్న యువతులు కొందరంకలసి మా భావలో ఉండే ప్రేమతత్వాన్ని తెలియజేసే పదం ఏమన్నా ఉందా అని ఆలోచించాము. పూర్వకాలములో స్త్రీలకు పురుషులకు ఉండే సంబంధం రసస్వరూపంలో ఆలోచించారుగాని మానవజాతిలోని ఒక పెద్ద సమస్యగా ఆలోచించలేదు. ప్రేమ, ప్రణయం అనే పదాలలో ప్రణయానికి ప్రళయానికి ధ్వని సంబంధం కనపడడంచేత, 'ప్రణయం' అనే మాటే బాగుందని అది ఏరుకున్నాం. ప్రేమ అనే పదం 'లేమ' అన్నట్టుగా ఉంటుంది; కాబట్టి దాన్ని తోసేశాము. ప్రణయానికి మేము చెప్పికొన్న అర్థం అపారం, అద్భుతం, అత్యంతక్లిష్టం, అస్పష్టం, ఆశ్చర్యకరం.

### 2

నా ప్రణయ వస్త్రములోని అల్లిక జంటపోగులతో, మూడు పోగులతో, రంగురంగుల మూలవాటపు దూవ్‌చాహాన్ కలయికలతో నిండిఉన్నది. నేను నలుగురిని ప్రేమిస్తున్నా, కాదు ప్రణయిస్తున్నా ననుకోండి. శ్రావ్యమైన కంఠం కలిగినది ఒకరు, మంచి రూపం కలిగినది ఒకరు, మాటలపోగు ఒకరు, మానం కలిగింది ఒకరు.

నిశాపతిరావు పేరుమాత్రం సార్థకంచేసుకోడు. వట్టి నిశారావు అన వచ్చును. నల్లగా, సన్నగా, పొడుగ్గా ఉంటాడు. తెల్లని కళ్ళు, నవ్వితే తెల్లని పళ్ళు తప్ప చంద్రుని పోలిక అతనిలో ఎక్కడా లేదు. కాని అతని కంఠంమాత్రం ఉంది చూశారూ, మహామందరగంభీరతను మథించి తేర్చి తెచ్చిన వెన్నవంటిది. మనిషిని చూస్తే చీకట్లు కమ్ముతాయి, గొంతుక విప్పితే కువలయాలు విచ్చుతాయి. ఆ ప్రకాశంలో అతడూ కలిసిపోతాడు.

"నీ చేతులు కడుక్కుని 'స్వానింగు బాటిల్సు' నింపి వర్తకం చేసుకొన వచ్చు. నా తెల్లని చీరను అంటకు, చీర నల్లబడిపోతుంది" అనేదాన్ని. ఇలా యేడిపిస్తూంటే అతనికి కళ్లనీళ్లపర్యంతమూ అయ్యేది. అతన్ని యేడి పించుకుతినటంలో ఇంతైనా జాలి కలిగేదికాదు నాకు.

అప్పుడు గొంతు విప్పాడా ప్రవహించేది ఒక గాఢ పరిమళం; మధు రాతి మధురమైన మధువు; ఊళ్ళూ కోళ్ళూ యేకంచేసుకుని పరవళ్ళుత్రొక్కే మహానది. ఆ నాగస్వరం యెదుట ఊగే పన్నగిని నేను. సుడిగుండాలలో పడి కరగిపోయిన చిన్న వాగును! అతని గొంతుక సమ్మోహనాస్త్రం! దానిలో ఏదో తీయనిబాధ ఉండేది. ఆ గొంతుకలో ఏ రాగమో, ఏ పాటో ఆలా పిస్తూ, చైతన్యరహితురాలనైన నన్నావేళ అత డేమిచేసినా దేహమూ, మానమూ, ప్రాణమూ అర్పించి ఉండేదాన్ని. ఆ గాన దావానలం ముందర నా గర్వం కరగిపోయి, నా రసజ్ఞత, నా హృదయము బయటికి స్రవించి ఆ మంటల్లో పడి బుగ్గైపోవలసిందే.

ఇంత మహాశక్తి అతనికి ఉన్నా, అతనిలో ఒక పెద్ద లోటు ఉన్నది. నిశాపతిరావు పౌరుషంలో మార్దవంలేదు. అతనికి స్త్రీలు భోగవస్తువులు మాత్రం అనుకుంటాడు. 'ఎలాంటి కౌశల్యము గలిగిన స్త్రీ అయినా, ఎలాంటి విజ్ఞానవతి అయినా, ఎంతటి విద్యావంతురాలైనా అలాంటి స్త్రీ మరింత ఉత్తమ మైన భోగవస్తువుగామాత్రమే అవుతుంది' అని అతని వాదన. ఇట్టి తుచ్ఛ పశుత్వభావం కలిగిఉండడంచేతనే పురుషుడైన నిశాపతికిన్నీ, గానమూర్తి యైన నిశాపతికిన్నీ సగమెరుక. స్త్రీని ముట్టుకుని గొంతుక యెత్తలేడు. గొంతుక సారించి స్త్రీని ముట్టుకోలేడు. స్త్రీ స్పర్శమాత్రాన అతను పశువై పోతాడు. ఒళ్ళు వణకిపోతుంది. మధుపానమత్తునిలా కళ్ళు కెంపులెక్కి తూలిపోతాడు. కొంకర్లుపోయే అతని వేళ్లు వనితావక్షోలపైకి, ఊరువులపైకి వాలబోతాయి.

అతని గొంతుక అంటే వెఱ్ఱి మోహంలో పడతాను. అతని గొంతుక ఆగిన మరుక్షణంలో నిండు మెలుకువ వస్తుంది. నిర్వచింపలేని అతని మధుర గంభీర కంఠంనుండి స్వరమధుప్రవాహాలు ప్రవహింపజేస్తూ అతడు ఆక్రమించి వస్తే కిక్కురుమనకుండా సర్వార్పణచేసి ఉండేదాన్నే. సంగీతం పాడుతూ గాఢకాంక్షతో అతడు నన్ను ముట్టుకునేటప్పటికి అతని గొంతుక కొడిగట్టిన

దీపంలా తుస్సున ఆరిపోయేది. అప్పుడు అతన్ని చూచి నా కళ్ళు కెంపు లెక్కేవి. అతడు కుంగి వణికిపోయేవాడు. అందుచేత మే మిద్దరం ఒకళ్ళొకళ్ళం గౌరవించుకుంటూ దూరదూరంగా ఉంటూంటాము.

## 3

కల్పమూర్తి సింహంలాంటి మనిషి. అతని వక్షం విశాలమైనది. అతని భుజస్కంధం దిమ్మెసలాంటిది. అతని మెడ పోతపోసిన కంచు. బలం మూర్తి కట్టి, కోట్లకొలది వానలకు తడిసి, నునుపెక్కిన రాతిబండల్లాగ తిరిగిపోయిన చేతులూ కాళ్ళూ! వీనికి తగిన ఉన్నత శరీరము, తీరైన ముఖము. కల్పమూర్తి గ్రీకు అపోలోను మించిన సౌందర్యమూర్తి. కాని కల్పమూర్తి తన మెదడును క్రిందటి జన్మలో మరచిపోయి వచ్చాడు. చెప్పింది త్వరగా అర్థం చేసుకోలేడు. అర్థంచేసుకున్నది అతికించలేడు. అతుకులేని అతని భావాలు అతన్నే కంగారు పెడతవి.

తండ్రి కావలసినంత సంపాదించి యిచ్చాడు. బంగారానికి ఏమీ కొదువ లేదు. ప్రయివేటు మాష్టర్ల కష్టఫలితంగా అయిదవ ఫారంవరకూ యీడ్చుకు వచ్చాడు. స్కూలుఫయినలు పరీక్షకి ఎంత గొప్పవారి అభిమానమున్నా సున్నలికి మార్కులు కలిపి అతన్ని పైకి ఎట్లా నెట్టగలరు? అంతటితో చదువు చాలించాడు.

అతని హృదయం నవనీతం. కల్పమూర్తి ఒకళ్ళకి అవగింజంతైనా కష్టం కలిగించలేడు. పెద్ద డేనుకుక్కలా నా చీరకొంగుల వెనుకనే తిరుగుతూంటాడు. ఆ విశ్వాసము, ఆ భక్తి, ఆ వెఱ్ఱిపూజ, ప్రపంచ శిఖరితమైన అతని మూర్తి, అతని భాగ్యమూ చూసి, ఇంకో స్త్రీ అయితే అతనికి దాసానుదాసురాలు కావలసిందే. సమంగా కోలగాఉన్న అతని ముఖం చూస్తాను. విశాలమైన ఫాలము, విస్ఫారితాలైన నేత్రాలు, విపంచిరూపంగాఉన్న నాసిక, విల్లయి పగడాలు చేర్చుకున్న పెదవులు, వియద్గంగావికసిత హేమపద్మముకుళంలాంటి చిబుకము, బంగారపు అతని ఒళ్ళు, అకల్మష హృదయం ప్రతిఫలించే అతని నవ్వూ చూస్తూ ముచ్చట పడిపోతాను. ఒక్క నిమిషం అతడు లేకపోతే నాకు తోచదు. అంతే!

దృఢమైన తన బాహువులతో అతడు నన్నదుముకుంటాడనే ఊహ నాకు కంపరం పుట్టిస్తుంది. నా పెదవులను అతని చక్కని పెదవులతో, తనివితో తాకడం అనే ఊహ నన్ను కుంగచేస్తుంది. అతన్ని నా పురుషుడిగా, నా భర్తగా భావించుకోలేను. అతడు నా రసజ్ఞతకు అలంబమైన ఒక వస్తువు మాత్రము. మోటారు బాగా నడపగలడు. టెన్నిసులో యోధుడు. కుస్తీలో అందెవేసిన చెయ్యి. ప్రయాణాల్లో పెట్టెలు ఖాళీచెయ్యడం, టిక్కట్లు తెప్పించడం, సర్వసౌకర్యాలను సమకూర్చడం అతనికి ఉగ్గుబాలవిద్య. ఎంత కొత్త వాళ్ళయినా అతనికి భయంలేదు. వాళ్ళతో అతడు బాగా స్నేహం చేయ

గలడు. రైల్వే ట్రాఫిక్ మానేజర్లు, స్టేషనుమాస్టర్లు, రైల్వే ఇంజనీర్లు, కలెక్టర్లు, పోలీసు సూపరింటెండెంట్లు, డిప్యూటీ సూపరింటెండెంట్లు, ఎక్సైజు అసిస్టెంటు కమీషనర్లు, యినస్పెక్టర్లు — యీ జాబితాకు అంతులేదు—అతని స్నేహితులు.

తమతమ ప్రణయాన్ని నాకు తెల్పడంలో నిశాపతికీ కల్పమూర్తికీ చాలా తేడా ఉన్నది. 'నీ అందం ఓ లక్ష గులాబీలపోగు హేమసుందరీదేవీ! నీ కళ్లలోని గాఢపుదమి నా కంఠంలోని అతిగభీరాలను గానమధువుతో అంచు లంటా నింపగలదు, మోహనమూర్తీ!' అంటాడు నిశాపతి.

'హేమా! నా సర్వస్వమూ నీది. సౌందర్యానికి నిగ్గులుదీర్చే దేవతా స్త్రీలు నీముందర వికారంగా ఉంటారు. మా అమ్మ నీవు ఎప్పుడు కోడలుగా వస్తావో అని కలవరిస్తూంది. ఈ కాలంలో చదువుల తేడాలు పరిగణించవలసిన అవసరం...అవసరం...లేదని నా మనవి. అది నిజంకాదూ? కాదూ!' అని అతి విశ్వాసపూరితమైన వృషభనయనాలతో నా పాదాలు పూజిస్తూ మొకరిల్లు తాడు కల్పమూర్తి.

## 4

కల్పమూర్తి నీడలా వస్తాడు తీర్థమిత్రుడు. తీర్థమిత్రుడు కర్పూర శలాక లాంటివాడు. ఆడదాని సౌందర్య మాతనిది. కళ్ళు కన్నన్‌బాల కళ్ళలా నవ్వుతవి; కాంచనమాల కళ్ళలా కాంతిస్తవి; పుష్పవల్లి కళ్ళలా పులకరాల పూజలు సమర్పిస్తవి. ఎప్పుడూ నవ్వుతూంటాడు. ఉంగరాల అలకలు తేలు జుట్టూ, చిన్న ఫాలమూ, గుండ్రనిమోమూ ఎప్పుడూ నవ్వుతూనే ఉంటవి. సమమైనముక్కు, కాయ శరీరము, ఉజ్జ్వల శ్యామలచ్ఛాయ స్పష్టతతాల్చిన మూర్తి. మిట్టమధ్యాహ్నపు లేత రావిచెట్టులా ఉంటాడు. పొట్టివాడు.

తీర్థమిత్రునితో నడిచివస్తుంది సంతోషదేవత. విషాదంలో కూలిపోయిన వారుకూడా అతడు వచ్చేటప్పటికి సంతోషాకాశంలో తేలిపోతారు. అతని అడుగుల చప్పుడు వినేటప్పటికి నా హృదయంలో సంతోషరాగాలు ఉద్భ విస్తాయి. నా పని ఇంతైనా నన్ను చేసుకోనివ్వడు. అతడు సమీపంలో ఉంటే తోచకపోవటమనేది దగ్గఱకురాదు. ఎన్ని గంటలయినా గణగణ మాటలాడుతాడు. అతనికి ఒక్క విషయమూ తెలియదు, తెలియని విష యమూలేదు. అతడు ఏ పుస్తకమూ చదవడు, అన్నిపుస్తకాలూ చదివినట్లు కనపడతాడు; ఏ పత్రికా చూడడు, పత్రికలలోని వార్తలన్నీ చెపుతాడు.

తీర్థమిత్రుడు సంగీత పాటకుడు కాడు. అయినా తియ్యగా పాడ గలడు. తనపాటల్ని తాను హార్మోనియం మీద వాయించగలడు. వాయించు కుంటూ పాడగలడుగాని అతని గొంతుకలో లోతులులేవు. రాసుకున్న పది నిమిషాలవరకు మాత్రం సువాసనవేసే అత్తరులాంటిది అతని గొంతుక.

'ఆడమ్మాయి' వలె మాట్లాడుతాడు, 'ఆడమ్మాయి' లా నడుస్తాడు. మామూలు మాటల్లోకూడా అతని గొంతుక ఆడగొంతుకే. స్త్రీ సహజమైన జాగ్రతతో అలంకరించుకుంటాడు. క్రీములు, పౌడర్లు, సెంట్లు రాసుకోడంలో నాతో సమానమైన చెయ్యి. సిల్కులలో మునిగి, సిల్కులలో తేలుతాడు.

కల్పమూర్తితో సమానమైన చెయ్యి టెన్నిసులో. బేస్‌లైన్ ఆటలో ఇతన్ని మించినవారు లేరు. 'చాపింగ్'లో 'హాఫ్‌వాలీ'లో మహామాంత్రికుడు. మా స్నేహితులు చాలామంది ఇతని ఆటని 'జిడ్డుఆట' అంటారు. గంటలకొద్దీ, సునాయాసంగా, చెమటతో షర్టు సుంతయినా తడవకుండా టెన్నిస్ ఆడగలడు. తాను 'పాయింటు' తియ్యలేడు. ఇతర్లని తీసుకోనివ్వడు. ఇతన్ని నెగ్గాలంటే 'స్మాష్' తోటి, 'నెట్ డ్రాప్'లతోటి నెగ్గవలసిందే. ఒక్క కల్పమూర్తి తప్ప ఇతన్ని టెన్నిసులో గెల్చేవారెవ్వరూ లేరు.

తీరమిత్రుడు కవికాడు. కాని కవిత్వంలాంటి పాటలు అప్పటికప్పుడు కల్పించి పాడుతూంటాడు. వీళ్ళ పాటల్లోంచి ఓ పాదం, వాళ్ళ పాటల్లోంచి ఓపాదం కలేసి విచిత్రమైన రుచులు అందిస్తూంటాడు. ఎవరైనా అతనికి కొత్తలేదు. ఏలాంటి వాళ్ళతోనైనా నిమిషంలో స్నేహం చెయ్యగలడు.

## 5

ఇంక, త్యాగతి శర్వరీ భూషణుడు కురూపీకాడు, అందమైన వాడూ కాడు. ఆలోచిస్తే అన్నీ అందమైన రేఖలే, అన్నీ చక్కని వస్తువులే. విలక్షణమైన విచిత్రమూర్తిత్వము అతని శరీరసౌష్ఠవములో ఉన్నది. అతన్ని మరవలేము. అతన్ని 'త్యాగతి' అని మాత్రం పిలుచుకుంటాము.

నవ్వడు. నవ్వుకన్న విలాసమయిన దేదో అతని పెదవుల్లో నాట్య మాడుతూంటుంది. అతని ఫాలాన అతిగభీరకాసార నిశ్చలత గోచరిస్తుంది. అతని మూర్తిలో ఏవో భావాలూ, ఏదో తీక్ష్ణత, ఏమో నమ్రత ప్రత్యక్షమవుతూ ఉంటవి. అతనికళ్లు చిన్నవీకావు పెద్దవీకావు; కనుబొమలకు దిగువుగా లోతుగా ఉంటవి. అయినా వాటి మూర్తిమాత్రం అతి అందమైన తామర పువ్వు రేకలు. కనురెప్ప వెంట్రుకలు చాలా పొడుగు. కళ్ళల్లోని నీలిపాపలు స్పష్టమైన వర్ణము కలవి. ఆ కంటిపాపల్లో ఏవో వెలుగులు ఎప్పుడూ నాట్య మాడుతూంటవి. ఆ కళ్ళముందర ఎవ్వరూ అబద్ధాలు చెప్పలేరు. అసత్యము ఆలోచింపలేరు. అతని చూపులయెదుట నా హృదయం నగ్నమూర్తి అయిపోతూంటుంది.

త్యాగతి ఎప్పుడూ మాట్లాడడు. మాట్లాడాడా రెండు ఎత్తైన కొండల మధ్యనుంచి ప్రవహించే మహానదుల గంభీరధ్వనిలా ఉంటుంది. రాత్రి పన్నెండు గంటలకు నిశ్శబ్దంలో వినపడే సముద్రఘోషలా ఉంటుంది. 'సెల్లో' వాద్యం మందరం తీగలా ఉంటుంది. ఏ సంభాషణలోనన్నా అతడు ఒక్క

మాట చెప్పితే ఇకెవ్వరూ జవాబు చెప్పలేరు. అందరూ నిరుత్తరులైపోవలసిందే. త్యాగతి అంటే నాకు భయం, భక్తీకూడాను.

త్యాగతికి ఏవిధమైన ఉద్యోగమూ లేదు. కాని గొప్ప శిల్పి చిత్రకారుడూ. నాకూ, అతనికీ అడియారులో ప్రథమ పరిచయం కలిగింది. అతని మూర్తిలోంచి ఏదో సమ్మోహనశక్తి నన్నాకర్షించింది. మా పరిచయం గాఢమై స్నేహంగా పరిణమించింది. సూర్యుడన్నా కాలం విషయంలో అశ్రద్ధగా ఉంటాడేమో కాని త్యాగతి రోజూ సరిగా, సాయంత్రం అయిదు గంటలకి మా యింటికి వచ్చేవాడు.

త్యాగతికి ముప్పది సంవత్సరములు వయస్సు ఉంటుంది. ఖద్దరు తప్ప యితరదుస్తులు ఎప్పుడూ ధరించడు. ఆ దుస్తులు ఎప్పుడూ అందంగా కుట్టబడి ఉంటవి. అవి ఎంతో శుభ్రముగా ఉంటవి. త్యాగతి ఎప్పుడూ ఏదో అతి సున్నితమైన సువాసనాద్రవ్యాన్ని ఉపయోగిస్తాడు. వేసవికాలంలో వట్టివేళ్ళ అత్తరు, వానాకాలంలో మల్లి అత్తరు, శరత్కాలంలో కేతకి, సీతాకాలంలో హెన్నా, వసంతంలో గులాబి అత్తరు వాడేవాడు. ఏనుగుతల చెక్కిన చక్కని పొన్నుకఱ్ఱ అతని చేతిలో ఎప్పుడూ ఉంటుంది.

త్యాగతికి నా రహస్యాలన్నీ చెప్పుబుద్ధివేస్తుంది; కాని ఏమీ చెప్పలేను. నా జీవితంలో ఎప్పుడైనా ఏ ఉపద్రవమయినా సంభవిస్తే త్యాగతి పట్టుకొమ్మ కాగలడనే విపరీత ధైర్యం నన్నావరించి ఉంటుంది. ఎందుకమ్మా నీకీ ధైర్యం అంటే అందుకు జవాబు చెప్పలేను.

## 6

ఈ నలుగురు స్నేహితులూ కొంచెం హెచ్చుతగ్గుగా రోజూ మా యింటికి చేరుతూ ఉంటారు. అయిదుగురం కలసి సినీమాలకి పోతూఉంటాము. లేదా మా కారుమీదో కల్పమూర్తికారుమీదో మనోహర ప్రకృతి నాట్య ప్రదేశాలకి విహారారము వెడుతూంటాము.

ఆరోజు 'గార్బో' నర్తకి నటించిన 'క్వీన్ క్రిష్టినా' చిత్రాన్ని చూస్తున్నాం. ఇద్దరు ఇటు, ఇద్దరు అటు, మధ్య నేను. నా కుడివేపున కల్పమూర్తి. ఎడమవేపున తీర్థమిత్రుడు. కల్పమూర్తి ప్రక్కన నిశాపతి ఉన్నాడు. తీర్థమిత్రుని ప్రక్కన త్యాగతి ఉన్నాడు. మంచుతెరలమధ్య హోటలులో చిక్కుపడిపోయిన క్రిష్టినా రాణి అఖండ ప్రణయసముద్రంలో పడిపోయింది. ఆ ప్రణయంయొక్క విచిత్రస్థితి అభినయించదగినది ఒక్క గార్బోయే!

ఆమె ప్రణయం చూచి, తీర్థమిత్రుని రక్తం ఉప్పొంగిపోయింది. తీర్థమిత్రుడు నా ఎడంచెవి దగ్గర పెదవిపెట్టి అన్నాడు: 'దేవీ! మా జీవితానికి మహారాజ్ఞివి. లక్ష్మిని హృదయంలో మాత్రమే ధరించాడు విష్ణువు. శివుడు పార్వతిని అర్ధదేహంలో దాచుకున్నాడు. తన సరస్వతిని బ్రహ్మ

నాలుకమీదమాత్రమే నాట్యమాడిస్తున్నాడు. కాని నిన్ను నేను నా జీవిత సర్వస్వము నింపుకొని పులకరించి భువనాలు నిండిపోతాను.'

'పిచ్చిమాటలు మాట్లాడక చిత్రం సరిగా చూడవయ్యా' అని విసుగుగా అన్నాను.

తీరమిత్రుడు మళ్ళీ నా చెవిలో 'ఎన్నాళ్ళిల్లాగ ఒంటిగా ఉంటావు? రాణీ క్రిష్టినాకూడా, తనకూ తన జీవితానికీ ఏమీ అడ్డం రానివ్వలేదు, చూడూ?'

'స్స'

ఇంక కొంతసేపటికి కల్పమూర్తి నెమ్మదిగా నాచెయ్యి పట్టుకున్నాడు.

'ఎంత మెత్తగా, సన్నగా ఉంది! ఎంత అందంగా ఉంది!' అన్నాడతను.

'మూర్తీ! మీ రెవ్వరూ నన్ను కథ చూడనివ్వరేమిటి?'

నా హస్తతలం అతని ఎడమచేతిలో ఒక్కనిమేషం ఇమిడిఉంది.

ప్రణయ కల్పనలు, కాంక్షాపూరిత అస్పష్ట వాక్యాలు, నిగూఢతా నిబిడమైన వ్యంగ్యకలాపాలు, పుంఖానుపుంఖాలుగా నన్ను ముంచివేయగా నిశాపతి కారు నడుపుతూన్న నాపక్క కూర్చున్నాడు.

'నువ్వెవరవు? మహాగాయకుని గాఢరాగానివి. నా గొంతుకలో మిన్నేరురవడై బంగారు ఝురులతో ప్రవహించి పోదువుగాని; నా హృదయంలోని మూర్ఛనల తాళాలకు ధిమి ధిమింకిత నృత్యం సలుపుదువుగాని.'

'క్రిష్టినా చూచి అందరికీ మతిపోయినట్లుంది' అన్నాను నెమ్మదిగా. కాని సౌష్టవములై, మేలిమి బంగారుఛాయలతో మిలమిలలాడుతూ ఉన్న వక్షోజాల వెనక దాగిఉన్న నా యువతీహృదయం నిర్వచింపలేని ఆనందంతో వివశత్వం పొందింది.

ఎవరి ఇళ్ళకడ వారిని దింపి, నేనూ త్యాగతీ మాయింటికి చేరుకున్నాం. కారును షెడ్డులోపెట్టి ఇద్దరం యింట్లోకి వచ్చాం. సిగరెట్టు తీసి వెలిగించి పొగ వదులుతూ నాపక్క సోఫాలంకారుడై నడిచి వస్తూన్న శర్వరీభూషణుని చూడగానే, నా మెదడులోని మత్తులు పటాపంచలైనాయి. ఆటలాడి అలసట పడిన చిన్నశిశువునైపోయాను. ఉస్సురని నిట్టూర్పు అప్రయత్నంగా నా హృదయంలోనుంచి వచ్చింది. కొంచెం తూలి ముందుకు పడబోయాను. తల్లి చెయ్యిలాంటి చేతిని నావీపున ఆనించినాడు త్యాగతి.

'హేమా! క్రిష్టినాకథ ఎవరినైనా తలక్రిందులు చేస్తుంది. కొంచెం పళ్లరసం తాగి ఏ ఆలోచనా లేకుండా పడుకొని నిద్రపో. సుడిగుండంలో దూకడం మొదట్లో ఆటగానే ఉంటుంది.'

నా కేదో భయంవేసింది. త్యాగతి భుజంమీద చెయ్యివేసి ఒక నిమిషం కదలకుండా నుంచున్నాను. త్యాగతి మౌనమే అత్యంత శమనమయింది.

ఇంట్లోకి వెళ్ళగానే సాత్కుడి బత్తాయిపండ్లు కోసి, రసం పిండి, వడ బోసి, అందులో ద్రాక్షాసవం అరఔన్సు వేసి త్రాగమని నాచేతి కిచ్చాడు త్యాగతి. నాకు కొంచెం సత్తువ వచ్చింది. మనస్సును ఏదో నిర్వచింపలేని ఆనందము ఆవహించినది.

'నేను బట్టలుమార్చుకు వస్తాను, పదినిమిషాలు ఉండవూ ?' అని అంటూ లోపలకి పరుగెత్తాను.

నేను మళ్ళీ తిరిగి వచ్చేటప్పటికి నీలిపచ్చని ఎలక్ట్రిక్ దీపపు వెలుగులో హాలులో పడమటిగోడకి వేళ్ళాడుతూన్న, తాను రచించిన నా చిత్రాన్ని చూస్తూ నిల్చుని ఉన్నాడు. తెల్లటి పట్టులాగున్నూ, మోకాళ్ళవరకు జీరాడుతూ ఉన్న తెల్లటి పట్టుచొక్కా తొడుక్కుని, తెల్లటి వల్లెతో గుమ్మందగ్గర నుంచుని అతన్ని చూస్తూన్నాను.

'ఆ డ్రెస్సు నీ కందం అనా ధరించి వచ్చావు ?'

నేను రావడం అతనికి తెలియదనే అనుకున్నాను. నాకు ఆశ్చర్యంవేసింది.

'ఇది పంజాబీ డ్రెస్సు.'

'పంజాబ్‌వాళ్లకి పంజాబు డ్రెస్సు అందం.'

'ఒకరికి అందమైనది ఇంకొకరికి అందం కాకూడదా ?'

'అందం అనేది వస్తుసంబంధాన్నిబట్టి ఉంటుంది.'

'ఆ సంబంధమే మనమూ చూపించకూడదా ?'

'అన్ని సంబంధాలు మనము చూపించగలమా ? వాతావరణం ?'

'నువ్వూ భోజనానికి వస్తావన్నాను తెలుసునా ?'

'మంచిది' అని అక్కడఉన్న ఓ సోఫామీద కూర్చున్నాడు. సిగరెట్టు ఆష్ ట్రేలో ఆర్పివేశాడు.

## 7

ఆ మర్నాడు త్యాగతితప్ప మేమంతా టెన్నిస్ ఆడుకుంటున్నాము. కల్పమూర్తీ, నేనూ ఓ పక్కని ఉన్నాం. నిశాపతీ, తీరమిత్రుడూ ఓ పక్కని ఉన్నారు. చెట్టుక్రింద క్యాంపుకుర్చీమీద కూర్చొని చెట్లఆకులు చూస్తూ త్యాగతి ఏ లోకాల్లోనో విహారంచేస్తున్నాడు. అతనివి చూచీచూడని చూపులు. నిశాపతి కళ్ళతో నన్ను కబళిస్తున్నాడు. కల్పమూర్తి అక్షులతో అర్చిస్తున్నాడు. తీరమిత్రుని దృష్టులు నా నిర్మల సౌందర్యస్నాతాలై సానందమత్తత తొలుస్తున్నవి. త్యాగతి చూపులో ఏమీ గోచరించడం లేదు. అవి అపహాస్యం చేస్తున్నవో, అత్యంత పరవశత్వం చెందుతున్నవో !

టెన్నిస్ అయాక అందరం వచ్చి త్యాగతిపక్కనే కుర్చీలమీద చతికిల బడ్డాం. మా సేవకుడు అందరికీ పానీయాలు తెచ్చి అందించాడు.

తీరమిత్రుడు: స్త్రీపురుషులు కలిసి పాశ్చాత్యదేశాలలో టెన్నిస్ మొదలైన ఆటలాడడం, నృత్యం సల్పడం అవీ చేస్తూంటారే, పూర్వకాలంలో మన దేశంలో ఇలాంటి ఆచారాలేవన్నా ఉండేవా? ఏమీ కనపడవు.

నిశాపతి: పాశ్చాత్య స్త్రీలు పురుషులు జంటగా సంగీతం పాడుతుంటారు. మన దేశాల్లో ఎక్కడ?

కల్పమూర్తి: పాశ్చాత్యదేశాల్లో స్త్రీ పురుషులు ఎక్కువ తక్కువలను చదువునుబట్టి ఏర్పరచలేదు!

తీరమిత్రుడు: ధనాన్నిబట్టా?

నిశాపతి: వారికుండే తెలివితేటల్నిబట్టి.

నేను: ఎవరి ఉలుకు వారు బయటవేసుకుంటున్నారు.

త్యాగతి: (మౌనం)

కల్పమూర్తి: పాశ్చాత్యదేశాలు మనకి పరవడా?

నేను: వారివల్ల మనం నేర్చుకోనవలసినవి చాలా ఉన్నాయిగా!

త్యాగతి: (మౌనంతో సిగరెట్టుపొగ వదులుతూన్నాడు.)

తీరమిత్రుడు: మనలో లక్షలోట్లు ఉన్నప్పుడు ఇతరులు ఏర్పరచిన రాజబాటను సరిగ్గా నడిస్తే మన జీవితం సునాయాసంగా అవుతుంది.

నిశాపతి: మనదగ్గరమాత్రం వాళ్లు నేర్చుకోవలసినవి లేవా?

తీరమిత్రుడు: ఒకటో రెండో మంచిసంగతులు కొన్ని నేర్చుకునేఉన్నారు.

కల్పమూర్తి: ఏమిటూ ఒకటో రెండో?

తీరమిత్రుడు: కొద్దిగా వేదాంతం, అత్తరువులు గిత్తరువులు ఉపయోగించడం...

నేను: అయితే మనదేశం ప్రపంచానికి ఏమీ యివ్వలేదంటావా?

త్యాగతి: (మౌనంతో సిగరెట్టు ఆర్పి, సిగరెట్టు బూడిదెగిన్నెలో వేశాడు.)

తీరమిత్రుడు: అనారోగ్యాలు, చాదస్తాలు, దెయ్యాలు, దేవతలు, భయాలు నేర్చుకోమన్నావా?

నేను: నీ వాదమంతా మన దేశంమీద అసహ్యత, పరదేశాలమీద భక్తితో బయలుదేరినదేకాని, న్యాయాన్యాయ విచారణదృష్టితో బయలుదేరింది కాదు.

త్యాగతి: ఒకదేశానికీ, ఒకదేశానికీ సమానసంబంధం కలిగిఉంటే, వారి ఆచారాలు కొన్ని వీరికి, వీరి ఆచారాలు కొన్ని వారికి వస్తాయి. అందులో కొన్ని చాలా అందంగానూ, కొన్ని చాలా అసహ్యంగానూ కనపడతాయి.

బానిసలకీ ప్రభువులకీ సంబంధంలో, బానిసలకి ప్రభువుల ఆచారాలు బాగున్నట్లు కనపడ్డం సహజం.

అందరూ మౌనం.

## 8

మర్నాడు పొద్దున్నే నేను నిద్రలేచి, మొహం కడుక్కొని, యివతలికి వచ్చేటప్పటికి తీర్థమిత్రుడు తయారు. కాఫీ పుచ్చుకొని తోటలోకి షికారు వెళ్ళాం. మా యిద్దరిచుట్టూ దక్షిణపుతోట, నందనవనానికి పాఠాలు నేర్పే సొబగులాడి. ఆ వనదేవత మమ్మల్ని కౌగిలిస్తోంది. ఆ పువ్వుల సువాసన నాకు వివశత్వం కలిగిస్తున్నది. నా యౌవనం సాఫల్యానికై చేతులుచాస్తున్నది. రంగువేయని ఎఱ్ఱని నా పెదవుల్లో అమృతాలు ఆస్వాదనకై పరవళ్లు త్రొక్కినవి. నా మనసులో కల్పమూర్తి పూజానయనాలతో మోకరించినాడు. నా హృదయంలో నిశాపతి సంగీతం సురభిళమై ప్రత్యక్షమైంది. ఎక్కడో మబ్బుల వెనకాల శర్వరీభూషణుని మౌనము తారకాకాంతై మినుకు మినుకుమన్నది. ఎదుట తీర్థమిత్రుడు.

చటుక్కున తీర్థమిత్రుడు నన్ను కౌగిలించుకొనబోయినాడు. నేనాతని త్రోసివేసి ఇవతల కురికి, కొంచెం కోపంతో, కొంచెం విసుగుతో, 'అబ్బా! ఉండవయ్యా! అస్పష్టతపీడని నా హృదయం నాకు దారి చూపించడం లేదయ్యా' అన్నాను.

అక్కడఉన్న ఓ వనవేదికమీద కూలబడ్డాను. అప్పుడు అమ్మయ్యో... తీర్థమిత్రుని కళ్ళల్లో ఏవో భయంకరమయిన కాంతులు తళుక్కుమని, మాయమయ్యాయి. అది నా భ్రాంతి అయి ఉంటుంది. దైన్యహాస కాంతులు వెదజల్లుతూ, కరుణార్ద్రాలైన ఆతని కన్నులు కర్కశద్యుతు లెల్లా వెదజల్లగలవు? కాని నాకా భ్రమమాత్రం ఎందుకు కలగాలి...? తీర్థమిత్రుడు ఒక నిట్టూర్పు విడిచి 'నా ప్రాణమే రూపందాల్చిన యీ తన్వంగి నా దురదృష్టంచేత నా పూజను గ్రహించడంలేదు.

'ఈ విధిని దాటులే
ఈ విధిని పొందులే
నా జన్మ తపసయ్యె
నా ఉన్మనమె వృథా!

కలువ పూబాలికను
కౌగిలింపగరాదు
త్వరపడితే నే ఫలము
దాపురించె నమాస!

తంగేటి జున్నుకై
　　పొంగిపోయిన నేమి?
భంగమొనరించేటి
　　భృంగాలు పొంచుచుండె'

'రా, లోపలికి వెడదాం. స్నేహితులు వచ్చేవేళ అయింది' అని, తల వాల్చుకొని నడిచా. 'ఈతని పూజ గొప్పదేకాని అతనికి భార్య ఉన్నదే!' అనుకుంటూ అడుగులు తడబడుతూ లోపలికి నడచాను.

## 9

అక్కడ శర్వరీభూషణుడు తాంబూలం వేసుకుంటూ, యాలుక్కాయ వొలుస్తున్నాడు. కనురెప్పవాల్చని గంభీరదృష్టులు అతడు నాపైన ప్రసరించినాడు. ఆ చూపులు నా గుండెలకి భయమును అద్దినవి. ఎప్పుడూ పొందని సిగ్గు శాలువలా నన్ను కప్పివేసినది. త్యాగతి ఎవరని మేము నిశ్చయించుకొనే వాళ్ళం.

తీర్థ : అతడు అఘోర సన్యాసి అని నా ఉద్దేశం!

కల్ప : అతడు మంచివాడు. మనుష్యుని వెనకాల అతన్ని వెక్కిరించడం పురుషలక్షణంకాదు.

నేను : ఆయనకూ, నాకూ పరిచయం కలిగినది ఈ ఏడాదిలోనే. అయినా ఎంత స్నేహితుడైనాడు!

కల్ప : ఈవాళే ఆ ప్రశ్న మనలో పుట్టిందేమిటి?

నిశా : ఆ ప్రశ్న నా మనస్సులో ఎప్పుడూ ఉండనే ఉన్నది.

తీర్థ : అడగనా నువ్వెవరని?

నేను : అలాంటి తెలివితక్కువ పనులు చేయకు.

కల్ప : ఆయన ఎవరో పూర్తిగా తెలపటం అనే ఇటువంటి ముఖ్యమయిన విషయంలో ఆయన ఉదాసీనత వహించగలడా? ఎవరి రహస్యాలనైనా మనం మన్నించాలి.

నిశా : ఈ ఏడాదినుంచీ రహస్యం వీడని స్నేహం అంత గొప్పదా మనం గౌరవించడానికి?

నేను : అలాంటి స్నేహాన్ని నేను మాటాడకుండా గౌరవించానుకాదా? పైగా ఏమి రహస్యాలున్నాయి ఆయన జీవితంలో! మహాశిల్పి, చిత్రకారుడూ అతడు.

తీర్థ : నిన్నుబట్టే మేమంతా గౌరవిస్తున్నాము; లేకపోతే...

నిశా : ఈజిడ్డుఆముదం ఎవరిక్కావాలి?

తీర్థ : తంటసాన్ని ఎవరు కోరుకొంటారు కావాలని!

కల్ప : ఈ రోజున మన కందరికీ జ్ఞానోదయం అవుతున్నది.

నేను : అయితే మా తండ్రిగారి కతడంటే ఉన్న గౌరవం టంగుటూరి ప్రకాశం గారన్నా లేదు.

తీర్థ : ముసలివాళ్ళు ముసలివాళ్ళని గౌరవిస్తారు.

కల్ప : ఆయనకు ముప్పై, ముప్పైఒకటి కన్న ఎక్కువ వయసు ఉండదు. ఇరవై అయిదేళ్ళ యువకునిలా ఉంటాడు.

నిశా : మామయ్యగారు అరవై ఏళ్ళవారులా ఉంటారా? ముప్పైఏళ్ళ మూర్తిలా ఉండరుమరి!

నేను: ఇదంతా శుష్కవాదన. ఏకారణం అయితే ఏమి, త్యాగతి నా స్నేహితుడు.

ఈలా ఒకనాడు త్యాగతి లేకుండా వాదన జరిగింది. అదంతా ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. ఈ ఆలోచనలన్నీ త్యాగతి యాలక్కాయ నోట్లోవేసుకొనే లోపుగానే నా హృదయంలో మెరుముల్లా మెరిసి మాయమైపోయినవి. తీర్థమిత్రుడు పెదవులతో నా దేహాన్ని స్పృశించినంతమాత్రాన్నే నేను మైలపడిపోయాననుకునే ఛాందసురాలిని కాను. ఇష్టతాయిష్టతలు యే కారణాలనుబట్టి యేర్పడతవో? ఇష్టతాయిష్టతలు మానవ జీవితచరిత్రకు యెన్నిరకాల ప్రకరణాలను సృష్టిస్తున్నవో? ఆడదాని జీవితము మొగవాడి జీవితముతో కలిపివేసుకోవడముతోనే ఆఖరా? వారి సంఖ్యను వృద్ధిపొందించడమే ఆడదాని కర్తవ్యమా? ఆమె అందమైన కళ్లు, సుందరరేఖాసమన్వితమైన ఆకార సౌష్ఠవం, పూర్ణాంగాలు, స్నిగ్ధవక్షాలు, అసమాన లావణ్యము, అద్భుత మాయాపూరిత జఘనము, బంగారు మోహర్‌పూవులలాంటి పాదాలు—ఇవన్నీ యెందుకు? పురుష కామాగ్నికి ఇవన్నీ ఇంధనాలు కావాలసిఉంటే, ఆడది మగవాడికన్న నాలుగువేల సంవత్సరాలు వెనకాలపడి ఉన్నదన్నమాటే! పురుష జీవితానికి మహాదాశయము స్త్రీ అని పురుషుడు కల్పించే రాతలూ, పాటలూ, స్త్రీని పురుషుడు మాయమంచులు కప్పి పశువుగా ఉపయోగించుకోడానికేనా? అందుకు స్త్రీ అభ్యంతరం చెప్పక తయారా!

ఇంక నేను ఈ నలుగురు స్నేహితులతో సంచరించే విధానంలో ఉండే అర్థం ఏమిటి? త్యాగతి నటుంచి, తక్కిన ముగ్గురూ నాలోని ఏ ఉత్కృష్టమైన ఆడతనాన్ని చూశారో యేమో, నన్ను గాఢమైన కాంక్షతో వాంఛిస్తున్నారు. త్యాగతిమాత్రం...అతని హృదయంలో ఏలాటి కోర్కెలున్నవో యెవరికి తెలుసు?

## 10

ఏ స్నానము చేస్తున్నప్పుడో నా యీ దేహముయొక్క అందము చూచుకొని నేనే ముచ్చట పడుతూంటాను. రెండు నిలువుటద్దాలమధ్యన నిలిచి

చూచుకొన్నాను నన్ను నేను. మోకాళ్ళవరకు సడలింపబడిన నా తలకట్టు ఒక్క మహా మేఘంలా ఆవరించుకొంటుంది. గనిలోనుంచి తీసిన నీలాలలా మెరుస్తూ, చంద్రవంకనది ఎత్తిపోతల ధారలా పతనాలవుతూ, కృష్ణవేణిలా ప్రవహిస్తూ ప్రసరిస్తూ, విరియపూచిన నీలమందార వృక్షంలా వికసిస్తూ, విడంబిస్తూ నా యీ తలకట్టు అద్భుతంగా దివ్యసంపదగా నన్ను అలంకరిస్తుంది.

నా ఫాలం నిశ్శబ్దంగా ఉదయకాలపు చిరుఎండలు ప్రతిఫలించే చెరువులోని బంగారపు నీరు, పూర్ణిమనాటి శారదాకాశము, బాగా వికసించిన తెల్లతామర పూవు రేకు, లేత తునితమలపాకు. నా కనుబొమ్మల్లో నేనే చిన్నబిడ్డల నవ్వుని, రసోన్మత్తుడైన మహాకవి స్వప్నాల్ని చూస్తుంటాను. అవి నల్లని గండుకోయిల పాటలు. నాసికామూలాన నాతిదూరముగా కొలగాఉండి, విస్ఫారితమధ్యాలై, వసంతవర్షబిందువులలాంటి పొడుగాటి కనురెప్పలచే పొదుగబడి, పాతాళగంగానీలవర్ణగంభీర కాష్టాయుతాలై, నన్నే సమ్మోహింపచేస్తున్నవి నా కళ్ళు.

కారలైన్ డి ఆర్డెన్ పూవురేకులు, వేదులవారి గీతికలు, ప్రత్యూష పాటలకాంతీ, వికసిత కకుబాలు నా కర్ణాలు. మృదులాలై, కఠినాలై, నిర్మల హరితారుణ ప్రభాపుష్పగుచ్ఛాలై, రోహిణీవర్ణోజ్వలహాసాలై, నాత్యున్నత నవనీత గోళాలై, నవతుషారార్ద్రజపాకోరకమూర్తులై, ప్రణయసర్వకళామూలాలంకారాలై ప్రభాసించుతూ, కైశికీవృత్తిప్రధానలాస్యసమానాలై, అప్సరోంగనాస్వప్నపూరితాలై, నా మిసిమి నవయవ్వనపు వక్షోజాలు నన్నే సమ్మోహింపచేస్తున్నవి. హేమఫణిఫణాసదృశహస్తతలాలలో కాని, నవరత్నకలశ జనితామృతధారలైన ఊరువులలోకాని, సముద్రమీనమూర్తులైన నా జంఘలలోకాని, మోహానంకాని పొంకమే లేదు.

## 11

బి. ఏ. తెలుగు ఆనర్సు మొదటశ్రేణిలో నెగ్గిన మదరాసు యూనివర్సిటీ పాండిత్యము నా సౌందర్యమును నేనుమాత్రం వర్ణించుకొనేటందుకు పనికివచ్చినది. ఆరోజున ఇదంతా రాసుకొని చింపివేసుకొన్నాను. ఆ వెర్రితనమంతా నాకు ఈనాడు మనస్సులో జ్ఞాపకం తెచ్చాడు తీరమిత్రుడు. పాశ్చాత్య స్త్రీల మోములవలె కనబడకపోయినా, సిగ్గుతో మోమంతా యెర్రటి రక్తంతో జేవురించిపోతూఉండగా, అడుగడుక్కీ తూలిపోతూ తేలిపోతూ, యాలక్కాయ ఒలిచి నోట్లో వేసుకొంటున్న త్యాగతివద్దకు నడచివచ్చాను. త్యాగతి వంచిన తల ఎత్తనే లేదు.

త్యాగతి: నిశాపతిగారు ప్రొద్దున బొంబాయి ఎక్స్ప్రెస్కు వెళ్ళేముందర ఆయన్ను నేను కలుసుకొన్నాను. ఆయన అక్కడనుండి ఢిల్లీప్రయాణమట.

నేను : నిశాపతి మనలను స్టేషనుకు ఎందుకు రమ్మనలేదో ? (అప్పటికి నా మనస్సును కుదటపరచుకొన్నాను.)

తీరమిత్రు డింతట్లో గబగబా మావద్దకువచ్చి 'నిజమే'... అని అంటూ ఉండగానే త్యాగతి అతనిమాట కడ్డమువచ్చి 'అతని స్నేహితులతో చాల ముఖ్యమైన పనుండి బండి కదిలేవరకు మాట్లాడి, కదలినతరువాత యెక్కవలసి వచ్చినదట మిత్రరావుగారూ! మరచిపోయినారేమండీ ?' అని అన్నాడు. ఇంతలో కల్పమూర్తి 'రేడియోలో ఆతని కంఠము ఎంత మధురంగానో వినబడుతుంది' అంటూ వచ్చాడు.

త్యాగతి : రేడియోసెట్టు హేమ ఇంకా కొనలే దెందులకో ?

నేను : నాకు నువ్వు ఒక మంచి సెట్టు కొనిపెట్టగూడదూ ?

## 12

ఒకనాటి వెన్నెలరాత్రి త్యాగతీ నేనూ మాత్రమే అడయారు నదిగట్టుమీద వాహ్యాళికి వెళ్ళినాము. ఏటిని పొదుగుకొని యేటినీటిలో ప్రతిఫలించే జ్యోత్స్నలు త్యాగతి కళ్ళల్లో తాండవిస్తున్నవి. ఆ ముహూర్తంలో త్యాగతి మధుమాసశుభ్రాంశునిలా ఉన్నాడు.

'హేమకుసుమదేవీ! అర్చకుని వైలక్షణ్యాన్ననుసరించే ఆతని పూజా, పూజాఫలమూ ఉంటవిసుమా! ఉపాస్యదేవత శ్రీగంటిచూపులకైనా అర్హుడగుటే మహాప్రసాదం.'

'అవునయ్యా, అర్చనకై వచ్చిన భక్తులందరికీ ప్రసన్నతకావాలిగదా ఆ దేవి ?'

'పూజాసౌలభ్యం వరప్రసాద మెందుకు కావాలి ?'

'వరప్రసాదానికి నలుగురూ అర్హులైతే ?'

'ఒకేసారి నలుగురు అర్హులవడం ధర్మవిరుద్ధం. ఏ ధర్మమూ అలా బోధించదు.'

'సనకసనందనాదు లందరూ ఒకేసారి ముముక్షువులు కాలేదా ?'

'సనకసనందనాదులు భక్తిభావంయొక్క అనేకత్వాన్ని మాత్రమే తెలియచేస్తున్నారు. ఒక్కొక్క అవతారానికి ఒక్కొక్క భక్తుడే భగవంతునిలో లీనమయ్యాడు. నరసింహమూర్తికి ప్రహ్లాదుడు, వామనునకు బలి, రామునకు హనుమంతుడు, కృష్ణునకు అర్జునుడు.'

ఆయన మాటలు నన్ను దాటిపోతున్నవి. నదిలో ప్రతిఫలించే చంద్రుని నవ్వులు నిశ్శబ్దంతో దిశలను ఆవరిస్తున్నవి. మందమలయానిలుడు మాఘమాసపు లేచివుళ్ళ సౌరభాలను పన్నీరు చల్లుతున్నాడు. శశిరాకాశనైర్మల్యము చేతులుచాచి తన నీలిహృదయానికి సర్వప్రకృతిని అదుముకొంటున్నది. సర్వ

వర్ణాలలోని స్పష్టతా కరగిపోయి యేకవర్ణములో కలసిపోతున్నది. త్యాగతి విశాలఫాలంలో పూర్ణకాముదివల్ల అణగిపోయిన తారకాకాంతులన్నీ పుంజీభవించినవి. అప్పు డాతడు లోగొంతుకతో

'గాలై ప్రసరిస్తే
వాగై ప్రవహిస్తే
మలయపవనమై
మందాకినివై
రారా నారాజా!
యీ రాజ్యంలో
నే నొంటినిరా!
కాంతై జ్వలియిస్తే
శాంతై పులకిస్తే
శరత్సుషమయై
క్షపాహాసమై
రారా నారాజా!
యీ రాజ్యంలో
నే నొంటినిరా!'

అని పాడినాడు.

'ఎవరిదయ్యా యీ పాట?'

'నేనే రచించుకొన్న గీతిక యిది.'

'ఏమయ్యా! నీవున్నూ తీర్థమిత్రునిలా కవిలాగున్నావే!'

'నేను కవి నెట్లా? నా గొంతుక అవ్యక్తం. అస్పష్టం. ఏవో సంధ్యాభావా లున్నవి. తీర్థమిత్రుడంటావా, స్పష్టతతాల్చిన జ్వాలాశిఖవలె ప్రజ్వరిల్లుతూ ఉంటాడు.'

'అవి వెలుగులు కావేమో! ఏవో తాటాకు, పాతగడ్డి మండించిన పొగచూరిన మంటల్లా ఉంటవి' అని పకపక నవ్వాను. అతడు రాసిన పాట విను నీకే తెలుస్తుంది!

'బ్రతుకలేనే ఓ ప్రియా!
కత లెరిగి నీ పెదవి
విత మెరిగి శ్రుతి మరచి
గతి తప్పి అడవిలో
వితము తెలియని నేను
బ్రతుకలేనే ఓ ప్రియా!
కత లెరిగి నీ పెదవి...'

'ఈపాట అతడు ఎందుకు రాసినట్లు ?'

'ఈ పాటలో నా అందాని కాతడు జోహారు లర్పిస్తున్నాడట !'

'నిన్ను ముద్దుపెట్టుకున్నట్లు రాస్తాడే ?'

'నిశాపతి ఢిల్లీకి వెళ్ళిన రోజున తోటలో అతనూ నేను తిరుగుతుంటే, తటాలున నాచేయి ముద్దుపెట్టుకొని 'నిన్ను ప్రేమిస్తున్నా' అన్నాడు. ఆ మరునాడు ఈ పాట రాసుకొచ్చి నాకు చూపించాడు.'

'నీ యౌవనం సాఫల్యం అనుభవించలేదా? ఆ ముద్దు నీ అందానికి హారతి కాలేదా ?'

'హారతో, నివేదనమో నాకు తెలియదు కాని, అతని స్నేహానికీ, ఆ ముద్దుకు శ్రుతి కలిసిందికాదు. నాకు అసహ్యం వేసిందన్నమాట నిజం. ఆరోజున నీవు బల్లవద్ద నుంచొనిఉండగానే, నేను డెట్టాలు నీటితో చేయి కడుక్కొనేవచ్చాను.'

త్యాగతి మాట్లాడకుండా తల క్రిందకు వాల్చుకొని చేతితో నేలమీద యేవో గీతలు గీస్తున్నాడు.

అందరూ నాకరమయ్యారు కాని త్యాగతి నాకరంకాడు! అతని మానంలో యేమేమి భావాలు నిశ్చలపక్షాలు చాపి తేలిపోతున్నవో!

'నేను హైస్కూలులో విద్యార్థినిగా ఉన్నప్పుడు, ఇద్దరు ముగ్గురు బాలకులు నన్ను ముద్దుపెట్టుకోబోయారు. నా చుట్ట మొకాయన, నా క్లాసుమేట్సు యిద్దరు. నాకు అసహ్యము వేసింది; ఏదో సంతోషమూ వేసింది. ఆ సంతోషముయొక్క తత్వముకాని, ఆ అసహ్యతయొక్క తత్వముకాని నాకీనాటికీ తెలియడంలేదు. నా కనుబొమలు ముడివడడంలోని కోపం చూచి ఆ ముగ్గురులో ఇద్దరు అక్కడనే ఆగిపోయినారు. నాకళ్ళపాపలలోని సంతోషము చూచికాబోలు ఆ ముగ్గురిలో ఒకడైన నా క్లాస్‌మేటు రెండోసారి నన్ను కౌగిలించుకునే ప్రయత్నం చేయబోయాడు. అప్పుడు నాచేత వాడు లెంపకాయ తిన్నాడు. అంతటితో ప్రణయ కార్యకలాపము చల్లారిపోయింది.'

ఆ మాటలని ఆలోచనలో పడ్డాను. ఇద్దరం కొంతవరకూ మౌనంగా ఉన్నాం.

'ఒక్కొక్క నీ ఆలోచనకు, ఒక్కొక్క దమ్మిడీ చొప్పున ఇచ్చేట్లయితే యీ పాటికి కొన్ని రూపాయలై ఉంటాయి' అన్నాడు త్యాగతి.

ఉలిక్కిపడి తలెత్తి 'మూడుదమ్మిడీలకంటె యెక్కువ యీయవలసి ఉండదయ్యా ? కాని ఇలా యీయి చెప్పుతా' అని నేనన్నాను.

'ధనంపెట్టి ఆలోచనలను కొనుక్కోగలమా హేమం' అని విషాదవదనంతో ఏరువైపు చూచినాడు త్యాగతి.

## 13

పది దినాలయిన వెనుక ఒక ఉదయమే నా కళ్ళల్లోని నిద్ర సగ మావలకి పోయి మళ్ళీ వెనక్కు వస్తున్నది. ఆ ప్రత్యూషంలో,

'మేలుకొనుమీ
దివ్యసుందరి!
మోహనాంగీ మేలుకో!
మేలుకో వాంఛాప్రదాయిని
మేలుకొనవే సురభిళాంగీ
పూర్ణకాంతుల తేజరిల్లే
భువనమోహిని మేలుకో!
కలలు ఆపుము కళ్లు తెరువుము
కలలకన్నా విలువమీరిన
పూజ యిదిగో
వేగ లే వరవర్ణినీ
వేగ లే సురవర్ణినీ?'

అన్న పాట ఘంటానాదమై వినబడింది. ఉలిక్కిపడి తొడుక్కొన్న పట్టుకుచ్చులలాగు సవరించుకొని, లేచి, కళ్లు నులుముకొన్నాను. చిత్రవర్ణమైన పల్చని నా పట్టుచొక్కాగాని, నా పట్టులాగుకాని, తప్తజాంబూనదకాంతులను వెదజల్లే నా శరీరచ్ఛాయలను దాచలేకపోతున్నవి.

'ఎవరూ?' అని కేక వేశాను.

'ఎవరా? ఒక యోగి! దివ్యత్వం కోరే ఒక తపస్వి.'

'ఆ తపస్వి యిక్కడకు ఇప్పుడెందుకు వచ్చాడు?'

'వరం కోరడానికి...'

'ఏమిటూ తపస్సు! ఏమిటూ వరం? ఇక్కడ తపస్సూలేదు. సిద్ధీలేదు. తపస్వి వెళ్ళిపోవచ్చును.'

'ఇక్కడ లేవూ? ఏ దివ్యమూర్తి సాక్షాత్కారంకోసం ఇన్నాళ్ళు దివ్యగాంధర్వం ఉద్భవింపజేశానో, ఏ దివ్యమూర్తి నామమంత్రం జపిస్తూ భ్రూయుగ్మంమధ్య చూపు నిలిపానో, అద్భుత సంకల్పసమాధిలోనికి పోయానో, ఆ దివ్యమూర్తి ప్రసన్న అవుతుందని ఈ ఉదయమే నాకు ఆకాశవాణి వినబడినది. కాబట్టి,

'తెరవవే తలుపుల్లు, దేవీ
తెరువవేమే దివ్యహృదయము
తెరిచి యీ భక్తుణ్ణి త్వరలో
వరము లిచ్చి వాంఛలిచ్చి
కరుణతో కాపాడు టెపుడో?'

ఏమా సంగీత మాధుర్యము! సైగల్ గొంతుకకన్న గంభీరత, అబుల్ కరీం గొంతుకకన్న మాధుర్యం, పంకజమల్లిక్ గొంతుకకన్న గాఢసురభిళత, వసంతదేశాయి కంఠముకన్న సమ్మోహనత......నిశాపతి యెప్పుడు వచ్చాడు? ఆతని గొంతు విని యెన్నాళ్ళయింది! నా పందిరిమంచంమీదనుంచి, విమానంలోనుంచి దేవకన్యలా ఉరికాను. నా వదులుజడ వీడి కెరటాలై, వడులై, సుడులై ప్రవహించిది. తలుపు చటుక్కున తీశాను. ఎదుట నిశాపతి. హృదయాభిరామంగా అలంకరించుకొని ఉన్నాడు.

'కరుణతో కాపాడు టెపుడో' అంటూనే రాగం ఏలోకాలకో పోనిచ్చి, సాలెగూడును దులిపినట్టుగా తలుపును తోసుకొని మాటాడకుండా అతితీక్ష్ణపు చూపులతో, అతి తృష్ణాపూరిత వదనంతో సున్నితమైన పట్టుదుస్తులలోంచి తొంగిచూచే నా అందాలయౌవనాన్ని పరిశీలిస్తూ ఒక్కనిముష మట్లాఉండి,

'ఎవ్వరికీ, యెప్పుడూ దొరకని నీ సూక్ష్మాచ్ఛాదిత ప్రాతఃకాల దర్శనం నాకు లభించింది' అని తమితో అస్పష్టంగా పల్కుతూ, సుడిగాలిలా నన్ను చుట్టివచ్చినాడు. రక్తం నా ముఖంలోనికి పొటెత్తుకొచ్చింది. నా చూపుల్లో యెర్రమంచులు కప్పినవి. నా వొళ్ళు వివశత్వం పొందింది. నా యౌవనం ఒక్కసారి ఉప్పెనలా యెగిసింది. ఒళ్ళు వేడెక్కిపోయింది. అప్రయత్నంగా ఒక అడుగు ముందుకు వేయబోయినాను. ఇంతలో నాకు ఫెళ్లున మెలకువవచ్చి నట్లయింది. వెనక్కు అడుగువేసి ఆయాసంతో తూలుతూ నా పందిరిమంచపు పక్కమీదికి వచ్చిపడ్డాను. నేను భరించలేని యేదో బాధ నన్నలమి, నన్ను మూలమంతా కదిల్చివేసే యేడుపు నన్నావరించినది. ఎప్పుడూ నే నేడ్చి యెరుగను. అప్పుడు నిశాపతి భయంతో నావద్దకు త్వరగా వచ్చినాడు. తెల్ల బోయి అట్లే నిలుచుండిపోయినాడు.

'హేమం, నేను మృగంలా ప్రవర్తించాను. నన్ను క్షమించు. నాప్రేమ అలాంటిది. అంత అద్భుతమైంది. అంత ఉత్కృష్టమైనది. సంగీతకచ్చేరి అయిందో లేదో ఢిల్లీనుంచి పరుగెత్తుకొచ్చాను.'

'ఓయి వెర్రివాడా, యీదినం నాకేదో భయంకరమైన ఆనందం కలిగింది. నీవు నన్ను అలమికొనవచ్చినప్పుడు నాకేదో విపరీతానందమూ, వింతభయమూ ఆవరించినవి. అదే ప్రేమంటావా?'

'నువ్వు మాట్లాడినపుడల్లా నీపెదవుల్లోని ఆ మాటల్నే తనివితీరా ఆస్వాదించి దివ్యసంగీతంగా వెదజల్లుదామనే కాంక్ష కలుగుతుంది.'

నిశాపతి నా పాదాలకడ మోకరిల్లినాడు. అతని తల నా కాళ్ళకు తగలడం గ్రహించి నా కాళ్ళు రెండూ పైకి లాక్కున్నా. 'నిశాపతీ, ఆ సోఫాలో కూర్చో. అభిమానాలు, మాయలు లేకుండా మన యిద్దరిసంగతీ యిప్పుడే విచారించుకొని ఒక నిర్ణయాని కొద్దాము' అని నేనన్నాను.

'ఆకాశనదీ స్వర్ణపద్మాలు పోగుచేసి నిన్ను కైవసంచేసుకోడానికి యే దివ్యుడూ తగడు. నేను హీనుణ్ణి, ఆశాజీవిని.'

'తగిఉండటం ఉండకపోవటం నిర్ణయము అనేక విషయాలమీద ఆధారపడి ఉంటుంది' అని అంటూ కాశ్మీరపు పాష్మీనాశాల్వ నా చుట్టూ కప్పుకొన్నాను.

'చిన్నతనమునుంచీ నాగొంతుక అత్యద్భుతంగా ఉంటుందని అందరూ అన్నారు. ఆ చిన్ననాడే తల్లిదండ్రులకి చెప్పకుండా, టిక్కట్టులేకుండా అలహాబాదు పారిపోయాను. నా గొంతుకలోని తీపితనాలు గమనించి అలహాబాదులోని ఒక సేట్‌జీ ప్రసిద్ధుడైన-బాబూరావు త్రిపాఠీదగ్గర సంగీతం నేర్చుకోమని నన్ను లక్నో పంపించాడు. ఏకదీక్షగా పదేళ్ళాయనవద్ద నేర్చుకొన్నాను. మూడేళ్ళు కష్టపడి సారంగి నేర్చుకొన్నాను. ఉత్తరాదిలో ప్రసిద్ధికెక్కిన అన్నిబాణీలూ కైవసంచేసుకున్నాను. మా యింటిపేరైన చతుర్వేదులను 'చతుర్వేది' యని పెట్టుకొన్నాను. ఉత్తరాది 'చతుర్వేది' వారు నేనూ ఒక్కటేనని ఉత్తరాదివారి ఊహ. ఇతడు మహోత్తమగాయకులలో ముఖ్యుడు అని జేజేలు పొందాను. మద్రాసువచ్చి నిన్ను చూశాను. నీకు దాసుణ్ణయాను. అప్పటినుంచి మదరాసే నా ముఖ్యమకాముగా చేసుకొన్నాను.'

'అవును. ఇవన్నీ నాకు తీర్థమిత్రుడే చెప్పాడు.'

'ఇవన్నీ తీర్థమిత్రుడు నీకు చెప్పిఉంటాడు. ఎవరైనా చెప్పిఉండవచ్చు. కాని నేనిదివరకెవరికీ తెరిచిచూపని కవాటాన్ని తెరిచి నా జీవితంలో అతినిగూఢమైన చరిత్రభాగాన్ని యీ దినము నీకు గోచరింపచేస్తున్నాను. అదే నా పరమ నివేదన నీకు. నా సంగీత కళాపరిశ్రమలో ఒక్కొక్కపథమే గడిచి పైకిపోతూండే రోజులవి. అందరూ నన్ను ప్రేమించేవారు, గౌరవించేవారు. నా ప్రతిభకు నా శక్తికి ఆశ్చర్యపడిపోతూండేవారు. నాకు యౌవనం వచ్చింది. కళాజీవిని కామవాతావరణం యెప్పుడూ చుట్టుకొని, ఇంత సందు దొరికితే లోనికి ప్రవేశించి, అతని జీవితంలో తానే రాజ్యంచేసే స్థితిని తీసుకొస్తుంది. నా కంఠమహిమ, నా గానవైచిత్రి సందర్శించి యెందరో బాలికలు పాదాక్రాంతలయినారు. నా బ్రహ్మచర్యాశ్రమం పాడుచేసుకొన్నాను. నా గానప్రజ్ఞతోపాటు నా కామతృష్ణ మహారణ్యం అయినది. ఇప్పటికి నాలుగేళ్ళక్రితం నిన్ను చూచినంతవరకూ నా తుచ్ఛజీవితము నన్ను పొదివికొనే ఉన్నది. అద్భుతములైన నీ కన్నులు నావైపు తిరిగి, పరమతేజాలైన నీ చూపులు నాపై ప్రసరించి ఆ పిశాచాన్ని దగ్ధంచేసివేసినై. ఆనాటినుంచీ నీ రూపమే తల్చుకొంటూ, నీ నామమే జపంచేసుకొంటూ, నీకోసం నిజమైన బ్రహ్మచారినయ్యాను. నువ్వు మన పెళ్ళికై అనుమతియ్యి. నా గానశక్తి, నా జీవితము నీ రెండుపాదాలదగ్గర సర్వార్పణము చేస్తున్నాను.'

నేను వంచిన తలెత్తి నిశాపతిని చూడలేకపోయాను. 'నిశాపతీ, నీ స్నేహము నాకు పూర్ణిమనాటి వెన్నెలలాంటిది. నీ గానము నా జీవితానికే

ఆధారమయినది. ఇదివరదాకా నా వివాహ విషయంలో ఎప్పుడూ నిశ్చయం రాలేదు. స్త్రీ తన యిష్టంవచ్చినట్టు సంచరించవచ్చో, వివాహమే అవసరమో నేను తెలుసుకోలేదు. అవసరమైతే ఆ కోరుకోవలసిన పురుషు డెవరో నేను నిశ్చయించుకోలేదు. మనస్సు ప్రేమించే మనిషి ఒకరు, దేహం ప్రేమించే మనిషి యింకొకరు ఉంటారేమో; అదిన్నీ తెలియలేదు. కాని... నేను... నాకు...నీవంటే...విపరీతమైన...సో...ద...ర...భావంమాత్రముందేదని...'

నిశాపతి క్రుంగి నిట్టూర్పుపుచ్చి సోఫాహస్తంమీద నున్న తనహస్తంపైన తలవాల్చి, ధ్వనిలేని గుండె బ్రద్దలయ్యే యేడ్పులో ద్రవించిపోయినాడు. భయంతో అతనివద్దకే వెళ్లలేకపోయినాను.

ఇంతలో 'అమ్మాయీ! ఆరున్నరయినా క్రిందికే రాలేదని బోయీలు చెప్పటమువల్ల యెల్లాగున్నావో చూదామని వచ్చాను' అని మెట్లుకువెళ్ళే గుమ్మంలో నుండి అనిన త్యాగతి మాటలు వినబడినవి. 'ఇదుగో వస్తున్నాను. నిశాపతివస్తే యేదో మాట్లాడుతున్నాను' అని నేను నా స్నానాలగదిలోనికి పరుగెత్తాను. నేను స్నానంచేసి బట్టలుకట్టి వచ్చేవరకూ నిశాపతి యిదివరకు కూర్చున్నచోటనే కూర్చుని ఉన్నాడు.

'నా స్నానాలగదిలోకి వెళ్ళి ముఖం కడుక్కొని రావయ్యా నిశాపతీ! నేను క్రింద ఉంటాను. నీకూ నాకూ యింతవరకున్న స్నేహము ఇంకను నిత్యమై, నిర్మలమై ఉండాలి! నిన్ను నా సహోదరునికన్నా యెక్కువగా నాకు...సన్నిహితునిగా చూస్తున్నాను' అంటూ మెట్లు దిగి వెళ్ళిపోయాను.

నిశాపతి అక్కడే మ్రాన్పడి నిలుచుండిపోయాడు.

## 14

నిశాపతి ప్రణయ రాగాలాపంలోంచి త్యాగతి మాటలు నాకు పూర్తిగా మెలుకువ తెప్పించినవి. రేడియం చూపులు కలిగిన త్యాగతి చూపులకుకూడా నిశాపతికీ నాకు జరిగిన సంఘటన గ్రహించడానికి వీలులేని పదతిగా నేను మేడ దిగాను. త్యాగితి యేమీ తెలియనివాడిలాగే కనబడ్డాడు. అయినా నాలుగు రోజులు పోయిన తరువాత మే మిద్దరమే ఇంట్లో భోజనం చేసే ఓ మధ్యాహ్నం వేళ, 'హేమాదేవీ, నిశాపతిని నీ వేమన్నావు?' అని అడిగినాడు.

'ఏమయ్యా, అలా అడుగుతున్నావు?'

'నిశాపతి మొన్న నాతో అంతా చెప్పినాడు.'

'ఏమి చెప్పాడు?'

'ఈ మహాయుద్ధంలో విజయదివ్యమూర్తియై నిశాపతి మనకు కనబడుతాడు. లేదా ఇంకనూ అధోగతికిబోయే పరమరాక్షసుడై మన కంటికి కనబడకుండా పోతాడు.'

త్యాగతిమాటలు నాకర్థమవుతున్నా అర్థంకానట్లే నటించాను. 'నిశాపతికీ యుద్ధానికీ సంబంధ మేమొచ్చింది?' అన్నాను.

'మొన్న నే మొదలుపెట్టిన ఇంగ్లండు, ఫ్రాంసు, జర్మన్ నూతన సంగ్రామానికీ నిశాపతికీ యేమీ సంబంధంలేదని నీకూ తెలుసును, నాకూ తెలుసును. నిశాపతి నిన్ను వాంఛించిన విషయమూ, నీవు కాదన్న విషయమూ నేను గ్రహించాను. నీ జీవితం ఒక ఆనందపథంలో విహరించాలంటే ఆతడు నీకు సరియైనవాడు. మొదటి దినాల్లో పరివ్రాజకుడై, సంగీత సత్యాన్వేషణలో, చీకట్లో దారి తడుముకొన్నాడు. ఈనాడు నిశాపతి ఉత్తమపథం చేరినాడు. ఆతన్ని నీ వెందుకు వివాహం చేసుకోకూడదో నా కర్థంకావడములేదు.'

'నీ దగ్గర మే మేమీ రహస్యాలు దాచుకొనేందుకు వీల్లేదన్నమాట. ఆతడు చెప్పినాడా, నీవే గ్రహించావా?'

'ఆతడు చెప్పలేదు హేమా! ఈ రహస్య మతని కతి పవిత్రమయినది.'

'నీవే గ్రహించావూ? అప్పుడే అనుకున్నాను! ఒక వస్తువు మంచిదే. ఆ వస్తువు నీ కిష్టమో లేదో ఏదైనా ఒక విచిత్ర సంఘటన జరిగినప్పుడుగాని తెలియదు.'

త్యాగతి మౌనంగా ఉన్నాడు.

'ఆ రోజు ఉదయము ఢిల్లీనుంచి రావడముతోనే, తాను రాత్రెలాగో గడిపి ఉదయమే నేను నిద్రలేవకుండానే నన్ను వచ్చి లేపాడు. అంతకుముందే ఎప్పుడో మా నాన్నగారిని కలుసుకొన్నాడట. మా అమ్మగారు కుశలప్రశ్నలు వేసిందట.'

'మీ అమ్మగారి దయాంతఃకరణలు మమ్మల్ని మంచి తేలుస్తునే ఉంటవి.'

'ఆతనిరాక నాకు చాలా సంతోషమైంది. నిద్రమంచంమీదనుంచి వచ్చి తలుపుతీశాను. తన ప్రేమ తెలుపుతూ నన్ను సుడిగుండంలా కౌగిలించుకోవాలని ప్రయత్నించాడు.'

త్యాగతి మౌనం.

'మొట్టమొదటలో నా యౌవనరక్తం పొంగిందికాని, మరుసటిక్షణంలో నిశాపతి అంటే నాకేమీ ప్రణయంలేదని, ఆతడు నాకు పురుషుడుకాదని స్పష్టంగా, నిస్సందేహంగా తోచింది. ఆతన్ని ఆపుచేసి ఆ సంగతి...'

'ఆతనితో చెప్పావు. ఎంత కఠిన హృదయమమ్మా నీది! అయినా ధైర్యం కలదానవు. నీవు సంపూర్ణంగా నేటికాలపు మనిషివి!'

'ఆ మర్నాడతడెక్కడికో వెళ్ళిపోయినాడు.'

'ఔను. మైసూరులో నందిపర్వతానికి వెళ్ళినాడు. నీవు తిరుగులేని నిశ్చయానికి వచ్చినట్లేనా? ఆతడు పెండ్లి చేసుకొంటానన్నాడు. నీవు

కాదన్నావు. జాగ్రత్తగా ఆలోచించవలసిన విషయమిది. నీవు తొందర పడలేదుకదా?'

'అలాంటి విషయాల్లో తొందరగానే నిశ్చయానికొస్తాము. రావడం తొందరేకాని, వచ్చినదిమాత్రం తిరగని నిశ్చయం.'

చాలాసేపటివరకిద్దరమూ మౌనంగానే ఉన్నాము.

నా హృదయం మహతీవీణ కాదు, మహామహతీవీణ. వేయి తీగెలతో, వేయిమెట్లతో లోకాలు ఆవరించుకొన్న విప్రకృష్టకమైన మహామహతీవీణ. ఆ అద్భుతవల్లకి తంత్రులలో తెలిసో తెలియకో పంచమస్వరపూరితమైన ప్రాణ తంత్రిని మీటి నా జీవితాకాశంలో కాకలీస్వరాలు మారుమ్రోగించినాడు త్యాగతి. ఎవరీ త్యాగతి? రాత్రల్లా సగం తెలిసిన నిద్ర. కలలుపూనిన కాళ రాత్రి. గంభీర రూపాలు ఆవహిల్లిన అనంతధామము. అందులో ఎచ్చటనో ఉన్నాడితడు.

## 15

నాకు ఇద్దరు యువతీమణులు స్నేహితులున్నారు. స్నేహితులంటే చాలా సన్నిహితురాండ్రని, నాతో జీవికాజీవులలాగ మెలిగేవాళ్ళని నా అభిప్రాయం. వీళ్లుకాక నాతో చదువుకున్నవారు, నా సతీర్థలు అయిన చెలిమికత్తెలు చాలామంది ఉన్నారు. అందులో కొందరు కొంచెం దగ్గరగా ఉంటారు, కొందరు కొంచెందూరం, ఇంకా కొందరు ఇంకా కొంతదూరం లోనూ ఉంటారు.

నేను కాలేజీలో టెన్నిస్ బాగా ఆడేదాన్ని. విద్యార్థినీబృందంలో నన్నుమించిన ఆటకత్తెలు లేనేలేరు. వరసగా రెండేండ్లు నేనే చాంపియన్ షిప్పు టెన్నిస్కప్పు విజయంపొందాను. పరుగులో దిట్టమైన బాలికను. సంచిపందెము వగైరాలలో ఒకటోస్థానమో, రెండోస్థానమో వచ్చేది. ఈ ఆటల సందర్భంలో ఎందరో బాలికలు స్నేహితురాళ్ళయ్యారు. వీరందరినీ కలుసుకుంటూ ఉంటాను. మా యింటికి విందుకు పిలుస్తూంటాను. ఆటలకు పిలుస్తూంటాను.

నాకు అత్యంత సన్నిహితులైన ఆ ఇద్దరు స్నేహితురాండ్రనూ ప్రాణ స్నేహితురాళ్ళంటాను. మా ముగ్గురిలో రహస్యాలు లేవు. అక్కచెల్లెళ్ళు కూడా అంతదగ్గరగా ఉండరు. అక్క చెల్లెలికి రహస్యాలు చెప్పకపోవచ్చును, చెల్లెలు అక్కకు చెప్పకపోవచ్చును. కాని ప్రాణస్నేహితురాండ్రుమాత్రం తమతమ రహస్యాలన్నీ ఒకరికొకరు చెప్పుకుంటారు.

వెనుకకాలంలో ఆడవారిలో స్నేహితులు అంత సన్నిహితంగా ఉండే వారుకాదట. స్త్రీ తన రహస్యాలన్నీ ఎవరితోనూ చెప్పదనే అంటారు. అందులో నిజం లేకపోలేదు. మా హృదయాంతరాలలో ఉన్న రహస్యాలు

సర్వాంతర్యామియైన భగవంతునికే తెలియనియ్యము. కాని చిన్నతనంలో ఈ స్త్రీవిద్యాదినాల్లో నెచ్చెలులకు కాస్త మా రహస్యాలు చెప్పుకుంటున్నాము.

పురుషులు రహస్యాలు దాచుకోలేరు. ఏ స్నేహితునితోనో ఎంత నిగూఢరహస్యాలైనా చెప్పేస్తారు. స్త్రీపురుష సంబంధాలైన రహస్యాలేవన్నా బయటబడ్డాయంటే పురుషునివల్లనే అని సంపూర్ణంగా నమ్ముతాను.

ఇంతకూ నాకుండే రహస్యాలేమిటి? నే నేమీ వ్యాపారాలు చేయటం లేదు. ఇంక నాకున్న ప్రణయకావ్యకలాపం అంతనిగూఢమైంది ఏముందిగనకా? అయినా నా మనస్సులో ఉన్న రహస్యభావాలు కానినీ, ఆ నా ఇద్దరు ప్రాణ స్నేహితురాళ్ళతో చెప్పుతూ ఉండడం, వాళ్ళ హృదయాలు వాళ్లు నాకు తెలియజేయడం మాకు పరిపాటి. మేం ముగ్గురం ఎక్కడో కలుస్తూనే ఉండేవాళ్ళం.

అందులో ఓ అమ్మాయికి మద్రాసులో ఒక బాలికా పాఠశాలలో ఆంధ్రోపాధ్యాయినిపని అయింది. ఆమె రూపురేఖావిలాసా లంటారా? ఉంటాయి ఒకమోస్తరు. ఆ అమ్మాయి అతి ఆడపిల్ల. చూపులో దగ్గిరవస్తువులు కనబడుతాయి. అందుకని షార్ట్‌సైట్ అద్దాలు పెట్టుకుంటుంది. ఆ అమ్మాయికి నేనే లోకేశ్వరి అని పేరుపెట్టినాను. ఆ అమ్మాయి అసలుఊరు ఒంగోలు. అసలుపేరు దూర్వాసుల వెంకటరత్నమ్మ. నెల్లూరులో తన చుట్టాల ఇంటికడ ఉండి, చదువుకొని, స్కూలుఫైనలు ప్యాసయి చెన్నపట్నం ఇంటరు చదువు కని వచ్చింది.

అప్పటినుంచీ నాకూ 'లోకా'నికీ చూపులతోనే ప్రేమకుదిరింది. లోకం ఎంత తెలివైనది! చెన్నపట్నంలో మా యింట్లోనే నాతోపాటే ఉండి చదువుకోమని పట్టుపట్టినాను. మాఇంట్లోనే భోజనంచేసేది. మా నాన్నగారూ, మా అమ్మగారూ లోకంఅంటే ప్రాణంఇచ్చేవారు. కన్నకూతురైన నాకన్న వాళ్ళిద్దరిదగ్గరా ఆమె ఎక్కువ చనువుగా ఉండేది. మాయమైపోయిన మా అక్కని మరపించేటంత అపేక్షగా ఉండేది. మా అక్క ఫోటో తనగదిలో పెట్టుకొని పూలదండలు వేసేది. రెండు మూడుసార్లు మా అక్క బొమ్మను హృదయాని కద్దుకొని కంటినీరు పెట్టుకోడంకూడా నేను చూశాను.

లోకమే మా అమ్మనీ, నాన్ననీ సినిమాలకు, నాటకాలకు, అడయారుకు, బీచికీ తీసుకువెడుతూ ఉంటుంది.

మా అక్కను పూర్తిగా జ్ఞాపకం చేసుకోలేను. మా అక్క అమృతమూర్తట. దివ్యసౌందర్యవతిట. నా ఆరవఏటనే మా అక్కకు పెద్ద జబ్బుచేసి వెళ్ళిపోయింది. మా అక్కా, నేనూ ఒక్కటేపోలిక. మా అక్క పోయేటప్పటికి పదహారేళ్ళది. నాకు పదహారేళ్లు వచ్చినప్పుడు అచ్చంగా మా అక్కలాగే ఉన్నాను. మా ఇద్దరి ఫొటోలు పక్కపక్కగా పెట్టితే ఒక్కరిఫొటోలే అని చెప్పవలసిందే. ఏమాత్రమూ తేడాలేదు ఆ రెంటికీ,

మా బావను తలుచుకుంటే ఏదో కలలో చూసిన మనిషిలా జ్ఞాపకం వస్తాడు. నన్ను స్వంతమానం ఎత్తుకునేవాడు. మా అక్క అంటే ప్రాణం ఇచ్చే వాడు. మా అక్క మా బావనూ, మా బావ మా అక్కనూ ఒక నిముషమూ వదిలిపెట్టి ఉండలేకపోయేవారు.

నా చిన్నతనంలో మా ఊళ్ళోనే ఉన్న మా అక్కగారి అత్తవారింటికి వెళ్ళినా, మా అక్కా బావా మా ఇంటికి వచ్చినా ఒక్క నిముషం ఇద్దరూ వదలి ఉండేవారా! నేను మా అక్కదగ్గరకు వెడితే ఇద్దరూ ఒక కుర్చీలోనే కూర్చునో, ఒక మంచంమీద ఇద్దరూ పడుకొని మాట్లాడుకొంటూనో ప్రత్యక్షం అయ్యేవారు.

ఈ ఈడులో ఆనాడు మా అక్కా బావల ప్రణయం లోకాతీతమైనదని తెలిసింది నాకు. మా బావ ఇప్పుడెక్కడున్నాడో? బ్రతికి ఉన్నాడో, లేదో?

ఇంతకూ మా లోకం మా అక్కను ఒక దేవతగా ఎంచి, ఆమె ఫొటోను పూజించేది. ఆ ఫొటోపై పూవులూ, కుంకుమా చల్లేది. రోజూ ఆ చిత్రానికి పూలదండలు వేసేది.

ఇదంతా మా తలిదండ్రులను టోపీలో వేసుకొనేందుకు కాదని నేను నిస్సందేహముగా చెప్పగలను. ఎందుకంటే, ఒంటిగా ఉన్నప్పుడుకూడా మా లోకం నేనుగాని, మా స్నేహితురాండ్రుగాని ఎవ్వరూ చూట్టం లేదను కొన్నప్పుడే, అక్క బొమ్మ హృదయానికి అదుకొని కళ్ళనీళ్ళు తిరిగిపోతూ ఉండగా, ఏవో పెదవులలో గొణుగుకుంటూ కుర్చీమీద కూర్చొనిఉండేది. మా లోకానికి మా అక్కఅంటే అంత ప్రేమ ఎందుకు కుదిరిందో? ఆ ప్రేమకు కారణం ఏమిటో తెలిసికోవాలన్న ప్రయత్నంచేశాను. నేను మా అక్కలా ఉంటానని, మా అక్క పోయేముందు మా బావతో తీయించుకున్న ఫొటోలో మా అక్కవేసిన వేషం నాకు వేసి, లోకం నా ఒళ్ళో తలపెట్టుకొని కళ్ళ నీళ్ళు కార్చేది.

ఒకరోజు నేనూ లోకేశ్వరి నా విద్యామందిరంలో మాట్లాడుకుంటున్నాం. మందగమనంతో అవతరించింది నా రెండో ప్రాణస్నేహితురాలు సోఫీ. సోఫీ భారతీయాంగ్లబాలిక. ఆమె తండ్రి నీలగిరిలో కాఫీతోటల యజమాని, లక్షాధికారి. తల్లి చిన్నతనంలో ఈమెను కని ఇంగ్లండులో చనిపోయింది. సోఫీ ఇంగ్లండులోనే చిన్నతరగతులు మాతామహుల ఇంటనుండి చదువుకుంది. తండ్రి ఆమెను వదలి ఉండలేకపోయినాడు. కళాశాల చదువుకు హిందూ దేశమే తీసుకువచ్చాడు. ఆమె నాతోపాటే ప్రెసిడెన్సీ కళాశాలలో ఇంటరు చదువుకుంది. ఇప్పుడు నాల్గవసంవత్సరము ఎం. బి., బి. ఎస్. క్లాసు వైద్య కళాశాలలో చదువుతున్నది. తండ్రి, తాతలు ఇంగ్లండులోనే పుట్టినా జీవితాలు నీలగిరి కొండల్లో గడపటంచేత, వాళ్ళు సంపూర్ణంగా భారతీయులే అయ్యారు. సర్ విలియంస్ విలియంగారికి సోఫీ ఏకపుత్రిక. ఆమెను అల్లారు ముద్దుగా పెంచుకుంటున్నాడు.

నాకూ సోఫీకి ఎందుచేతనో విపరీతమైన స్నేహం కుదిరింది. సోఫీ మగ రాయుడు. రూపంలో గాదు సుమండీ! రూపంలో రతీదేవే! తండ్రి థియాస ఫిస్టు అవడంచేత ఈవిడా థియాసఫిస్టే. అందువల్లనే ఆమెకూ నాకూ గాఢ స్నేహం అవడానికి కారణం అనుకుంటాను.

'నువ్వు నాతో ఇంగ్లండు రావాలి' అని వేధిస్తూ ఉంటుంది. నాకు వెళ్ళాలనీ ఉంది.

'యుద్ధం అవనీ సోఫీ! తప్పక వస్తాను' అన్నాను.

'మనం ఇద్దరం నర్సులుగా చేరిపోదాం.'

'నీకు నర్సుపనేమి కర్మం? రేపు డాక్టరుపరీక్ష పూర్తిచేసి, ఏ లేడీ మేజరుగానో వెళ్తావు.'

'అందాకా ఈ యుద్ధం ఉంటుందా? ఈ జర్మనీ, ఇటలీల పస మనం కూడా కనుక్కోకపోతే ఎట్లా హేమ్?'

'జర్మనీవాడి చెయ్యి పైగానే ఉంది. రష్యాను చావగొడుతూ చొచ్చుకు పోతున్నాడు.'

'ఎంతదూరం అట్లా వెళ్ళగలడని?'

'మీ ఇంగ్లీషువారూ, అమెరికావారూ తిన్నగా సహాయం చెయ్యకపోతే, రష్యా ఏంచేస్తుంది? రెండో రంగమో అంటే, నిద్రపోతో కూర్చున్నారు ఈ మిత్రమండలివారు. అవతల ఆఫ్రికాలో రోమెల్ విజృంభించి ఇంగ్లీషు వారిని పరుగెత్తించి అలెగ్జాండ్రియావద్ద తిష్ఠవేసుక్కూచున్నాడు.'

'ఎంతకాలం వేసుకుంటాడు హేమ్! నేనే వేవెల్‌నయితేనా అసలు, రోమెల్‌ను రానిద్దునా!'

'చేతులో స్వయంగా పీక నులుముదువా? లేక కొరడా పుచ్చుకుని వెనక్కి కొట్టి కొట్టి వదులుదువా?'

అప్పుడు పుస్తకము చదువుకోవడం మాని లోకేశ్వరి మావైపు తిరిగి 'సోఫీ, ఈ యుద్ధం మా భారతీయులకు ఏమీ హృదయస్పందనం కలిగించడం లేదు. మాకు అవసరం కాని ఈ యుద్ధం సంగతి మా హేమకెందుకు చెప్పు' అని అన్నది.

సోఫీ: నీ మాటలు, అన్నీ ఎప్పుడూ యింతేనే! గాంధీమహాత్ముని శిష్యురాల నంటావు. ఆయన పేరుకూడా పాడుచేస్తున్నావు. ఈ యుద్ధం భారతీయులకే కాదు, సర్వ ప్రపంచానికీని. మా బ్రిటిషువాళ్ళు భారతీయుల్ని అన్యాయం చేయలేదని నేను అనను. మీ దండర్ హెడ్డుల సహవాసంచేసి నాలో ఉన్న బ్రిటిషుతత్వం అంతా చంపుకున్నాను. స్లేడుకుమారి శ్రీమతి మీరాబెన్‌గారే నా గురువయినది. దుర్మార్గశక్తులు నీరసులమీద దాడి వెళ్తే ఆ దుర్మార్గులమీద సాగించే యుద్ధం, భారతీయుల యుద్ధం ఎందుకు కాదు? భారతీయులు జర్మనీ పక్షం చేరరుకదా!

లోకే: ఈజిప్టువా రెవరిపక్షం చేరారు? భారతదేశం ఈజిప్టుకన్నా తీసిపోయిందా! ఏం? మనదేశం జర్మనీపైనగాని, ఇటలీపైనగాని కత్తిగట్టి యుద్ధంచేసే సితిలో ఉందా? బ్రిటిషువారిపాలన పుణ్యమా అని, భారతీయులు ఎంత నీచసితిలోకి వెళ్ళాలో అంత నీచసితిలోకి వెళ్ళారు. ఆ భారతీయులపేరున తామే యుద్ధం ప్రకటించారు!

హేమ: ఏమర్రో! రాజకీయ నీతంతా ఈ పూటే నిరారణచేసేటట్టున్నారు మీరిద్దరూను! ఏ త్యాగతిగారో వింటే ఏమంటారు?

... ... ...

లోకేశ్వరికి కొంచెము కోపంవచ్చింది. చురుకుగానే మాట్లాడడం సాగించింది. కాని, నా మాటలవల్ల చప్పున కరిగిపోయి, సోఫీని కౌగిలించుకొని, 'సోఫీ! ఏదో కాస్త చురుకుగా మాట్లాడాను క్షమించాలి' అన్నది.

సోఫీ లోకేశ్వరిని గుండె కదుముకుని 'లో! నీకూ కోపములేదు, నాకూ కోపములేదు. నువ్వు వాదించడము ప్రారంభిస్తే నేనూ మళ్లీ సిద్ధంగాఉన్నాను. వాదనలకు ప్రేమకు సంబంధంయేమిటి?' అని కాకలీస్వనాన పలికినది.

హేమం: బాగుందిలెండి నాటకం! మీ యిద్దరూ మన తీర్థమిత్రునిలాగే వాదించారు.

సోఫీ: తీర్థమిత్రుడంటే జ్ఞాపకం వచ్చింది. నిశాపతి ఎక్కడా కనపడడం లేదేమిటి?

## 16

ఈ ఇద్దరు స్నేహితురాండ్రూ ఆ నలుగురు పురుష స్నేహితులంటే, నేనున్నంత ఎక్కువ అన్యోన్యంగా ఉండరు. చనువుగానే ఉంటారుకాని, ప్రాణస్నేహంగా ఉండరు. ఒకొక్కప్పుడు ఏడుగురం కలిసి సినిమాలకు వెళ్తాం. ఒకనాడు ఏ ఎణ్ణూరు రేవు బంగాళాకో పోయి, స్వంతంగా వంటలూ పిండివంటలూ చేసుకుని అల్లరిచేసి వస్తూంటాము.

మా లోకేశ్వరి మాత్రం నిశాపతి సంగీతం అంటే, చెవికోసుకుంటుంది. సోఫీకీ, నిశాపతికీ భారతీయ సంగీత సంప్రదాయాన్నిగూర్చీ, పాశ్చాత్య సంప్రదాయాలనుగూర్చీ వాదప్రతివాదాలు జరుగుతూ ఉండేవి. సోఫీ పాశ్చాత్య సంగీతం బాగానేర్చుకుంది. ఆమె గొంతుక మంచి సోప్రానో, కాకలీస్వరయుక్తము.

ఇంక నా సంగీతం అంటారా, నేను పట్నం సుబ్రహ్మణ్యంగారి శిష్యునికి శిష్యుడైన నీలకంఠయ్యరుగారి దగ్గిర గాత్రం నేర్చుకున్నాను. కర్ణాటక బాణిలో అందెవేసినచేయనే నన్ను అంటారు. వీణ ఓ మోస్తరు బాగానే నేర్చుకున్నాను. మా లోకేశ్వరి కర్ణాటక బాణి అంటే అంత ఇష్టపడదు.

కాని ఉత్తరాది బాణీ అంటే మహాప్రేమ. నిశాపతిదగ్గిర శుశ్రూష నేరపి, చక్కగా పాడుతుంది. సినిమా పాటలు కన్నన్ బాలవీ, ఖరిషీద్ వీ, దేవికా రాణివీ, శాంతాఆప్టేవీ, శాంతా హుబ్లికర్ వీ పాటలు అచ్చం వారివలెనే పాడుతూంటుంది. కళ్ళు మూసుకొని ఆ పాటలు వింటూంటే, ఆయా తారలు పాడుతున్నారని అనుకోవలసిందే!

తీర్థమిత్రుడు లోకేశ్వరి అంటే కొంచెం విసుక్కుంటాడు. సోఫీఅంటే చెవికోసుకుంటాడు. సోఫీని వెన్నంటుతాడు. ఆమె అందాన్ని పొగడుతాడు. ఆమె ఏదిచేసే అదే బాగుందంటాడు. అతణ్ణి సోఫీ చివాట్లు పెడుతూ ఉంటుంది. అట్టే అల్లరిచేస్తే రెండుమూడుసార్లు చెంపకాయలుకూడా తగిలించింది.

కల్పమూర్తి లోకంతో స్నేహంగా ఉంటాడు. కాని సోఫీ అంటే కొంచెం సిగ్గుపడుతాడు! ఇంగ్లీషు గట్టిగా మాటలాడలేడు. కాబట్టి సోఫీ ఏమనుకుంటుందో అని అతని భయం. అంచేత సోఫీ ప్రశ్నలు వేస్తూఉంటే 'అవును' 'కాదు' అనే అంటాడు. అయినా సోఫీ కల్పమూర్తి అంటే చాలా గౌరవం చేస్తుంది. అతని మూర్తిత్వం గ్రీకుల మూర్తిత్వం అంటుంది. అతడు పూర్వజన్మలో ఏ ఎథీనియన్ వీరుడో అని, ఆనందం పడుతుంది. కల్పమూర్తి ఏ ఎన్నేరులోనో సముద్రంలోనో ఈదుతూఉంటే, అతనితోపాటు ఈదుతూ, మా అందరికన్న ముందు పోతుంది సోఫీ.

నేను బాగానే ఈదుతాను. నేనూ మా సోఫీవలెనే పాశ్చాత్యుల ఈత దుస్తులు తొడిగి, ఈతకు వెడితే నాతో ఉంటాడు తీర్థమిత్రుడు. త్యాగతి సాధారణంగా ఈదడు. బాగా ఈతవచ్చునన్న సంగతి నా కెలా తెలుసునంటే ఓరోజున మేమందరమూ ఎన్నేరులో పడవలమీద వెళ్ళి ఈత ప్రారంభించాము. త్యాగతీ, నిశాపతీ, లోకేశ్వరీ పడవలమీద ఉన్నారు. లోకేశ్వరికీ, నిశాపతికీ ఈత అంటే హడలు.

ఇంతలో పక్కన వెళ్ళే ఓ పల్లెవారి పడవలోంచి ఓపిల్లాడు మమ్మల్ని తెల్లబోయి నిల్చుని చూస్తూ, నీటిలోపడ్డాడు. వాడు పడడమేమిటి దగ్గిరగా తేలుతున్న మాపడవలోంచి త్యాగతి నీటిలోకి ఒక్క ఉరుకు ఉరికి, ఆ కుఱ్ఱకుంక దగ్గరకు బారఈతలో పోయాడు. వాడికీ ఈత బాగా వచ్చును కాబోలు బెండులా తేలుతూ ఈదుతున్నాడు. త్యాగతి దిట్టమైన ఈతకాడని అప్పుడు తెలిసింది.

## 17

నిశాపతి వెళ్ళిపోయాడని సోఫీ ప్రశ్న వేయగానే జవాబు చెప్పాను.

సోఫీ : వెళ్లిపోయాడంటే?

నేను : నందిపర్వతం ఆ ప్రాంతాలకు వెళ్లిపోయాడట.

లోకే : ఎందుకు వెళ్ళాడు?

నేను: సరే! మీ ఇద్దరూ లాయరు ప్రశ్నలు వేస్తూ ఉంటే నేను జవాబు చెప్పకపోతే బ్రతకనిస్తారు గనకనా! వినండి. నిశాపతి నన్ను ప్రేమించాడు, పెళ్ళిచేసుకోమని కోరాడు. నేను పెళ్లిచేసుకోనన్నాను. అతడు కించపడి వెళ్లిపోయాడు.

అక్కణ్ణుంచి వాళ్ళ ప్రశ్నలు, నా జవాబులు. జరిగిన సంగతి అంతా చెప్పాను. వాళ్లు తెల్లపోయారు.

సోఫీ: హేం, నీకోసం ఈ నలుగురు పురుషులు కాసుకుని ఉన్నారంటావా?

లోకే: తీరమిత్రుడికి ఇదివరకే పెళ్ళి అయినది. అతనిభార్య చక్కనిచుక్క. ముగ్గురు ముద్దులు గులికే వెన్నముద్దల పాపలు. రెండేళ్ళవాడు అతనికి కొడుకున్నాడు. ఎనిమిదేళ్లూ, అయిదేళ్లూ గల బాలికలిద్దరు. కనక తీరమిత్రుడికీ మన హేమానికి పెళ్ళేమిటి? ఇక కల్పమూర్తి. హేమం తల్లి తండ్రుల్ని అడిగితే వాళ్ళిద్దరూ తమ అభ్యంతరం లేదనీ, అమ్మాయి యిష్టమనీ అన్నారు. ఈ అమ్మాయిగారు జవాబు చెప్పదు. పైగా కల్పమూర్తిని ఏడిపిస్తుంది. అతణ్ణి వదలదు. అతనికి ఆశా వదలదు.

సోఫీ: పాపం, వట్టి వెఱ్ఱివాడు. త్యాగతి నాకో పెద్ద సమస్యగా కనబడుతాడు.

హేమం: ఆంగ్ల స్త్రీలకు భారతీయ పురుషు లెప్పుడూ సమస్యలే సోఫీ!

సోఫీ: భారతీయ స్త్రీలకు ఆంగ్ల పురుషులు సమస్యలు కాదా అంట?

లోకే: మీ మగవాళ్ళు మాకు సమస్యలుకారు. మా వాళ్ళే మాకు పెద్ద సమస్యలు. మీ జాతిమాత్రం మాకు పెద్దసమస్య. మా దేశం మీవాళ్లు ఒదలరు. ఏవో మాటలంటారు. మీ జాతి మాటనిలబెట్టుకొనే జాతి అంటారు. మా విషయంలో మాత్రం మీ మాట నీటిమూటే!

సోఫీ: భారతీయులు ఒక్కమాటమీద నిలుస్తారు! మీ గాంధీగారికే రోజుకో కొత్తగొంతుక. ఇవాళ ఓటి అంటాడు, రేపు ఓటి అంటాడు.

లోకే: గాంధీమహాత్ముణ్ణి అంత బాగా అర్థంచేసుకున్నావు!

నేను: మళ్ళీ మీ ఇద్దరూ వాదం మొదలు పెట్టారు; మా మేడ కాస్తా కదలిపోయిందేమో చూస్తాను. అసలు త్యాగతి సంగతి మొదలుపెట్టి చటుక్కున గాంధీగారి దగ్గరకు వచ్చి ఊరుకున్నా రేమిటి మీ యిద్దరూ?

ఇంతలో త్యాగతే మా దగ్గరకు వచ్చాడు.

లోకే: మిమ్మల్నిగురించే మాట్లాడుతున్నారు. మీకు వెయ్యేళ్ళు ఆయుర్దాయం.

## 18

త్యాగతి: ఏమిటి అంత తీవ్రంగా మాట్లాడుతున్నారు?

లోకే: గాంధీమహాత్మునిగురించి వాదన వచ్చింది, ఇద్దరికీ.

ఆమె వాదనసంగతి త్యాగతికి విపులంగా చెప్పింది, లోకేశ్వరి.

త్యాగతి: హిమాలయాలనుగురించి వాదనవస్తే ఎంతో, మహాత్మునిగురించి వచ్చినా అంతే! అమ్మా సోఫీ, ఆంగ్లరాజ్యానికి చర్చిల్ ఇప్పుడు ముఖ్య పురుషుడు. అతను లేకపోతే ఆంగ్లేయులు యుద్ధం విజయం పొందడం దుర్ఘటంకదా! కాని, ఆయన చిత్తవృత్తులు మనం అర్థంచేసికోగలమా? మా మాట అలా ఉంచు. మీ ఆంగ్లజాతిలోని ప్రముఖులు అర్థంచేసికోగలరా? అలాంటి సందర్భంలో ఆధ్యాత్మికదేశమైన మా దేశంలో, ఆధ్యాత్మికపురుషుడైన మహాత్ముడు మీకు అర్థంకాడు. కాని మీలోని మహానుభావు లనేకు లాయన్ను అర్థంచేసికొన్నారు. అలాగే మాలో కొందరు చర్చిలును సంపూర్ణంగా అర్థంచేసికొన్నవాళ్లూ ఉన్నారు.

నేను: భౌతికం, ఆధ్యాత్మికం అంటావు. ఏమిటా భౌతికమూ, ఆధ్యాత్మికమూ?

త్యాగతి: హేమం! ఒక్కసంగతి అడుగుతాను. మనకీ, పశువులకూ తేడా ఏమిటి?

నేను: పశువులకు మెదడులేదు, మనకు మెదడుఉంది.

త్యాగతి: పశువులకూ మెదడు ఉంది కాని అది చిన్నది; మనుష్యుల మెదడంత క్లిష్టమైనదికాదు. సరే. మనుష్యుడూ తన బిడ్డల్ని ప్రేమిస్తాడు, జంతువులూ ప్రేమిస్తవి. ఆ రెంటి ప్రేమలో తేడాఉందా?

సోఫీ: ఉండకేం? జంతువు అవసరం ఉన్నంతసేపే, తర్వాత ప్రేమ నే మరిచిపోతుంది.

త్యాగతి: కాని మనుష్యుడు జీవితం ఉన్నదాకా ఎందుకు ప్రేమిస్తాడు? చచ్చిపోయిన చుట్టాల్ని, స్నేహితుల్ని, గొప్పవారిని ఎందుకు ప్రేమిస్తాడు? దేశం అని ప్రాకులాడుతాడు, మానవలోకం అని గగ్గోలుపడతాడు. ఎందుకు సోఫీ?

## 19

ఆడవాళ్ళకీ మగవాళ్ళకీ ఉండే సంబంధానికీ—మతానికీ ఏం చుట్టరికం ఉంది? నైతికం అంటే యేమిటి? కామపరమైన స్త్రీపురుష సంబంధము నైతికంగా మానవుల్ని అధోగతిలో పడేస్తుందని ఎలా నమ్మగలము?

ఈ ఆలోచనలు ఒంటిగా ఉన్నప్పుడల్లా నాకు వస్తూనేఉన్నాయి. ఈ విషయాలనుగురించి నాతో సమానంగా ఆలోచిస్తుంటాడు తీరమిత్రుడు. నైతికమనేది మానవులలో ఒకరికొకరు కష్టం కలిగించకుండా ఉండడము. అందుకనే మనుష్యుణ్ణి మనుష్యుడు చంపడము తప్పైనా, వారూ వీరూ ఒప్పుకుంటే యుద్ధంలో ఒకర్నొకరు చంపుకోవచ్చును. కాని అది దేశపరం కావాలి, అంతే.

అలాగే స్త్రీపురుష కామసంబంధము. ఈ పక్షం ఆ పక్షం ఒప్పుకుంటే నీతిదూర మెట్లా అవుతుంది? పిలిచేవారు పిలవబడేవారు ఒప్పుకొనికదా భోజనాలకి వెడుతున్నారు? అలాగే పిలిచేవారు పిలవబడేవారు ఒప్పుకుంటే, స్త్రీపురుష సమాగమం నీతిదూరం కాదనే నాకు తోస్తూఉంటుంది.

ఈవిషయంలో నాకూ, త్యాగతకీ భేదాభిప్రాయాలున్నాయి. మా కల్ప మూర్తి ఈ వాదన వచ్చేటప్పటికి చెవులు మూసుకుని పరుగెత్తుతాడు. ఈ వాదనలో సోఫీ నన్ను బలపరుస్తూనే ఉంటుంది. కాని ఆ బలపరచడం వట్టి వాదనకోసమేనని నా అనుమానం. లోకేశ్వరిమాత్రం తన అభిప్రాయమేమిటో ఎప్పుడూ చెప్పదు.

చదువుకోని భారతాంగనల్లో వివాహంవినా, స్త్రీ పురుష సంబంధము నైతికానికీ మోక్షానికీ కొన్నివేలకోట్ల యోజనాల దూరము ఉందని సాధారణాభిప్రాయం. మనోబలం కాస్త తక్కువగా ఉన్నప్పుడు కొందరు స్త్రీలు మగవాడి మాయలకు లోబడి, ఎప్పుడైనా తమ దేహాల్ని వాళ్ళకప్పచెప్పడం ఉన్నది. ఇవి సాధారణ కుటుంబాలలో అప్పుడప్పుడు జరిగే రహస్యసంఘటనలు. అవి లోకానికి కొంచెముగా తెలియవచ్చును, తెలియకనుపోవచ్చును. అనేక యుగాలనుంచి వచ్చింది కాబట్టి కాబోలు యీ నైతిక ఆధ్యాత్మికాభిప్రాయం, నేను నాలో ఎంత వాదించుకున్నా నాకు తెలిసియున్నా తెలియకుండానున్నాకూడా నాచుట్టూ గోడలు కట్టుతూ ఉంటుంది.

నాకు ఒక్క పురుషుడూన్నూ నచ్చడు. నాలో ఏదో ఒక మహత్తరమైన శక్తి ఉన్నదనీ, నాలోని స్త్రీత్వము అద్భుతమైన స్వరూపము తాల్చిందనీ, నాలోని స్త్రీత్వము ఒక విధమైన పరిపూర్ణత పొందిందనీ నా చిన్నతనాన్నుంచీ మహోన్నతికమగు భావము పెంపొందిస్తూనే ఉంది. ఈ భావమే నా హృదయంలోని గీటురాయిమీదగీసి వాళ్ల పురుషత్వాన్ని పరీక్ష చేస్తూంటుంది, నా మనస్సు.

నా పురుషస్నేహితులు నలుగుర్నీ ఆ గీటురాయిమీద గీసుకుని స్నేహం చేయలేదు నేను. ఏ కారణాలవల్ల వీళ్ళు నాకు స్నేహితులయ్యారా అని నేను ఆలోచిస్తూంటాను. అయితే స్నేహానికి కారణాలు వెతికితే దొరక్కపోవు. కొన్ని విషయాలు సంభవించడము కారణాలు చూచుకొని సంభవించవు. అవి సంభవించిన తర్వాత కారణాలు వెదికితే దొరుకుతాయి.

ఆడదానికి ఒక ఆశయపురుషుడు ఉంటాడు. నాకు వయస్సు వస్తోంది అన్నప్పుడు కామభావాలు కలిగేవి. కాని వాటి తత్వము నాకు ఏమీ తెలియదు. యవ్వనము పొందిన బాలకులు నన్ను చూస్తే నా కప్పుడు ఆనందం. వాళ్ళకు తెలియకుండా వాళ్ళని చూడడమూ ఆనందంగానే ఉండేది. ఈ వికారాలు అనేక విచిత్రమైన పోకళ్ళు పోయేవి. కరకాగారు వ్రాసినట్లు భారతీయ స్త్రీలకూ పురుషులకూ కామవికారాలు అంతంత దూరంలోనే ఉంటూ ఉంటాయి.

ఇంతకూ నా ఆశయపురుషుని రూపం నాకు దిఙ్మాత్రంగానే నా భావనేత్రాలకు గోచరించేది. కాని, ఇది అని నేను నిర్ధారణ చేసుకునే స్పష్టత లేకపోయేది. యవ్వనం ముద్దకట్టినవాడు, దేహం కండలుతిరిగి, నున్నగా గంధం చెక్కతో చెక్కిన పరిమళం, సౌష్ఠవమూ కలిగినవాడు, సంతతానందమూర్తి,

గంభీరకంఠన ర్తితగానంకలవాడు, కళామూర్తి, సర్వవిజ్ఞానకోవిదుడు, ముఖ్యంగా ధనలేమిలేనివాడు, సకల సద్గుణసంపన్నుడు. ఇల్లాంటి ఉత్తమపురుషు డెవ్వరు, ఎక్కడ? అతన్ని ఊహించుకొని నేనూ పాటలు రాసుకునేదాన్ని.

ఎచ్చటుంటివోయీ ఓ పురుషమూర్తీ!
ఏల రావైతివీవూ!
పసిమి పచ్చని బలము బంగారు పండునో
మిసిమి యవ్వనకాంతి మేలమ్ములాడునో?
ఎచ్చటుంటివోయీ ఓ పురుషమూర్తీ
నీ యెడద మింటిదెస నావరించిన నేను
నిత్య భాసిత సుధా నిర్గతానందమును
ఎచ్చటుంటివోయి!
నీవేన నాధుడవు! నీవేన ఈశుడవు!
నీ లోననే నేను నృత్య మయ్యెడి దాన
ఎచ్చటుంటివోయీ!

## 20

మా అమ్మగారూ మా నాన్నగారూ అదితికశ్యపులు! మా నాన్నగారి పేరు వినాయకరావుగారు. మా అమ్మగారి పేరు వెంకటరామమ్మ. మా అమ్మ మా నాన్న రెండవ భార్య అని ఎవ్వరూ అనుకోరు. మా తలిదండ్రులకు నేనే ప్రాణం, నేనే బ్రతుకు. మా అక్క చిన్నతనంలో పోవడంవల్ల అప్పటికి ఆరేళ్ల బాలికనైన నన్ను తీసుకువచ్చి, ఏడుస్తూ చివికిపోతూ మదరాసులో కాపురం పెట్టారు. మేము వచ్చిన రెండేళ్లకు మైలాపురంలో, ఆళ్వారుపేటలో పిఠాపురంవారి 'డెన్మోర్ హౌసు' స్థలాల్లో ఒక అందమైన మేడ కొన్నారు మా నాన్నగారు.

సంగీతానికి ఒక మేష్టరు; ఇంగ్లీషు, లెక్కలు, ఫిజిక్సు, కెమిష్టరీ మొదలయిన వాటికి ఒక బి. ఏ.; తెలుగు, సంస్కృతం, చరిత్ర, భూగోళంకు ఒక తెలుగు సంస్కృతం ఎమ్. ఏ. గారు—నాకు ముగ్గురుపాధ్యాయులు. నా ఇష్టం వస్తే చదివేదాన్ని, లేకపోతే మానేసేదాన్ని. మా భవనంలో నేనే రాణిని.

మా నాన్నగారికి అరవై రెండేళ్ళు వచ్చాయి. మా అమ్మకు నలభై మూడు. అయినా వాళ్ళిద్దరూ జీవికా జీవుల్లాగే ఉంటారు. మా నాన్నగారు కొంచెం బొద్దుమనిషి అయినా అట్టే అంత ముసలివానిలా ఉండరు. కాని, చిన్నతనంలో ఉన్నశక్తి అవీ లేవంటూ, ఏదో మూల్గుతూ నేఉంటారు. డాక్టరు వెంకటప్పయ్యగారు వారానికి మూడురోజులు మాయింటికి రావలసిందే.

మా అమ్మగారు నలభైమూడేళ్ళకే తల నెరిసిపోయి, పండులా అయిపోయింది. రహస్యంగా నాకు తెలియకుండా ఎంత ఏడ్చేదో! అందుకోసమే

ఆవిడ కళ్ళకు ఎప్పుడూ జబ్బులే. ఎప్పుడూ కళ్ళవైద్యమే! కళ్లాస్పత్రి కోమన్ నాయరుగారు ఆమెకు ఎప్పుడూ ఏదో వైద్యము చేస్తూనే ఉంటారు.

మా అక్కకోసం మా అమ్మ ఏడ్వని రోజులేదు. ఎవరైనా చుట్టాలు రావడం మా కందరికీ భయం. ఏ పండుగ వచ్చినా భయమే! నన్ను చూచి కళ్ళు తుడుచుకొని వెడనవ్వు నవ్వుతుంది. "ఎందుకే అమ్మా ఆ కళ్ళనీళ్ళు" అని అంటే తన కంటిలో ఏదో నలక పడిందంటుంది. 'అమ్మా మళ్ళీ ఏడుస్తున్నావూ' అని నే నంటే 'ఛా! నేనేడ్చానా నాన్నా! నువ్వు వట్టి వెఱ్ఱితల్లివి నాన్నా! నీకు అస్తమానం నాకళ్ళల్లో నీళ్ళే కనపడతాయి' అని అంటుంది.

మా అమ్మా మా నాన్నా దుఃఖించూనీ, మా అక్కకోసం అంతా ఏడుస్తారు. ఆవిడ ఎంత మంచిదో అని అనుకుంటాను. మా అక్క పేరు శకుంతల. మా అక్క అంత నాకు జ్ఞాపకం లేకపోయినా మా అక్కను గురించి అన్ని కబురులు వినడంచేత, మా అక్కను చూచినట్లే ఉంటుంది నాకు.

మా పినతండ్రి పినపాపారావుగా రున్నారు. వారు అప్పుడప్పుడు సకుటుంబంగా మదరాసువచ్చి మాదగ్గిర ఓ పదిహేన్రోజు లుంటూఉంటారు. మా పినతండ్రి అంటే మా నాన్నగారి పెదతండ్రికొడుకు. మా పాపారావు బాబయ్యా నవ్యసాహిత్యకవుల్లో ఒకడు. ఆయన కవిత్వం అచ్చంగా రాయప్రోలు సుబ్బారావుగారి కవిత్వంలాగే ఉంటుంది. ఆయన మా అక్కను వర్ణించి చెప్తూఉంటే నా కళ్ళు చెమరించి, నా గుండె దడదడమని, ఈ లాంటి అక్కను ఎల్లా పోగొట్టుకొన్నానా అని, నేను రహస్యంగా కళ్లనీళ్లు కుక్కుకునేదాన్ని.

పాపారావు బాబయ్యకూ మా త్యాగతికీ ఎందుకో విపరీతమైన స్నేహం, మా నాన్నగారు, మా అమ్మ మా త్యాగతితో అంత చనువుగా ఉండడం మా స్నేహితులోకాని కందరకూ ఆశ్చర్యం వేసేది. ఎవ్వ రీ త్యాగతి?

ఓరోజున మా లోకేశ్వరి, మా పాపారావు బాబయ్యతో చాలాసేపు మాట్లాడి, నా దగ్గరకు వచ్చింది. ఆ రోజున లోకేశ్వరి హృదయంలో ఏదో రహస్య విషయం ప్రవేశించిందని ఆశ్చర్యపడ్డాను.

మా బాబాయి గుంటూరు వెళ్ళిపోయాడు సకుటుంబంగా. ఆయన కుమార్తెలు—నా చెల్లెళ్లు—వనకుమారి, రాగమాలికాదేవి నన్ను కౌగిలించుకొని 'అక్కా గుంటూరు ఒక్కసారి రావే! పెదనాన్నగారు మదరాసు కదలరు. నువ్వూ మదరాసు కదలవు! వెడితే విశాఖపట్నం ఉపన్యాసపరీక్షకు వెళ్తావు. బొంబయి వెడతావు, కలకత్తా వెడతావు. గుంటూరుకూ యూనివర్సిటీ వచ్చిందిలే. నీ చదువు పూర్తి అయింది. మా చదువులు చూడడానికైనా రావే!' అని అన్నారు.

వాళ్ళిద్దరినీ కౌగిలించుకొని, ముద్దులుపెట్టి, ఎన్నో బహుమతులు ఇచ్చి పంపాను. రైలుకువెళ్ళి ఇంటరులో కూచోబెట్టి వచ్చాను. ఇంటికి రాగానే మా లోకేశ్వరి నా చేతిలో ఓ కట్ట పెట్టింది.

'హేమం ఇదంతా ఈ రాత్రే చదువు!' నా చేతికి ఈ ఉదయమే వచ్చింది. స్కూలులో పాఠాలు ఎల్లా చెప్పానో, కాని వ్రాతపుస్తకం మాత్రం పూర్తిచేశాను' అని పారిపోయింది. ఆ చక్కని బైండుపుస్తకంపై పేరుచూస్తే 'త్యాగతి కథ' అని ఉంది. అది చూడగానే ఎందుకో నా చేతులు వణికినవి. నా కపోలాల చిరుచెమటలు పట్టినవి.



# త్యాగతి కథ

## 1

సముద్రంలో ఎక్కడనో ఒక అలపుట్టి, పైకి ఉబికి, లోతులకుదిగి ప్రపంచ సంచారానికి బయలుదేరినది. మహా నక్షత్రగోళంలోంచి విడివడి ఒక తేజః ఖండము తన ప్రథమ గ్రహసితిని పొందినది. గుంటూరుజిల్లా తెనాలితాలూకా భట్టిప్రోలు గ్రామంలో ఇప్పటికి ముప్ఫైఏళ్ళ క్రితము ఒక విచిత్ర ముహూర్తములో నా మొదటి యేడ్పు లోకము, రాత్రి, నక్షత్రాలు విన్నవి. ఆ ఊరు మా మేనమామల ఊరు. మా అమ్మకు నేను నాల్గవ కాన్పు. మూడవకాన్పు మా స్వంత గ్రామమైన కొల్లిపరలోనే సంభవించినది. కుమారుడు పుట్టి నష్టపడినాడట. కాబట్టి నా జననం మా మేనమామగారింటనే. జాత తండ్రి గండాన పుట్టినాను కాబోలు! నా మూడవ యేటనే తండ్రి దిక్కులలో లీనమై పోయినాడు.

పాలుకు ఏడువేల రూపాయ లాదాయము వచ్చే ఆస్తికి నేనొక్కణ్ణే కుమారుడ నవడంచేత, జనకుణ్ణి చంపినవాడనని నన్నందరూ హేళన చేసినప్పటికినీ నా చిన్నతనం మాత్రం రాజభోగంగా జరిగిపోయింది. నన్ను చూచుకొని మా అమ్మ దుఃఖమంతా దిగమ్రింగి అహల్యాబాయిలా రాజ్యపరిపాలనచేసింది. వీధిలోనికివచ్చి మొగం చూపించకపోయినా భూములు కౌలు కియ్యడంలో, తమలపాకుల తోటల మగతా వసూలుచేయడంలో, పది యెకరాల స్వంత వ్యవసాయము పర్యవేక్షణ చేయడంలో మాఅమ్మగారు వీరనారీమణిలాగే ప్రవర్తించేవారు. నేను నిద్రపోతున్నాననుకొన్నప్పుడు ఒకొక్కక్కరాత్రివేళ తన భర్తను తలచుకొని వాపోయిన సమయాలు నేను కనిపెట్టినవి ఉన్నవి. అప్పుడు నేను పక్కమీదినుంచి గభుక్కున లేచి మా అమ్మ మెడ కాగిలించుకొని 'అమ్మా, ఏలవకు, అమ్మా ఏలవకు' అని నేనున్నూ ఏడ్చేవాడనట.

దూరదూరాన్నుంచి దర్శించిన విగ్రహంలా నా తండ్రిగారు జ్ఞాపకం. ఆయన ఎడమచేతికి నాలుగు ఉంగరాలుండేవి. పొడుగాటి మీసాలు, చెవులకు రవ్వలకమ్మలు. కోలమోము. చక్కని చామనచాయ, తీక్ష్ణమైన చూపులతో

నన్ను చూస్తూ పైకెత్తి 'నాన్నా నీవు పుట్టావు, ఇక నేను వెడుతాను' అని ఆయన అన్నమాటలు ఇప్పటికీ నాకు ఏవో వేదమంత్రాలులా తోస్తూ ఉంటవి.

మా అమ్మ అంత అందమైనదికాదు. కళ్ళల్లో ఉన్న ప్రేమకాంతులు తప్ప కనుముక్కు తీరుల్లో సౌందర్యము తక్కువ. కాని మాతృదేవతాకాంతు లెప్పుడూ ఆమె ముఖంలోంచి ప్రసరిస్తూ ఉంటవి. నాకు జ్ఞానం వచ్చినప్పటి నుంచి తెల్లటివస్త్రము కట్టుకొని ముసుగు వేసుకొన్న రూపమే! కాని, సర్వ భూషణాలంకృతయై, సౌభాగ్యవంతమైన ఆమె కురులు జడగా ముడిచి, సిగ చుట్టుకొని బనారస్‌చీర కట్టుకొన్న ఆమె రూపము నేను మా యింట్లోని ఫొటోలలో మాత్రమే చూచినాను. పూజాపీఠము ముందు కూర్చొని జపం చేసుకుంటుంటే మా అమ్మ పీతాంబరధారిణియైన యోగినీదేవతలా ఉండేది.

ప్రతి పండుగకీ మాఅక్కయ్య లిద్దరూ వస్తుండేవారు. మా పెద్దక్కయ్య నాకన్నా పదేళ్ళు పెద్ద. మా రెండో అక్కయ్య నాకన్నా ఏడేళ్లు పెద్ద. నా నాల్గవయేటను మా పెద్దక్కగారు తన అత్తగారూరైన బందరుకు కాపురా నికి వెళ్ళినది. మా పెద్దక్కగారి పెళ్లి మా తండ్రిగారే చేసినారట. నాకేమీ జ్ఞాపకంలేదు. నా ఐదవ ఏటను మా చిన్నక్కగారిపెళ్ళి జరిగినది. పెళ్ళివారు గుంటూరునుంచి తరలివచ్చినారు. మా మేనమామవైపువారు, మా అన్నదమ్ముల వారు మమ్మాదుకొని వివాహము అత్యంత వైభవముతో చేసినారు. అప్పుడే నా వడుగు కూడా అయింది.

మా అమ్మ నా చదువుకొరకు రేపల్లెలో కాపురము పెట్టినది. అక్కడా మాకు పెద్ద కామాటంగానే ఉండేది. మా క్లాస్‌మాస్టరే నాకు ప్రయివేటుగా చదువు చెప్పేవాడు. క్లాస్‌లో మొట్టమొదటగా ఎప్పుడూ ప్యాసవుతూ ఉండే వాణ్ణి. సెలవలకు ఇంటికి రావడమంటే ఎంతో సరదాగా ఉండేది. తోటల వెంట తిరగడం, పొలాలవెంట తిరగడమంటే నా చిన్నహృదయం ఎగిరి గంతువేసేది. నాకు కమ్మవారబ్బాయిలు, రెడ్లబాలకులు, బ్రాహ్మణార్భకులు చాలామంది స్నేహితు లుండేవారు. వీళ్ళందరికీ నాయకుణ్ణి నేను. తెనాలిలో సెకండుఫారం చదువుతున్న సూరపరెడ్డి, వెంకట్రామయ్యచౌదరీకూడా నా మాటంటే గీచినగీటు దాటేవారుకారు. నాకోసం మా అమ్మ ఎప్పుడూ ఏదో చేస్తూనేఉండేది. మినపరొట్టో, చేగోడీలో, పకోడీలో, జంతికలో ఏవో అవి మూటలు పట్టుకొచ్చి, నా స్నేహితులకు విందులు, ఫలహారాలు పెట్టేవాణ్ణి. ఏ స్నేహితునింటికి వెళ్ళినా ఆ స్నేహితుని పెద్దలందరూ ఎంతో ప్రేమతో నన్ను పల్కరిస్తుండేవారు.

ఆ రోజుల్లోకూడా ధుంటి వినాయకరావుగారు నేనంటే చూపించే ఆపేక్ష నిరుపమానమైంది. ఆయనకూ మాతండ్రికీ పరమస్నేహము. ఆయనకు పిలక ఉండేది. పద్ధతి నియోగ మంటే అపరిమితమైన ప్రేమ. నందిరాజు దీక్షితులవారంటే ఎంతో భక్తి. నియోగమహాసభలకు వేలకువేలు ఖర్చు

చేస్తుండేవారు. మా తండ్రిగారికి పద్ధతియందు నమ్మకముండేదికాదట. మా నాయనగారిని శ్రీ దైవద్వైతమతస్థాపక దీక్షితులుగా ఎప్పుడూ హెచ్చరిస్తుండేవారట. పద్ధతి నవలంబించిన వినాయకరావుగారికిని, పద్ధతి నవలంబించని మా తండ్రిగారైన శేషాచలపతిగారికిన్నీ కృష్ణార్జున మైత్రివంటి గాఢస్నేహమని పెద్దలు చెప్పుతుండేవారు.

ధుంటి వినాయకరావుగారు నేను కనబడగానే 'ఒరే మూరీ!' అని దగ్గరకు పిలిచి, ఒళ్లో కూర్చోపెట్టుకొని, నా తలను వ్రేళ్ళతో సవరిస్తూ 'నీకు మీ అమ్మగారి పోలికలు, మీ నాన్నగారి తెలివితేటలన్నీ ఉన్నాయిరా. పరీక్షలన్నీ ఫస్టుగా ప్యాసై గొప్పవాడివై లోకంలో పేరుప్రతిష్ఠలు సంపాదించుకో' అని అనేవారు. ఈ ముక్కలు ఎన్నివేలసార్లన్నారో ఇప్పటికీ నా చెవుల్లో ప్రతిధ్వనిస్తూనే ఉంటవి.

నా చిన్నతనంలో చంటిబిడ్డలంటే అసహ్యం. వాళ్లు బట్టలు మలినం చేస్తారని పెద్దక్కగారి బిడ్డల్ని ఎప్పుడూ ఎత్తుకునేవాణ్ణికాను. దూరంనుంచి ఒకవేలుతో ముట్టుకునేవాణ్ణి. మా మేనమామగారి బిడ్డల్నీ అంతే. అలాంటి నా చిన్నహృదయానికి ఒక బాలికంటే అదేదో విపరీతమైన అనురాగముండేది. ఆ బాలిక పుట్టినప్పటినుంచి 'నీ పెళ్ళాము నీ పెళ్ళా'మని వాళ్ల అమ్మా, నాన్నాకూడా నన్ను వేళాకోళం చేసేవారు. ఆ చిన్నప్పటిమాటే నాకు పరమవాక్యయినది. నా అయిదవ ఏటను ఆ బాలిక జన్మ తాల్చినది. పాలబుగ్గలపైన ఉన్న ఆ నాటి నా కళ్ళకే, పొత్తిళ్ళలోని ఆ వెన్నముద్దల బాలిక సర్వసౌందర్యాలకు నిధి అనితోచేది. ఆ బాలిక తల నిలపడం వచ్చిన అయిదోనెలనుంచి కూడా నే నెక్కడ పడవేస్తానో అనే భయంతోనే ఎత్తుకుంటుండేవాణ్ణి. ఎంత ఏడ్పులోఉన్నా 'ఏడవకు' అని నేననగానే ఆ పాప ఊరుకునేది. ఆ అమ్మాయి వినాయకరావుగారి ప్రథమ సంతానం.

వినాయకరావుగారి ప్రథమ భార్య, బిడ్డలు లేకుండానే ఇరువదియైదవయేట కాలముచెందినది. అప్పుడే రెండవభార్యను చేసుకొన్నారట. రెండవ భార్యకు చాలాకాలమువరకు కాన్పురాలేదు. శేషాచలపతితో వియ్యమందుటకైనా నాకు బిడ్డలు కలుగలేదే అని ఆయన దిగులుపెట్టుకునేవారట. మా తండ్రిగారు పోయిన రెండేళ్ళకు వారి ప్రథమ పుత్రిక ఉద్భవించినది. అందాల ఆ చిన్నపాప నే నెత్తుకొన్నప్పుడు చాకలి తెచ్చిన బట్టలైనాసరే, ఆమె అశుభ్రపరచినా మాట్లాడకుండా ప్రక్కనేఉన్న మా యింటికి పరుగెత్తుకవెళ్ళి ఆ బట్టలు విడిచి శుభ్రమైనబట్టలు కట్టుకొనివచ్చేవాడిని. మేము రేపల్లె చదువుకు వెళ్ళేసరికే శకుంతల తప్పటడుగులు వేస్తుండేది. మొదటిసారి సెలవలకు వచ్చినప్పుడు, ఆమె ముద్దుమాటలు మాట్లాడినది. రెండవసారి సెలవలకు వచ్చినప్పుడు, మొదట నన్ను చూచి క్రొత్తచేత సిగ్గుపడినా రెండవదినం నా మెడచుట్టి నన్ను వదిలిందికాదు.

బంగారపు తొనల ఒళ్లు, ఒత్తు జుట్టు. ఆ జుట్టు, వెనక్కు తీసుకోవడము తెలిసేదికాదు. జుట్టుమధ్యనుంచే కళ్ళతో చూస్తూ మాట్లాడేది. 'బావ వత్తేలు బితకతులు తెత్తిపెత్తాడు' 'నాన్నా బావను పెల్లి తేతుకుంతా' అని అంటూవుంటే దేహ మనః ప్రాణాలతో కాంక్షించి పెళ్ళిచేసుకొన్న నవ యౌవనుని హృదయంలా నాహృదయము దడదడ మనేది, పాలకడలిపొంగులా పై కుబికిపోయేది.

నేను పదేళ్ల కుర్రవాణ్ణి, ఆమె అయిదేళ్ల బాలిక. మే మిద్దరం చిన్న తనాన్నుంచి ఒకేకంచంలో తినడ మలవాటు. వాళ్ళింటికి వెళ్ళినా వాళ్లమ్మ ఒకే వెండికంచంలో మాకు అన్నం పెట్టేది. ఒకొక్కప్పుడు మా ఇంట్లోనే రాత్రులు నా మంచంమీదనే, నాప్రక్కన పడుకొని నిద్రపోయేది. మా నిదురలో ఆమె నాన్నగారు వచ్చి ఎత్తుకొని తీసుకుపోయేవారట. వాళ్లమ్మ ఏమి పెట్టినా నాకు పెట్టకుండా తినేదికాదు. నే నేమి సంపాదించినా శాకుంతలకి పెట్టకుండా తినేవాణ్ణికాదు.

నేను విన్న కథలు, చదివిన కథలు ఆమెకు చెప్పేవాణ్ణి. ఆమెకు వాళ్ల అమ్మమ్మ చెప్పిన ఈగ పేరు మరచిన కథ, రాజుకు ఏడుగురు కొడుకుల కథ, పేను కథ, కాకీ పిచ్చుక కథ తన తియ్యనైన లేత మాటలతో,

'పేదరాసి పెద్దమ్మా
పెద్దమ్మ కొలుకా
కొలుకుచేతి గొడ్డలా
గొడ్డలి కొత్తే చెత్తా
చెతుమీద వాలిన పిత్తల్లాలా
పిత్తలుతాగే నీల్లా
నీల్లల్లో తిరిగే తేపల్లాలా
తేపల్ని పత్తే జాలరివాలా
నా పేలేమితి?'

అని కథ చెప్తూవుంటే, నా ఆ చిన్ననాటి దశలోనే ఆ మాటలతో కలిసిపోయి ఏ లోకాలలోకో పోయేవాడిని. ఆమె ఆ కథ ఎన్నిమారులు చెప్పినా క్రొత్త అందాలతో కనబడేది. గుజ్జనగూళ్ళ ఆట లాడేవాళ్ళము. 'నేను బువ్వ వండుతాను, నీవు కత్తేరుకు వెళ్లిరా బావా' అని ఆమె అన్నప్పుడు ఆ బొమ్మరిల్లే మహాభవనమై, ఆ వేయించిన కందిపప్పే పంచభక్ష్య పరమాన్నాలై, ఆమె నా దివ్యసుందరి గృహిణియై, రాజ్యభారము వహించిన ఒక ఉన్నతోద్యోగిని నేనై, అవ్యక్తంగా క్రీడలలో నా కా రోజుల్లో మహదాశ్చర్యమైన ప్రపంచ మొకటి ప్రత్యక్షమయ్యేది. ఒకొక్కక్కప్పుడు నాకు పై పడుతున్నకొలది, మా యం దొకరి కొకరి కున్న ప్రేమ ద్విగుణీకృత మయ్యేది.

ఒక రోజున మా స్నేహితులకు ఆట యుద్ధమునుంచి నిజమైన యుద్ధము వచ్చినది. తోలుబొమ్మలాట చూచిన ఫలితమది. ఒక జట్టు పాండవులు, ఒక జట్టు కౌరవులు. నేను అర్జునుణ్ణి. పడిపోయిన దుర్యోధనుడి తలపాగా కోస్తున్నట్లు నేను నటిస్తున్న సమయంలో, ఆ దుర్యోధనుడి జుట్టు కొంచెము లాగినాను. పద్నాలుగేళ్ళ రెడ్డిపిల్లవాడు కోపముతో లేచి, అయిదువేళ్ళు అంటేటట్లు చెంపపెట్టు ఇచ్చినాడు. ఒక నిమిషం తెల్లబోయినాను. రెండవ నిముషం కళ్ళనీళ్లు తిరిగినవి. మూడవ నిముషం వెర్రికోపంవచ్చి పొట్టమీద తన్నినాను. ఆ మరునిముషంలో వాడిజుట్టు నేను, నా జుట్టు వాడు పీక్కో-వడము, గ్రుద్దుకోవడం, తన్నుకోవడం. స్నేహితులందరు చుట్టుగూడి నవ్వడం. ఈ మహాయుద్ధంలో ఎక్కడనుంచి వచ్చిందో శకుంతల, వాళ్ల నాన్నగారి పేపబెత్తము పట్టుకొని గబగబవచ్చి దడదడ ఆ రెడ్డిస్నేహితుణ్ణి నాలుగు తగిలించింది. సోగలైన ఆమె కళ్ళు అప్పుడు స్ఫులింగాలు అర్చినవి. మహాగ్నిహోత్రాలై వెలిగినవి. 'మా బావను కొడతావా? వెధవా! నిన్ను చంపేస్తా'నని మహాకోపముతో పలికినది. ఆ రెడ్డిబాలుడు తెల్లపోయి, నాజుట్టు వదిలినాడు. నేను తెల్లపోయి వాడిజుట్టు వదిలినాను.

నన్ను ఫర్థుఫారంలోకి వేసినప్పటికి నాకు పంద్రెండవయేడు, శకుంతలకి ఏడవ ఏడు. బావతోవెళ్ళి రేపల్లెలో చదువుకుంటానని ఆమె పోరుపెట్టింది. పుత్రికమీద ప్రేమతో వినాయకరావుగారు రేపల్లెలో కాపురము పెట్టి, పిల్లను అక్కడ ఆడపిల్లల బడిలో చేర్పించినారు. అప్పుడామెకు కలిగిన సంతోషము తుంగతరంగములైనది. మా మా స్కూళ్లనుంచి రావడంతోనే మేము కలుసుకొనేవాళ్ళం. 'నాకు సంగీతం చెప్పించు నాన్నా' అని ఆ పదేళ్ల బాలిక సంగీతం కూడా ప్రారంభించింది. రోజూ క్లాస్‌లో చదువుకొన్న పాఠాలు నాకు ఒప్పచెప్పేది. పాఠంలో ఏమాత్రం అనుమానం వచ్చినా నన్నడగవలసిందే. తన ప్రయివేటుమాస్టరుకన్నా నేను బాగా పాఠం చెప్పగలనట. ఆ చిన్ననాటి రోజుల్లోనే నేను బి. ఏ. చదువుతున్న ఛాత్రవాణ్ణి అన్నట్టు సంచరించేది.

తన చుట్టాలతో మాట్లాడేటప్పుడు 'మా బావకు సంగీతం బాగావచ్చును, మా బావ కథలు బాగా చెప్పతాడు, మా బావ ఎంతో తెలివైనవాడు, మా బావ అన్ని క్లాసుల్లోను ఫస్టుగా ప్యాసవుతాడు' అన్న అసదృశమైన ఆమె పూజలో నేను జవహరులాల్ నెహ్రూ అంతటివాణ్ణా అనుకొనేవాణ్ణి. తెలియకనే ఆ చిన్ననాటి కలలు, ఆ భావాలు, ఆ చిత్రాలు కాశీపటముల పెట్టెలోని బొమ్మలవలె అవ్యక్తమై మధురమై తిరిగిపోయినవి. పెద్దవారి మాటల్లా ఆడబోయిన మాటల్లో అర్థము లేదు. అరవత్కృతులుమాత్రమున్నవి. ఆ నీడలలో గాఢ తమస్సులు లేవు. సంజెవెలుగులు పరిమళపూర్ణాలై లేచిపోతుంటవి. ఆ రోజులలో గ్రీష్మాతపములు లేవు. సువ్యక్తదినకాంతులు లేవు. నిష్కల్మష ప్రేమలు నిర్మల హృదయాలు!

జాబిల్లి వంకలో చదలేటి ఊటలున్నవి. చుక్కల వెలుగులో మక్కువల మహిమలున్నవి. పండుగలే ప్రపంచ రాజకీయాలు. ఆటలే జీవితపు గాఢ కష్టాలు. ఆనందమే జీవిత పరమావధి. ఆ రోజులలో చేయికలుపువారు బాల కృష్ణుడు, బాలరాముడు. మంచినీటికై మబ్బుల జంతువులు. అవి ఆవులో తేనెల ప్రోవులో!

ఓ చిన్నబాలికా! నీ చిన్ని అందాలచేతులే ఆనాటి నా మొరకుచేతులను పట్టుకొని నన్ను మెమ్మదిగా నడిపించినవి. మా దొడ్డిలోని గులాబిమొగ్గల ఎరుపులను సేకరించుకొని వంకరలు తిరిగిన నీచిన్ని పెదవులు, ఆనాడు దివ్యమంత్రముల నెన్నో ఉపదేశించినవి. సోగలై దివ్యత్వము నే కూర్చుకొన్న అద్భుతములైన నీ కళ్ల కాంతులు ఈ సృష్టిలోని ఏదో రహస్యాలను వెలుగులతో దూరదూరాన చూపించినవి.

## 2

చిన్ననా డో జేమచెట్టున
చిట్టచివరకు ఎక్కి పళ్లను
చిలకలా తింటున్న నన్నా
చిట్టిదానవు చూచి గంతున
చేరగా పరుగిడుచు వస్తివి,
నీలిపావడ కూర్చు కుచ్చులు
గాలిలో న ర్తించె శంపా
లీలలో!

పసిడి దేహం తొనలు మెరిసెను
పాణికీ బంగారు గాజులు,
పిల్లకాసుల పేరు గల గల
కంఠమున గొలుసుల్లు పేటలు
చిక్కపడి పులిగోరుతోనే
చెదిరియాడెను హృదయసీమను.
దువ్వపోయే కురులుగోటను
తొలగ చేస్తూ పరుగువస్తివి,
ఘల్లుమన్నాయ్ కాళ్ళగజ్జలు
ఝల్లుమన్నది చిన్నగుండే.
చెట్లపళ్ళో కోయుమన్నా
'చిన్నబావా, చూడు చూడూ
దోరపండు ఒకటి ఇయ్యావ్
మారుపెడతా తాయిలమ్మో
మాట నిజ'మన్నావు.

'తాయిలమ్మా నాకు వద్దూ,
మాయమాటలు నేను విన్నూ
పెళ్ళి ఆడా బావ నిన్నని
వేయి చేతిలో 'చేయి' అన్నా.

మాటలో అరాలు తెలియదు
మాటలో మంత్రాలు ఎరగను
మిన్ను మొగమై చూచు కన్నుల
చిన్ని సిగ్గులు నాట్యమాడెన్.
చెట్టునుంచీ దుమికి, చెంగున
జేరి నిన్నూ బాలరాణిని,
చేర్చితిని నా చిన్న హృదయం,
లజ్జపడి, గద్గదికమైతిని.
జేబులో ఉన్నట్టి పళ్లూ
చేతిలో ఉన్నట్టి గుటకలు
మోకరిలి దోసిళ్లు పట్టితి
మోమువంచితి శోకహృదినై.
చిట్టి చూపులు చిన్ని చేతులు
చెంప లట్టీ మోము నెత్తీ
'చిన్నబావా నిన్నె పెళ్ళి
మాటయిస్తా మాట తప్పను
పళ్ళకోసమె కాదు నిజమూ
పళ్ళచెట్లూ సాక్ష్య'మన్నావూ!

కళ్ళలో ఆడేను చుక్కలు
గళములో చేరాయి బరువులు
బాలహృదయం మధురమాతూ
కలలు కన్నాదీ!

నేను హైస్కూలు క్లాసులు మూడూ, గుంటూరు టౌను హైస్కూలులో చదివినాను. గుంటూరులో మొదట నేను చేరినప్పుడు అరండల్ పేటలో మేము కాపురమున్న చోటినుంచి హైస్కూలుకు చాల దూరమవడంచేత మా అమ్మ నాకొక చిన్న సైకిల్ కొనిపించి యిచ్చింది. నా సైకిల్ బి. ఎస్. ఎ. తళ తళలాడుతూ వేటకుక్కవలెనున్న నా సైకిల్‌ను చూస్తే నాకెంతో గర్వంగా ఉండేది. లాంతరు, గంట, క్యారియర్, స్టాండ్ మంచి ఖరీదుగలిగిన లూకాస్ కంపెనీవారివి. గుఱ్ఱపు జీనులాంటి జీను — బ్రూక్స్‌సాడిల్, ఇంకా ఇతర అంగసౌష్ఠవాలు కలిగి పందేనికి ఉరకబొయ్యే అరబ్బీ గుఱ్ఱంలా ఉండేది. ఆ బండిమీదే తొక్కడం నేర్చుకొన్నాను. ఒక్కరోజులో వచ్చిందా విద్య

నాకు. అప్పటి కింకా పొట్టిగానే ఉండేవాణ్ణి. అయినా ఆ సైకిల్ మా యింటికి వచ్చిన మరుసటి క్షణంనుంచి, నాకూ దానికీ గాఢస్నేహం కలిగింది. నా మనస్సులోని భావం గ్రహించి నడిచేది. వెళ్ళితే మేఘాలమీద పరుగు. లేకపోతే వెనక్కు నడిచినట్టు నడక. నాకే ఎదురు సలహా చెప్పేది. ఎంతటి జనసమ్మర్దమైనా, దారి ఎంత ఉక్కిరి బిక్కిరిగా ఉన్నా, బళ్ళూ, జట్కాలు, కార్లు వత్తిడి ఎంత ఎక్కువగా ఉన్నా, అతి నేర్పుతో వత్తిగించుకొంటూ నన్ను తేల్చుకొనిపోయేది. నేను మీద చేయివేస్తే ప్రేమతో ఉప్పొంగేది. రాత్రిళ్ళప్పుడు నేను సైకిల్ తొక్కి వెళ్లుతుంటే ఏదైనా గొయ్యికాని, రాయి కాని ఎదుట ఉన్నప్పుడు, తాను బ్రేకుపడినట్లు ఆగిపోయేది. ఎప్పుడూ సైకిల్‌ను బాగుచేసుకునేవాణ్ణి. బాగుచేసుకొన్నప్పుడు సైకిల్ పకపకమని నవ్వేది.

నేను సైకిలెక్కి తొక్కి వెళ్లుతూ అందరూ నన్నే చూస్తున్నట్లు భావించుకొనేవాణ్ణి. అందరి కళ్ళు నా సైకిల్‌మీదే ఉన్నట్టుగా తోచేది. నా సహాధ్యాయి ఎవరడిగినా, నేను నా సైకిల్ ఎప్పుడూ ఇయ్యలేదు. నేను క్లాసులో ఉన్నప్పుడు రెండుసార్లిద్దరు స్నేహితులు నా సైకిలెక్కి త్రొక్కాలని ప్రయత్నించారు. కాని ఎక్కిన తక్షణమే తల్లక్రిందులుగా పడి గడ్డం బ్రద్దలుకొట్టుకొన్న వాడొకడు, ఎడమ ముంజేయి విరగకొట్టుకొన్న వాడొకడు! నా సైకిల్‌కు రంగైనా చెదరలేదు.

ఆలాంటి నా సైకిలు మా శకుంతలను చూచేటప్పటికి, నాతోపాటు ఆనందంతో పొంగిపోయింది. పెడలు అందకపోయినా పరికిణీ వెనక్కు విరిచి కట్టుకొని అతి సునాయాసంగా సైకిల్ త్రొక్కడం నేర్చుకొన్నది. మా ఊళ్ళో కాలువగట్టుమీద డొంకల్లో మా శకుంతలను కూర్చోపెట్టి సైకిల్ త్రొక్కుతుండేవాణ్ణి. ఇది ఫోర్తుఫారం సెలవలకి నేనింటికి వెళ్లినప్పుడు జరిగిన సంగతి. నాతో గుంటూరు చదువుకు రావాలని తండ్రిగారితో పోరుపెట్టింది. కాని ఇంటిదగ్గరే ప్రయివేటుగా చదువు చెప్పించారు వినాయకరావుగారు.

* * * *

**ఆ రోజు ఉదయం తోటలోంచి హేమ ఏదో ఒకవిధమైన తొందరతో ఒక విధమైన సిగ్గుతో, ఒక విధమైన పరుగుతో ఆమెకు సహజమైన గంభీరనదీ** ప్రవాహంవంటి నడకగాక, భయము నిండిన నడకతో తోటలోంచి నా దగ్గరకు వచ్చిన క్షణంలో, నాయీ చిన్ననాటి జీవితము అద్భుత వేగంతో ప్రత్యక్షమై, మాయమైపోయింది. ఆమెను తోటలో వీరమిత్రుడు తన ధూర్తత్వముతో బాధించినాడని నా కామెను చూడగానే అర్థమైనది. పురుషులలోని పశుత్వము తన కోరలకు ఆడదాని వేడినెత్తురు తగిలితేనేగాని, తృప్తి అనేది పొందదు. చక్కని గులాబీ పువ్వును చేతికిస్తే కొందరు రసికశ్రేష్ఠులు రేకురేకు త్రుంపి, కొన్ని చేతుల్తో నలిపి, కొన్నిటిని పళ్ళతో కొరికి, ఆ సుందర కుసుమాన్ని అయిదు చిటికలలో రూపు మాపేస్తారు. మనోజ్ఞ మానినీజీవితాన్ని కూడా మనుష్యపిశాచులు కొందరు ఖండఖండాలుగా చీల్చి, నలిపి గిరవాటు వేస్తారు.

తీరమిత్రుడు ఎంత కర్పూరశలాకలాంటి శరీరంకలవాడో అంతటి కఠిన హృదయుడు. ఆతని జీవితరేఖలన్నీ హేమకుసుమదేవి చూచాయగా కనిపెట్టి నట్టే తోస్తుంది. కాని ఏమో?

అయినా నిప్పుతో చెలగాటూ లెందుకాడుతోందో? చపలాత్ములైన స్త్రీల హృదయం ఎంతటివారికైనా అగోచరముకదా? హేమదేవి తీరమిత్రుని ప్రేమిస్తున్నదా? అయితే ఆ ప్రేమ ఎలాంటిది? నా దివ్యదేవతైన శకుంతల చెల్లెలు తుచ్ఛప్రేమకు దాసురాలు కాగలదా?

దివ్యదేవీ శకుంతలా! నువ్వు నడిచినది సర్వకాలము పవిత్రవ్యోమనదీ తీరాలేకదా! దివ్యలోకవాసినివైన మహాదేవివి నీవు. కారణమాత్రుణ్ణయి నీ జీవితంలో ఒక అణుమాత్రం పంచుకొన్నాను నేను! మళ్ళీ నా మనస్సు నా చిన్ననాటి కథమీదికి పోయింది.

* * * *

శకుంతల ఎప్పుడూ అబద్ధము చెప్పి ఎరుగదు. కాని తియ్యటి ముద్దుమాటలతో చిన్న పిల్లలకు తగిన హాస్యపు సంభాషణలతో సర్వకాలమూ సంతోషముతో ఉప్పొంగి పోయేది. ఆమె వేళాకోళాల కందరము గురి ఔతుండేవాళ్ళము. వాళ్ళమ్మమ్మ మాఊరు వచ్చినప్పుడ నేది 'అమ్మమ్మా! నీ ఆచారం కోసం ప్రపంచమంతా తడిపేసేట్టున్నావే! మనింటి ముందర గేటును బిచ్చగాడు ముట్టుకోవ స్తే అంటైపోయిందని, గేటుకడిగివేస్తావే! వంటిల్లున్నందుకు యిల్లంతా కడిగించవేం' అని. నే నొకరోజున యిప్పుడే వస్తానని తోటకు వెళ్ళి మూడుగంట లాలస్యం చేసి వచ్చాను. 'మూర్తిబావా! ఇప్పుడే వస్తానన్నావు, యిప్పుడంటే ఎన్ని గంటలో?' అన్నది. నేను తెల్లబోయినాను, ఆమె పకపకా నవ్వినది.

ఆ నవ్వులో వెన్నెలలు విరిసినవి. ఉదయకాలపు ఎఱ్ఱని కిరణాలు ప్రసరిస్తుంటే కృష్ణానది చిరుకెరటాలలా ఆ నవ్వు అన్నివేపులా ఆక్రమించినది. ఆ నవ్వులో కోకిలలు పాటలు పాడినవి. తమలపాకుతీగ లేత ఆకులు తొడిగినది. మా అమ్మగారి పూజావేదికపైన చిత్ర చిత్ర పుష్పముల ఆ నవ్వు సౌరభాలను వెదజల్లినది.

నేను ఊళ్లో ఉన్నానంటే, నిమిషానికో వింతకైసేత చేసికొనేది. 'ఈ పరికిణీ బాగుందా బావా? ఈ చొక్కా అందంగా ఉందా?' అని నే నేదో సమాధానం చెప్పినదాకా అడిగేది. నేను బాగుండలేదంటే బట్టలు మార్చుకొనివచ్చేది. నేను బాగున్నాయంటే గంతులు వేసుకుంటూ వాళ్ళమ్మవద్దకు పోయి 'అమ్మా, ఓ అమ్మా! నాబట్టలు బాగున్నాయన్నాడే బావ!' అనేది. "అల్లాగటమ్మా! బావ మెచ్చుకున్నాడటమ్మా! నాతల్లివిగా' అని వాళ్లమ్మ సంతోషముతో మాట్లాడేది.

ప్రతి ఆభరణమూ నేను మెచ్చుకోవలసినదే. లేకపోతే ఆ నగ ధరించేదే కాదు. ఒక్కొక్కప్పుడల్లరితో తన హారాలన్నీ నా మెడలోవేసి 'బావ

నగలు పెట్టుకొంటే ఎంత అందంగా ఉంటాడు ! రా ! మా అమ్మ చూస్తుం' దని నన్ను వాళ్లమ్మగారివద్దకు తీసుకపోయేది.

"అమ్మా, బావ పెండ్లికొడుకులా లేడటే !"

"బావ పెళ్లికొడుకులాగున్నాడు, నీవు పెళ్లికూతురులా ఉన్నావు."

"నాతో వేళాకోళా లాడొద్దమ్మా !"

"నీతో నాకు వేళాకోళాలేమిటే పిచ్చితల్లీ ! నిజం చెప్పాను."

"అబ్బా ! నాకు సిగ్గువస్తుంది" అని తుర్రున పారిపోయింది.

## 3

### వి ష్క ం భ ము

హేమసుందరి ఇంతవరకు ఆ వ్రాతప్రతిని చదువుకొన్నది. ఆమె హృదయం ద్రవించిపోయింది. ఏమిటీ, త్యాగతి తన బావగారా! త్యాగతి పేరేమిటి? ఎంత తన్ను మోసపుచ్చినాడు! తన తల్లిదండ్రులు ఆ మోసంలోనే చేరారూ! ఏమిటి దీనికంతకూ కారణం? ఎందుకీ సంవత్సరముపాటూ త్యాగతి తనకు బావగారని తెలపకపోవటం? అందుకనే తనతండ్రి కతడంటే అంత ప్రేమ, అంత గౌరవం! తనతల్లి అతడు వచ్చాడనేటప్పటికే ఎంతో ఆనం దంతో పొంగి అల్లుణ్ని చూచుకొన్నట్లు చూచుకోవడము.

త్యాగతికథ చక్కని పట్టుబెండు పుస్తకంలో వ్రాసివుంది. ఆపుస్తకం నిండా భారతీయ చిత్రలేఖనా విధానాన అలంకారచిత్రములు నిండియున్నవి. తన అక్కగారి చిన్ననాటి చిత్రములు, తన బావగారి చిత్రము, తండ్రిగారివి, తల్లిగారివి ఎన్నో ఉన్నవి. వాని అన్నింటిలో తన అక్క చిత్ర మెక్కడ రచింపబడినా అది ఒక దేవలోక సుందరి చిత్రంలా ఉన్నది.

తన పడకగదికి ముందున్న చదువుగదిలో హేమం సోఫాలో పడుకుని, తలకు ఎడమప్రక్కగా చిన్నరోజు చెక్కబల్లమీద పద్మములోనుంచి వచ్చే కర్ణికలా ఉన్న విద్యుద్దీపం వెలుగున, ఆ పుస్తకం చదువుకుంటున్నది. కథ రెండు ప్రకరణాలు జరిగేసరికి హేమం ఎందుకో పడుకుని చదవలేకపోయింది. పుస్తకం హృదయాని కద్దుకుంది. ఆమె కళ్ళవెంట జలజల నీటిబిందువులు రాలినవి. తన స్మృతిపథంలో చిన్ననాటి రోజులలో సంచరించిన దేవవీరుడై వెలిగి, దేశాల తెగించి పారిపోయిన తన మూర్తిబావే త్యాగతా! ఆ ప్రశ్న ఆమె ఆశ్చర్య మున లీనమై ఆమెహృదయమునకు మరియు ఆందోళన తెచ్చినది. ఈ సంఘటన లోని మహారహస్య మేమిటి? ఆమె తీవ్రాలోచనలలో మునిగినది. ఒకసారి కోపం ఒకసారి విషాదం ఆమెను అలమివేసినవి.

త్యాగతీ! ఎంతవాడవయ్యా నీవు! నిన్ను బావా అని పిలవాలా? లేక త్యాగతీ అని సంబోధించాలా? అహో! ఎంత అందంగా కథ మొదలుపెట్టాడు.

బావ అనే మాటలో ఉన్న ఏదో చిత్రానుభవము ఆ కథాసౌందర్యంలోనుంచి తొణికిసలాడి, వెల్లువలై ప్రవహించివచ్చి, తన్ను ముంచివేసింది.

ఈ రహస్య వ్యక్తితలోనుండి బయలుపడిన బావ తనకు ఎక్కువ సన్నిహితుడా? లేక తన స్నేహితుడై తనకు పెట్టని కోటయై, వివిధరీతుల గురువైన త్యాగతి తన కెక్కువ సన్నిహితుడా? ఈ బావా, ఈ త్యాగతీ తన హృదయంలో ఇంతలో ఏకీభవించడంలేదేమి?

చిన్నతనాన్నుంచి తన అక్క తన కొక దేవతే. ఇప్పుడు ఆ అక్క చరిత్ర ఎంత చక్కగా వర్ణించాడు ఈ కవి! తన బావకవి. త్యాగతి శిల్పి మాత్రమని తాను విన్నది. ఆతని చిత్రాలూ, ఏవో తన ఇంటికితెచ్చి చూపించిన లోహవిన్యాసాలు తక్క, ఇతరాలు తానెప్పుడూ చూడలేదు. ఆ లోహ శిల్పాలు కొత్తఅందాలతో, భావాలతో నిండి, మనోహరంగా ఉన్నవి. తానీ లోహశిల్ప విధానము నేపాలులో నేర్చుకొన్నానని త్యాగతి చెప్పినాడు. తన చరిత్ర పూర్తిగ ఒక్కనాడైనా ఆతడు చెప్పలేదు. కారణము? పాపారావు బాబయ్య రాగానే ఎదో సంచలనము కలిగినది. ఆ కారణంగా తన కీ గ్రంథము వచ్చిఉంటుంది.

హేమసుందరి ఆ గ్రంథము మూసివేసి హృదయమునకు మరల నొకసారి అదుకొని, ఇటునటు పచారుచేసినది. ఒకమారు పడకగదిలోనికి పోయి, హృదయమున నా గ్రంథ మద్దుకొనియే ఆమె తన మృదులపల్యంకముపై బోర్లగిల పండుకొన్నది.

లోకేశ్వరికి మొదటినుంచీ ఈ రహస్యము తెలుసునా? తనఅక్క అత్తగారు తమ్ము చూచుటకు రెండు నెలల క్రిందట వచ్చినది. ఆవిడ తన్నెంతో ఆదరించినది. తన్ను కౌగిలించుకొన్నది. ఉన్నంతసేపూ తనదగ్గరనే తన్ను కూర్చుండబెట్టుకొన్నది. తన కామెను చూచినప్పు డెంతో జాలి కలిగినది. తన కోడలికై, దేశాలు పట్టిపోయిన కొడుకుకై ఆమె హృదయము వ్రక్కలై యుండుననీ, ఆమె జీవచ్ఛంలా ఉన్నదనీ తాను భావించి ఆమె దగ్గరగా తాను ఒదిగిపోయినది.

"హేమం అచ్చంగా శకుంతల పోలిక" అని ఆమె అన్నప్పుడు తాను ద్రవించిపోయినమాట నిజం. తాను ఇంతైనా భేదంలేకుండా అన్నిమారులా అక్క పోలిక అని అందరూ అంటూఉంటే పొందిన విచిత్రభావాలకంటే, అక్క అత్తగా రన్నప్పుడు పొందిన ఆనంద మేదో విలక్షణమై, ఇదమిత్థమని తేల్చరానిదై పోయినది.

త్యాగతి తనబావని కల్పమూర్తికీ, తీరమిత్రునికీ, నిశాపతికీ, సోఫీకి తెలియనే తెలియదు. తెలిసిఉంటే తనకూ తెలిసిపోయిఉండును. లోకేశ్వరి ఇంత రహస్యము దాచుకోగలిగిందా? తల్లిదండ్రుల ఉద్దేశ మేమిటి? ఆమె హృదయంలో ఎదో ఆలోచన పుట్టింది. ఆమె మోము కెంపెక్కింది. ఆమె మోములో చిరునవ్వులు నృత్యమాడినవి. ఆమె హృదయం అమితవేగముగ

పరుగులువారింది. వెంటనే ఆమెకు కోపంవచ్చింది. కోపము తల్లిదండ్రులపై, త్యాగతిపై, లోకేశ్వరిపై—అందరిపైనా వచ్చింది. వెంటనే తనకోపానికి తాను నవ్వుకొంది. మంచంనుండి లేచి గ్రంథము తీసికొని చదవడానికి సోఫాపై చేరింది.

( త్యాగతి కథ తిరిగి ప్రారంభము )

దసరా సెలవులకు నే నింటికి పోయినప్పుడు టెన్నిసు లాగు, షర్టు ధరించి, నీలపు వెనీషియన్ కోటు ఎడమ మోచేతివంకలో చమత్కృతిగా వేసుకొని, కాలికి టెన్నీసుజోడు తొడుక్కొని, చేతిలో టెన్నిస్ రాకెట్టుతో మా ఊళ్ళో దిగాను. బండిదిగి మా యింటికి వెళ్ళకుండా నే శకుంతలయింటికి గబగబ వెళ్ళినాను. "బావా, యిదేమి వేషమోయ్" అని పరుగెత్తుకొనివచ్చి అతి ఆనందంగా శకుంతల నన్ను 'బావ పెద్దవా డవుతున్నాడు, నేనూ పమిట వేసుకుంటా'నంటే మాఅమ్మ కోప్పడుతుంది. నీవు బంతి ఆడుతున్నావా? నాకు కూడ నేర్పుతావా బావా?"

నేను: టష్. ఆడవాళ్ళు బంతి ఆడకూడదు. ఆడవాళ్ళు ఒప్పులకుప్పా వొయ్యారిభామా, చెమ్మచెక్క చేరడేసి మొగ్గా ఆడుకోవాలి.

శకుం: పోనీలేమ్మా! నాకు నేర్పకపోతే నేను నేర్చుకొంటున్న సంగీతపాటలు నీకు వినిపించనే వినిపించను. నాకు సంగీతంమాష్టరు వచ్చాడని నీకు తెలియదు కాబోలు! నీ బ్యాట్ కంటె నా వీణ చాలా అందంగాఉంటుంది. నావీణ నీకు చూపిస్తానా? నాకు సరిగమలు వచ్చాయ్. స్వరజతులు మూడయాయ్. మామాష్టర్ నాకు ఎంతో తొందరగా సంగీతం వస్తుందన్నాడు.

నేను: అంతా బడాయ్! నీకు సంగీతంకూడా వస్తుందా!

శకుం: నీకు బంతి ఆట వస్తుందా! బడాయికి బ్యాట్ తెచ్చుకొన్నావు.

నేను: గుంటూరు వచ్చిచూడు తెలుస్తుంది.

శకుం: నేను సంగీతం పాడుతుంటే వచ్చి విను!

నేను: ఓ తాయలంగారికి నేను తెచ్చిన బొమ్మలన్నీ యిస్తానా?

శకుం: నేను ఓతాయిలంగారికోసం కట్టిన జేబురుమాళ్లు ఇస్తానా?

నేను: నాకూ ఉన్నాయి కావలసినన్ని జేబురుమాళ్లు.

శకుం: నాకూ ఉన్నాయి కావలసినన్ని బొమ్మలు.

నేను: అయితే నేను తక్షణం యింటికి వెళ్ళిపోతాను.

శకుంతలకు కన్నీళ్లు తిరిగినయి.

"అమ్మా, మూర్తిబావ నామీద కోపంవచ్చి నా జట్టు ఉండకుండా వెళ్ళిపోతున్నాడే!" అని కళ్లనీళ్ళు తుడుచుకొంటూ కోపంతో గిర్రున తిరిగి లోపలి హాలులోకి వెళ్ళిపోయింది. గుమ్మందగ్గరే వాళ్ళ నాన్నగారు నుంచుని

"ఏమిటి తల్లీ! బావమీద కోపం వచ్చిందా?" అని గభుక్కున ఎత్తి గుండె కదుముకొన్నారు. నా హృదయం ద్రవించిపోయింది. నా కంఠము బరువెక్కినది. పైకిరాని నా కంటినీరు నా కళ్లను మండించినవి. తండ్రి మెడ కౌగిలించుకొని శకుంతల వెక్కి వెక్కి ఏడుస్తూ, ఆయన భుజములో మోమును దాచుకొన్నది.

వినాయకరావుగారు "ఇదేమిటోయ్, ఎప్పుడూ లేనిది, ఇద్దరూ దెబ్బలాడుకొన్నారు! ఏమిటీ తగాదా?" అని ప్రశ్న వేశారు.

శకుంతల గభాలున తండ్రి మెడ చుట్టిన చేతులు వదిలి, క్రిందకు జారి, నాదగ్గరకు పరుగెత్తికొనివచ్చి, "బావా నామీద కోపము పోలేదూ?" అని అడిగినది. "నాకు కోపము లేదు; వేళాకోళంగా అన్నాను" అని, నవ్వాను. "నే నివ్వాళ మీ యింట్లో నే భోజనం చేస్తాను. రా, మాయింటికి పరుగెత్తి వెళ్ళి, నా పెట్టెతీసి నీ బొమ్మల్ని ఇస్తాను. ఆ పెట్టంతా నీకోసం తెచ్చిందే! వెళ్ళిరామా, మామయ్యగారూ?" అని తలవాల్చి వినాయకరావు మామగారి నడిగినాను. "పరుగెత్తుకొని వెళ్లండి" అని ఆయనగా అన్నారు. చేతులు చేతులు పట్టుకొని మా హృదయాలు కలిసి మెలిసి, మా నవ్వులు పైకిపొర్లి ప్రవహించి మేము గాలిలో మా యింటికి తేలిపోతిమి.

నాకు పదమూడవయేడు జరుగునప్పుడే, వినాయకరావుగారికి రెండవ కుమారిత జన్మించినది. శకుంతల ఒక్క నిమిషం చెల్లెలిని వదలి ఉండేదికాదు. చెల్లెలికి హైమవతి అని వినాయకరావుగారు నామకరణం చేసినారు. హేమకుసుమదేవి అని ముద్దుపేరయినది. చెల్లెలిని ఒడిలో పడుకోపెట్టుకొనేది. చెల్లెలి ప్రక్కలో పడుకొనేది. చెల్లెలి మాటలే సర్వదా నాతో చెప్పేది. ఒకనాడు నావద్దకు పరుగెత్తుకొనివచ్చి "బావా, ఎన్నాళ్ళకు నాకో చెల్లాయ్ పుట్టిందోయ్! నన్ను అక్క అని పిలుస్తుంది. నేనంటే ఆనమాలు కడుతూవుంది. ఎంత తెలివైందనుకొన్నావ్! ఆకలేస్తేకాని ఏడవదు" అని గబగబా చెప్పింది.

నాకు వాళ్ల చెల్లాయి అంటే అసూయపుట్టింది. నామీదుండే ప్రేమంతా వాళ్ల చెల్లాయిమీదే శకుంతల చూపిస్తుందని బాధపడ్డాను. ఏదైనా వంకతో ఆమెను ఆటలకు తీసుకునిపొయ్యేవాణ్ణి. చెల్లాయి కబుర్లు చెపుతుంటే యితర విషయాల్లోకి ఆమె మనస్సును తిప్పుతుండేవాణ్ణి.

నేను గుంటూరులో స్కూలుఫైనలుక్లాసులో చేరడానికి వెళ్ళేసరికి హేమకుసుమానికి రెండోయేడు వచ్చింది. "మా చెల్లాయి నొక మాటెత్తుకొని మరీ వెళ్ళుబావా" అని నన్ను బరబర ఉయ్యాలదగ్గరికి శకుంతల లాక్కొనిపోయినది. రెండు చిటికెలువేసి 'హేం! హేం' అని పలకరించి శకుంతలను మా యింటికి లాక్కొనిపోయినాను. ఆరోజున మేమిద్దరము ఒక నిమిషమైనా విడిచి ఉండదలుచుకోలేదు. శకుంతల పాఠాల కాదినము శెలవే పుచ్చుకొన్నది.

నాతోబాటు నా పెట్టెలన్నీ సర్దినది. 'అత్తయ్యా! నేనూ మడికట్టుకు వచ్చి నీకు ఆవకాయలవీ సర్దిపెట్టనా' అని అడిగింది. మా అమ్మ "అక్కర లేదు నా బంగారు తల్లీ. నేనే సర్దుకొంటానమ్మా, నీవు బావకు సహాయంచేయి. చెల్లాయ్ ఆడుకొంటూఉందా? మేము దసరాకు వచ్చేసరికి చెల్లాయ్ నడవడం ప్రారంభిస్తుందిలే. వారానికో ఉత్తరం రాస్తుండేం" అని మా అమ్మ అన్నది.

"తప్పకుండా రాస్తానత్తయ్యా, బావచేత నాకో ఉత్తరం రాయిస్తుం డండి. నేను నిరుడు రాసిన నాలుగింటికీ ఒక ఉత్తరానికే జవాబిచ్చాడు. యివ్వేళ వస్తుంది, రేపు వస్తుందని ఎదురుచూచి ఉత్తరం రాకపోతే నాకు ఏడ్పుకూడా వచ్చేది."

"ఈపట్టు బావ ఉత్తరం రాయకపోతే బావతో మాట్లాడకు."

"నేను మాట్లాడుతానా! గుంటూరు వెడతాడు. స్నేహితులతోనూ టెన్నిస్ ఆటలతోను మునిగిపోయి నన్ను మరచిపోతాడు."

"అమ్మా, శకుంతల మాటల్ని నిజమని నమ్మతావేమో? ఏమిటీ రానే దని, నేను నిరుడు రాయలేదు. ఈయేడు తప్పకుండా రాస్తాను."

## 4

హేమా, నీ వానాడంత పాపవు. ఈనాడింత బాలికవు. ఆనాడు ఈనాటి అద్భుతమూర్తిగా ప్రత్యక్షమౌతావని నేనూహించుకొనైనా ఊహించు కోలేదు. ఇంగ్లీషు బాలికలవలె ఇట్టి స్వేచ్ఛామూర్తివైన విచిత్రవ్యక్తివి కాగల వని నీవు ఉయ్యాలలో కాళ్ళూచేతులు ఎగరవేస్తూ కేరింతలాడేటప్పుడు, కల నైనా కనలేదు.

ఆ ఉదయాన్ని జరిగిన సంఘటనవలన నిశాపతి క్రుంగి కూలిపోయి "శర్వరీ భూషణరావుగారూ, అందరికన్నా నన్నే ఆమె ఎక్కువగా ప్రేమిస్తుందని, అనుకొన్నాను. అపవిత్రమైన నా జీవితాన్ని పవిత్రపథాలకు మళ్ళించినాను. వివాహము వాంఛించినాను. కల్మషరహితురాలై పవిత్రురాలైన ఆ బాలిక తన మోము అటు త్రిప్పినది. నేను బ్రతికిఉండీ బ్రతుకనివాడనే..." అని కంట నీరు పెట్టినాడు. నే నతనికడకు రెండంగలలో వెళ్ళి "నిశాపతిరావుగారూ, నేను మీకో అద్భుతరహస్యాన్ని చెబుతున్నాను. హేమకుసుమదేవి అసలు పేరు హైమవతి. ఈ బాలిక నా మరదలు. చాలాకాలం ఉత్తరాదిని సంచ రించివచ్చిన నన్నానవాలు పట్టలేదు. ఈ బాలిక చిన్నతనంలోనే, నేనూ మా అమ్మగారు ఉత్తరాదికి వెళ్ళిపోయినాము. ఆమెను వివాహము చేసుకొనుటకు మీరు మిక్కిలి అర్హులని నా నిశ్చితాభిప్రాయం. అయినా యీ బాలికలో కల్మషం లేదు. అబద్ధము చెప్పలేదు. ఆమె అభిప్రాయము మార్చరానిది. నీ ఆవేదనల్ని ఉత్తమక్షేత్రసందర్శనంలో నెమ్మదినెమ్మదిగా మాయంచేసుకో వచ్చు. అదీకాక పరమరహస్యము మనుష్యుడు గ్రహించలేడు! తన్ను ప్రేమిం

చినవారున్నారని ఆతనికి తెలియదు. మీ హృదయం మీ ఆత్మ అర్థంచేసుకొన్న ఒక ఉత్తమవ్యక్తి ఉన్నది సుమండీ! ఆమె ఎవరో మీకే ముందు వ్యక్తం అవుతుంది. దాపురించిన కల్మషాన్ని దహించుకోవాలంటే మనచుట్టూ దావానలాన్ని చెలరేగచేసుకోవాలి'' అని అస్పష్టమైన మాటలతో ఆయనకుకూడ వినబడనంత మెల్లగా చెప్పినాను. నిశాపతి మరునాడు మైసూరులోని నంది పర్వతానికి ప్రయాణమైపోయినాడు.

అడురానంతవరకు మనుష్యుడు మహాప్రతాపవంతుడు. ఇనపజోళ్లు తొడుక్కొని నడిచే మనుష్యుడు నేలక్రింద నలిగిపోయే కోమల స్వరూపాల్ని చూస్తూ వికటానందంలో ఊగిపోతాడు. ఆ ఇనపజోళ్లనుకూడ ఛేదించే కఠినత్వం అడ్డు తగిలినప్పుడు, కంటినీటితో తనకు తానే జాలిపడుకుంటూ కూలిపోతాడు.

నేను స్కూలుఫైనలు పరీక్షనిచ్చి, మా అమ్మగారితో కొల్లిపరవచ్చిన కొద్దిరోజులకు మా మేనమామతో, మా అన్నదమ్ములవారితో వినాయకరావు గారు మాయింటికివచ్చి, తన పెద్దకుమార్తె శకుంతలను నాకు వివాహము చేయుటకు సంకల్పించినామనిన్నీ, అందులకు పెద్దలందరూ అంగీకరించవలెననీ కోరినారు. 'శుభమస్తు! తథాస్తు' అని పెద్దలందరూ ఆశీర్వదించినారు. మంచి ముహూర్తాన తాంబూలాలు పుచ్చుకొన్నారు.

'నేనూ, శకుంతలా భార్యాభర్తలముగా చిన్నతనాన్నుంచి పెరిగినాము. ఆ జీవితానికి ఫలంగా నాకీ వరము ప్రసాదింపబడింది. తాంబూలాలు పుచ్చుకొన్న మరునాటినుంచీ, పది ఏళ్ళ ఈడునే శకుంతల నా కళ్లకు కనబడదు. తుర్రున బంగారు పిచ్చుకలా పారిపోయేది. అందమైన ఆమె నవ్వుల మోము దూరంగా కనబడి మాయమయ్యేది. నాకూ ఒక విధమైన సిగ్గువచ్చినది. పదిమందిలోనూ ఆమెతో నేను మాట్లాడుట తప్పేమో అనుకొన్నాను. తాంబూలాలు పుచ్చుకొన్నప్పటినుంచీ నన్నొక క్రొత్త వ్యక్తిత్వ మావహించినది.

మునుపటివిధంగా కాబోవు అత్తగారింటికి తరుచుగా వెళ్లడము మానినాను. మాయింట్లోనూ పెళ్లిపనులు ప్రారంభించినారు. వివాహము వైశాఖ శుద్ధ దశమినాడు. ఒకనాడు మా పురోహితుని భార్య మా అమ్మగారిదగ్గరకు వచ్చి ఏవో మాట్లాడుతున్నది. ఆ ప్రక్కగదిలో కలలు కంటున్న నాకీ మాటలు వినిపించాయి. 'వాళ్లిద్దరిస్నేహము అలాంటిదండి. నేను కాపరానికి వచ్చి యిప్పటికి నలభై ఏళ్లయినది. అప్పటినుంచీ వీళ్లిద్దరిస్నేహం మెరుగుదును. కృష్ణార్జునుల్లా ఉండేవారు. వినాయకరావుగారికీ, మీ వారికీ సంతానము కలిగినప్పటినుంచీ వియ్యం అందడమనే గాఢమైన కోర్కె మీ రెరుగనే ఎరుగుదురు. ఆ కోర్కె యిప్పటికి ఫలించినందుకు శేషాచలపతిరావుగారు కళ్లారా చూచి ఎంతో ఆనందించి ఉందురు. కళ్లెంట నీళ్లుపెట్టకండమ్మా,

శుభసమయంలో మంచిదికాదమ్మా. ఎప్పటి దుఃఖా లప్పటికి భగవంతుని చేతిలో విడిచి సంసారము మోస్తూనే ఉండాలి.' ఆ మాటలు వింటూనే నేను లేచి మా తండ్రిగారి ఫొటోదగ్గరికి వెళ్లి ఆయన కళ్లలోనికి దీర్ఘంగా పారకించి చూచినాను. నాకు కళ్లనీరు తిరిగింది. ఏదో భక్తి, ఏదో సంతోషమూ నన్నావహిస్తున్నవి.

శుభముహూర్తంలో కన్యాదానఫలం చూరగొంటూ, వినాయకరావుగా రఖండవైభవంగా తమ ప్రథమకుమార్తె వివాహముచేసి ధన్యుణ్ణయ్యాననుకొన్నారు.

ఠీవిగా నలంకరించుకొని మే మిద్దరము ముత్యాల పల్లకిలో ఊరేగినాము. మా అక్కగా రిద్దరూ ఆడబిడ్డ లాంఛనాలకై చెరియొక వేయి రూపాయిల మాటలు అతిగర్వముగా అందుకొన్నారు. ఆ ఐదురోజులు మా అమ్మగారు బయట కానరాలేదు. ఆమె లోలోన ఏమి కుళ్ళికుళ్ళి దుఃఖించినదో, పైకి మాత్రం అతి శాంతగాంభీర్యాలతో వచ్చిన చుట్టాలను వేయికళ్లతో కనిపెట్టి చూచినది. శకుంతల నా ఎడమ చిటికెనవ్రేలు పట్టుకొని నాతో, అగ్నిహోత్రముచుట్టూ ఏడడుగులూ వేసినది. వసిష్ఠులు మాచేత ఏ మంత్రాల్ని పఠింపచేశారో కాని ఆ పవిత్ర మంత్రాలకుకూడ అతీతమైన మహామంత్రప్రభావమే నన్నప్పు డొక ఋషితుల్యుని చేసినది.

నా చిన్ననాటి యీ అందాలబాల నాతో ఈ జీవితమార్గాన్ని ఏడు కాదు ఏడుకోట్లడుగులున్నూ నడవవలసిందే! ఆమె అడుగు లతిసుకుమారములైనవి. పవిత్రరేఖా చిహ్నితములు. ఆ అడుగులపైన ఎర్రటి పారాణి నా హృదయంలో రాగాలు దిద్దినది. అప్పట్లు నా శకుంతల దేవివలె ప్రకాశించినది.

'నేనూ, శ్రీనాథమూర్తి బావా వచ్చినాము, తలుపుతీయండి' అని ఆమె అన్న పలుకులు, న న్నంతవరకూ ఆవరించుకొని ఉన్న బాల్యత్వాన్ని క్రిందకు లాగిపారవేసినవి. నే నప్పుడు పురుషుణ్ణయి, 'నేనూ, శకుంతలా వచ్చినాము, తలుపు తీయం'డని నెమ్మదిగాను అతి గంభీరంగాను సుమంగళీసమూహము ఎదుట పలికితిని.

## 5

హేమకుసుమదేవి చేతిలోని బొమ్మలము మేమంతా... ఈనాడు. నిశాపతి నందిపర్వతము వెళ్లుటగాని, అక్కణ్ణుంచి తిరువాన్కూరు రాష్ట్రము వెళ్లడము కాని కల్పమూర్తికి, తీరమిత్రునికి నిజం గోచరించలేదు. సంగీత కచేరీలకో, సరదాకో వెళ్ళినాడని వాళ్ళిద్దరూ అనుకొన్నారు. నిశాపతి వెళ్లిన నెలరోజులకు హేమకుసుమ నన్నుచూచి, "ఏమయ్యా త్యాగతీ, నువ్వు నాకు అడయారులో కనపడినప్పటినుంచి నిన్నెక్కడో చూచినట్లే జ్ఞాపకం. మా నాన్నగారు, 'ఈయన మనకు బంధువుడు, నాకు చాలా స్నేహితుడు. ఇత

నంటే నాకు కుమారుడికన్న ఎక్కువ ప్రేమ. నీ చిన్ననాడే దేశాంతరాలకు వెళ్ళిపోయినాడు. ఇన్నాళ్లకు తిరిగివచ్చాడు' అని అన్నాడే! నువ్వు దేశాంతరాలకు వెళ్లకమునుపు మాయింటికి తరుచుగా వచ్చేవాడివా'' అని ప్రశ్నించింది.

నేను : ఔను. కాని నీకు జ్ఞాపకము ఉండనంత చిన్నతనము.

ఆమె : నే నతిచిన్నబిడ్డనై ఉన్నపుడుకూడా న న్నెరుగుదు వన్నమాట!

నేను : సందేహము లేకుండా! నిన్ను ఎత్తుకున్నాను. నీకు నీళ్లుపోశాను, నీకు బట్టలు కట్టాను. నిన్ను......

ఈ మాటల్ని నే ననడముతోనే, ఆమె అతిసిగ్గుపడిపోయి తల వాల్చుకొన్నది. ఆమె సిగ్గును గమనించనట్లు నటించి "కాని, అవన్నీ ఏనాటి మాటలో! నే నిప్పుడు ముసలివాణ్ణి. నీవు తగిన వరునితో నీ సంసారయాత్ర అతిసుఖంగా సాగించడం చూచి, సంతోషించాలని కనిపెట్టుకొని ఉన్నాను'' అన్నాను.

"నీవు ముసలివాడి వేమిటయ్యా? నీకున్న శక్తి కల్పమూర్తికికూడా ఉందో లేదో. శిల్పశాస్త్రప్రకారంగా నీ ముఖము మహా అందమైనదని చెప్పలేము. కాని ఏదో నిర్వచింపలేని రేఖాసంయోగంచేత, ఏదో భావాతీతమైన సౌష్ఠవకల్పనచేత నీ మోము మహాసౌందర్యపూరితమే అయినది. నీ ప్రఫుల్లముఖం ముందర నేను అందమైన వనుకొన్నవారి అందరి ముఖాలు తెల తెలపోతుంటవి. నీ వెప్పుడూ మూలిగి ఎరగవని నా దృఢాభిప్రాయము. నీ మనసులో కలత కాని, నీ హృదయంలో బాధకాని, నీ భావంలో వక్రతకాని ఉంటుందని నే నూహించుకోలేను. కాని ఇంకా నీవు నాకు క్రొత్తే! నీలోని అద్భుతమైన అతి సుందరములైన, అతి దివ్యములైన పథములు కొన్ని తెరమరుగునే ఉన్నవని నేను నిశ్చయించుకొన్నాను.

నేను : వెర్రిఅమ్మాయీ, నేనూ అందరిలోటివాణ్ణే! ఈ లోకంలోని పరమ రహస్యాలన్నిటిలోనూ సంచరించాను. పరమపవిత్ర ప్రదేశాలలోనూ సంచరించాను. ఆ అనుభవముతప్ప నాలో ఇంకేమీ లేదుసుమా.

నా మాటలకు ఆమె ఆలోచనలో నిమగ్నమయినది. నేనూ ఆలోచనా లీనుడ నయ్యాను. ఈ ఆలోచన లటుంచి మళ్ళా కథ ప్రారంభిస్తాను.

నేను స్కూలుఫైనలు పరీక్షలో దెబ్బదికి తక్కువకాని మార్కులలో కృతార్థుడనైనాను. "అమ్మాయి కాలుపెట్టినవేళ మంచిది, అబ్బాయి ప్యాసయినాడు'' అన్నారు. మా మామగారు నేను చెన్నపట్టణములో చదవడము మంచిదని నిశ్చయముచేసినారు. మా మామగారూ, మా అమ్మా, నేనూ ముగ్గురము కలిసి చెన్నపట్టణము వెళ్ళినాము.

చెన్నపట్టణము బయలుదేరేపూర్వము శకుంతలను చూచి, మాట్లాడివెళ్ళా అని నాకు కోరికకలిగినది. ఇదివరకు ఒక్క నిముసముకూడ వదలి ఉండేవాళ్లము కాదుకదా! మా వివాహమే మాకు అడ్డమురావాలా? ఏమిటీ సిగ్గు?

భార్యాభర్తల కీ సిగ్గు ఎందుకో? వారిద్దరికీ రాబోయే స్త్రీపురుష సంబంధము వలన జనించిఉంటుంది. కాని రానురాను నవవధువున కదీ అలంకారమైన ఆనందము సమకూరుస్తుంది. ఈ వ్రీడ నవవధూవరుల నడుమ తెర కావడమే కాక, వధూవరుల ఇరువురిచుట్టూ తెర అవుతుంది.

బాలవే నీ వెపుడు
గోలవే చెలవే!
పరమ సౌందర్యాలు
పడతి నీ కన్నులే
కన్నుల్లో దాగనే
కమ్మన్ని సిగ్గొకటి.
బాలవే...

ఉదయసంధ్యల ఎరుపు
పెదవుల్ల తేనెలే
తేనెలో ఒదిగింది
తీయతీయని సిగ్గు.
బాలవే...

తంత్రుల్లు మీటుతూ
తలవాల్చి పాడుతూ
ననుముంచు నీ పాట
నవ్వువెన్నెల సిగ్గు.
బాలవే...

నీలి కనురెప్పలో మేలమాడే సిగ్గు
అందాల నీ పెదవి అలమిపోయిన సిగ్గు
దివ్య గాంధర్వాన నవ్యమయ్యే సిగ్గు
సిగ్గులను మాలగా చేరువే నా గళము?
బాలవే...

మా అత్తగారే మే మిద్దరము కలుసుకోవడానికి కారణభూతురాలైంది. శకుంతల గదిలో ఉందని మా అత్తగారు నన్ను బలవంతాన గదిలోనికి త్రోసింది. ఆమె తలదువ్వుకొని బొట్టు పెట్టుకొంటున్నది. నేను వెనకాలే వెళ్ళి శకుంతల కళ్లు మూశాను. ఆమె మూర్తినంతా మెరుములా సిగ్గు ప్రసరించి మాయమైనట్టు ఎదుటి నిలువుటద్దములో స్పష్టమై కనబడినది. ఆమె పెదవులలో చిరునవ్వు మధురలాస్యము లాడినవి. అతి స్పష్టమైన పెదవి కదలికతో 'బావ' అన్నది. ఆ పెదవు లతికోమలములు. ఆ పెదవుల వక్రతువులు, ఎరుపు రంగులు, ఆ పెదవులలోని ఆర్ద్రత, ఆ పెదవులలోని నునుపుగీతలు చూస్తూ ఆ బాలికతలను నా భుజంమీదికి వంచుకొని వణికిపోతూ, సిగ్గుపడుతూ, ఉప్పొం

గుతూ కరిగిపోతూ, ఆ నునులేత వెలుగుల జిలుగు పెదవులను ఒక్కసారి ముద్దు పెట్టుకొన్నాను. కళ్లనుంచి చేతులనూ తీసినాను.

ఆమె మోము ఎంత ప్రఫుల్లమైపోయినది! ఆమె తలవాల్చుకొని 'చెన్న పట్టణమునుంచి ఉత్తరం...'

నేను : నువ్వూ ఎప్పుడూ ఉత్తరాలు రాస్తుంటావా?

ఆమె : నేనూ, అమ్మా ఎప్పుడో చెన్నపట్నం వస్తాము.

నేను : స్టేషనుకువచ్చి నిన్ను కారుమీద ఇంటికి తీసుకపోతాను.

దీర్ఘాలై, నల్లనైన కనువెంట్రుకలతోడి రెప్పల నొకసారి పైకెత్తి క్రిందకు చూచినది.

నేను : ఇలారా. సోఫామీద కూర్చుండి మాట్లాడుకొందాము.

ఆ సోఫామీద కూర్చున్నాము. మా మానమే అనేక విషయాలను మాట్లాడినది, మా మానమే పాటలు పాడినది, మా మానమే మేమింతలో విడిపోవు దుఃఖాన్ని అశ్రువులుగా రాల్చినది. ఆమె చేతులు రెండూ నా చేతులలో ఉన్నవి.

## 6

నా చేతులు అందమైనవి. నా వ్రేళ్లు అంత అందమైనవికావు. అవి పొడుగాటివి, బలమైనవి, సూక్ష్మస్పర్శకలవి. నా చేతులు చూచిన ఇద్దరు ముగ్గురు పెద్దలన్నారూ, 'ఈ అబ్బాయివి డాక్టరు చేతులు' అని. బాహ్యరూపంలో కూడా ఎట్టి సూక్ష్మమైన తేడాలనైనా, ఎట్టి అవ్యక్త స్పందనాన్నైనా స్పృశించినంతమాత్రాన తెలుసుకోగలిగిన వేళ్లు! వేళ్లతో చేయగలిగిన పని ఏలాంటి దృఢమైనదైనా, ఏలాంటి సున్నితమైనదైనా నాకు పందు వొలిచినట్లే.

ఇంటర్ పూర్తిచేసి డాక్టరు చదువుకు వెళ్లుదామని సంకల్పము నాకు. మదరాసులో ఒకనాడు నేనూ నా స్నేహితులు కొందరూ కలిసి సిద్దప్ప శిల్పాశ్రమానికి వెళ్ళినాము. సిద్దప్పగారు కొడగుదేశపు ఉత్తమ కులీనుడు. ఆయన పాశ్చాత్యదేశాలకు పోయి పాశ్చాత్య శిల్పవిద్య సర్వతోముఖంగా నేర్చుకొని వచ్చినాడు. ఇటలీలో, పారిస్‌లో అతనికి బహుమతులు, యోగ్యతాపత్రాలు అనేకము సమర్పింపబడినవి. ఆతని శిల్పకళావైదగ్ధ్యాన్ని పొగడుతూ పాశ్చాత్య దేశాలలోని వివిధ పత్రికలు ప్రశంసించాయి.

స్వదేశానికి వచ్చినవెనక హిందూదేశమంతా సంచారంచేసి మదరాసు నగరంలో శిల్పాశ్రమం ఒకటి స్థాపించినాడు. మహారాజులు, కోటీశ్వరులు, ప్రసిద్ధులు, రాజకీయవేత్తలు అనేకులు తమతమ మూర్తుల్ని పాలరాతిలోనో, లోహంలోనో, రాతిలోనో రూపం పొందించుకొన్నారు. పాశ్చాత్య శిల్పవిధానంలో భరతదేశంలో అతన్ని మించినవారు లేరు. అతని యశము తీగ

లల్లుకుపోయినది. ఆతని విగ్రహాలలో పాశ్చాత్యుల కందరాని ఏదో స్పర్శ భారతీయమైనది, ఆశయస్వరూపమైనది ఉన్నదని రసజ్ఞులు భావించి, ఆయన విధానాన్ని సంభావిస్తారు. ఆయన నిర్మించిన శిల్పాశ్రమము గౌరవము సముపార్జించి, అనేక విద్యార్థులను వివిధప్రాంతాలనుండీ ఆకర్షిస్తూ ఉంటుంది.

ఆరోజున మేమంతా ఆయన ఆశ్రమాన్ని దర్శించినాము. సిద్దప్పగారు రచించినవీ, విద్యార్థులు రచించినవీ ఎన్నో విగ్రహాలను ఆనందంతో సందర్శించి నాము. ఆ శిల్ప దేవాలయంలో నా హృదయము చైతన్యం తప్పింది. ఏదో నిర్వచింపరాని ఆనందము నన్ను ముంచివేసింది. నాలోన నేను పొంగి, నాలోన నేను తాండవించి, నాలోన నేను భువనాలకు ప్రాకిపోయినాను.

మట్టితో, మైనంతో పాఠాలు నేర్చుకొంటున్న విద్యార్థుల పరిశ్రమచూచి నా ప్రేళ్ళలో ఏదోవణుకు, ఏదో విద్యుల్లత ఉద్భవించింది. నాలోన వివిధ మూర్తులు అస్పష్టమై నాతిదూరాన గోచరించాయి.

ఒక విద్యార్థి దగ్గరనుండి మైనంలా తయారుచేసిన మట్టిముద్ద ఇంత తీసి కొని ఎదురుగా ఉన్న ఒక విగ్రహ శిరస్సును అనుకరిస్తూ, పది నిమిషాలలో తల నొకదాన్ని రచించినాను. ఇంతలో శిల్పగురువు మా కడకువచ్చి ఒక నిమేషము నా రచనను పరిశీలించి చూచినారు.

"మీ చేతిలో అపారమైన శిల్పశక్తి గర్భీకృతమై ఉన్నది. ఇదివరకు మీరీ విద్యను అభ్యసించి ఉన్నారా?"

"లేదండి"

ఆయన నన్ను కళ్ళలో కళ్ళుగా ఒక క్షణము చూచినాడు. నాకేదో ఆనందము! ఏవో కాంతులు నన్ను చొచ్చినవి.

"మీరు మద్రాసులో ఏం చేస్తున్నారు?"

"నేను ఇంటరు చదువుతున్నాను ప్రెసిడెన్సీ కాలేజీలో."

"నా అదృష్టము! కళాశాల చదువులో మీకు తీరుబడి ఉన్నప్పుడల్లా ఈ ఆశ్రమానికి వస్తే ఈ ఉత్తమ విద్యను మీకు చెలియలుగా అర్పించగలను."

"ఎంతో కృతజ్ఞుణి."

ఆనాటినుంచీ ఒక మహాయోగంలో దీక్షాపరుడనయ్యాను. సిద్దప్ప గురు వర్యులు నాలోని పాతాళగంగను పైకి ఉప్పొంగించి, ప్రవహింపచేశారు. మను ష్యుని బాహ్యమూర్తి, లోనిమూర్తి కంఠాది అవయవాల కండరాలు, నరాలు, రక్తనాళాలు, అంతరింద్రియాలు, ఎముకలగూడు, వాని స్వరూపాలు అన్నీ నా గురువులు నాకు ఉద్బోధించినారు. జంతువులు, పక్షులు, వృక్షాలు వాటి మూర్తులు అంగాంగ సౌందర్యమూ వారు పరిశీలించి, ఉపన్యసించారు. సిద్దప్ప గారి ప్రతిభాపూర్ణ దేశికత్వంలో దినదినాభివృద్ధినంది నాప్రేళ్ళు పరమేష్ఠి సంకల్ప రూపాలే అయినవి. విశ్వకర్మదేవుని దివ్యహాసము నాలోన వెన్నెలలు

నిండించింది. సూక్ష్మవిన్యాసాలు తీర్చుటలో, సూలాంగిక భంగిమములు దిద్దుటలో, భావాలు సర్వమూర్తిలో ప్రతిష్ఠచేయుటలో ప్రవీణుడ నయినాను.

దసరా సెలవలకు మా ఊరు వెళ్లువరకు మైనముతోనూ మట్టితోనే అభ్యాసము చేసినాను. నేను విరచించే మట్టిబొమ్మలకన్న నా ఆత్మేశ్వరీ దివ్య విగ్రహము ఎదురాడలేని సందేశము నాకు పంపించినది.

దసరాకు తప్పక రమ్మని ఆ బాలిక నాకు ఉత్తరాలు వ్రాసినది. ఉత్తరాలలో ఇదివరకు బావా అని సంబోధించేది. వివాహం అయినవెనుక ఏ సంబోధనమూ లేకుండగా చిత్రంగా వ్రాయడం సాగించింది. 'బావా' అని ఎందుకు వ్రాయకూడదని నా ఉత్తరం పృచ్ఛచేసింది. అందుకు జవాబు రాలేదు. కాని తాను క్రొత్తగా అవలంబించిన విధానంతోనే ఉత్తరాలు వస్తున్నాయి. ఏమిటీ ఉత్తరాలు! ఆ ఉత్తరాలంటే అంత ఆనందమెందుకో? ఆ పదకొండేళ్ళ బాలికకూ ఉత్తరాలు వ్రాయడం ఎంత చిత్రంగా అలవడింది!

కొల్లిపర, 18-9-1925

శ్రావణమంగళవారం నోములు బాగా జరిగాయి. వరలక్ష్మీపూజకు అత్తగారు రావడం మా అందరకు ఎంతో సంతోషమైంది. మీరే కొన్నారుట చీర! మనదేశంలో అలాంటి చీరలు షాపనుకాలేదు. కాని ఎంత అందంగా ఉంది. అంత ఖరీదు ఎందుకు పెట్టారు? చబుల్ దాసులో కొన్న ఆ కొత్త పాపను గొలుసు మెళ్ళోవేసుకొని అత్తయ్యగార్కి దణ్ణముపెట్టితే ఆమె కళ్ళ నీళ్ళు నా తలపై వెచ్చగా పడ్డాయి. దసరాకు తప్పక రావాలి. వదినగారిద్దరూ వస్తారు.

చిత్తగించవలెను
శకుంతల

## 7

ఉత్తరాలు మనస్సులో ఎందుకు ఆనంద తరంగాలు విరిగిపడజేస్తాయో? కొందరు స్నేహితులకన్న వారి ఉత్తరాలు ఎక్కువ ఆనందం సమకూరుస్తవి. కొందరు స్నేహితులూ ఉత్తరాలూ సాయంత్రం బంగారు కాంతిలా, వెన్నెల తుంపుర్లలా, నిలువెల్లా పూలు వికసించిన పొగడచెట్టులా ఆ ఆనందం ప్రాభృతం ఇస్తారు.

శకుంతల ఉత్తరాలను ఏమని వర్ణించుకోను? పరీక్ష ప్యాసు అయ్యావు అని చెప్పే వార్తాపత్రికను కూడా ఉత్తరాలతో పోల్చడానికి వీలులేదు. హిమాలయపర్వతోత్తుంగసానుప్రపతద్ఘంగా నిర్ఝరీసందర్శనానందమును ఆనందానికి పోల్చవచ్చునని ఊహించుకుంటాను.

దసరాకు కొల్లిపర వెళ్ళినప్పుడు, మా ఊరు నాకు వేరై కన్పించింది. కొల్లిపరలో ఎన్నో కొత్త అందాలు చూచాను. ఇప్పుడనుకుంటాను శకుంతలను

ఆ రోజుల్లో అలా ఆరాధించేవాణ్ణే, దానిలో ఉండే నిజతత్వం ఏమిటి అని! ఆ పూజ స్త్రీ పురుష సంబంధమయినదా? నాలో ఉదయిస్తూఉన్న పురుషత్వము, ఆమెలో ఉదయిస్తూఉన్న స్త్రీత్వాన్ని ఆశించిందా? అలాగు స్త్రీని ఆశించడమే అయితే, స్త్రీత్వోదయం నవనవలు సాగుతూ మిసమిసలాడే నా సహాధ్యాయినులు ఎంతమందో ఉన్నారే! అందమయినవారున్నారే! ప్రౌఢతనాన్ని పరిమళింపచేసే చమత్కారిణులున్నారే! వారంతా స్త్రీలుగా వాంఛనీయులుగా నాకు ప్రత్యక్షం కాలేదే!

కాని అసలు ప్రేమమాత్రం స్త్రీపురుష సంబంధమనే విచిత్రస్థితిలోంచే ఉద్భవించిందని కొందరు విచిత్రవాత్స్యాయనుల వాదన. శకుంతల స్వరూపమే నన్ను దివ్యుణ్ణిచేసినది. అది స్త్రీపురుష ప్రేమైతేనేమి, ఇంకో విచిత్రతత్వమైతేనేమి? నాకు సర్వమూ ఆ పదునొకండేళ్ల బాలికే!

మా అత్తగారూ శకుంతలా కలిసి దసరా బొమ్మలు ఒక గదిలో అలంకరించారు. శకుంతలకు నేనూ ఒక పెట్టెడు బొమ్మలు పట్టుకొని వచ్చాను. విక్టోరియా మందిరములో అమ్మే కొండపల్లి బొమ్మలు, ఇత్తడి బొమ్మలు, వెండి బొమ్మలు, మైసూరు గంధంబొమ్మలు, తిరువాన్కూరు దంతంబొమ్మలు రకరకాలవి ఆ పెట్టెనిండా నిండిఉన్నవి. నూరురూపాయలైతే నేమి? కళలు ఊటలూరే బొమ్మలు అవి.

నాకు జపాను బొమ్మలంటే అసహ్యం. కీ ఇస్తే పరుగెత్తేవి, తల ఆడించేవి, గంతులు వేసేవి, పల్టీలు కొట్టేవి, కప్పలు, పక్షులు, సర్కస్ మనుష్యులు, గుఱ్ఱాలమీదవాళ్లు, మోటారుబళ్లు, సైకిళ్లు, అమ్మా అనేవి—తక్కువ రకం సంతోషం కలుగజేసేవి, హీనమైనవి అని నాకు మాగురువుగారైన సిద్ధప్పగారు ఉద్బోధించారు. ఆ వాదన బాగా నాబుఱ్ఱకెక్కింది. వారన్నారుగదా,

"పాశ్చాత్య దేశాలల్లోవారు ఏదోవిధంగా కళ అలుముకు ఉంటేనే గాని బొమ్మలను గౌరవించరు. డ్రెస్డెన్ చీనాబొమ్మలు, చీనాజేడ్ బొమ్మలు, ఇటలీ వెండి బంగారు బొమ్మలు, కర్రబొమ్మలు అన్నీ కళాకాంతులు వెదజల్లేవి. పెద్దపెద్దలు తమ మందిరాలు అలంకరించడానికి కొన్నివందల పౌనులు ఇచ్చి కొంటారు. దేశప్రదర్శనశాలల్లోకూడా అలంకరించిన వేలకొలది కాసులు ఖరీదుచేసే బొమ్మలున్నవి. ఓడల బొమ్మలు, చరిత్రలో ప్రసిద్ధికెక్కిన ఓడల నమూనాలు, బ్రిటిషు ప్రదర్శనశాలలో నూరులున్నవి" అని.

ఈ ముక్కలు నా తలకు బాగా పట్టినవి. శకుంతలగదిలో పుదుచ్చేరి బొమ్మలు, తిరుపతి చందనంబొమ్మలు, జపాను, జర్మను, ఇంగ్లీషుబొమ్మలు ఉన్నవి. ఆ పుదుచ్చేరి బొమ్మలంటే నాకు ఉద్భవించిన రోత రోహిణీకార్తె గాడ్పులా విసిరింది. శకుంతల చిరునవ్వుతో, పూజా నయనాలతో సగర్వంగా నా కా బొమ్మలు చూపించింది.

"ఏలా ఉన్నాయి?"

"సరే! సరే! నేను పెట్టెడుబొమ్మలు నీకు బహుమతి పట్టుకవచ్చాను. అవన్నీ మనం అలంకరిద్దాం."

'నేను సర్దిన ఈ బొమ్మలు బాగా లేవూ ?'

'చాల బాగున్నాయి! కాని ఈ పుదుచ్చేరి బొమ్మల రకాలు అందరి ఇళ్ళల్లో ఉంటూనే ఉన్నాయి; మనింట్లోనూ అవే పెడితే గొప్పకాదు. నేనో విచిత్రమైన బొమ్మచేసి పట్టుకొచ్చాను. అది మధ్యపెట్టి, ఈ పుదుచ్చేరి బొమ్మలు కొన్ని దాచేసి అద్భుతంగా అలంకరించాలి బొమ్మలు.'

'నే నలంకరించినవానిలా బాగా లేకపోతే ?'

'శకూ! ఇలా చూడు, నాకళ్ళల్లోకి చూడు కోపం వచ్చిందీ. ఓఅమ్మాయి గారు ఒకరికి ఓ ఉత్తరంలో 'నేను శిష్యురాలనై బొమ్మలు తయారుచేయడం నేర్చుకుంటూ' అని వ్రాశారు. శిష్యురాలు! గురువుగారికి బొమ్మ లలంక రించడం బాగా వచ్చునని అనుకోవద్దూ?'

శకుంతల పక పక నవ్వింది. 'గురువుగారికి నమస్కారం.'

'సత్వర శిల్పకళాప్రాప్తి రస్తు.' నా నవ్వు శకుంతల దివ్యహాసంలో లీనమైపోయింది.

శకుంతలా నేనూ బొమ్మ లలంకరించడంలో ఉల్లాసప్రవాహంతో తేలి పోయాము. మా అత్తగారు రాజ్యలక్ష్మమ్మగారు వచ్చి తొంగిచూసింది.

'శకూ! బావకు తలంటిపోయాలి, చెల్లాయి హారతిస్తుందట. ఈ బొమ్మలగదిలో ఉన్నారంటే ఈ పాటికి పరుగెత్తుకొని ఇక్కడికి రాక పోయిందా!'

తప్పటడుగులు వేసుకుంటూ బంగారు పనసతొనల హేమంగారు నేను చెన్నపట్నంనుంచి వచ్చానుగదా అని, 'బావ వత్తాలు బావ వత్తాలు' అని చక్కావచ్చింది. ఎత్తుకుంటే మళ్ళీ సిగ్గుపడింది.

ఆ రోజుల్లో నన్ను 'బావా' అని పిలిచిన హేమకుసుమ నేడు నన్ను ఆనవాలే పట్టలేకపోయింది. నేను బావగా హేమకుసుమను చూచినది ఆఖరు సారి ఆమెకు తొమ్మిదేళ్ళున్నప్పుడు. నా రూపురేఖావిలాసాలు పూర్తిగా మారిపోయినవి. నాలో ఒక కొత్తతనం వచ్చినది. నా ముఖంలోని గుండ్రని నున్నని రేఖలుపోయి తీక్ష్ణమైన స్పష్టరేఖలు ప్రత్యక్షమైనవి. తొమ్మిదేళ్ళకు తర్వాత అడయారులో ఆమె నన్ను మరల జూచినది. నన్ను వెనక చూచి నట్టామెకేమీ స్ఫురణలేదు. అక్కా బావల గాథ ఒక పురాణగాథలా ఆమెకు స్పృహఉండి ఉండాలి.

## 8

చెన్నపట్టణంలో మా మామగారి భవనంలో అక్కడక్కడ గోడల అలంక రించి ఉన్న శకుంతలా శ్రీనాథమూర్తుల ఛాయాచిత్రాలు అనేకం ఉన్నాయి.

అందులోని శ్రీనాథమూర్తికీ ఈనాటి త్యాగతికీ ఎంతో తేడావుంది. నన్ను నేను ఆనవాలు పట్టుకోలేక పోయినాను.

సముద్రం ఒడ్డుకు నేనూ, హేమా, కల్పమూర్తి, సీతాసుందరి అనే హేమ స్నేహితురాలు ఒకతే, నలుగురమూ హేమ కారు నడుపుతూండగా వాహ్యాళికి వెళ్ళినాము. నున్నటి మెరీనారోడ్డుమీద హేమ ఆక్సిలేటరుమీద గట్టిగా నొక్కింది. మా ముందు కార్లు నిముసంలో వెనకపడవి. రోడ్డు పక్క నిలబడ్డ కార్లు అన్నీ కలిసి ఒక మాలికైపోయాయి. అంతవేగంతో వెళ్తూన్న కారును చక్కగా వేగం తగ్గించి, మైలాపూరు వీధులవెంట తీసికొని పోయి, అడయారు నదిదాటి అడయారు క్లెల్లెటు సముద్రతీరందగ్గర ఆపింది హేమకుసుమ. వెనుకసీటులో కూచునిఉన్న నేనూ, కల్పమూర్తీ దిగి ముందు కూచునిఉన్న సీతాసుందరికిన్నీ హేమకుసుమకున్నూ తలుపులు తీసినాము.

నీలాలైన ఆ సముద్ర కెరటాలు మమ్మాహ్వానించినవి. సముద్రం హోరులో భైరవరాగాలాపన పరమాద్భుతమై నాకు వినిపించింది. మేఘాలు లేని నీలాకాశం, కొంచెం పడమటకు వాలిఉన్న సప్తమినాటి చంద్రుడు, వెన్నెల కిరణాలల్లో భైరవరాగమూర్తికి ప్రణయదేవియైన దేవక్రియా రాగిణీదేవి తన కిన్నెరీ కంఠమును సవరించుకొని శ్రుతి కల్పినది. నేనా బంగారపు ఇసుకమీద తక్కిన ముప్పురివెనకా శకుంతలా స్మృత్యారాధన శాంతిలో నిశ్చలుడనై కూర్చుంటిని.

ఆ విచిత్రబాలిక హేమ నీకు ప్రజ్ఞాపరిమిత అని ఆ బౌద్ధాచార్యులు నాకు సెలవిచ్చినారే? ఆతడు తన దివ్యశక్తితో ఈ బాలికను పారచూచినాడు. ఈ బాలికకొరకేనా నన్నా పవిత్రత్రివిష్టప ప్రదేశాలనుండి పంపించినది? ఆ కైలాస పర్వతముల దివ్యభూములనుండి ఈమెకొరకేనా నేను వచ్చినాను? చదువు కొన్నది. కళారహస్యాలరమ చేసుకొంటున్నది. అత్యంత సూక్ష్మగ్రహణ శక్తిగలది, ప్రతిభావంతురాలు ఐనా యీమెలో ఏమిటో లోటు. ఇంకనూ చిన్నబిడ్డా? ఈ బాలిక పరమాద్భుత బాహ్యసౌందర్యమూ, ఆ సౌందర్యంలో ఒదిగింపబడిన ఒక తేజస్సూ, అన్నింటికన్నా నాదివ్య దేవీమూర్తికి సరిపోవు పోలికలూ నన్నీ మెకు దాసుణ్ణి చేసినవి. నా హృదయమామె తెలిసికొనలేదు. ఆమెకు నాపైనిఉన్న భావము నాకు సువ్యక్తము. హేమకుసుమదేవీ! నీలో తుపాను చెలరేగబోతున్నది.

చంద్రుడు పశ్చిమానికి దిగుతున్నాడు. వాళ్ళు ముప్పురూ కిలకిలాడు తున్నారు. హేమ 'త్యాగతీ! రావయ్యా, అంతా బడాయే' అన్నది.

* * *

శకుంతల ఫొటోలను చూచి నా హృదయంలోని ఆమె మూర్తిని తలుచు కొని ఒక శిల్పం వెనక రచించాను. మా గురువుగారు సెబాసన్నారు. కాని అసలు శకుంతలకు ఈ బొమ్మను ఎలా పోల్చగలం? ఆ బొమ్మను ఆ దసరా

బొమ్మల మధ్య అలంకరించాను. ఆ బొమ్మచుట్టూ నేను మదరాసునుంచి తీసుక వచ్చినవీ, శకుంతల బొమ్మల్లోని మంచివీ అమరించినాను. ఉదయమే శకుంతల హేమను తీసుకవచ్చింది. తన బొమ్మను చూసుకొని ఆశ్చర్యపడిపోయింది. ఆమె చిన్నహృదయంలో ఎలాంటి భావాలు ఉదయించాయో ? ఆమె తేజస్సులో వెలుగుతూ ఒక దివ్యపూజామూర్తిలా తన చెల్లెలి చేయిపట్టుకొని నిలిచిపోయినది. పండుగైన వెనక చెన్నపట్నం వచ్చాను.

రోజూ పదిగంటలకు కళాశాల తెరుస్తారు. కార్లమీదవచ్చేవారున్నారు. ఆడపిల్లలూ మొగపిల్లలూ, విక్టోరియా హాస్టలులోనూ ట్రిప్లికేనులోనూ ఉండే వారంతా నడిచేవస్తారు. ఎక్కువభాగం సైకిళ్లమీద వస్తారు. విద్యార్థినులు కొందరు రిక్షాలమీద కూడా వస్తూంటారు. గంటకొట్టి పని ప్రారంభించే లోపుగా వరండాలో తిరుగుతూంటాము. క్లాసుల్లోకే వెళ్ళి కూచుంటూ ఉంటాము. బాలికలు మాత్రం వారి విశ్రాంతి మందిరంలో ఉంటారు.

మా విద్యార్థులు ధరించుకునే దుస్తులు మాత్రం ఎంత వివిధత్వాన్నైనా ప్రదర్శిస్తూంటాయి. ఇంగ్లీషు డిన్నరు పార్టీకి వెళ్ళే మొదటి తరగతి ఆంగ్లో సాక్సన్ దొరలాగా తయారై వస్తాడొకడు. ఛస్టుక్లాసైన సాంబారయ్యరులా తయారై వస్తాడొకడు. గాంధీ సేవాసంఘంలోకి వెళ్ళే అహింసా వాదిలాగ ఖద్దరులాల్చీ, ధోవతి, టోపీ పెట్టుకుని ఒకడు. వారం రోజులై మడతలుపోయి దుప్పటి గుడ్డలా ఒదులైన డ్రాయర్సు తొడుక్కొని రైల్వేదొరల కోట్లంటి కోట్లు ధరించి ఈ రెండింటికీ గూడా అపశ్రుతి అయ్యేటై తగిలించుకొని ఒకడు. పూర్వాచారానికి విరుద్ధంగా ఉండడాని కిష్టంలేక ఉంచుకున్న సందెడి కురులనూ హాట్లక్రింద దాచటానికి వీల్లేదు గాబట్టి, మా సంస్కృతం అయ్యరు మాష్టారుల బ్రహ్మాండమైన తలపాగావంటివి చుట్టుకవచ్చే విద్యార్థులు కొందరు.

ఆక్స్ఫర్డులోనూ, హార్వార్డులోనూ ఇంకా ఇతర ఇంగ్లీషు, అమెరికన్ కళాశాలల్లో విద్యార్థులందరికీ ఒకటే రకం డ్రస్సు ఉంటుందని విన్నాము. కాని హిందూదేశంలో ఏయిద్దరు విద్యార్థులకూ ఒకే రకమైన దుస్తులు మాత్రం ఉండవు. దుస్తుల విషయంలో మాకున్న భిన్నత్వం మరేజాతిలో ఎప్పుడూ ఎక్కడా ఉండదని ఘంటాపథంగా చెప్పవచ్చు.

కాలేజీకి వచ్చే విద్యార్థినులంతా ఎంతో అందంగా అలంకరించుకొని వస్తారు. వారు కట్టే చీరల్లో, ధరించే రవికల్లో, అలంకరించుకొనే భూషణాలలో, తలమీద మనోజ్ఞంగా తురుముకొనే పువ్వులలో ఎంతో వివిధత్వమున్నా, అద్భుతమైన సుందరత్వము తొణికిసలాడుతూ ఉంటుంది. వారి అలంకారాల్లో ఒక విధమైన అమరికా ఉంటుంది.

మాలో అన్ని భాషలవారూ ఉన్నారు. తెలుగువారు, అరవవారు, కన్నడులు, మలయాళీలు, సిరియన్ క్రిష్టియన్లు, సిరియన్ యూదులు, యూరేపియన్లు, తంజావూరి మహారాష్ట్రులు, పారశీకులు, మహమ్మదీయులు, హిందువులు, బౌద్ధులు

ఆర్యసమాజిస్టులు, వైష్ణవులు, హైందవ క్రిస్టియనులు, ఒకరనగా నేమిటి,-మా కాలేజీ ఒక ప్రపంచమే! భాషలనుబట్టి, మతాలననుసరించి, జిల్లాలను లెక్కించు కొని స్నేహాలు జట్టులు ఏర్పడుతూంటాయి. సాధారణంగా తెలుగువాళ్లు ఒకటౌతారు. అందులో జిల్లాల తేడాలు వస్తూంటాయి కూడా.

ఇంక మాకూ, ఆచార్యుల వారలకూ ఉండే సంబంధము సాలె తంతి అల్లికవంటిదే. వారెవరో మే మెరుగము. మే మెవరమో వారెరుగరు. క్లాసులోకి వెళ్ళి కూచోగానే ఆచార్యులవారు చక్కా వస్తారు. అటెండెన్సు తీసుకుంటారు. అక్కడినుంచి ఆయన ఉపన్యాసం ప్రారంభిస్తారు. అతి జాగ్రత్తైన విద్యార్థులు అది నోట్సు తీసుకుంటారు. మధ్యరకంవారు శ్రద్ధగా వింటారు. మూడోరకంవారు వింటూఉంటారు, వినకుండానూ ఉంటుంటారు. నాలుగోరకంవారు నావల్సు ఏవో చదువుకొంటూంటారు. ఐదోరకంవారు నిద్రపోతారు ఆచార్యులవారు కనిపెట్టకుండాను! ఇంతకన్న మాకూ ఆచార్యుల వారికి ఉండేసంబంధం ఏమి ఉంది?

## 9

నేను లెక్కలూ, పదార్థవిజ్ఞాన శాస్త్రమూ, రసాయనశాస్త్రమూ పాఠ్యములుగా ఏరుకున్నాను. క్రొత్తలో ప్రెసిడెన్సీ కళాశాల అంటే భయమే వేసింది. కాని, విద్యార్థుల వివిధత్వమే ఆ భయాన్ని చాలా తీసివేసింది. నేను జాగ్రతగా వేసుకున్న సూటును చూచి ఎవరేమనుకుంటున్నారో అనే ఆలోచన! నేను పట్టి కొల్లిపరమనిషినని గ్రహించారేమో నన్నేభయము! మా విద్యాశాలనుంచే వచ్చిన ఇంకో విద్యార్థి నేనూ ఒకరికొకరు సహాయమా అన్న ట్టుగా ఒక్క నిముషమైనా వదలకుండా క్లాసులో కూచోవడం, క్లాసు వదల గానే ఇంకో క్లాసుకు వెళ్లడం ఈరకంగా ఉండేవాళ్లము. అక్కడినుంచి కొంచెం కొంచెంగా బరిమీదపడ్డాను. మదరాసంటే భయంవదిలింది. ప్రెసి డెన్సీ కళాశాల పాతడిపోయింది. మూడుమాసాల పరీక్షలో కొంచెం బాగానే మార్కులు పైకాయితంమీదికి వచ్చేటట్టు చూశాను. కాని అరవ వాళ్ళతో పోటీచేయడమంటే మాత్రం వాడలే. తెలుగువాళ్ళల్లో నేను మొదటివాడనైనా, అరవవాళ్లల్లో ఇంగ్లీషులో పదిమందికి వెనకఉన్నాను. సాంబారులో ఉందేమో ఆమహత్తు! ఆవకాయ పదోప్లేసుతప్ప ఇంకే మివ్వ గలదు?

నా స్నేహితుని పేరు విశ్వనాథం. అరిపిరాలవారు. మంచివాడు. నా కతడు అర్జునుడు, నే నాతనికి కృష్ణుణ్ణి. ఇద్దరం లేకుండా చెన్నపట్నంలో తిరగనేలేదు. ఆనర్సు ఐదవతరగతికి చదువుతూన్న మా చుట్టాలలో ఒకాయన నన్ను తన అండకు జేరదీసుకున్నాడు. డబ్బుగల చుట్టం, పలుకుబడిగల స్నేహితుడూ ఎవరికైనా వాంఛనీయులేకదా! వీరిద్దరు గాకుండా నాకింకా

నలుగు రైదుగురు దగ్గరగా చేరిన స్నేహితులేర్పడ్డారు. మదరాసు చదువూ, జీవితమూ చక్కగా సాగింది.

సిద్దప్పగారి ఆశ్రమానికి ఎలాగో అలాగు తీరిక చేసుకుని వెడుతూనే ఉన్నాను. సతీరుడైన మా చుట్టమే నన్ను సిద్దప్పగారి ఆశ్రమానికి తీసుకువెళ్ళి నాడు. 'ఒరే మూర్తీ! కళలో మునిగిపోయావంటే చదువు సముద్రములో కలుస్తుంది. అవతల బొమ్మలేస్తున్నావు. ఒకపక్క టెన్నీసు దంచేస్తున్నావు. ఇంక మూడోపక్క చదువు పిండిక్లొట్టేస్తా నంటున్నావు. విరాటరాజు కుమారుడవుమాత్రం కావద్దు నాయనా!'

'నువ్వు నన్ను ఈ చదువు మహారథం ఎక్కించి బృహన్నల మాత్రం కావద్దని మనవి.'

'ఓరి పిట్టపిడుగా! వేశావూ బ్రహ్మాస్త్రం?'

నేను: టెన్నిసంటే జ్ఞాపకం వచ్చింది మామయ్యా. నేను 'బి' కోర్టులో ఒకర్ని సవాలు చేయాలనివుంది. వీలైతే 'ఎ' కోర్టులోనే ఎవరినైనా సవాల్ చెయ్యాలనివుంది. మా జిల్లాలలో హైస్కూలు టోర్నమెంట్సులో నేను ఫస్టు ప్రయిజు కొట్టింది నీకు తెలిసే ఉంటుంది. నా ఆట చూస్తున్నావు. నాకేమైనా ఛాన్సు ఉందంటావా?

అచ్యుతరావు: ఏకోర్టునేనా ఛాలెంజిచేసే వీళ్ళు నీకున్నాయి. నీ ఆట చూశాను. కాని, కొద్దిరోజుల్లో యం.యు.సి,యం.సి.సి. టోర్నమెంట్లున్నాయి. ఆ పందేలలో మంచి దిట్టమయిన ఆటగాళ్లు ఆడుతారు. అవి చూసి కొన్ని మెలుకువలు నువ్వు నేర్చుకోవలసి ఉంటుంది. 'బి' కోర్టులో కొంచెం మధ్య రకంవాణ్ని సవాల్ చెయ్యి, కాని రాక్షసుడులా మాత్రం పరిశ్రమ చెయ్యాలి.

* * * * *

నాకు టెన్నిస్ ఆటవచ్చునని తీర్థమిత్రుడికీ, కల్పమూర్తికీ, హేమకుసుమకూ ఏమి తెలుస్తుంది? మదరాసు రాజధానిలో కళాశాలలకు జరిగే పందెములలో నేనొక సంవత్సరం మొదటిపందెం నెగ్గాననిన్నీ, ఆయేడే యం. యు. సి. పందెములలోగూడా ప్రథమ వీరుణ్ణయ్యాననీ వీళ్ళకు తెలియదు.

ఒకరోజున హేమకుసుమ టెన్నిసుకు తనస్నేహితురాలైన సోఫీని పిలిచింది. ఆమె రాలేదు. నిశాపతి దేశాంతరగతు డైనప్పటినుంచీ టెన్నిస్ ఆడుటకు ఇతర స్నేహితులు చాలామంది వస్తూండేవారు. అత డున్నప్పుడూ వచ్చేవారనుకోండి. ఇప్పుడు సర్వసాధారణముగా వస్తున్నారు.

ఈరోజున ఆటకు వీరు ముగ్గురేఉన్నారు. హేమకుసుమ చాలా బతిమాలింది. నన్ను 'ఒక్కసారి బాటు చేతులో పట్టుకొని ఆడవయ్యా' అని. నేను టెన్నిస్ ఆట మానివెయ్యడానికి అనేక కారణాలున్నాయి. నా చరిత్ర వికసించినకొలదీ అవీ ద్యోతకమౌతవి. తీర్థమిత్రుని కన్నులలోని అపహాస్యపు కాంతులు చూసినా నాకు ఆడాలనే హుషారు కలుగలేదు. నేను రెండు చిరు

నవ్వులు విసరివేసి ఊరుకున్నాను. ఇంతలో హేమకుసుమ నాదగ్గరకు సుడిగాలిలా పరుగెత్తుకొని వచ్చింది. ఆమెతో సుగంధాలునూ పొర్లుకొని వచ్చినవి. నా యెదుట నుంచుని, నా రెండు చేతులూ పట్టుకున్నది. ఘోరున వానకురిసి మేఘములు విడివడిపోయిన నిర్మలయామినీవదనంలో ముత్యాలైన తారకలులా ఆమె కన్నులు నా కన్నులలోనికి ఉజ్వలిస్తూ చూచినవి. ఆ కన్నులలో ఒక అద్భుతమైన ప్రశ్న ఉన్నది. ఒక్క నిమేషం నేను సర్వప్రపంచం మరచిపోయినాను. ఆ కన్నులలో హిమాలయ శిఖరాలపై ఆకాశనీలాలు కనపడినవి. ఆ దీప్తనీలాలలో మహాదూరపథాలను దర్శించినాను. ఆ దూరపథాలలో ఏదో దివ్యగాంధర్వము విన్నాను. ఇంతలో ఆ విశ్వము నాకు దూరమైనది. నవ్వే ఆమె కన్నులే. ప్రజ్వలించే ఆమె కన్నులే! అప్పుడామె మనోహరమైన నాసిక కనబడినది. పాలసముద్రపు ఆకులాంటి ఆమె ఫాలము కనబడినది. సర్వకాలమూ కలలు కంటూ పాటలు పాడుకొంటూ నృత్యమనోహరాలౌతూ, ఉషాబాలిక హృదయపు పొంగులౌతూ ఆమె పెదవులు కనబడినవి.

ఈ విచిత్ర సంఘటనంతా ఒక నిమేషంలో జరిగింది. నాకది ఒక దివ్యానంద తత్వమైనది.

'సరే, హేమా! నీకోసం ఆడుతా. పద కోర్టులోకి. నన్ను చూచి మాత్రం నవ్వకండి. చిన్నతనంలో ఎప్పుడో ఆడాను.''

తీరమిత్రుడు — మేమంతా ఉన్నాము గాదయ్యా నీకు సహాయము చేయడానికి?

'మీ సహాయంవల్ల నాకు చిన్నతనంలో చాతనైన ఆకొద్ది ఆటా తగలడుతుందేమో, పిల్చి తద్దినం కొనుక్కోకుండా మాత్రం చూసుకోండి' అని అంటూ నేను టెన్నిస్ కోర్టులోనికి వెళ్ళాను.

ఆట ప్రారంభించాము. నేనూ కల్పమూర్తి ఓపక్షాన, తీరమిత్రుడూ హేమకుసుమా ఒకవైపున. నాలో కొంచెం భయం ఉదయించింది. నా చేతికి బ్యాటే కొత్త కొత్త అనిపించింది. కల్పమూర్తిని కుడివైపున ఉండమన్నాను. తీరమిత్రుడు ఆట ప్రారంభించాడు. కల్పమూర్తి నాకేమీ ఆటరాదన్న ఉద్దేశంతో కోర్టంతా తానే విజృంభించి విశ్వరూపం తాల్చాడు. అతన్ని తప్పించి జారి వచ్చిన బంతుల్ని నేను తీయలేకపోయాను. తీరమిత్రుని సర్వీసులు రెండుమూడు తీయలేకపోయాను. 'మాకు ఆట వస్తోందండోయ్' అని తీరమిత్రుడు కేకవేశాడు. హేమకుసుమ కళ్ళల్లో ఏదోబాధ కనిపించింది. నేను మావైపున కుడివైపు కోర్టుకు వెళ్ళినప్పుడు హేమకుసుమ నాకు వీలుగా పాయింట్లు తీసేటట్టుగా సర్వీసు చేసింది. ఆ పాయింట్లు కొత్తగా నేర్చుకొనేవాడైనా తీయగలడు. ఐనా మేమే ఓడిపోయినాము. కల్పమూర్తి సర్వీసు గేము ఒక్కటే మాకు. తక్కిన రెండు గేములూ వారివి. ఇక నేను సర్వీసు చేయవలసి వచ్చింది. వారికోర్టులో కుడివైపున నా కెదురుగా మూలగా తీరమిత్రుడు వానలులేని

వర్షాకాలపు ఆకాశంలోని అపహాస్యంలా మొగముపెట్టుకుని నిల్చున్నాడు. ఆ బ్యాటు అక్కడఉంచి కల్పమూర్తి డజను బ్యాటుల్లోంచి నిశితమైన కృపాణంలోని కాంతుల్లాంటి తీగలు కలిగిఉన్న దానిని, భీమసేనుని గదలాంటి సమున్నతమైన దానిని, మంచిపొంకాలున్న పారశీకాశ్వముయొక్క వేగంగల దాన్ని బ్యాటును తీసుకొన్నాను. కోర్టులోనికి వచ్చినాను. సాధారణంగా ఏ గొప్ప ఆటగాడూ సెట్టుకాకుండా బ్యాటు మార్చడు. నాపని మరింత అపహాస్యానికిపాలై ఉంటుంది. తీర్థమిత్రుని కండ్లలో నా కివన్నీ కనిపించనే లేదు.

సర్వీసు చేశాను. బంతి తీర్థమిత్రునికి కనబడలేదు. 'ఫాల్ట్' అనడానికి కూడా వీలులేదు. తీర్థమిత్రుడు వెల్లమొగము వేసినాడు. కోర్టుమార్చినాను. రెక్కలు చాచుకొని విచిత్రగతితోవచ్చి భూమినివాలే హంసలా నా బంతి హేమకుసుమకు వెళ్ళింది. ఆమె ఆ బంతిని నాకే తిరిగి పంపించింది. ఆమె పంపిన సంగతే ఎరుగనుగాని తిరిగి నావల్ల పంపబడి ఆతని కుడికాలి జోడు యొక్క ముందుభాగాన్ని ముక్కలుచేసిన తీవ్రసంఘాతము తీర్థమిత్రునికి తెలియదు.

ఎవ్వరీతడు! ఈ ఆట యెక్కడిది! అని ఆశ్చర్యపడుతున్నట్లు కల్పమూర్తి తాను ప్రేక్షకుడైపోయినాడు. వారలకు మళ్ళీ గేములేకుండా అరగంటలో సెట్టయిపోయినది. తమ్ములమిన ఆశ్చర్య విభ్రమాలలో మునిగిపోతూ చైతన్య రహితుల్లావచ్చి కుర్చీలమీద చతికిలబడ్డారు, కల్పమూర్తీ తీర్థమిత్రుడూ హేమ కుసుమదేవి. నేను కోర్టులోనే బ్యాటుపుచ్చుకొని సైంధవవధనాటి అర్జునుడులా తల పైకెత్తి ఆకాశం చూస్తూ త్రివిష్టపపథాన్ని ధ్యానిస్తూ నిలుచుండి పోయినాను.

* * * * *

అలాంటి టెన్నిస్ ఆట నాది. ఆ ఆటలో పేరు సంపాదిస్తూ మా రాజధాని కళాశాలకు ఎన్నో కప్పులు, వెండిడాళ్లు బహుమతులు తెచ్చాను. ఆ రోజుల్లో మా హృదయాల్లో ఏమిభావాలు ఉద్భవిస్తాయి? చదువు, పెద్దవాళ్ళని గూర్చి అపవాదులు మాట్లాడుకోవడం, స్నేహితులతో తిరగడం, సినిమాలకు వెళ్ళడం, సాయంకాలం బీచివాహ్యాళి—ఇవీ మా పనులు. పెద్దకవులూ విమర్శకులూలా కాళిదాసుని, షేక్సుపియరును చీల్చి చెండాడేవాళ్ళం.

నేను: ఒరే! షేక్సుపియరు ముందర కాళిదాసు దివిటీముందర దీపంవంటి వాడురా.

అచ్యుతరావు: నక్కపుట్టి నాలుగువారాలు కాలేదు తుపాను గిపాను దానికేం తెలుసురా. నువ్వు కాళిదాసును చదివావూ?

నేను: ఆ! వీరేశలింగంగారి తర్జుమాలు చదివాగా?

అచ్యు: ఏడిశావుగా!

(9)

విశ్వ: ఒరే శ్రీనాథం! నీ కా అభిప్రాయం ఏలావచ్చిందో కాని, పా ముందరా, ఇబ్సెను ముందరా? వీళ్లిద్దరూ పనికిరారురా.

ఈలా వెళ్ళేవి మా వాదనలు. అంతే! లోతుల్లేవు. పిచ్చిభావాలు. గట్టిగా పట్టవస్తే ఒక్కవిషయం తెలియదు.

## 10

ఈ రోజులలో మదరాసు పట్టణము ఎరుగనివా ళ్ళెవరున్నారు! ఆంధ్ర దేశంలోని రెండుకోట్లన్నర జనాభాలోను ఏడాదికి ఏ ఏభైవేలమందో మద రాసు చూస్తూనే ఉంటారు. వ్యాజ్యాలకు హైకోర్టు అప్పీలు వుంటుందిగదా! వైద్యానికి చెన్నపట్నం పెద్దచెయ్యి. విశాఖపట్నంలో ఒక్కపాశ్చాత్యవైద్య విధానమే వుందిగాని చెన్నపట్నంలో గొప్ప ఆయుర్వేదవైద్యులూ, మళయాళ వైద్యులూ, యూనానీ వైద్యులూ, దేవీసిద్ధ భస్మమూ, ఒకటేమిటీ, అన్ని వైద్యాలూ అక్కడ వున్నవి. రామేశ్వరాది యాత్రలకు, తిరుపతియాత్రకు, చెన్నపట్నం వచ్చితీరాలిగదా!

ఈ రోజులలో సినిమాలుకూడా వచ్చాయి. ముఖ్యపట్నమే కాకుండా తెలుగు అరవ టాకీలకు హాలీవుడ్ కూడాను చెన్నపట్నం. కంపెనీ మేనేజర్లు, మెంబర్లు, డైరెక్టర్లు, ఆర్టు డైరెక్టర్లు, మ్యూజిక్ డైరెక్టర్లు, యాక్టర్లు, తారలు, తారలతోవుండే పక్షీంద్రాది హంగుజనం! వీరేమిటి, వారేమిటి, అదో మహా ప్రపంచం. అదీ కాకుండా రేడియో ఒకటి వచ్చింది. ఇవి ఇల్లా ఉంటోంటే పులిమీద పుట్ర అన్నట్లు బైరాగిటిక్కెట్లు వచ్చిపడ్డాయి. జేబులో పది రూపాయీలు ఉన్నవారు ఏలాగో చెన్నపట్నం వచ్చిపడాల్సిందే. క్రిష్టమస్‌లో జరిగే కాన్ఫరెన్సులకు లెఖ్ఖేమిటి? ఆంధ్రదేశంలో ఏ కాన్ఫరెన్సు ఎక్కడ నెగ్గకపోయినా చెన్నపట్నంలో నెగ్గితీరుతుంది. సంగీతసభలు, ప్రదర్శనాలు, స్వదేశవస్తు ప్రదర్శనాలూ! ఇవన్నీ ఇలాఉంచి సర్వకాల సర్వావస్థలయందు వర్తకం ఉండితీరిందిగదా!

చదువులకోసం తక్కువవస్తున్నారా చెన్నపట్నం! చెన్నపట్నం చదువు చెన్నపట్నం చదువే! మెడికల్ కాలేజీలు, ఇంజనీరింగ్ కాలేజి, లాకాలేజీ లున్నాయి. రాయలసీమవారంతా చెన్నపట్నం రావలసిందేగదా,

కాని నేను చదువుకొనే రోజులకున్నూ ఇప్పటికిన్నీ చెన్నపట్నం చాలా మారిపోయింది. 1915 లో పిచ్చిపిచ్చి హోటళ్లు ఉండేవి చెన్నపట్నం నిండాను. సత్యరాజాచార్యులవారు దేశయాత్రకు వెళ్లినప్పుడు చూచిన 'దుడ్డు పుచ్చుకొని భోజనం వేయబడును' అనేరకం హోటళ్లు. ఎండిపోయిన పచ్చి పప్పు, చెండాలపు వాసన కొట్టే నెయ్యి, ఏవో కూరముక్కలు నాలుగు ఉడక బెట్టి ఇంత ఉప్పూ కారం చల్లిన శాకాలూ, నిన్నటి పప్పు ఇవ్వాళ వేసిన సాంబారూ, వీటన్నిటికన్న శిరోమాణిక్యంలా కన్నడ పెరు! అందుకనే, విక్టోరియాహాస్టల్లో సీట్లకోసం పాట్లుపొట్టయి పోయేవారట.

కాఫీహోటళ్లలో ఇడ్డెన్లమీద నెయ్యి వేసేవారు కాదట. కావలిస్తే పుష్కరం రోజుల్నించీ పకోడీలు వేయిస్తున్న నువ్వులనూనె (లేకపోతే ఆముదం అనుకోండి) అలాంటిది ఇడ్డెన్లమీద వేసుకోమనేవారు. కాఫీ తప్పకుండా జిడ్డు ఆముదం. ఆ పరమదౌర్భాగ్యపు కాఫీని ఎత్తితాగాలని దెబ్బలాడేవాడు అయ్యరు. అక్కణ్ణించి తెలుగు విద్యార్థులు 'గ్రేట్ వార్' డిక్లేరు చేశారట. అన్నంలో వేసిన నెయ్యి వాసనచూట్టం, అయ్యర్ పళ్ళు మెలుమూరంలో పడే టట్టు పటేల్మని కొట్టడం. మంచినెయ్యి వెయ్యకపోతే ఇడ్డెన్లు వాడి మొఖాన వేసి రుద్దడం. శుభ్రంగా కడుపునిండేటట్టు కాఫీ కరిచిత్రాగడం. అయ్యరు ఆ అన్నాడా, ఆ కాఫీకప్పు అతని నోట్లోవేసి కడుపులోపలికి దూర్చడమే.

దెబ్బలాటకు తెలుగుకుర్రాళ్లకి క్రాపులు బాగా పనికివచ్చేవిట. అరవ వాళ్లని హతమార్చడానికి కుడుములు బాగా కొరికేవట. కన్నడ తైరు వేశాడా, ఆ తైరూ అన్నం యావత్తు అయ్యర్ను తలంటేవారుట. అప్పణ్ణించిటండీ చెన్న పట్నంలో నిజమైన మార్పులు రావడం ప్రారంభించాయి. వెన్న కరిగిన నెయ్యీ, పాలు తోడెట్టిన పెరుగూ, పోపులు పెట్టిన కూరగాయలూ, చక్కని పిండివంటలున్నూ. ఎక్కడో గుహలోని హోటళ్ళు మాయమైపోయి, వసతికీ భోజనానికీ చక్కని ఏర్పాట్లున్న రాజభవనాలు రావడం సాగించాయి. పొద్దున్నా సాయంత్రం ఒక వందరకాలు కారం, తీపి సరకులు ఈ రోజులలో పెద్దపెద్ద కాఫీహోటళ్ళలో దొరుకుతాయి.

ఇవన్నీ మా అచ్యుతరావు మామ ఉద్బోధించి చెప్పి 'కనక చెన్నపట్నం మనదిరా' అన్నాడు మీసం దువ్వుతూ!

'రేపు ఆంధ్రరాష్ట్రం వస్తే చెన్నపట్నం మన తెలుగురాజ్యానికి ముఖ్య పట్నం అన్నమాట, అంతేనా ?'

'నిశ్చయంగా.'

'అయితే, ఉన్న అరవాళ్ళందర్నీ ఏంచేద్దాము ?'

'కాయమ్ మహానదీగర్భవీచికా సమర్పణమస్తు.'

'తథాస్తు.'

అసలీ సంభాషణంతా రావడానికి కారణం శకుంతల దగ్గరనుంచి నాకు వచ్చిన ఉత్తరం నేను చదువుకొంటోంటే ఒక అరవ మహా పెద్దమనిషి 'కొ ట్టూడెంట్' తొంగిచూసి 'క్షమించండి, సార్!' అని ఇంగ్లీషులో అన్నాడు. నా క్షమార్పణ వాడి చెంపమీద ఫెళ్ళున తగిలింది. తరువాత ఏంజరుగు తుందో ఏమోనని భయపడి మా అచ్యుతరావు మామయ్యతో చెప్పుకున్నాను.

'ఏమీ పరవాలేదురా. మన అరవసోదరులకి ధైర్యం అనే వస్తువు రామేశ్వరం దగ్గరే నిలబడిపోయింది. వాడు అధికార్లతో ఫిర్యాదుచేస్తే ఎక్కడ నువ్వు సాగదీసి తంతావోఅని భయం. ఇలా కొంచెం కొంచెం మధ్య మధ్య మనం విజృంభిస్తేగాని మన ప్రావిన్సు మనకు రావొద్దూ!'

ఈ చెన్నపట్నంలో మహాభయంకరమైన దారిద్ర్యం. ఈ మహా పట్టణారణ్యంలో ఎక్కడో ఒకమూల ఏ ప్యాకేజీపెట్టి బాపతు చితుకులో, వీధి తుడవగా మూల పోగుచేసిన తుక్కో నిప్పుచేసుకొని, పొద్దుణ్నించీ సాయంత్రందాకా రిక్షాలులాగి, కూలికి బరువుబండ్లు లాగి, అణాడబ్బులు సంపాదించుకొని, అరణా బియ్యం గంజికాచుకొని, తక్కిన అర్ధణా డబ్బులతో జీవిత పరమావధి నిర్వర్తించుకొనే అతికరుణమైన దారిద్ర్యము 'కోటిచేతులు జాపి' తిరుగులోంది.

ఎప్పుడైనా సరదాపుట్టి తోటివిద్యార్థులతో బజార్లవెంబడి తిరిగినప్పుడు నాకు కళ్లంబట రహస్యంగా సుడిగుండాలు తిరిగేటట్లు చేసే కుష్ఠురోగుల బాధలు, వికలాంగులైన బిచ్చగాళ్ళ కష్టాలూ, గుండె తరుక్కుపోతూ ఉండేవి.

సాధారణంగా సినిమాలలోనూ నవలలు మొదలైనవి చదువుకోవడంలోనూ మనస్సు సంతోషంతో గంతులు వేసేది. కథలోని కథానాయకుని హృదయంలా నాహృదయమున్నూ సముద్రతీరంలో రాత్రి ఒంటిగా చీకట్లలో ఉన్నప్పుడు విచిత్ర గాంధర్వాలు ఆలాపించేది.

నేను ఇంటరు సీనియరు చదువుకునేప్పుడు మా శకుంతల వ్యక్తురాలయిందని మా అమ్మగారికి ఉత్తరం వచ్చింది. ఆ వార్త నాకు సిగ్గు కలిగించింది. ఎవరికైనా ఈ వార్త తెలిస్తే నన్ను హేళన చేస్తారేమో నన్న భయం. శకుంతల నాకు క్రొత్తదై తోచింది. ఆమె నా ఆలోచనాపథానికి వచ్చినప్పుడు నా కామె దూరమైపోయిందని భావించాను. ఇప్పుడామె నాకు స్నేహితురాలు కాదేమోనని భయం వేసింది. ఇప్పుడామె సిగ్గుపడుతున్న భార్యఅయినది.

ఆమె నాకు ఉత్తరములు వ్రాయుట మానింది. అది నాకెంతో బాధా, అశాంతి కలిగించింది. ఈ యేటి పండుగలకు వెళ్ళినప్పుడు శకుంతల నన్నుచూసి తుర్రున పారిపోయినది. శకుంతల ఏదని నేనడిగితే అందరూ నన్నుచూసి నవ్వేవారు. నా స్నేహితురాలైన శకుంతలకు, నాకు ఏదో విచిత్రమైన అడ్డమువచ్చివాలింది. తెరచాటున నీడగామాత్ర మా మెను నేను దర్శించేవాణ్ని. ఎందుకు ఈ విచిత్రమైన అవమానం నాకని నేను కలతపడిపోయాను.

## 11

నాకూనూ హేమకుసుమకునూ ఈతీరెన్నాళ్ళు? ఓ తెరచాటునమూర్తీ! తెరచీల్చబడదా? ఒక్క మహాపవిత్రమైన ప్రేమకు అతినీరసుణ్ణై, హీనుణ్ణై, తన నీరసత్వానికి లోకాన్ని తిట్టుకునే పాపినై, ఆ నీరసత్వపు కసిని కాశీపట్నపు గల్లీలలో బురదలో తొక్కి పంకిలం చేసుకున్న మూఢుణ్ని నేను. అయినా అత్యంతానందంతో ఈలోకాన్ని మహానటనంగా చూడగలుగుతూ ఉన్నాను. చూడలేకా ఉన్నాను.

శకుంతలను మరిచిపోలేని నేను, నా శకుంతలను తన చెల్లెలైన హేమకుసుమలో దివ్యలీలా వినోదినిగా ఆ పవిత్రముహూర్తంలో చూచినప్పణ్ణుంచీ

సాక్షిగానూ ఉండలేను, జీవితసమరోన్ముఖుడనూ కాలేను. కాని ఏదో మహా శాంతి, ఏదో దివ్యశీతలమ్ము, ఏదో పరమాచ్ఛత నన్ను పొదివికొని నా చేతులను పట్టి ముందుకు తీసుకొని పోతున్నది.

* * * * *

నేను బి.ఏ., జూనియర్ చదువు పూర్తిచేసి వేసవికాలంలో కొల్లిపరవచ్చి నప్పుడు నాకు పందొమ్మిదవ ఏట, మా శకుంతలకు పదునాలుగవ ఏటను ఇర్వురకు పునస్సంధాన మహోత్సవం జరిగింది. ఈ ఏడాదిలో శకుంతల అందం సెలఏటి ఊటలా విజృంభించింది. విశాలమైన ఆమె కళ్ళు అరమూతలు వహించి నవి. ఆ కళ్లలో నిర్వచింపలేని మాధుర్యాలు నర్తించినవి. ఆమె మోమున స్నిగ్ధత పరిమళ పూరితమైనది. మంచుతో కూడుకొనిన ఫాల్గుణ మాసపు ప్రత్యూషారుణ కాంతిలా అతిఆర్ద్రిత తాల్చినది.

ఆ మహోత్సవంలోని ఆమెసిగ్గు చెట్టును పండగా కోసిన జహంగీరు మామిడిపండు రుచిని మించినది. ఆమెకు ఎక్కడాలేని నెమ్మది అలవడినది. విచ్చటనూలేని ఘామేదాతనం హత్తుకుపోయినది. ఇదివర కామె మాటలో ఎప్పుడూ కని విని ఎరగని ఒక ప్రసన్నత, ఒక ఉత్కంఠత, ఒక గంభీరత, ఒక మధురత తీగె లల్లుకొనిపోయినట్లయినది. ఆ మూడురోజులు మే మిర్వురము సర్వలోకాలను మరచిపోయినాము.

మనుష్యుని జన్మలో అంతటి ఆనందము ఉండునా? ఆనంద కల్లోలము యొక్క పరమ శిఖరము ఆ రోజులు. మా యిద్దరి జీవితముల ఆ ఆనందమే కరడుగట్టి, శిల్పరూపమై శాశ్వతముగా సృష్టి ఉన్నంతవరకూ ఉండి పోయేడిదేమో!

ఏలాగు పరీక్షలకు చదివానో, ఏలాగు కాలేజీరోజులు గడిపానో, అదంతా ఇప్పటికీ నాకు స్పష్టంగా తోచని ఒక్క మహాస్వప్నం. సెలవిచ్చేటప్పటికి కొల్లిపరలో హాజరు. సెలవల్లే పోయేవి. కొల్లిపరలో ఉంటే ప్రతిరోజూ ఇరవైనాలుగు గంటలూ మతిలేని ఒక మహామధురత. అనంతమై తీవ్రమైన మానసిక మత్తత.

శకుంతలను ఒక్క నిమిషము విడిచి ఉండలేకపోయితిని. ఆమె నా కౌగిటిలో ఒదిగి ఉండని క్షణములే కొలదిగా ఉండేవి. మాకు నిద్రలులేవు. ఆహారాలూలేవు. అనిమిషత్వమూ ఆనందామృత భోజనము. దసరా సెలవలై చెన్నపట్నం వెళ్లవలసి వచ్చినప్పుడు మాకు ప్రాణములే లేవు. శకుంతలా నేనూ కళ్ళనీళ్ల ప్రవాహాలైనాము. మహాకవులు రచించిన విరహము మాకు పేలవమై తోచినది!

చెన్నపట్నమునుండి నేనూ, కొల్లిపరనుంచి శకుంతలా రోజురోజూ ఉత్తరాలే! పొద్దుననుంచి సాయంత్రందాకా ఉత్తరం వ్రాసి, ఉత్తరం పోస్టులో పడగానే మళ్ళీ ఉత్తరం ప్రారంభించి, చదువులుపోయి, నిద్రలుపోయి,

సర్వమూ ఒకే బాధయైపోయినది. ఆ నాటి నా విచిత్రస్థితి ఒక దివ్యోన్మాదమై ఉండునని అనుకుంటాను.

నేను క్రిష్టమస్‌కు వెళ్ళినప్పుడు మా ఆనందం ఇంద్రియ పరిమాధతనుంచి దివ్యానంద స్వరూపమైన చేతనత్వస్థితికి వచ్చింది. పాటలు పాడుకొన్నాం. నాట్యా లాడినాము. గిలిగింతలు పెట్టుకొని సెలవులువార నవ్వుతూ, నవ్వలేక ఉక్కిరిబిక్కిరవుతూ, అల్లరులలో దొర్లిపోయినాము. రాత్రిళ్లు చలిలో, వెన్నెలలో పైడాబామీద కూర్చొని చక్కని కాశ్మీరశాలువలో ఒదిగి గాఢమైన తియ్యటి కథలు చెప్పుకున్నాం. పేకాడుకున్నాము. చదరంగ మాడుకున్నాం. కాలవగట్టున మా మామిడితోటలోకి వెళ్లి ఒకరోజల్లా గుజ్జనకూడు లాడుకొన్నాము. ప్రేమికుల చుంబనములో ఉండే మహామంత్ర మేమిటో, గంగోత్రిలో గంగానదీ ప్రథమ జలబిందువులు స్రవించడంగాని, వసంత కాలంలో మల్లెపొదలో మొట్టమొదటి మొగ్గ ఉదయించి వికసించడంగానీ, దాహబాధాత్మకమైన శాలిభూమిపై తొలకరి జడి అవతరించడంగానీ యవ్వన ప్రణయపూరిత చుంబనానికి పోల్చలేము.

దివ్య సౌందర్యపూరితమైన శకుంతల మోములో అప్పుడప్పుడే వికసించిన గులాబీరేకుల పాటలవర్ణమున్నది. వికసించే నందనవన పారిజాత పుష్పాల తేనియలను స్రవింపజేసుకొని సురభిళమై, సురుచిరమై, సాద్భుతమైన ఆ యధర చుంబన దానము ఊహాతీతమైనది, భావాతీతమైనది, ఆనందాతీతమైనది.

కర్కశమై, గాఢకాంక్షాపూరితమయిన నా దృఢ పరిష్వంగంలో అందాలకు నిధి, ఆశలకు పరమావధి శకుంతలాబాల బిగిగా ఒదిగిపోయి, అక్కడనే ఉద్భవించినట్లయిపోయినది. ఆమె ప్రతి అణువూ నా ప్రతి అణువులో లీనమైపోయి, ప్రథమ ప్రణయానికి దివ్యసాఫల్యము చేకూర్చింది.

ఇంక శకుంతలా నేనూ విడివడి ఉండలేము. విడివడిఉంటే మా ప్రాణాలే విడివడిపోతవి. ఇద్దరం ప్రయాణమైనాము. చెన్నపట్నంలో ఆ మూడుసెల్లూ మూడు నిముషాలై పోయినవి. చదువు పుస్తకాలలోనే ఆగిపోయినది. స్నేహము సేమాట మరచిపోయినాను. సిద్దప్పగారి ఆశ్రమము కలలవెనకాలే దాగిపోయినది. బీచికి వెళ్ళినాము. సినీమాలు చూచినాము. శకుంతలకు రోజుకు ఒక కన్విందర్పించుకున్నాను. చెల్లారామ్ కొట్టులో సగం చీరెలూ, రవికెలూ మా యింట్లోనే ఉన్నవి.

## 12

చెన్నపట్నంలో ఒకరోజున నేనూ శకుంతలా భోజనముచేసి తాంబూలాలు వేసుకుంటూ మా పడకగది ముందరిహాలులో కూర్చున్నాము.

శకుంతల నన్నుచూచి, ఆమె విశాల నయనాలు వాలుగన్నులుకాగా, ఆమె దీర్ఘ వినీల పక్ష్మాలవెంట జారే నవ్వుతో చూపులు నాపై ప్రసరించి,

'ఈ ఇంగ్లీషు సినిమాలలో ప్రేమని చెప్తూతారే ఆ ప్రేమ ఏమిటండీ?'

'నీకు నామీద ఉండే భావం!'

'నేను ఒప్పుకోను! నాకు మీమీద ఉండే ప్రేమ ఏలాంటిదంటారు?'

'ఇంకా మరీ ప్రేమ!'

'మీకు నామీద ఉన్న ప్రేమ?'

'మరీమరీ ప్రేమంటాను!'

'ఈ రెంటికి తేడా ఏమిటి?'

'ఇంకా ప్రేమకు, మరీ ప్రేమకు తేడా ఏమిటని నీకు తోస్తుంది శకూ?'

'బాగా ఉన్న పిండివంట ఇంకా వడ్డించు అనే మోస్తరు ప్రేమ నా ప్రేమని మీ భావం!'

'సరిగ్గా గ్రహించావు, నారాణి!'

'అయితే మరీ ప్రేమంటే మీకిష్టమున్న వస్తువును మరికాస్త వడ్డించుకు తినడమన్న మాటా?'

'అసలు అర్థం చెప్పుకున్నావు!'

'మీరెంత చెప్పండి, ఇంగ్లీషు సినిమాలలో చెప్పే ప్రేమ అసలు ప్రేమ కాదు.'

'ఏమి? ఎందుకు కాదు పంతులుగారూ?'

'బ్లాక్ పైరేటు అనే బొమ్మకు వెళ్ళామా మనం మొన్న? అందులో ఆ రాజుగారి కూతురుకి నాయకుని మీద మొదట కోపం, తర్వాత ఇష్టం! అదేం ప్రేమండీ?'

'ఎలా ఉండాలంటావు?'

'అతన్ని చూడగానే ఆమెకు, ఆమెను చూడగానే అతనికీ సర్వ ప్రపంచమూ మాయమైపోవాలి. ఆమెకోసం అతడూ, అతనికోసం ఆమె జన్మించాలి, జీవించాలి.'

నేను ఆశ్చర్యంతో మౌనం వహించి ఆమెవంక తేరిపార చూచాను.

'ఒక స్త్రీకోసం పురుషుడూ, ఒక పురుషునికోసం స్త్రీ అనాదినుంచీ జన్మల్లో ప్రయాణాలుసాగిస్తూ వుంటారు. ఇద్దరూ ఒకళ్ళకోసం ఒకళ్ళు జీవిస్తారు. వాళ్ళిద్దరూ ప్రతి జన్మలోనూ కలుస్తూ ఉంటారు. ఆ కలుసుకున్నప్పుడు వీళ్లిద్దరే. ఇంక ఎవ్వరూ వాళ్ళకు వుండరు. ప్రపంచం మాయమై పోతుంది.'

'వాళ్లిద్దరూ కలిసికోడానికి వీల్లేకుండా ఒకరు అమెరికాలో, ఒకరు ఇండియాలో పుడితే? లేక ఇద్దరూ వేరు వేరు కులాలలో పుడితే?'

'ప్రేమదేవత ఎప్పుడూ అలా చెయ్యదు. అమెరికాలో ఆమె పుట్టితే, ఇతడు ఎక్కడపుట్టినా అక్కడకు పోతాడు. వేరువేరు కులాల్లో పుట్టితే, వాళ్ల ప్రేమ కులాలను మించిపోతుంది!'

'రామీ, చండీదాసుల ప్రేమలానా?'

'అవును! వాళ్లప్రేమ తుచ్ఛంకాదు. వారు పెళ్ళిచేసుకోని మనో వాక్కాయకర్మల వారు ఒకర్కిరిలో ఒకరు లీనమైపోతారు. పెళ్ళిచేసుకునే వీలు లేకపోతే బ్రహ్మచర్యం అవలంబిస్తారు.'

'లోకంలో అన్ని ప్రేమలు అలా ఉన్నాయంటావా?'

శకుంతలమోము దివ్యహాసంతో వెలిగిపోయింది. కుర్చీనుండి లేచి నా దగ్గరకువచ్చి నా పాదాలకడ కూర్చుంది.

లేచి నడిచివస్తూవుంటే వెన్నెల కిరణాలన్నీ ముద్దకట్టి ప్రవహించి వచ్చి నట్లుగా కనబడింది. ఎంత మహోత్తమ ప్రేమ ఈమెది! ఈ పదునాలుగేళ్ల పడుచు, సౌందర్య పరమావధి అయిన అందాలబాల నన్ను ప్రేమిస్తున్నదన్న భావం నాకు భయమూ కలిగించింది, అమృతత్వమూ ఇచ్చింది.

ఆమెను నా హృదయాని కదుముకున్నాను. నాకు మైమరపు కలిగింది! ఆమె సువాసనాలహరి! ఆమె సర్వరసాధిదేవి! ఆమె ఆనంద విశ్వమూర్తి! ఆమె సౌకుమార్యం నా మొరకుతనంలో నలిగిపోయినది.

'దేవీ! ఈ దేహము శాశ్వతము కాదుగదా? దేహానందంకోసంకదా భార్యాభర్తల సమాగమం! దేహానందం తుచ్ఛం కాదా?'

'అలా అంటారేమిటి?' ఆమె మాటలు నా చెవిలో బుల్ బుల్ పాటలులా ధ్వనించాయి. ఆమె తన పెదవులతో నా చెవిని ముద్దుగొని, 'దేహానందం, మనస్సు ఆనందానికి పునాది కాదండీ? మనస్సూ దేహమూ ఆత్మకు పునాది. మొన్న నాతో విద్యుచ్ఛక్తిని గూర్చి, మీరన్నీ చెప్పలేదా ఏమిటి? తీగైనా వుండాలి, గాలైనా ఉండాలి, మరో వస్తువయినా ఉండాలి ఆశక్తి ప్రవహించడానికని మీ రనలేదూ?' అన్నది. తల ఊపాను.

'విద్యుచ్ఛక్తి ఆత్మ అనుకోండి. మన దేహాలు అందుకు ఉపాధికాదూ? మీరు దొంగలు, నాకు పాఠం చెప్పే విధానం కాబోలు ఇది.'

ఆ మర్నాడు సాయంకాలం బీచికిపోయాము. ఇద్దరం కెరటాలు చూస్తూ కూచున్నాము. సర్వ ప్రపంచము మమ్మల్నిద్దరినీ తేరిపార చూస్తూ ఉంది. అందరికళ్ళూ ముఖ్యంగా నా శకుంతలమీదే!

'నా' శకుంతల అంటే నేను కొన్నానని కాదు. నా కృష్ణపరమాత్మ అంటే ఎంతో, నా శకుంతల అన్నా అంతే!

వెన్నెల కెరటాలమీద వాలి కెరటాలకు జీవంపోస్తున్నది.

'ఆ వెన్నెల కెరటాలమీద ప్రేమలా వాలుతున్నది కాదండీ!'

'శకూ! కెరటాలలో కూడా ప్రేమికులున్నారు సుమా?'

'అదే కాబోలు ఒక పెద్ద కెరటం వెనకాల ఒక చిన్న కెరటం వస్తూ ఉంటుంది.

'పెద్ద కెరటం భార్య, చిన్న కెరటం భర్త.'

'అబ్బా! అన్నీ తప్పులు చెప్పి, నా చేత వాగించాలని మీ ప్రయత్నం. నేను మీకన్న పెద్దదాన్నా?'

'భర్తవెంట భార్య వస్తుందన్నా ?'

'ఇద్దరూ కలిసివస్తారు. మధ్యమధ్య ఒక పెద్ద కెరటం వస్తూవుంటుంది. అది భార్యా భర్త లిద్దరు ఏకమై రావటం.

ఏలాగో బి. ఏ. పరీక్షలు పూర్తిచేసికుని, సామానూ, గీమానూ అంతా సర్దుకొని, మా అమ్మా, శకుంతలా, నేనూ కొల్లిపర వచ్చాము. మేఘసందేశ మైన వెనక, శాపము తీరి ప్రియురాలిని కలుసుకొన్న యక్షుడు, ప్రియురాలితో విహరించే అతి మహానందంకూడా కుంటుపడే దివ్యానందంతో నేనూ శకుంతలా ఆ వేసవికాలంలో కొల్లిపరలో గడిపాము.

నిజమైన ప్రవరుణ్ణి కలుసుకొన్న వరూధినీయోష పొందు అద్భుతానందం, నన్ను కూడివున్న శకుంతలాదేవి పరమానందము ఎదుట, జీవకళాకాంతిరహితమై పోవలసినదే.

శకుంతల రోజుకు మూడుసారులు స్నానం చేసేది. నీళ్లలో పన్నీరులు కలుపుకునేది. ఒంటికి అత్తరులు అలముకొనేది. రోజుకు నాలుగుసారులు చీరలు మార్చేది. ఉదయం ఉప్మా, ఇడ్లీ, పెసరట్టు, దోసె ఏదో చేసేది. కాఫీ అమృతమే. చెన్నపట్నంలో అరవపురంధ్రుల సావాసం చేసి నేర్చుకుంది. ఆ గురువులను మించిపోయే పాకంతో తాను తయారుచేసేది. సాయంకాలం మళ్ళీ కాఫీ, రకరకాల పిండివంటలు చేసేది. రోజూ మా మామగారు ఫలహారానికి రావాలి. మా హేమం అసమానమూ మా యింటిలో ఫలహారాలను రుచిచూడవచ్చేది. నా శకుంతల అత్తగారికి సేవ, మడిగట్టుకోడం, రాత్రిళ్లు వంటా, మా ఇల్లంతా కలకలలాడిపోయింది.

## 13

ఒకనాడు మా పురోహితుణ్ణి నాకూ నా శకుంతలకూ సరిపోయిన మంచి ముహూర్తము పెట్టుమన్నాను. ఆ ముహూర్తము రాత్రప్పుడు ఉండాలన్నాను. 'ఎందుకయ్యా శ్రీనాథమూర్తీ' అని ఆయన నవ్వుతూ నన్నడిగినాడు.

'అది వేరేసంగతి. మీరు ముహూర్తం పెట్టండి, అన్నిరకాల బాగుండేది' అన్నాను. ఆయన వైశాఖ శుద్ధ తదియనాడు రాత్రి 8-30 గంటలకు ముహూర్తం పెట్టినాడు. ఆ ఉదయమే శకుంతలను తలంటించుకొమ్మన్నాను. నేనూ తలంటింపించుకొన్నాను.

చెన్నపట్నంనుంచి ఆరోజు ఉదయానికి తెనాలికి నా పేర వేలకొలది గులాబిపూలు వచ్చే ఏర్పాట్లు చేశాను. చుట్టుప్రక్కల గ్రామాలనుంచి బుట్టలు బుట్టలు మల్లెమొగ్గలు వచ్చేటట్లు చూచినాను. అనేకరకాలైన పళ్లు చెన్నపట్నం నుంచి వచ్చినవి. చబుల్‌దాసునుండి నగలప్యాకెట్టు వచ్చినది. నూటయాభై

రూపాయల బెంగుళూరి చీర జిలుగుల తళుకులున్నది కుసుంబాపువ్వు వన్నెకలది కొన్నాను. దానిమ్మపూవురంగు పట్టురవిక కుట్టించాను.

మా పురోహితుడు పెట్టిన ముహూర్తం పదినిమిషాలుందనగా శకుంతలను ఆ చీర పసుపుపెట్టి కట్టుకోమన్నాను. ఆరవిక తొడుక్కోమన్నాను. మాగదిలో తూర్పువైపు గోడదగ్గిర కమలపుపట్టు వేశాను. వెండి పువ్వులపీట వేశాను. ఆపీటపై సరిగపూల పట్టురుమాలు పరచినాను. దానిపై వేయి గులాబిపూవులు చల్లినాను. ఆ పీటపై శకుంతలను కూర్చోమన్నాను.

'ఇదేమిటండీ ?'

'శకూ, నేను చెప్పినట్లు చెయ్యి, దీనిలో ఒక పరమార్థముంది. అది తర్వాత చెప్తా !'

శకుంతల వెరగుపడిన చిరునవ్వుతో ఆ పీఠంమీద కూర్చున్నది. ఆమె మోము కోలనైనది. స్నిగ్ధమై, మెత్తనై, కమలకుట్మలాలైనవి ఆమె చెక్కిళ్ళు. వెడదలై, సోగలై, నల్లని పొడుగాటి రెప్పలు కలిగిన వామెకన్నులు. సమంగావచ్చి, చిట్టచివర సెలయేటివంపు తిరిగిన దామెముక్కు. పల్చనై, వెడల్పు తక్కువైన కనకాంబర పూపుటము లామె ముక్కుపుటములు. కుడి ముక్కు పుటాన ఏడురవ్వల బేసరి ఉంది. పై పెదవి పైభాగము ఒత్తుగా వికసించిన కాశ్మీర కుసుమ క్షేత్రంలా ఉంది. మధ్య నొక్కు చిన్న పాల యేరులా ఉంది. ఉదయించే సూర్యుని పైఅంచు వంపుకు, అందాలు దిద్దే పై పెదవిరేఖకు రెండు వంపుటంచులు. ఆ పై పెదవి సూర్యకిరణాలు ప్రసరించిన పాలసముద్రపు వీచిక. వీచికల తాకుడుచే మథింపబడి, తేరిన వంపు వెన్న రేఖపై అరుణకిరణాలు ప్రసరించిన క్రింద పెదవి. కొంచెం విడివడిన ఆ రెండు పెదవులమధ్య, తురిమిడిపట్టిన ఆణిముత్యాల వరస ఆమె పళ్లు. వసంత కాలపు మధ్యాహ్నలమాల ఆమె పలువరుస. పాలసముద్రంలోని సహస్రకమల ముకుళ మామె చిబుకము.

ఆకసపు లోయలోని స్వర్ణది ఆమె కంఠము. ఆమె బుజాలు ఉదయ సాయంకాలాలు. లోకంలోని మధురాలు సేకరించి, కరిగిన బంగారులో ఒలికించి, పోతపోసి, మొనలుతేల్చి, ఆ మొనలపై స్విన్నత నందిన సరస్వతీ కంఠ హారశోణరత్నాలు పొదిగినవి, ఆమె ముగ్ధ వక్షోజాలు. ప్రాణము పోసికొన్న బంగారు వర్ణం ఆమె దేహకాంతి. శిల్పుల తపఃఫలం ఆమె రూపం.

ఆమెను పూజించాను. ఆమెకు షోడశోపచారాలు అర్పించాను. మల్లెపూలు వర్షము కురిపించాను. గులాబిపూలు ధారలు కట్టాను. మాలతీ జాజీ మాధవీ పుష్పాలు దోసిళ్లర్పించాను. ఆణిముత్యాలు గుప్పిట సేసలు చల్లాను, నగల అర్పణలిచ్చాను. ఆమె ఎదుట మోకరిల్లాను. మృదులాలై, సౌందర్య శ్రీలు చెన్నారే ఆమె చిన్నారి పాదాలు నాహృదయాన్ని చేర్చుకొని ఫాలాన అదుముకొని ప్రతి వేలు, పాదము యావత్తూ తనివోవ ముద్దుపెట్టుకొన్నాను.

ఆమెను సువ్వున పూలమాలలా ఎత్తి నా హృదయాని కదుకొని, తీసికొని పోయి, మా తల్పంమీద పరుండపెట్టాను. ఆమె వివశయై ఈ లోకంలో లేదు. ఆమె మోమున దివ్యకాంతులు ప్రసరిస్తున్నవి. 'శకుంతలా! శకుంతలా!' అని భయముతో, డగుత్తికతో పిలిచాను. ఆమె చైతన్యరహితయై మారుపలుకలేదు. 'శకుంతలా! శకుంతలా!' అని అస్పష్టంగా ఒణికిపోతూ, నా కన్నుల నీరు జల జల వర్షిస్తుండగా పిలిచినాను.

ఆమె చిరునవ్వు నవ్వుతూ కన్నులు తెరిచింది. బంగారువెన్నెల కిరణాలైన ఆమె చేతులు రెండూ నా వైపు చాచి 'నేను మీ పూజకు తగుదునా ప్రాణేశ్వరా!' అన్నది.

'నా సర్వస్వము, నా తపసు, నా జన్మాశయం, నీపాదాల మ్రోలకాదా శకూ!'

''ఈ కల వినండి! మీరు పూజించగానే, నేనో గంధర్వబాలికనై ఒక విమానంలో ఎగిరి వెడుతున్నానట. 'నా ప్రాణేశ్వరు డేడీ' అని దిక్కులు చూస్తూ వణికిపోతూ విమానంమీద కూర్చున్నాను. ఆ విమానం తిన్నగా చంద్రలోకం పోయిందట. అక్కడ ఓ కలవపూవుపై నా మూర్తే పవళించి నిదురపోతూన్నదట. నేను వెళ్ళగానే ఆమూర్తి పెదవులు కదిపి 'నేను పూర్ణ రూపాన్ని, నువ్వు నాలో సగం. పూర్తిగా మన తపఃఫలాన్ని నువ్వెలా అనుభవిస్తావు?' అన్నదట! భయపడి ఆమె పాదాలమీద వాలానట. ఇంతట్లో మీరు 'శకుంతలా' అని దూరాన్నుంచి నన్ను పిలిచినారు. వినికూడా లేవలేకపోయాను. మళ్ళీ మీ పిలుపు వినబడింది. లేచాను. ఇంతలో నాకు మెలకువ వచ్చింది. నాకు చాల భయం వేసిందండీ!''

'శకుంతలా! నువ్వు లేవకు. తలగడపై చెయ్యి ఉపధానం చేసుకుని పడుకో! నీమీద చేసిన నా పాట నీకు అంకితం ఇవ్వాలి. నీవు రాణివి, నేను నీ కవిని.

'ఓ దేవి! నీ దివ్యజన్మకే
నాదు సర్వస్వమ్ము ఇత్తునో!
నా జన్మ, నా బ్రతుకు, నా కలలు
ఏ జీవితాద్భుత రహస్యమ్మో
ప్రత్యక్ష మొనరింపవచ్చెనో
ప్రజ్వలిత మొనరింపవచ్చెనో!
ఆ దివ్యసిద్ధియే నీవునై
ఆ దివ్యమోక్షమే నీవునై
నీ పరమ పాదాబ్జముల నేను!
నీ పవిత్రహృదయాన నేను'

అని పాడి, మంచముకడ మోకరించి, పరుపు అంచుననున్న ఆమె పాదాలపై నా మోము నుంచినాను. ఆమె లేచి నా చేతులు రెండును పట్టి

తనకడకు లాగుకొని, నీరు తిరుగు కన్నులు వానవెలిసిన చంద్రకాంతిలా మెరిసిపోవ, నా మోము చూస్తూ 'మీరు నా దేవుళ్ళు, నా సర్వస్వమూ మీలోని భాగం, మిమ్ము మీరు పూజించుకుంటారా? మనం ఇద్దరం కలిసి పూర్ణరూపం అవుతాము. ఆ పూర్ణపురుషునిలోని దివ్యత్వం మీరు, నేను మానవత్వాన్ని. నేను మిమ్ము పూజించాలి. అదేకాదూ సీతా, సావిత్రి మొదలైనవాళ్లు చేసిందీ అదే నిజం!' అన్నది.

'శకూ! పురుషుడు ఇంతవరకు మనుష్యుడు. ప్రపంచంలో కృషి చేసేవాడతను. అతని జాతికి అమృతత్వం ఇచ్చి, అతనికి వెనకాల బలమైన స్త్రీ అతనిలోని దివ్యత్వం.'

'ఈ రోజున నాలో ఏదో పవిత్రత వచ్చింది. మీకూ నాకూ అర్థంకాని ఏదో మహాభావం నాలో చేరినట్లు నా కల నాకు భావం కలిగిస్తున్నది.'

## 14

మా అత్తగారైన వెంకటరామమ్మగారు శలాకలా పొట్టిగా, బంగారు బొమ్మలాంటి మనిషి. ఎంత ఈడువచ్చినా చిన్నబిడ్డలా ఉండే కాయశరీరం కల ఆరోగ్యవంతురాలు. చారెడేసి కళ్ళూ, ఉంగరాలు తిరిగిన జుట్టూను. ఎనిమిది కాన్పులు వచ్చినా ఇద్దరు బిడ్డలు మాత్రమే బ్రతికి ఉన్నారు. అయినా ఆమెలోని యవ్వనపు బిగి ఏమాత్రమూ సడలలేదు. తల్లీ, పెద్ద కొమరితా కలిసి వస్తూఉంటే అప్ప చెల్లెళ్ళలా ఉండేవాళ్ళు. ఆమె వెర్రిబాగుల మనిషి. ఆమెకు లోకంలోని వాళ్లందరూ మంచివాళ్ళే. అనవసర సంబంధాలు కలుగచేసికొనేదికాదు. కాని తన దృష్టిపథంలోకి వచ్చినవాళ్ళ నందరినీ నిష్కల్మషమైన అపేక్షతో చూచేది. భర్తఅంటే ఎంతో గౌరవం, భక్తీ.

లోకంలో సర్వసాధారణంగా రెండవ వివాహం భార్యలకు, భర్తలు దాసానుదాసులుగా ఉంటారు. తన భర్త అలా ఉండటానికి వీలులేకుండా చేసింది మా అత్తగారు. వినాయకరావుగారికీ, రాజ్యలక్ష్మమ్మగారికీ మధ్య ఇరవై సంవత్సరాలు తేడా ఉన్నది. అందులో మా అత్తగారు బంగారు తీగలాంటి మనిషిన్నీ, మా మామగారు విఘ్నేశ్వరుని పేరు సార్థకం చేసుకునే శరీరంకలవారున్నూ అవడంచేత మా అత్తగారు మా మామగారికన్నా ఏనలభైఏళ్ళో చిన్నదిలా కనుపించేవారు.

మా మామగారు, వినాయకరావుగారు ఉత్తములు. ఉదాత్త హృదయం, ఉత్కృష్టరూపం కలవారు. అయిదడుగుల పదకొండంగుళాల ఎత్తు, ఆ ఎత్తుకు తగిన లావూ, పుష్టీ కలవారు. 'ఊ' అని మూలిగిఎరగని మంచి ఆరోగ్యం కలవారు. శుభ్రమైన భోజనమూ, శుచివంతమైన నడవడి, సూక్ష్మగ్రహణశక్తి, ఉత్తమ ఆలోచనలూ వినాయకరావుగారిని మా చుట్టుపక్కల గ్రామాలలోకి ముఖ్యపురుషుణ్ణి చేసినవి. ఆయన పలుకుబడి అనంతము. మా జిల్లాలో ఆయన్ను గౌరవం చెయ్యనివారు లేరు.

కొంచెం బొజ్జ ఉన్నా అతిసునాయాసంగా ఎంతదూరమైనా నడవ గలరు. తన స్వంత పనుల్లో కూలీలతోపాటూ, పాలేళ్లతోపాటూ, తానూ రాక్షసునిలా పనిచేసేవారు. భోజనప్రియు లవడంచేత మా మామగారు సమస్త శాకపాకాదులూ, చివరకు విదేశీయజాతులుకూడా తన దొడ్లో పండించుకొనే వారు. ఏ ముష్టి లక్ష్మీనారాయణగారినో సలహా చేస్తూఉండేవారు.

మా మామగారు ఎక్కడ ఏ మీటింగు జరిగినా హాజరు. జాతీయవాది, ఖాదీవస్త్రవాది. సీతారామశాస్త్రుల్గారు వైదీకె నందుకు కొంత విచారించినా, కాంగ్రెసువాడైనందుకు సంతోషిస్తూ ఆయనకు ఎంతో సహాయం చేస్తూవుండే వారు. గాంధీమహాత్ముడు అవతారపురుషుడని నమ్మతాడుగాని, హరిజనోద్ధరణ విషయంలో ఆయనకు బాగా తెలియదేమోనని అనుమానపడ్తాడు.

ఆహితాగ్ని, ఆచారసంపన్నుడు. ఆచారాలవల్లనే భరతవర్షం ఈమాత్ర మైనా బ్రతికివుందని ఆయన వాదిస్తాడు. మా మామగారింట్లో ఎప్పుడూ నిత్య దేవతార్చన, జపతపాలు జరుగుతూ ఉండేవి. ఏడాదికి మూడునాల్గుసార్లయినా ఏ సత్యనారాయణవ్రతమనో పేరు చెప్పి, చుట్టాలందర్నీ పిల్చి, బట్టలూ పాతలూ బహుమతులూ పెట్టి, బ్రాహ్మణులకు తదితరవర్ణాలవారికి పంచభక్ష్యపరమాన్న భోజనాలు పెడుతూ వుంటారు. ఒకరోజున నన్ను కబురంపించారు. 'మూర్తీ, నువ్వు బి. ఏ. ప్యాసయినతర్వాతం ఏంచేస్తావు?' అని అడిగారు.

'నాకు గవర్నమెంటు ఉద్యోగంమీద ఏమీ నమ్మకం లేదండీ.'

'అయితే బి. ఎల్. కు వెడతావా?'

'ప్లీడరు వృత్తంటేనే నాకు అసహ్యం. మనిషినీ, ఆత్మనూ చంపుకోవా లంటే ప్లీడరువృత్తి తీసుకోవాలి గాని, లేకపోతే గడకబ్బ చివరతోనయినా దాన్ని ముట్టడానికి వీల్లేదని నా గాఢమైన నమ్మకం.'

'ఆ విషయంలో నేను నీతో ఏకీభవిస్తానోయి. ధర్మశాస్త్రాలెరగని వాళ్ళూ, ఆచార వ్యవహారం సంగతు లెరగనివాళ్లూ ప్రజాసామాన్యంయొక్క ఆశయాలూ, భావాలూ, గ్రహించలేనివాళ్లూ మన మతాలను గురించి వాదించడం, వాళ్ళల్లోంచి వచ్చి, తమచుట్టూ గోడలు కట్టుకొన్న మునసబులూ, జడ్జీలూ, మన మత విషయాలల్లో తీర్పు చెప్పడం, మన దురదృష్టంకొద్దీ ఏర్పడ్డ ఒక విచిత్ర సంఘటనగానీ ఇంకోటికాదు. ఇంతకూ నువ్వేమాలోచన చేసినట్లు?'

'పెద్దలు సంపాదించి, మా తండ్రిగారు వృద్ధిచేసిన ఇంత ఆస్తి ఉన్నది. ఆస్తికోసం కాదు గదాండీ నేను ఉద్యోగం చెయ్యవలసింది. ఇంక వ్యావృత్తి కోసం. శిల్పకళంటే నాకు చాల ఇష్టం. అసలు వైద్యానికి వెళ్దామను కున్నాను. ఈ శిల్పకళయందుండే అభిరుచిచేత, నాదారి ఆ వైపు మళ్లింది. ఈ ఊళ్ళోనే ఒక శిల్పాశ్రమం ఏర్పాటుచేసి, కళాసేవ చేద్దామని సంకల్పం ఉంది.'

'అదీ బాగానే ఉంది. ఇవతల వ్యవసాయమూ చూచుకుంటూ ఉండ వచ్చును. శిల్పాన్ని మళ్ళీ పునరుద్ధరించడము చాలా గొప్ప కార్యం.'

'అదే అనుకుంటున్నానండీ మీ ఆశీర్వచనం ఉంటే.' ఆ విషయమూ, స్వంత వ్యవసాయం విషయమూ ఆలోచన సాగింది నాకు. మనం స్వంత వ్యవ సాయం ఎలా చేయించగలం? చదువుకున్నవారు స్వంత వ్యవసాయం చేయించ గలరా? ఎందుచేత చేయించగూడదు? సర్వాధారమైన భూదేవికి వ్యవసాయం వల్ల సన్నిహితులంకామా? సర్వకాల యవ్వనంతో సకల సౌరభావృత దివ్యగర్భ అయిన ధరిత్రీమాత తనదగ్గిరకు చేరిన అనుగుబిడ్డలకు సర్వసృష్టి రహ స్యాలనూ ఉపదేశించదా? పూర్వకాలంనుంచీ ఆశ్రమాలలో ఉండి, విద్య పూర్తిచేసికొని, పల్లెటూళ్ళలో భూమాత ఒడిలో పెరిగిన మహాశిల్పులే అజంతా, ఎల్లోరా, వాతాపి మొదలైన గుహలను నిర్మించారు. ధాన్యకటక, నాగార్జున కొండ మొదలైన పవిత్ర స్థలాలలో స్తూపాలను నిర్మించారు. కాకతీయ శిల్పులు పల్లవ శిల్పులు, చాళుక్య శిల్పులు, విజయనగర శిల్పులు ఈ మహాభాగులే! అసత్య నాగరికతలోబడి, నకనకలాడే పురుషుల్లా కొట్టుకొంటూ ఉన్న పట్టణ వాసులకు శిల్పహృదయం ఏమి తెలుస్తుంది? కర్కశమైన ఒక గింజను భూమిలో పాతి, లాలిత్యము ఒరుసుకొనిపోయే సర్వవర్ణ సముపేతమైన మొక్కను భూమిలోనుంచి తీసికొనిరాగలిగిన కర్షకుడు విద్యావంతుడే అయినట్టయితే ఉత్తమశిల్పి కాకుండా ఎట్లా ఉండగలడు?

ఈ ఆలోచనలతో శకుంతల దగ్గరకు పరుగెత్తుకొని వెళ్ళినాను. 'ఓ హృదయ సింహాసన రాజ్ఞిగారూ! ఇలా వినండి. నాకేసి చూడండి. ఆ అందమైన నీలితెరలు జిలుగులాడే తమకళ్ళు నిలా తిప్పండి. తళుకులు ప్రసరిస్తూ మధువులు తొంగలించే ఆ పెదవులను అట్టే నావైపుకు తిప్పకండి. అన్నీ మరిచిపోవలసివస్తుంది. అందుచేత ఆ పెదవులను కాస్త బిగించండి. ఏదీ తమ బంగారులతలు, ఆ రెండుచేతులూ ఇట్లా ఇవ్వండి. కాస్త ఈ మెడచుట్టూ గట్టిగా చుట్టనివ్వండి. లేత తమలపాకు చెవిని నా పెదవిదగ్గర పెట్టండి. ఒక రహస్యం చెప్పాలి.'

'రహస్యం చెప్పబోతున్న ఓ పెద్దమనిషిగారూ! నాచెవి కొరికేస్తారా ఏమిటి? రహస్యం చెప్పడం మానేసి నా కళ్ళూ, బుగ్గలూ, జుట్టూ, ముక్కూ, తినేసేటట్టున్నారు. నా ఎముకలు విరుగుతున్నాయి. అంత గట్టిగా అదుము తారేమి? అబ్బ! ఉందురూ. ఇదా మీరు చెప్పే రహస్యం. అందుక నేనా అంత గబగబ పరుగెత్తుకొచ్చారు...'

'రహస్యమా! ఈ ఊళ్ళోనే ఒక శిల్పాశ్రమం మనం ఏర్పరచుకోడం నిశ్చయం చేశాను. మామగారు చాలా ఫస్టుక్లాసుగా ఉందన్నారు. రవీంద్ర నాథ టాగూరుగారి శాంతినికేతనంగూడా దీనిముందర ఎందుకూ పనికిరా నటువంటిదనే ఆశ్రమం పెట్టాలి. మన కొల్లిపరకి దేశదేశాలనుంచీ తండోప తండాలుగా జనంవచ్చి ఈ పవిత్రక్షేత్రాన్ని కొలిచి వెళ్ళేటట్టుగా చెయ్యాలి.'

'ఇక్కడుంటే తోస్తుందా మీకు ? మన ఊళ్ళో బీచి లేదు. సినీమాలు లేవు. టెన్నీసాటలు లేవు. అయినా బొమ్మలు చెయ్యడం మీ కెంతో ఇష్టంగా ? నా బొమ్మను మాత్రం అస్తమానం చెయ్యకండేం !'

'ఓయి వెర్రిదానా ! ప్రపంచంలో నీకన్న అందమైనవా ళ్ళెక్కడున్నారు ? సరస్వతిగా, లక్ష్మిగా, లలితాదేవిగా, నిన్నే మూ ర్తిస్తాను. ఒక్కొక్క శిల్పికి ఒక ఆశయదేవత ఉంటుంది.'

'మీకైనా సిగ్గు ఉండాలి. ఆ మాటలు అలా ఉంచండి. ఇక్కడుండటం బాగానే ఉంటుంది. మా అమ్మ సంతోషపడుతుంది. హేమ బావగారిని వదలి ఒక్క నిముషం ఉండలేదుకూడా ! కాబట్టి, నేను మీ అభిప్రాయాన్ని బలపరుస్తున్నాను.'

## 15

ఇంతట్లో ఏడేళ్ల బాలిక మా హేమకుసుమ అక్కడికి పరుగెత్తుకు చక్కావచ్చింది. 'అదేమిటే అక్కా ! బావ అట్లా గట్టిగా పట్టుకుంటాడు నిన్ను ? మంచిబావ కాడు. నన్నెత్తుకుని అస్తమానం నలిపివేస్తాడు. బావతో మాట్లాడకూడ దనుకుంటాను. కాని ఎంతో మంచికథలు చెప్తాడు. నాకూ అస్తమానం బావను చూడాలనే ఉంటుంది. బావకు అమ్మ ఫలహారాలు చేసిందట. త్వరగా తీసుకురమ్మంది మీ యిద్దర్నీ.'

హేమకుసుమ ముద్దులు మూటకట్టే బాలిక. అచ్చంగా అక్కగారి పోలిక. ఆ ఈడులో శకుంతల ఎల్లాఉండేదో అలాగే అచ్చుగుద్దినట్టు హేమకుసుమా ఉన్నది. కాని మహా అల్లరిపిల్ల. తన ఈడుకు మించిన ఆలోచనలు. కొంటె మాటలు. ఎవరిని పెళ్ళిచేసుకుంటుందో కానీ, ఆ భర్తను సంతలో అమ్మకు చక్కావస్తుంది. నేనంటే విపరీతమైన ఆపేక్ష. అక్కగారిని ఒక్కనిముషం వదిలి ఉండలేదు. ఎన్నిరాత్రిళ్ళో మాదగ్గిరే పడుకొని నిద్దరోతుండేది. మా అత్తగారు వచ్చి, ఆమెను ఎత్తుకొని తీసుకువెళ్ళుతూ ఉండటం జరుగుతూ ఉండేది.

* * * *

హేమకుసుమా ! ఆనాటి దివ్య స్వప్నంలోనుంచి ఈ 1941 ఫిబ్రవరి నెల లోకి వచ్చినాము. మహాయుద్ధము లోకాన్ని భయంకర రాక్షసిలా కబళిస్తూ ఉన్నది. వేలకొలది గ్రీసువాళ్లు, ఇటలీవాళ్ళూ, ఫ్రెంచివారూ, ఇంగ్లీషువారూ, జర్మనులూ అనుదినమూ ఈ రాక్షసికి ఆహుతులైపోతున్నారు. జగత్సంహారమైన ఘోర యుద్ధంవల్లగాని మనుష్యులు తమతమ కాంక్షలకు తృప్తిఇవ్వలేరా? ప్రేమ అనేది వట్టి హుళక్కేనా ? మానవుని జీవితమంతా రక్తం పీల్చుటకేనా? ప్రేమనే పల్చనిపొర లోకాన్ని మాయచేసేందుకే కప్పుకొని ఉంటాడా మనుష్యుడు ? 'సౌందర్యోపాసి' అని మనుష్యుణ్ణి పిలవడం ఒక భయంకరమైన

అసత్యమా? నా చిన్నతనంలో జరిగిన మహాయుద్ధం కన్న ఈ యుద్ధం ఇంత భయంకరమైపోయిందేమి? మహాత్ముని పవిత్ర వ్రతము ఏనాటికైనా సఫలత పొందగలదా?

హేమకుసుమ తనతో యుద్ధం మాటే తీసుకురావద్దంటుంది. ఆడవాండ్లను శాసనసభికులుగా ఏర్పాటుచేస్తే, ఏదేశమూ యుద్ధాలలో దిగదని వాదిస్తూంటుంది. వాళ్ళు శాంతవ్రతులట. ఆనందజీవికలట. రసపిపాసలట. అట్టి వాళ్లు లోకాన్ని సౌందర్యంతో నింపుతారట. వాళ్ళ మాతృహృదయము యుద్ధపిశాచాన్ని లోకంలో లేకుండా తరిమివేస్తుందట.

తీర: హేమా! ఆడవాళ్లు కాళికా స్వరూపిణులు కూడా కదా!

హేమ: అది మీరు కవులై వ్రాసిన వ్రాతగానీ, ఎంత నీచస్త్రీ ఐనా నోటి యుద్ధములో సరిపెడుతుందిగాని కత్తిగట్టి యుద్ధంచేసే స్త్రీ ఎవత్తయ్యా త్యాగతీ!

తీరమిత్రుడు: మొన్న 'ఉమెన్' అనే ఇంగ్లీషుఫిల్ము వచ్చిందిగదా! అందులో ఆడవాళ్లు జుట్టూ, జుట్టూ పట్టుకొని దెబ్బలాడలేదుటయ్యా!

నేను: అది కథ. మనం కల్పించుకున్నది. ఆడమళయాళం స్త్రీలు యుద్ధం చేశారని, అమజాను స్త్రీలు యుద్ధంచేశారని పురాణాల్లో చెప్పుకున్నాము. అంతేనేగాని యుద్ధం అంటే ప్రీతిపొందే స్త్రీ ఉంటుందని హేమతో పాటు నేనూ నమ్మను.

వినాయకరావుగారు: నిజమేనయ్యా త్యాగతీ! మనుష్యులలోఉండే సంహార శక్తిని కాళికా స్వరూపిణిక్రింద వర్ణించాము కానీ, రక్తం కళ్ళచూచేందుకు వెరవనిది మొగవాడే! అంత కష్టంవస్తే స్త్రీ తన నాశనమే కోరుతుంది. గాని ఎదుటివాణ్ణి, తన్ను అవమానంపరిచే పురుషుణ్ణయినా, స్త్రీ నాశనం కోరలేదు. ఎంతో అవసరంవచ్చి గాని స్త్రీ కత్తిగట్టలేదు. పురాణాల్లోని సత్యభామ, ప్రమీల, కైక క్షణమాత్ర విక్రమం చూపించారు. వాళ్ళు పూజ్యచరిత్రలు. చరిత్రలో ఉండే ఝాన్సీలక్ష్మీబాయి, రుద్రమదేవి యుద్ధంకన్న శాంతమే యెక్కువ ఆశించారు.

కల్పమూర్తి: అవునండి మామగారు, అహల్యాబాయి యుద్ధంలేకుండా ఎంత ప్రేమతో రాజ్యం పాలించింది?

హేమకుసుమ: నేను ఆడవాళ్ళు ప్రపంచశాంతి కోరారన్నాను. ఆ మాత్రానికే మీరు ఆడవాళ్ళని పిరికిపందలక్రింద జమకట్ట చూస్తున్నారు. మీకెప్పుడూ మేము బానిసలుగా ఉండాలేమి?

రాజ్యలక్ష్మమ్మగారు: ఓసి వెర్రితల్లీ! నీకెందుకమ్మా పౌరుషం. ప్రేమనుకోరే ఆడవాళ్ళు బానిస లెట్లా అవుతారమ్మా!

హేమకుసుమ: ప్రేమ! తేమ! లోకంలో ప్రేమఉందంటావా? ఓ వెర్రమ్మా! మనుష్యుడు అవసరం వచ్చినప్పుడు నాలుగు తీపిమాటలు మాట్లాడుతాడు.

దానికి ప్రేమని ఓ చచ్చుపేరు పెట్టాడు. మనం అంతా పశువులం. పశుధర్మం నిర్వర్తిస్తాం.

వినాయకరావుగారు : ఏమో ! బొత్తిగా ఈకాలందానవైపోయావు. ఈ నాటివాళ్ల భావాలు మా ముసలాళ్లకేమీ అందవుగదా !

నేను : అవునండీ. వీళ్లంతా నవజవానులు. ఛల్ ఛల్ రే నా జవాన్! కత్తిగట్టు నా జవాన్ ! గజ్జెకట్టు నా జవాన్.

హేమకుసుమ : దద్దమ్మలా పడుకోకు నా జవాన్.

కల్ప : యుద్ధంవచ్చి ధనమానప్రాణాలు రక్షించుకోవలసి వచ్చినప్పుడు తప్పక స్త్రీ కత్తి పట్టవలసిందే! రష్యాలో స్త్రీలు యుద్ధానికి సిద్ధమట! కాని...

హేమ : కానిలేదు, అరణాలేదు. స్త్రీ యుద్ధంకోరదు. స్త్రీకి యుద్ధం అక్కరలేదు. కాని యింతవరకు స్త్రీని పురుషుడు అణగదొక్కి ఉంచాడు. పురుషుడు తన కామప్రీతిలో ఏవో కొన్ని అధికారాలు దయచేశాడు. ఆయన మాకు యిచ్చిన గృహాధికారం ఆయన యిచ్చిందేమిటి ? మాకు ఇవ్వక ఆతనికి తప్పలేదు. పిల్లలను కనేవాళ్లం, పెంచేవాళ్లం, వంట చేసే వాళ్లం అందుకని గృహాధికారం. లేకపోతే ఆ అధికారమూ పురుషుడే ఉంచుకొని ఉండును. ఎంతమంది పురుషులు స్త్రీలను అవమానాలు చేయలేదు ? బట్టవిప్పించి దుర్యోధనుడు అవమానం చేస్తే, జూదంలో పందెం పెట్టి ధర్మరాజు అవమానం చేశాడు. అంతే మనుష్యులు. ఏవిషయంలో నైనా స్త్రీ పురుషులు సమానులే! మేమూ యుద్ధంచేస్తాం. దేహబలం అవసరంలేని సైన్సు రోజులివి.

నేను : అవును హేమా ! నువ్వు చెప్పిందంతా నిజం. నేను కాదనను. ఒక సంగతి మాత్రం చెప్తాను. ఎవరిదోషం వారే అనుభవిస్తారు. మనం ఇంగ్లీషు వాళ్లని అని ఏలా లాభంలేదో అల్లాగే స్త్రీలు పురుషులను అని లాభంలేదు. నీలో నీరసత్వం ఉంటే రోగాలు దాపురిస్తాయి. రోగాలు అందుకే ఉన్నాయి. ఆలాగే హిందూదేశం నీరసంగా ఉండడంవల్ల యవన, హూణ, మ్లేచ్ఛ, తురుష్క, ఫ్రెంచి, డచ్చి ఆంగ్లజాతులవారు వచ్చి చేరారు. నువ్వు వారిని తరిలించేయి. ఎవరూ కాదనరు. నీలో జబ్బులిన్ని కుదుర్చుకోవూ ? అలాగే! ఆడవాళ్ళు నీరసులవడంవల్ల మొగవాళ్ళు అధికారాలన్నీ వహించారు. వారితో యుద్ధంచేయి, వారిమనస్సులు కరిగించు, వారితో సమానం అని పనిచేసిచూపు ! నీ స్థానం నువ్వు ఆక్రమించుకో !

హేమ : అదే చేసి చూపెడతాం !

నేను : ఎక్కడి మాటలు. మీ సొదర్లు మీరు వదలరు. మీ కులుకులు మీరు మానరు. మీ సొగసులు మీరు మరిచిపోరు. మీ అలంకారాలు మీరు అవతల పారవేయరు.

తీర : అలంకారాలు అడ్డం వస్తాయా ?

నేను : రావు! రావు! అలంకారం అయ్యేవరకూ అవసరాలు అగుతాయి. కాలం నిలిచే వుంటుంది!

* * *

ఈ హేమ ఆ రోజున హేమబాలికగా అల్లా అంటూంటేనే మేము మా కౌగిలింత వదలినాము. నేను హేమనెత్తి ముద్దులు కురిపించాను.

'అల్లరిపిల్లా! ఇంకో పదిసంవత్సరాలు వుండు. నీకూ ఈలాంటి కష్టాలు వస్తాయిలే' అన్నాను.

హేమ : నేను పెళ్ళి చేసుకోనుగా!

శకుంతల : వద్దే నాన్నా నీకు పెళ్ళి! మీ బావంటి మొగుడు దొరికితే ఈలాగే వేపుకు తింటాడు.

## 16

అందరి జీవితంలోనూ అంతే! మూలసూత్రం ఒకటే. నదులూ, పర్వతాలూ, సముద్రమూ జీవితయాత్రను తమ ఇచ్ఛవచ్చిన దారులకు తీసుకొని పోతవి. ఒక్కొక్క నది ఒక్కొక్క రీతిగా మనుష్యులను నడుపుతుంది. కృష్ణానది శిల్పులనది, గోదావరి కవులనది అన్నారు. పెన్నా తుంగభద్రలు విక్రమజీవన మిస్తాయట. కావేరి గాంధర్వానకు అమృతజీరలు వరమిస్తుందట. గంగానది తపస్వినిఅట. యమున భక్తిమాల.

నేను కొల్లిపరకు అనతిదూరంలో కృష్ణానది ఒడ్డున శిల్పాశ్రమం నెలకొల్పాలని నిశ్చయించాను. అందు భూమి, ఆలయాలు, విహారాలు, మందిరాలు గృహాలు నిర్మించడానికి లక్షరూపాయలు అవుతాయనుకున్నాను. అక్కడే మా మామగారి భూమి వున్నది. ఆ భూమి చక్కనితోట అవుతుంది. ఆలాటి ఆశ్రమం కలలు కంటున్నాను.

కాని ఆ కల లన్నిటికి కౌస్తుభమణి నా శకుంతల. నా శకుంతలముందు కాళిదాస శకుంతల కామధేనువు ముందు నందినీధేనువే! గౌరీశంకర శృంగం ముందు కాంచనగంగ మాత్రమే. శకుంతలకు పదహారు సంవత్సరాలువచ్చాయి. అమృతములో కడిగి తుడిచిన బంగారు కమలంలా వికసించిపోయింది. ఆమె బంగారుచాయలో పాలసముద్రంచాయ కలిసిపోయింది. ఆమె కన్నుల ఆకాశంలో స్వర్గధామాలు నృత్యాలు సల్పినవి. ఆమె పెదవుల మందారాలలో విష్ణుహాసాలంకార లీలాపద్మమధువులు చేరుకొన్నవి. ఆమె గానసుధలో సరస్వతీదేవ్యంగుళీ సంతతవర్తిత వల్లకీశ్రుతులు మేళవించాయి.

ఆమెను తేరి చూడజాలక నేను, ఆమెయెదుట మోకరించి నేను, ఆమెను హృదయాన ధరించి నేను, ఆమెజీవిత కిరీటాలంకృత సార్వభౌముణ్ణి నేను. ఆమెతో కృష్ణానదిలో నావపై విహరించాను. ఆమెకోసం చిన్న మోటారు కారు తెప్పించాను. ఆ కారులో అమరావతి, నాగార్జునకొండ, ఓరుగల్లు,

ఔరంగాబాదు, ఎల్లోరా, అజంతాలు విహరించాను. ఆమె మెచ్చిన బొమ్మ నాకు ఆశయము. ఆమె ఆనందంపొందిన పతాలు నా హృదయఫలకాన, ఆమె ఆలపించిన రాగం నా జీవిత విపంచిలో, ఆమె నడచిన నడక నా ఆత్మపథాల.

శకుంతలాదేవీ! అందాలబాలా, ఆనందదేవీ, అమరకన్యా! ఆనాడు నీకు జ్వరము వచ్చిందా! మనం దేశాలు తిరిగివచ్చిన నెలరోజులకేనా? నాకు నీ దర్శనానందంలో శతాంశం అనుభవానికి రాలేదే! నీ జన్మకాంతులు నాపై సహస్రాంశం ప్రసరించలేదే? నీ ప్రేమామృత కలశాంబోధిలో ఒక్క కణము నా జన్మలో ప్రసరించలేదే? ఇంతలోనేనా నువ్వు జ్వరతల్పం అధివసించావు దేవీ! నీ భక్తునిపై, నీ సేవకునిపై, నీ స్నేహితునిపై, నీ భర్తపై నీలోని భాగానిపై, అప్పుడే విరక్తివచ్చిందా దేవీ! దేవీ! నా ఆత్మేశ్వరీ! నా ముక్తీశ్వరీ!

అది టైఫాయిడ్ జ్వరమట! ఎక్కడనుంచి వచ్చిందా జ్వరం? అది మృత్యుకీలగాని జ్వరంకాదట! ప్రపంచంలోని వైద్యులందరూ నీకువచ్చిన జ్వరాన్ని తగ్గించలేకపోయారా? మదరాసు వైద్యవృషభులు పెదవులు విరిచారా? నువ్వు ఏమైపోయినావు?

మా శకుంతల వెళ్ళిపోయింది. తపస్సుచేయగా ప్రత్యక్షమైన దేవి వర మీయకుండానే అంతర్థానం అయిపోయింది.

ఏమిజరిగింది? మా యింట్లోలేదా? ఆమె పుట్టింటికే వెళ్ళలేదా? వైద్యాలు హుళక్కా? మంత్రాలు చచ్చుమాటలా? మొక్కుబళ్ళు మొరకు తనాలా? దేవుళ్ళు రాళ్ళా? లోకంలో ధర్మంలేదా? నేను ఎవరికీ మాటలో నన్నా కష్టం కలిగించి ఎరగనే! నాకున్నవి ఉత్తమ ఉద్దేశాలే! నా దివ్యమూర్తి ఏమయింది? చిన్ననాటినుంచీ నన్ను తననీడలో పెంచుకొన్న నా తేజస్విని ఏదేశంపోయింది? ఎందుకీ సూర్యుడు? సన్యాసి సూర్యుడు! ఎవరికి కావాలి ఎండ?

ఇది నా యిల్లా? ఈమె నా అమ్మా? మీ రెవరు? నా శకుంతల తండ్రే! అయ్యో మహాభాగా! నీ కడుపున ఉద్భవించిన అమృతకలశాన్ని ఎవరు ఎత్తుకు పోయారు? గరుత్మంతుడా? రాక్షసుడు! పిశాచి, నరహంతకుడు! నేను తపస్సు చేసి సంపాదించిన వరం. ఏదీ! ఎవరుతీసుకొన్నారు? నా వరం నాకివ్వండి. నా వరం! నా జీవిత పరమావధి! నా సర్వం. నా...నా...

* * * * *

ఓ హేమదేవీ! ఈ నా కథ నీకోసం రాస్తున్నా. నువ్వు చదివేరోజు వస్తుంది. నీతో సహవాసంచేస్తూ నిన్నుగమనిస్తూ, రోజూ నా కథ రాస్తున్నాను. చివరదాకా చదివిందాకా నన్నుగురించి అభిప్రాయాలేమీ నిర్మించుకోకు. ఆ రోజు రాగానే నీ చేతికి ఈ గాథ వస్తుంది. అంతా చదివి నన్ను అర్థంచేసుకో.

నేను శ్రీనాథమూర్తిని. నేనే త్యాగతిని. త్యాగతి పేరేమిటి? ఎందుకా పేరు నాకు వచ్చింది? ఎవరిచ్చారు? ఎందుకు నీతో మొదటినుంచీ

నా నిజకథ చెప్పలేదు? ఇవన్నీ నీకు మనవిచేసేరోజు ఇది. నువ్వు నా శకుంతలకు చెల్లెలివి! నా శకుంతలా, నువ్వూ ఏకగర్భజలు. ఎంతచిత్రము! నా దుఃఖాన్ని నువ్వు ఊహించలేవు. నేనుమాత్రం ఇప్పుడు ఊహించుకోగలనా?

నేను నాదేవి వెళ్ళిపోయినతర్వాత పదకొండురోజులు స్పృహలేక జీవచ్ఛవంలా ఉన్నాను. ప్రాణంపోలేదు. నన్ను కారుమీద వేసుకు డాక్టర్లు ఆమంచర్ల చలపతిరావుగారు, గోవిందరాజుల సుబ్బారావుగారు తెనాలిచేర్చారు. అక్కడ ఒక మేడలో పెట్టారు. మా అమ్మనూ నాతో వైద్యానికి తీసుకువచ్చారు. ఆమెకు నాదేవి అంతర్థానమైన రోజునుంచే మూర్ఛ పట్టుకుంది. ఆమెకు తిండిలేదు. సర్వకాలం కళ్ళవెంట నీళ్ళు. మా కిద్దరకూ పరిచర్యకు మా అక్కగార్లిద్దరూ వచ్చారు.

## విష్కంభము

ఇంతవరకు ఆ వ్రాతపుస్తకం చదివేటప్పటికి హేమకుసుమ వెక్కివెక్కి ఏడుస్తూ సోఫామీదనుంచి లేచింది. తూలుతూ వెళ్లి మంచంమీదవాలిపోయింది. చిన్ననాడు సంభవించిన అక్కగారి అకాలమరణ కథఅంతా కళ్లకుకట్టిపోయినది. అక్కగారిని తాను చిన్ననా డెంత ప్రేమించినది! ఆ ప్రేమ పరిమళాలు ఈనాటివరకూ తన జీవిత పథాలన్నీ ఆక్రమించలేదా? ఆమె తన కెప్పుడూ దేవబాలికలానే మనఃపథాల ప్రత్యక్షమవుతూ ఉండేది. ఆమె దుఃఖము భరించలేకపోయింది. కన్నీళ్లు అఖండధారలైనవి. గుండె బరువెక్కినది. 'అబ్బా' అని ఆమె దుఃఖించింది. 'అక్కా! ఎక్కడికి పోయావే' అని రోదించింది.

ఈబాధ భరించలే ననుకొంది. తన గదిలో ఉన్న విద్యుత్ ఘంటికకు మీట నొక్కినది. ఆగంట పరిచారికగదిలో మోగింది. ఆ అమ్మాయి పరుగెత్తుకొని వచ్చింది. తలుపు ఏలాగోతీసి హేమకుసుమ మళ్ళీ మంచంమీద వాలింది.

'ఏమిటండి అమ్మా! ఎందుకు అలా ఉన్నారు?' ఆ కొల్లిపరనుంచి చిన్నతనంలోనే వీళ్ళతో మదరాసు వచ్చిన ఆబాలిక అడిగింది.

'త్వరగా......వెళ్ళి......లోకాన్ని......తీసుకురా!'

ఆ పనిగత్తె పరుగెత్తి వెళ్ళి అయిదు నిముషాలలో లోకేశ్వరిని తీసుకువచ్చింది. లోకేశ్వరి రాగానే హేమ ఆబాలికను గట్టిగా కాగిలించుకొని ఇనుమడించిన దుఃఖంతో వణికిపోయింది.

హేమ్! ఏమి టా ఏడ్పు? మతిపోయిందా? మీఅక్క చనిపోయి పదకొండు ఏళ్ళయింది.'

'...............'

'నీ సితికి అర్థం ఉందా? ఇది హిస్టీరియాగాని ఇంకోటికాదు. ఇంత నీరసురాలి వయ్యావేమిటి? ఇంతకన్న అవమానం ఇంకోటివుందా? పుస్తకం

చదువుతూ అంత ఏడుస్తారా ఎక్కడన్నా! లే, కళ్లు తుడుచుకో. నేను ఈ రాత్రి నీ దగ్గరే పడుకుంటాను.'

'లోకం, త్యాగతి మా బావ. మా అక్క ఎంత,.........'

'మీ అక్క దేవత. పదిహేనురోజులక్రిందట ఈ పుస్తకం త్యాగతి నాచేతి కిచ్చాడు. అందులో చదివిన విషయాలు ఎవ్వరికీ చెప్పవద్దన్నాడు. నేను చదివి పొందినబాధ, దుఃఖము వర్ణించలేనిది. హేమా మనం చదువుకొన్న వాళ్ళం. మనకూ మూర్ఖునికీ కూడా దుఃఖం ఒకటే! అయినా మనం దిగమింగి లోపల కుళ్ళుతాం. వాళ్ళు పైకి ఏడ్చి బాధనుండి విముక్తులవుతారు. అంతే తేడా! నీ దుఃఖం పవిత్రమైంది. నువ్విలా ఏడ్వడం మంచిదే. కాని దుఃఖాన్ని కూడా మనం సాక్షులమై దర్శించాలిగాని, మనంకూడా దుఃఖంలో భాగమైతే ఇంకేముంది? లే! కాఫీచేసి తీసుకురానా ?'

'నేనూ వస్తాను వంటింటికి పద.'

హేమ లోకేశ్వరిని కాగిలించుకొనే వారిద్దరూ వంటింటిలోనికి వెళ్ళారు. హేమకు కంటెదుట ఆమె అక్క కనుపించింది. ఆమె చిన్ననాడు తనపై చూపిన గంభీరప్రేమ కళ్లగట్టింది. 'అక్కా! నువ్వు ఎందుకు బ్రదకలేదు. నీ కిప్పుడు ఇరవైఆరు సంవత్సరాలు ఉండిఉండును. నీ బిడ్డలు పరమ సౌందర్యమూర్తులుగా ఉందురు. నీ ప్రేమలో నేను ఎన్ని జీవితరహస్యాలు తెలిసికొని ఉండేదాన్ని' అని హేమ అనుకొంటూ కన్నీటివెల్లువ తుడుచుకొంటూనేఉంది. లోకేశ్వరి వెనక్కు తిరిగి చూస్తూనే కళ్లనీళ్లు తుడుచుకుంటూ కాఫీ తయారుచేసి హేమకు ఒక కప్పు ఇచ్చింది. ఇద్దరూ చెరోకప్పు కాఫీతాగి మళ్లీ పడకటింటిలోకి వచ్చారు. అక్కడ క్రిందపరచిన తివాసీలపై పరిచారిక పడుకొని నిద్దురపోయినది.

ఒకరి దుఃఖం ఇంకొకరి కేమి అర్థమవుతుంది! ఆమెకు యజమానురాలి ఆవేదన ఆశ్చర్యం కలిగించింది. ఆ తర్వాత సానుభూతి నాళాలు స్పందనం కాగా కళ్ళనీళ్ళు పెట్టుకుంది. అది మానవసహజం. లోకేశ్వరి విద్యుద్దీపం చిన్నది వెలిగించి, పెద్దది ఆర్పి, పరిచారికను లేపి, వెళ్ళి పడుకోమని చెప్పి, తలుపు వేసి, పందిరిమంచంపై హేమపక్కను పండుకొని ఆమెను గట్టిగా హృదయాని కదుముకొంది. హేమకు నిద్రపట్టదు. లోకేశ్వరికి నిద్రపట్టదు. వారేమీ మాటలాడుకొనలేదు. గంటకు లోకేశ్వరికి నిద్రపట్టింది.

త్యాగతి, శ్రీనాథమూర్తి, తనబావ. తన అక్క ఎక్కడవుంది? అంత వరకు అక్క బ్రతికిఉన్నట్లు, తాను చిన్నబిడ్డ అయినట్లు హేమ భావిస్తూ ఆనందపడింది. ఒకనాడు మాయమైన ఒక అనుభూతి మరలివచ్చి, మరల మాయమైంది. నెమ్మదిగాలేచి సోఫామీదకు పోయి త్యాగతి పుస్తకం తెరచి అక్కగారి బొమ్మను కళ్ళకద్దుకొని తిరిగి కథ చదవటం ప్రారంభించింది.

## 17

నాకు ప్రాణంమీదకు వచ్చిందని మా మేనమామ కస్తూరి రఘురామయ్య గారు కుటుంబంతో వచ్చి వాలారు. మా అమ్మగారికీ పోయేప్రాణం వచ్చే ప్రాణం. కొల్లిపరలో మా అత్తగారు మూడురోజులు ఏమీ స్మారకంలేకుండా పడిఉన్నారట. మా మామగారు వేదాంతి. సర్వ సముద్రాలుగా పొంగివచ్చిన దుఃఖాన్ని అగస్త్యుడులా మింగివేసినారు. లోకులను దహించివేసే దుఃఖాన్ని శివుడులా కంఠంలో దాచుకొన్నారు. నడపవలసిన తంతు నడిపినారు. కంటనీరు లేదు. కీళ్లు పొదిగించిన కొయ్యబొమ్మ. కాని భోజనంలేదు. మూడురోజులలో నల్లగా ఉన్న ఆయన జుట్టు తెల్లబడిపోయింది. బుగ్గలు వాలిపోయాయి. ఒళ్ళంతా సడలిపోయింది. కళ్లు గుంటలు కట్టినాయి.

మా అత్తగారి పుట్టింటివారు, ఇంకా దేశంనిండా ఉన్న సర్వబంధువులు వచ్చి వాలారు. కోటీశ్వరశర్మ, శాస్త్రిగారు వచ్చారు. ఆయన వేదాంతం కురిపించారు. ఎవరు ఏమిచెప్పినా మామగారికి ఏమీ వినిపించలేదట. కుమార్తె ఆఖరుక్షణాల్లో 'నాన్నా నేను వెడుతున్నాను. మీ—అ—ల్లు—ణ్ణి——సర్వ—కా లా లు —కనిపెట్టి—ఉండండి—నేను మళ్ళీవస్తా—నేను—పూ ర్తి గా వెళ్తున్నానా—ఇక్కడే—ఉంటాను—ఆ—య—న్ను—మీకు—కో—డు—కు. అ—మ్మ—దుఃఖం—వ—ద్దు—చెల్లె—కా—పా—డు—ఆ—య—న--పాదజలం —ఇ—వ్వం--డి—పు—ణ్యం—నా—కు—' అని, మంచంమీద కొయ్యై స్పృహ ఏమీ లేని, నా చేయితీసుకొని కళ్ళకద్దుకొని 'దేవీ...వస్తు...న్నా!' అని మాయమైన విషయమే ఒక్క లిప్తవ్యవధైనా లేకుండా ఎదుట కనబడుతో ఉండేదట ఆయనకు. ఒక్క పరమ సుశీల లోకాన్ని వదలి మా అందరి ప్రాణం తనవెంట రాబోతే ఆపుచేయించింది కాబోలు.

మా వైద్యులు, నాకాంతి దేవత ప్రాణం కాపాడలేనివారు నా ప్రాణం మా అమ్మ ప్రాణం, మా అత్తగారి ప్రాణం కాపాడారు. నాకు ప్రాణం మీదకు వచ్చిందంటే, మా అమ్మ బ్రతికింది. హేమ తల్లిదగ్గరకు పోయి, 'అమ్మా అక్కతోబాటు నువ్వూ వెళ్ళకే. నే నెల్లాగ! అమ్మా, అమ్మా' అని అంటే మా అత్తగారు బతికింది.

నేను మొండివాణ్ణి, తుచ్ఛుణ్ణి. పాపిని, నాకు ప్రాణం ఎందుకుపోతుంది! నాలో విషబీజాలు ఉండడంచేత, పరమపవిత్ర చరిత్ర నా శకుంతల వెళ్ళిపోయింది. నే నామె సంపర్కంవల్ల పవిత్రుణ్ణి కాలేనంత పాపిని అవడంవల్ల నా శకుంతల వెళ్ళిపోయింది.

నాకు కొంచెం తిరిగినడిచే ఓపిక వచ్చేటప్పటికి మూడునెలలు పట్టింది. మళ్ళీ కొల్లిపర మొన్న మొన్నటివరకూ వెళ్ళలేదు. ఎంతమంది బతిమాలినా

వెళ్ళలేదు. నేనూ నా ఉజ్వల సౌందర్యదేవీ విలాసాల జీవించిన ప్రదేశం ఆమె లేకుండా ఏలా వెళ్ళగలను?

మా అమ్మపేర పదిహేనెకరాల సుక్షేత్రం రాశాను. ఇల్లు వ్రాశాను. మా అక్కగారి దగ్గర చెరొక పది ఎకరాల భూమి వ్రాశాను. శకుంతలపేరున ఒక మహిళావిద్యాలయం పెట్టడానికి ఇరవై ఎకరాల భూమివ్రాశాను. మిగిలిన పదెకరాల భూమి అమ్మి ఆ ఇరవై వేలు మా అమ్మగారి పేరున బాంకిలో వేశాను. బాంకిలో నా సొమ్ము పద్దెనిమిదివేలు పెట్టబోయే మహిళావిద్యాలయానికి భవన నిర్మాణానికి ఇచ్చాను.

ఇవన్నీ అమలులోకి రావడం పదేళ్లైనవెనక. అందాకా నా మేనమామను, నా స్నేహితుడైన డాక్టరు సుబ్బారావుగారిని, తెనాలిలో పెద్ద వకీలైన వెంకట్రామయ్యగారిని ట్రష్టీలుచేసి ఆస్తి పెంచవలసిందని ఆదస్తావేజులో రాసి, ఎవ్వరికీ తెలియకుండా రిజిష్టరుచేసి, మిగిలిన తొమ్మిదివేల ఆరువందల రూపాయలు చేతులో పట్టుకొని కాశీ మా అమ్మతో వెళ్ళిపోయాను.

మా అమ్మగారికి పుట్టింటివారూ, మా అమ్మమ్మ ఇచ్చిన ఆస్తి పన్నెండెకరాల సుక్షేత్రమైన మాగాణి ఉంది. ఆరోజులలో సాలుకు పది పన్నెండు వందల ఆదాయం వచ్చేది.

కాశీ వెళ్ళాము. మా అమ్మ ఏమీ అనలేదు. నేనేదిచెపితే అదేనన్నది. కాశీలో ఊరుచివర ఒకచిన్న బంగాళా నల్భైరూపాయలకు అద్దెకు తీసుకున్నాను. మా బంగాళా విజయనగర భవనానికి కొద్దిదూరంలో ఉంది. నాకు స్నేహితు లవసరంలేదు. నాకు చుట్టాలు అక్కరలేదు. నాకు పుస్తకాలు వద్దు. కళవద్దు, నాకు భగవంతుడువద్దు. భక్తి అక్కరలేదు. భగవంతుడు? ఎవ్వరీ భగవంతుడు? ఎక్కడ? పరమాత్ముడట? దీనజనరక్షకుడట? కరుణామయుడట? ఆపద్బాంధవుడట.

హా! హా! ఏమివెఱ్ఱి మనవాళ్లకు? భగవంతుడెవడు? మనందరిపైన ఓ పెద్ద అధికారా? ఇప్పుడు చేసిన తప్పులకు ఇప్పుడే కష్టపెడితే అనుకోవచ్చు. ఎప్పుడో కొన్ని జన్మలక్రింద చేసిన తప్పుకు ఇప్పుడా మనల్ను శిక్షించడం? ఎంత మంది అలాంటి అధికారులు? ముస్లింలకు ఒకరు, క్రైస్తవులకు ఒకరు, బౌద్ధులకు ఇంకొకరు, హిందువులకు కోటిమంది! ఎందుకీ పాడుదేవతలు, దెయ్యాలు.

దేవతలు వేరు. దేవుళ్ళు వేరు. వేదాంతుల దేవుడు ఏమీ చెయ్యలేని బ్రహ్మపదార్థము! మనకర్మ మనమే అనుభవించవలసి వస్తే మనకు తెలిసే అనుభవించే శిక్షకరం ఉంటుంది. ఒకణ్ణి చంపితే చంపినవాణ్ణి ఉరితీస్తారు. అదీ శిక్ష. దొంగతనం చేస్తే ఖైదువేస్తారు. అనంతమైన కాలంలో, సృష్టిలో కోటికోటి సంవత్సరాలు పురుగైతేనేమి, పుడకైతే నేమిటి?

నా దేవిని బ్రతికించలేని దేవుళ్ళు నా కెందుకు? నిజమైన ఆనందం చూచి ఓర్వలేని దద్దమ్మలు లోకాలను ఏలుతున్నారు. మనుష్యునికి మూఢత్వ మెందుకు? ఎందుకీ లక్షలకొలది గుళ్ళు గోపురాలు? క్షేత్రాలు, తీర్థాలూ! ఎందుకీ మొక్కుబళ్లు, నిలువుదోపిళ్లు? యాత్రలెందుకు? పవిత్రనదుల స్నానాలట! స్నానాలు మురుగుగుంటలో చేయకూడదా!

నా హృదయంలోని నీరసాలు పోయాయి. నా దేవుళ్ళు నా శకుంతలతోనే పోయారు. వాళ్ళమీద యుద్ధం ప్రకటించాను. నాకు వాళ్ళతో నిమిత్తం ఏమిటి? భక్తట! ఓహో! మెదళ్ళలో రాళ్ళుపాదిగించుకొని, భక్తని బయలుదేరే చచ్చుదద్దమ్మలకు బుద్ధి చెప్తా! ప్రపంచంలో న్యాయం మోక్షం కోసం కాదు. నా పళ్ళు బిగించి, నా గుప్పిట్లు ముడిచి దేవుళ్ళరాజు విశ్వేశ్వరుడుమీద మొదటి యుద్ధం ప్రారంభించాను.

## 18

శకుంతలాదేవి, నీవు నాకు లేకపోయినావు. ఎక్కడకు పోయినావు? ఎక్కడకు పోయావు దేవీ? నిన్ను గాఢంగా కౌగిలించుకున్నప్పుడు నాకెంత ఆనందం కలిగేది? ఎంత విచిత్రానందం! ఎన్నిరకాల కౌగిలింతలు చూపావు నాకు? ఒకరోజున వెనకనుంచి వచ్చి కన్నులు మూశావు. నా కన్నులు కప్పిన ఆ పూవుల మెత్తందనాన్ని కర్కశం చేశానా నేను? అవి చేతులా దేవీ? పారిజాతాపహరణంలోని పద్యాలకు స్నిగ్ధత్వం లాలిత్యం నేర్పే అద్భుత రూపాలు కావా? నా వీపుమీద వాలిన నీ ఉరోజస్పర్శామృతము నా ఒంటికి వివశత్వం కలిగించలేదా? నా మెడచుట్టూ చేతులు చుట్టావా శకుంతలా?

ఒకనాడు నిద్రపోయినట్లు నటించి, నేను నీమీద వాలినప్పుడు నా కన్నులు మూసి, నా తల నిమిరి, నా నొసట ముద్దిడినావా? అది వట్టి చుంబనమా? జీవితం కూలంకషంగా కదిపివేసే పరమ వరప్రసాదంగాని. నేను సోఫామీద కూర్చుని బొమ్మల పుస్తకం ఒకటి చూస్తూఉంటే, నా ఒళ్ళోవాలి ఒదిగిపోయి, నా హృదయాన నీ మో మదుకొని, నా విశాలవక్షంలో నీ మోము తిప్పుతూ పుణికినావే! ఆనాడు నేనే మైపోయాను? ఆనందమే క్షీరమైతే, ఆ క్షీరం మథించిన నవనీతం కడుపార సేవించిన శ్రీకృష్ణుణ్ణేనా నేను!

శకుంతలా రాజ్ఞీ! నా హృదయం నీ హృదయంలో గాఢంగా అదుముకొని నిద్రపోయేదానవు. నిద్రలోనైనా అటుతిరగడానికి వీలులేక పోయేది. నీవు కదలక చిన్నపాపవలె గాఢనిద్ర పోయేదానవు. నేను కొంచెం కదిలితే, ఆ నిద్దర్లోనే నన్ను అల్లుకు నేదానవు.

నీ కళ్ళల్లో కళ్ళుపెట్టి ఎన్నియుగాలు చూచినా తృప్తితీరుతుందా దేవీ? ఆ కళ్ళ అందాలు వర్ణించగలనా? కాటుకకళ్లు ఎంత వెడల్పు అవి? ఆ వెడల్పుకు తగిన కనీనికలు. ఆ కనీనికలలో ఎంత లోతులు, ఎంత గాఢనీలాలు! అరమూత

లతో చెన్నారే ఆ కళ్ళు దూరాననుండిమాత్రం దర్శింపగలిగేవాణ్ణి. కన్నులు నావైపు తిప్పి నా శకుంతల నన్నుచూస్తే, నేను ఎదురు చూడలేకపోయేవాణ్ణి. ఆమె కన్నులు బొమ్మలలో వేయగలిగిన చిత్రకారుడు లేడు. మొలేరాం కాని, అజంతా చిత్రకారులుగాని ప్రయత్నించినా వాని అందాలలో ఒక అంశ మాత్రం చిత్రించగలరో లేదో!

మా ఆనందంలో దేహవాంఛ లేదనను. సాకు పూర్తిగా ఉంది. కాని దేహాతీతమైన ఏదో మహత్తరానందము నన్నారోజులలో ముంచెత్తేది. నాలోని ప్రతి అణువు పులకరించిపోయేది. ఆమెపై కామవాంఛ లేకుండానే నేనామె ఎదుట ఉంటేనే చాలనిపించేది. ఆమె దేహసౌందర్యము తనివోవచూచి ఆ అనుభూతిమత్తతతో మైమరచేవాణ్ణి. ఆమె నా ఎదుటే అలంకరించుకోవాలి. ఆమె సిగ్గుతో కుంగిపోయేది. 'ఈలాంటి వేళలలో మీరు నాకు కొత్త అవి కాదండీ' అని శకుంతల అనేది. ఆమెకు సిగ్గుమాత్రమే! నిలువుటద్దం ఎదుట ఆమెనూ, గ్రీకువీనసు విగ్రహాన్నీ నిలుచుండబెట్టితే వీనస్సే తేలిపోయేది.

ఆమె చెవులు, ఆమె భుజాలు, ఆమె నడుం, ఆమె జఘనము, ఆమె పాదద్వయం ఊహించుకోలేని పరమమూర్తిత్వంలోని దివ్యక్రతువులే! ఇవన్నీ నాకు సన్నిహితంగాలేని ఒక క్షణంలేదు. రాత్రిళ్లు నాకు నిద్రలేదు. నా ప్రక్కలోని సర్వలోక నిధి ఏదీ? ఆమె నా ప్రక్కనే ఉందనుకొని, గుండె నీరయి, నీరసపడి, కన్నీరుమున్నీరై వెక్కి వెక్కి ఏడ్వలేక, అసురసురయిపోతూ ఉండేవాణ్ణి. ఎవరు నా దుఃఖము తీర్చేది? నా శకుంతలే నా దుఃఖము తీర్చగలదు! మనుష్యులు మరల బ్రతికివస్తారా? ఆమె దేవతై నా దగ్గిరకు రాకూడదా? ఆమె ఆత్మ నా కౌగిలింతలో ఇమడకూడదా ?

ఆమె నా దగ్గిరకు వచ్చినట్లు భావించుకొని ఒళ్లు ఝల్లుమని, ఆమెను ఆ భావంలోనే బిగియార కౌగిలించుకొని మోము నా మోముకు చేర్చి, ఎఱుపు వెన్నెల పూవులైన తీయపెదవులను గాఢంగా ముద్దుపెట్టుకొనేవాణ్ణి. ఆమె చీరలు, రవికలు, బాడీలు, లో పరికిణీలు, వల్లెలు, నగలు బీరువానుండి తీసి పెట్టెలలో సర్ది వెంట తీసుకువచ్చాను. ఆ చీరలు నా హృదయానికి అదుముకొనేవాణ్ణి. అవే గాఢంగా కౌగిలించుకొని పడుకునేవాణ్ణి! ఆ రవికలపై ముద్దులు కురిపించేవాణ్ణి. ఆ నగలు తలపై ధరించేవాణ్ణి. ఈ కర్మకాండ ఇంటి దగ్గిర ఉన్నంతసేపూ జరిగేది.

ఏడ్చిఏడ్చి సొమ్మసిలిపోయేవాణ్ణి. నా ఏడ్పుకు నేను అడ్డురాలేదు, నన్ను నేను సమాధానం పెట్టుకోదలచుకోలేదు. ఏడ్చి ఏడ్చి ఏడ్చి ప్రాణం పోవాలనే ఆశించాను. పోతుందనుకున్న ముహూర్తాలూ ఉన్నాయి. అప్పుడు వికటానందం పడి, 'మృత్యుదేవీ! రా' అని అరచాను.

శకుంతలా! ఇవి నీనగలు, ఇవి నీచీరలు, ఇవి నీరవికలు. ఏమి చెయ్యను వీనిని! నీతో నన్ను ఎందుకు సహగమనం చేయనియ్యలేదు? ఈ చీరలతో నగ

లతో సహగమనం చేయకూడదూ? ఇవన్నీ పోగుచేసి కిరసనాయిలులో తడిపి వానిని నా గొంతుకవరకు పేర్చుకొని, ఒక్క అగ్గిపుల్ల వెలిగించుకోగూడదా, అని ఆ ప్రయత్నం ప్రారంభించాను. ఛా, ఆమె చీరలు నా అపవిత్రదేహంతో ఎందుకు దహించుకుపోవాలి? అని ప్రశ్నించుకొన్నాను. ఒక చీర చాలు! అంతా సిద్ధం చేసుకున్నాను.

## 19

పాతగుడ్డలూ, కొన్నిదుప్పట్లూ పోగుచేశాను. వాని నన్నిటినీ కిరసనాయిలులో తడిపినాను. నాచొక్కా, నాపంచె కిరసనాయిలులో తడిపినాను. అన్నీ సిద్ధపరచి, గదిలో వస్తువులన్నీ అంటుకునే ఏర్పాటుచేశాను. ఉత్తరాలందరికీ రాశాను. మాశకుంతల ఫొటో ఒకటితీసి గంటలకొలదీ హృదయాని కద్దుకుని నా చదువుగదిలో కూర్చున్నాను.

శకుంతలా! నాప్రేమ నీచమైంది కనక నీతో రాలేకపోయాను! ఒకరో ఇద్దరో తప్ప మనుష్యులలో ప్రాణప్రియవెంట ప్రాణమువదలిన వారెవరు? మగవాళ్ళకు ప్రేమతక్కువ. మగవాళ్ళు కర్కశహృదయులు. మగవాళ్ళు రాక్షసులు. నా శకుంతలను వదలి ఇన్నాళ్ళు బ్రతికి ఉండగలిగిన నేను పరమపాపిని.

నా పళ్ళుబిగించుకొన్నాను. కళ్ళు జేవురించాయి. మనస్సు నిశ్చలం చేసుకున్నాను. ఆ ఫోటోతో జేబులో అగ్గిపెట్టెతో మేడమీద నా సహగమన మందిరానికి వెళ్ళడానికి హాలులో మెట్లదగ్గిరకు పోయాను.

ఇంతలో వంటింటిలోంచి మా అమ్మగారు వచ్చి 'నాయనా' ఈరోజు కూరలేమీ తెప్పించలేదేమీ బాబూ! ఏమిచెయ్యమన్నావు తండ్రీ!' అన్నది.

'నాకు ఆకలిలేదమ్మా! సాయంకాలం తెస్తాను. అప్పుడు కూర వండ వచ్చునులే!' అని మెట్లెక్కిపోయాను. నా సహగమనపు గదిలోకి వెళ్లాను.

ఇంతలో నావెంటనే మా అమ్మగారు కూడా వచ్చి, గది ప్రవేశించింది. అంతా కలయచూచింది. 'నాతండ్రీ, ఇదేమిరా బాబూ!' అని మూర్ఛలో విరిగి పడిపోయింది.

నేను తెల్లపోయినాను. వెంటనే ఆమె కడకు ఉరికి ఆమెను లేవనెత్తి, గబగబ మేడహాలులోనికి తీసుకువచ్చి పనిమనిషిని పేరెట్టి పిలిచాను. 'నీళ్ళు, నీళ్ళు!' అని కేకవేశాను. మాతో కొల్లిపరనుంచి వచ్చిన పనిమనిషి నీళ్ళు పట్టుకొని పరుగెత్తికొని వచ్చింది.

కాశీలో చాలాకాలంనుంచి ఉన్న ఒక తెలుగుబ్రాహ్మణ యువకుని, సహాయంగా ముప్పదిరూపాయలు జీతంయిచ్చి ఏర్పాటుచేశాను. ఆ అబ్బాయి మేడమీదకు పరిగిడి వచ్చాడు. అతన్ని 'డాక్టరు' అని కేకేసి చెప్పాను. అతడు వెంటనే పరుగెత్తిపోయినాడు. ఈలోగా నీళ్ళుపెట్టి నుదురూ, తల తడుపుతూంటే మా అమ్మకు మెలుకువ వచ్చింది. ఆమె మాటాడలేక పెదవులు

వణికిపోగా నాచేయి ఘట్టిగా పట్టుకొని, మళ్ళీ మూర్ఛపోయింది. గురక, నోటి నురుగు, చేతుర్లు కొంకర, పళ్లు బిగిసిపోయాయి.

అయ్యో మాతల్లి ప్రాణంవిడుస్తుందా? అమ్మా! ఎంతటి ఛండాలపు కొడుకును కన్నావు? గుండె దడదడమంటూ, కళ్ళనీరు కారిపోగా డాక్టరుగారి కోసం ఎదురుచూస్తున్నాను. నీళ్ళతో మా పనిపిల్ల అమ్మ తలతడుపుతో నేఉంది.

ఇంతట్లో కారుచప్పుడైంది. డాక్టర్ను వెంటబెట్టుకొని గంగాధరుడు వచ్చాడు. నేను వణికిపోతూ అమ్మవిషయం చెప్పాను. నా కిరసనాయిలు గదిసంగతి చెప్పలేదు. ఆయన పరీక్షచేశాడు. ఏదో మందుగొట్టంతీసి ఇంజెక్షను ఇచ్చాడు. ఒక చిన్నగొట్టం బద్దలుకొట్టి ముక్కుకడ వాసన చూపించాడు. అమ్మ మళ్ళీ కళ్ళు తెరిచింది.

'అమ్మా డాక్టరుగారు వచ్చారు, నీకు ఇంజెక్షను ఇచ్చారు. నేను నీకు నా శకుంతల సాక్షిగా, నువ్వనుకున్నపని చేయనని ఒట్టు పెట్టుకుంటున్నా అమ్మా!' అన్నాను.

డాక్టరుగారు నన్నుచూచి, ఇంగ్లీషులో 'ఏమయ్యా మీ అమ్మగారికి హృదయం చాలా నీరసంగా ఉంది. అది తాత్కాలికమే. నాలుగురోజులు జాగ్రత్తగా ఉండాలి. రెండు మూడు ఇంజక్షనులు ఇస్తాను. మందుకు సీసా పంపించండి' అన్నాడు. మందుకోసం ఆయనవెంటే మా గంగాధరుడు వెళ్ళినాడు.

మాఅమ్మ ఎదుటే నీళ్ళబాల్చీ తెప్పించి కిరసనాయిలు గుడ్డలన్నీ నీళ్ళలో వేశాను. మా అమ్మకు బాగా కులాసా చిక్కేవరకూ నేను కొంచెం ఎచ్చుతగ్గుగా సర్వకాలాలూ, ఆమెదగ్గిరే ఉన్నాను. కిరసనాయిలు బట్టలన్నీ పదిసార్లు సబ్బునీళ్ళల్లో ఉతికించి, బాగుచేయించి, చాకలివానికి వేశాను.

మా అమ్మ పదిరోజులైన వెనుక నన్నుపిలిచి, 'నాయనా, నిన్నుచూసుకునే ఇన్నాళ్ళు బ్రతికి ఉన్నాను లేకపోతే మీ నాయనగారు పోయిన వెంటనే నాప్రాణాలు పోయిఉండేవి. శకుంతలకు నువ్వు ఈలాంటి దుర్మరణం పాలవడం ఇష్టమౌతుందనా? ఇక నేను నిన్నెలా నమ్మను తండ్రీ!' అని కళ్ళ నీళ్ళతో అన్నది.

'అమ్మా నాలో మండిపోతున్న దుఃఖం కొద్దీ ఏ పిచ్చిపనులన్నా చేస్తానేమో కాని, నాప్రాణంమాత్రం తీసుకోను. నీపాదాల సాక్షి, నాన్నగారి స్మృతి సాక్షి, శకుంతల మృతిసాక్షి!'

'సరే నాన్నా! మనస్సుమాత్రం కుదుటబరుచుకోవద్దూ? అడదాన్ని నేను మీ నాన్నగారు వెళ్ళిపోయిన వెనుక నీకోసం కదా బ్రతికిఉంటిని. నాయనా చచ్చిన వాళ్ళతో చస్తామా? అయితే ప్రపంచం అంతా ఇదివరకే నాశనం అయిపోయి ఉండునుకదా? ప్రేమలు లేకే ప్రజలు బ్రతికి ఉన్నారా? ఎంతప్రేమైనా, బ్రతికి ఉన్నవారి విషయంలోనే, మనధర్మం పాలించవద్దా

నాన్నా! ఏదో వ్యావర్తులు పెట్టుకో! కాశీవచ్చింది మరికాస్త గుండె బద్దలు కొట్టుకోడానికనా?' తలవాల్చికొని 'అమ్మా నన్ను నమ్ము' అన్నాను.

## 20

కాశీపట్నం విచిత్రంగానే ఉంటుంది. పట్నంలో ఒక వీధీ పెద్దది కాదు. అన్నీ వంకరటింకర గల్లీలే. గంగానదీతీరం పొడుగునా అన్నీ గల్లీలే. గంగానదీతీరం పొడుగునా అన్నీ స్నానఘట్టాలే—దశాశ్వమేధం, కేదారం, మణికర్ణిక, హరిశ్చంద్ర అంతటా వేలకొలది మెట్లు. గంగానదికి వానకాలంలో వరదలు. వేసవికాలంలో వరదలు. శీతాకాలంలో మాత్రం నీరు నీలంగా ప్రవహిస్తుంది. ఇదివరకు నా నమ్మకాలన్నీ మరిచిపోయాను. ఈనాడు నేను నాకే వేరయ్యాను. నాకు గంగానది ఏమీ పవిత్రంగా కనబడలేదు. నాకది నదీ, మురుగుకాల్వల కలయికలాగ తోచింది. నాకు విశ్వేశ్వరుడు భారతీయుల మూఢత్వ హిమాలయ పర్వతానికి శిఖరంలా కనిపించాడు. ఇక్కడ అన్నపూర్ణ అన్యాయాల ముద్ద. అన్యాయాలు చేసి, అబద్ధాలాడి, మోసాలు కలిపి కాశీవాసులు అన్నం సంపాదిస్తారు. అదే కాబోలు అన్నపూర్ణ విశాలాక్షి. డబ్బు, డబ్బు, డబ్బు! విశ్వేశ్వరుడికి డబ్బు, పూజారులకు డబ్బు, పండాలకు డబ్బు, గంగాపుత్రులకు డబ్బు, చచ్చినవారు అగ్నికి ఆహుతి కావడానికి డబ్బు! ఏదో నెమలిపించం నెత్తిమీదపెట్టి ఆశీర్వదించి, డబ్బు అడుగుతాడు; ఇవ్వకపోతే నానాతిట్లు తిడతాడు. నీ మోక్షంకోసం, నీకు సర్వసంపదలు రావడంకోసం కుంకం ఇచ్చేవాడు, విభూతి ఇచ్చేవాడు, పువ్వులిచ్చేవాడు. అవి అక్కర్లేదంటే, శాపనార్థాలు! పండాలకు గంగాపుత్రులకు నీతి నియమాలు లేవు. అబద్ధాలకు వెరవరు, మోసం చేయడానికి వెనుదీయరు. వాళ్ళకు భక్తిలేదు, భయంలేదు. ఎప్పుడూ కనబడే విశ్వేశ్వరుడు వాళ్ళనేం చేస్తాడు? ఆ విశ్వేశ్వరుడు ఒక పెద్దమోసం అని వాళ్ళకు పూర్తిగా తెలుసు.

ఆ విషయం నేనూ తెలుసుకున్నాను. నేను బురదనీళ్ళు అభిషేకం చేసినా ఊరుకున్నాడు; కుళ్ళుపూవులు నెత్తిమీదవేసినా ఊరుకున్నాడు. ఏ రాయి ఊరుకోదు?

భారతీయుల కిలాంటి మూఢనమ్మకాలు ఎందుకు వచ్చాయి? ఎవరో కెమల్‌పాషావంటి మహానుభావుడు హిందూమతానికి కావాలి! యజ్ఞోపవీతాలు పోవాలి, కులం తేడాలు చావాలి, మొక్కుబళ్ళు నశించాలి, పూజలు మాయం కావాలి, యాత్రలు ఎగిరిపోవాలి, తీర్థాలు కుంభమేళాలు, పుష్కరాలు, అర్ధోదయాలు, వైకుంఠ ఏకాదశులు, కృత్తికా నక్షత్ర ప్రవేశాలు, పండగలు, పర్వాలు రూపుమాసి మండిపోవాలి.

ఓయి వెర్రిదేవుడా నీ పని అయింది. నేను కత్తిగట్టాను. నాబోటివాళ్ళు ఈ దేశంలో అప్పుడప్పుడు ఉద్భవించకపోతే చెలరేగిపోదువు నువ్వు. నీకు

సిగ్గులేదు, నీ భక్తులకు లజ్జలేదు. నువ్వు శానిసత్వానివి. నీవల్ల ప్రపంచంలో కోటియుద్ధాలు వచ్చాయి. కోటి కక్షలు ఏర్పడ్డాయి.

ఏం చేయగలిగావు నువ్వు? ఓయి విస్సయ్యా! నీ పెళ్ళాం విస్సమ్మను ఎంత అవమానమైనా చేశాను. నేను శివపురాణం, స్కాంధపురాణం రాసే గంజాయి దమ్ముగాణ్ణి కాదు. మదతు పీల్చేవాణ్ణికాదు, భంగుతాగేవాణ్ణికాదు. నువ్వు లోక మోసానివిరా విస్సయ్యా! నీ తమాషా నేను కనుక్కుంటాను. నువ్వేఉంటే నా శకుంతలను ఎందుకు తీసుకుపోయావు? నువ్వులేవు. లేనేలేవు.

ఇదే నా పాట! ఇదే నా ఉద్యమం. నేను విశ్వేశ్వరునిపై సాగించిన యుద్ధం అన్నిరంగాలలో విజృంభించింది. నా చిన్ననాట సంభవించిన ప్రపంచయుద్ధం ఈ యుద్ధమంత సర్వతోముఖంగా నడవలేదు. అసలు నాతో యుద్ధం చేసేందుకు ఏడీ ఈ మగవాడు విశ్వేశ్వరుడు? దద్దమ్మ, హీనుడు, సిగ్గులేనివాడు, పాషండుడు షండుడు! రమ్మనండి. త్రిపురాసుర సంహారం చేశాడట. రాత్రిళ్ళు నాలో కామం ప్రకోపింపసాగింది. నా శకుంతలా వియోగం నాకు తీరని బాధ. నాకు కలిగే కామవాంఛకు నేనే సిగ్గుపడ్డాను. కాని శకుంతలా స్మృతియే నా కామవాంఛా ప్రవాహానికి ఆనకట్ట అయినది.

ఏమిటి నీతి? ఎందుకు? నా ప్రేమంతా వెళ్ళిపోయిన ఒక పరమ పవిత్ర బాలికకు ధారపోశాను. ఇంక నా కామవాంఛా ప్రవాహానికి ఆ పవిత్ర బాలికా ప్రేమభావం ఎందుకు అడ్డంరావాలి? నా ప్రేమను హరించిన ఈ దేవుళ్ళను అవమానం చేయాలంటే స్త్రీ వాంఛయే ఉపాయమనే నిశ్చయానికి వచ్చాను. ప్రసిద్ధికెక్కిన ఉత్తరాది భోగంవాళ్ళ ఇళ్ళకు వెళ్ళాను. చెమటలు పట్టాయి. పదిరూపాయలు దర్శించుకొని పారిపోయి వచ్చాను. ఆ మహాపట్నంలో కొందరు సంసారిణులుగూడ ధనంకోసం ఈ వృత్తిచేస్తూవుంటారు. యాత్రికులే వారికి విటులు. అట్లని అన్నిరకాల విటులను చేరనివ్వరట.

అలాంటివారిలో ఒక పండా రెండవ భార్యతో నాకు స్నేహం కుదిరింది. ఆఅమ్మాయికి నాఈడే ఉంటుంది. చాలా అందంగా ఉంది. ఉత్తరాది సంగీతం చక్కగా పాడేది. చీరలని, రవికలని రెండుమూడువందల రూపాయలు ఆమెకోసం కర్చుచేశాను. అయిదారుసారులు అప్పుక్రింద పాతిక ముప్ఫై, పదిహేను సొమ్ముఇచ్చాను. ఆ అప్పు తిరిగి వస్తుందనికాదు. ఆ వంక పెట్టిగాని ఆ అమ్మాయి డబ్బు పుచ్చుకునేది కాదు. భర్తకు మా ఇద్దరి స్నేహం తెలుసును. ఇద్దరం అల్లరిచేసేవాళ్ళం, పాడుకునేవాళ్ళం. ఆ అమ్మాయికి తెలుగువచ్చును. ఎందుకంటే ఆవిడ భర్త, తెలుగువాళ్ళ పండాలలో ఒకడు. ఆమె పేరు సుశీలాదేవి! ఆమె నాతో చెప్పడం ఇంతవరకు నావంటి స్నేహితు డామెకు దొరకలేదట. కాశీవిశ్వవిద్యాలయంలో చదువుకొనే ఇద్దరు తెలుగు విద్యార్థులు అప్పుడప్పు డామెకడకు వస్తారట. ఆమెకు కామసంబంధం ఉందట. వాళ్ళు డబ్బు బాగానే ఇచ్చేవారట. నే నామె జీవితపథంలోకి

రాగానే ఆమె వాళ్ళిద్దరినీ ఇక రావద్దందట! ఎంత స్నేహం అయినా సుశీలా దేవితో ఇంతవరకు కామసంబంధం కలిగించుకోలేకపోయాను. ఆటపాటలతో, కేరింతలతో సరిపోయేది.

ఒకరాత్రి సుశీలాదేవి తమి పట్టలేకపోయింది. నామీద వాలిపోయింది. నా మొగమంతా ముద్దులు కురిపించింది. బంగారు తీగెలాంటి తన శరీరం నా శరీరానికి అతిగాఢంగా, గాఢంగా అదిమివేసి అలుముకుపోయింది. నాలోని కాంక్షలు, ఒక్కసారిగా విజృంభించాయి.

'మూర్తీ! మూర్తీ! నాకోర్కె తీర్చు. నీకోసం బ్రతుకుతున్నా!' అన్నది ఆమె. నాకు ఒళ్ళు తెలియలేదు. ఇంతలో మెలకువ వచ్చింది! ఏది నాకు మెలకువ తెచ్చిందో తెలియదు. అంతే!

నాకు బొటబొట కళ్ళనీళ్ళు కారిపోయినవి. మంచంనుండి జీవచ్ఛవంలా లేచాను. నా చొక్కా తొడుక్కొన్నాను. సుశీలాదేవి లేచి జాకెట్టు తొడుక్కొని, చీరకట్టుకుంది.

'మూర్తీ! కోర్కె తీర్చకుండా, వెళ్ళిపోతావా? నేనేంచేశాను? నేను స్వచ్ఛమైన దానిని కాననా నీ ఉద్దేశం? అవును మాబోటి నిర్భాగ్య జీవితాలలో నిర్మలత్వం, ఎక్కడ వస్తుంది!'

'సుశీలా! నీతో సహవాసంచేసి, నీమతి విరిచిన తప్పు నాది. అంతే! నేను ఇప్పుడు స్త్రీ పురుషధర్మం నిర్వహించకుండా వెళ్ళిపోవడానికి నువ్వు కారణంకాదు. నేనే కారణం. నాలో భయం దాగిఉంది. పూర్వవాసనల నీరసత్వం నన్ను కుంగదీస్తున్నది.'

'నువ్వు నా స్నేహం చేసినప్పటినుంచీ ప్రేమనేది ఏమిటో తెలుసుకున్నా. ప్రేమకు ఫలం ఇవ్వవా నాకు? నేను ప్రేమించగలిగినవాడు దొరికితే చక్కని కొడుకుని, అందమైన బాలికను కందామని ఎదురు చూస్తున్నా. ఈరోజు నా ప్రేమ తృప్తి, నా ప్రేమ ఫలం వాంఛించి సిద్ధమయ్యాను మూర్తీ! నువ్వలా వెళ్ళిపోతావా? నా జన్మలో ఇక రాజపుత్రస్థానపు ఎడారులేనా?'

'సుశీలా నన్ను ఆలోచించుకోనీ, నీకు భర్త ఉన్నాడు. ఇద్దరు విద్యార్థి స్నేహితులున్నారు...'

'నోరుముయ్ మూర్తీ! నీ నిర్దయవల్ల నన్ను చంపేయడమే కాకుండా, నన్ను దెప్పుతున్నావా? మీ మగవాళ్ళంత తుచ్ఛులు ఎక్కడన్నా ఉన్నారా? పట్టుకుపో నీ డబ్బూ, నీ విచ్చిన బట్టలూ. ఆడదానికి అభిమానం లేదనుకున్నావా?'

'సుశీలా! నా చరిత్రంతా నీకు చెప్పలేదు. రేపు సాయంకాలం వచ్చి, నా జీవితం యావత్తూ నీకు నివేదిస్తా. నువ్వే నాకు న్యాయాధిపతివి అవు! ఇంతకన్న ప్రస్తుతం మాట్లాడలేను.'

అని విసవిస వాళ్ళింటిలోనుంచి వచ్చేశాను. ఆ గల్లీలలో తిరిగి తిరిగి ఇంటికి చేరుకున్నాను. అప్పటికి పదిగంట లవుతుంది. రోజూ పదకొండు గంటలలోపుగానే ఇంటికి చేరుకునేవాణ్ణి. ఏవో రెండు మెతుకులు నోట్లో వేసుకుని పడకగదిలోకి పోయి, మంచంమీద కూలిపోయాను. పాపం సుశీల కామవాంఛ తీర్చలేకపోయాను. నా పిరికితనానికి నన్నే తిట్టుకున్నాను. ఎందుకు వచ్చిందో ఈ పిరికితనం ? ఎందు కామె వాంఛ తీర్చకూడదు ? దేవుళ్ళకే ఎదురుతిరిగిన నేను పుణ్యపాపాలూ, నైతికధర్మాలు గణించడం ఏమిటో? నాకాభావాలు నా శకుంతలతోనే వెళ్ళిపోయాయి. కాని పిరికితనం పోలేదు. పిరికితనం యుద్ధంలో పరాజయం తెస్తుంది. దేవుళ్ళతో యుద్ధం చేయడంలో పిరికితనం తిరిగి ఎదురువచ్చిన నారాయణాస్త్రంవంటిది.

దేవుళ్ళతో యుద్ధం మన హృదయరంగంలో, పూర్వనమ్మకానికీ, అందుకు వ్యతిరేకం అయిన విప్లవభావాలకూ యుద్ధమే కదా! నాముందు వేలకొలది పూర్వీకుల నమ్మకాల కోటలు బురుజులతో ఆకాశంఅంటే అతిమందం గోడలతో ఉన్నాయి. నాకు బలం నాబోటివాళ్ళే, పాశ్చాత్యులలో కొందరూ, అంతే !

ఆ గోడలు నాకు సుశీల గదిలో కనుపించాయి. నా దగ్గిర యంత్రాయుధాలు తక్కువగా ఉన్నాయి. సుశీల అందం బలం యివ్వలేదు. ఆ గోడల మీద నా శకుంతలను భావించుకొన్నాను కాబోలు.

తెల్లవార్లూ నిద్రపోలేదు. పక్కమీద దొర్లుతూ ఉన్నాను. తలవేడెక్కి ఉంది. ఉడుకెత్తిన నా రక్తం చల్లారలేదు. సుశీల వాక్యాలు నా గుండెను అదిరించివేశాయి. లేచి రెండుమూడుసార్లు వీధి తలుపు దగ్గరకు వెళ్ళాను, సుశీల దగ్గిరకు వెడదామనే! మళ్ళీ సిగ్గుపడి వెనక్కు చక్కావచ్చాను.

## 22

సుశీలాదేవి ఇంటికి నేను వెళ్ళడమే మానేశాను. మానివేసిన మూడు రోజుల్లో సుశీలభర్త మాయింటికి వచ్చాడు. అతణ్ణి చూడగానే నేను సిగ్గుచేత నేలలోనికి కుంగిపోయాను. ఏ తగాదా వస్తుందో అని భయపడిపోయాను.

సుశీలభర్తపేరు జగత్‌రాం పండా. జగత్‌రాం పండాకు సుశీల రెండవ భార్య. భార్య కోరినకోర్కె నెరవేర్చడం అతని తపస్సు. ఆమె సంతోషంగాఉంటే విశ్వేశ్వరుడు ప్రత్యక్షమైనట్లే అతడు సంతోషించేవాడు.

'పండిజ్జీ! నా భార్య భయంకరమైన జ్వరంతో పడిపోయింది. జ్వరం సంధితో ప్రారంభించింది. సర్వకాలం నీపేరే గొణుక్కుంటుంది. వచ్చాడా శ్రీనాథమూర్తి?' అనే ప్రశ్న బాబూజీ! నువ్వు వెంటనే ఒక్కసారి మా యింటికిరావాలి. నా సుశీల నన్ను విడిచి వెళ్ళిపోతే ఒక్క నిమిషం బ్రతక

లేను. నువ్వు వెంటనే రావాలి. నన్నూ నా భార్యనూ బ్రతికించు, నా బగ్గీమీద పోదాంరా బాబూజీ!'

ఆమాటలు వింటోంటే నా ప్రాణాలే పోయాయి. నా శకుంతలతో పాటు దేశంలో ఉన్న ఆడవాళ్ళందర్నీ చంపడానికే పుట్టానా అని వణికి పోయ్యాను. వెంటనే బయలుదేరాను జగత్‌రాం పండా ఇంటికి. ఇల్లంతా చుట్టాలతో కిటకిటలాడుతూ ఉంది. ఆ పట్నంలో ప్రసిద్ధికెక్కిన ఆయుర్వేద వైద్యుడు వైద్యరాజ్ పండిత్ భోలానాథ్ రోగిమంచందగ్గర ఉన్నాడు. సుశీల మంచంపై ఇటూ అటూ కొట్టుకుంటూ ఉన్నది. ఆమె కళ్ళు అరమూతలుగా ఉన్నాయి. ఆమె మాడుపై ఏదో మందు పట్టీవేశారు. వైద్యుడు రోగి నాడి పరీక్ష చేస్తున్నాడు.

జగత్‌రాం పండా, నేను గదిలోనికి రాగానే వైద్యుడు మావైపు తిరిగి నావైపు తీక్ష్ణంగా చూచి, 'నువ్వేనా శ్రీనాథమూర్తివి?' అని అడిగినాడు. 'చిత్తం పండిజ్జీ' అన్నాను.

'ఈమె బ్రతకాలంటే నీలోవుంది. ఈవిడకు జ్వరం మెదడుకు పట్టింది. గుండె చాలా నీరసంగా వుంది. నువ్వు ఈగది అత్యంతావసరాలకుగాని వదలకుండా రాత్రింబగళ్ళు మందులివ్వడం, మంచినీళ్ళివ్వడం వగైరా అన్ని పనులు చేయాలి. అప్పుడు ఈ అమ్మాయి బ్రతకడానికి సావకాశాలున్నాయి. లేకపోతే రెండురోజులకన్న నేను ఎక్కువ పూచీ పడలేను.'

నేను గుండె రణభేరీ వాయిస్తూవుండగా సరేనని తలఊపాను.

'శ్రీనాథ్! నువ్వు నాకు బిడ్డ నీయకుండా... వెళ్ళిపోతావా?...... ఇన్నాళ్ళనుంచీ... నా మీద ప్రేమ... దొంగ... ప్రేమా' అని గొణుగుతున్నది సుశీల.

నాకు చెమటలుపట్టాయి. ఆ వైద్యుడి మొఖం చూడలేకపోయాను. సుశీల మంచంమీద మొగం వాల్చుకుని కూచున్నాను. ఆమె చేయి నా రెండు చేతులతో పట్టుకున్నాను. కళకళ కాగిపోతోంది ఆమె ఒళ్ళు.

'ఆమె నుదురుమీద చేయివేసి, ఆమె చెవిలో 'సుశీలా' అని పిలుస్తూ ఉండు. తల్లిలా కుమారునిలా నువ్వు సంచరించాలి. జ్వరం తగ్గి తెలివివచ్చిన తరవాత మందులు మారుస్తాను' అన్నాడు వైద్యుడు.

ఆమె నుదురుమీద చేయివేశాను. అబ్బా! నా కెన్ని పరీక్షలు? 'ఇలాగే నా శకుంతలను నాకోసం బ్రతుకు' అని ప్రార్థించాను. అయ్యో శకుంతలాదేవీ! నా కెలాంటి పరీక్షలు పెట్టావు ప్రాణేశ్వరీ!

సుశీల చెవిలో 'సుశీలా! నేను శ్రీనాథమూర్తిని, నీకోసం వచ్చాను. నెమ్మదించు సుశీలా!' అని కళ్ళనీళ్ళు కారిపోతూ ఉండగా పిలిచాను.

సుశీల కొంచెం శాంతించింది. కదలకుండా పడుకుంది. నేను నా చెయ్యి, ఆమె నుదురుమీద అలానే వుంచాను. ఆ గదిలోకి ఎవ్వరిని రాకుండా భర్త గుమ్మందగ్గర కాపలా! నేనూ, వైద్యుడూ లోపల. వైద్యుడు 'పాకు పత్రాస్త్రము అనే మందు ఇస్తున్నాను. ఇది ఇచ్చిందగ్గరనుంచి చాలా జాగ్రత్తగా ఉండాలి నాయనా!' అన్నాడు. ఏమిటా జాగ్రత్త అని భయపడి పోయాను. తేనెలో రంగరించి, ఆయన ఆ మందు సుశీల నోరు తెరిచి నాలికకు రాసినాడు. 'నేను మళ్ళీ వస్తా' నని చెప్పి వైద్యుడు వెళ్ళిపోయినాడు. పండా గుమ్మందగ్గిరే రాయిలా కళ్ళనీళ్ళతో సుశీలవైపు చూస్తూ, చేతులు నలుపుకుంటూ నిలుచున్నాడు. సుశీల చెవిదగ్గిర నా నోరుంచి 'సుశీలా! నేను శ్రీనాథమూర్తిని, నువ్వు మా అందరికోసం బ్రతకాలి! సుశీలా! నేను ఇదివరకే ఎంతో కష్టం అనుభవించాను. సుశీలా! నానెత్తిపై ఇంకో చావుకూడా పెట్టకు సుశీలా!' అన్నాను. నా కంటినీరు ప్రవాహాలై కారిపోయినాయి.

సుశీల నావైపు తిరిగి 'వచ్చావా? మూర్తీ, నా పెదవులు ముద్దుపెట్టుకో' అన్నది.

భర్త నాకు నమస్కరిస్తూ, 'పెట్టుకోండి బాబుజీ!' అన్నాడు పాపం!

నేను కాగిపోయే సుశీల పెదవులను ముద్దెట్టుకున్నాను. సుశీల జ్వరంలోనే చిరునవ్వు నవ్వుతూ నావైపు తిరిగి నాచుట్టూ చేయిచుట్టి ఒళ్ళో తలపెట్టి చంటిబిడ్డలా నిద్రపోయింది. నేను కదలలేదు. నడుం నొప్పిపెట్టింది. ప్రాణాలు క్రుంగిపోతున్నవి. అలాగే కదలకుండా కూర్చున్నాను. ఒక గంటకే కొన్నివేల గంటలు కూర్చున్నట్లు తోచింది. కాళ్ళు గుదికట్టినవి. రక్తం స్రవించడం మానింది. వీపున సూదిపోటులు. సుశీలకు చెమటపట్టుట ప్రారంభించింది.

ఇంతట్లో వైద్యరాజు వచ్చాడు. నెమ్మదిగా నన్ను చుట్టిన చేయి సడలించి, నాడి పరీక్ష చేశాడు. 'రోగి బ్రతికే ఆశలున్నాయి. బాబుజీ మీరు నెమ్మదిగా తలతీసి ఆ దిండుపైన పెట్టండి' అన్నాడు. నేనామె తలను దిండుపైన పెట్టాను. సుశీల కళ్ళు తెరిచి 'ఆకలి' అన్నది. వైద్యుడామెకు పళ్ళరసం ఇప్పించాడు. నేను మంచంమీదే కూర్చునివున్నాను. సుశీల నన్ను చేరి, గట్టిగా అదుముకొని మరల నిద్రపోయింది.

## 23

సుశీలాదేవికి జ్వరం నిమ్మదించింది. కాని ఆ నీరసస్థితినుంచి కోలుకొనేటప్పటికి ఆమెకు మూడు నెలలు పట్టింది. ఆమెకు బలంపట్టి ఊడిపోయిన జుట్టు మళ్ళీ గిరజాలులా వచ్చేటంతవరకూ అంత భయపడలేదు నేను. ఆడుతూ పాడుతూ కాలంబుచ్చాను. ఆ కొద్దిరోజులూ శకుంతలాస్మృతి కొంత వెనక్కు పడింది.

అలసటపడి ఇంటికివచ్చి నిద్దురపోయేవాణ్ణి. సుశీలచేత వేళకు మందులు తినిపించడం, సుశీలను ఒళ్లు మసాజ్ చేయించుకునేటట్లు చూడడం, పళ్ళ రసాలు, పాలు మొదలైనవి తినేటట్లు చూడడం ఇది నా నిత్యకృత్యం. ఆ రోజుల్లో నా కామె స్నేహితురాలు. ఆమెను నేను వాంఛించలేదు. ఆమె నన్ను వాంఛించలేదు. నా కా గొడవే మనస్సుకు తట్టలేదు. కాని, దేశంలో సంచరిస్తున్న అనేక భావాలు ఆ నాళ్ళలో నా ఎదుట బడ్డాయి. నేను బి. ఎ. సెకండుక్లాసులో విజయం పొందినా ఇంకా బాలుణ్ణే. ఒక్క భార్య విషయం లోనే పురుషుణ్ణి.

నేను కొంత కాశీ విశ్వవిద్యాలయ విద్యార్థుల స్నేహం లభించింది. సుశీల ఇంటికివచ్చిన ఆంధ్రవిద్యార్థులతో నాకు స్నేహం లభించింది. వాళ్ళి ద్దరూ సామ్యవాదులు. వాళ్ళకు కారల్ మార్క్సు జగద్గురువు. అలా అని అంటే మీద విరుచుకుపడతారు. అతడు విజ్ఞానవేత్తఅని, 'గతితార్కిక' శాస్త్ర పరిశోధనలచేత, ఇలాఉంటే నిజమైన శాంతి ప్రపంచంలో ఏర్పడు తుందని కనిపెట్టినాడని వాళ్ళ వాదన.

నేను: అవి శాస్త్రరీతిగా ఉన్నాయని ఎల్లా చెప్పగలవు రామకృష్ణా?

రామ: మనకు ఆలోచనశక్తి ఉందంటావా?

నేను: అందరి ఆలోచనశక్తి ఒక రీతిగా ఉంటుందా?

విశ్వమూర్తి: (ఇంకో స్నేహితుడు) అందరికి సమమైన రాజకీయాధికారం సమ మైన అర్థస్వామ్యం, ఉత్తరోత్తరా ప్రపంచ రాజకీయాందోళన సమసి పోతుందిగదా?

నేను: ఓయి వెఱ్ఱిబ్బాయి! అంతటితో మన సమస్య పూర్తవుతుందా? ఒకడు ఎక్కువ అధికారాలు వాంఛిస్తాడు. ఒక సంఘం ఎక్కువభాగం ఆశిసుంది. ఒక దేశం ఎక్కువలాభం కోరుతుంది. అప్పుడీ సమానత్వం ఏమౌతుంది?

రామ: ఏమోయీమూర్తీ! నీవాదం వితండంగాఉంది. మనం ఇల్లు కట్టించు కుంటున్నాము. పెద్ద భూకంపంవచ్చి ఇల్లు పడిపోతుందనుకో అన్నట్టుగా మాట్లాడుతున్నావు.

విశ్వ: మనుష్యుల్లోని నీరసత్వాలవల్లా, అన్యాయశాంతులవల్లా ఇప్పటి భయం కర స్థితి ప్రపంచానికి దాపురించింది. అవన్నీ పరీక్షచేసి మానవనైజం సంపూర్ణంగా గ్రహించి కారల్ మార్క్సు తన 'డెస్ కాపిటల్' రచిం చాడు.

నేను: అవునయ్యా! సరిగా 'డెస్ కాపిటల్' గ్రంథంలో ఉన్నట్లు రష్యా సోవియట్ రాజ్యం స్థాపన అయిందంటావా విశ్వం?

విశ్వ: ఏ ఉత్తమ విషయమైనా ఆచరణలో పెట్టేటప్పటికి కొన్ని తాత్కాలి కాలూ, స్థానికాలూ అయినమార్పులు వస్తూనే ఉంటాయి. గాంధీగారి తత్వంప్రకారం కాంగ్రెసు నడవగలుగుతోందా మూర్తీ?

నేను : అందుకనే నేను చెప్పేది, ఆచరణ వేరు, ఆశయాలు వేరుగా ఉంటా
యని. కనుక ఏనాటికైనా కారల్ మార్క్సు ఆశయాలు వృథాఅవుతాయి.

ఈలా మా ముగ్గురికీ వాదనలు ప్రబలాయి. నా మనస్సులో ఉన్న ఆశ
యాలన్నీ నా శకుంతలతోనే వెళ్ళిపోయాయి. నాకు బోల్షివిజం అయినా
ఒకటే, గాంధీ ఇజం అయినా ఒకటే. ప్రపంచంలో కొట్టుకుతినడానికి
మనుష్యుడూ జంతువులూ ఉద్భవించారు. ఎవరివస్తువులు వారు కాపాడు
కొంటూ ఉంటారు. కొట్టుకు తినడానికీ కాపాడుకోడానికీ ఎప్పుడూ యుద్ధం.
అందుకనే వెనకటి ప్రపంచయుద్ధం వచ్చింది అనే నమ్మకం స్థిరపడిపోయింది.

నా స్నేహితులు నాకు చదువుకోమని అనేక గ్రంథాలు ఇచ్చారు.
రహస్యంగా రష్యానుంచి అనేక కరపత్రాలు వస్తూండేవి. కూలీలను, రైతు
కూలీలను, బీదరైతుల్ని లేవదీయడం, కోటీశ్వరులను జమీందారులను కూల్చి
వేయడం, ప్రజావిప్లవం తెచ్చి సోవియట్టు ప్రభుత్వం స్థాపించడం, ఇవి ఆ కర
పత్రాలలోఉండే ముఖ్యవిషయాలు. ఒకసారి అన్ని దేశాలలో స్వామ్యరాజ్యాలు
స్థాపనకావాలి అని భావించాను. ఒకసారి ఏరాజ్యం లేకుండా దేశాలన్నీ
నాశం కావాలనుకున్నాను. కాని అన్నింటికీ వెనకాల చిన్ననాటినుంచీ మా
శకుంతలతోబాటు పూజించిన మహాత్మాజీ అహింసాభావం నన్ను వదలక
దెయ్యంలా పట్టుకుంది.

సుశీల నానాటికి తేరుకుంది. ఓరోజు సాయంకాలం నేను సుశీల
యింటికి వెళ్ళాను. నా మనస్సులో ఆవేదనలు అణిగిఉన్నాయి. నాకు అంత
చైతన్యం కాని, హుషారుకాని లేక, ఏదో బొమ్మలా తిరుగుతూ ఉన్నాను.
మా అమ్మ ఏమిచేసిపెడుతోందో, ఏమితింటున్నానో నాకారోజుల్లో తెలియనే
తెలియదు. అప్పటికి సుశీలకు జబ్బు నెమ్మదించి నాలుగు నెలలయింది. వసంత
కాలంరోజులు, మత్తుదినాలు. ఆరోజు సాయంకాలం సుశీల ఇంటికి వెళ్ళగానే
ఆ నాలుగంతసుల పూర్వకాలం మేడపై, డాబామీద కుండీల్లో పూలమొక్కల
మధ్య, తివాసీపైన పరచిన దిండ్లమీద ఆనుకుని పడుకుని ఉంది.

నేనామెదగ్గరకు వెళ్ళాను. ఆమె ఒయ్యారం, కులుకు, అప్పుడే
వస్తూన్న గిరజాల జుట్టు, కొత్తరకం! వేసంకాలంలో హిమాలయాలలో పొంగి
వచ్చే శైవాలినిలాంటి క్రొత్తతనంతో వరూధినిలా ఒరిగిఉంది. నేను రాగానే
'ఈలారా, మూర్తీ!' అంది.

నేనామె దగ్గరకు వెళ్ళి కూర్చున్నాను. ఆ డాబామీదవాళ్ళు పక్క
డాబామీద వాళ్ళకు కనబడకుండా చుట్టూ ఎత్తుగా తడికెలు కట్టి ఉన్నాయి.
'మూర్తీ! నీకోసం బ్రతికా సుమా!' అని ఆమె అన్నది.

## 24

నేను మౌనంగా సుశీలప్రక్కనే కూచున్నాను. నా శకుంతలకూడా
ఈలాబ్రతకరాదా? ఆమె బ్రతికితే! ఓ దౌర్భాగ్యుడా! నీకంత పవిత్రవరం

ఎక్కడ దక్కునురా! ఓయి ఛండాలుడా! నీకు సర్వరసపరిపూర్ణ మహా భావం గ్రహించే ప్రతిభ ఎక్కడరా? ఓయి నష్టాత్ముడా! ఆ అప్రతిమాన సౌందర్యనిధిని అనుభవింప నీ కెక్కడ తగుదువురా! ఓయి మురికిగోతుల పొర్లాడేపంది! నీకా అసదృశ దివ్యతేజస్సు భరింప శక్తి ఎక్కడరా?

సుశీల నాతో ఏమి మాట్లాడిందో తెలియదు. కొంతమనస్సు ఇటుతిరిగే టప్పటికి సుశీల నన్ను గట్టిగా, అప్పుడే పొంగి మరల తమ తొల్లింటి పీనత్వం సంపాదించుకునే వక్షోజాలకు అదిమి నామోమంతా ముద్దులతో మింగివేస్తున్నది. ఈ హీనావస్థ నాకు నేనై తెచ్చుకున్నాను. నాగోయి నేను తవ్వుకున్నాను. నాకు మతిలేదు. శకుంతలా స్మృతి మాయమైంది. ఏదో శూన్యభావమే నా ఎదుట, నా చుట్టూ, నాలో!

సుశీలాదేవి, ఎన్నివిలాసాలు కురిపించిందో! నాకు చైతన్యం ఏది? ఆమె నా లాల్చీ విప్పి అవతలవేసిన సంగతి నాకు తెలియదు. చిన్నపిల్లవాడివలె ఊరుకున్నాను కాబోలు! లాల్చీలోపల బనీను విప్పుతుంటే ఊరుకున్నాను కాబోలు! సుశీల ఉదయకాల హిమాచలసానువుల నాక్రమించిన సువర్ణమేఘ శకలంలా నన్ను ఆక్రమించి ఉండగా మెలకువ వచ్చింది. నాలో ఇంతకాలం అణచిపెట్టబడిన అతిపురుషత్వవాంఛలు ఉప్పొంగిపోయినాయి.

* * * *

రాత్రి ఎనిమిది గంటలు కొట్టుతుండగా ఇద్దరమూ మామూలు మానవత్వానికి వచ్చాము. సుశీలమోము అత్యంతానందంతో చిరుగాలులు వీస్తూ ఉండగా కలకలలాడే వెన్నెలరేయిలో కలవపూవులా ఉంది. నేను మనో నీరసత్వంతో అక్కడనుంచి లేచివెళ్ళి పక్క మేడ డాబామీద ఆటలాడుకొంటున్న బాలికలను చూస్తున్నాను.

ఇది మహాదోషమా, దోషరహితమా? పుణ్యమా, పాపమా? శకుంతలా స్మృతి ఒక్కసారిగా ఎగిరివచ్చి నామీద వాలింది. ఆమె పేరు ఉచ్చరింపడానికి అర్హత తీసివేసుకున్న ద్రోహంచేశాను నేను. హీనుడను, హీనుడను, హీనుడనయ్యా! చెవిలో గింగుర్లు పెట్టినవి.

పుణ్యమేమిటి, పాపమేమిటి? అన్న భావం వచ్చింది. ఎంత నీరసుణ్ణి! నాకు నేనే శత్రువునా? విరోధినా? ప్రబలహంతకుణ్ణా? సుశీల ఎరుపెక్కిన బంగారు కమలంలా నా దగ్గిరకు వచ్చి డాబా పిట్టగోడ నానుకొన్న నాపక్క నిలబడింది.

'నువ్వే నా భర్తవు మూర్తీ! ఇక నిన్ను వదలలేను.'

నే నేమి మాట్లాడగలను?

'మూర్తీ! ఈరోజు నేను తల్లినయ్యే సన్నాహంలోనూ ఉన్నాను. నీకు భార్యనయ్యే మధుర సంసిద్ధతలోనూ ఉన్నాను. నేను సర్వదేవతలను, దేవీమూర్తులను ప్రార్థించా! నువ్వు ఈవాళ నాభర్త కావాలని, నేను గవ్వలక్కకు

మొక్కుకున్నా కూడా! నా కోర్కె ఫలించింది. నువ్వు నాకు బంగారు పాపాయిని యిస్తావు.'

నా గుండె గుభేలుమని ఆగిపోయింది. నేను ఎంతపని చేశాను! ఈ మెకు ఈ దొంగరకమైన భర్తనయ్యాను. నా శకుంతలను రెండవసారి చంపుకున్నాను. సుశీల తన తుచ్ఛవాంఛను (కాదేమో) తీర్చుకోడానికి దేవతల్ని ప్రార్థించి నెగ్గింది. నా దేవిని నేను బ్రతికించుకోలేకపోయాను. నా ఒళ్లు గజగజ వణికింది. సుశీల నామీద చెయ్యివేసి, 'అమ్మో! నీవళ్లు ఈలా కాలిపోతోందేమిటి! రా లోపలికి రా' అని నా చేయిపట్టి, నా చుట్టు చేయివేసి నన్ను తనకు గాఢంగా అదుముకొని క్రిందకు తీసుకువెళ్ళింది.

ఎల్లా వెళ్ళానో! నా కేమీ తెలియదు. మెదడు వేడెక్కింది. ఒళ్లు తిరుగుతోంది. కళ్లు మూతపడిపోయినాయి. ఆమె నాకు కాశ్మీర శాలువలు కప్పింది. మెత్తటి ఉన్నిపచ్చడము కప్పింది. శీతాకాలంలో వాడుకొనే రగ్గు కప్పింది. నా ఒణుకు తగ్గలేదు.

నాకు 107 డిగ్రీల జ్వరం వచ్చిందట. మా అమ్మకు కబురు వెళ్లిందట. మా అమ్మ డాక్టరుకోసం గంగాధరుణ్ణి కబురుపంపిందట. ఆయన కారుమీద ఆ యింటికి వచ్చి నాకు మెదడు మలేరియా అని నిశ్చయం చేశాడట. ఆ ఇంట్లో చావు బ్రతుకులమధ్య ఇరవైరోజు లున్నానట. మా అమ్మ మా మేనమామకు టెలిగ్రాం ఇచ్చిందట.

మా మేనమామ పరుగెత్తుకొని కాశీ వచ్చాడట. ఆ ఊళ్ళో ఉన్న ఇద్దరి పెద్దడాక్టర్లను, అలహాబాదులోఉన్న పెద్దడాక్టర్ని పిలిపించారట. మా మేనమామ నాకోసం ఆరోజుల్లో వేలు ఖర్చుచేశాడట. వైద్యమే నన్నారోజుల్లో బ్రతికించింది. ఆయుర్వేదం నన్ను మనుష్యుణ్ణి చేసింది. సుశీల ఆ రోజుల్లో తిన్నగా తిండి తినలేదట. మా అమ్మతోబాటె నాకు సపర్య చేస్తూ ఉండేదట. నాకు జ్వరం నెమ్మదించడం సుశీల పిచ్చిదానిలా చేసిన, ఒక పిచ్చిపనివల్ల నేనట.

## 25

సుశీల ఇంటిలో నేనలా జ్వరంవచ్చి పడిఉండడంవల్ల, సుశీలకు మతిపూర్తిగాపోయి, గవ్వలక్కకు మొక్కుకొని, అన్నపూర్ణకూ, డుంఠి వినాయకునకూ, అనేక పూజలు చేయించింది. ఏడ్చింది, దొర్లింది.

ఒకరోజు రహస్యంగా ఒక హిమాలయవాసి, సన్యాసి ఒకాయనదగ్గరకు పోయిందట. ఆయన మన్ను నలిపిఇస్తే అదే మందన్న ప్రతీతి ఆ మహానగరమంతా వ్యాపించిఉంది. ఆయనకు సుశీల తనింటికివచ్చిన ఓ తీర్థవాసికి చాలా జబ్బుగావుందనీ, ఆతడొక్కడే బిడ్డడనీ, తల్లీకొడుకూ కలిసివచ్చారనీ, ఆ బాలకుణ్ణి రక్షిస్తే వాళ్ళదారిని వాళ్లు పోతారని చెప్పిందట. పైటకొంగున ముడిగట్టిన పాతిక రూపాయ లా సన్యాసిచేతిలో పెట్టిందట.

ఆ సన్యాసి తన సంచిలో నుండి ఒక మందు తీసి, అది కొంచెం మాత్ర చేసి తన వంటి బూడిద తీసి పూసి, 'ఇది యియ్యి బ్రతుకుతాడు. ఈ రాత్రి ఇంకో పాతికరూపాయిలు పట్టుకురా' అన్నాడట. ఆ మాత్ర ఎవ్వరూ చూడకుండా నాతో మింగించిందట. నాకు స్పృహే లేదట. ఆ సన్యాసికి పాతిక రూపాయిలు పంపించిందట. ఇది రాత్రి జరిగిన పని. ఆ తెల్లవారగట్ల, నా కా జ్వర తీవ్రతతో కడిపెడు విరోచనమై, కాళ్లు చేతులు చల్లబడి వాతం కమ్మింది. ఇంగ్లీషు వైద్యులువచ్చి గ్లూకోజు మొదలైన వేమేమో ఇంజక్షను లిచ్చారట. లాభంలేదని చక్కాబోయారుట. అప్పుడు జగత్‌రాంపండాను సుశీల పోరుపెట్టి, కవిరాజ్ వైద్యరాజు పండిత బోలానాథ్‌ను రప్పించిందట. మా అమ్మ నేను చచ్చిపోయాననే మూర్ఛపోయింది. మా మామయ్యమాత్రం విపరీత ధైర్యంతో మా అమ్మకు ఉపచారం చేయిస్తున్నాడు. నేను బ్రతుకుతానన్న ఆశ అతనికీ పోయిందట.

బోలానాథ్ వచ్చి నాచేయి నాడిచూచి, 'అయ్యో మనిషిని అక్రమంగా చంపారని,' వాతరాష్ట్రం, వాతగజకేసరి, వాతజ్వరాంకుశం, సూతికాభరణం, సన్నిపాతం, కస్తూరి, మహాపాశుపతం, గరళం, నవరత్నచింతామణి, అన్నీకలిపి నూరి, బొడ్డుకు పట్టు, మాడుపై చిన్నగాయంచేసి అందుపై పట్టు, గుండెలకు పట్టు వేయించి, ఒళ్ళంతా వెల్లులిపాయి పసుపూ తేనె నూరించి రాయించి, అరగంట, అరగంటకు పై మహాపాశుపతాదుల మందే నాలికకు రాయించినాడట.

93 డిగ్రీల వాతం! ఇరవైనాలుగు గంటలయినతర్వాత నెమ్మదిగా వేడందుకొంది. ఇంకో ఇరవైనాల్గు గంటలకు నాకు వేడి 97 డిగ్రీలకు వచ్చి, నాడి కొంచెం బాగుపడిందట. మా అమ్మకూ ఆయనే వైద్యం చేశాడు.

వైద్యుడు అంతా అయినతర్వాత నిజం తెలుసుకొని సుశీలను బాగా చివాట్లుపెట్టి, తర్వాత ఆ మందే ఆ మహాజ్వరాన్ని మళ్ళించగలిగిందని మెచ్చుకున్నాట్ట. ఆ సన్యాసికోసం నాకు మహావాతం చేయగానే పరుగెత్తితే అతడక్కడ లేడట.

ఆ జబ్బు నెమ్మదించగానే ఒక రాత్రివేళ నాకు మెలుకువ వచ్చింది. సుశీల నా మంచంప్రక్కనే కుర్చీలో కూర్చుండి, నిద్రవచ్చి, నా మంచంమీద తలవాల్చి గాఢనిద్రపోతున్నది. ఆ గదిలో వేరొకచోట చాపపైన మా అమ్మ నిద్రపోతున్నది. గుమ్మంఅవతల చావడిలో మా మేనమామ మంచంమీద పడుకొని నిద్రపోతున్నాడు.

శకుంతలవచ్చి నన్ను లేపినట్లు కలవచ్చి 'అయ్యో బ్రతికివచ్చిందా?' అనుకుంటూ చెమటలుపట్టి, శకుంతలా అంటూ లేచాను. న్నామాట ముద్దమాటలా వచ్చింది.

అందరూ ఒక్కసారి లేచారు. మా అమ్మ నాదగ్గరకు పరుగిడివచ్చి 'నాయనా బతికావురా!' అని కంటనీరు కారిపోతూ ఉండగా, వెక్కి వెక్కి

ఏడ్చి నన్ను కౌగిలించుకుంది. మా మేనమామ 'అక్కా ఊరుకోవే! వాడు బతికాడు. అదే పదివేలు. కొంచెం కులాసాచిక్కగానే మా ఊరు మనం అంతా వెళ్ళవచ్చును' అంటూ కళ్ళనీళ్లు వరదలుకట్టించాడు. సుశీల కంటి నీరు జడివానగా, 'విశ్వేశ్వరా తండ్రీ! నీ దయే ఇదంతా!' అంటూ వణికి పోయింది.

జగత్‌రాంపండా కళ్ళు నులుముకుంటూ పరుగెత్తికొని వచ్చాడు. 'ఎంత సంతోషం! ఓ విశ్వేశ్వర ప్రభూ! నువ్వు రక్షించావు మమ్మల్నందరినీ!' అని చేతులతో మొగం కప్పుకొని, నవ్వుతూ, ఏడుస్తూ, కళ్ళనీళ్లు తుడుచుకుంటూ దేవతార్చన గదిలోకి పరుగెత్తాడు.

నాకు కొన్నిరోజులవరకూ ముద్దమాటలే! కొన్నినాళ్ళవరకూ భోజనం సహించలేదు. మా అమ్మ ఇంత రససింధూరం, మిరియాలు నూరి మాత్రలు చేసి వేసేది. పులికడుగుచారు పెట్టేది. అప్పటినుంచి నాకు ఆకలిపుట్టింది. అన్నీ తినాలని బుద్ధి పుట్టింది. అతి జాగ్రత్తగా నాచేత పథ్యం చేయించారు. ఆపట్టుపట్టు ఆరునెలలకు కోలుకున్నాను. నాకు జబ్బు నెమ్మదించిన నెల రోజులకు నేనూ, మా అమ్మా నా ఆరోగ్యంకోసం హిమాలయాలలో 'మస్సోరీ' వెళ్ళవలసిందని డాక్టరుగారు సలహాయిచ్చారు. మా మేనమామ తన కొడుకు కస్తూరి సుబ్రహ్మణ్యాన్ని పంపించాడు. సుబ్రహ్మణ్యం నాకన్న రెండేళ్ళు పెద్ద. అంత పెద్ద చదువులేదు. కాని చాల మంచివాడు. వ్యవహారవేత్త. మా హేమ అతన్ని చూసింది రెండుమూడుసార్లు. (జ్ఞాపకం తెచ్చుకో హేమా)

మేమంతా ఆ వేసవికాలం జూన్‌నెల వానలవరకూ మస్సోరీ నగరం లోనే ఉన్నాము. మేము మస్సోరీ వెళ్ళేటప్పుడు సుశీల ఎంత ఏడ్చిందో వర్ణించలేను. నన్ను అమిత గాఢంగా కౌగలించుకొని వదలలేదు. ఆమెకు ఏడవనెల గర్భం. ఆమెభర్త జగత్‌రాంపండా అన్ని ముచ్చట్లూ జరిపించినాడు.

'మూర్తీ! నువ్వు నా జీవితంలోంచి వెళ్ళడానికి వీలులేదు. నువ్వు బ్రతికావు! నేనూ బ్రతికాను. నువ్వు మస్సోరీనుంచి ఇక్కడికే రా. మా ఇంట్లో ఉండు. ఉంటావుకదూ?' అని ఎంతో బ్రతిమాలింది. నేనామెను ముద్దు పెట్టుకుంటూ 'తప్పక వస్తాను సుశీ' అని వీడుకోలిచ్చాను. నేనా క్షణంలో ఏమీ ఆలోచనచేయలేని నల్లరాతిలా అయిపోయాను.

## 26

మస్సోరీలో మొదటి రెండుమూడువారాలు నేనూ మా సుబ్బులుబావ, మహా ఆనందంగా గడిపాము. సుశీలా, శకుంతలా ఎవరూ నా హృదయంలో లేరు. ఆ తర్వాత నాకు కాశీ విషయాలన్నీ జ్ఞాపకంవచ్చాయి. రాత్రిళ్ళు నిద్రపట్టకపోవడం తిరిగి ప్రారభించింది.

బలం త్వరలో పట్టడంచేత ఆ మహాపర్వతసానువులన్నీ మా సుబ్బులుతో తిరిగేవాణ్ణి. దూరాన మాకు ధవళహిమకిరీట సుందరాలైన ఆ పర్వతరాజా

శిరములెన్నో గోచరించేవి. ఆ కొండల్లో ఒక్కొక్క రోజు గంటలకొలదీ నడిచేవాళ్ళము. చెట్లను కోసిన ఆపిల్సుపండ్లు, దానిమ్మపండ్లు, ద్రాక్షపళ్ళు విపరీతంగా తినేవాణ్ణి. నడిచి నడిచి వచ్చి, సొమ్మసిలి నిద్రపోయేవాణ్ణి. ఈ నడకలు శకుంతలా సుశీలలను దూరంగా తోలటంకోసమే! నాలో సుడి గాలులు వీస్తున్నవని మా సుబ్రహ్మణ్యానికేం తెలుసును!

నెలరోజు లుండేటప్పటికి, మసూరీ నాకు విసుగు పుట్టించింది. ఆ ప్రపంచంలో నే నొంటివాణ్ణయ్యాను. నా శకుంతలను మరచి, ఒకవిధంగా స్వైరిణి అయిన సుశీలతో కామవాంఛ తీర్చుకున్న ద్రోహిని నేను. శకుంతల నాపై దీనదృష్టులు పరుపుతోన్నట్లే భావించేవాణ్ణి.

సుశీలమాత్రం ఏం తప్పుచేసింది? ఆమెధర్మం ఆమె నిర్వర్తించింది. నేనే నీరసుణ్ణి. ఏమిటా ప్రేమ ? ప్రేమకోసం జీవితాలు బ్రహ్మచర్యానికి అంకితం ఇస్తారా? వెనకటికథలే నిజమైతే విశ్వామిత్రుడు మేనకతో, వేదవ్యాసుడు మరదళ్ళతో నిర్వహించిన ధర్మం ఏమిటి ? పుణ్యపాపాలు సత్యంలా సర్వకాలాలు ఒకేరీతి ఉండాలి. అవి కాలాన్నిబట్టి మారితే సుశీలకూ నాకూ ఆ సాయంకాలం సంభవించిన కామవాంఛా నిర్వహణం పాపం ఎలా అవుతుంది?

నెమ్మదిగా నా ఆలోచనలు నశించాయి; ఒకవిధమైన స్థాణుత్వం వచ్చి చేరింది. మూఢుడు సర్వప్రపంచంపైన అమితక్రోధం వహించినట్లుగా నాకు అన్నింటిమీదా కోపం ఆవహిల్లింది. మా సుబ్రహ్మణ్యంపై ఉదయాత్తు సాయంకాలంవరకూ నాకు విసుగూ కేకలు ప్రబలాయి. మా అమ్మపై కసు బుసులు సాగించాను. ఆమె నేనెన్నన్నా ఎప్పుడూ నవ్వుతూ చాకిరీ చేసేది. మా సుబ్బలూ గంగిగోవులా ఏమీ మాట్లాడకుండా నాకు పరిచర్య చేసేవాడు. సేవకులమీద కోపం, బండివాళ్ళపై, కూలీలపై, అందరిపైన కోపం. మా అమ్మ రహస్యంగా కంటనీ రెట్టుకొనేదట, బక్క కోపం ఎక్కువైంది మా వాడికని అన్నీ భరించేది మా అమ్మ.

'నేనిక మసూరీలో ఉండలేనురా' అంటే మా సుబ్బలు కాశ్మీరం పోదామన్నాడు. కాశ్మీరం పోయాము. అందరికళ్ళుబడే షాలిమారు ప్రమదా వనం, దాలుసరస్సు, జీలంపై కాశ్మీరునౌకా యాత్రలకన్న, అక్కడ అనంతంగా పండే పళ్ళయినా తినడానికి పైసాలేని బీదవాళ్ళ స్నేహం ఎక్కువైంది. నాదృష్టి ఎప్పుడూ అందమైన స్త్రీలమీదనే. ఎన్నివస్త్రాలు ధరించిన జవ్వనినైనా నా మనస్సులో విగతవస్త్రనుచేసి ఊహిస్తూ, నా నీరసత్వానికి పళ్లు కొరుక్కుంటూ ఉండేవాణ్ణి!

అయోధ్యప్రాంతాల స్త్రీలు పట్టపగలు ఆడవాళ్ళచేత స్వల్పవస్త్రాచ్ఛాదితలు మాత్రమై వళ్ళు పట్టించుకోడం చూస్తూ నా రాక్షసహృదయానికి ఆనందం సమకూర్చుకున్నాను. ఆలాగే ధనంఇచ్చి, చక్కని పిల్లలను శ్రీనగరగల్లీలలో ఏరితెచ్చి, అక్కడ నాకేర్పడిన నేస్తం ఒక స్త్రీ వ్యాపారిణి ఇంట్లో రహస్యంగా వాళ్ళను దిగంబరలచేసి, ఆ బంగారు మలామా దేహాంగాలను

తనివోవ స్పృశిస్తూ ఆనందం పొందేవాణ్ణి. వాళ్ళూ తమ దేహాలు కామతృప్తికి బలి యివ్వకుండా, ఆ బలివల్ల వచ్చే రుసుంకన్న స్పర్శానందం ఇచ్చేరుసుం ఎక్కువగా దక్కడానికి సంతోషిస్తూ, నాకు సలాములుకొట్టి, నా చెంపలు తాకి మెటికలు విరుచుకొని వెళ్ళిపోతూ ఉండేవారు.

ఈ నా పిచ్చిచేతలు మా సుబ్బులుకు చూచాయగా తెలిశాయి. ఓ సాయంకాలం నావ పైతట్టుపైన కూర్చుని దాలు సరస్సులోని అందాలు ఖాళీ చూపులతో చూస్తున్న నా దగ్గరకు మా సుబ్బులు చేరాడు.

'ఒరే మూర్తిబావా! ప్రపంచంలో అనేక కష్టాలు పడ్డవాళ్ళూ ఉన్నారు. భార్యలు పోయినవాళ్ళూ ఉన్నారు. వాళ్ళు మతులు పోగొట్టుకుంటారురా! పోనీ ఏమీ తెలియని పిచ్చికాదు, ఇదేమి పిచ్చి నీకు?'

'సుబ్బులూ, నా వ్యవహారాలలో నువ్వు జోక్యం కలుగజేసుకోకు. నేను చావడానికి సిద్ధంగా ఉన్నప్పుడు, మీ నాన్నవచ్చి నన్ను బ్రతికించాడు. ఆ పని నువ్వు పూర్తిచేశావు. మామయ్యకూ నీకూ నాదేహం వలిచి ఇచ్చినా బాకీ తీరదు. నిజమే. అంతమాత్రాన నా జీవితానికి మీరు నాథులు కారు, నేను మీకు బానిసను కాను.'

'అల్లా నువ్వు మాట్లాడితే, నేనేం చెప్పను?'

'నువ్వేం చెప్పక్కరలేదు. నేను వినక్కరలేదు. లేనిపోనివన్నీ కలుగజేసికొని నాకు ఈకాస్త సంతోషం లేకుండా చేయకు.'

'అయితే సరే! నేను రేపే బయలుదేరి మా ఇంటికి వెడ్తాను. నువ్వు ఏమయితే, నాకేంగావాలి? కాని నీ విషయం తలుచుకొని అత్తయ్యపడే వేదన చూస్తూంటే నాగుండె తరుక్కుపోతోంది!'

'మా అమ్మా, మీ నాన్నా నన్ను కాశీలో చచ్చిపోనివ్వకపోయారూ, బాధవిరగడై పోవునుగా? మీ కందరికీ ఒకటేమాట చెప్తున్నాను. నేను బతకాలని మీకుంటే నా దారిని నన్ను పోనీయండి, లేదంటూరా, ఇంతవిషం తెచ్చి నాకు పెట్టండి!'

మా సుబ్బులు ఒక్కసారిగా లేచి బొట బొట కన్నీళ్లు కారుతూఉండగా క్రిందకు వెళ్ళిపోయాడు. నా కోపం ఆ రాత్రి పన్నెండు గంటలవరకూ చల్లారలేదు.

'ఓయి వెధవదేవుళ్ళోయి! ఈ అవస్థ నాకేమిటట్రా!' అని పొలికేక పెట్టాలని బుద్ధి పుట్టిందినాకు.

## 27

ఇక కాశ్మీరంలో ఉండలేకపోయాను. మేనెల రెండవవారం ప్రవేశించింది. దేశం ఏమయితే నా కేం కావాలి? కాంగ్రెసు విజయం పొందకపోతే ఏమి కావాలి? స్వరాజ్యపార్టీవారు శాసనసభల్లో మొగ్గలు వేస్తూంటే ఏమి కావాలి?

మా అమ్మ మరీ చిక్కిపోయింది. కాశ్మీరం నుంచి తిన్నగా బయలుదేరి లాహోరు వచ్చాము. లాహోరులో హీరామండి వెళ్ళిచూచాను. ప్రపంచంలో అంత ఘోరమైన భోగంవీధి లేదనుకుంటాను. ఆ మండిలోకి టాంగామీదనే లాహోరు చేరిన మధ్యాహ్నం వెళ్ళాను. టాంగావాడు ఒక శిక్కుసోదరుడు. నా వైపు దయార్ద్రదృష్టులు పరపి,

'బాబూజీ! కీఖరాబ్ రాస్తే దేవిచ్ ఫంజ్ దేయో?' (బాబుగారూ! చెడ్డతోవ పట్టేరేమిటి?')

నేను మౌనం.

'త్వడ్డీ జిందగీ దీలోడ్ నై?' (జీవితం బాగుచేసుకోవాలనే ఉద్దేశం నీకు లేదా?)

నేను: చుప్ రాహ్. అప్ నీ కిస్మత్ దా బాదుషా మైయా, తు? (ఊరుకో, నా భాగ్యాన్ని నిర్మించేవాణ్ణి నేనా, నువ్వా?)

టాంగామనిషి పెదవి విరిచి ఊరుకొన్నాడు. మే మా గల్లీలో ఆగాము. నేనాతనికి డబ్బిచ్చి దిగాను. బండిమనిషి బండితోలుకువెళ్ళకుండా అక్కడే ఉన్నాడు. నేను దిగి ఇటూ అటూ చూస్తూఉన్నాను. వెంటనే ఎదురుగా ఉన్న మేడలోంచి నలుగురు ముసల్మాను భోగంపిల్లలు నన్ను చుట్టుముట్టారు.

ఒకతె: తుకిన్నాసోణాఐ! అప్నేమకాందేవిచ్ ఆ సడ్డీహూవ్ సూర్తీ వేక్. (ఎంత అందంగా ఉన్నావయ్యా నువ్వు, మా యింట్లోకి వచ్చి మా అందాన్ని చూడు.)

నేను తెల్లబోయాను.

ఇంకొకతె 'అపనే సడ్డాగీత్ సుణు! నాచ్ నా వేక్! అపనే ఘర్ మే ఫలోందేవిచ్, కిసీఏక్ నూ చుణ్ లే! (మా సంగీతం విను! మా నాట్యం చూడు, మా ఇంట్లో మంచిపండ్లల్లో, ఒకపండు రుచిచూడు)'

అని అంటూ ఆ నలుగురూ నన్ను బర బరా తమ మేడమీదకు లాక్కొని పోయారు. అక్కడ నన్ను నలిపేశారు. నా జేబులో చేయిపెట్టి ఒకత్తె నా పర్సు లాగేసింది. అయిదారుగురు నాకు ఊపిరాడకుండా నులిమివేశారు. తుదకు ఒకత్తె 'ఓసోణియో! త్వన్ను కాడేఢర్ (ఓ అందకాడా! ఎందుకు నీకుభయం) అంటూ దరిజేరింది. తక్కినవాళ్ళు నవ్వుకుంటూ పారిపోతూ తలుపువేసేశారు. నాకు ముచ్చెమటలూ పట్టాయి.

ఏలా లేచానో అమ్మాయిని తోసేసి నాకే తెలియదు. గదిగుమ్మం తెరచి, అక్కడ ఎవరూ లేనందుకు సంతోషిస్తూ, సగం ఏడుస్తూ వీధిగుమ్మం దగ్గరకు పరుగెత్తుకొని వచ్చాను. అక్కడ ఆ శిక్కు టాంగా సిద్ధంగాఉంది. అందులోకి ఉరికాను. ఆ చుట్టుప్రక్కల మేడవరండాలలోనికి ఆడవాళ్ళం దరూ మూగి పక పక నవ్వటం ప్రారంభించారు. ఆ శిక్కు టాంగామనిషి మాట్లాడకుండా మేం ఉన్నసత్రం దగ్గిరకు తీసుకొనిపోయాడు.

నేను ఇంట్లోకి వెళ్ళి ప్రాణంపోయినట్లు భావించుకొని, నా పరుపు వాల్చి, పండుకొని వెక్కి వెక్కి ఏడ్చాను. నా కింతటి అవమానం కలగాలా? ఇది నాకు పరాభవమా? అవమానమా? నాలోని కోపం నన్ను దహించివేసింది. ఏం ప్రతీకారం చెయ్యగలను? కూడా పట్టుకువెళ్ళిన యా భైరూపాయిలు పోతేపోయాయి కాని వాళ్ళని నేను ఏమిచెయ్యగలను? ఆ హీరామండీ (రత్నాలవిఫణి) ఏమి రత్నాల బజారు?

ఆనాడు నేననుకోపోయినా తర్వాత నన్ను నేను తర్కించుకొన్నప్పుడు మహాత్మజీ స్త్రీ విషయంలో అన్నముక్కలూ, మహాత్మజీకి ఒక స్త్రీ మండలి వారు సమర్పించుకొన్న మనవీ ఎన్నిసార్లో జ్ఞాపకం వచ్చాయి. ఆ రోజుల్లో పశువునై ఉన్న నాకు క్రోధమే ప్రధానమై నన్ను పూర్తిగా మండించింది.

## 28

లాహోరులో మూడురోజులు మాత్రమే ఉన్నాము. అక్కడినుంచి బయలుదేరి సింధునదీతీరంలో ఉన్న సుక్కూరుకు వెళ్ళాము. నా ప్రయాణాలకు అర్థంలేదు. యాత్రావిశేషాలను చూడాలని కాదు. దేశంలోని ప్రసిద్ధ ప్రదేశాలను చూద్దామనీ కాదు. నాలోని భరింపరాని వేదనే నన్ను ఎక్కడికో తరిమివేస్తున్నది. ఎక్కడికో అంతుదొరకని యాత్ర? ఎందుకీ అనంతమైన వేదన? నా శకుంతల నాకు ఎక్కడ ప్రత్యక్షం అవుతుంది?

నా రూపం మారిపోయింది. నేను నల్లపడ్డాను. నా మొగం చిక్కిపోయింది. నా జుట్టు ఊడిపోయి కోడిజుట్టులా అయింది. నా నుదురులో గీతలు బ్రహ్మరాతలా కఠినమై, స్పష్టమై, చెరపరాని తీవ్రత తాల్చినవి కాబోలు!

నే నద్దం చూచుకోవడమే మానేశాను. నాకు బట్టల విషయంలో శ్రద్ధ సంపూర్ణంగా మాయమైపోయింది. ఏదుస్తులు ధరించేవాణ్ణో, అవి మాసినవో, శుభ్రంగా ఉన్నాయో అనే భావమే లేదు.

మా సుబ్బులు 'ఒరే బావా! అన్ని మంచిబట్టలున్నాయి, ఈ మాసిన బట్ట లెందుకు కట్టుకుంటావురా?' అన్నాడు.

'ఏబట్టలైతే నేమిలేరా? ఇప్పుడు నేనందంగా కనబడకపోతే కొంపలు మునిగిపోలేదు!'

'ఏమిటో, నువ్వు తెలిసినవాడవూగాదు, తెలియనివాడవూకావు. తెలిసీ తెలియని నరుడెల్ల బ్రహ్మదేవుని వశమే?' అని చెప్పినట్లుఉంది నీ వ్యాపారం. నీకు నేనేం చెప్పగలను? నీ సంగతిచూచి, అత్తయ్య కుళ్ళిపోతోంది!'

'సుబ్బులూ! మీరంతా నామీద ఎందుకు ఆపేక్షగా ఉంటున్నారో నా కర్థంకావటంలేదు. నేను లోకానికి క్షయపురుగును. నేను పరమ చండాలాన్ని. నన్ను లోకమంతా కలిసి వెలేసి ఏ నిర్జనారణ్యానికో తోలివెయ్యాలి.

నాకు చావనేది లేదు. ఇలా ఏదో మొండివాడిలా, కుక్కలా, మొద్దులా, పురుగులా బ్రతికి, నా అన్నవారినల్లా ఏడిపించి, ఏడిపించాక, ఎక్కడో పనికిమాలిన చావు నా నొసట రాసివుంది. దానికి నువ్వు బెంగపెట్టుకోడ మెందుకు, అమ్మ కుళ్ళిపోవడ మెందుకు?'

'నీ ఉపన్యాసం పూర్తిఅయితే అంతే చాలురా. నీ ఇష్టంసుమా! నువ్వు ఏ భగవంతుని దయవల్లనైనా మామూలు మనిషివైతే, తిరుపతివెళ్ళి నూరురూపాయలు అర్పించుకుంటాను.'

'ఓ వెఱ్ఱికాయా! భగవంతు డెక్కడున్నాడురా? మనుష్యునిలోని నీరసత్వంవల్ల దేవు డున్నాడని, తమకు తెలియనివి, తమకు మించినవీ, వాడికి పేళ్ళుపెట్టి అర్థంకాక తప్పుకుంటున్నారు. ఎవ రా దేవుడు?'

'మనుష్యులలో పెద్దవాళ్ళూ, చిన్నవాళ్ళూ, వెలివైనవాళ్ళూ, తెలివి తక్కువవాళ్ళూ అని తేడాలున్నాయంటావా?'

'ఆ!'

'అలాగే మనుష్యులకు మించిన వ్యక్తు లుండవచ్చు నంటావా?'

'అన్నీ ఉండవచ్చును. లేందే?'

'లేరని నీకెల్లా తెలుసును?'

'ఉన్నారని నీ కెల్లా తెలుసును?'

'ఉన్నారని అనేకమంది పెద్దలు చెప్తూతున్నారు.'

'లేరనీ చెబుతున్నారు.'

'మనం ఇంగ్లండు వెళ్ళలేదు; అయినా ఇంగ్లండు ఉందని మనం ఒప్పుకుంటున్నామా?'

'వంకాయలు ఈరైలులో లేవు. అయినా వంకాయలనేవి ప్రపంచంలో ఉన్నాయని ఒప్పుకుంటున్నామా?'

'అల్లాగే ప్రపంచంలో కొందరు దేవతల్ని దర్శించారు, కొందరు దర్శించలేరు. దర్శించినవాళ్ళు, దర్శించినట్లు చెప్పారు. దర్శింపని వాళ్ళు లేరని వాదించారు!'

'అంత చవకగాలేదు వాదన. లోకంలో వంకాయలున్నాయని ఎరగనప్పుడు వాదనేరాదు. కొందరు చూచారు. తిన్నారు. వానిని గూర్చి ఇతరులకు ఋజువుచేశారు. ఆ ఋజువుచేసే విధానం, జ్ఞానంకల ప్రతివాడూ ఒప్పుకునేది. కాబట్టి లోకం అంతా ఒప్పుకుంటుంది.'

'అయితే మనం నమ్మదగిన పెద్దలు—రామకృష్ణ పరమహంస, వివేకానందుడు, రమణమూర్తి, అరవిందఘోష్, మహాత్మాజీ మొదలైనవారు స్పష్టంగా దేవుడు ఉన్నాడనిన్నీ, తమ కా అనుభవం కలిగిందనీ చెప్తారే, అంతకంటె ఋజువు ఏంకావాలి?'

'ఓయి పిట్టపిడుగా! ఆ పెద్దలు మంచివాళ్ళే! కాని వాళ్ళు ఓవిధమైన పిచ్చివాళ్ళు. పిచ్చివాళ్ళకు మనస్సులో అనేకమైన భావాలు ఉదయిస్తూ

ఉంటాయి. అవన్నీ వాళ్ళకు నిజంగానే కనబడతాయి. అంతమాత్రంచేత దేవుడూ, దెయ్యమూ ఉందని ఏలానమ్ముతాము?'

లాహోరునుంచి సాయంకాలం బయలుదేరి తెల్లారేసరికి సక్కర్ (మన వాళ్ళు సుక్కూర్ అంటారు) చేరాము. సక్కర్‌లో మూడురోజు లుందామనుకున్నాము. అక్కడ నా పశుత్వానికి తృప్తినిచ్చింది స్నానాలరేవు. సింధ్‌లో ముసల్మానులు ఎక్కువ, హిందువులు తక్కువ. వీళ్ళకు పూర్వ పారశీక యవన పహ్లావాదుల సంపర్కం ఎక్కువ ఉంటుంది. సింధ్‌లో పరదాలేదు. కొద్దిమంది నవాబుల కుటుంబాలలో ఉందేమో? సింధుస్త్రీలవి చంద్రబింబాలలాంటి గుండ్రటి మొహాలు. వాళ్లు పైజామాలు ఉపయోగిస్తారు. కాశ్మీర పంజాబులలో సిల్వార్ లాగు ఉపయోగిస్తారు. అవి వదులుగా ఉంటాయి.

సుక్కూరులో సింధునదికి స్నానానికి పోయాము. అక్కడ ఆడవాళ్లు ఎంత పెద్దకుటుంబాలవాళ్లైనా స్నానంచేసేటప్పుడు పైనున్న చొక్కాలన్నీ తీసేస్తారు. ఒక చిన్న తుండు కట్టుకొని నీళ్లలోకి దిగుతారు. జవ్వనుల బంగారు వక్షోజాలు కాశ్మీర పూవులలాంటి చూచుకాలతో నీళ్ళతో మేల మాడుతాయి. ఒక స్నానంకాగానే మెట్లమీదకు వచ్చి కూర్చొని, సబ్బుతో గాని పిండితోగాని సిగ్గులేకుండా ఒళ్ళంతా రుద్దుకుంటారు. ఆడవారికీ మొగవారికీ ఘట్టాలు ఒకటే! స్నానమంతా అయి ఒళ్ళు మొగవారి ఎదుట సిగ్గులేకుండా శుభ్రంగా తుడుచుకొని చొక్కా వేసికొని, పైజామా తొడుక్కొని ఆపైన కండువా (దుప్పటా అంటారు) వేసుకుంటారు.

మూడురోజులనుకున్న మకాము ఆరురోజులయింది. రోజూ స్నానాల ఘట్టానికి ఉదయమే వెళ్ళి, పదింటికి పదకొండింటికి ఇంటికి వచ్చేవాణ్ణి! మా సుబ్బులు ఆడవాళ్ల ఆ దృశ్యాలు చూస్తే ఎవరైనా తంతారేమోనని భయపడ్డాడు. మా అమ్మ నానాటికి చిక్కిపోతోంది. ఓనాడు నన్ను 'నాన్నా! లక్నో, హరిద్వారం, హృషీకేశం చూద్దామురా?' అన్నది.

మే రెండవ వారంలోనే సుక్కూరునుంచి, షికార్‌పూర్, కరాచీ, క్వెట్టా చూడకుండానే చిన్నబండిమీద ఢిల్లీ, అక్కడనుంచి ఆగ్రా, ఆగ్రానుంచి కాన్పూరు, లక్నో చేరుకున్నాము. లక్నో, అయోధ్యలు చూచి హరిద్వారం చేరుకున్నాము. ఎండలలో మాడిపోయాము.

## 29

నా హృదయానికి, నా మనస్సుకు, నా బుద్ధికి వనితాలోకం తప్ప ఇంకోటి దృశ్యంకావటమేలేదు. ఆడవాళ్ళద్వారా భగవంతునిపైనా, ప్రపంచంపైనా కసితీర్చుకోవాలి. ఆస్తి పోయినవాడికి లోకంలో ధనమంతా వాడి ఆస్తే! అలాగే భార్యపోయిన నాకీ స్త్రీదాహం విపరీతం అయింది.

దాహం తీర్చుకోలేని వ్యాధిపీడితునిలా ఆ వనితాజలధి వెంట తిరగడమే కాని, అందులో మునగలేదు.

కుంతను కాలేని కుదహీనాత్ముణ్ణి, నన్నీ నారీలోకమంతా హేళన చేస్తోందని భావించాను. వాళ్లను హేళనచేశాను. మా ప్రయాణాల్లో వాళ్లు వింటూండగా మాసుబ్బులుతో ఆడవాళ్ళను ఎత్తిపొడవడం, వాళ్లను శంకించడం,దుర్భాషలాడడం సాగించాను. కొందరు మగవాళ్ళు ఆ మాటలను వింటూ నన్ను ఎత్తిపొడిచారు, కొట్టవచ్చారు. ఒకసారి రైలుకూడా ఆపు చేసేటంతవరకు వచ్చింది.

అప్పుడే ఒక మహిళారత్నం నావైపుతిరిగి, పూర్వీభాషలో 'ఓ, అబ్బాయీ! ఇందాకటినుండీ నీ పేలుడంతా వింటున్నాను. నీ మొగం చూస్తే జబ్బుతో ఉన్న మనుష్యునిలా కనబడుతున్నావు. మీబోటి తుచ్చులు, మా స్త్రీలనుచేసే అవమానం మితిమీరిపోతూ ఉంది. నీకు కనబడేది స్త్రీల దేహమా, వాళ్ల అందమా? వాళ్ళ తెలివి అంతా వాళ్ల అందమైన అంగాలలో ఉందా? వాళ్ళు భోగవస్తువులా? వాళ్లు పురుషవాంఛలు తీర్చడానికి పుట్టారా? నీ తప్పుల హిందీ ప్రలాపాలు వింటోంటె నువ్వు మదరాసీవాడిలా కనబడుతున్నావు. మదరాసీ మొగవాళ్లు మా ఉత్తరాది మగవాళ్లకన్న పెద్దమనుష్యలనుకున్నాను. ఛీ! ఛీ! ఏమి బ్రతుకయ్యా నీది!

'రా! నీకు ఆడవాళ్లు పశువులో, దద్దమ్మలో, శక్తిరూపిణులో చూపుతా, మా లక్నో స్త్రీ మండలి అఖాడాకు! నీలో ఇంతైనా మానవత్వం ఉంటే ఈ లాంటి నీచప్రలాపాలు కట్టిపెట్టి నోరు సర్వకాలం మూసుకుని ఉండే ప్రయత్నం చేయి. లేదంటావా, నేనే నాలుగు లెంపకాయలు తగిల్చి నీ జబ్బు కుదురుస్తాను' అంటూ ఆమె నావైపు క్రోధారుణనయనాలతో చూచింది.

మా వాడు ఆమెకు నమస్కారంచేసి, 'అమ్మా! మావాడు చాలా జబ్బులో ఉన్నాడు. రెండుసార్లు చచ్చి బ్రతికాడు. అతని మనస్సు సరిగా లేదు' అన్నాడు.

'ఒరే! సుబ్బులూ నీ కెందుకురా నా గొడవ?' అన్నాను. ఇంతలో లేచాడో గఢార్వాల్ రాజపుత్రుడు. 'ఇస్ లుచ్ఛేకీ బాత్ సున్కర్, మేరా బదన్ జల్‌రహాహై. (ఈ తుచ్ఛుని మాటలు వింటోంటే నావళ్లు మండిపోతోంది)' అంటూ నా దగ్గిరకు వచ్చాడు. నేనూ లేచాను.

నా పూర్వబలం పూర్తిగా పోలేదు. ఇద్దరం ఇంకో నిముషంలో ఎంత కొట్టుకుందుమో, మా సుబ్బులూ, నన్ను చివాట్లు పెట్టిన ఆ లక్నో వీరనారీ లేచి మా ఇద్దరిమధ్య అడ్డంవచ్చారు. వాళ్ళిద్దరూ ఆ రాజపుత్రునికి సద్దిచెప్పారు.

మా అమ్మలేచి ఆ రాజపుత్రునికి నమస్కారంచేస్తూ కళ్లనీళ్లు కారిపోతూ ఉండగా తెలుగులో 'అయ్యా వాడు నాకు ఏకపుత్రుడు. రెండుసార్లు చచ్చి బ్రతికాడు. మనస్సు సరిగాలేదు. రక్షించు నాయనా! వాడిమీద దెబ్బపడితే

చచ్చిపోతాడు. వాడు చస్తే నా ప్రాణం వెంటనే పోతుంది' అంటూ గజగజ వణికిపోయింది.

ఆ రాజపుత్రుడు నెమ్మదించి 'ఘరవానై మాయీ!' అని కూర్చున్నాడు. నేనూ కూర్చున్నాను. రైలు హరిద్వారం వచ్చింది. హరిద్వారం గంగానదికి కుడివైపున ఉంది.. హిమవత్పర్వతాల వెలువడి గంగానది ఆర్యావర్త సమపథాలలో ఇక్కడనే ప్రవేశిస్తుంది. స్టేషనులో దిగాము. ఓ గంగాపుత్రుడు మమ్మల్ని సత్రంలోకి తీసుకుపోయాడు. వెంటనే గంగకుపోయి హరికాచరణ్ ఘట్టంలో స్నానంచేశాము. నేను స్నానంచేయడం పుణ్యంకోసంకాదు. అది హరిచరణ ఘట్టమైనా ఒకటే అసురచరణఘట్టమైనా ఒకటే! స్నానంచేసే ఆడవాళ్ళూ, వేసంకాలంలో స్నానవాంఛా తప్ప మరేమీలేదు. మా అమ్మగారూ, సుబ్బులూ అతిభక్తితో స్నానంచేసి అయిదారు రూపాయలు ఖర్చు చేశారు. వాళ్ళు దగ్గరనే ఉన్న గంగాద్వార మందిరంలోకి వెళ్ళారు. నేను బజారు చూసుకుంటూ సత్రంలోకి వచ్చి కూర్చున్నాను.

ఇక్కడ హరిద్వారంలో రకరకాల సుందరాంగులు నా కంటబడ్డారు. ప్రపంచం స్త్రీ సౌందర్యంతో నిండినట్లే నాకు కనిపించింది. రైలులో ఆ లక్నోవనిత అన్న మాటలు నా మనసు కలతపెట్టుతున్నవి. నాకు ఆ రాజపుత్రుని మీదా, ఆ లక్నో స్త్రీమీదా పట్టరానికోపం లోపల కుతకుతలాడుతున్నది. మేము ఉన్న గదిముందు వరండాలో బోనులోని జంతువులా తిరుగుతున్నాను.

నాకు లోకంమీద కసి తీరలేదు. దైవంమీద కసి తీరలేదు. ఏమి చెయ్యను? దేవుడి గుళ్ళల్లో దొంగతనాలు చెయ్యనా? రాత్రిళ్లు దేవుళ్ల విగ్రహాలను ముక్కలుచేయనా? హరిచరణమట! హరిణనేత్రచరణంకాదూ? స్నానఘట్టంలో రాతిమీద ఓ చచ్చు అడుగు చెక్కి, అది హరిచరణం అనేవాడు ఒక శుంఠ. అది చెక్కించినవాడు మరో శుంఠ. అది నమ్మి పూజించినవాడు అంతకంటె శుంఠ. ఈ శుంఠలందరు దేశాన్ని దద్దమ్మ, చచ్చమ్మ, శుంకమ్మ దేశాన్నిచేసి పాడుచేసిపారేశారు.

## 30

హరిద్వారం వచ్చిన మర్నాడు తెల్లవారగట్ల తిన్నగా స్నానఘట్టానికి పోయాను. ఏమిటూ హరిచరణం? దానికి నా చరణప్రహరణం ఇస్తే ఏమవుతుంది? స్నానఘట్టానికి వెళ్ళడంతోటే అక్కడ అప్పుడే స్నానం చేస్తూన్న సాధువు లెవ్వరూ చూడకుండా, ఇతర దొంగభక్త లెవ్వరూ కనుగొనకుండా హరిచరణాన్ని నాలుగు తన్నులు తన్నాను. ఏమి చేయగలిగిందా చరణం? విష్ణుచక్రం రాలేదే? గరుత్మంతుడు తన్నుకుపోలేదే? పాంచజన్య శంఖారావాలు భూనభోంతరాళాలు వ్రక్కలు చెయ్యలేదే? లోకం తలక్రిందులు కాలేదు. సముద్రాలు పొంగిరాలేదు. మిన్ను విరుచుకుపడలేదు. నక్షత్రాలు డుల్లలేదు. హా! హా! హా! ఓయి వెట్టి విష్ణుపదమా! నన్నేం చేస్తావు నువ్వు?

నువ్వా దద్దమ్మ పంగనామాలవాళ్ళను ఏడిపిస్తావు? నన్నేం చేయగలవు? నాకు నువ్వంటే భయమా?

వికటహాసంతో వచ్చి మెట్లమీద కూర్చున్నాను. నా ఎదుట శకుంతల నీళ్ళల్లో స్నానమాడుతున్నట్లు కనిపించింది. ఇదేమిటి! నా శకుంతల ఎక్కడ నుంచి వచ్చింది? కళ్ళు నులుముకుని చూచాను. ఆమె అక్కడనే స్నానం చేస్తూంది. లోతు అని భయంలేకుండా నిర్భయంగా స్నానం చేస్తూంది. నేను చూస్తుండగానే తన రవిక విప్పి నీళ్ళల్లో పడవేసింది. అది గంగా మహా ప్రవాహంలో కొట్టుకుపోయి మాయమైపోయింది. శకుంతల కట్టుకున్న చీర, ఆ కొట్టుకపోయిన రవిక, ఆమెను పూజించినరోజున నేను అర్పించినవే!

ఆమె నిర్భయంగా అంతలోతు నీళ్ళలో ఆ ప్రవాహవేగావర్తములలో మునుగుచు తన ఘన కచభారాన్ని విప్పి ఆ సౌభాగ్యం గంగానదికే అందం ఇస్తూండగా స్నానం చేస్తూంది. నాకు 'శకుంతలా' అని పిలవడానికి మాట రాలేదు. కట్టెలా, రాయిలా, మొద్దులా, ఆ మెట్లమీద అలాగే కూర్చుండి పోయాను. ఆమె రెండుమూడుసార్లు వెనక్కు తిరిగి నన్ను చూచి, చిరునవ్వు నవ్వింది. ఆ నవ్వులో ఎన్నికోట్ల సౌందర్యాలు నర్తించాయి! ఆ మందహాసంలో ఎన్ని వెన్నెల్లు వికసించాయి! ఆ నవ్వు పెదవులప్రక్క సొట్టలలో ఎన్నిపూవులు ప్రోవులై కురిసిపోయాయి. ఆమె నా ఎదుట సిగ్గులేక ఆ నీళ్లలో భయంలేక చీర విప్పి, చేతుల్లో చుట్టిచుట్టి ఆ ప్రవాహానికి అర్పించివేసింది. ఆమె ఆ దెసమొలతో నెమ్మదిగా నావైపుకు రాసాగింది. ఎందరో స్త్రీలు, పురుషులు ఆ హరిచరణఘట్టం మూగిపోతున్నారు. ఆమె ఘన వక్షోజద్వయ మప్పుడే నీటిబయటకు వచ్చింది. 'అమ్మయ్యో! శకుంతలా తప్పు తప్పు' అంటూ ఆ నీళ్ళల్లో ఆమెవైపు ఉరికాను. శకుంతల దీనహస్తాలు పరుస్తూ, వెనక్కు పోవడం ప్రారంభించింది. ఆమె కంఠంవరకు పోయింది. గడ్డం మునిగి పోయింది. పెదవులు మునిగిపోయాయి. నేను రెండుబారలలో అక్కడకు పోయాను.

నా శ......కుం......త...ల మునిగిపోయింది. నే నా ప్రవాహంలో ఆమె దగ్గరకుపోయి ఆమె మునిగినచోట మునిగి, పైకి తీసి రక్షించుకోవాలనే ఆతురతతో ఒక్క ఉదుటున అక్కడకుపోయి ఉరికాను. ఆ తర్వాత ఏం జరిగిందో నా కేమీ తెలియదు.........

'బాబా! నీ శకుంతలకోసమే అల్లా ప్రాణాలు తీసుకోవడమే?' అని స్పష్టంగా తెలుగుభాషలో ఓ సన్యాసి నన్ను ప్రశ్నించాడు.

నేను లేచి కూర్చుండి 'నా శకుంతల ఏది? ఆమె మునిగిపోయిందా? అయ్యో!' అన్నాను.

'బాబా! ఎందుకల్లా కంగారుపడతావు? నీ శకుంతల లేనేలేదు. నువ్వు భ్రమపడ్డావు. నీటిలో ఉరికావు. నీ చిత్తవృత్తే నిన్నలా చేసింది, నాయనా!'

నేను నా చుట్టూ మూగిన జనాన్ని చూచాను. మా అమ్మ, మా సుబ్రహ్మణ్యం నన్ను పొదివి పట్టుకున్నారు. మా అమ్మ దుఃఖంతో వణికిపోతూ కుంభవృష్టిలా కంటినీరు కారిపోతూవుండగా నాకేసి దీనదృష్టులు, ఆ తల ముసుగుసందులోంచే, పరపుతూ నన్ను కౌగలించుకొని ఉంది.

'బాబా చూచావా! మీ తల్లిగారి దుఃఖము, మీ బావగారి దుఃఖమున్నూ? నీకు ప్రపంచంమీదా, భగవంతునిమీదా ఎందుకీ ప్రళయకాలం వంటి కోపం? నువ్వు భగవంతుణ్ణి అవమానంచేస్తే, ఆ భగవంతునికి కోపం వస్తుందనా నీ ఉద్దేశం! ఓయీ మొరకుమనిషీ! కోపం నిన్నే దహిస్తూన్నది. నీ చదువు నీకు ఊరట కలిగించలేదు. నీ యాత్రలు నీకు శాంతి నివ్వలేదు. నీకు స్త్రీ తుచ్ఛమైన వస్తువుమాత్రం. నీ భార్యగనుక, ఆమెను నువ్వు నీ ప్రేమ పాత్రమైన కుక్కకన్న ఎక్కువగా చూచి అదే ఒక దివ్యప్రేమ అనుకున్నావు. ఆమె దివ్యలోకాలకుపోతే, నీ వస్తువు, నీ స్వంత ఆస్తి, నువ్వు అత్యంతంగా ప్రేమించిన నీ ప్రేమవిధానం పోయిందని, భగవంతునిమీద మండిపోతున్నావు. అంతేనా?

'సద్గురురాయా ఎటువంటి కలగంటినీ
నిర్గుణమందే గుణముల రంగులు
రంగులలోనే గంధము చూస్తిని
సద్గురురాయా ఎటువంటి కలగంటినీ'

అని మా గురువుగారు పాడినట్లు నీ బ్రతుకు ఒక పాడుకల అయింది బాబా!'

సన్యాసి మాటలు వింటోంటే నా కాశ్చర్యము కలిగింది. ఇవన్నీ మా అమ్మ ఆయనకు చెప్పిందనుకున్నాను. అమ్మా, మా సుబ్బులు ఆయనకేసి తెల్లబోయి చూస్తున్నారు. ఉన్నట్టుండి మా అమ్మ ఆయన కాళ్ళమీదపడి, 'స్వామీ మా అబ్బాయిని రక్షించండి బాబూ!' అని వాపోయింది.

## 31

ఆ స్వామి తనతో మమ్మల్ని తమఆశ్రమానికి తీసుకుపోయారు. ఆ ఆశ్రమంలో అయిదారుగురు స్వాములున్నారు. అందులో ఇద్దరు గోసాయీలు. స్వామి మమ్మల్ని తన నివాసభాగంలోనికి తీసుకుపోయి అక్కడ ఉన్న కృష్ణాజినాలమీద మమ్మల్ని కూచోమని, తాను లోని గదులలోనికి వెళ్ళారు. మేము ముగ్గురము మాటలులేకుండా ఆ చాపలపై కూర్చున్నాము. ఇంతవరకు నాస్థితి ఇలాంటిదని చెప్పలేను.

నేను గంగలో ఉరుకుతుండగా తానూ, మా అమ్మా గంగ ఒడ్డుకు పరుగెత్తుకు వచ్చామనీ; అలా పరుగెత్తుకు రావడానికి కారణం, నా పక్కమీద నేను లేకపోవడమేననీ; నేను గంగలో ఉరికి ప్రాణం తీసుకుంటాననే వాళ్ళకు భయంవేసే వచ్చారనీ; వాళ్ళు వచ్చేరావడంలో ఈ స్వామి గంగలో నావెనకే

ఊరికి నన్ను నిముషంలో ఒడ్డుకు చేర్చడం చూశామనీ; నేను పదినిమిషాలు ఒళ్ళు తెలియక పడిఉండడం చూచి, మా అమ్మ ఘొల్లున ఏడ్చిందనీ; ఆ స్వామి మా అమ్మతలపై చేయివేచి, 'అమ్మా! నీ కుమారునికి ఏమీ భయంలేదు. అతని జీవితం పూర్తిగా మారిపోయి, మళ్ళీ యథాప్రకార మవుతాడు. అతని భవిష్యత్తు బాగుంటుం'దని చిరునవ్వుతో ధైర్యం చెప్పారనీ, ఇంతలో నేను కళ్ళు తెరిచా ననీ దారిలో సుబ్బులు నాకు చెప్పాడు.

నా కిదంతా ఆశ్చర్య మనిపించింది. ఎవ్వ రీ స్వామి? ఆయన్ని చూచే టంతలో నాకూ ఏదో శాంతి కలగడమేమిటి? ఇదంతా నాలో అణిగిఉన్న నీరసత్వమేనా? నా ఆవేదన ఓ వెఱ్ఱి బోడిగుండుస్వామి అన్నమాటలతో చల్లారిపోవడమా? నా హృదయం అందుకు సంసిద్ధపడి ఉందికాబోలు. ఇన్ని యుగాలనాటినుంచీ ఉన్న ఈ మూర్ఖభావాలు ఒక్కసారిగా పోతాయామరి? కాషాయాంబరాలు ధరించు ఓమాయకాడు కంటబడగానే, సాష్టాంగ దండ ప్రణామాలు చేయడానికి అందరమూ సిద్ధమౌతాము. అలవాటు చేసుకొన్న వాడికి ఎదుటివారి హృదయం నిముషంలో అవగతంఅవుతుంది. ఈ సన్యా సులు ఆ విద్యలో పరమ ప్రవీణులు. ఆ గంగలోపడి నా శవంతలతో పోనీక ఈతడు నన్ను రక్షించడ మేమిటి?

ఇంతలో స్వామి లోపలనుంచి మా వద్దకు వచ్చారు. మేమంతా లేచి నుంచున్నాము. స్వామిజీ మోము అంత అందమైనది కాదు. కాని ఆ మోములో ప్రసరించే అద్భుతమైన కాంతులు, నేను వర్ణింపలేనివి. అవి ఆ గదంతా వెలిగించినట్లే నాకు తోచింది. ఆరడుగుల పొడవు, దబ్బపండు ఛాయ, ముప్ఫయిఏళ్ళు పైన ఉండవచ్చును. నాకు మాత్రం ఆయన ఇరవైఏళ్ళ యువకునిలా కనుపించారు. మమ్మల్నందరినీ కూర్చుండ నియమించి, స్వామిజీ చిరునవ్వుతో నావైపు చూచి, 'బాబా! నా ఈడు ఎంతని నీ ఉద్దేశం?' అన్నారు.

నే నాశ్చర్యంతో 'చిత్రం! చిత్రం! ముప్ఫయి ఉండవచ్చును' అన్నాను.

'నా కిప్పుడు ఏభై ఆరేళ్ళు! నీవంత ఆశ్చర్యపడ నక్కరలేదు. మా గురువుగారికి తొంబది ఏళ్ళున్నాయి. ఆయన నా కన్న చిన్నవారుగా కనబడు తారు. నీ హృదయంలో అనుమానాలు పూర్తిగా వదలలేదు. వదిలితే నువ్వు అందరితోపాటే అవుతావు. మూర్తీ! నీ పేరు నాకు మంత్రశక్తివల్ల తెలియ లేదులే...మీవాళ్ళే చెప్పారు. నీ భార్య పోయింది. నీ భార్యను నువ్వు అతి గాఢంగా ప్రేమించావు. దాంతో నువ్వు డ్రైవరులేక పరుగెత్తే మోటారు కారు వయ్యావు. ఆ కారు చివరకు గంగలో ఉరికింది. నువ్వు పట్టి భ్రమ వల్లనే గంగలో ఉరికావని నాకు తెలుసును బాబా! నేను నీకో వైద్యము కెబుతాను. నువ్వు నాతో కైలాసయాత్రకు రా! మీ అమ్మగారు, ఈ సుబ్ర హ్మణ్యం మీ మేనమామల ఊరు వెడతారు.'

మా అమ్మ భయంతో చేతులు జోడించి, 'స్వామీ, మా అబ్బాయిని నే నెలా వదిలి ఉండగలను?' అన్నది.

'అమ్మా! భయపడకండి. నన్ను నమ్మండి. ఆరునెలల్లో మీ అబ్బాయి తిరిగి మీ ఇంటికి వస్తాడు. ఈలోగా మీకో చిన్నమంత్రం ఉపదేశిస్తాను. అది మీరు పునశ్చరణ చేసుకుంటూ ఉండండి.'

మా అమ్మ స్వామివైపు చూచింది. ఆయన మోము, పాదాలు రెండు సార్లు తిలకించింది. 'తమ ఆజ్ఞకు నేను బద్ధురాలను' అన్నది.

నా కిదంతా ఆశ్చర్యంగా ఉంది. నేను కైలాసమూ రాను, గియలాసమూ రాను అనడానికి సిద్ధంగా ఉన్నాను. స్వామిజీ నావైపు చూచి, 'బాబా! నువ్వు నాతో కైలాసపర్వత దర్శనానికి రా! అక్కడ అందమైన ఆడపిల్లలెవరూ లేరు. నువ్వు భక్తితో ప్రార్థనలు చేయనక్కరలేదు. నీకు దైవము వద్దు. నేను 'దైవాన్ని నమ్ము' అని నీతో ఒక్కమాటూ అనను. ఆ మాట నీకు ఇస్తాను. కాని క్షతమైన నీ హృదయానికి శాంతి ఆ ప్రయాణంలో లభించితీరుతుంది. నీ మనస్సులో ఉన్న అనుమానాలు ఆ నిర్మల నిశ్చల ప్రదేశాలలో నివృత్తి అవుతాయి. ఆ ప్రదేశాల అందమే నీకు భోజనం అవుతుంది. ఆ ప్రాంతాలనుండి మనం తిరిగివచ్చిన తర్వాత నీ ఇష్టంవచ్చినట్లు నువ్వు సంచరించు. నా అభ్యంతరం లేదు. నేను నిన్నేరకమైన వాగ్దానమూ ఇమ్మని కోరను' అని అత్యంత గంభీరంగా పలికినారు. నేనవశుడనై, 'తప్పక వస్తానండీ' అన్నాను.

## విష్కంభము

హేమసుందరి త్యాగతికథ ఇంతవరకు చదివేటప్పటికి తెల్లవారగట్ల రెండున్నర అయినది. ఎంత విచిత్ర సంఘటన! త్యాగతి ఆలా అయినాడా? తనబావ శ్రీనాథమూర్తేనా ఈ త్యాగతి? ఎన్ని బాధలు తెచ్చిపెట్టుకున్నాడు! అతని గర్హించాలా, లేక అనుక్రోశించాలా? ఆమె ఆ పుస్తకాన్ని పక్క సోఫా మీద పెట్టింది. సుశీల విషయంలో అతడు పప్పులో కాలువేశాడు! కాని అత డేమి చేయగలడు? కాశ్మీరంలో, లాహోరులో, సుక్కూరులో అతని పోకడలు అసహ్యంగా, జుగుప్సాకరంగా ఉండలేదా? స్త్రీ అంతచులకనా! స్త్రీ అంటే అంత పశుభావమా? కాని ఈ గ్రంథం ఇంత బట్టబయలుగా త్యాగతి రాయడంలో ఉందే పరమార్థ మేమిటి? ఈ గ్రంథం అచ్చువేస్తాడా?

ఆ గ్రంథాన్ని మళ్ళీ తీసింది. మొదటి పేజీ చదివింది. 'ఈ నా తుపాను హేమకుసుమదేవికోసం మాత్రమే! ఆమె నేను ఎవరినో తెలియక నన్నుగురించి అనేక ఊహలు ఊహించుకొంటున్నది. ఇంక నేను రహస్య వ్యాజాన అసత్యదోషాన్ని ఆచరిస్తూ ఉండలేను. నేను చేసినపని గురువు ఆదేశంమీదనే! 'నీకు ఉచితమని తోచిన మరుసటి క్షణంలో నీ రహస్యం నీ వాళ్ళకు చెప్పు' అని గురువుగారన్నారు. అయినా ఆ కాలపరిమితినికూడా నేను కావాలని దాటబుచ్చాను.

'హేమసుందరితో స్నేహం వాంఛించాను. నాలో బయలుదేరిన సమస్యను నేను విడదీయలేకపోయాను. ఆ కారణంచేత నా గురువు ఆజ్ఞప్రకారం

కొన్ని నెలల క్రిందటనే హేమకు నా విషయం యావత్తు పూర్తిగా చెప్పాదామని ప్రయత్నం చేశాను.

'కాని అలా చేయలేకపోయాను. ప్రచ్ఛన్నంగా ఉండి మాయవేషం వేసిన దోషం నన్ను పూర్తిగా అలుముకొన్నది. ఆ దోషానికి నేనే బాధ్యుణ్ణి.

'అయితే హేమా! నా కథ చివరవరకూ చదువు. అప్పుడు నన్ను క్షమించు. అంతే నేను కోరేది.'

తనకోసమేనా, త్యాగతి ఈ కథ వ్రాసింది? అతని ఉద్దేశం?

హేమ అలా ఆలోచనతో కూర్చుండిపోయినది. త్యాగతి అంటే ఏవేవో స్వప్నసౌధాలు కట్టడం ప్రారంభించింది అతన్ని తాను. అత డంటే ఏవేవో విచిత్ర భావాలు తనకు కలగడం ప్రారంభించాయి. అతన్ని తాను... ప్రేమిస్తున్నానా అనుకుంది. అత డంటే తన కున్న గౌరవం అప్రతిమానమైన స్థితికి వచ్చింది.

అతడు తనబావ శ్రీనాథమూర్తేనని తెలియగానే హేమసుందరి అత్యం తాశ్చర్యంలో మునిగిపోయింది. అతని కథ తెలుస్తున్నకొలదీ ఆమెలో ఏవేవో విచిత్ర భావాలు కలిగి అణగిపోతున్నవి. అతని ఆ జీవితానికి ఈనాటి త్యాగతికీ ఏమి సంబంధం ఉంది? లోకేశ్వరి మంచంమీద లేచి కూర్చున్నది. 'హేమా! ఎంతసేపయింది నువ్వు లేచి?'

'చాలా సేపయింది. కథ మళ్ళీ చదవడం ప్రారంభించాను.'

'కళ్ళు విప్పగానే నిన్ను చూచి అదే అనుకున్నాను. నాకు మాత్రం వెఱ్ఱినిద్ర పట్టింది. ఇంకా మత్తు వదలలేదు. కాసేపు నిద్రపోతా. నువ్వు పుస్తకం పూర్తికాగానే లేపుతావుకదూ?'

ఈ ముక్కలంటూనే లోకేశ్వరి ప్రక్కమీద వాలిపోయింది. పడుకున్న పది నిముషాలల్లో లోకేశ్వరి నిదురకూరిందనే హేమ 'భావించుకుంది. కాని లోకేశ్వరికి నిదురపట్టలేదు. ఆమె అతిగాఢమైన నిద్రలో మునిగిపోయినట్లు నటించడం ప్రారంభించింది.

హేమసుందరి త్యాగతికథ మళ్ళీ తీసింది. మళ్ళీ సోఫాపైనుంచి లేచి వెళ్ళి కూజాలో నీళ్లు తాగివచ్చి, చదవడం ప్రారంభించింది.

* * * *

స్వామిజీ బోధనలు వింటూ మా అమ్మ హరిద్వారంలో వారంరోజులు ఉంది. నేను కైలాస ప్రయాణానికి వలసిన సన్నాహాలన్నీ స్వామిజీ సలహా ప్రకారం చేయడం ప్రారంభించాను.

వేడికి ఉన్ని దుస్తులు కుట్టించుకున్నాను. చేతులకు తోలుతొడుగులు కొనుక్కున్నాను. దారిలో భోజనానికి వలసిన సామగ్రి సేకరించాను. మాతో వచ్చేందుకు ఒక లేప్చాను మాట్లాడుకొన్నాను. హృషీకేశం వెళ్ళగానే అక్కడ మా సామాను మోసుకువచ్చేందుకు హిమాలయపు పొట్టిగుఱ్ఱాన్ని

ఏర్పాటుచేసుకున్నాను, సిగరెట్లు, చుట్టలు, అగ్గిపెట్టెలు దిట్టంగా సేకరించాను. ఒక డబ్బా కిరసనాయిలు, ప్రైమస్ స్టవ్ నూ కొన్నాను.

నా యాత్రా సంరంభం చూస్తూ స్వామిజీ నవ్వుకుంటూ ఉండేవారు. ఢిల్లీకివ్రాసి ఒక చిన్న డేరా ఖరీదుకు తెప్పించుకున్నాను. ఆ డేరాకు రెండు గుఱ్ఱాలు అదనంగా మాట్లాడాలట. ఒక చిన్న మహారాజుకైన ఖర్చు అయినది. నా సరంజాము పూర్తికాగానే మేమంతా హృషీకేశ్ నగరం వెళ్ళాము.

మా తల్లికూడా నాతో ప్రయాణమయితే స్వామిజీ వద్దన్నారు. అందుకు చాలా కారణాలున్నా యన్నారు. మా అమ్మ స్వామిజీ ఉపదేశ ప్రకారం హృషీకేశ యాత్ర పూర్తిచేసుకుని గయ, కలకత్తా, పూరీలమీదుగా భట్టిప్రోలు వెళ్ళడానికి నిశ్చయం చేసుకున్నది. మా అమ్మ నన్ను తనగదిలోకి రమ్మని, 'నాన్నా! నాకు నువ్వు నమస్కారంచేసి చాలా రోజులయిందిరా. ఒక్కసారి నాకు నమస్కారం చేయరా!' అన్నది.

మా అమ్మగారి ప్రేమ పొంగిపోయి, నన్ను ముంచెత్తింది. కరిగిపోయిన హృదయంతో అప్రయత్నంగా, నేల సాగిలబడి, ఆమె పాదాలు రెండూ స్పృశించాను. 'దీర్ఘాయురస్తు. బహుసంతాన ప్రాప్తిరస్తు. నాన్నా! నువ్వు తిరిగి వచ్చేవరకు నా పంచప్రాణాలు నీతోనే ఉంటవి. ముందు సంవత్సరం మన మిద్దరం వేసవికాలంలో మళ్ళా హిమాలయయాత్రలు చేద్దాము. ఇప్పుడు నేను జగన్నాథం మీదుగా భట్టిప్రోలు వెళ్ళి, అక్కడ నీకోసం ఎదురు చూస్తుంటాను' అంటూ కన్నీళ్ళు తిరుగుతుండగా కళ్ళు మూసుకొని ఆశీర్వచన హస్తం చాపి నిల్చునిఉంది. పిమ్మట నాతల, హృదయం, భుజాలు, మోము తడిపి, పెదవులు కదుపుతూ నిశ్శబ్దంగా ఆశీర్వదిస్తూ 'నాన్నా వెళ్ళి సర్దుకో' అన్నది.

మా ప్రయాణం ఏదో కొత్త లోకంలోవలె పదివేలఅడుగుల ఎత్తున ఉంటుంది. పదిహేనువేలు, ఇరవైవేల అడుగులవరకూ ఎత్తు పెరుగుతూ ఉంటుంది. హిమాలయాలను తలచుకొంటూ, మా అమ్మను తలచుకొంటూ గంగఒడ్డుకు వెళ్ళి కూర్చున్నాను. గంగామాయీ, మాఅమ్మా ఒకటిగా నాకు తోచారు. నా హృదయకలశం ఏవో వింతభావాలతో నిండిపోయింది. ఏవో తెలియరాని వేదనలు, అర్థంకాని కాంక్షలూ, తెరచాటున ఉన్న మూర్తులూ, నా జీవితాన్ని మూలమంటా కదల్చివేస్తూ ముందుకు వచ్చినట్లయినది.

ఎవరిబాధలు ఎవరికి తెలుస్తాయి? ఆవేదనలు కాని, ఆనందాలు కాని వ్యక్తిసంబంధమైన గోప్యాలు. నేను ఈ ప్రపంచంలో ఒక్కణ్ణే అయిపోయాను. దుఃఖం కానీ, సంతోషం కానీ, ఆవేదన కానీ అవి ఎవనిలో ఉద్భవించాయో వానికే తెలియకుండా ఉంటాయి కాబోలు. అవి వ్యక్తం చేసుకున్న కవీ, చిత్రకారుడూ, ప్రతి సహృదయుని హృదయంలోనూ ప్రతిధ్వనిస్తారు. ఇదే కాబోలు వ్యక్తిగత సృష్టిలోని విశ్వత్వము. ఆ ఆలోచనలో

నాకు కృష్ణశాస్త్రి ఆవేదన అర్థమైంది. ఆ మహాకవి మధురమైన ఆవేదన అంతా, అందుకోలేని సౌందర్యంకోసం, ఆనందంకోసమేకదా! మహాకవీ నువ్వూ నావలెనే వేదనపడ్డావా?

మనుష్యుడు కోరే ఆ సౌందర్యం ఏమిటో? అది స్త్రీస్వరూపంగా ఎక్కువ సన్నిహితం కావచ్చును. అంతకు తక్కువ, ప్రకృతిసౌందర్యం కావచ్చును. వీటికి కొంచెం తక్కువగా మానవజీవిత సౌందర్యం రావచ్చును. కాని వీటి అన్నిటికి మించిన దేనికోసమో మనలో ఈ ఆవేదన సర్వకాలమూ ఉంటుంది. ఆ ఆవేదన మన బ్రతుకుకు సన్నిహితంగానూ, అతీతంగానూకూడా ఉంటుంది. ఈ ఆవేదననే విశ్వనాథ సత్యనారాయణ కవిసామ్రాట్టు, శ్రీకృష్ణ నిర్వేదంగా పాడాడు. ఈ ఆవేదన రసస్వరూపం తాల్చబోయే దోరపండువంటి భావం. పండగానే కావ్యం అవుతుంది. ఏవో నాభావాలు నా తల త్రిప్పి వేసినవి. ఎదుట కేదారగౌళ పాడుకుంటూ గంగానది ప్రవహిస్తూంది. గంగానదీ! నీలోవున్న ఆవేదన ఏమిటి అని ప్రశ్నించాను. అలా సంతతజన్మయై, సంతత వేగవతియై, సంతత జీవితయై, సంతత మరణయై, ఏదో మహాభావము సర్వ విశ్వానికి ప్రసరింపచేస్తూ ఉంది.

"గంగానదీ! నీ రహస్యము నేను నీ దారిపొడుగునా ప్రయాణించి, నీ పుట్టుపూర్వోత్తరాలు గ్రహించి నాలో నీ ఝురీవేగరాగిణీ స్వరాలాపన శ్రుతిని లయింపచేసుకుంటానమ్మా! నువ్వూ, మా అమ్మే నా ప్రపంచం. నా కింకేమీ అక్కరలేదు. ఈ స్వామిజీ నా చేయి పట్టుకుని నీ మాతృహృదయాకాశ యానం చేయిస్తాడు. నీ ప్రవాహరహస్య గాథను అవగతం చేస్తాడు" అని అస్పష్టవాక్కులతో అనుకున్నాను.

"నీవు పుట్టెదవోయి!
నీవు నడచెదవోయి!
నీలోన ఝురులుగా
నీలోన వరదలై
నేనె ప్రవహింతు నోయీ!" అని గంగ పాడినట్లయింది.

## 32

హరిద్వారం చేరుకున్నాము. మా అమ్మగారు 'కాశీలో, ప్రయాగలో, బృందావనంలో, గోవర్ధనంలో, హస్తినాపురంలో, లక్నోలో, అయోధ్యలో మనుష్యుల సంపర్కం ఎక్కువ. కాని హరిద్వారం వచ్చేసరికి దేవతా సంపర్కం కలుగుతున్నది' అన్నది.

హరిద్వారానికి పూర్వపుపేరు మాయావతి. మాయావతి పట్టణ శిథిలాలు ఇప్పటికీ చూస్తే హరిద్వారానికి సంబంధించే కనబడుతున్నవి. పట్టణంలో కొంతభాగాన్ని మాయాపురి అనే పిలుస్తారు. హరిద్వారంలో గంగానది అందమే వేరు. గంగానదిలో మాతృభావం పొంగిపోతూ ఉంటుంది.

యమునలో ప్రియురాలిభావం పరవశత్వం కలిగిస్తుంది. గంగ జ్ఞానస్వరూపిణి, యమున ప్రేమస్వరూపిణి. అంతర్వాహినయైన సరస్వతి విజ్ఞానరూపిణి. 'పూర్ణగంగామాయి తేజోరూపిణియై; ప్రాపంచిక పథాల విహరించడానికి అవతరించిన మోక్షదేవి' అన్నారు మా స్వామిజీ.

హరిద్వారంలో హిందువులు కానివారు ఆస్తి సంపాదించకూడదు. ఒక్క మసీదుగాని, చర్చిగాని హరిద్వారంలో లేవు. హరిద్వారపట్టణ సరిహద్దులలో మాంసము తినరాదు. చేపల పట్టరాదు, పక్షుల హింసింపకూడదు. సారాయి మొదలైన మత్తుపదార్థాలు పట్టణంలోకి రారాదు. ఈ నిబంధనలన్నీ ఇతర పుణ్యస్థలాలలో లేవు. నేను సిగరెట్లు పట్నంబైటనే కొనుక్కొన్నాను. ఇచట బ్రహ్మచర్యాశ్రమాలు ఎన్నో ఉన్నాయి. ఇక్కడనుండి యాత్రికులైన స్త్రీ పురుషులు కామసంపర్కం వదలివేస్తారు. హిమాలయవాసులకే అది ఆరోగ్యకరమట గాని, ప్రయాణీకులకు రోగకారణమౌతుందట. వేదాధ్యయనం ప్రతిచోటా వినబడుతూ ఉంటుంది. ఇక్కడ ఉచ్చారణ వేరు. మన ఆంధ్రుల ఉచ్చారణమే స్పష్టంగా, సలక్షణంగా ఉంటుంది. వానప్రస్థాశ్రమాలు, గురుకులాలు, ఆయుర్వేద కళాశాలలు ఎన్నో ఉన్నవి.

మేము మదరాసీ ధర్మశాలలో మకాంపెట్టాము. మా సుబ్బులుకు ఈ పట్టణం కన్నులవైకుంఠంగా ఉంది. వాడి ఆనందం వర్ణనాతీతం. గంగాద్వార దేవాలయం ఉండేదని హుయన్‌త్సాంగు వ్రాశాడు. ఆ దేవాలయం ఇప్పటికీ అక్కడ ఉన్నది. గంగాద్వారం తర్వాత ప్రసిద్ధికెక్కిన స్థలం బ్రహ్మకుండం. ఇక్కడ బంగారు వెండిపాత్రలలో అస్తులు కలుపుతారు. బ్రహ్మ ఇక్కడ తపస్సు చేశాడు. ధర్మాంగదుడు పామై ఉన్నప్పుడు అతనిభార్య అతన్ని ఇక్కడకు తీసుకువచ్చి స్నానం చేయించగానే, అతడు శాపంపోయి అందమైన రాజకుమారుడయ్యాడట. ఈ కథ నిజమైఉండాలంటాడు మా వెఱ్ఱిసుబ్బులు. తల్లీ కుమాళ్ళు ఒకళ్ల నొకళ్లు కామించుకోగానే కుష్ఠురోగులయ్యారుట. అప్పుడు బుద్ధివచ్చి దేశాలు తిరిగితిరిగి ఈ బ్రహ్మకుండంలో స్నానంచేసేసరికి, వారి పాపాలు క్షయమై యథారూపాలు పొందారుట.

గంగానది ఇక్కడ రెండు పాయలౌతుంది; ఆ చీలికలను ధారలంటారు. చండీధార చండీ పర్వతం ప్రక్కనే దక్షిణంగా ప్రవహిస్తుంది. రెండవధార శివాలిక్ పర్వతం ప్రక్కగా వచ్చి, హరిద్వారం, మాయాపురం, కనఖలపట్నం పవిత్రంచేసి, చండీధారతో కలుస్తుంది. ఈ ఉత్తరధార శివాలిక పర్వతాన్ని స్పృశించినచోట బ్రహ్మకుండం ఉంది. బ్రహ్మకుండం దిగువగా గంగాద్వారాలయం, హరిచరణఘట్టం ఉన్నాయి. గంగ విష్ణుపాదజ అనే భావానికి చిహ్న ఈ హరిచరణ ఘట్టం. భారతదేశంలోని సంస్థానాధీశులు ఈ రోజులలో క్షేత్రాలన్నిటా మెట్లు, ఇనప గొలుసులు మొదలైన అనుకూలాలెన్నో చేశారు.

బ్రహ్మకుండానికి దక్షిణంగా గోఘట్టతీర్థ ముంది. గోహత్యాపాతకం పోతుందట. దత్తాత్రేయమహర్షి ఇక్కడే తపస్సు చేశాడుట. ఆ తర్వాత

కుశాతీరముంది. తర్వాత విష్ణుతీరము, తర్వాత బిల్వపర్వము. ఇంతటితో శివాలిక్ పర్వతం ఆఖరు. ఇక్కడ బిల్వకేశ్వరుడు వెలిసి ఉన్నాడు. మాయాపురం దగ్గర గణేశతీరము, నారాయణశిల తీరము ఉన్నాయి. చండీధార ప్రక్కనున్న చండీపర్వతంమీద చండీ దేవాలయంవుంది. పర్వతపాదంకడ గౌరీశంకర దేవాలయంవుంది. అక్కడే ఇల్లేశ్వర దేవాలయం వుంది. హరిద్వారానికి ఎదురుగా ఈ చండీపర్వతముంది.

మా సుబ్బులు నన్నీ తీర్థాలన్నీ తిప్పాడు. మా అమ్మగారు అన్ని దుఃఖాలు మరిచిపోయి, నేను కైలాసంనుంచి తిరిగివచ్చేవరకూ ఇక్కడేవుండామనుకొన్నది. కాని స్వామిజీ ఆవిడ హరిద్వారంలో వున్నంతకాలం వుండి, భట్టిప్రోలుమాత్రం వెళ్ళాలని ఆదేశం ఇచ్చారు.

స్వామిజీని కలుసుకొన్న పదవరోజున మేమంతా భీమగోడాతీర్థానికి వెళ్ళాము. ఇదే మా కైలాసయాత్రా ప్రారంభం. మా అమ్మగారూ, సుబ్బులూ హృషీకేశంవరకూ వస్తారు. అక్కడ మేమంతా మూడురోజులుంటాము. ఆ తర్వాత హిమాలయం ఎక్కుతాము. ఇది మా ప్రయాణం ఏర్పాట్లు. మా యాత్ర సాగినతర్వాతకూడా మా అమ్మగారూ, సుబ్బులూ కొన్ని రోజులు హృషీకేశంలో మకాంచేసి, హరిద్వారం వెళ్ళి అక్కడ ఇంకా కొన్నిరోజు లుండి, ఇంటికి వెడతారు.

మొదట సప్తస్రోతతీర్థము వెళ్ళాలి. హరిద్వారానికి మూడుమైళ్ళ తూర్పుగా వెళ్ళాలి. ఇక్కడ గంగానది ఏడుపాయలుగా చీలింది. సప్తస్రోతంలో ఏకాంతవాసంచేసే ఋష్యాశ్రమాలు చాలా ఉన్నాయి. ఇక్కడనుంచి హరిద్వారానికి దక్షిణంగా కనఖలతీర్థం వెళ్ళాము. కాళిదాసు తన మేఘసందేశంలో ఈ నగరాన్ని అందంగా వర్ణించాడు. ఈ కనఖలపురం దగ్గర పతితపావనేశ్వర, దక్షేశ్వర, తిలవధేశ్వర మహాదేవాలయా లున్నాయి. ఇక్కడే సతీకుండం ఉన్నది. సతి ఇక్కడ దక్షయజ్ఞశాలలో ప్రాయోపవేశం చేసింది. ప్రక్కనే దక్షేశ్వరాలయమూ ఉన్నది. ఇవన్నీ చూచుకొని భీమగోడాకు పోయాము. అక్కడ స్నానంచేసి హరిద్వారం వచ్చి రైలెక్కి పదిహేనుమైళ్ళ దూరంలో ఉన్న హృషీకేశం చేరుకున్నాము.

## 34

హృషీకేశం ఎంతో విచిత్రమైన పట్టణం. అక్కడ శ్రీరామ మందిరము, భరతాలయాలను దర్శించాము. మా స్వామిజీ మా కోసం చేసిన సదుపాయాలు అన్నీ ఇన్నీ కావు. ఎవరీ స్వామిజీ ? వీరు పూర్వాశ్రమంలో, నెల్లూరిజిల్లా కావలిపుర వాసులు. వారింటిపేరు ధనికొండవారు. వారి పూర్వాశ్రమంపేరు నారాయణరావుగారు. ఎమ్. ఏ., బి.ఎల్. పరీక్షలో కృతార్థుడై, నెల్లూరిలో న్యాయవాదిపని చేస్తూ, 1919 లో భార్య, ఇద్దరు కుమార్తెళ్ళూ, తండ్రీ ఇన్ఫ్లూఎంజా జబ్బువల్ల మరణిస్తే, జీవితాన్ని రోసి, హిమాలయాలకు వచ్చి బదరీ,

కేదార, గంగోత్రి, గోముఖ, యమునోత్రి, సత్పథాది యాత్రలుచేసి హృషీకేశంలో అఖిలానంద భారతీస్వాములవారి శిష్యులై, ఆశ్రమం తీసుకొన్నారు.

నారాయణరావుగా ఉన్నంతకాలం తన కుటుంబం, సంపాదన తప్ప ఇంకేమీ ఎరగడు. ఆశ్రమం తీసుకొన్నతర్వాత, సర్వకాలం తపస్సు, పఠనం ఇవి ఆయన పనులు. గురువులు వీరికి కైలాసానంద భారతి యని నామకరణం చేశారు. వీరు ఆశ్రమం పుచ్చుకొని ముందు కైలాసపర్వత సందర్శనమూ, మూడుసారులు ఆ మహాపర్వతానికి ప్రదక్షిణమూ చేసి వచ్చారట. ప్రతి సంవత్సరమో, లేకపోతే రెండేళ్ళ కొకపర్యాయమో కైలాసానందులు, కైలాసయాత్రచేసి వస్తూ ఉంటారు. ఒక్కొక్కప్పుడు ఒక ఏడాదంతా కైలాసపర్వతం దగ్గరఉన్న బౌద్ధాశ్రమాలలో నివసిస్తూ తపస్సు చేసుకుంటూ ఉంటారు.

కైలాసానందులు సాంగ వేదులై, ప్రస్థానత్రయశాంతిచేశారు. భాష్యత్రయం గళగ్రాహంగా వచ్చును. పాతంజలం మొదలైన యోగగ్రంథాలు క్షుణ్ణంగా వచ్చును. తపస్సువల్లనో ఏమో వారికి ఏకసంథాగ్రాహిత్వం అతి సులభంగా అబ్బింది. షడ్దర్శనాలు, మతేతర దర్శనాలు పూర్తిగా వచ్చును. రామకృష్ణ మఠం వారి గ్రంథాలు, రామతీర్థుల గ్రంథాలు, సత్సంఘ గ్రంథాలు శివకామతసుల గురుగ్రంథ సాహెబ్జీ ఉపదేశాలు, ఆగమాలు, పాశ్చాత్యుల వేదాంతాలు అన్నీ సర్వకాలం చదువుతూ ఉంటారు. హరిద్వారంలో వీరు మానససరోవరాశ్రమం ఏర్పాటుచేశారు. ఆ ఆశ్రమంలో గ్రంథాలయం ఉంది. అన్నిభాషలూ నేర్చుకున్నారు. త్రివిష్టపపు వ్రాతగ్రంథా లెన్నో సముపార్జించారు. అనేక సన్యాసులు వీరి ఆశ్రమానికి గ్రంథపఠనంకోసం వస్తారు. వీరి శిష్యులు దేశం అంతా ఉన్నారు. కోటీశ్వరులు, మహారాజులు దరిద్రులు ఎంతమందో వీరిశిష్యులు. బీద సన్యాసులకు సర్వ సహాయాలు చేస్తూ ఉంటారు. వీరు పూర్తిగా అహింసావాదులు. గాంధీగారు అవతారపురుషులనే వీరి ఉద్దేశం. మూడు నాలుగుసారులు వీరా మహాత్ముని సందర్శించారు.

వాదనలో మా స్వామిజీని జయింపలేము. వాదన అవసరంలేకుండా హృదయానికి అమృతభోజనం ఆరగింపజేస్తారు వారి ఉపదేశాలల్లో. వీరి మహాత్మ్యం చాలా గొప్పదని హరిద్వార హృషీకేశాదులలో అనేకులు మాతో చెప్పారు. హాస్యంచేసి నవ్విస్తారు. మోమాటంలేకుండా అన్ని విషయాలు చెప్పుతారు. ఎప్పుడు కునుకుతారో నేను కనిపట్టలేకపోయాను. ఎప్పుడూ చదువుతోనో జపంచేసుకుంటూనో కనబడుతారు. స్వామిజీ మంచి గాయకులు. సైగల్ గొంతునుమించిన తీపి మందరం గొంతుతో జపాదులు లేనికాలాల్లో, ప్రయాణం చేసేటప్పుడు, రాత్రిళ్ళు ఎప్పుడూ తత్త్వాలు పాడుకుంటూ ఉంటారు.

హృషీకేశంనుంచి దేవప్రయాగ వెళ్ళాము. మోటారుబస్సుపై పది హేనుగురు స్వాములు, మా స్వామిజీ, నేనూ ఒక రాజపుత్ర జమీందారుడూ, సిబ్బందీ, అందరము ఇరవైనలుగురము, ఒక జట్టయి హిమాలయ యాత్ర

ప్రారంభించాము. ఇంతవరకు స్వామి నా కేమీ బోధించ ప్రయత్నించలేదు. నేను ఆయన్ను ప్రశ్నలూ వేయదలచుకోలేదు. మా అమ్మగారి దగ్గిరా, మా సుబ్బులు దగ్గిరా సెలవు పుచ్చుకొని బస్సుమీద దేవప్రయాగ చేరాము. మా అమ్మగారు ఎంతో ఉత్సాహంతో అత్తవారింటికి కొడుకు వెళ్ళేటప్పు డుండే సంతోషంతో 'సుఖంగా వెళ్ళి, కైలాసేశ్వరుని దయచేత కులాసాగా తిరిగిరా నాన్నా' అని ఆశీర్వదించింది.

ప్రయాగ అంటే నదీ సంగమక్షేత్రం. అలహాబాదు మనుష్యప్రయాగ, అలకనందా భాగీరథీ సంగమం దేవప్రయాగ. కర్ణ, నంద, రుద్ర, విష్ణుప్రయాగ లున్నాయి. అసలు గంగానది భాగీరథి. భగీరథుడు గంగోత్రి కనిపెట్టినాడు. కాబట్టి భాగీరథి అని పేరువచ్చింది. ఉన్న ప్రయాగలన్నీ అలకనందానదికే ఉన్నాయి. భాగీరథిలో చాలా నదులు కలుస్తున్నా వాటికి ప్రయాగలనే పేర్లు లేవు. అలకనందలో మందాకినీనది కలిసేచోటు రుద్రప్రయాగ. అలకనందలో పిండారీగంగ కలిసేచోటు కర్ణప్రయాగ; నందప్రయాగలో నందానది అలకనందలో సంగమించే పుణ్యస్థలం. విష్ణుప్రయాగలో విష్ణుపాదజ అయిన విష్ణుగంగ లేక ధౌలీగంగ అలకనందలో కలుస్తుంది.

మందాకిని ఆకాశనది. కేదారనాథక్షేత్రందగ్గిర ఈ నది పుట్టిన స్థలము. అలకనంద అలకాపురందగ్గిర పుట్టింది. అది మానవులు దర్శింపలేని హిమాచల శృంగస్థలము. బదరీనారాయణానికి ఎగువగా పన్నెండు పదమూడు మైళ్ళ దూరంలో ఈ అలకాపురప్రదేశం ఉంది. ఒకప్పుడు యక్షజాతి మనుష్యులు (ఈ నాడూ దారిపొడుగునా వారు కనిపిస్తారు) పొట్టి మంగోలీజాతివారు, టిబెట్టుజాతికి చుట్టాలు, అక్కడ ఉండేవారనీ, హిమాలయాలలో ఎప్పుడూ సంభవించే హిమపాతాలవల్ల ఆ పట్టణం పూడిపోయిందనీ నా ఉద్దేశం. కాళి దాసుని మేఘసందేశయాత్రకూడా ఇక్కడికే వస్తుంది. ఇక్కడినుంచే కైలాస పర్వతానికి దారి ఉంది.

## 35

హృషీకేశంగాని, ఆ తర్వాత మా ప్రయాణంలో మకాములుగాని నన్ను కప్పిన మంచుతెరలను చీల్చలేకపోయాయి. నా గుట్టాన్ని నేను ఎక్క దలచుకోలేదు. కూడ ఉండడం మంచిదని ఎంచాను. మునికిరేతి, లక్ష్మణ ఝూలా, గరూర్వాచట్టీ, ఫూల్‌వారీ, గులార్‌చట్టీ, నయీమోహన్, చహోటీ బిజానీ, బ్రిహ్మబిజానీ, కుండుచట్టీ, బందర్‌భేల్, మహదేవ్, సెమాల్‌చట్టీ, కండీచట్టీ, వ్యాసఘట్టం, ఉంరాసు ప్రదేశాలన్నీ మోటారుబస్సుమీద వెడుతూ చూచాను. బస్సుప్రయాణంలేని రోజుల్లో, ఈ మజిలీలన్నీ మకా ములు చేసుకుంటూ, దేవప్రయాగ చేరతారు. మా జట్టులోనివా రొకరు నాకీ ప్రదేశాలన్నీ చూపిస్తే 'ఉహూం' అంటూ చూచానేగాని, నా మానసఫలకం మీద ఇవేవీ చిత్రితంకాలేదు.

దేవప్రయాగలో ఒకదినం ఆగి, అక్కడ మా కూలీలనూ, గుఱ్ఱాలనీ కలుసుకొని మర్నాడు తెల్లవారగట్ల లేచి విశాలబదరీనాథ్‌కీ జైయ్, కైలాసేశ్వర్ స్వామిజీకి జై అని మా ప్రయాణం సాగించాము. తెల్లవారగట్లకే వెలుగు బాగా వచ్చింది. చలి లేనేలేదు. కొద్దికొద్ది దూరాలే ప్రయాణం సాగించవలసి ఉన్నది. నీరు కాచి త్రాగుచుంటిమి. ఒక సన్యాసి, వంట బాగా తెలిసినాయన మా కందరకూ వంటచేస్తున్నాడు. ఆ రాజపుత్రజమీందారు జట్టుకు వారి వంటమహారాజ్ ఉన్నారు.

మేము లక్ష్మణఝూలా వంతెన దాటకుండానే గంగానది పడమటిఒడ్డునే మోటారుమీద వచ్చాము. నాకై అయిదువేల రూపాయీలు మాత్రం ఉంచుకొన్నాను. తక్కిన రూపాయలు హరిద్వారంలో బ్యాంకులోవేసి తెనాలికి మా అమ్మగారిపేర హుండీ ఇచ్చాను. ఆ అయిదువేలలో మూడువేల రూపాయీలు నాపేర బ్యాంకిలో వేసుకోమని స్వామిజీ సలహా ఇచ్చారు. కైలాసం వెళ్ళే దారిలోనూ, నేపాలులోనూ బ్రిటిషు వెండిరూపాయలకు బాగా చలామణీవుంది. నేపాలులో నేపాలు ప్రభుత్వంబ్యాంకులో మననోట్లకు వారిడబ్బు మార్చుకోవచ్చునట. తిబెత్తులోమాత్రం మనసొమ్ముకే ఎక్కువ విలువట.

నాతో ఉన్న రెండువేలరూపాయలకు, వేయిరూపాయలు వెండి నాణేలుగా ఉంచి, ఆ రూపాయలు ఒక ట్రంకులోపెట్టి, ట్రంకుకు దిట్టమైన ఆగ్రా తాళాలు వేశాను. తక్కిన వేయిరూపాయిలలో, 20 రూపాయలు కానుల క్రింద మార్చి వుంచాను. నూరురూపాయలనోట్లు అయిదు వుంచుకొన్నాను. వెండి చిల్లరగా ఏభైరూపాయ లుంచుకొన్నాను. తక్కిన నాలుగువందల ముప్ఫై రూపాయలు కూలీలకు, కూలీల ఏజంసీవారి కిచ్చాను. ఈ అయిదువేలు కాక మందులకని, భోజనసామగ్రులకని, పెద్ద గుడారానికని, స్టవుకని, విద్యుచ్ఛక్తిటార్చిలకని, కిరసనాయిలుకని, మూడు చలికోట్లకు, రగ్గులకు, బనీనులకు, చేతితొడుగులకు, విద్యుత్ బాటరీలు రెండింటికి, సూదులకు, దారానికి, తళుకు గాజుపూసలకు, తళుకు నగలకు, వెండినగలు చిన్నచిన్నవానికి రెండువేల రూపాయలు కర్చుచేశాను. ఇందులో కొన్ని స్వామిజీ కొనమన్నవి, తక్కినవి నా ఆలోచన. నేను కొన్న మందులతో ఓ చిన్న ఆస్పత్రి పెట్టవచ్చును.

హేమా, ఇవన్నీ ఎందుకు ఇంత విపులంగా రాస్తున్నానో విను. నాలో ఉన్న ఏదో తీవ్రావేదన, గాఢాందోళనము అణచుకోడానికే ఇవన్నీకొన్నాను. మందులజాబితా ఇస్తే మరీ నవ్వుకుంటావు. ఇవి కొనేటప్పుడు నా తెలివితేటలు చూపించాలనే అహంకారంకూడా వుంది. లేకపోతే రకరకాల ఇంజక్షన్లు, మూడువిధాలైన ఇంజెక్షన్ గొట్టాల పెట్టెలూ, ఆ గొట్టాలకు తగిన అరడజను సూదులు కొనడం ఏమిటి? మాత్రలు, అరిష్టాలు, ఆసవాలు, లేహ్యాలు తైలాలు — ఒక టేమిటి! ఒక చిన్న ఆంగ్లవైద్యశాల నాతో వచ్చింది. ఈలా ఏ మహారాజూ ప్రయాణం చేయరని మా స్వామిజీ అంటూ నవ్వుకొనేవారు,

బయలుదేరేముందు హరిద్వారంలో ఒక డాక్టరుగారి స్నేహమూ, ఒక ప్రసిద్ధ ఆయుర్వేదవైద్యుని స్నేహమూ చేశాను. ఆయుర్వేదవైద్యులు, హిమాలయాలలో ఆయుర్వేదవైద్యం బాగా పనిచేస్తుందని ` ముప్పైరకాల కొప్పెలు ఇచ్చారు. మా స్వామిజీకి ఆంగ్లవైద్యమూ, ఆయుర్వేద వైద్యమూ కూడా బాగా వచ్చును. ఆయన ఒక్కమాటు నన్నుచూచి, చిరునవ్వు నవ్వి 'బాబా! భగవంతుని నమ్మినవారికి మందు లెందుకయ్యా!' అన్నారు. నేను వెంటనే 'భగవంతుని నమ్మనివారికి మందులు కావాలికదండి!' అన్నాను. స్వాములవారు పకపక నవ్వారు.

## 36

ప్రతి మకాములో స్నానంచేస్తూనేఉన్నా, నేను గంగలోమాత్రం స్నానం చేయటంలేదు; ఇన్ని నీళ్ళు కాచుకొని స్నానంచేసేవాణ్ణి. మాతో వచ్చే రాజపుత్రజమీందారు, ఆయన వర్గమూ నన్ను చూచి ఆశ్చర్యపొందారు. 'ఎందు కీ జంతువు మనతో?' అనే ప్రశ్న వారందరు లోపలవేసుకున్నారు కాబోలు, మా స్వామిజీ బిల్వకేదారం దగ్గిర వారినిచూచి 'ఈ అబ్బాయిని ఆరోగ్యంకోసం నాతో తీసుకుని వెడుతున్నాను' అన్నారు.

జమీం: గంగాస్నానంకంటె వేరే ఆరోగ్యకరమైన విషయం ఉందాండి?
స్వామి: ఆరోగ్యం కుదిరినకొలదీ గంగాస్నానం ప్రారంభిస్తాడీ బాలుడు.
జమీం: చాలా ఆరోగ్యంగా కనబడుతాడు.
స్వామి: దేహారోగ్యం రెండుమూడుసారులు చెడిపోయింది. ఇప్పుడాతనికి నరాలజబ్బు.

జమీందారుడు, కారణంలేక స్వామిజీ నా తరఫున వాదించరని ఎంచి కాబోలు ఇంతటితో ప్రశ్నలు మానేశాడు. అవసరం అవుతుందని నేను కొన్న పన్నెండు కప్పుల థర్మాస్ ఫ్లాస్కులో ప్రతిఉదయమకాములోనూ టీ చేయించి పోసివుంచేవాడిని. నాలుగు కప్పుల ఫ్లాస్కులో నా కోసం కాఫీ స్వయంగా తయారుచేసుకుని పోసివుంచేవాడిని.

కైలాసానంద స్వామిజీ ఆదారిలో అందరికి పరిచయమే. అందరు ఆయన్ను గౌరవించేవారు. మా నడకల్లో ఎన్ని మకాములవరకో స్వామిజీ, ఇంకా కొందరు సన్యాసులూ, జమీందారుగారి జట్టులో కొందరూ ముందు పోతూవుండేవారు. నేను నెమ్మదిగా నా ఆలోచనలే నాతో సంభాషిస్తుండగా ప్రయాణంచేస్తూ ఉండేవాడిని. ఆ ఆలోచన లేమిటో ఇప్పటికీ నాకు జ్ఞాపకంలేవు.

మలాస్‌చట్టీ, రాణీబాగ్, కొట్లా, రామాపురం, బిల్వకేదార్ మకాములు గడిచి శ్రీనగరం చేరుకున్నాము. శ్రీనగరంలో కాలాకంబళీవాలా సత్రంలో మకాముచేశాము. కాలాకంబళీవాలా ఒక సన్యాసి. ఈయన హిమాలయ యాత్రలు విరివిగా చేశాడు. అనేకమంది హిమాలయయాత్రలు చేసేటప్పుడు

పదేబాధల్ని గమనించి, అక్కడినుంచి దేశమంతా తిరిగి చందాలు వసూలు చేసి, హరిద్వారంలో, హృషీకేశంలో, దేవప్రయాగలో, శ్రీనగరంలో ఇతర మకాములలో ధర్మశాల లేర్పాటుచేశాడు. ఈయన పెట్టించిన సత్రాలల్లో, బీదలకు, సన్యాసులకు సదావర్తులిస్తారు. వైద్యానికీ ఏర్పాటులు చేయబడినాయి. నల్లటి కంబళీ కప్పుకొనివుండేవాడు గనుక ఈ సన్యాసికి కాలా కంబళీవాలా అని పేరువచ్చింది. ఈయన బ్రహ్మసాయుజ్యం పొందిన తరువాత, ఈ మహామహుని ఉత్తమకార్యం కొందరు పుణ్యవంతులగు సన్యాసులు కొనసాగించారు.

శ్రీనగరం నుంచి బయలుదేరి సుకృత, భట్టినేర, కంకార, వార్కోట, గులాటిరాలులు మకాములు చేసుకుంటూ హృషీకేశంలో బయలుదేరిన నాలవ రోజు ఉదయానికి రుద్రప్రయాగ చేరాం. రుద్రప్రయాగలో మందాకిని అలకనందలో కలుస్తుంది. గంగోత్రి పోదలుచుకొన్నవారు దేవప్రయాగ దగ్గరనుండి భాగీరథినది ఒడ్డునే ప్రయాణంచేసుకుంటూ పోవలసిఉన్నది. యమునోత్రి పోదలుచుకొన్నవారు గంగోత్రి దారిలో విడిపోవాలి.

రుద్రప్రయాగనుంచి మందాకినీ ఒడ్డునే కేదారనాథ్‌కు యాత్రచేస్తారు. అలకనందా తీరాన్నే రుద్రప్రయాగనుంచి ఆ సాయంకాలమే ప్రయాణం సాగించి, శివానంది వెళ్ళేసరికి నాకు గాడ్పుకొట్టినంత పనైంది. కాఫీ మధ్య మధ్య నాలుగుసార్లు తాగాను. ఆ రాత్రి శివానందిలో మకాంవేశాం. తెల్లవారగట్లనే బయలుదేరి హరి ఆశ్రమం, ఖమెరాలలో ఆగకుండా •గౌచార్ చేరాము. ఇక్కడవరకు విమానాలు తీసుకురావాలని ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఆ సాయంకాలం బయలుదేరి, పిండారిగంగ అలకనందలో సంగమించే కర్ణప్రయాగ చేరాము.

నందప్రయాగ వచ్చేదారిలో హిమాలయవాసులైన లేప్చాలజట్టు ఒకటి మా కెదురైంది. వాళ్ళు రోడ్డుపక్కనే చల్లటి మామిడిచెట్ల నీడలో మద్దళం వాయిస్తూ పాడుతూ నాట్యంచేస్తున్నారు. అందులో ఒక అమ్మాయి అచ్చంగా గంధర్వబాలికలా ఉంది. బంగారు చాయ, గుండ్రటి మోము, స్ఫుటరేఖా సమన్వితమైన దేహమూ నన్ను పరవశుణ్ణిచేశాయి. వరూధినికూడా ఈలాంటి బాలికే అయిఉండాలనుకున్నాను. ఆమె బట్టలు రంగురంగులతో ఒక చిత్ర విధానంలో ఉన్నాయి. తడుపుట ఆరవేయుట ఎరగనే ఎరగవు. నగలూ లేవు. ఏమి అందము! నే నా నాట్యంచూస్తూ ఆ చెట్లనీడనే కూర్చున్నాను. నాతో రాజపుత్రా జమీందారుడును కూర్చున్నాడు. ఆ రాజపుత్ర జమీందారుని పేరు రాజగోవిందసింహాకపూర్ బహదూర్. ఈయనకు నలభైఅయిదేళ్ళుంటాయి. పొడుగాటి మనుష్యుడు. బంగారానికి వన్నెదిద్దే చాయ. గరుడనాసిక, కోలమోము, బవిరిగడ్డంతో ఏ ధర్మరాజునో, అర్జునుణ్ణో తలపించే అందం గలవాడు. మా ఇద్దరి సంభాషణ హిందూస్థాన్ భాషలో జరిగింది.

'బాబూజీ! ఆ అమ్మాయి ఎంత చక్కగా పాడుతోంది. కోయిలకంఠం కాదా?'

'అవును రాజాబహదూర్! ఆ నాట్యం చూస్తోంటే ఊర్వశినృత్యం ఈలాగే ఉండేదేమోనని అనిపిస్తోంది.'

'ఊర్వశి నృత్యం ఎందుకు జ్ఞాపకంవచ్చింది మీకు?'

'మనం ఊర్వశి పుట్టినస్థలం చూడబోతున్నాం గాదా అండి?'

'అదెక్కడండోయి?'

'నరనారాయణాశ్రమమైన బదరికాక్షేత్రమే కదాండి. నరనారాయణులు తపస్సుచేసుకొంటోంటే, ఆ తపస్సు చెడగొట్టడానికి ఇంద్రుడు రంభాదులను పంపిస్తే చిరునవ్వుతో నారాయణుడు తొడ తరచగానే, ఊర్వశి ఉద్భవించిందట. ఆమె పరమాద్భుత దివ్యసౌందర్యాన్ని చూచి రంభాదులు పారిపోయారుట. ఇంద్రుడామెకు దాసుడయ్యాడుట.'

## 37

ఆ బాలిక నాట్యం మనోహరంగావుంది. మమ్మల్ని మెప్పించాలని మరీ చక్కగా పాడుతూ చేతులూ కళ్ళూ తిప్పుతూ నాట్యంచేసింది. ఆమె అలా నాట్యం చేస్తూ, చేస్తూ, నాదేవి శకుంతలగా మారిపోయింది. ఎప్పుడూ నేర్చుకుంది నా శకుంతల నాట్యం? నా శకుంతల ఊర్వశి కాదుగదా? ఏదైనా శాపం పొందివచ్చి, శాపం తీరగానే వెళ్లిపోయిందేమో? పురూరవుణ్ణి, అర్జునుణ్ణి ఆమె ప్రేమించింది. పురూరవుడు ఆమెను ప్రేమించాడు. అర్జునుడు ప్రేమించలేదు. మా తెలుగు కవులలో ఉత్తముడైన దేవులపల్లి ఊర్వశీభావాన్ని అత్యంతము ప్రేమించి, సర్వకాలం విరహవేదనపడుతూవుంటాడు.

అప్సరోభావం అద్భుతమని నా ఉద్దేశం హేమా! అప్సరసలు అమృతంతో లక్ష్మితో ఉద్భవించిన వాళ్లు. పాలసముద్రం అంటే విశ్వసౌందర్యం. ఆ సౌందర్యాన్ని మథిస్తే సౌందర్యమూర్తములైన వస్తువులు ధవళమై వెలుగుతూ ఉద్భవించాయి. శక్తి సౌందర్యం కామోదకి. నాదసౌందర్యం పాంచజన్యం, కాంతిసౌందర్యం కౌస్తుభం, మహాపథదిక్సౌందర్యం ఐరావతం, జీవితాభీష్ట సౌందర్యం చింతామణి, వేగసౌందర్యం ఉచ్చైశ్రవము, వితరణసౌందర్యం కల్పవృక్షము, నృత్యకళాసౌందర్యమూ కామసౌందర్యమూ అప్సరసలు, పరమైశ్వర్యరూప సౌందర్యం లక్ష్మి, కాలాతీతత్వ సౌందర్యం అమృతం. ఈ భావాలు నాకు తర్వాత తర్వాత కలిగాయి. పరమ కామము, పరమ నృత్యమూ ఊర్వశిలో సౌందర్యోజ్జ్వల రూపాలయ్యాయి.

నాట్యం కాగానే ఆ అమ్మాయి నా దగ్గిరకు వచ్చి పైస యాచించింది. ఆ అమ్మాయిలోని బిగువులు చూచి నే నామెను నా మనస్సులో విగతవస్త్రను చేసి ఆ అందాలు చూచాను. నా కళ్లలో, ఆమె దిగంబరత్వాన్ని చూచింది. కాబోలు ఆ అడవిపిల్ల సిగ్గుపడుతూ, చిరునవ్వు నవ్వుతూ వాళ్ళ జట్టు కడకు

పరుగెత్తింది. తక్కిన అమ్మాయిలు పక్కన నవ్వుతూ 'ఆ బాబునిచూచి కన్నేసినావా?' యని వేళాకోళం చేశారు.

నాకా భాష తెలియనట్లు నటిస్తూ, కొన్ని నగలు, ఇన్ని సూదులు, దారంకట్టలు ఆ అమ్మాయికి బహుమతి ఇచ్చాను. తక్కినవారి కెవ్వరికీ కోపంరాకుండా, సూదులు, దారపుఉండలు అందరికీ పంచిఇచ్చాను. హిమాలయ పర్వతవాసినులకు సూదులు, దారపుఉండలూ అంటే మహా ఆనందం. రొట్టైనా మానుతారుగాని సూదులు దారాలు వదలరు.

ఎవడో మహాదాత బయలుదేరాడన్నవార్త ఆ పర్వత ప్రదేశాలలో మారుమ్రోగింది కాబోలు, ప్రయాణం పొడుగునా భూటియాలు లేప్చాలు మొదలైన పర్వతవాసుల స్త్రీలు, బాలబాలికలు పైసా, నగలియ్యి, సూదియ్యి, దారమియ్యి అని నన్నే పట్టుకున్నారు. నాకు, వాళ్లు నిజమైన గంధర్వ, కిన్నెరీ, యక్షబాలికలై తోచారు.

నాలో కామవాంఛ, కాశిలో మణికర్ణికాఘట్టంలోనే మాయమైంది. అనాచ్ఛాదితస్త్రీమూర్తి సౌందర్యసందర్శనకాంక్ష పూర్తిగా నన్ను నిండి పోయింది. లోయలలో ప్రవహించే నదీ సౌందర్యానికీ, ఈ పర్వతవర్ణనుల సౌందర్యానికీ ఏదో విచిత్రసామ్యం కనిపించింది. స్త్రీమూర్తివినా నాకా పర్వతంలో ఏదీ పులకరాలు కలుగజేయలేదు. స్వామిజీ ఈమార్పు చూస్తూనే ఉన్నారని నా అభిప్రాయం. ఏమీ చూడనట్లే కనబడ్డారు. ఆ విలక్షణ సౌందర్యంవినా నాకా క్షేత్రాలు అర్థరహితమయ్యాయి.

మా దారివెంబడిలో ఎక్కువమంది బదరీనాథంనుంచి తిరిగి వచ్చినవారే కనబడ్డారు. కొందరు గంగోత్రివెళ్ళ సంకల్పించుకొన్నవారు, కొందరు కేదార యాత్రోన్ముఖులు. కొంచెం పొద్దెక్కనప్పటికి నందప్రయాగ చేరాము. నంద ప్రయాగలో సాయంకాలంవరకూ ఉండి, ఆ పెద్దగ్రామం పూర్తిగా దర్శించాను. ఆ పర్వతవాసుల జీవితం కనుగొనడమే నా ఉద్దేశం. నందప్రయాగ దగ్గిర నందానది అలకనందలో చేరుతుంది. సాయంకాలానికి కోహేడ్ చేరాము.

## 38

ఉదయమే చమోలీ చేరి, అక్కడ బసచేసి చీకటిపడేవేళకు మఠ్‌చట్టీ చేరాము. మఠ్‌చట్టీ పరిసరాలన్నీ తోటలే. ఇక్కడనుంచి హిమాలయాలని పిలువవచ్చును. అక్కడ ఆరాత్రి మకాంచేసి, తెల్లవారగట్లకు సియాసీన్ చేరాము. అచ్చట హిమవత్పర్వతసౌందర్యం కొంచెం రుచిచూడ ప్రారంభించాను. అలకనంద రెండు ఎత్తైన పర్వతాలమధ్యనుండి అత్యంతాశ్చర్యకరంగా ప్రవహిస్తూంది.

నేను ఈ స్వాములతో, ఈ రాజపుత్ర జమీందారుతో కలిసి హిమాలయాలలో ప్రయాణం చేస్తూవుండడం నాకే ఆశ్చర్యం కలుగజేసింది.

ఎందుకు ఈలా ప్రయాణమైనాను? ఎల్లా తీసుకురాగలిగారు ఈ స్వామిజీ? మా అమ్మ ఏది? ఈలాంటి ఆలోచనలు ఎక్కువయ్యాయి. నేనీ హిమాలయపర్వత శ్రేణిలో కరిగిపోతే? నా కేదైనా జబ్బుచేస్తే? పీడ విరగడైపోతుంది కదా! ఈలా పరిణమించిందేమిటి నా చరిత్ర? నా అస్తినంతా అమ్మేకున్నాను. మా ఊళ్ళో శకుంతల పేరిట విద్యాలయం కట్టమన్నాను. తాడూ బొంగరం లేనివాణ్ణయ్యాను. నాకూ లోకానికీ సంబంధం శకుంతలే. నాకూ, జీవితానికీ నా శకుంతలదేవే పెనవేసిన బంగారుత్రాడు. ఆ త్రాడు తెగిపోయింది. నేను త్రాడుతెగిన గాలిపటంలా ఆకాశాన ఎగురుతున్నాను. ఏగాలి కొడితే ఆ గాలికి ఎగిరాను. ఇప్పు డీ కొండల్లో ఏగాలికో కొట్టుకువెడుతున్నాను.

హాల్‌చట్టీ, గరూర్‌గంగా, పాతాళగంగా, గులాబ్‌కోటీ, కుంబార్‌చట్టీ చేరాము. హరిద్వారం దాటి 155 మైళ్ళు వచ్చాము. ఎదురుగుండా మంచుకప్పిన పర్వత శిఖరాలు, చలీ. ఎంత చక్కనిదృశ్యం! కన్నులపండువ చేస్తున్నది. నా కేమి బుద్ధిపుట్టిందో నా పెట్టెలో ఉన్న బొమ్మలువేసే స్కెచ్చి పుస్తకము, రబ్బరుముక్క, పెన్సిల్ తీశాను. అయిదారు బొమ్మలు వేశాను. చమరీమృగాలను తోలుకువెళ్ళే మనుష్యులు, ఆ సన్నని ఇరుకుదారి, క్రింద అలకనంద మహావేగంతో ప్రవహించడం, రాళ్ళు, మంచు హిమానీజలాలు, స్వచ్ఛ నీలాకాశం, ఏలాగు వేగవంతాలై నా వేళ్ళు ప్రసరించిపోయినవో కాని ఎంతో చక్కని బొమ్మలు ఉద్భవించాయి. మా రాజపుత్ర జమీందారుని, స్వాములనందరినీ, కూలీలను, మా పొట్టి గుఱ్ఱాలను అన్నీ బొమ్మలు వేయడం ప్రారంభించాను. లేప్చాలు, భూటియాలు, గర్హవాళీలు, ఆడవారు, వారి పనులు, నాట్యాలు అన్నీ వేయసాగాను. మా జట్టంతా ముందు వెళ్ళింది. నేను వెనకాలే వస్తానని, బొమ్మలు గీసుకుంటూ నెమ్మదిగా వెళ్ళాను. యాత్రికుల జట్టు లెన్నో జ్యోతిర్దర్శనం చేసికొని వస్తూన్నవట. ఏమిటో ఆ జ్యోతి?

బదరీనారాయణస్వామి గుడి పదివేలఅడుగులపైచిల్లర ఎత్తు ఉండడం చేత శీతాకాలంలో ఆప్రదేశం అంతా తెల్లటి వెన్నలాంటి మంచుతో కప్పబడిపోతుంది. అందువల్ల ఆ ప్రదేశంలో ఎవ్వరూ ఉండలేరు. దేవుళ్ల ఉత్సవ విగ్రహాలు తీసుకుని, పూజారులు జోషీమఠంలో వచ్చి ఉంటారట. కొందరు నందప్రయాగ వెళ్లి ఉంటారట. దీపావళి అమావాస్య వెళ్లగానే స్వామి దేవాలయంలో ఒక అండిగలో ఆవునెయ్యి అయిదుశేరు పోసి, వత్తి ఉంచి, జ్యోతి వెలిగించి, తలుపులుమూసి, తాళంవేసి, సీళ్ళు వేస్తారుట. మళ్లీ ఏప్రియల్ నెలలో శుభదినంనాడు ద్వారాలసీళ్ళు తెరచి, తలుపులు తెరిస్తే, బదరీనారాయణజ్యోతి వెలుగుతూ ఉంటుందిట. అనేకులు పెద్దలు పిన్నలూ ఆజ్యోతిని సందర్శించడానికే ఆరోజుకు వస్తారుట. 'బదరీ విశాలలాల్‌జీకి జై' యని పరవశత్వంతో జ్యోతిని దర్శనం చేసుకుని నమస్కరిస్తారుట. ఈ జ్యోతి ఆరునెలలు మంచుచేత కప్పబడి పూడిపోయిన గుళ్ళో ఎల్లా ఉంటుంది? శాస్త్ర దృష్ట్యా అది అసంగతము. మంచుచేత కప్పబడిన బొగ్గుపులుసుగాలిని వదులుతూ

ప్రాణవాయువు అంతా అయిపోవడంచేత ఆరిపోవాలి. అదీకాక అయిదుశేర్ల నేయి దీపం రెండురోజులలో వెలిగి దీపం కైలాసం అంటుతుంది. అలాంటిది దీపం ఆరదు. నెయ్యి ఇంకా శేరు మిగులుతుందట!

ఇది దేవతల మహత్తు అంటారు! మంచుచే కప్పబడిన అతి శీతలతవల్ల దీపంకర్చుచేసే ప్రాణవాయువూ, నెయ్యికూడా తక్కువేమో! ఈ విచిత్రం కూడా తప్పక శాస్త్రానికందుతుందనే నా ఉద్దేశం. హిమాలయ ప్రయాణం ఆరోగ్యదాయకమని, మన పూర్వులు బదరీకేదారాది యాత్రలు చేశారనీ నా ఉద్దేశం. ఈమాత్రం ఆలోచించడం ప్రారంభమైంది నాలో. ఇంతలో మాజట్టు వెనకాలే జోషీమఠం చేరాను. ఎన్నో దేశాలవారు ఈ యాత్రకు వస్తున్నారు. బిడ్డలు, యవ్వనులు, పెద్దలు, ముసలివారు నిర్భయంగా భక్తితో ఈ కష్టమార్గాల వేలకొలదీ సంవత్సరాలనుండి ఈ యాత్రలు చేస్తున్నారు. పాండవులు ఈదారిని వెళ్ళారు. మహాఋషులనేకులు ఇక్కడే వాసంచేశారు. ఈనాటికీ ఈజనం వస్తూనేవున్నారు. పండాలు, గఢ్వాల్ సంస్థానోద్యోగులు, బ్రిటిష్ ప్రభుత్వోద్యోగులు ఇక్కడ వాసంచేస్తున్నారు. భోజనపదార్థాలు సంపాదిస్తున్నారు, వంటలు చేసుకుంటున్నారు, ప్రేమించుకుంటున్నారు, ఆనందిస్తున్నారు, కష్టాలుపడుతున్నారు, దుఃఖిస్తున్నారు, స్త్రీపురుషులు కామించుకొంటున్నారు, బిడ్డలను కంటున్నారు.

ఓహో! ఈ హిమాలయ ప్రపంచానికీ, క్రింద భారతీయ విశాల సమప్రదేశాలకూ ఎంత తేడా! హృదయాలు దోషకళంకపూరితాలై ఉంటాయి అక్కడ. జీవితం కర్కశమై, చెడుదారులనే ఆశిస్తుంది. ఈ హిమాలయాలలో, ఈ ఎత్తైన కొండలలో, ఈరాళ్ళలో, మంచుగడ్డలలో, అతి శీతలపు నదులలో, హెచ్చుతగ్గులలో జీవనం ఎంత ఆర్ద్రం? ప్రేమమయం. ఈ అతికర్కశ భూములలో ఎంత నిదానమైన, కల్మషరహితమైన జీవితాలివి అనుకున్నాను.

## 39

అడవులనిండా తెల్ల గులాబీపూలు, పర్వత గ్రామాలలో బంగారు గులాబీ పూలైన యవ్వనవతులు. ఆ అడవులలో ఆ లోయలో, ఒక ప్రక్క మహోన్నత పర్వతాలు, ఒకప్రక్క పాతాళ ప్రదేశంలో మహావేగంతో, సంతత గంభీరరాగ హృదయంతో ప్రవహించిపోతున్న అలకనంద.

జోషీమఠం చేరాము. జోషీమఠం పెద్దబస్తీ. ఊరంతా తిరిగి, చమరీమృగపుతోళ్ళు, పెద్దపులితోలు ఒకటి కొన్నాను. తెల్ల చిరుతపులితోలు సంపాదించాలని కోర్కె కలిగింది. అక్కడ ఆ గాంధర్వశిల్పులు రచించిన చిత్రాలు, దారుశిల్పాలు కొందామనుకుంటే, స్వామీజీ తిరుగుదారిలో కాని, మా అమ్మను తీసుకుని రెండవసారి ప్రయాణం చేసినప్పుడు గాని కొనవచ్చునన్నారు.

జోషీమఠంనుంచి విష్ణుప్రయాగ చేరాము. తర్వాత పాండుకేశ్వరము, లంబర్‌ఘట్టీ, హనుమాన్‌చట్టీలలో మకాములుచేసుకుంటూ బదరీదర్శన ప్రదేశం

చేరాము. అందరికీ తన్మయత్వాలు కలిగి 'విశాల్ బదరీలాల్‌జీకీ జై' అని పర్వత శిఖరాలు మారుమ్రోగుతూ ఉండగా నాట్యంచేసినంత పని చేశారు. మా స్వామిజీకి ఒడలు తెలియలేదు. ఆయన ఒక రాతిబండమీద పద్మాసనం వేసుకొని, బదరివైపు తిరిగి సమాధిలోనికి పోయినారు. అందరూ నిశ్శబ్దం వహించారు. నేను జాగ్రత్తగా ప్రక్కనున్న ఒక సానువును కొంతవరకు నా ఇనపమొనకఱ్ఱ సహాయంతో ఎక్కి, అక్కడ కూర్చుని బదరీనాథ్ వైపు దృష్టి పరచి, ఆ దృశ్యం గమనిస్తున్నాను.

ఈలా క్షేత్రాలని పేరుపెట్టి, భారతీయులు దేశాలుతిరిగే ఈ నాగరికత ఏమిటి? ఏమిటీ బదరీనాథం? ఇక్కడ నరనారాయణులు తపస్సుచేశారా? నా శకుంతల బ్రతికివుంటే, ఈ ప్రదేశాలు తిరిగి ఉందుమా? ఏమో! శకుంతలా! నన్ను వదలి ఎందుకు వెళ్ళావు? ఈ నరనారాయణులు నిన్ను బ్రతికి ఉండునట్లు చేయలేకపోయారా? మంగళగౌరి, శ్రావణలక్ష్మి, ఎన్నిపూజలు చేశావు నా శకుంతలా! నా దివ్యసుందరీ, నా ఆత్మేశ్వరీ, నా జీవిత సింహాసనరాజ్ఞీ! ఏమయిపోయావు దేవీ! నాకు కనబడవా......?

ఇలా అనుకున్నానో లేదో, నాకు దిగువగా రోడ్డుప్రక్క తపస్సుచేసుకునే స్వామి శకుంతలగా మారిపోయారు. శకుంతలాదేవి చటుక్కున లేచింది, ఇటు అటూ చూడకుండా బదరివైపు ప్రయాణం సాగించింది. నాకా అతిశీతల ప్రదేశంలో చెమటలు పట్టాయి. ఆమె అతివేగంతో నడిచింది, ఆకాశంలోకి తేలిపోయింది. ఆలా తేలుకుంటూ బదరీనారాయణ విశాలలాల్‌జీ మందిర శిఖరంలో కలిసి మాయమైపోయింది. నాకు కళ్ళనీళ్ళు జలజల ప్రవహించిపోయినాయి.

బదరీనాథా! నువ్వేనా నా శకుంతలవు? నువ్వేనా! అది ఏలా సంభవించింది? తండ్రీ నువ్వున్నావా? నా శకుంతల ఉన్నదా? నేనున్నానా? నా స్వామీజీ, నా శకుంతలా, నా బదరీ అన్నీ ఒకటేనా? ఇది ఏమివెఱ్ఱి? నాకీ విచిత్ర పర్వత ప్రదేశాలలో మతి తిరిగిపోతున్నదా? క్రిందకు దిగివచ్చాను. స్వామీజీ లేచి బదరీనాథ్ వెళ్ళారని అక్కడివారందరూ చెప్పారు. నాకు గుండెగతి తప్పిపోయింది. కన్నులనీరు కారిపోయింది.

అందరమూ బయలుదేరాము. బదరికి ఒక్కొక్క అడుగు ముందర బడుతూన్నది. బదరికి ఈవలావల నరనారాయణ పర్వతాలున్నవి. దిగువ మహావేగంతో అలకనంద ప్రవహిస్తున్నది. 'విశాల బదరీలాల్జీకీ జై' అని కేకలు ఆ ఉదయకాలంలో ఏవో మహారాగాలతో వినిపించాయి. ఆ శ్రుతులలో ఎవో దివ్యసంగీతాలు, ఆ సంగీతాలు స్వరాలై, ఆ స్వరాలలో కలిసి శకుంతల కంఠం తీయతీయని పాటపాడుతూ నాకు వినబడింది. నరనారాయణ పర్వతాలూ, బదరీనారాయణ దేవాలయమూ కళ్ళారచూస్తూ నిలుచుండిపోయాను. సంగీతం వినబడుతూనే ఉన్నది. తక్కినవారు జయజయధ్వానాలు సలుపుతూ నడిచిపోతున్నారు. నేనుమాత్రం అదృశ్యయై ఉన్న ఆదేవి సంగీతం వింటూ

నిలిచిపోయాను. ఆ సంగీతం అతిమధురమైనది. గాఢతమవేదనాభరితమైనది. ఆ గాంధర్వమును, కిన్నెరలతో కలిసి పాడుతూ గంధర్వాంగనలతో నృత్యం చేస్తూ శకుంతలాదేవి అమృతప్రవాహాలు దెసల నింపుతున్నది కాబోలు? ఆ పాట ఇదియని చెప్పలేను. ఆ రాగ మిట్టిది అని గ్రహించలేకపోయాను. ఆ తాళ మేదియో హృదయమున వ్యక్తం కాలేదు.

ఎంత ఆనందరూపమైనది ఆ పాట! ఆ పాటలో మంచుగడ్డలు కరిగి పోయినవి. ఆ స్వరకల్పనంలో నదులు ఉద్భవించి ప్రవహించినవి. ఆ రాగారోహణలో హిమాలయ శిఖరాలు ఆకాశంలోకి చొచ్చుకుపోయాయి. అవరోహణలో పుష్పవనవాటికలు ఆ లోయలలో వికసించి సురభిళాలైనవి. నేనో మంచుకొండనైతిని. ఎన్ని కల్పాలనుంచో నాలో పేరుకొనియున్న హిమపర్వతాలు, వేడినే ఎరక్క ఇంకనూ పేరుకుపోతున్నాయి, పెరిగిపోతు న్నాయి. నా హృదయంలోని చైతన్యం గడ్డకట్టుకుపోయినది. ఆనాటి నా మంచుగడ్డబ్రతుకుపై ఒక్క సూర్యకిరణం పడి, ఆ మంచుగడ్డ శకలాలలో ఏడు వర్ణాలుగా రూపంపొందింది. లోకం వర్ణమయమైంది. నా బ్రతుకు ఆ కిరణకాంతి ప్రసరింపువల్ల నెమ్మదిగా కరగడం ప్రారంభించింది. గజగజ వణికిపోయాను. నాకు మెలకువవచ్చి తొందరతొందరగా బదరిచేరాను. జనుల కోలాహలం ఆ పర్వతాలలో ప్రతిధ్వనిస్తూన్నది.

నేను వెళ్ళివెళ్ళగానే బదరీనాథ ఉష్ణకుండంలో స్నానంచేసి వేయి ఏనుగుల బలంతో వచ్చి, ఉన్నిదుస్తులు ధరించి బదరీనాథస్వామి దర్శనానికి వెళ్ళాను. ఆ దేవాలయంలో జరిగే తంతంతా చూచి ఇంటికి తిరిగివచ్చి నిద్ర పోయాను. ఏమిటి నాకీ హిమాలయ ప్రయాణం. ఈ బదరీనాథయాత్ర ఎంత విచిత్రంగా పరిణమించింది. ఈలాంటి మహావిచిత్ర స్థలాలల్లో మనుష్యుడు ఎన్ని దేవుళ్ళనైనా కల్పించుకోగలడు! నాకుమాత్రం బదరీనాథుడు మను ష్యుడు చెక్కిన విగ్రహంలాగే కనిపించాడు. కాని మనుష్యుడు ఎంతో కష్టపడితేనేగాని, తన మనస్సులో పుట్టిన ప్రపత్తిభావాన్ని నిర్మలమూ, నిశ్చ యమూ చేసుకోలేడు. ఎన్ని యుగాలనుంచి, ఈ బదరీనాథుడు ఈ మంచు కొండల ప్రదేశంలో వెలసి వున్నాడో! పాండవులీ శీతలప్రదేశానికి వచ్చా రట! క్రీస్తు పూర్వం కొన్నివేల ఏళ్ళక్రింద ఆర్యులు వుత్తరభూములలో బదరి కాశ్రమాన్ని నిర్మించుకొన్నారు. ప్రపంచానికి పదివేలఅడుగులపైచిల్లర ఎత్తున, ఎక్కడో అలకనందానదీ జననప్రదేశాలలో ఈ మహాక్షేత్రం, మణి పూసలా పొదగబడివుంది.

## 40

మరునాడు స్వామీజీ బ్రహ్మకపాలంలో నాచేత మాతండ్రిగారి శ్రాద్ధం పెట్టించారు. బ్రహ్మకపాలంలో శ్రాద్ధంపెడితే మళ్ళీ ఆ పితరులకు శ్రాద్ధాలు పెట్టకూడదట. ఎందుకంటే బ్రహ్మకపాల శ్రాద్ధంవల్ల పితరులకు మోక్షం

వస్తుందట. ఒకసారి మోక్షంవస్తే మళ్ళీ పితరులను ఎలా ఆహ్వానిస్తాము? ఏది ఏమయితేనేమి ఒక గొడవ వదలిపోతుంది. అందుకనే నేను ఒప్పుకున్నా. స్వామీజీకూడా 'నీ కిష్టమైతేనే పెట్టు, ఇష్టంలేకపోతే మానెయ్యి!' అన్నారు. అందులో వుండే లాభాలాభాలు చూసే నేనూ ఒప్పుకున్నాను. స్వామి దర్శనము, పూజలు అన్నీ ఏదో గౌరవంకోసం చేయించాను. నాకు దేవుళ్ళమీద గౌరవంకంటె ఆ ప్రదేశాలమీద ప్రేమ ఎక్కువైంది. నా వెనకాల ప్రసరించి వున్న వెలుగునీడల్ని మరచిపోయాను.

ఎత్తైన, స్నిగ్ధహిమంతో నిండి, స్వచ్ఛమూర్తులతో ప్రాపంచిక సంబంధమేమీలేకుండా ఆ రహస్యప్రదేశాలలో ఆకాశపథగభీరవదనులైన శీతనగేంద్ర శిఖరదేవులు నన్ను పూర్తిగా తమ హృదయానికి హత్తుకొన్నారు. వారితో నా ఆవేదనలు మూగభాషలో చెప్పుకొన్నాను. ఏలాగైనా ఆ శిఖరమూర్తులను చేరాలనే కాంక్ష నా కెక్కువైంది. చలి లెక్కచేయలేదు. రాత్రిళ్ళు మంచు కురుస్తున్నా వంటినిండా బొచ్చుకోటులూ, తోలుకోటులూ తొడుగుకొని ఆ వెన్నెలలో బదరిలో ఒంటిగా తిరిగాను. స్వామిజీ నన్ను చూచి ఏమీ అనలేదు.

శీతల తీవ్రత వర్ణింపలేను. వెన్నవలె మంచు కురుస్తూఉన్నది. ఒంట్లో రక్తం ప్రవహించడానికి, ఇటూ అటూ పచారుచేస్తూ తెల్లవారుగట్ల మంచు కురవడం ఆగగానే అలకనంద పుట్టిన ప్రదేశానికి బయలుదేరాను ఒక్కణ్ణే! దారి మంచుపడి ఉంది. నా కాళ్ళను పెద్ద జోళ్ళున్నాయి. హిమాలయ ప్రయాణపు జోళ్లు, వాడిసూదులున్నవి తొడుగుకొని, సంచినిండా బిస్కట్లు, చిన్న స్టవ్వు, కాఫీపొడుం, పాలడబ్బా వేసుకొని బయలుదేరాను. ఒక్కణ్ణే వెళ్ళాలనే దీక్షపట్టి వెళ్ళాను. స్వామిజీకి ఒక చీటి వ్రాసి బయలుదేరాను.

చీకటి లేదు. ఒక రకమైన సంధ్య. నిశ్శబ్దం లోకమెల్లా ఆవరించి ఉంది. దారి తప్పిపోతుందని భయపడలేదు. ప్రాణానికి భయపడలేదు. ఆ చుట్టుపక్కల లోయలలో ఏ దారైనా బదరీనాథ్‌కే చేరుతుంది. ఏ నదైనా అలకనందలో కలుస్తుంది. చేతిలో ములుకఱ్ఱ ఉన్నది. నడక సాగించాను. కొండపక్కనే మనుష్యులు నడిచే దారి, దారికి దిగువ ఎక్కడనో అలకనంద సంగీతం పాడుకుంటూ ప్రవహిస్తున్నది. ఎదురుగా, వెనకగా, ప్రక్కగా ఆకాశాన్నంటే కొండలు. ఒకచోట కొంచెం దిగుతున్నా, మొత్తం ఎక్కటమే. పదకొండువేల అడుగులనుండి పధ్నాలుగువేల అడుగుల దూరం ఎక్కాలి. అక్కడ వున్నది అలకాపురం.

తెల్లవారగట్ల నాలుగింటికి బయలుదేరి తెల్లవారేసరికి బదరికి ఆరుమైళ్ళు ఎగువకు ఎక్కాను. అక్కడ ఆ అతిశీతలంలో దారిప్రక్క ఒక పెద్ద రాతిపై కెక్కి కూర్చుండినాను. ఆకాశంలో వెలుగు పూర్తిగా వచ్చింది. ఎఱ్ఱటి కిరణాలు మబ్బుల్ని వివిధాంతరాలైన బంగారురంగులతో, నారింజరంగులతో అంతటా కమ్మివేశాయి. పేరు తెలియని కొన్ని హిమాలయ శిఖరాలు గులాబి రంగులు తాలుస్తున్నవి. అలకనంద లోయలోమాత్రం చీకట్లు పూర్తిగా

పోలేదు. పర్వతసానువుల పరచివున్న తెల్లటి హిమం, ఉన్న కాస్త వెలుగునూ ద్విగుణీకృతంచేసి, లోయలను వెలిగిస్తున్నది.

ఏమీ ఆలోచనలేని ఆనందంలో మునిగిపోయాను. ఏమి చూస్తున్నానో నాకు తెలియలేదు. ఎన్నో వింతవింతలైన పక్షులు, ఎన్నో విచిత్ర గాంధర్వ గీతాలు ఆలపించుకుంటూ ఎగిరిపోతున్నవి. వానిని గమనించకుండానే కూర్చుంటిని. ఎన్నో మనోహరమైన పుష్పాలు కని విని ఎరగనివి ఆ కొండ చరియలలో తలెత్తి లేచి నవ్వి, పరిమళాలు వెదజల్లుతున్నవి. ఇవేమీ నాకు గోచరం కానేలేదు.

వసుధారా జలపాతాలు చాలా అందంగా ఉంటాయట. అవి నా తిరుగుదారిలో సందర్శిస్తామని ఏర్పాటుచేసికొని అలకనందా జననప్రదేశాన్ని ఎనిమిది గంటలకు చేరాను. ఏమి ఆ ప్రదేశసౌందర్యము! దేవత లిక్కడ వాసంచేశారంటే అపనమ్మక మేముంది? ఎచ్చట చూచినా మంచుకొండే. ఒక మహా సమప్రదేశంలా వుంది అలకాపురీద్వారమైన హిమఖండ ప్రదేశం. ఆ హిమపు బయలునకు ఎక్కాలంటే ఇంకా రెండుమూడు వందల అడుగులు వట్టి మంచుగడ్డ ఎక్కాలి. ఆ గడ్డకట్టిన మంచుపర్వతంక్రిందనుంచి అలకనంద ప్రవహించి వస్తూవుంది.

మంచుగడ్డలు విరిగి ఆ నదీకన్య ఒడిలో పడుతున్నవి. ఆ నిర్మల నిశ్చల మహాశీతల ప్రదేశంలో గొంతెత్తి పాటపాడ బుద్ధిపుట్టింది నాకు.

ఓహో! అలకనందా! అమరవాహిని!
అమృతరాగిణి! విమలమోహిని!
సుందరాంగీ వ్యోమగామినీ! ఆనందరూపిణీ!
ఓహో అలకనందా! అమరవాహినీ!
ఎచ్చటనె నీదివ్య జన్మము
ఎచ్చటనే నీ బాలికా కేళీ
ఎచ్చటే నీ ముగ్ధలాస్యము
ఎచ్చటే ఓ అలకనందా!
మనము లెరుగని హిమప్రదేశము
మనసు లెగరని గగన పథముల
జనన మొందిన సుందరాంగీ!
మనుజ పథముల కేల వస్తివి
జలజలా ప్రవహించివస్తివి
గలగలా ప్రవహించివస్తివి
పంకిలమ్మగు నరుల బ్రతుకున
మహారాగము పాడుకుంటూ
పరమపూత విచిత్ర పర్వత

సానువుల శిఖరాలమధ్యా
స్వచ్ఛపన్నీరాల ఝరులతో

ఈ పాట ఆ యక్షప్రదేశాలలో మారుమ్రోగింది. ఆ పాటకు అలకనంద ఆనంద మందినదా? అలకనందాదేవి! ఈ భావం మనస్సులో తట్టిన మరు క్షణంలో అలకనందా నా శకుంతలా ఒకటేనా? అన్న ఆలోచన ఉద్భవించి నది. శకుంతలాదేవి అలకనందా ఒక్కటే! ఆమె మరల నదీరూపమెత్తి ఇక్కడకు చేరిపోయింది అనుకున్నాను.

## 41

అక్కడనుండి అలకనంద ఆడుకునే ఆ ప్రదేశం దర్శనంచేద్దామన్న మహాకాంక్ష పుట్టింది నాలో. ఆ తొమ్మిది గంటలకూ ఆ కొండ ఎక్కడం ప్రారంభించాను. ఏలా ఎక్కానో, ఎన్నిసారులు తూలి పడబోయానో, జారానో, కూర్చున్నానో, దేకానో తెలియదు. పదిగంటలయ్యే లోపున ఆ అలకాపురప్రదేశం చేరాను. ఆ ప్రదేశం పద్దెనిమిదివేల అడుగుల ఎత్తు ఉంటుంది. చుట్టూ ఇరువదిమూడు, ఇరువదినాలుగువేల అడుగుల శిఖరాలెన్నో అనంతంగా కనబడినాయి. గాలి అతివేగంగా విసురుతూఉంది. మంచుతోనిండి, తెల్లటి నెరిసిన జుట్టు శిఖలుగా ముడివేసిన యోగి తపస్సుచేసుకొంటున్నట్లున్నది. ఒక చిన్న కొండప్రక్క ఉన్న చిన్న గుహలో చేరి, బిస్కత్తులు తిని, థర్మాస్ ఫ్లాస్కులోని కాఫీ తాగి, స్కెచ్ తీసి పులకరాలతో ఒక బొమ్మవేశాను. ఆ బొమ్మ మధ్య నాట్యమాడుతూ ధవళాలక అలకనందానది తోచినది. ఆ నదీ సుందరి మోము మా శకుంతల మోమే!

అలకనందా చిత్రము నేను వేయాలని వేయలేదు హేమా! అలావచ్చింది. ఆ గడియలలో ఆలా ఎందుకు వేశానో నాకే తెలియదు. ఎంత అందంగా వచ్చింది, ఆ రూపం! నాతో ఐక్యముకాని నూత్న యవ్వన దినాల శకుంతలా రూపం. ఒళ్ళు బంగారము, జుట్టు బంగారము. ధరించినవస్త్రాలు హిమధవ ళాలు. హిమమే వస్త్రాలుగా నేసిన సౌందర్యమారేఖలలో, వంపులలో దృశ్యమైనవి. ఎటుచూచినా హిమం. లోయలలో దేవదారువృక్షాలు. ఘనీభూత హిమావృత పర్వతసానువులలో అంతర్వాహినులై అనేక దివ్యనదీబాలలు. వారెప్పుడూ బాలలే నిర్ఝరీసుందరులు కొందరు. నిత్యయౌవనలు. త్రిదశ ప్రౌఢాంగనసితి పొందేవారు, గంగా యమునాది నదీమతల్లులు.

హిమాలయంలో ప్రతిప్రదేశం ఎవరు తిరుగగలరు? ఆ రహస్యాలను ఎవరు తెలిసికోగలరు? మహాకవులీ మహాప్రదేశాలను వర్ణించి వర్ణించి, చాలలేకపోయి నారు. మనుష్యదేశాలమధ్య మనుష్యులకందని మాయాప్రదేశమై విస్తరించి ఉన్న ఈ విచిత్ర పథాలలో మనుజునకు పనిఏమి? మనుష్యుని దుఃఖాలు, ఆనందాలు, ఆవేదనలు, కాంక్షలు, సంతృప్తులు హిమాలయేశ్వరునకు తెలియ నవసరమేమి? అవి అతని పాదాలనైనా అంటునా?

ఆ స్థలంలోని మహదానంద మత్తతలోనుంచి విడల్చుకొని, ఎట్లు దిగానో, లోయలలోనికి ఎల్లా నడిచానో, ఏదిక్కున వచ్చానో, మెలకువ వచ్చేసరికి శతధార దగ్గిర ఉన్నాను. శతధారా సౌందర్యం వర్ణనాతీతమే. అక్కడ నూరు ధారలు నూరు వివిధ శ్రుతులతో నారదమహతీవీణానాదం చేస్తూ పడుతున్నవి. అచ్చటి పూవులలో ఒక మహాపుష్పము నాకు దర్శనమిచ్చింది. ఆ పుష్ప సౌందర్యం నేనేమి వర్ణించగలను? తెల్లని రేకులు, కాశ్మీరకుసుమవర్ణ హృదయం రెండువందల పుటాలున్న కమలాలకన్న పెద్దది. ఎన్నో తుమ్మెదలు ఆ పుష్పంలో వాలుతున్నవి. మత్తెక్కి వెళ్ళిపోతున్నవి. ఆ పుష్పపు సువాసన ఇతర పరిమళాలను చిన్నబుచ్చుతుంది. అదే పారిజాతకుసుమము అనుకున్నాను. పుష్పస్వరూపము ఒక మహోత్తమ నక్షత్రస్వరూపమై వెలుగుతున్నది. ఆ పువ్వును నేను సంపాదించగలిగిననాడు, అని నా హృదయంలో ఒక మెరుము ప్రసరించింది.

## 42

అలకాపుర బాహ్యసౌందర్యచిహ్నం సత్పథసరోవరం. ఆ సరోవరం మెలున్నర విశాలం. అత్యంత శుభ్రనీలజలపూర్ణము. అలకాపురంలో మధ్య నుండేది చంద్రకుండము, దాని కావల మైలుదూరమున సూర్యకుండమున్నది. అంత ఎత్తున సత్పథాది సరోవరకుండాలలో, వేడినీటి ఊటలు గర్భమందుండుట చేతనే, నీరు ఆ అతిశీతలంలోకూడా పేరుకోకుండా ఉన్నాయి. అలకాపురీ ద్వారమైన ఆ హిమసమతల ప్రదేశాన్ని చక్రతీర్థమంటారు. ఆ చక్రతీర్థంలో మానవవాసన పూర్తిగా కరిగిపోతుంది. ఏదో అననుభూతశాంతి హృదయాల నావరిస్తుంది. నాకా చక్రతీర్థ నిత్యవాసత్వం ఏల లభించకూడదన్న గాఢ వాంఛ జన్మించింది. సత్పథ సరోవరతీరాన నిలుచుండి, ఆ మధ్యాహ్నాన ఎదుట హిమాలయాలను దర్శిస్తే అవన్నీ ఎక్కడికో, ఏ పథాలకో తీసికొని పోయే స్ఫటిక సోపానపంక్తిలా కనబడ్డాయి. ఈ దృశ్యానికే స్వర్గారోహణ దృశ్యమని పేరు.

సూర్యకాంతిలో ఆ పర్వతాగ్ర ప్రదేశాలు వెండి, రత్నసోపానాలులా కనుపించాయి. ఇక్కడనుండే పాండవులు స్వర్గారోహణము కావించారుట. ఆ సోపానాల నెక్కుచు అనంతపథాలకు వెళ్ళిపోగలనా? మానవాతీతపథ సందర్శనం మానవులలో ఉన్న మానవత్వాన్ని నాశనంచేసి, వారికీ మానవా తీతసత్వాన్ని అర్పిస్తుంది. ఆ మానవాతీతత్వం అనుభవించగలం, వర్ణించ లేము. ఆ ఆనందానుభవమే అమరత్వమేమో.

తోడు దారెరిగిన మనుష్యుడు లేక ఎవ్వరూ ప్రయాణంచేయలేరట. అయినా అంతకుముందే ఒక సన్యాసులజట్టు ఒకటి ఆదారిని ప్రయాణంచేసి ఉండడంచేత వారి ప్రయాణంజాడలు స్పష్టంగా కనబడినవి. అదీకాక ఆ సన్యాసులను, ఆ దారినిగురించీ ఆ దృశ్యాలనుగూర్చి పూర్తిగా తెలుసు

వున్నాను. అందుకనే నా కా దారి సుగమమైంది. తిరిగి చక్రతీర్థమువచ్చి, ఇంకను దిగి శతధారల సందర్శించుచున్నప్పటికి నాలుగైనది. వడగళ్లు కురియుట కారంభించినవి. అత్యంత శీతలవాయువు వీవదొడగినది. నా కాఫీ అంతా అయిపోయినది. బిస్కట్లు అయిపోయినవి. ఒక బండరాతిక్రింద దూరి, చమరీమృగంలా నేను మోసే సామానులు దింపి, గాలి రాకుండ ఒక గొంగళీ అడ్డు పెట్టి, నా స్టవ్వు వెలిగించి, వెలగకాయలంత ఉన్న నాలుగు వడగళ్ళేరి, నీళ్లుకాచి, కాఫీ తయారుచేసుకొని త్రాగాను. సిగరెట్లు వెలిగించి రెండుగంట లలాగే కూర్చున్నాను. చీకటి అలుముకుపోయింది. ఉన్నిగొంగళీ కోటుక్రిందవున్న తోలుకోటులోపల ఉన్నిదుసులు నాకు చలి బాధను కలిగించలేదు. ఒక గంట కురిసి వడగండ్లవాన వెలిసింది. గాలి జోరుమాత్రం తగ్గలేదు. వేసవికాల మవడంచేత దారి పూడుకుపోదనిమాత్రం ధైర్యం.

తీర్థయాత్రకు పోయేవారంతా రానూపోనూ మూడురోజులు ప్రయాణం చేస్తారు. నేనున్న తావుకు దిగువను పదునొకండుమైళ్ళ దూరంలో బదరీపురం ఉంది. ఈ కొంచెందూరంలోనే సర్వ మానవజగత్తు నాకు వేలకొలదిమైళ్లు దూరమైపోయినట్లే తోచింది.

ఒక చిన్నజంతువు దాగేటందుకుమాత్రం సరిపోయే ఆ స్థలంలో ఇన్ని ఎండుచితుకులు పోగుచేసి మంటచేశాను. దేవదారుపుల్లలు బాగా మండుతూ సువాసనధూపాలను ఎగజిమ్ముతున్నవి. ఆ విచిత్ర నిశ్చలతలో, నాకు సంపూర్ణమైన మెలకువే. నిద్ర రానేలేదు. మత్తయినా కలగలేదు. ఎన్ని ధ్వనులు నిండివున్నా అవన్నీ ఆ నిశ్చలతలో అంతర్భాగాలయ్యాయి. అలాగే కూర్చున్నాను. నా చేతిగడియారంలో రెండు అయ్యేసరికి నిప్పు ఆరిపోయింది. ఆ చీకటిలో, ఆ వెలుగులో, ఆ చీకటివెలుగులలో అలానే కూర్చుండివున్నాను. నడుం నొప్పిపెట్టలేదు. ఆలోచనలు ఆఖరయ్యాయి. బుద్ధి నిశితత్వం తాల్చింది. స్పష్టమైన ఆలోచనలు మొక్కలు మొలిచి వృక్షాలై పుష్పాలు పూచినవి.

ఏ విషయమైనా మనుష్యుల బుద్ధిమీదనే ఆధారం. బుద్ధి ననుసరించి సిద్ధాంతం. సిద్ధాంతా న్ననుసరించి మనుష్యుల ఆచరణ ఉంటుంది. అన్ని ఆచరణలకు ఆతని స్వీయసిద్ధాంతాలు ఆధారం కాకపోవచ్చును. అవి చిన్న పనులు. అప్పటి తాత్కాలిక పరిస్థితుల ననుసరించి ఉంటవి. కాలానికి మనుష్యుడు దూరమవడమేకదా ఐన్‌స్టైన్ నాల్గవపథము. ఆకాశంలోని కొన్ని నక్షత్రాలకు మూడువేల సంవత్సరాలనాటి భూమిలోని చరిత్ర కన బడుతూవుంటుంది. కొన్ని తారలకు నూరు సంవత్సరాలనాటి చరిత్ర. ఇంక కొన్నింటికి ఏడాదిక్రిందటి చరిత్ర దర్శనము అవుతూ ఉంటుంది. ఒకే క్షణంలో ఈలాంటి కాలవ్యత్యాసాలు విశ్వంలోవుంటే, సంఘటన సందర్శనము మనుష్య మనుష్యునికి ఎన్ని తేడాలుగా వుండాలి. అందులో వివిధ హృదయాలకు దృష్టివైవిధ్యమూ, గ్రహణవైవిధ్యము అనంతరూపాలుగా వున్నవి.

ఈ వైవిధ్యస్థమై, వైవిధ్యాతీతమైన ఒక సత్యమేదో ఉండాలికదా! అది భౌతికానుభవంలోనే ప్రత్యక్షమవుతున్నప్పుడు, బుద్ధి కతీతమైన మహాసత్య మొకటి ఉండాలికదా? ఈ సత్యము ఇతరు లెవ్వరూ బోధింపలేరు. ఎవరికి వారే గ్రహించుకోవాలి, ఆలోచించుకోవాలి. గురువు మార్గం మాత్రం చూపిస్తాడు.

జనసమ్మర్దంలో సంగీతం వినబడదు. జనుల హోరులో ఆలోచన ఏక ధార కాదు. కళాశాలాశాస్త్రపరిశోధనాలయము వీధిలో పెట్టగలమా? అలాగే సత్యాలను గ్రహించడానికి ఈలాంటి మానవజీవితాతీత నిర్మల నిశ్చల ప్రదేశాలు అనుకూలములు. ఆ సమయంలో ఏవి నాలో చర్చించుకున్నా, నా కవి నిముషంలో స్పష్టమైపోయినవి. ఇంతలో, నేను స్టవ్ వెలిగించి నీళ్ళు కాచుకొని, ముఖసమ్మార్జనం చేసి, కాఫీ కాచుకొని తాగుతుండగా స్వామిజీ నలుగురు సన్యాసులతో నన్ను వెతుక్కుంటూ అక్కడకు వచ్చారు. ఆయన నన్ను చూచి ఆశ్చర్యపడి 'నాయనా! ఒక్కడవు వచ్చావని ఆలోచించాను. కాని నాకు భయం కలుగలేదు. అందుకని ధైర్యంగానే ఉంటిని గాని వడ గండ్లవాన కురియడంవల్ల దారి తప్పిపోతావేమోనని తెల్లవారగట్ల బయలుదేరి వచ్చాము' అన్నారు.

# ద్వితీయ భాగము

## కైలాసేశ్వరుడు

### 1

హేమసుందరీదేవీ, ఇక్కడనుంచి జరిగిన మా సమాచారం యావత్తూ స్వామిజీ వ్రాశారు. మళ్ళీ నేను వ్రాయనవసరంలేదు. ఆయనభాష గంగా నిర్ఝరిణే. అదంతా ప్రతి వ్రాసుకొని ఈ నా జీవితచరిత్రలో రెండవభాగంగా స్వీకరిస్తున్నా. ఈ భాగం కొద్దే. ఆ పిమ్మట, నేను నీదగ్గరకు వచ్చేటంతవరకు జరిగినది, నాలుగు ముక్కలు నేనే వ్రాసి నా చరిత్ర పూర్తిచేశాను. ఈ చరిత్ర ఉద్దేశము చిట్టచివర నీకు నివేదించాను...శ్రీనాథమూర్తి.

### స్వామిజీ కథనము

శ్రీనాథమూర్తి ఎంతో ఉత్తముడు. అతన్ని చూడగానే నాకదేమో అనిర్వ్యాజమైన వాత్సల్యం కలిగింది. కర్మదుర్విపాకంవల్ల అతని భార్య పోయినది. అతడు పసువై పోయాడు. ఈ బాలకుని ముందుజీవితం అఖండ నిర్ఝరిణి వేగంతో ప్రవహిస్తూ, దేశాల పుణ్యవంతం చేయవలసి ఉన్నది.

శ్రీనాథమూర్తి ఉత్తమశిల్పి కాగలడు. ఈనాడాతనికి ఎవ్వరి బోధలు రుచించవు. అతడే ఆతనిదారి వెతుక్కోవాలి. హిమాలయాలలోనే ఈతనికి దారి దొరుకుతుందని తోచింది నాకు. వెంటనే అతన్ని మా జట్టుతో కైలాసం రమ్మన్నాను. ఆతనితో నేను వాదించదలచుకోలేదు. ఆతనికి అవసరం వచ్చినప్పుడే ఇది దారి అని చూపిస్తాను. అది నిశ్చయము. నారాయణ! నారాయణ! దివ్యభావాలకుకూడా అతీతుడవైన పరమేశా! బదరీక్షేత్రాంతరమూర్తీ, కైలాసక్షేత్ర పాలకా, అనంతప్రభూ, మేమంతా కైలాసం వస్తున్నాము. కైలాసపర్వత సందర్శన మహాపుణ్యం నీకే అర్పిస్తున్నాము తండ్రీ. సెలవా?

నా కిది పదిహేనవసారి కైలాసయాత్ర. కైలాసేశ్వరచరణాలకూ, నాకూ ఏదో విచిత్ర పవిత్ర సంబంధం ఉండి ఉండాలి. బదరీనాథ క్షేత్రంలోని అన్ని పుణ్యస్థలాలు శ్రీనాథమూర్తికి చూపించినాను. నారదశిల, నృసింహశిల, వరాహశిల, గరుడశిల, కుబేరశిల అనే పంచశిలలు; వహ్నితీర్థము, ప్రహ్లాదతీర్థము, నారదతీర్థము, కూర్మతీర్థము, ఋషిగంగ అనే పంచతీర్థాలు; చరణపాదుక, శేషనేత్ర, వేదధార, మాతామూర్తి, వ్యాసగుహ, భీమశిల అను షట్ పవిత్రస్థలాలు ఆతనికి చూపించి, శుభముహూర్తంలో కైలాసపర్వతోన్ముఖులమయ్యాము.

కొండలెక్కుటలో అతి జాగ్రత్తగా దారి చూచుకోవలసిఉన్నది. అనేక నదుల లోయలు దాటవలెను. వర్షాలు, వడగండ్లుపడుట ఎక్కువైనది. మానాఘాట్ ఈ దారి కంతకూ ఎత్తైన ప్రదేశం. ఇక్కడ నిలుచుండి శ్రీనాథమూర్తి నన్నుచూచి 'స్వామిజీ మనం స్విడ్జర్లాండులోని బ్లాంకు శిఖరంకన్న ఎత్తైన ప్రదేశంలో ఉన్నామండీ' అన్నాడు.

ఆ ప్రదేశానికి ఎటువైపు చూచినా లోయలు క్రిందకు దిగిపోతున్నాయి. మేము నిలుచున్న ప్రదేశం అసలు హిమాలయశ్రేణికి వెన్నెముక. ఆ వెన్నెముక శ్రేణిలో ఎవరెస్టు, గురుమాంధాత, నందపర్వత, కాంచనగంగ, గౌరీశంకర, ధవళగిరి, గోడ్విను పర్వతశిఖరాలున్నాయి. అందులో ఎన్నో శిఖరాలు మాకు కనబడినాయి.

మానాఘాట్ నుంచి ప్రయాణాలు చేసుకుంటూ అడుగుమాత్రం వెడల్పుగల దారుల హిమపాత ప్రవాహాలపై ప్రయాణించాము. ఒకచోట ఆకాశమంటే పర్వతసానువు, ఈప్రక్క పాతాళమంటే లోయ; పర్వతాలు, నదులు, రాళ్లూ; రోజుకు ఆరు, ఎనిమిది మైళ్ళుకన్న ఎక్కువ ప్రయాణం చేయలేము.

ధాప్పానగరం హిమాలయశ్రేణికి అవలివైపు పర్వతపాదాన ఉన్నది. ధాప్పానుండి, పధ్నాలుగువేల అడుగుల ఎత్తునుండి పన్నెండువేల అడుగుల ఎత్తుకు జీలంనది లోయలోనికి దిగి, ఆ నదీతీరాన చివచిలింగ్ గ్రామం చేరుకున్నాము. చివచిలింగ్ గ్రామంనుండి మూడురోజులు ప్రయాణంచేస్తూ జ్ఞానిమామండి నగరం చేరాము. ఈ నగరం పెద్ద వర్తకస్థానం. ఇక్కడే హిందూదేశ వస్తువులు, టిబెట్టువస్తువులు మారకంజరుగుతూ ఉంటవి. ఇక్కడ చక్కని పాశ్మీనా

ఉన్నిగుడ్డలు, శాలువలు, కస్తూరి, శిలాజిత్తు, ఉన్ని మొదలైనవి టిబెత్తువారు అమ్ముతారు. ఆయుర్వేదౌషధాలకు పనికివచ్చే ఓషధు లనేకం త్రివిష్టపులు ఈ నగరంలో అమ్ముతారు. వెండి బంగారము ఖడ్డీలుగాజేసి అమ్ముతారు.

భరతదేశాన్నుంచి నగలవస్తువులు, పగడాలు, ముత్యాలు, కుంకుమపువ్వు, తేయాకుడబ్బాలు, అత్తరుదినుసులు, అగరువత్తులు, ధూపసామానులు, పచ్చ కర్పూరం, హారతికర్పూరము, బియ్యము, దూదివస్త్రాలు, ఇత్తడి, రాగి మొదలైన లోహాలు, అద్దాలు, దువ్వెనలు, దీపాలు, కొవ్వత్తులు, సూదులు, కత్తెరలు, ఉక్కుసామానులు, ఇనపసామానులు ఇంకా ఎన్నో త్రివిష్టపానికి ఎగుమతి అవుతాయి.

## 2

జ్ఞానిమామండీలో మా సరకులన్నీ తనిఖీచేసి, కొద్ది పన్ను విధించారు టిబెత్తు రాజ్యాధికారులు. ఆదేశంలో నన్నెరిగినవారు చాలామంది ఉన్నారు. అక్కడ ఉద్యోగులకూ, నాకూ చాలా స్నేహం. అవసరమైతే దారిలో దొంగలు మమ్ము బాధించకుండా ఉండడానికి కొంతమంది టిబెత్తు పోలీసు వారిని రక్షకులుగా ఇస్తామని వారంటే 'మేము చాలామంది వున్నాము. మా కేమీ భయంలే'దని నేనన్నాను.

జ్ఞానిమామండీనుండి మాజట్టు బయలుదేరింది. మధ్య, గ్రామాలు వున్నా లేకపోయినా, శ్రీనాథమూర్తి డేరా, రాజపుత్ర జమీందారుని డేరా వేస్తే మాకందరికీ బాగా సరిపోయేవి. గుర్రాలకూ, చమరీమృగాలకూ టార్పాలిన్‌తో డేరాలు తయారుచేసి వాని నందులో కట్టేసేవారం. కూలీలకు టార్పాలిన్‌తో చక్కని గుడారం నిర్మించేవారం.

ఆ ప్రకృతిసౌందర్యం వీక్షిస్తూ మూర్తి సర్వమూ మరచిపోయేవాడు. అతని ధ్యానమంతా ఏదో మహాభావసందర్శనాభిలాషియై ఉరకలుపెట్టు తూన్నది. ఈ మకాంలో శ్రీనాథమూర్తి నాదగ్గరకు వచ్చాడు. 'స్వామీజీ! భగవంతుడంటే ఏమిటి?' అని చిన్నబిడ్డలా ప్రశ్నించాడు. ఈవిషయమైన చర్చ అతడు చేసుకోక, గ్రంథాలు చదవక ఆ ప్రశ్న వేయలేడు. అతనిలో ఈ పరమభావాన్నిగూర్చి శిశుత్వం వచ్చింది. అదేకదా సాధకుని ప్రథమస్థితి!

నేను: నాయనా, భగవంతు డొక వ్యక్తికాదు; అఖండ మానవుడూ కాదు.

మూర్తి: విష్ణు, శివ, అమితాభ, జెహోవాది భావాలన్నీ మానవుని శక్తికి కొన్ని కోట్లకోట్ల రెట్లు శక్తిగల మూర్తిని భావించినవేకాదా అండి?

నేను: అలా మనుష్యులు భావిస్తున్నారు. ఒకొక్కప్పుడు తమకు సన్నిహితునిగా, పరమబంధునిగా కూడా భావిస్తారు.

మూర్తి: అలా భావించడంవల్ల మానవునికి స్వశక్తి నీరసించి, అస్వతంత్రత ప్రబలి తన పురోగామిత్వానికి తానే అడ్డుతగలడం కాదాండి?

నేను: మనుష్యు డెందుకు పురోగామికావాలి?

మూర్తి: లేకపోతే నశించిపోతాడు.

నేను: ఋజువు చేయి.

మూర్తి: ప్రకృతిలో వస్తువులు పెరగాలి. లేకపోతే నశిస్తాయి.

నేను: సముద్రం పెరుగుతోందా? కొండలు పెరుగుతున్నాయా? ప్రపంచంలో ఉన్న గాలి పెరుగుతోందా?

మూర్తి: అవి రూపాలు మారుతున్నాయి గదాండి.

నేను: మనుష్యుడు పెరుగునా! తక్కిన శక్తులు మారునా! ప్రకృతిలో వస్తువులు పెరగాలి, లేకపోతే నశించాలంటావేమి?

మూర్తి: ప్రకృతి అంటే చేతనప్రకృతి అని నా ఉద్దేశం.

నేను: ప్రాణంగలవన్నీ పెరుగుతున్నాయికాదా? పదేళ్ళనాటి జనాభా నూట ముప్పైకోట్లయితే, ఇప్పుడు ప్రపంచంలో నూటయాభైకోట్ల పెచ్చిల్లర పెరగ లేదా? అందులో ఏకొద్దిమందో తప్ప తక్కినవాళ్లు భగవద్భావాన్ని నమ్మిన వాళ్ళేకదా? ప్రకృతిలో మనుష్యులు తప్ప తక్కిన ప్రాణికోట్లకు భగవంతుడున్నాడని, లేడని భావాలు లేవుకదా? ఒకవేళ ఉన్నా, ఉన్నదీ లేనిదీ మనకు తెలియదు. అనేకరకాల ప్రాణికోట్లు నశించాయి, వానిలోంచో, విడిగానో కొత్త ప్రాణికోట్లు ఉద్భవించాయి. వానికి పురోగామి కావాలనిగాని, ఆగిపోదామనిగాని ఆలోచనలేదు. వాని పెరుగువిరుగులు ఆ పురోగామిత్వంమీద ఆధారపడి ఉండలేదు. కనుక నువ్వు ప్రారంభించిన ప్రాతిపదిక నిరాధారం! ఇంక నీ వాదన మనుష్యుని పురోగామిత్వ తిరోగామిత్వాల విషయమై మాత్రమేకదా?

మూర్తి: అవునండి. మనుష్యుడు వృద్ధిపొందడమే, ఆరోగ్యవంతుడవడమే, సర్వసంపదలు సమంగా అనుభవించడమే కోరుతాడు. అంటే, మనుష్యుడార్థికప్రాణి. ఆర్థికంగా సమత్వం కోరుతాడు. అది రావాలంటే భగవంతుడు, కర్మ, మోక్షము, నిర్వాణము, మళ్ళీ జన్మ అనే భావాలు అతని పురోభివృద్ధికి అడ్డాలుకదా?

నేను: ఆర్థిక సమత్వం కోరేవాడికి భగవంతుడు వద్దని చెప్తాడా అంటే, ఒక మనుష్యునిలో ఉన్న భగవద్భావం 'నువ్వు ఆర్థికంగా సమంగా ఉండకు' అని బోధిస్తుందా?

మూర్తి: అంటే, మనుష్యుడు తనలో ఉన్న ఎచ్చుతగ్గులు ఆదికర్మనుంచీ వస్తున్నాయనిన్నీ, కర్మకూడా భగవత్స్వరూపమనిన్నీ, ఎచ్చుతగ్గులు ఉండడమే భగవంతుని ఇచ్ఛఅనీ నమ్మి, పెద్ద అలసత్వం సంపాదించుకొని, తన ప్రయత్నాలనుండి విరమించి, నిస్పృహ పొందుతున్నాడు కదా అండి?

నేను: ఇంతవరకు భగవద్భావమే లోకం అంతా నిండివున్నదికదా. ఏ చార్వాకులో, ఏ ఇంగర్సాల్‌వంటివాళ్ళో దేవుడు లేడని వాదించవచ్చు. అంతే. కాని భగవంతుడున్నాడని నమ్మేవారు కోట్లు వున్నారు. అయినా ఒక పరిణామంనుంచి ఇంకో పరిణామం వస్తూనేవుంది. రాజ్య విధానాలు,

శాస్త్రవిధానాలు, జీవితవిధానాలు అనేకం మార్పులు పొందాయి. ఆ మార్పులన్నీ చాలా ఉత్కృష్టాలైన మార్పులని మీరంతా వాదిస్తూనే ఉన్నారు. భగవద్భావం ఎల్లా తీసుకువచ్చిందా మార్పులు? మీతండ్రి భగవంతుని నమ్మితే, లేడని వాదించగలిగిన నీవెలా ఉద్భవించగలిగావు? నువ్వు పురోగమ స్వరూపానివా? తిరోగమ స్వరూపానివా? అలాగే లెనిన్ తండ్రో, తాతో భగవంతుని నమ్మినవాడేకద! ఆ వంశంలో భగవంతుని నమ్మని లెనిన్ ఏలా ఉద్భవించాడు?

మూర్తి: నన్ను ఆలోచించుకోనియ్యండి.

మూర్తి నాకు నమస్కరించి వెళ్ళిపోయాడు. ప్రజలు భగవంతుడున్నాడని ఒప్పుకుంటే ఏమి ఒలికింది, లేకపోతే ఏమి నష్టమైంది? భగవంతుని పేరిట జరిగే ప్రాణిహింస అనంతంకదా. మనుష్య హింసకే వెరవని భక్తులు దేనికి వెరుస్తారు? మనుష్యుణ్ణి పశువునుచేసే భగవద్భావంకన్న, మనుష్యుణ్ణి మనుష్యుడుగా ఉంచే నాస్తికభావమే నయంకాదా అనుకుంటూ కూర్చున్నాను.

మూర్తి ఒక్కడూ ఆ లోయలలో కొండలలో నడిచి కొంత దూరం పోయాడు. మనుష్యుడు ముందుకునడిచినా, వెనక్కునడిచినా ఒక్కటే! వెనకాముందు లెక్కడున్నవి? తూర్పు ముందూ, పడమర వెనకవుతుందా? తూర్పుపడమర లీ భూమిలో సూర్యుణ్ణిబట్టికదా. ఎవరు ఎట్లు నడిచినా, చుట్టు చుట్టి యథాస్థానానికే వస్తారు.

గోళాకారంగా ఉన్న దీ భూమి. గోళాకారంగా ఉన్న దీ విశ్వం. గోళాకారంగా సర్వశక్తులూ స్పందిస్తాయి. గోళాకారంలో ఏదిమొదలు? ఏది పురోగామి? ఏది ఆశయం?

## 3

మరల నా కైలాసేశ్వరుణ్ణి సందర్శిస్తున్నాను. భోజన ప్రియునకు చక్కని మిఠాయిలు, వస్త్రప్రియునకు పట్టువస్త్రాలు ఏ నరాలను స్పందింపజేస్తాయో కదా? మనుష్యుడు వాని దర్శనమాత్రాన ఉప్పొంగిపోతాడు. నాబోటి జ్ఞానపిపాసులకు కైలాస సందర్శనము అత్యంత మాధుర్యాలను జీవితమంతా ఏల ప్రసరింపజేస్తుందో భౌతికవాదులకు ఏమి తెలుస్తుంది?

మూర్తి ఓ కూలీని వెంటబెట్టుకొని లోయలో ఎక్కడికో పోయాడు. అతనికీ హిమాలయ సందర్శనము ఆనందం సమకూర్చింది. రంగుల కళ్ళజోళ్ళతోనూ, కళ్లకా రంగుల అద్దాలజోడు లేకుండాను, సర్వకాలము ఆ శిఖరాలను, పర్వతసానువులను పరిశీలిస్తూ తన చిత్రలేఖనాలు విన్యాసం చేసివేస్తున్నాడు.

మూర్తికి కైలాసపర్వతముకడ ఏదో విచిత్ర పరివర్తనము కలుగుతుందనే నా నమ్మకం. కైలాసపర్వతానికి అనతిదూరంలో ధాన్యకటక సంఘారామం ఉంది.\ దానిని ద్యూపాంగు సంఘారామం అంటారు త్రివిష్టప బౌద్ధులు.

అచటి సంఘారామాచార్యుడైన లామా తొంబదిఏళ్లు దాటినవాడు, అఖండ విజ్ఞాని. సత్వసంపన్నుడు. అగతానాగతవేది. అర్హతుడు. ఆయన మహాశిల్పి, చిత్రకారుడు. నా కెన్నియో విషయాలు పూర్వశిల్పాన్నిగురించి బోధించారు. ఆయనకడ మూర్తిని కొన్ని నెల లుంచదలచుకొన్నాను. నేను కైలాస ప్రదక్షిణం చేసేటప్పుడు మూర్తిని నాతో తిప్పుతాను.

మేము అయిదురోజులు దుర్గమమైన జీలంనదీలోయలో ప్రయాణం చేశాము. రావణహ్రదం చేరాము. మూర్తి నాకడకు పరుగునవచ్చి 'స్వామీ ఈ చెరువునేనా మానససరోవరం అంటారు?' అని అడిగాడు.

'కాదుబాబూ, ఇది రావణహ్రదం. ఈ ప్రదేశాలలో అనేక మంచినీళ్ళ చెరువులున్నాయి.'

'రావణహ్రదం! కైలాసాన్ని పెకలించి తన లంకకు తీసుకొనిపోవాలని ప్రయత్నించిన రావణాసురుని గాథతో సంబంధం ఉందా స్వామీ?'

'అవునుమూర్తీ, నఖాలతోతవ్వి కొండ పెకలించాలని ప్రయత్నిస్తే ఆతడు భంగపాటు పొందాడట. కాని ఆ త్రవ్వడంవల్ల ఈ హ్రదం ఏర్పడిందట.'

'మనవాళ్ళవి ఏమి విచిత్రభావాలండీ! ప్రతి ప్రకృతివైచిత్ర్యానికీ ఒక చక్కని గాథ కల్పిస్తారు.'

'కల్పించడం అంటే నీ ఉద్దేశం?'

'లేనిది సృష్టించడమనే!'

'లేనిది ఎవరికి?'

'.........'

'అందరికీనా?'

'అవును.'

'ఉందని గుర్తించేవస్తువు ఉందని ఎల్లా తెలుస్తుంది?'

'చూపులుచూస్తే, మనస్సు గ్రహిస్తుంది.'

'చూపులు చూచినా, మనస్సు గ్రహించకపోతే?'

'చూచినా ఒకటే, చూడకపోయినా ఒకటే?'

'అంటే—చూపులు నిమిత్తమాత్రం, మనస్సు అసలుశక్తి అనిగదా నీవాదన. సరే. చూపులు లేకుండా మనస్సు గ్రహిస్తే?'

'మనస్సు గ్రహించడానికి ఏదైనా మార్గం ఉండితీరాలండి.'

'మనస్సు పైఅధికారి అనుకో. పై అధికారికివచ్చే విన్నపాలు క్రింద ఉన్న అధికారసోపానం వెంట వస్తవనుకో. ఆ అధికారే క్రింది అధికారులతో సంబంధంలేకుండా తానే స్వయంగా విషయం దర్యాప్తుచేసుకొని, విషయాన్ని గూర్చి తీర్పు ఇవ్వగలడా?'

'ఇవ్వగలడండి. కాని ఈ పోలిక సరియైందికాదు. తెలుపురంగు ఒక వస్తువు ఆధారంలేకుండా ఉండలేదు. అల్లాగే మనస్సు ఇంద్రియాల ఉపాధి లేకుండా వ్యక్తంకాదు.'

'విశ్వంలో విద్యుచ్ఛక్తి ఉంది. అది ఉపాధిద్వారా వ్యక్తం అవుతుంది. కాని ఉపాధికూడా ఆ విద్యుత్ స్వరూపమే అనికదా శాస్త్రజ్ఞులంటారు. అంటే విశ్వంలో ఉన్న ప్రతి అణువూ ఎలక్ట్రాన్, ప్రోటాన్ మొదలైన సూక్ష్మాతి సూక్ష్మశక్తి కణాల కూడికనేగా మీ ఉద్దేశం? ఆ విద్యుత్ వ్యక్తం కావాలంటే తనతో చేయబడిన వస్తువుద్వారా వ్యక్తమవుతుంది. మనస్సునుంచే సర్వ ప్రకృతీ ఉద్భవించింది. సర్వ ప్రకృతిలోని వస్తువు మనస్సు. ఆ మనస్సు ఒక ఉపాధిద్వారాగాని వ్యక్తంకాకపోవచ్చును. కాని మనస్సు ఉపాధి అవసరంలేకుండా ఉండి, ఇతర విషయాలను గ్రహిస్తుందికదా?'

'చిత్తం.'

'అలాంటి మనస్సు సృష్టించిన ఈవిచిత్రభావాలు వట్టికల్పనలెలా అవుతవి మూర్తీ? మనస్సు, ఇంద్రియాలను ఉద్భవింపజేసినట్లే, భావాలనూ ఉద్భవింపజేస్తుంది. భౌతికమైన ఈపదార్థాలెలాంటి సత్యమో భౌతికేతరమైన భావాలూ అలాంటివే. కనక ఒక భౌతికవిషయం ఎంత ఆనందదాయకమౌతుందో, మానసికమైన ప్రపంచమూ అంత ఆనందదాయకమే! శాస్త్రకారుడు టిబెట్టునుగూర్చి తెలుసుకోడానికి ఎంతో ప్రయత్నించాడు. అనేకులు పరిశోధకులు కష్టపడి, మారువేషాలతో తిరిగి, ఈ టిబెట్టు రహస్యాలను రవంత గ్రహించారు. అల్లాగే ఫలాని నక్షత్రం భూమికి ఇన్ని వెలుగు సంవత్సరాలదూరం అంటే, ఈ జ్ఞానం మనుష్యునకెందుకు సంతోషంకలిగించాలి? ఎవరెష్టు శిఖరము ఇరవైతొమ్మిదివేల పైచిల్లర అడుగుల ఎత్తుంటే ఏమి, అందుకు ఒకవేయి అడుగులు తక్కువుంటే ఏమి? ఆశిఖరం తవ్వి పసిఫిక్ మహాసముద్రం పూడుస్తావా? ఈలాంటివిషయాలు తెలుసుకోవడం ఆనందం. అలాగే శాతవాహనులు ఆంధ్రులా, మహారాష్ట్రులా? వారు ఎవరైనా, కొంపలు మునిగిపోవు. ఇదంతా మానసికం. అలా మానసికంగా గాథలు కల్పించడం ఆనందకారణం. అందువల్ల వచ్చే నష్టమేమీ లేదు.' నా ఉపన్యాసం అవగానే మూర్తి నాకు నమస్కరించి ఆలోచనతో రావణహ్రదం ఒడ్డున కూర్చుండి బొమ్మ వేయడం ప్రారంభించాడు.

## 4

రావణహ్రద సౌందర్యము, మానససరోవర సౌందర్యముతో సరిపోల్చలేము. రావణహ్రదంలో ఆసురిక సౌందర్యమూ, చిత్రిణీజాతి స్త్రీ మనోహరత్వము విలసితమౌతుంది. మానససరోవర సౌందర్యం అలౌకికము. పద్మినీ జాతి స్త్రీవలె ఆ సరస్సు ప్రత్యక్షమౌతుంది. సరస్వతీదేవివలె నాట్యం చేస్తుంది, రాజహంసివలె నడయాడుతుంది, యజ్ఞాగ్నిశిఖాకాంతితో వికసిస్తుంది. మానససరోవర సందర్శనమాత్రాన పూర్వకర్మ పటాపంచలవుతుంది. బహ్మానందము సన్నిహితమవుతుంది.

డెబ్బదిరెండు మైళ్ళ వైశాల్యం గలిగి నిర్మల నీల నీరాలతో తెల్లటి ఆ మంచుప్రదేశంలో సతీదేవి ధవళవక్షోజ నీలచూచుకంవలె బిడ్డలైన భక్తులకు

దర్శన మిస్తుంది. సకల విశ్వాత్మికమగు ఆధిమానసిక ప్రతిబింబ మీ మానస సరోవరం. విశ్వంలో భూగోళము, విచిత్ర భగవల్లీలారంగము. ఆభూగోళంలో భరతదేశం విశ్వమాత. ఆ మాతకు వక్షోజాలు హిమాలయాలు, హృదయం బదరీ నారాయణం, మనస్సు మానససరోవరం, శిరస్సు కైలాసం, సహస్రారం కైలాసశిఖరం. ఈ రాజరాజేశ్వరీ భావం, ఈ కామకామేశ్వరీ భావం, నాబోటి యోగ విద్యార్థులకే దృశ్యాదృశ్యం.

శ్రీనాథమూర్తి మానససరోవరాన్ని చూచి నిర్విణ్ణుడై, ఆ దివ్య సౌందర్యం అతన్ని ముంచెత్తగా, ఆనందం అతన్ని వణికించగా, అశ్రుబిందువులు గంగాధారలై ప్రవహింప నవ్వుతూ, వెక్కి వెక్కి ఏడ్చినాడు. కొంత సేపటికి సమ్మాళించుకొని, ఆతడు యోగివలె కౌపీనమాత్రధారియై, ఆ భయంకర శైతల్యంలో నాతోపాటు మానససరోవరంలో స్నానంచేశాడు. ఒంటి నిండా బూడిదపూసుకొని శుభ్రవస్త్రాలు ధరించి వెగడిదగ్గర కూర్చుండి ఉత్తరాన ఆకాశంలో దివ్యదర్శనం ఇచ్చే కైలాసేశ్వర శిఖరానికి అభిముఖుడై, పద్మాసనాసీనుడై, కన్నులు మూసికొని ధ్యానంలో మునిగిపోయినాడు.

నే ననుకున్న ముహూర్తం వస్తూఉంది. ఆ తర్వాత అతని అదృష్టం. ఆ ముహూర్తానికి అతన్ని సిద్ధంచేయాలి. అతనితో వాదించాలి. అతడు తనలో తాను చర్చించుకునే విధానమే మార్చాలి. ఇవి నా కర్తవ్యాలు. అలా ఏదో ఒక విచిత్రమైన యోగంలో నిశ్చలుడైనాడు శ్రీనాథమూర్తి. ఆ విచిత్ర యోగంలో ఇరవైనిముషా లుండి, లేచి తిన్నగా నా దగ్గరకు వచ్చినాడు. 'స్వామీ ఈ శుభముహూర్తంలో నాకేదైనా చిన్న మంత్రం ఉపదేశించండి. నా జీవితంలోని కల్మషం కడిగి నన్ను పరమ జ్ఞానోన్ముఖునిగా చేయగలిగిన మంత్రం దయచేయండి!' అని ప్రార్థించాడు. వచ్చిం దా పుణ్యముహూర్తం!

'సరేనయ్యా, నీకు దక్షిణామూర్తిమంత్రం ఉపదేశిస్తాను. అది ఒక లక్ష నెమ్మదిగా పునశ్చరణచేసుకో. తర్వాత ఓపిక ఉంటే మంత్రం బీజాక్షర లక్షలు పునశ్చరణ చేసి శాంతిహోమమూ, సంతర్పణ చేయి' అన్నాను. అతని కామంత్రం ఉపదేశించాను. ఆ సమయంలో నే నూటఎనిమిదిసారు లా మంత్రాన్ని అతనిచేత నేను చెబుతూ పునశ్చరణ చేయించాను. మధ్యాహ్నం పన్నెండింటికి భోజనాలయ్యాయి.

శ్రీనాథమూర్తి దూరంగా గోచరమయ్యే కైలాసపర్వతాన్ని, మానస సరోవరాన్ని చిత్రం వేసుకుంటూ సాయంకాలం నాలుగింటివరకు గడిపాడు. ఈలోగా సేవకులు మా గుడారాలు చుట్టివేసి గుఱ్ఱాలమీద ఎక్కించారు. మేము నాలుగున్నరకు బయలుదేరి రెండుమైళ్ళు నడిచి, ఆ సాయంకాలము మానససరోవరానికి వామతీరానవున్న కొద్దిమంది టిబెట్టులామాలున్న ఒక చిన్న బౌద్ధ సంఘారామంలో మకాం చేశాము.

ఆరాత్రి శ్రీనాథమూర్తి జపం ముగించి నాదగ్గిరకువచ్చి, 'స్వామీ! ఈ రోజుల్లో మాలోకం అంతా అనేక అనుమానాలతో నిండివుంది. నిశ్చ

యాలు ఒకరికీలేవు. ఒకవేళ ఏదైనా నిశ్చయం ఉంటే, అది పక్వంకాకుండా ఊదరకొట్టి పండించిన అరటిపండులాంటి నిశ్చయమే' అన్నాడు.'

'ఏమిటవి బాబూ! నాకు శక్తి ఉన్నమట్టుకు నీ అనుమానాలు పోగొట్ట ప్రయత్నం చేస్తాను' అని జవాబిచ్చాను.

'మా యువకలోకంలో ప్రపంచానికి సరియైనస్థితి కమ్యూనిజం అని, అందుకు దారి ప్రజావిప్లవం వల్లనే అని. ఆ దారిలో భగవంతుడులేడు. ఆ దారిలో మతాలులేవు. ఆత్మ వుందని నమ్మం. మతగ్రంథాలు, మానసికవైపరీత్యాలు. వీటి అన్నిటిపైనా ఆధారపడిన కళ హీనము. 'కళకోసం కళ' అనటం క్షమింపరాని ద్రోహం. ప్రజాభ్యుదయస్వరూపం కాని కళ, నీరసుని కూనిరాగాలవంటిది.

'అహింసలో మగతనంలేదు. అది మానవలోకాన్ని నాశనంచేస్తుంది. సద్గుణాలు సమయానుకూల నటనలుమాత్రం. పుణ్య దయా ధర్మ సత్యశౌచాలు వెనక్కులాగే శక్తులు. ఆర్థికసమత్వం, తర్వాత రాజకీయసమత్వం ప్రపంచానికంతకూ సరియైన ధర్మం. జాతులు అనవసరపు అడ్డుగోడలు; దేశాలు భూగోళ భాగాలుమాత్రం. ఇవన్నీ మాబోటిగాళ్ళ వాదనలు. మీ అభిప్రాయం సెలవియ్యాలి.

## 5

మానససరోవరం తీరంలో నుంచుని దూరంగా ప్రత్యక్షమయ్యే కైలాస పర్వతాన్ని, మానస నిర్మల హృదయంలో ప్రత్యక్షంఅయ్యే ఆ దివ్య పర్వత చ్ఛాయను చూస్తూ సర్వప్రపంచమూ మరచిపోవచ్చును. మానససరోవరానికి, కైలాసానికి ఉన్న శ్రుతి, పద్మానికీ సూర్యోదయానికీ ఉండునా? సుందర శ్రీవిలసిత వనితా వక్షోజాలకూ, ముత్యాల హారానికి ఉండునా? విశాలదీర్ఘ వినీల పక్ష్మాంకిత లోచనాలకూ వాలుచూపులకూ ఉండునా? సౌందర్యానికీ, ఆనందానికీ, పారిజాతానికీ, పరిమళానికీ ఉండునా?

ప్రభూ! కైలాసమూర్తీ! నీవే ఈ పర్వతప్రభువు! నీవే సర్వలోకాశ్రయపాదుడవు, నీవే పరమసృష్టిస్వరూప నృత్య వినోదివి. నీ బంగారుజటలు సర్వ విశ్వ ప్రసరిత ప్రాణకాంతులు. నీ హస్తాలు సర్వసృష్ట్యాధార చైతన్యాలు. నీ త్రినేత్రాలు, సర్వశక్త్యాత్మికవస్తు, వస్తుసౌందర్య, సౌందర్యానందాలు. ఓ పరమేశ్వరేశ్వర! నీవు యోగివి, యోగస్వరూపుడవు, యోగాతీతుడవు. నీవు మాతవు. మానమవు, మేయమవు. నీవు జ్ఞాతవు, జ్ఞానమవు, జ్ఞేయమవు. ఓ స్వయంభూ, నీకు ఉనికిలేదు. నీకు చేతనములేదు, నీవుమాత్ర మున్నావు. ఓ సదాశివా! నీవు కర్తవు, కర్మవు, క్రియవు. నీవు మహాకావ్యానివి. నీవు రసమవు, స్థాయీ, సంచారీ, విభావానుభావసాత్త్వికభావాలు నీవే. నువ్వు చిత్రకారుడవు, కుంచెవు, వర్ణాలు, ఫలకానివి, చిత్రమవు, నువ్వు వచనమవు, అన్వయానివి. నీవే వ్యాకరణమవు. ఓ గుణాతీతా! నువ్వు విరోధివి, స్నేహితు

డవు, తండ్రివి, కుమారుడవు. నువ్వు దారివి. దారినడిచేవాడివి, గమ్యస్థానానివి! నిన్ను సందర్శించిన పరమాద్భుతానందంలో, ఆటలలో చిన్నబిడ్డల ఆనందం, యువతీయువకుల ప్రేమానందము, కుటుంబికి సంపత్సముపార్జనానందము, జ్ఞానికి విభూత్యానందము అణువులుమాత్రము.

కైలాసేశ్వరుని సందర్శిస్తున్న శ్రీనాథమూర్తి మనలోకంలో లేడు. కొద్దిమంది మాత్రమే సందర్శించిన మహాదృశ్య మాతడు సందర్శించాడు. ప్రకృతిలోని ఒక సౌందర్యఖనిని సందర్శించాడు. ఆతనిలోని అహంభావము, గర్వం రేకెత్తాయి. ఆతనిలో కళాతృష్ణ గట్లుతెగి పరవళ్ళెత్తుతున్నది. ఆతనిలో ఎక్కడో దాగివున్న నిశ్చలభక్తిలో స్పందనం కలిగింది. ఈ త్రివేణీ సంగమజ మహానదికి అతడు నిజమైన భగీరథుడు కావాలి!

భోజనాలై విశ్రమిస్తున్నప్పుడు, నాదగ్గరకు వచ్చి కూర్చున్న శ్రీనాథమూర్తివైపు తిరిగి, 'బాబూ నువ్వు నిన్నడిగిన ప్రశ్నలకు నాకు తోచిన సమాధానాలు కొన్ని చెపుతాను విను. ఆ సమాధానాలు నీ సందేహాలకు సరియైన సమాధానాలుకావు. నీసందేహనివృత్తి నువ్వే చేసుకునేందుకు తోడ్పడుతాయి. అంతే! నీసందేహాలు, నామాటలూ సమన్వయంచేసి ఆలోచించుకో. నీకే నెమ్మదిగా జవాబులు దొరుకుతాయి' అన్నాను.

'చిత్తం స్వామిజీ!'

'భగవంతుడు ఒక పెద్దమనుష్యుడుకాడు. అయితే ఆతడు ఉన్నాడో, లేడో మనకు అక్కరలేదు. ఆత్మ ఉన్నదని నువ్వు నమ్మవద్దు. ఆత్మానాత్మ విచారణ, ఆస్తినాస్తి విచారణ, మానవ దైనందిన చర్యకు సంబంధం కలుగజేసుకో నవసరములేదు. మతగ్రంథాలు చదవ నవసరంలేదు. ఇంక అహింసను గూర్చి, పుణ్య, దయా సత్యశౌచాలనుగూర్చి, నేను స్పష్టంగా మాట్లాడుతాను. జాతులనుగూర్చి, దేశాన్నిగూర్చి చివర నా అభిప్రాయం చెప్పగలను.'

'చిత్తం.'

'హింస అంటే ఏమిటి?'

'మనుష్యుని చంపడం. శారీరకంగా, మానసికంగా మనుష్యుని బాధ పెట్టడం.'

'కాబట్టి, మనుష్యుని చంపడం తప్పులేదు, చావగొట్టడం తప్పులేదు, మనుష్యుని మానసికంగా బాధపెట్టడం తప్పులేదు. అది మగతనం అని మీ వాదనా?'

'అంటే ఏదైనా మనుష్యలోకానికి మంచిది అని తోచిన స్థితిని తీసుకు రావడానికి అడ్డు అని తోచే మనుష్యులనందరినీ చంపవచ్చు, కొట్టవచ్చు, మానసికంగా బాధించవచ్చు.'

'ఇంకోమనుష్యుల జట్టుకు వారికి మంచిదన్నస్థితి, మీజట్టుకు మీరుమంచిదన్నస్థితి—ఒకదాని కొకటి అడ్డంవస్తే ఆ జట్టును మీరూ, మీ జట్టును వారూ

చంపుతూ దారి నిష్కంటకం చేయవచ్చునన్న మాట? ఈ రెండు జట్లూ సమానబలం కలవి అయితే ఒకదాన్ని ఒకటి నాశనం చేసుకొని రెండూ మాయంకావాలికదా! ఒకటి ఎక్కువబలం కలది అయితే, రెండోదాన్ని నాశనంచేసి, తానుకొంత నాశనం అయి తర్వాత ముందుకు నడవాలి. తీరా, ఆ మంచిస్థితిని పొందిన తర్వాత నాశనం అయిన జట్టు తిరిగి ఉద్భవిస్తే, మళ్ళీ దాన్ని నాశనంచేస్తూ ఉండాలి. రెండోజట్టు బలం ఎక్కువైతే ఈ జట్టు నాశనం అయిపోవాలి! ఇదేనా మీ హింసాతత్వం?

'అవునండి.'

'ఈ రకమైన చరిత్ర ఈ మనుష్యలోకం సంపూర్ణంగా నాశనం అయినదాకా ఉండాలని మీ వాదన!'

'అలా ఉండాలనికాదు, ఉంటే ఉండవచ్చును.'

'అసలు మనుష్యుడు, ఇంకో మనుష్యునికోసంగాని, మనుష్యలోకంకోసంగాని ఎందుకీ హింసంతా జరపడం?'

'అది న్యాయం కాబట్టి!'

'న్యాయం అన్నదానికి అర్థం ఏమిటి? మనుష్యులకు మంచిది కాబట్టి న్యాయం. మనుష్యులకు ఇది మంచిది అని నిర్ణయించేవారు ఒక మనుష్యుడో మార్క్స్‌వంటివాడు లేక చాలామందో—ఇంటర్ నేషనల్—దీనికి వ్యతిరేకంగా హిట్లరో—ఒక మనుష్యుడు లేక నాజీపార్టో—వ్యతిరేకంగా నిర్ణయించవచ్చు! ఆ మంచిదన్న న్యాయంకోసం నువ్వూ నేనూ ఎందుకు బాధపడాలి?'

'మనం అన్నదాంట్లో నేనూ ఉన్నానుకదాండి. కుటుంబం బాగు అన్నదాంట్లో కుటుంబంలోని ప్రతిమనుష్యుడు ఉన్నాడు. లోకకుటుంబంలో కూడా ఉంటాడు గదాండి.'

'ఇప్పుడు రెండు కుటుంబాలయ్యాయికదా? ఈ రెంటిలో ఏది సరియైన న్యాయం?'

'అందరికీ లాభించేది.'

'ఆవిషయం నిర్ణయించే దెవరు?'

'అందరూ!'

'నాజీలూ, ఫాసిస్టులు ఇంకా చాలామంది అందులో చేరారుకదా?'

'ఎక్కువమంది? ఒక్కడుచెప్పినా ఎక్కువమందికి నచ్చవచ్చును!'

'అంతేనేకాని సర్వవిశ్వాన్ని మథించి తెచ్చిన సత్యాలుకావన్నమాటేనా ఇవి?'

నేను ఆలోచించుకొని రేపు చెప్తానండి.

## 6

శ్రీనాథమూర్తి తిన్నగా డేరావదిలి మానససరోవర తీరానికి పోయి, అక్కడ మంచులేని ఒక రాతిబండమీద కూర్చుని ఉన్నాడు. శ్రీనాథ

మూర్తిలో బాహ్యసౌందర్య పూజావాసనలు నిండిఉన్నాయి. ఆ బాహ్య సౌందర్యం వెనకాల మనస్సౌందర్యము, ఆత్మసౌందర్యముకూడా ఉండాలి. ఈ మూడు సౌందర్యాలూ మహోత్తమ స్థితిలో సంగమించడమే సంపూర్ణావతార భావము. ఆత్మసౌందర్యంలేని తక్కిన రెండు సౌందర్యాలూ, మనుష్యుని రాక్షసుని చేస్తవి. ఫ్రాంక్ యిన్‌స్టైయినుచే సృష్టింపబడిన రాక్షసునివంటివాడవుతాడు. ఒక బాహ్యసౌందర్యం ఉన్న మనుష్యుడు జంతుసమానుడు. జంతువులో విలసించేది భగవంతుని ప్రసాదమగు ప్రకృతిసిద్ధగుణం (ఇన్‌స్టింక్ట్) వల్ల వచ్చే మంచిచెడ్డలు మాత్రం. ఆ జాతి స్త్రీ పురుషులలో అది ఎక్కువగా ఉండి మానవత్వ సహజమైన మనస్సు తక్కువగా ఉంటుంది. అలాంటివారిలో ఆలోచనా తక్కువ ఉంటుంది.

ఆ మధ్యాహ్నం మేము ప్రయాణంచేస్తున్నప్పుడు జమీందారుడుకూడా మాతో కలిసి నడుస్తున్నాడు. ప్రొద్దుటి ఆలోచనలు నన్నింకా వీడలేదు. నేను శ్రీనాథమూర్తిని చూచి 'శ్రీనాథమూర్తీ! నీ హృదయంలో మానవ సౌందర్యం పులకరాలు కలుగజేస్తుంది కదా! నీ హృదయంలో సౌందర్యాన్ని గురించి ఉన్న భావాలన్నీ నాకు విందామని కుతూహలంగా ఉంది. ఎందుకంటే, మనం ప్రొద్దున చర్చించుకున్న విషయాని కది సన్నిహితం అన్నాను.

శ్రీనాథమూర్తి: స్వామిజీ! మానవుని సౌందర్యం ఎక్కువగా వికసించేది స్త్రీ మూర్తిలోనని నా ఉద్దేశము. ఈ సౌందర్యంలో మూడుభాగాలున్నాయి. మూర్తి సౌందర్యం, వర్ణం, ప్రాణవిలసనమూను.

జమీం: నలుపువర్ణం అందంకాదనా నీ ఉద్దేశం!

శ్రీనాథ: ఏ రంగైనా అది అందంగా ఉండవచ్చును. అంటే అందంగా ఉండేందుకు రంగు మట్టితో కలిపినట్లు బురదలా ఉండకూడదు. రంగులో మాంద్యం ఉండకూడదు. రంగులో ప్రకాశం, నైర్మల్యం ఉండాలి. అదే వర్ణ సౌందర్యం. అలాగే మూర్తి సౌందర్యం అంగాంగ శ్రుతి మేళనం ఉండాలి.

జమీం: అంటే?

శ్రీనాథ: అనురూపత అని నా భావం. ఒక పొడుగు మనుష్యుడు తల, ముఖము, కళ్ళు, ముక్కు, చెవులు, నోరు, ఫాలము, చేతులు, హస్తతలాలు, వేళ్లు, ఛాతీ, నడుం, కటి, పిరుదులు, తొడలు, పిక్కలు, పాదాలు, ఆ పొడుగుకు తగినట్లుగా వుండాలి. పొడుగువానికి, ఛాతీ బాగా వెడల్పున్నవానికి పొన్నకాయలాంటి చిన్న తలకాయవుంటే, అనురూపరహితమన్నమాట.

నేను: ఈ అనురూప నిర్ణయం ఎట్లాగ?

శ్రీనాథ: అనేక యుగాలనుండి మనం మనుష్యరూపం ఎరిగి, ఉత్తమ పురుషుడికి ఇంత తల, ఇంతంత కళ్లు మొదలైనవి వుండాలని నిర్ణయించాము.

నేను: అంటే మంగోలులకు ఒకరకం అనురూప నిర్ణయం, నీగ్రోలకు ఇంకోటి వుండవచ్చు నన్నమాటేగా!

శ్రీనాథ: చిత్తం.

రాజ: బెలూచీలకు ఒకరకం, కాబూలీలకు ఇంకోరకం, పంజాబీలకు వేరే రకం, బ్రాహ్మణులకు వేరు, ముస్లింలకు వేరు ఆలా వుండవచ్చునన్నమాట.

శ్రీనాథ: అవునండీ! ఈ తేడాలు మానసిక సౌందర్య, ఆత్మసౌందర్యాల నిర్ణయాలలోనూ వుంటాయి.

నేను: ఇంక ప్రాణశక్తి సౌందర్యం ఏమిటి?

శ్రీనాథ: ఒక మనుష్యుడు మందకొడిగా వుంటాడు, ఇంకొకడు హుషారుగా వుంటాడు. చాకచక్యంగా వుంటాడు. ఎక్కడ ఈ మూడూ ఉత్తమంగా సంయోగం అవుతాయో, అక్కడ భౌతిక సౌందర్యం వుందని మేమంటాము. అంగాంగ సమప్రమాణత వున్నంతమాత్రం చాలదండి. ఆ అంగాంగాలు పుష్టిలో రేఖలలో సమప్రమాణంగా వుండాలి. మొగవాడికి కండలుకట్టిన దేహం అందం. స్త్రీకి కర్కశత్వం పనికిరాదు. మెత్తదనము, రేఖాస్ఫుటత్వమూ వుండాలి.

నేను: ఎందుచేత స్త్రీలో ఎక్కువ మనుష్య సౌందర్యం వుందంటావు? జంతువులలో, పక్షులలో మగవే ఎక్కువ సుందరంగా వుంటాయి కదా! కోడిపుంజు, నెమలిపుంజు, మగపులి, మగసింహము, ఆంబోతు ఎంత అందంగా ఉంటాయి?

శ్రీనాథ: చిత్తం. జంతుస్థితినిదాటి మనుష్యుడు పైకివచ్చాడు. జంతు, పక్షి కుటుంబాలలో పనిబాధ్యత ఆడదానికి. మగది ఆడదాని సంతోషంకోసం మాత్రం. అందుకని అందమూ, పాటా మగదానికే వుండాలికదా! ఇక మనుష్యులలో పురుషుడు పని నిర్వహించేవాడు. స్త్రీ పురుషప్రీతికోసం. అందుకని స్త్రీలోనే అందం అంతా చేరింది.

నేను: పురుషులకూ, స్త్రీలకూ సమాన హక్కులు, సమాన బాధ్యతలు వచ్చినప్పుడు, పురుషునికోసం స్త్రీ అంటావేమిటయ్యా!

శ్రీనాథ: స్త్రీ పురుషులు సమాన కర్మపరతంత్రులైనవెనక నెమ్మదిగా సౌందర్యం ఇద్దరికీ సమమౌతుం దేమోనండి!

జమీం: అది ఎల్లాగయ్యా! పనివల్ల సౌందర్యం తక్కువ, పని లేనివారికి సౌందర్యం ఎక్కువా అన్నావుకదా! స్త్రీ పురుషు లిద్దరూ సమానంగా పనిచేసేటట్టయితే ఇద్దరిలోంచీ అందం నశించిపోతుందేమో! అంటే మానవజాతిలోంచే అందం పోతుందేమో?

## 7

మా నడకా, మా సంభాషణా రెండూ సాగుతూనే వున్నాయి. మా దారి మానససరోవరతీరం ప్రక్కనే, పర్వత సానువులమీద ఎగుడుదిగుడు రాళ్ల

ప్రక్కగా, గుట్టలమీదుగా ఉన్నది. కొన్నిచోట్ల మంచు కరిగి నీరుగా ప్రవహించి చిన్న, పెద్ద పతనాలుగా మానససరోవరం చేరుతున్నాయి. చిన్నచిన్న వాగులు, ఆ వాగులు దాటుతూ మనుష్యుడుమాత్రం నడవగలిగిన ఆ దారిలో పూవులు పూచే చిన్న గుబురులమధ్య ప్రయాణం చేస్తున్నాము. సరోవరానికి ఉత్తరంగా కైలాసశిఖరం బంగారురంగులతో ప్రజ్వరిల్లుతూ బంగారుకమలంలో పరమశివుడు పద్మాసనస్థుడై యోగసమాధిలో ఉన్నట్లు దర్శనమిస్తున్నది.

నేనా పవిత్ర సందర్శనానందంలో పులకరించిపోయి, "చూడు మూర్తీ! ఆ సౌందర్యం, ఆ కైలాసశిఖరం, కనకాంభోజగతం, నవేందుమకుటం, కైలాస ప్రభుం! అన్నట్లుగా ఉన్నది. ఆ సౌందర్యాన్ని వర్ణించగలమా?" అన్నాను.

శ్రీనాథమూర్తి: ఆ దృశ్యం అద్భుతంగానే వున్నదండి, పదినిముషాలలో ఒక చిన్న బొమ్మ వేసుకొని మిమ్మ కలుసుకుంటాను.

నేను: అల్లాగే మూర్తీ, మేమంతా ముందుకుసాగం. అదిగో అక్కడ కూర్చుంటాము. మన మకాం ఒక అరమైలుమాత్రం ఉంది.

శ్రీనాథమూర్తి పది నిముషాలలో బొమ్మ పూర్తిచేసి, ఆ ప్రకృతి సౌందర్యం, ఉప్పొంగిపోతూ వీక్షిస్తున్న మమ్మల్ని కలుసుకున్నాడు.

నేను: మూర్తీ! మనుష్యుని ఆరాధన మూడు మోస్తరు. ప్రకృతిలో శక్తులను గమనించి, ఆ శక్తులకు అతీతమైన ఒక ఆధారం వుందని సిద్ధాంతానికి వచ్చి, సుఖ దుఃఖాలకు అతీతమైన ఆ స్థితిని చేరడానికి ప్రయత్నించడం ఒక రకమైన ఆరాధన. దీన్నే జ్ఞానమార్గం అంటారు.

జమీందారుడు: నాకు కష్టాలు కలిగించవద్దని మొక్కుకుంటే ఆ కష్టాలు రాకపోవడం జరుగుతూ ఉంటుంది కదాండి స్వామీ?

నేను: అవునండి, దాన్నిగురించి చెప్తాను. రెండవది, నువ్వు ప్రకృతిశక్తులను గమనిస్తావు. దాని అపారాద్భుతత్వము నీలోని మానసికశక్తులను స్పందించి నీకు ఆనందం కలుగుజేస్తుంది. ఆ ఆనందంలో నువ్వు ఆ అద్భుతాన్ని ఆనందంగా వర్ణిస్తావు. అది మామూలుగా చెప్పితే నీకు మొదట కలిగిన ఆనందం కలుగదు. అందుకని నీలోని ఆనందాన్ని వ్యక్తీకరించగల విధానం, విపరీత రచనా పద్ధానమే! అదే సంగీతం, అదే కవిత్వం, అదే చిత్రలేఖనం, నాట్యం, శిల్పమున్నూ.

శ్రీనాథ: స్వామీ! ఈ కళలలో భగవంతుడు, మనుష్యుడూ ఎక్కువగా వస్తారేమండి?

నేను: వస్తున్నా! మూడవమోస్తరు ఇలావచ్చింది. మనుష్యుడు ప్రకృతిశక్తులను చూచాడు. ఆ శక్తులను ఆరాధిస్తే తనకు మేలువస్తుంది అనుకున్నాడు. లేకపోతే ఆశక్తులీతన్ని నాశనంచేస్తాయి అనుకున్నాడు. వరుణ, ఇంద్ర, అగ్ని మొదలైన శక్తులను పూజించాడు. యాగాలుచేశాడు. ఇది భయజనితారాధన. ఈ ఆరాధన హీనస్థితిలో ఉన్న మనుష్యులలో ఎక్కువ.

శ్రీనాథ : తిరుపతి వెంకటేశ్వరుని మొక్కు, మంత్రాల పునశ్చరణ ఏమిటండి?
నేను : విను! అదే చెప్పబోతున్నది. ఈమూడు మార్గాలు, ఒకదానితో ఒకటి సమంగాగాని, ఒకటి ఎక్కువగాగాని సంగమం అవుతాయి. జ్ఞానమార్గం, సౌందర్యమార్గం లేక ప్రపత్తిమార్గం సమంగాకలిసి విశిష్టాద్వైతం, ముస్లిం మతం, ఆదిశైవము మొదలైనవి వచ్చినవి. సౌందర్యమార్గం ఎక్కువై వామాచార శాక్తేయం, గౌరాంగమతం, సూఫీమతం వచ్చాయి. పూర్తిజ్ఞాన మార్గం, హీనయాన బౌద్ధం, చార్వాకం, వైశేషికం, కాపిలమున్నూ, జ్ఞానం ఎక్కువై అద్వైతం వచ్చింది.
జమీం : భయాధారంవల్ల, అమ్మవారి జాతర్లు, మొక్కుబడులు వచ్చాయి అంటారు.
నేను : జ్ఞానమార్గం, భయమార్గం, భక్తిమార్గం అన్నీ కలసి వేలకువేలు విధానాలు ఉద్భవించాయి.
శ్రీనాథ : ఇప్పుడు శాస్త్రజ్ఞానం వృద్ధిఅయినందువలన, మతంయొక్క భవిష్యత్తు పరిణామం ఏమవుతుంది స్వామీజీ?
నేను : శాస్త్రజ్ఞానం ఎక్కువౌతున్నది నిజమే. మూఢత్వం జీరనీయని విజ్ఞాని మతాన్ని ఇంకా బాగా అరంచేసుకుంటాడు. మతం అనేది శాస్త్రజ్ఞానంలోని లోట్లు వెదికి 'కాబట్టి దేవుడున్నాడు' అనదు. అలా వాదించడం జ్ఞానమార్గం నాశనంచేయడమే అవుతుంది. ఉత్తమ మతం ఎప్పుడూ శాస్త్రజ్ఞానాన్ని ఉపాధిగా తీసుకుంటుంది. శాస్త్రజ్ఞాన పర్యవసానంవల్ల మతంలోని ఉత్తమభావాలకు ఎక్కువ గట్టితనం వస్తుంది.

మా ముగురనూ నిశ్శబ్దత ఆవరించింది. ఇంతలో మకాం ప్రదేశం వచ్చింది. చీకట్లు ఆవరిస్తున్నాయి. మేము మాబస ఏర్పాటులలో మునిగి పోయాము. సర్వవిశ్వాన్ని స్పందించే భావాణుసముద్రంలోని అలలు ఉప్పొంగి పోతున్నవి. ఆ తరంగాల అంచులు లోకాలోక ప్రదేశాలపై విరుచుకుపడుతున్నాయి.

## 8

పాశ్చాత్యుల శాస్త్రజ్ఞానాన్ని సంపుటీకరణంచేసి శ్రీనాథమూర్తికి ఆ రాత్రి నిరూపించాను. 'శాస్త్రజ్ఞానం అంటే ఏమిటి? ప్రకృతిని దర్శించి; ప్రకృతిశక్తి విధానాలను పరిశోధనద్వారా నిరూపించి; ఆ నిరూపణ, నిర్ధారణ చేసి; ఆ నిర్ధారణ సోపానాలతో నూతనమార్గాలు, నూతనసత్యాల అన్వేషించడం శాస్త్రజ్ఞానం. ఇది పాశ్చాత్యవిధానం.'
శ్రీనాథమూర్తి : భారతీయుల విధానం ఎలాంటిదండి?

'భారతీయుల విధానం ప్రస్తుతం ఆలా ఉంచుదాము. భారతీయులు అతీంద్రియ దృష్టిద్వారా జ్ఞానం సంపాదించారు. ఆ దృష్టీ, ఆ జ్ఞానం ఇంకో

విచారణలో చెప్పుకుందాం. ప్రస్తుతము పాశ్చాత్యఖండమునులైన ఉత్తమశాస్త్రజ్ఞులు ఇంతవరకు నిర్ధారణచేసిన శాస్త్రజ్ఞానం ఏమిటి? వారు పదార్థాన్ని గురించి, అర్థవాదం ఎట్లాచేశారు? వారి శక్తివాదము, జీవవాదము, పరిణామవాదము, మనశ్శాస్త్రము, ఎయిన్‌స్టెయిన్ గారి పరస్పర సంబంధవాదము, అన్నీ క్రోడీకరించుకొని, ప్రాచ్యసంస్కారానికి అవి సన్నిహితమా వ్యతిరేకమా అనేవి నిర్ధారణచేసుకుందాము.'

శ్రీనాథమూర్తి: చిత్తము. మా యువకులలో సంపూర్ణ పాశ్చాత్య జ్ఞానమూ లేదు, ప్రాచ్యజ్ఞాన పరిచయం అంతకన్నా లేదు.

'పాశ్చాత్య శాస్త్రజ్ఞానం అర్థంచేసుకోవాలంటే, శాస్త్రపరిభాష పూర్తిగా రావాలి. ఆభాష వెనకాలఉన్న సంపూర్ణభావం ద్యోతకంకావాలి. ఇప్పటికీ అనేకులు పాశ్చాత్యశాస్త్ర పండితులకే ఎయిన్‌స్టెయినుగారి పరస్పర సంబంధవాదము పూర్తిగా అర్థంకాదట!'

శ్రీనాథమూర్తి: మా కళాశాలలో పాఠాలుచెప్పే ఎమ్. ఎస్‌సి. మొదటిశ్రేణి వారయిన గురువులకే కొన్ని పాశ్చాత్య శాస్త్రజ్ఞాన విషయాలు అగోచరాలండి.

'కాదామరి! ఇంక ఆ పాశ్చాత్య సిద్ధాంతాల పరిశోధనచేయగల శక్తి ఉండాలి, పరిశోధనకు తగిన ఉపకరణాలు ఉండాలి. ఇవి భౌతిక వాదానికి ఉండాలి అని నేనంటే, ప్రాచ్యజ్ఞానానికి తెలివితేటలు అక్కరలేదనిగాని ఉపకరణాలు అక్కరలేదనిగాని నా ఉద్దేశంకాదు. ఏ సిద్ధాంతం అర్థంచేసుకోవాలన్నా అతి నిశితమైనబుద్ధి కావాలి. ఇంక పాశ్చాత్యుల పరిశోధనోపకరణాలు, భౌతికమైన వస్తువులు; ప్రాచ్యుల ఉపకరణాలు అధిమానసిక, ఆధ్యాత్మికములు. అవీ కొద్దిమందికే లభ్యం. కొలది జ్ఞానవంతులకు పాశ్చాత్యశాస్త్రజ్ఞానమూ, భారతీయశాస్త్రజ్ఞానమూ రెండూ ఛాయామాత్రంగా అర్థం అవుతాయి. నేనూ నా పూర్వాశ్రమంలో ఎమ్. ఏ. నే! నేను పదార్థ విజ్ఞానశాస్త్రం పుచ్చుకొన్నాను. నేనూ నీకుమల్లేనే నీబోటి అనేక యువకులమల్లేనే మన శాస్త్రాలను, మన ఆధ్యాత్మిక విచారాన్ని నిరసించినవాణ్ణే. నా గురువుగారి పరమకరుణవల్ల నిజం తెలుసుకొనడానికి అర్హత సంపాదించుకొన్నాను.'

శ్రీనాథమూర్తి మోములో ఆశ్చర్యరేఖలు ప్రసరించాయి. అవును నేను ఎమ్. ఏ. నని తెలియడం అతనికి ఆశ్చర్యం కాదా?

శ్రీనాథమూర్తి: చిత్తం.

'శాస్త్రజ్ఞానం కొంతవరకు వచ్చింది. అంటే ఇంతవరకు రూఢిఅయిన శాస్త్రజ్ఞానము, ఇంకనూ మిగిలిపోయినదీ రెండుభాగా లున్నాయి. మూడో భాగం కొంతఅయి, కొంత కానివిషయం. అవి అర్థచ్ఛాయారూపాలు (పీనంబ్రా) వంటివి. ఈ భాగంలో మానసికశాస్త్రం సాంఘికశాస్త్రం జీవశాస్త్రం ఉంటాయి. నిర్ధారణంగా వచ్చే శాస్త్రజ్ఞానం రసాయన, పదార్థ

విజ్ఞానశాస్త్రాలు ఉంటాయి. ఒక కుక్క మరుసటి నిముషంలో ఏమి చేస్తుందో శాస్త్రదృష్ట్యా చెప్పలేము. కాని పది సంవత్సరాల తర్వాత చంద్రగ్రహణం ఎక్కడ, ఎప్పుడు ఏ రీతిగా వస్తుందో చెప్పగలం. కుక్కవిషయంలో ఆలోచనాతీతమైన బుద్ధి అనే శక్తి ఒకటి వస్తుంది. ఒకటి, శాస్త్రం ఉన్న సత్యాలను వివరిస్తుంది. రెండు, శాస్త్రం ఆ వివరణలు పూర్తిగా అర్థమయ్యే రూపంగా కొద్దిమాటలతో వ్యంజనగా ఎక్కువ అర్థం యిచ్చే పారిభాషిక పదాలు, వచనాలు, విచారణ సోపానాలు ఇస్తుంది. మూడు, శాస్త్రం ప్రతిపదార్థమూ శక్తి అని అత్యంత సమసూక్ష్మ రూపాలకు పృథక్కరణం, విభజనం చేస్తుంది. అంటే ఒక పదార్థ స్ఫటికాన్ని (నత్రజని అనుకుందాము) అణువులుగా (మోలెక్యూలు) మార్చి, ఆ అణువులను పరమాణువులుగానూ, (ఆటములు) ఆ పరమాణువులను శక్తిరూపమైన విద్యుత్ కణాలైన ధనకణము (ప్రోటాను) ఋణకణము (ఎలక్ట్రాను) లుగా విభజిస్తుంది. అల్లాగే జీవశాస్త్రంలో రక్తం, ఎముకకణాలు, తెలుపుకణాలు, జీవకణాలు (సెల్సు) ఆదిను జీవపదార్థము (ప్రొటోప్లాజము) గా విభజిస్తుంది శాస్త్రం.

జమీందారు: స్వామిజీ, నాకివి అన్నీ తిక్కగా ఉన్నాయి. ఓ పట్టాన అర్థం కావటంలేదు. నాకు కావలసింది ఒక్కటే విషయం. పాశ్చాత్య శాస్త్ర జ్ఞానం భగవంతుణ్ణి, అంటే ఆత్మశక్తిని, నిరూపిస్తుందా?

నేను: జమీందారుగారూ! నా వాదన ఏమిటంటే, పాశ్చాత్య శాస్త్రప్రకారం భగవద్భావం బాగా నిరూపణ అవుతుందనే! అందుకనే పాశ్చాత్య శాస్త్ర జ్ఞానం యావత్తూ నాలుగుముక్కలలో చెప్పి, భగవద్భావానికి ఆ శాస్త్రం ఎందుకు అవసరమో నిరూపిద్దామని ప్రారంభించాను.

జమీం: చిత్తం స్వామిజీ! మీరు కానీయండి. నాకు శక్తి ఉన్నంతమట్టుకు వింటాను, లేకపోతే చల్లగా వెళ్ళి పడుకుంటాను.

'నాలుగు, శాస్త్ర సత్యాలను వివరించడంలో సంపూర్ణ, అంటే చరిత్రరూపమైన, వివరణ చేస్తుంది. విశ్వం ఎప్పుడూ స్పందిస్తోంది, మారుతోంది. శాస్త్రం సత్యం చెప్పేటప్పుడు ఒక పదార్థమూ, ఇంకో పదార్థమూ; పదార్థమూ, శక్తీ పరస్పరంగా మార్పులు తీసుకువస్తాయి అన్నప్పుడు సూర్య కుటుంబ, నక్షత్ర చరిత్రలు కలుపుకొని చెబుతూఉండాలి. అయిదు, రసాయన భౌతికశాస్త్రాలలో 'ఏలాగు' 'ఏది' అనిమాత్రం ప్రశ్నలు వస్తాయి. జీవ మానసిక శాస్త్రాలలో ఎందుకు అన్న ప్రశ్నకూడా ఉద్భవిస్తుంది. ఆరు, శాస్త్రం ఎందుకు అన్న ప్రశ్నకు జవాబు ఇవ్వాలి. ఆ జవాబు పూర్ణం కాకపోవచ్చును. ఇది అయిఉండవచ్చును అను ప్రత్యక్షవాదాధారము (ఎంపిరిసిజం) పూర్వవాదానుమానాధారము (ఎప్రయోరీ) అయిఉంటుంది. ఏడు, శాస్త్రప్రశ్నలు, 'ఏమిటిది?' 'ఇది ఏలా జరుగును?' 'ఏవిధంగా సంభవించింది?' 'దీని చరిత్ర?' ఈ విధంగా ఉంటాయి.'

ఈ విషయం దగ్గిరకు వచ్చేసరికి మూర్తీ, నేనూ చిన్నపులి అఱుపు విన్నాము. అతడు ఉలికిపడ్డాడు. జమీందారుడు గుఱుపట్టి నిద్రపోతున్నాడు. అది గమనించి శ్రీనాథమూర్తి పకపక నవ్వాడు. అతన్ని పడుకోమని నేను యోగాభ్యాసం ప్రారంభించాను.

## 9

విద్యుచ్ఛక్తి, అయస్కాంతందగ్గిర ఎక్కువ చలనం పొందినట్లుగా, కైలాసేశ్వరుని సమీపించినకొలదీ మాలో విషయవిచారణ ఎక్కువైంది. ఎక్కువ సన్నిహిత సంబంధాలున్న మూడు విభాగా లవుతుంది మానవచైతన్యం. భౌతిక ప్రపంచం ఏమిటి అని తెలుసుకోడం; ప్రకృతిలో ఉన్న అద్భుతదృశ్యాలు, సంఘటనలవల్ల మానవునిలో హృదయం స్పందించి, సౌందర్యపిపాస రేకెత్తి ఆనందం కలగడం, భౌతికాతీతమైన భగవంతుని లీలలలో తన్మయత్వం పొందడం. ఈ మూడు మానవచైతన్యాలకూ వ్యతిరేక స్వరూపాలుకూడా, స్పందన భాగాలే, శాస్త్రం ఖండసత్యం అని వాదించడం, శాస్త్రం లొంగకపోవడం; లలితకళలు మానవనీరసత్వం అన్న వాదన; భగవంతుడు లేడనువాదన.

మర్నాడు తెల్లవారగట్ల మా ప్రయాణం సాగింది. మేమందరము ఏదో అనిర్వచనీయమైన ఆనందంలో మునిగిపోయాము. కైలాసపర్వతప్రకాశం మా జన్మలనంతా ఆప్లావిస్తున్నది. ఆ తేజస్సు మా జీవితంలో ప్రతి అణువునా ప్రసరిస్తున్నది. తత్కారణరూపమైన దివ్యమత్తత మమ్మల్ని అలిమిపోయింది. కైలాసపర్వతము ఒక మహాదేవాలయంలా ఉంటుంది. విమానం, ముఖమండపము, కళ్యాణమండపము అన్నీ కలిసి ఒక పరమ నిర్మాణం.

సంతత ఘనీభూత హిమపూతాచ్ఛమైన ఈ దివ్యపర్వతము పార్వతీ పరమేశ్వరుల నిలయమా? ఇరవైమూడువేల పైచిల్లర అడుగులు ఎత్తున్నదని అంచనా వేయబడిన ఈ పర్వత శిఖరము మానవసంచారణాతీతము! ఆ దివ్య గోప్య ప్రదేశాలలో గణేశుడు, కుమారుడు నందీశ్వరభృంగీశ్వరులు, వీరభద్రుడు పరమశైవానందంతో నాట్యం చేస్తూ ఉంటారా? పరమశివుడు, పవిత్రనృత్య తాండవేశ్వరుడు, దివ్యరుద్రవీణాతంత్రీ గానవినోది, యోగీశ్వరేశ్వరుడు పరమ దరిద్రుడు, నిత్య భిక్షాటనమూర్తి, శ్మశానవాటీనివాసి, నిత్యశివసుందరుడు. ఎంత అందమైన భావము! ఎంత మహోత్తమోత్తమ భావము!

కైలాసేశ్వర పర్వతశిఖరదృశ్య సందర్శనాభిముఖుడైన శ్రీనాథమూర్తి వైశాఖాదిత్య మధ్యాహ్న చండకిరణస్పృష్ట హిమఖండములా కరిగిపోయినాడు. ఆతనికన్నుల అశ్రుధారలు యమునా గంగానదులై ప్రవహించాయి. గాఢప్రేమవిధాననాథ సందర్శనమందు యోషవలె ఆతడు వెలిగిపోయినాడు. మానససరోవరం తీరంలో మంచునిండిన ఆ బండరాళ్ళలో, కైలాసశిఖరం ఎదుట మోకరిల్లి సాష్టాంగమైపోయినాడు. ఆతడు గజగజ వణకినాడు. పరుసవేది స్పృశించిన ఇనుమువలె ఆతడు తప్తజాంబూనదంలా ప్రజ్వరిల్లిపోయి

నాడు. అంతకుముందు మాడిపోయినట్లున్న ఆతని రంగు హిమాలయ పర్వతాల లోకి చొచ్చి వస్తున్నప్పటినుంచీ, మళ్ళీ మునుపటి బంగారుచాయ తెచ్చుకుంది. ఈనాడు, ఆతడు ఆ దివ్యోదయ సంధ్యాక్షణంలో తేరిపార చూడలేకున్నాడు. ఒక నిత్య యౌవనం ఆతనిలో తేజరిల్లింది. ఆతని పూర్వవాసనలన్నీ ఒక్క సారిగా ఆకురాలుకాలంలో ఆకురాలినట్లు రాలిపోయినవి. ఆతని ఆత్మ ఒక మహాసూర్యగోళమై తేరిచూడరానట్లయినది.

ఓ పరమేశ్వరా ఆతనిపై నీకు కరుణ జనించినదా! ఆతని జన్మ లోక కళ్యాణంలో ఉత్తమ నాయకత్వం వహించబోతున్నదా ?

శ్రీనాథమూర్తి లేచి అలాగే నిలుచుండినాడు. ఆత డింతలో చైతన్య రహితుడైపోయినాడు. పదిహేను నిముషాలట్లు సమాధిలోకి వెళ్ళినవెనక నేను ప్రణవనాదోచ్చారణ చేశాను. ఆతడు కళ్ళుతెరచి నాదగ్గరకు పరుగెత్తి వచ్చి నా కాళ్ళకడ సాగిలపడి నా పాదాలు గ్రహించి,

'కైలాసేశ సమారంభాం
శంకరాచార్య మధ్యమాం
అస్మదాచార్య పర్యంతాం
వందే గురు పరంపరాం'

అని చదువుతూ కన్నుల వెల్లువైనాడు.

చంద్రికానాథునిలా కనబడినాడు.

'శ్రీనాథమూర్తీ, నీకీ కైలాసపర్వతసందర్శన-పుణ్యకాలంలో శర్వరీ భూషణ అనే పౌరుషనామం ఇస్తున్నాను. నువ్వు దర్శించిన మహాభావాన్ని చంద్రునిలా వెదజల్లు.'

'కరచరణకృతంవా, కాయజం కర్మజంవా
శ్రవణనయనజంవా మానసంవాపరాధం
విహితమవిహితంవా సర్వమేతత్ క్షమస్వ
జయజయ కరుణాబ్ధే శ్రీమహాదేవశంభో'

## 10

శర్వరీభూషణుడైన శ్రీనాథమూర్తి ఆ సమాధిలో నిశ్చలత్వం దర్శించాడు. ఆ నిశ్చలత్వం రూపొంది, తనువు చాలించిన ఆతని భార్య శకుంతలా మూర్తి అయిపోయిందట. ఆ శకుంతలామూర్తి నవ్వుతూ ఒక పాలరాతి విగ్రహంలా మారిపోయిందట. ఆ విగ్రహం వేయి విగ్రహాలైనదట. ఆ విగ్రహాలన్నీ లోకంలోని దైన్యమూర్తులుగా, కర్షకులుగా, బీదలుగా, ప్రసిద్ధ కవులుగా, నాయకులుగా, నాయికలుగా మారిపోయినవట. అప్పు డొక్క దివ్యవాక్కు ఆతనికి వినబడినదట.

'ఓయీ! శ్రీనాథా, త్యాగమే మానవదివ్యత్వము, శాస్త్రమే జ్ఞానము, కళే భక్తి, వేదాంతమే మతము, ఈ మూడూ నాలోనే సమన్వయము. ఒక దాని కొకటి సంబంధంలేనట్లు ఉన్నా అవి నాలో లయమవుతున్నాయి. నేనే సర్వమతాలు, నేనే శాస్త్రాలు, నేనే సర్వకళలూ. వీని నిజమైన అర్థం కావాలంటే ప్రతి విషయాన్ని సమ్యక్ దృష్టితో సందర్శించాలి.'

ఈ ముక్కలు తన జీవితంలో మారుమ్రోగుతుండగా శర్వరీభూషణుడైన శ్రీనాథమూర్తి కళ్ళు తెఱచాడట. త్యాగంచే ప్రియమైనవాడు త్యాగతి. అతడు త్యాగతి శర్వరీభూషణుడౌ గాక!

సర్వకాలాల కైలాసపర్వత సందర్శనము, తదానందము. పర్వత ప్రదక్షిణం ప్రారంభించాము. మా జట్టులోని కొందరు గంటకోసారి కైలాసేశ్వరునికి సాగిలపడుతూ ప్రయాణం చేస్తున్నారు. త్యాగతి శర్వరీభూషణ శ్రీనాథమూర్తి చేతులు జోడిస్తూ ఆ ఇరుకు ఎగుడుదిగుడు హిమపూరిత వృక్షరహిత పథంలో నడుస్తున్నాడు. ప్రార్థనలు, భజనలు, నమక చమక గానాలు, ఆది శంకరప్రణీతశివానందలహరీ పవిత్ర శ్లోక పఠనాలతో కైలాసపర్వతం చుట్టూ మూడువారాలు ప్రయాణంచేశాము. కొన్నిచోట్ల రాత్రిళ్ళు గుహలలో ముకాం చేయవలసివచ్చింది. హిమాలయాలకన్న ఇక్కడ గాలి ఎక్కువ, చలి ఎక్కువ; అంతా మంచుమయం. మధ్యమధ్య అనేకజాతుల పూవులు, లతలు మాత్రం తమ సుగంధాలను వెదజల్లుతూ వికసించి ఉన్నవి. తిరిగి తిరిగి ప్రదక్షిణ ప్రారంభస్థలానికి వచ్చిచేరాము.

కైలాసపర్వత పాదమునందు నిశ్చలమై ప్రత్యక్షమయ్యే మానస సరోవరంలో స్నానాలు సలిపి, అక్కడినుండి బయలుదేరి మూడురోజులలో ద్యూపాంగు బౌద్ధ సంఘారామం చేరాము. అచ్చటి లామాలు మాకు ఆతిథ్య మిచ్చారు. వచ్చినరోజు సాయంకాలం శర్వరీభూషణ శ్రీనాథమూర్తిని కులపతి కడకు తీసికొనిపోయి ఆయనకు నమస్కారం చేయించాను.

## 11

ద్యూపాంగు సంఘారామం ఆంధ్ర శాతవాహన సామ్రాజ్య రాజధానీ నగరమైన ధాన్యకటక సంఘారామం పేరున నెలకొల్పబడింది. ద్యూపాంగు అంటే టిబెట్టు భాషలో ధాన్యకటకం అని అర్థం. ద్యూపాంగు బహుశః ఆరవశతాబ్దంలో భారతీయులైన బౌద్ధసన్యాసులు టిబెట్టు వలసపోయి అక్కడ నెలకొల్పివుంటారు. ఆంధ్రమహాయాన బౌద్ధసంప్రదాయం ఇక్కడనుండే టిబెట్టు అంతా ప్రసరించింది. ఆంధ్రశిల్ప చిత్రలేఖన సంప్రదాయాలు ఇక్కడ నుండే త్రివిష్టప్రదేశం అంతా శాఖలల్లుకుపోయినవి. అనేక ఆంధ్రగ్రంథాలు టిబెత్తు భాషలో అనువదింపబడ్డాయి. అవన్నీ ద్యూపాంగు సంఘారామంలో వున్నాయి. మా అద్వైతానికి పనికివచ్చే గ్రంథా లెన్నో త్రివిష్టప భాషలో వున్నాయి అక్కడ.

శ్రీనాథమూర్తి శిల్పి, చిత్రకారుడు, కవి, చక్కని కంఠంతో తాను రచించుకొన్న పాటలు పాడగలడు. ముఖ్యంగా శిల్పి. పాశ్చాత్యవిధానంలో అందమైన బొమ్మ లెన్నో మైనంతో, ప్లాస్టరు సుద్దతో విన్యాసం చేశాడు. ఆతనిలో ఆశక్తి ఉత్తమరూపంతో గర్భితమైవుంది.

పాశ్చాత్యవిధానమూ, భారతీయవిధానమూ ఈ రెంటివిషయమై నాకూ శ్రీనాథమూర్తికి చక్కని వాదోపవాదాలు జరిగాయి. ఆతడు పాశ్చాత్య విధానమూర్తమైన శిల్ప, చిత్రలేఖన, వాస్తు శాస్త్రాలను గూర్చి అఖండంగా చదువుకొన్నాడు. ఆ చదువుకొన్న రోజులలో ఆ సంప్రదాయాల సంపూర్ణ భావం తెలియకపోయినా, ఈనాడీ కైలాసపర్వత నిశ్చలపవిత్రజ్యోత్స్నా స్నాతుడైన ఆతని మనస్సు అతి నిశితమై, వెనుకటి చదువును ప్రతిభతో స్మృతికి తెచ్చుకొని, సూక్ష్మభావాలుకూడా సమన్వయం చేయించగలిగింది. అందుకనే ఆతణ్ణి భారతీయ విధానానికి మార్చగలను అనే నమ్మకం నాకు బాగా కలిగింది. ఒక సంప్రదాయంలో పండితుడైన వ్యక్తి వేఱొక సంప్రదాయం బాగా అర్థంచేసుకోగలడు. పాశ్చాత్య సంగీతవిధానంలో పండితుడై స్వర, శ్రుతి, తాళ, లయాదులు అర్థంచేసుకొన్న కళాస్రష్ట భారతీయ సంప్రదాయ, స్వర, శ్రుతి, గమక, రాగ, తాళ, లయలను బాగా అర్థంచేసుకోగలడు. మొదట పాశ్చాత్య శిల్ప చిత్రకళాశయాల రహస్యం ఏమిటో చెప్పమని శ్రీనాథమూర్తిని కోరాను.

శ్రీనాథమూర్తి ఉపక్రమించాడు. మేమంతా సంఘారామ మధ్య గృహంలో చేరాము. ఆశ్రమవాసులైన శిల్పచిత్రాచార్యులు, కొందరు పండిత లామాలు చేరారు. నాకు టిబెత్తుభాష బాగా వచ్చివుండడంవల్ల, శ్రీనాథమూర్తి సంభాషణ అంతా వారికి ఎప్పటి కప్పుడు భాషాంతరీకరణంచేసి చెప్పినాను.

“స్వామిజీ, మానవప్రకృతిలో జంతుప్రకృతి 'ఆహార నిద్రాభయమైథునాని' అన్నది ప్రథమం అనే తామన్నారుగదా. దానిపైన తనేమిటి, తనచుట్టూ ఉండే సమస్తమూ ఏమిటి అనే జిజ్ఞాస వస్తుంది మనుష్యునికి. అది మనస్సుకు సంబంధించింది. ఇదీ తామే అన్నారు. మనస్సు ఎలక్ట్రాను ప్రోటానులనుండి వచ్చిందా, లేక భౌతికపదార్థము మనస్సునుంచి ఉద్భవించిందా అనే విషయాన్ని గురించీ తామే చర్చించారు. ప్రాణశక్తి ఎలెక్ట్రాన్ ప్రోటానుల కలయిక వల్ల ఏలా రాదో ప్రాణశక్తి మనస్సుయొక్క భౌతికశక్తిపైన వచ్చిన రెండోరూపమైన శక్తి మాత్రమో అవన్నీ తామే సెలవిచ్చారు. మనస్సుయొక్క మూడో శక్తి, సౌందర్యదర్శనానందం. ఈ ప్రకృతిలో దృశ్యంగాని, మానవ చరిత్రలో సంఘటనగాని సౌందర్యవంతమై ప్రత్యక్షమైతే, స్మృతికివస్తే మనుష్యుడు ఆనందం పొందుతాడు. ఈ మూడోశక్తి సౌందర్యారాధనశక్తి అని తామే సెలవిచ్చారు. ఈ మూడుశక్తులనుగూర్చీ పాశ్చాత్యపండితు లందరూ తమ భావాలను పూర్తిగా చెప్పారు.”

'అవును శ్రీనాథమూర్తి! ప్లేటో, అరిస్టాటిల్ దగ్గరనుంచి, అతి ఆధునిక రష్యా తత్వవేత్తలవరకు నిర్వచించిన వాదనలు, మన రసవాదం అన్నీ పూర్తిగా విచారించి చెప్పవలసిన ముక్కలే!'

'చిత్తం! ఆవేశరూపమైన సౌందర్యపూజ శాస్త్రాతీతమని జేమ్సునర్లీ అంటాడండి. కాని సౌందర్యపూజ మానవ భౌతిక సంబంధమని వాదించేవారూ లేకపోలేదు. ఈ రోజులలో ముఖ్యంగా రాజకీయ, ఆర్థిక, శాస్త్ర, పారిశ్రామిక వాతావరణాలు మనుష్యుని పూర్తిగా కమ్మివేసి ఉన్నప్పుడు, సౌందర్యానికీ ఆర్థికోపయోగ భావానికీ, రాజకీయ భావాలకూ శాస్త్రభావాలకూ ఎక్కువ చుట్టరికం వచ్చింది. ఎంతఅయినా సౌందర్య విచారణా, ఆనందమూ మనస్సుకే అని అందరూ ఒప్పుకుంటారు. లలితకళ లెందుకు అన్న విషయం ఉద్భవిస్తుంది. అప్పుడే ఇది మానవప్రకృతి అని నిర్ధారణ చేశారు.

'ఈ మానవప్రకృతికి ముఖ్యమైన గుణం, తానే ఆ సౌందర్యాన్ని సృష్టించాలని ఇచ్ఛ కలగడం, అది సృష్టించడం. ఆ తర్వాత తానుగాని, ఇతరులుగాని అలా సృష్టించిన సౌందర్యాన్ని దర్శించి ఆనందించడం. ఇంత వరకూ పాశ్చాత్య శాస్త్రజ్ఞు లందరూ ఒప్పుకుంటారు స్వామీ!'

'అవును ఈనాటివారి ఉపయోగవాదం త్రివిష్టశిల్పులైన ఈ సన్యాసులకు చిట్టచివర నువ్వు చెప్పితీరాలి. ఆ తర్వాత త్రివిష్టపండితుల అభిప్రాయా లేమిటో తెలుసుకుందాము.'

'చిత్తం. పాశ్చాత్యసౌందర్యతత్వం తర్వాత మనవిచేసుకుంటాను. ఈ లోగా లలితకళలంటే పాశ్చాత్యుల భావమూ సిద్ధాంతాలూ మనవిచేసుకుంటాను. కళ మనుష్యుని పని. ప్రకృతిలోని వస్తువును మనుష్యుని ఉపయోగంకోసం గాని, మనుష్యుని సంతోషంకోసంగాని, మనుష్యుని వెట్టికోసంకాని మార్చడం కలపడం కళ అని పాశ్చాత్యులు పేరుపెట్టారు. ఇక్కడకూడా తత్వవేత్తలు ఇప్పటివరకు రెండుపక్షాలుగా వాదిస్తున్నారు. ప్రకృతిలో లేని పని ఏదయ్యా అని కొందరు అంటారు. అవి వేదాంత విషయాలుగా రావచ్చును అంటారు కొందరు. కాని పనినిగూర్చి ఆలోచించి, విధానం నిర్ధారణచేసుకొనిగానీ, కొంతవరకూ నిర్ధారణ చేసికొనిగానీ మనుష్యుడు చేసేపని కళే.'

## 12

ఆ సభలో కూర్చున్నవారందరూ నిశ్శబ్దంతో శ్రీనాథమూర్తి మాటలు వింటున్నారు. శ్రీనాథమూర్తే అతిజాగ్రత్తగా ఆలోచించుకుంటూ తన అభిభాషణ నడుపుతున్నాడు. నేను శ్రీనాథమూర్తి వాక్యాలు, మనస్సు, వాదన అన్నీ పూర్తిగా గమనిస్తున్నాను.

శ్రీనాథమూర్తి లలితకళఅంటే ఏమిటో నిర్వచనం చేశాడు. 'అలా మనుష్యుడు చేసిన పనులలో అంటే, కళలలో కొన్ని పట్టి ఆనందంకోసం

మాత్రం చేసిన పనులు ఉంటాయి. అవి సౌందర్య స్వరూపాలైతే లలితకళ అంటారు. స్వామిజీ సెలవిచ్చినట్లు మనుష్యునిలో ఉన్న సౌందర్యతత్త్వం ఈ లలితకళలకు ఆధారం. ప్రకృతిలో ఉన్న రంగులూ, మూర్తులూ, ధ్వనులూ, ప్రకృతిలోని కదలికా అతని సౌందర్యోపాసనకు ఆధారాలయ్యాయి. అవే చిత్రలేఖన, శిల్ప, సంగీత, కావ్య, నాట్యాదులయ్యాయి. మనుష్యునిలో పశుత్వం ఎంతనిజమో ఈ సౌందర్యతత్త్వమూ అంతే నిజము. కొందరు కొన్నిపనులు చేయకలిగి, కొన్ని చేయలేనట్లు, మనుష్యులలో కొందరు కళాస్రష్టలు, కొందరు కళానందులు, కొందరు కళకు ప్రక్కనుంచి వెళ్ళిపోయేవారు—మూడురకాలుగా ఉన్నారు.

'కళ ఆనందసముపార్జన నిమిత్తం ఉద్భవించింది. ఆ రకపు ఆనందం లలితకళానందం. ఇది పూర్తిగా మనుష్యుని సౌందర్యారాధనగుణంపై ఆధారపడి ఉంది.'

నేనప్పుడు శ్రీనాథమూర్తిని చూచి, "మూర్తీ, పాశ్చాత్యకళలలో దుఃఖరూపమైనవి, అసహ్యరూపమైనవి, హాస్యరూపమైనవి లలితకళారూపాలున్నాయే ?" అని ప్రశ్నించాను.

"నిజమే స్వామీ! ఏలా అయితే మనుష్యుడు తనకు కావలసిన ఆహారాన్ని వాంఛించి, సంపాదించి, అది తింటోంటే ఎంత సంతోషపడతాడో, ఆలాగే సౌందర్యానందంకోసం సౌందర్యవస్తువులు సంపాదించీ, సృష్టించీ, చూచీ ఆనందపడతాడు. భోజనంలో ఆరు రుచులు ఉన్నాయి. తీపి, కారం, ఉప్పు, పులుపు, చేదు, వగరున్నూ. తీపి అసలు రుచి. అలాగే లలితకళలలో సమ్యక్స్థితి అనే రుచి అసలు సౌందర్యం. చేదులాంటిది విచారం, కారంలాంటిది కోపం, ఉప్పులాంటిది హాస్యం, జుగుప్స వగరువంటిది, అని నా అభిప్రాయమండి."

నేను : చాలా బాగాచెప్పావు. నీపోలిక చాలా అందంగాఉంది. తర్వాతకానీ !

'చిత్రం. ప్రథమంలో మనుష్యుడు తన చుట్టూవున్న ప్రకృతిలోని రంగులుమోసరు, తనకు దొరికిన రంగుమన్నులు, రంగుపూవులు మొదలైన ఉపకరణాలతో ప్రకృతిలోని రూపాలను, ప్రకృతిలోని రంగులను అనుకరిస్తూ తానున్న గుహల గోడలపై జంతువుల బొమ్మలు, జంతువులను మనుష్యులు వేటాడే బొమ్మలు వేశాడు. మట్టితో జంతువుల, మనుష్యుల బొమ్మలుచేశాడు. ప్రకృతిలోని ధ్వనులు అనుకరిస్తూ సంగీతం పాడాడు. గంతులువేశాడు. భాష కల్పించుకున్నాడు. ఆ భాషతో తనలో కలిగిన ఆనందాన్ని వెలిబుచ్చాడు. అది ప్రాథమిక కావ్యమయింది.'

ఒక టిబెట్టులామా నెమ్మదిగా 'మనుష్యుడు దేవతలలోనుండి ఉద్భవింపలేదా ?' అని ప్రశ్నించాడు.

'ఈ బాలకుడు చెప్పే మాటలు పాశ్చాత్యుల భావాలు మాత్రం. అవి తామందరూ విని తర్వాత నా మాటలు విని ఈతనికి తమ కళలు నేర్పేందుకు

అనుమతించాలని నా ప్రార్థన!' అని నే నా లామాకు మనవిచేశాను. ఆయన తల ఊపాడు. 'శ్రీనాథమూర్తీ నువ్వు కానీ!' అన్నాడు.

'లలితకళ అంటే మనుష్యుడు సౌందర్యాన్ని సందర్శించినప్పుడు, ఆ సౌందర్యానందం, చిత్ర, శిల్ప, శబ్ద, స్పందనరూపాలుగా సృష్టించడమే. లలితకళా చిత్రశిల్పాలు దృశ్యకళలు, సంగీతకవిత్వాలు శ్రవ్యకళలు, నాట్యం దృశ్య శ్రవ్యకళ. లలిత కళలు ప్రకృతి సందర్శన స్మృతులవల్లా, మానవ జీవిత సందర్శన స్మృతులవల్లా వచ్చినవి గనుక, ఆ కళలు ప్రకృతికీ మానవునికీ సన్నిహితంగా ఉండాలి అంటారు. కాబట్టి పాశ్చాత్య కళాకారులలో చాల మంది భౌతికసత్యవాదులు. ఈ కైలాసం సృష్టించాలంటే, కైలాసం ఎక్కువ అందంగా కనబడేకాలంలో అంటే ఈ ఋతువు, ఈ మాసం, ఈ రోజు, ఈ సమయంలో ఒకానొక వైపునుంచి చిత్రం వేస్తాడు. అందుకనే పాశ్చాత్యుల కళ ఎప్పుడూ నూత్నమార్గాలు అన్వేషిస్తూనే ఉంటుంది. పాశ్చాత్యులకళ దినదినమూ, మార్గం అధిగమించినకొలదీ, వృద్ధి అవుతూన్న కళ. ప్రకృతిని సరిగా అనుకరించాలన్న ప్రయాసతో వివిధ విధానాలు వచ్చాయి. అవే భౌతిక సత్యవాదము, (రియలిజం) మూలసత్యవాదము (ఇంప్రెషనిజము) అఖండ మూర్తి సత్యవాదము (పోస్టుఇంప్రెషనిజము) అతివాస్తవికత (సర్ రియలిజం) మొదలైనవి.

నేను అప్పుడు శ్రీనాథమూర్తిని చూచి 'భౌతికసత్యాన్ని అనుకరించడమే మొదటినుంచీ పాశ్చాత్యచిత్రకారుల కృషి అంటివి. పారలౌకిక సత్యాన్ని అనుసరించాలని పాశ్చాత్యదేశాల్లో ప్రయత్నం జరగలేదా?' అని ప్రశ్నించాను.

అతడు నన్ను చూచి 'స్వామీ, అలాంటి ప్రయత్నాలూ చాలామాట్లు జరిగాయి. కాని అవి పారలౌకికం అని చెప్పలేము. అవన్నీ భౌతిక సత్యవాదానికి వ్యతిరేకంగా వచ్చినవే. మన దేశంలోని ఆధ్యాత్మికభావజనితమైన ఆదర్శవాదానికీ, పాశ్చాత్యుల ఆదర్శవాదానికీ (ఐడియలిజం) చాలా తేడా ఉందనుకుంటాను' అన్నాడు.

## 13

తర్వాత శ్రీనాథమూర్తి పాశ్చాత్యుల ఆశయవాదం అంటే ఏమిటో స్పష్టంచేశాడు. 'ఆశయవాదంలో పాశ్చాత్యులకు మూడు భేదాలున్నాయి: సాధారణ లౌకికం, వేదాంతపరం, లలితకళాపరమున్నూ. లౌకికపరమైన అర్థం ప్రతివిషయమూ సంపూర్ణత పొందడం. ప్రజారాజ్యం అంటే నిజమైన ప్రజారాజ్యంగా ఉండడం. ఇంక వేదాంతపరంగా ఉన్నభావం ఏమిటంటే భావమూ, వస్తువూ ఒకదాని కొకటి అత్యంతాంతరంగిక సంబంధంకలవి అన్న వాదన. మనుష్యునిజ్ఞానం లేక వస్తువు లేదు అన్నవాదన. ఈ వాదన మన

జ్ఞానమార్గానికి సన్నిహిత సంబంధం కలిగిఉంటుం దనుకుంటాను. ఈ వాదానికి వ్యతిరేకం వస్తువు వేరు, మనుష్యజ్ఞానం వేరు అన్న వాదన.

'ఇంక లలితకళా విషయంలో ఆశయవాదం ప్రాపంచికంగానే ఉంటుంది. భౌతికసత్యం ఇల్లా ఉండాలని ఊహించి, ఆ సత్యానికి సన్నిహితమైన రూపం ప్రకృతిలో వెదికి, దానిని నిరూపించడం ఆశయవాదం. ఈ ఆశయవాదం ఇంకోరకమూ ఉంది. భగవంతునిశక్తి ప్రకృతిలో ఉందని, అది కళాస్వరూపం చేయడంలో వర్ణాలకలయిక, రేఖల సామ్యత, మూర్తుల విన్యాసమూ, కర్మశాంతతా ఇవన్నీ ఆ భగవంతుని ఒక్కొక్క శక్తిని తెలియజేస్తాయనీ, ఉత్తమకళ ఇవన్నీ జాగ్రత్తగా పాటించాలని చెబుతుందనీ, రస్కిను మొదలగువారు వాదిస్తారు.'

శ్రీనాథమూర్తి భౌతికసత్యం కళకు జీవమన్న పాశ్చాత్యవాదననుగూర్చి వర్ణించాడు. వాస్తవికజగత్తు మానవభావరహితమై ఈ స్థితిలో ఉంటుందని మనుష్యుడు విచారణచేసి కనుక్కోవాలట. అది కళాస్వరూపంగా సృష్టించాలట. త్రివిష్టపసన్యాసు లీతని అభిభాషణ అంతా శ్రద్ధగా ఆలకించారు. ఆ విషయము ఆతడు పూర్తిచేసేటప్పటికి రాత్రి పన్నెండు గంట లయినది. ఆ తర్వాత అందరమూ విశ్రమించడానికి లేచాము.

ఆ మర్నాడు శ్రీనాథమూర్తి నాదగ్గరకువచ్చి పాదాభివందనంచేసి, "గురుదేవ్" నిన్న నేను పాశ్చాత్యభావాలు తమ కందరికీ విన్నవించి వెళ్ళిన తర్వాత, నా కెంతసేపటికీ నిద్రపట్టలేదు. లేచి సహస్రముఖ బుద్ధదేవ చైత్యమందిరానికి పోయి, ఆ విగ్రహం ఎదుట పద్మాసనంవేసి కూర్చుండి, మినుకు మినుకుమనే ఆ దీపాల కాంతిలో, ఆ విగ్రహమహాభావం, సౌందర్యం అవలోకిస్తూ, ఏదో ఆనందంలో మునిగిపోయి ఉంటిని.

"ఇంతలో ఆ విగ్రహం మాయమై కైలాసపర్వతం దర్శనమైనది. అప్పుడే ఒక మహాభావం నాకు వినబడినట్లయింది. 'మూర్తీ! భారతీయ కళావిధానం ప్రాచ్యఖండవాసుల సౌందర్యదర్శనాధారం. కాలాతీతమై, వ్యక్తిగత మూర్త్యతీతమైన భావాన్ని నిరూపించింది భారతీయ కళ. నూతనాశయాలు భావాలు సంప్రదాయంలో విన్యాసం చేయి. ప్రకృతిని ఆధారంచేసుకో. దేహం, మనస్సు, ఆత్మ ఒకదాన్ని ఒకటి చంపకూడదు. ఈ మూడూ ఒకే మహాభావంయొక్క త్రిమూర్తిత్వంసుమా! భావరాగతాళాలు సమ్యక్‌స్థితి పొందడం నిజమైన సంగీతం. అలాగే రంగు, రేఖ, మూర్తి, భావం సమ్యక్‌స్థితి పొందింది చిత్రలేఖనం. రేఖలూ, మూర్తీ, భావము సమ్యక్‌స్థితి శిల్పం' అని నాకు వినబడినట్లయిందండి. నా కేదో వివశత్వం కలిగి కన్నీళ్ళు దొన దొన జారిపోయాయి. గురుదేవా! నాకున్న' అనుమానాలు పోయాయి. తమ ఆదేశంప్రకారం నడుస్తాను. సెలవు దయచేయండి" అని నివేదించుకున్నాడు.

నేను : నాయనా! నీలో ప్రపంచం పూర్తిగా మాయంకాలేదు. నీబోటి వాళ్ళు భౌతికంలో, సత్యశివసుందరత్వాన్ని ప్రదర్శించి ఆధిభౌతిక, ఆధిమానసిక, ఆధ్యాత్మికాలకు సమన్వయం చేయడానికి ఉద్భవించారు. ఆ ధర్మాన్ని నువ్వు విసర్జించకూడదు. నీ శకుంతల నీకు వేరేరూపంలో ఈ జన్మలోనే దర్శనం ఇస్తుంది. ఆమె, ఈమె అని నీకే హృదయగోచర మవుతుంది. ఆమెతో ఏడాదిపాటు నీకథ చెప్పకు. నీ జీవిత పరమావధికి తోడునీడ కావాలి. శక్తిలేని శక్తుడెట్లా? సరస్వతిలేని బ్రహ్మ ఉండునా! మానవ ధర్మయుద్ధం స్త్రీపురుషులు కలిసి చేయాలి. పారలౌకికయుద్ధం మాబోటివారు నిర్వహిస్తారు. ఏడాదయినవెనక నీ చరిత్ర చెప్పుకో. ఏది ఎట్లా సంభవించినా, నీ ధర్మం నువ్వు మానకు. ప్రజాసేవ నీ ధర్మం. అది లలితకళలద్వారా నువ్వు చేయాలి. నువ్వు ఈ ఆశ్రమంలో కొన్ని నెలలపాటు ఉండు. నేను కైలాస పర్వతేశ్వరునకు నమస్కరించి హిమాలయాలకు వెళ్ళిపోతాను. సెప్టెంబరు నెలలో నువ్వు నేపాలు వెళ్ళు. అక్కడకు వెళ్ళే అనువులన్నీ నేను చూస్తాను. అక్కడ శిల్పమూ, చిత్రలేఖనమూ పరీక్షించు. నవంబరు నెలలో నన్ను హరిద్వారంలో కలుసుకో. అప్పటికి మీ అమ్మగారు హరిద్వారం వస్తారు. నువ్వు ఏప్రిల్ నెలవరకు నాదగ్గర హరిద్వారంలో ఉండు. తర్వాత మీ అమ్మగారితో హిమాచలయాత్ర చేయి. ఆ తర్వాత మీ గ్రామం వెళ్ళు. అక్కడనుండి నీకు ఏది ధర్మమని తోస్తే అది చేయి.

ఈ ముక్కలు నేను చెప్పుతుండగనే శ్రీనాథమూర్తి కరిగిపోయినాడు. ఆతడు నా కాళ్ళకడ సాష్టాంగపడి కళ్ళనీళ్ళు కారిపోవగా "తమ ఆజ్ఞ అక్షరాలా నిర్వహిస్తాను గురుదేవా!" అన్నాడు.

## 14

స్త్రీగాని, పురుషుడుగాని ప్రపంచసాంస్కృతిక పురోగమనానికీ, సంతతాభ్యుదయానికీ ఆధారశక్తిరూపం కావాలి. ఈనాడు భరతదేశంలో స్త్రీ అత్యంత హీనదశలో ఉంది. పురుషుడు ఎంత చదువుకున్నా నిజమైన ధర్మం దూరంగానే వుంచుకొన్నాడు. ఎన్ని ఉద్యమాలు వచ్చినా భరతదేశ యువకునిలో పశుత్వం ఎక్కువ అవుతోందిగాని తగ్గటంలేదు. ఇప్పటికి ఆడది ఒక్కతే ప్రయాణం చేయలేదు. మూగదేవుడులా గృహంలో బాధలుపడుతూ త్యాగభారం కొండలుకాగా నడుము వంగిపోయి జీవితప్రయాణం సాగిస్తోంది. పురుషుడు ఆత్మదర్శనంకోసం ఎన్నో కడగండ్లు పడి, హీనస్థితినికూడా పొందుతూ, కష్టాలపాలవుతూ, పశువుగాకూడా అవుతూ, చివరకు విజయమైనా పొందుతున్నాడు, లేదా విజయాభిముఖుడై నశించిపోతున్నాడు.

ఇంక భరతదేశంలో బీదలస్థితి తలుచుకొంటే, నాబోటి నిస్సంగులు కూడా లజ్జపడి, తల వంచుకోవలసివస్తోంది. లక్షాధికారులు, భూస్వాములు,

పారిశ్రామికవేత్తలు ఇంకా ధనం, ఇంకా ధనం అని, బీదల ధన మాన ప్రాణాల్ని తమ ధనకాంక్షాయజ్ఞానికి ఇంధనాలు చేస్తున్నారు. ముప్పదిఅయిదు కోట్ల జనాభాలో ఇరవైఅయిదుకోట్ల కటికబీదవాళ్ళు! అయిదుకోట్ల ముప్పాతిక బీదవాళ్ళు; మూడుకోట్లు సగంబీదలు; ఒకకోటిన్నర కొంచెం ధనవంతులు; అరకోటి ధనవంతులు; పావుకోటి మహాధనవంతులు; కొన్ని లక్షలు అతి ధనవంతులు; కొన్ని వేలమంది మాత్రమే కోటీశ్వరులు.

ప్రపంచం అంతా అల్లాగేవుంది. అయినా ఆసియాదేశాలలో ఈ దురతి ఘోరాతిఘోరస్వరూపంలో ప్రత్యక్షమౌతుంది. ఎన్నికోట్ల జనానికో, పెద్దలకు, పిల్లలకు, స్త్రీలకు, పురుషులకు కట్టుగుడ్డా, తిన తిండీ, పండ పక్కా లేదు. తండ్రీ కైలాసప్రభూ! రష్యా భౌతికంగా ఈ భయంకర సమస్యను ఎదుర్కోవడానికి ప్రయత్నంచేస్తూంది. బౌద్ధధర్మము మానసికంగా తృప్తి తీసుకొనిరావడానికి ప్రయత్నం చేసింది. ఆరోజులలో భరతదేశాన దారిద్ర్యం లేనేలేదు. ఆ బౌద్ధమతం—జపానుకు కర్మశక్తియూ, చీనాకు నిద్రమత్తూ, సింహళానికి ఆశా నేర్పింది. వట్టి మతంవల్ల, ఆధ్యాత్మికచింతవల్ల భౌతికమైన ఈ దుర్భరస్థితి పోతుందా స్మశానదేవా? భౌతిక మానసిక పారమార్థిక సమన్వయత లేనినాడు ఏ దేశమూ ఉత్తమస్థితికి ఏలావస్తుంది? ఈ ఆలోచనలతో త్యాగతి శర్వరీభూషణుడైన శ్రీనాథమూర్తినీ, నాశిష్యులైన కొందరి సన్యాసులను ద్యూపాంగు సంఘారామంలో ఉంచి, నేనూ, రాజపుత్ర జమీందారుడూ, అతని అనుచరులూ భరతదేశానికి బయలుదేరాము.

రాజపుత్ర జమీందారుడు, కపూర్ బహదూర్, శ్రీనాథమూర్తిదగ్గరకు పోయి, "శ్రీనాథమూర్తిగారూ! నమస్కారం. మీవంటివారి సహవాసం ఇప్పించినందులకు స్వామిజీకి, ఈ కైలాసప్రభువునకూ నేను ఆత్మాభివందనాలు అర్పిస్తున్నానుసుమండీ. మన స్నేహం ఇంతటితో ఆగిపోకూడదు. మీరు మా జమీకి రావాలి. మా ఆతిథ్యం స్వీకరించాలి. మా ఇంటిలో ఎన్నో రాజపుత్ర చిత్రలేఖనాలూ, మొగలు చిత్రలేఖనాలూ ఉన్నాయి. అవన్నీ మీరు చూడాలి. అవీకాకుండా కొన్ని స్ఫటికశిలా శిల్పాలూ, కొన్ని లోహ శిల్పాలు అనేక కళాపూరిత వస్తువులూ ఉన్నాయి. అవన్నీ మీరు చూడాలి. పూర్వ కాలపు సంగీత వాద్యవిశేషాలు ఉన్నాయి. నేను అర్పించబోయే కొన్ని వస్తువులు తాము స్వీకరించాలి" అని మనవిచేశాడు.

శ్రీనాథమూర్తి కళ్ళనీరు తిరుగుతుండగా జమీందారుగారికి నమస్కారం చేసి, "జమీందారుగారూ! నేను వాక్కర్మలద్వారా తమ కప్పుడప్పుడు కష్టం కలిగించి ఉండవచ్చు. మన ప్రయాణంలో తమ స్నేహం పూర్తిగా అర్థంచేసుకోలేకపోయాను. తమ స్నేహానికి నన్ను అర్హుణ్ణిచేసింది నా గురుదేవుడే. ఈ దేహమున ప్రాణాలు తమ మధురస్నేహాన్ని ఎప్పుడూ వాంఛిస్తూంటాయి. త్వరలోనే మీ భవనానికి మా అమ్మగారితోకూడా వస్తాను. స్వామిజీని,

మిమ్మల్ని, ఈ స్వాములను వదలిఉండడం కష్టం! అయినా గురుదేవు ఆదేశం నేను ఉల్లంఘించలేనుకదా! తమ అందరిదగ్గిరా సెలవు'' అన్నాడు.

జమీందారుడూ, శ్రీనాథమూర్తీ కౌగలించుకొన్నారు. శ్రీనాథమూర్తి నా పాదాలకు నమస్కారంచేశాడు. తక్కిన స్వాములందరికీ పాదాభివందనాలు అర్పించాడు. కూలీ లందరకూ మంచి బహుమతులు ఇచ్చాడు. అందరమూ బరువైన హృదయాలతో విడిపోయాము.

శ్రీనాథమూర్తి ముందుయుగంవాడు. అతడు తప్పక అసలు నిజం కనుగొనడానికే పుట్టాడు. కైలాసేశ్వరుడు అతనికి చిరాయురారోగ్యాలు, ధర్మనిరతీ సత్యదీక్షా పురోగమనశక్తీ ప్రసాదించుగాక!

ఓం తత్ సత్

# సౌందర్యదీప్తి

## 1

[హేమసుందరీదేవీ! ఇక్కడనుంచి నేనే నా కథను సాగించి, పూర్తి చేస్తాను—శ్రీనాథమూర్తి]

సౌందర్యారాధన మానవుని వీరత్వమా? కళ మానవునకు అవసరమే లేదా? కళారూపం ఈలా ఉండాలని కళాస్రష్టలకు ఆజ్ఞలు ఇవ్వడం కళకు మంచిదా, నష్టమా? ఈ రకం సాహిత్యం ఉండాలి, ఈ రకం చిత్రలేఖనం ఉండాలి, శిల్పం ఈ మార్గాల నడవాలి అని చెప్పడానికి అధికారం ఉందా?

నా గురుదేవుడు జమీందారుగారితో, అనుచరులతో బయలుదేరి భరతభూమికి ప్రయాణమై వెళ్ళిపోయారు. నాతో వారి శిష్యులు ముగ్గురుమాత్రం ఉన్నారు. స్వామిజీ వెళ్ళుతోంటే తల్లినిబాసే బిడ్డవలె తల్లడిల్లిపోయాను. ఆ చలిలో, ఆ నిశ్శబ్ద నిర్మల వాతావరణంలో కైలాసపర్వతకాంతులు ప్రసరిస్తూ ఉండగా స్వామిజీ, వారి అనుచరులూ మమ్మ వీడ్కొని ప్రయాణంసాగించారు.

మా స్వామిజీ చూపులు కైలాస పవిత్రసందేశాలు. నా కవి పది ఏనుగుల బలము ప్రసాదించాయి. స్వామిజీ నా కనులకు కనబడేటంతవరకూ ఆ చిన్న పర్వతశిఖరంమీద అలాగే నిలుచుండిపోయాను. నాదగ్గిరఉన్న దూరదర్శకయంత్రంతో చూస్తూ నిలుచున్నాను. వారు లోయలో దిగినప్పుడు కనబడరు. మిట్టలు ఎక్కినప్పుడు కనబడినారు. ఆ యంత్రానికికూడా కనబడనంత దూరం వెళ్ళారు. ఎండ తీక్ష్ణంగా సాగింది. నేనో పెద్ద నిట్టూర్పువదలి ఆశ్రమంలోకి వెళ్ళిపోయాను. లోపల నా గదిలో కూర్చున్న క్షణంనుండీ నా కనేక రూపాలైన ఆలోచనలు ఉద్భవించి మాయంకాసాగినాయి.

నాలోని కళావిషయకమైన ప్రశ్నలకు శిల్పాచార్యులైన ఆ త్రివిష్టప బుద్ధభిక్షాచార్యులే సంశయం తీర్చాలి. పెట్టిన శుభముహూర్తమునుంచీ శిల్ప, చిత్రలేఖనాలు నేర్చుకోవడం ప్రారంభించాను. నేను జూను, జులై, ఆగష్టు నెలలు ద్యూపాంగు సంఘారామంలో ఉన్నాను. దారుఫలకంమీద సన్నని ఉల్లిపొరగుడ్డ అంటించి, అది చిత్రలేఖనానికి అనువుచేసి, దానిమీద చిత్రించడం ఒకవిధానం. గుడ్డమీదనే చిత్రించడం రెండవ విధానం. నేపాలు నుండి వచ్చిన చేతితయారు కాగితాలమీద చిత్రించడం మూడవరకం. ఈ విధానాలన్నీ నేర్చుకున్నాను. మా గురువుగారు శిల్పగ్రంథాలు రెండు నాకు విపులంగా వ్యాఖ్యానంతో చెప్పారు. మాగురువుగారికి హిందీ రాదు. స్వామిజీ శిష్యులైన ఒక స్వాములవారు మా ఇరువురిమధ్యా ద్విభాషి అయ్యారు.

దారుశిల్పం, లోహశిల్పం టిబెత్తువాసులకు ఎక్కువ ఇష్టం. నేపాలులోనూ అంతే. స్వదేశంలోనే శిలాశిల్పం నేర్చుకోవాలి అని సంకల్పం చేశాను. మా గురువుగారు ఒకదినం నన్ను ముఖ్యాచార్యులైన కులపతికడకు తీసుకొనివెళ్ళారు. వారు నాకు లలితకళలనుగూర్చి ఉపదేశించారు.

"నాయనా! నువ్వారోజున చెప్పినట్లుగా లలితకళలు ఆనందంకోసం కదా మనుష్యునిలో ఉద్భవించాయి! సరే. ఆ ఆనందంకూడా మనుష్యునిలో ఊరికే ఉద్భవించలేదు. ఆతని పురోభివృద్ధికే అతనిలోఉన్న సమస్త ఉత్తమ గుణాలూ తేజరిల్లుతున్నాయి. అట్టి ఆనందం అనేది పిచ్చివానికిమాత్రం ఉంటుందేమో! తన జీవితంలో భాగమైన ఉత్తమవిషయాలు కళాస్వరూపంతో దర్శనమిచ్చినప్పుడు మనుష్యునికి నిజమైన ఆనందం కలుగుతుంది.

"ఆకలివేసి, ఆ ఆకలి తీర్చుకొనుటకు భోజనంచేస్తే, ఆనందం కలుగుతుంది. ఆ ఆనందం తుచ్ఛమే అగుగాక. కాని, ఆకలితీరడం భౌతికాభివృద్ధికొరకేకదా! ఆనందమూ, భౌతికాభివృద్ధీ రెండూ కలిసిఉన్నాయి ఆకలి తీరడంలో! అలాగే ఆనందప్రయోజనంలో పరమార్థంకూడా ఉండితీరుతుంది."

"కాబట్టి కళను ఉత్తమప్రయోజనస్వరూపంచేస్తే మానవ పురోభివృద్ధికి ఎంతో మహోత్తమకళ అవుతుంది."

"స్వామీ! కళాస్రష్ట సర్వస్వతంత్రుడుకదా, అలాంటప్పుడు ఆతన్ని ఈరకంగా కళఉండాలి అని ఎవరైనా నిర్బంధింపగలరా? అన్న ప్రశ్న నన్ను బాధిస్తోంది" అని ఆ లామాను ప్రశ్నించాను.

ఆ వృద్ధసన్యాసి చిరునవ్వు నవ్వాడు. ఆ మందిరం ఆ నవ్వులతో వెలిగిపోయింది.

## 2

"నాయనా! నిజంగా మనుష్యునికి సర్వస్వాతంత్ర్యం ఉందా? పుట్టిన దేశం, కుటుంబం, కాలం ఆతని స్వతంత్రాన్ని చాలావరకూ అరికట్టలేదా?

భారతీయుడైతే బానిసగానే పుట్టుతున్నాడుగదా, అప్పుడాతనికి స్వతంత్రం ఉందా? మనుష్యుడు తన గుణగణాలకి తానే ఆనకట్ట కట్టుకోవాలిగదా? తన స్వాతంత్ర్యం ఇతరుల స్వాతంత్ర్యందగ్గిర ఆగాలికదా! మానవధర్మం, ప్రేమ, దయ, సత్యమూ, శీలమూ తన స్వతంత్రాన్ని అరికట్టుతాయిగదా! మనుష్యుడు పిచ్చివాడైతే విషం పుచ్చుకుంటాడేమో? కత్తిపెట్టి నరుక్కుంటాడా మంచివాడు? కళ్లుపెట్టి కొట్టుకుంటాడా? అల్లాగే తన కుటుంబానికి, తనకు, తన దేశానికి సర్వధర్మాలకు వ్యతిరేకమయిన పనులు చేస్తాడా? అలాంటి కవిత్వం, చిత్రలేఖనం సృష్టించగలడా?"

"స్వామీ! కేవల సౌందర్యారాధనరూపమైన కవిత్వం ఎందుకు రాయకూడదు? సంపూర్ణ సౌందర్యారాధన మనుష్యునికి హాని కలిగిస్తుందా?"

"సౌందర్యారాధన లేనిదే కళలు పుట్టనే పుట్టవుకదా బాబూజీ! కళాత్మకు సౌందర్యారాధనే మూలశక్తి. ఆ ఆరాధన ప్రకృతిసౌందర్యారాధనగా, మానవ సౌందర్యారాధనగా, మానవసృష్టి సౌందర్యారాధనగా, మానవ చిత్త, గుణ, ఆత్మసౌందర్యారాధనగా, మానవచరిత్ర సౌందర్యారాధనగా ఉంటుందిగదా!"

"చిత్తం. నా ఉద్దేశంలో, మానవుడు తన్నే నాయకుణ్ణిగా జేసుకొని, తన ప్రేమనిధానాన్ని నాయికనుచేసి కావ్యం సృష్టించవచ్చునా?"

"తప్పకుండా! తన మనస్సులేనిది, లలితకళలే లేవుకదా! వస్తువు, దర్శనముచేయువాడు—ఈ ఇరువురి సంబంధంలోనుంచికదా లలితకళలు వచ్చేది. ఆ కళలు రెండురకాలుగా సృష్టిస్తాడు. ఒకదానిలో వస్తువువెనక తాను దాక్కుంటాడు. ఇంకొకదానిలో, తానే ప్రత్యక్షమౌతాడు. వస్తుగుణ, మానవ భావప్రదర్శనాలు సంపూర్ణంగా శిల్పి హృదయప్రదర్శనాలేకదా!"

"శృంగార రసానికి స్థానం ఏదండీ"

"శృంగారరసం కళలో ప్రథమస్థానం వహిస్తుంది. సౌందర్యారాధనే శృంగారరసం. ఉత్తమ శృంగారం భక్తి. భగవంతుని అర్చించే భావము మనుష్యునిలో స్త్రీభావము, భగవంతునిలో పురుషభావము ఆరోపించుకునిగదా భక్తియొక్క శిఖరితభావం సృష్టించుకొన్నాడు మనుష్యుడు!"

ద్యూపాంగు ఆంధ్రసంప్రదాయ పరంపరానుగతస్వరూపం తాల్చింది. ఆంధ్రుణ్ణయిన నేను అక్కడి విద్యార్థినయ్యాను. నా ఆంధ్రదేశంలో ఇప్పుడు శిల్ప చిత్రకళలు అధోగతిలో ఉన్నాయి. అవి పునరుద్ధరించటం నా ధర్మము. దామెర్ల రామరాయుని చిత్రలేఖనాలు అనేకం చూచాను. ఆ ఉత్తమ పురుషుడు ఆంధ్రసంప్రదాయం పునరుద్ధరింప ప్రయత్నం చేశాడు. ఆ ప్రయత్నంలో కొంతవరకూ జయంపొందినాడు. కాని సిద్ధి లభింపకుండా అవతారం చాలించాడు. అందుకనే ఆతని చిత్రాలలో పరిపూర్ణత వచ్చేస్థితి ద్యోతకం అవుతుంది. వర్ణాలు ప్రాథమికస్థితి దాటుతున్నాయి. రేఖలలో కర్కశత్వం వీడుతూఉంది.

అంగవిక్షేపాలు లాలిత్యం తాల్చబోతున్నాయి. భావమేళము పూర్ణతవహించబోతున్నది. చిత్రాలకు వ్యక్తిత్వం వస్తూఉన్నది. ఎంత రసవత్తరమైనా చిత్రానికీ, చిత్రంలోని పాత్రలకూ వ్యక్తిత్వం ఉండాలి. రామావతారం, కృష్ణావతారం ఎంత సంపూర్ణ వ్యక్తిత్వచిత్రాలు! కాళిదాసుని మేఘసందేశం వేరు, రఘువంశం వేరు. అలాగే మనుచరిత్ర వ్యక్తిత్వం వేరు, పారిజాతాపహరణ వ్యక్తిత్వం వేరు. ప్రవరాఖ్యుడు, మాయాప్రవరాఖ్యుడు, స్వరోచి ముగ్గురూ మూడు వ్యక్తులు. అలాంటి వ్యక్తిత్వం రామారాయని చిత్రాలలో తెరవెనకనుంచి అవతరిస్తున్నది. ఆతని కృష్ణలీలచిత్రము, సిద్ధార్థయశోధర చిత్రము రెండు ఒకటే. కృష్ణుడుకీ సిద్ధార్థుడుకీ ఏమీ తేడాలేదు. యశోధరకూ ఆమె చెలికత్తెలకూ ఏమీ తేడాలేదు. ఆదోషం ఆతని చిత్రాలన్నిటిలోనూ మాయంకావడం ప్రారంభించిన మహోత్తమక్షణాలలో ఆంధ్రుల దురదృష్టంవల్ల ఆత డవతారం చాలించాడు. రవివర్మలో ఇంకా ఎన్నో దోషాలున్నాయి. రామారాయుని చిత్రకళ అంతా కలిపితే ఒక వ్యక్తిత్వం ఉంది. ఒక మహాతపస్సు ఆతనికళ.

మూడునెలలూ ద్యూపాంగు సంఘారామంలో గడిపాను. అక్కడి గురువులు నాకు దారి చూపించారు. ఆ దారిని నడిచి, మజిలీలు చేసుకుంటూ గమ్యస్థానం చేరవలసింది నేను. గురువులందరికడా కులపతికడా సెలవు తీసుకున్నాను. వారి ఆశీర్వచనాలు పొందాను. మా స్వామిజీ ఆదేశంప్రకారం ఆ ప్రదేశంలో ఆ చలిలో, ఆ కొండలలో, లోయలలో ప్రయాణంచేస్తూ నేపాలు చేరుకున్నాను. మా గురువుగారి కరుణవల్ల నేపాలు ప్రభుత్వంవారు వారి దేశంలోనికి నన్ను, నాతో ఉన్న సన్యాసులనూ రానిచ్చారు. నేపాలులో పదిరోజులు ప్రయాణంచేసి కాట్మాండు నగరం ప్రవేశించాము.

కాట్మాండులో అనేక దేవాలయాలు ఉన్నాయి. ఆ దేవాలయాల వాస్తునిర్మాణం అనేకరీతులుగా ఉన్నది. బౌద్ధదేవాలయాలు, హిందూదేవాలయాలు ఉన్నాయి. నేపాలులో భారతీయ శిల్పవిధానం ఒక విచిత్ర పరిణామం పొందింది. భరతదేశంలో అలజడి సంభవించినప్పుడల్లా కొన్ని కుటుంబాలు నేపాలు చేరుతూవచ్చాయి. వీరికీ, ఆ ప్రదేశంలోఉన్న పూర్వవాసులకూ సంబంధాలు కలిగి మిశ్రమజాతులు ఉద్భవించాయి. అలాగే మతాలు మిశ్రమం పొందాయి. నేపాలులోని మధ్యలోయ ఒకప్పు డొక మహాసరస్సట. ఆ సరస్సును మంజుశ్రీ శాతవాహనుడనే ఆంధ్రమహారాజు కొండలు బ్రద్దలుకొట్టి దారిచేసి నదులుగామార్చి గంగానదికి ఉపనదులు చేశాడట.

ఒకనాడు ఇక్కడ ఆంధ్ర శాతవాహనులు రాజ్యంచేసినట్లు చిహ్నాలు చాలా ఉన్నాయి. గోదావరినది, కృష్ణానది ఈ దేశానికి ఈవలావల ఉన్నాయి. ధాన్యకటకనగరము, ప్రతిష్ఠాననగరము రెండుపట్నాలున్నాయి. ఇక్కడ శాలివాహనశకము చాలా గౌరవస్థితిలో ఉన్నది. నేపాలు శిల్పంలోకూడా పూర్వాంధ్ర సంప్రదాయం మిళితమైఉండిన గురుతు లీనాటికీ కనబడుతాయి.

# 3

1931 వ సంవత్సరం నవంబరు నెలలో నేపాలునుంచి బయలుదేరి బెంగాలుచేరి, అక్కడనుంచి హరిద్వారం వచ్చాను. వచ్చీరాగానే మా గురువుగారి ఆశ్రమానికి వెళ్ళి వారి పాదాలమీద వ్రాలాను. నేను నేపాలునుంచి ఎప్పటికప్పుడు స్వామిజీకి ఉత్తరాలు వ్రాస్తూండేవాడిని. ఇండియాలోకి కాలు పెట్టగానే స్వామిజీకి నేను వస్తున్నానని తంతి ఇచ్చాను. నన్ను ఆశీర్వదిస్తూ స్వామిజీ చిరునవ్వు నవ్వుతూ, నన్ను లేవనెత్తి, ఆసనంమీదే కూర్చుండుమని సైగచేశారు. నేను కూర్చోగానే స్వామిజీ నన్ను కుశలప్రశ్న లడిగి, నేపాలుదేశ యాత్రావిషయాలన్నీ తెలుసుకున్నారు. నేపాలునుంచి స్వామిజీకి నేను వ్రాసిన ఉత్తరాలతో కలిపి, మా అమ్మగారికి ఉత్తరాలు వ్రాయడం సాగించాను. వానిని స్వామిజీ ఎప్పటికప్పుడు భట్టిప్రోలు పంపిస్తూ ఉండేవారు. నేను భరతభూమిలో కాలు పెట్టగానే, స్వామిజీ నేను వస్తున్నానని మా అమ్మగారికి తంతిఇచ్చారు. నేను వచ్చిన మరునాడు మా అమ్మగారు హరిద్వారం వచ్చారు. నేను స్టేషనుకు వెళ్ళి, బండి వెతుకుతూ, మా అమ్మగారూ మా సుబ్బులూ కలిసి బండి దిగడం చూచి అక్కడకు పరుగెత్తాను. ఇద్దరూ నన్ను ఒక్క నిమిషం తేరిపారచూచారు.

'ఒరే బావా! అంత మారిపోయావేమిటిరా?'

'ఏం మారానురోయి! జబ్బుగా లేనుకదా, కొంపదీసి!'

'ఛా! ఛా! ఏం పాడుమాట. నీ చిన్నతనంలోని వెన్నముద్దలరూపం నిరుడు మాడి నల్లపడిపోయింది. చిక్కిపోయి, మొగాన్ని నల్లనిమచ్చలు, కళ్ళ కింద నలుపులు, ముడతలుపడి, జుట్టు అక్కడక్కడ తెల్లబడి, నలభైఏళ్ళా అన్నట్టుగా కనబడ్డావురా! ఇప్పుడు నీ ఇరవైఏళ్ళరూపూ కనబడుతోంది. జుట్టుబాగా నల్లబడింది. ఏదో గంభీరత ఉంది నీ రూపుల్లో. మోము వెలుగుతున్నట్లుందిరా!'

మా అమ్మ అప్పుడు నన్నుచూచి, 'నాన్నా! నీ ఆరోగ్యం ఇప్పుడు చాలా బాగుందిరా! నిన్ను ఆనవాలుకట్టలేకపోయానురా!'

నేను: అమ్మా! నా ఆరోగ్యాని కేమిగాని, నువ్వు బొత్తిగా చిక్కిపోయావే!

అమ్మ: నీకోసం ఏదో బెంగ. మళ్ళీ స్వామీజీని తలుచుకొని ధైర్యంగా ఉండేదాన్ని. ఈవాళ నిన్ను చూడగానే నాకు కలిగిన ధైర్యం వేయి ఏనుగుల బలం ఇచ్చిందిరా!

మా అమ్మా నేనూ స్వామీజీదగ్గిర నెలరోజులు ఉన్నాం. అనేక విషయాలు వారితో చర్చించేవాణ్ణి. స్వామీజీ ప్రతివిషయమూ పండు ఒలిచి చేతికిచ్చినట్లు చెప్పేవారు. స్వామీజీకి విపరీతమేధ. వారు ఆంగ్లదేశము, యూరోపు, అమెరికా అన్నిదేశాలు తిరిగారు. శాస్త్రపరిశోధన ఈ నాటికి ఎంతవరకు వచ్చిందో వారికి పూర్తిగా తెలుసును. మేము వారి ఆశ్రమంలో

ఉన్న నెలరోజులూ అనేకమంది శిష్యులువచ్చి స్వామీజీ దర్శనం చేసి వారి మాటలు విని ఆనందించి వెళ్ళిపోతూ ఉండేవారు.

మా సుబ్బులు తిరిగి భట్టిప్రోలు వెళ్ళిపోయాడు. మా అమ్మగారిని తీసుకొని శ్రీకాకుళమని జగన్నాథం వచ్చాను. ఫిబ్రవరి నెల వచ్చేవరకు జగన్నాథం, భువనేశ్వరం, కోణార్కం, సాక్షిగోపాలం, శ్రీకూర్మం, ముఖలింగం మొదలైన ప్రదేశాలన్నీ చూచాము.

నేను నేపాలునుండి హరిద్వారం రాగానే నా చిత్రలేఖనాలన్నీ మా గురువుగారు పరిశీలించారు. నేను కైలాసపర్వతం చేరేవరకూ వేసిన బొమ్మలు ఒకరకం అన్నారు. అక్కడనుంచి వేసిన బొమ్మల స్వరూపమే మారిపోయిందట. హిమాలయ పర్వతాలలో మొదటియాత్రాస్థలాల్లో ఉన్న ఎత్తే నా మొదటిభాగం బొమ్మలట. రెండవభాగం బొమ్మలు, హిమాలయం నడిగడ్డపై ఉన్న ఎత్తును తెలియజేస్తాయట. 1932 ఫిబ్రవరి నెలలో కలకత్తాలో నా చిత్రాలన్నీ ఒక ప్రదర్శనం ఏర్పాటుచేశారు స్వామీజీ. వాటి ఖరీదులు ఆయనే పెట్టారు. స్వామీజీని, ద్యూపాంగు ఆశ్రమాన్ని, ఆశ్రమంలో శిల్పగురువుని రచించిన చిత్రాలు కొన్ని, కైలాస పర్వతేశ్వరుని చిత్రాలు కొన్ని, నేపాలువి కొన్ని నేను అమ్మనన్నాను.

నా బొమ్మలన్నీ నూటడెబ్బదిఎనిమిది ఉన్నాయి. నేను తీసిన స్కెచ్చిలు మూడువందల ఏభై ఉన్నాయి. నేను అమ్మదలచుకోనివి తప్ప తక్కిన బొమ్మలలో అయిదుతప్ప తక్కినవన్నీ అమ్ముడై నాకు పదివేల ఎనిమిదివందల అరవైమూడు రూపాయలు వచ్చినాయి. మోడరన్ రివ్యూ, అమృతబజారు పత్రిక, స్టేట్సుమన్, వంగబాణి, మొదలయిన వంగభాషాపత్రికలు నా చిత్రలేఖనాన్ని చాలా ప్రశంసించాయి. నా చిత్రాలలో కొన్నిటి ప్రతిరూపాలుకూడా ఆ పత్రికలు ప్రకటించాయి. ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక ఈ పత్రికలను చూచి వార్తలు ప్రకటించాయి. వీనిలో నాపేరు టి. శర్వరీభూషణ్ అని పడింది. నా వారెవ్వరికీ శ్రీనాథమూర్తే ఈ చిత్రకారుడు అని తెలియదు. మార్చి నెలలో మా అమ్మా నేను తిరిగి హరిద్వారం చేరుకున్నాము. అక్కడ పంచలోహాత్మకంగా కొన్ని విగ్రహాలు పోతపోశాను. నచ్చనివి తిరిగి కరిగించివేశాను. నేపాలులో విగ్రహాలు పోతపోయడం, అవి బాగుచెయ్యడం, మెరుగుపెట్టడం నేర్చుకున్నాను.

మార్చి నెలాఖరున మా అమ్మా నేనూ మా సుబ్బులూ హిమాలయ యాత్ర ప్రారంభించాము. మా అమ్మకు బదరిలో జ్యోతిర్దర్శనము చేయించాలని నాకోర్కె. మా అమ్మా నేనూ కలసి బదరీక్షేత్రం ముందర దర్శించాము. అక్కడనుండి కేదారేశ్వరం, కేదారం నుండి గంగోత్తరి, గోముఖం, అక్కడనుండి యమునోత్తరి సందర్శించాము. మాతో మా సుబ్బులు రావడం నాకెంతో ఆనందమయింది. మా అమ్మగారి ఆనందానికి పరిమితేలేదు. ఆమెకు నిజంగా వేయి ఏనుగుల బలం వచ్చినట్లే అయింది.

# 4

1931 నుంచి నాకు ఎనిమిది సంవత్సరాలు ఎడతెగని కళారాధనే. అననుభూతమైన సౌందర్యదీప్తిలో స్నాతుడనై ఆ సౌందర్యారాధనకే దేశాలు తిరిగాను. నా దేశంలో జరిగిన స్వాతంత్ర్య యుద్ధాన్నిగూర్చి మా సుబ్బులు నాకంతా చెప్పాడు. గ్రంథాలయాలకు పోయి 1930 మార్చి నుండి ప్రారంభమైన దండీ సత్యాగ్రహ లవణయాత్రనుగూర్చీ, దేశం అంతా అనేక లక్షల దేశభక్తులు ఈ స్వాతంత్ర్య సమరాగ్నిలో ఆహుతైన విషయమూ తెలుసుకున్నాను.

నా శకుంతల నన్ను విడిచిపోయిన దుఃఖంలో మునిగిపోయి, పశువునై నా చుట్టూ జరిగే మహాశాంతిసమరంలోని దివ్యసందేశము గ్రహించలేక పోయాను. 'ఎవ్వరీ మహాత్ముడు ?' అన్న ప్రశ్న అప్పుడు వేసుకున్నాను. నేను చదువుకునే రోజులలో మహాత్ముని గురించి నాకు తెలియకపోలేదు. అఖిల భారత జాతీయ మహాసభ ఉందనీ తెలుసును, ఖద్దరుసంగతీ ఎరుగుదును. నేను తొమ్మిదేళ్ళ బాలుడుగా ఉన్నరోజులలో గుంటూరు జిల్లాలో జరిగిన ప్రథమ సత్యాగ్రహ చరిత్ర పురాణగాథలా విన్నాను. ఉప్పుసత్యాగ్రహయుద్ధం అనేక రామాయణ భారతాదుల సంపుటి! భారతీయాంగనలు వేలకు వేలు జైళ్ళకు పోయారు, దెబ్బలు తిన్నారు, అవమానాలు పడ్డారు, ప్రాణాలు అర్పించారు. ఆ యుద్ధ చరిత్రలో ఆంధ్రదేశమూ ప్రశంసాపాత్రమైన పాలు పుచ్చుకుంది. నాదేశానికి స్వాతంత్ర్యం, నా దేశం తన తొల్లింటి ఔన్నత్య దశకు రావడం ఇవి నా సర్వజీవితమూ నిండిన ఆలోచనలు.

'సుబ్బులుబావా! నా శకుంతల నన్ను వీడిపోయింది. ఆ దేవిని నేను ఎప్పుడు కలుసుకోగలనో నాకు తెలియదు. ఆమెను కలుసుకోగలిగే పవిత్రత నేను సంపాదించుకోవాలి. పశువులా సంచరించిన నన్ను స్వామీజీ రక్షించాడు. ఇంక తరవాయి పని నాది. ఆరోజుల్లో నన్ను కంటికి రెప్పలా కాపాడిన, నిన్ను మరిచిపోలేనురా! ఇంక మా కొల్లిపర విషయాలూ, భట్టిప్రోలు విషయాలు సావకాశంగా చెప్పు' అని ద్వితీయ హిమాచల ప్రయాణారంభంలోనే అడిగాను.

'మీ మామగారూ, అత్తగారూ కొల్లిపరలో ఉండలేక, మీరు వెళ్ళిపోయినట్లే వెంటనే మదరాసు వెళ్ళిపోయారురా బావా! మీ అత్తగారికి చాలా జబ్బుచేసింది. వైద్యానికి మంచిదే అని చెన్నపట్నం చేరారు. అక్కడ వాళ్ళ చిన్నమ్మాయికి చదువు చెప్పించుకుంటూ ఉన్నారు. అక్కడే మైలాపురంలో ఒక చక్కనిమేడ కొనుక్కున్నారట!'

'నేను చెన్నపట్నం వెళ్ళలేను. మా మామగారిని అత్తగారినీ చూస్తే నేను ముక్కలయిపోతాననే భయం నన్ను వదలలేదురా!'

'అది నీయిష్టం. ఇంతకూ నువ్వేమి చేయదలచుకొన్నావు?'

'హరిద్వారంలో స్వామిదగ్గరగా ఉండి కొంతకాలం గడుపుతాను. ఇక్కడ రెండేళ్ళపాటు సంస్కృతం చదువుకొంటాను. బొమ్మల విషయం చూచుకొంటాను. భారతీయకళలకు సంస్కృత సాహిత్య మహాసముద్ర మథనం కొంత ఉండాలి. ఏమంటావు?'

'నీయిష్టంరా! కాని మధ్య మధ్య భట్టిప్రోలు రావా ఏమిటి? బందరూ అవీ వెళ్ళి వదినలను, వారి పిల్లలను, మీ బావగార్లను చూస్తూవుండు మరి.'

'అయ్యో రానాయేమిటి! ఏడాదికి ఒకసారైనా వస్తాను. అక్కయ్యల నిద్దరినీ చూడను మరి! వాళ్ళను, మా మేనకోడళ్ళను, మా మేనల్లుళ్ళను చూచి నూరు సంవత్సరా లయినట్లు ఉందిరా!'

'అత్తయ్యకూడా ఇక్కడే ఉంటుందా?'

'ఆ! ఇక్కడ నేనున్నంతకాలమూ ఉంటుంది. నేను ఎక్కడికైనా మా అమ్మ రాలేని ప్రదేశాలకు యాత్రలకు వెడితేమాత్రం, మా అమ్మను భట్టిప్రోలు పంపుతాను.'

మా హిమాలయయాత్ర పూర్తికాగానే మా సుబ్బులు వెళ్ళిపోయాడు. నేనూ రెండు సంవత్సరాలు హరిద్వారంలో సంస్కృతం దీక్షతో చదువుకున్నాను. పంచకావ్యాలూ లఘుకౌముదీ పూర్తిచేశాను. ఆ రెండు సంవత్సరాలలో ఒకసారి, మా పెద్దక్కగారి ఊరు బందరూ, మా చిన్నబావ ఉద్యోగం చేసే నరసరావుపేటా వెళ్ళాను. మా పెద్దబావగారు బందరులో వకీలు. నెలకు రెండు మూడు వందలు వృత్తిలో వస్తాయి. పొడుగ్గా వంగిపోయినట్లు ఉంటాడు. వారికి సాలుకు మూడు నాలుగు వేల రూపాయ లాదాయం వచ్చే వసతీ ఉంది.

మా పెద్దక్కగారి పేరు వెంకటరంగమ్మ. ఆమె కొంచెం పొడుగ్గా బలంగా ఉంటుంది. అచ్చంగా మా నాన్నగారిపోలిక. తన కుటుంబం, తన భర్త, తన చుట్టాలు తప్ప ఇంకోవిషయం ఏమీ తన కక్కరలేదు. ఆవిడకు ఆ ముప్పది ఒకటో సంవత్సరానికే ఆరుగురు సంతానము. ప్రథమ సంతానం ఒక కొడుకు. వా డిప్పుడు స్కూలు ఫైనలు పాసై ఇంటరు సీనియరు చదువుతున్నాడు. వాడు చక్కని గొంతుకతో సంగీతం పాడుతాడు. చక్కని బొమ్మలు వేస్తాడు. మేనమామపోలికే అని వాణ్ణందరూ అంటారు. వాడిపేరు విశ్వనాథం. వాడితర్వాత ఇద్దరాడపిల్లలు. పెద్దదానికి పెళ్ళి అయినది. దాన్ని గుడివాడ ఇచ్చారు. దానిపేరు సరోజిని. మా రెండో మేనకోడలు సరళకు శారదాశాసనం వస్తుందని తొమ్మిదవ ఏటనే మా బావ నేను కాశీలో ఉన్నరోజుల్లో పెళ్ళిచేశాడు. మా అమ్మ అప్పుడు బందరు పెళ్ళికి వెళ్ళి వచ్చింది. తర్వాత కొడుకు రామకృష్ణుడు, ఆ తర్వాత కూతురు శారద, ఆ తర్వాతా కూతురే. దానిపేరు లక్ష్మి అని పెట్టారు. అది పాలబిడ్డ. పిల్లలందరూ కడిగిన ముత్యాలులా ఉంటారు.

# విష్కంభము

## 1

హేమసుందరీదేవి త్యాగతి చరిత్ర ఇంతవరకూ చదివేసరికి తెల్లవారి పోయింది. ఒక్కొక్క భాగం, ఒక్కొక్క ప్రకరణం చదవడం, ఏదో ఆలోచనలో మునిగిపోవడం ఈరకంగా సాగింది ఆ బాలిక చదువు. లోకేశ్వరి ఆమె చదవడం చూచి, చూచి నిదురకూరింది. బాగా తెల్లవారగనే లోకేశ్వరికి మెలకువవచ్చి, చటుక్కున లేచి, క్రిందకు ఉరికి, "అయ్యో ఎంతపొద్దుపోయిందే హేమ్! నేను ఈవాళ చెప్పవలసిన పాఠాలు తయారు చేసుకోలేదు. స్నానం చెయ్యాలి. తలదువ్వుకోవాలి. అయ్యరుగారికి, ఫలహారాదులకు ఏమీ అందివ్వ లేదు. అమ్మ ఏమనుకుంటుందో?" అంటూ గదితలుపు తీసి పరుగెత్తింది. హేమసుందరి లోకేశ్వరి అన్నముక్కలే వినిపించుకోలేదు. ఆమె హృదయంలో కోటి ఆలోచనలు నిండిపోయాయి. ఒక మహాసభకు చేరిన మహాజనంలా ఆమె ఆలోచనలు మూగాయి. ఆ జనానికంతకూ ఉపన్యసించే ఉపన్యాసకునిలా ఒక్క విషయం మాత్రం అన్నింటికన్నా ముందుగా అడ్డం వస్తూన్నది. త్యాగతి తనబావ. ఇంతవరకు తాను ఫలానా అని చెప్పకుండా తన దగ్గిర అలా మెలగడానికి కారణం ఏమిటి? కారణం! కారణం! కారణం! రేపు అతన్ని ఏమని పలకరించగలదు? ఆతనితో ఎంతో మహత్తరమైన చరిత్రకూడా వస్తూఉన్నది. ఆ సుశీలతో సంబంధం కలిగించుకోవడం తన అక్కగారి దివ్యస్మృతికి అపశ్రుతి, ద్రోహం అర్పించాడా? ప్రేమ ఉత్కృష్టం అయితే, ప్రేమ నిధానం దుర్మరణానికి పాలయితే, అంత అధోగతిలోపడాలా ఏ వ్యక్తైనా? స్త్రీని అంత నీచంగా తన కాంక్షలు తీర్చే బజారు వస్తువుగా మాత్రం చూచాడు! అయితే ఆవెనక అతడు పడిన బాధ? తన ఆవేదనను౦చి ఆతడు పారిపోయిన మోసరు? స్వామీజీ ఆతనికి సందర్శనమీయకపోతే, ఆతనిగతి ఏమయి ఉండును! గంగానదిలో పడి ప్రాణం పోగొట్టుకొని ఉండును! ఆ దుఃఖంతో ఆతని తల్లీ ప్రాణం వదలేసి ఉండును.

ఏడాదికావచ్చింది ఇతడు తన జీవిత చరిత్రలో ప్రవేశించి! ఈతడంటే తనకున్న భావాలేమిటి? తన స్నేహితులలో స్నేహితురాండ్రలో త్యాగతే గొప్పవాడు. ఆతడు చిత్రకారుడనీ, శిల్పిఅనీ తాను బాగా ఎరుగును. కాని అత దెవరో తన తలితండ్రులకు మాత్రం పూర్తిగా తెలిసిఉండాలి. ఆమె తన స్నేహితులతో కూడి త్యాగరాజ నగరంలో ఉన్న ఆతని శిల్పశాలకు ఎన్ని సారులో వెళ్ళినమాట నిజమే! రెండు మూడు సార్లు త్యాగతి తల్లి తన అక్క అత్తగారులా వచ్చి తన్ను దగ్గరగా తీసుకోవటం తానేదోరకంగా అర్థంచేసుకుంది. ఆరోజుల్లో తన అక్క అత్తగారు తమ్ము చూడడానికి కొల్లిపరనుంచి వచ్చిందని తాను అనుకున్నది. ఆమె త్యాగతి తల్లి అని

ఎరుగదు. త్యాగతికి తల్లి ఉన్న సంగతే తనకు తెలియదు. లోకేశ్వరికి ఈ విషయం ఎప్పటినుంచి తెలుసును ?

ఎక్కడైనా ప్రపంచంలో, ఈ 1941 వ సంవత్సరంలో, ఒకడు తానెవరో తన మరదలకు తెలపకుండా ఉండగలడా ? ఇది కథ అనుకున్నాడా, సినిమా అనుకున్నాడా ? ఇందుకు తానేమి చెయ్యాలి ? తన అమ్మ నీరసపురాలు. ఎప్పుడూ జబ్బుతో మూలుగుతూ ఉండేది. తన అక్క శకుంతలాదేవి మాయమైపోవడంవల్లనే తన తల్లికి అలాంటి జబ్బుస్థితి సంభవించింది. అలాంటి జబ్బుమనిషి త్యాగతితో మాట్లాడుతూ బాగా తేరుకుంది. తల్లితండ్రులు కూడా తన కాతని గూర్చి చెప్పకుండా ఎల్లా ఉండగలిగారు ? తన ఒక్కదానికే ఈ విషయం తెలియకుండా ఉంచడంలో ఉద్దేశం ఏమిటి ? లోకేశ్వరికిగూడా తెలుసునా ? అందరూ తన్ను మోసం చేయదలచుకొన్న దానిలో అర్థం ఏమిటి ? తాను పరీక్ష పేసయింది 1940 సంవత్సరం ఏప్రిల్ నెలలో. ఈరోజు ఫిబ్రవరి 1941 వ సంవత్సరం. త్యాగతి తనకు ప్రథమ పరిచయం అయినది 1939 డిశంబరు 26 వ తారీకు. ఆ తారీకు తానెప్పుడూ మరిచిపోలేదు.

అడయారులో అఖండోత్సవం జరుగుతున్నది. దేశదేశాలనుండి ప్రతినిధులు, ప్రేక్షకులు వేలకువేలు వచ్చారు. ఆ రోజున రుక్మిణీ అరండేలుగారి నాట్య ప్రదర్శనం ! సాయంకాలం ఆరునుండి ఎనిమిదిన్నరవరకూ జరుగుతుంది. ఆ ప్రదర్శనం చూడడానికి ముందే పది రూపాయల టిక్కెట్లు కొనుక్కొని హేమసుందరి జట్టువారూ ఆమె తల్లిదండ్రులూ వచ్చారు. లోకేశ్వరీ వచ్చింది. లోకేశ్వరి అని పేరు హేమ పెట్టింది. ఆమె ప్రతి విషయం తెలుసుకోవాలని పుస్తకాలు తింటుందట. అందుకు లోకేశ్వరి అని హేమ పేరుపెట్టింది. ఆ పేరే అందరూ ఎరుగుదురు. అసలుపేరు వెంకటరత్నమ్మ. కల్పమూర్తి అసలుపేరు శ్రీనివాసరావు. కల్పించనన్నా కల్పించలేనివాడననీ, ఏ ప్రథమ రాతిమనిషి యుగానికో చెందినవాడననీ చెప్పి కల్పమూర్తి అని పేరుపెట్టింది హేమ. నిశాపతి అసలుపేరు జగపతిరావు. నల్లగా ఉండే మనుష్యుడు పట్టి 'నిశ' వంటివాడు కాబట్టి అతడు నిశాపతి అని హేమసుందరి నామకరణం చేసింది. తీర్థమిత్రుడి పేరు జానకిరామమూర్తి. అతని చిన్నతనంలో అతని తల్లిదండ్రులు యాత్రలు చేసేటప్పుడు తమ బాలుణ్ణి కూడా తీసుకువెళ్ళారని అతడు కోతలుకోస్తూ ఉంటే అతనికి తీర్థమిత్రా అని బిరుదునామం ఇచ్చింది కొంటెపిల్ల హేమ. అవే సార్థకనామాలయ్యాయి ! ఆరోజున సోఫీ, లోకేశ్వరి, ఈ ముగ్గురు పురుషస్నేహితులూ హేమ తలిదండ్రులతో అడయారుకు అయిదు గంటలకే వేంచేశారు. అక్కడ అడయారు కళాక్షేత్ర బాలబాలికలు రచించిన చిత్రలేఖానాలు ప్రదర్శించారు. ఆ ప్రదర్శనం చూద్దామని వీరంతా అక్కడికి వచ్చేసరికి వీరికి ఎదురుపడ్డాడొక పురుషమూర్తి.

ఆతడు అయిదడుగుల తొమ్మిదంగుళాలున్నాడు. బలసంపద గలవాడు. పొడుగాటి ఖద్దరు పట్టులాల్చీ తొడుగుకొని, ఖద్దరుపంచె కట్టుకొని, ఖద్దరు గుజరాతి టోపీ ధరించి, చక్కని చేతికఱ్ఱతో ప్రత్యక్షం అయ్యాడు. వీరిజట్టు చూడగానే, ఆతడు రెండంగలలో వీరి దగ్గరకు వచ్చి, వినాయకరావుగారికీ, ఆయన భార్యకూ వంగి పాదాలకు నమస్కరించాడు.

"ఓహో త్యాగతి శర్వరీభూషణుడా! ఎప్పుడు వచ్చావోయి, మనదేశాన్నుంచి?" అని వినాయకరావుగారు కళ్ళ నీళ్ళు తిరిగిపోతూ ఉండగా ఆతన్ని కౌగిలించుకొన్నాడు. కంటినీరు జల జల ప్రవహించిపోతూఉండగా "నాయనా! ఎన్నాళ్ళకు చూచామోయ్ నిన్ను! గుంటూరునుంచే వచ్చావా? అక్కడ మా మరదిగారు కులాసాగా ఉన్నారా? నా తండ్రీ! ఇన్నాళ్ళకా నువ్వు మమ్మల్ని చూడడానికి రావడం?" అని ప్రశ్నలు కురిపించింది హేమ తల్లి వెంకటరామరాజ్యలక్ష్మమ్మగారు. హేమసుందరీ, ఆమె స్నేహితులూ ఆ నూతన పురుషుని తెల్లబోతూ చూచారు.

## 2

వినాయకరావుగారు: "కన్ననాన్నా, ఈయన మనకు చాలా దగ్గర చుట్టం. చిన్నతనంలో మనదేశంవిడిచి ఉత్తరాదికి వెళ్ళిఉంటున్నారు. ఇప్పుడు మనదేశంలోనే ఉంటారు. చిత్రకారులు, శిల్పిన్నీ."

త్యాగతి శర్వరీభూషణుడు అలా నమస్కారంచేస్తూ నవ్వుతూ నిలుచుని ఉన్నాడు.

వినా: నీ చిన్నతనంలోనే మనయింటికి తరుచుగా వస్తూఉండేవారు.

హేమ: అవును! నేను ఆమధ్య రెండుమూడుసార్లు ఈయనపేరు ఆంధ్రపత్రికలో చదివాను. 'శిల్పకళ మళ్ళీ ఆంధ్రదేశంలో విజృంభించాలి' అనే వ్యాసం రాశారు. అదీకాకుండా 'పాశ్చాత్యశిల్పం' అనే నాలుగయిదు వ్యాసాలు భారతిలో ప్రచురించారు.

త్యాగతి: అవునమ్మా! నేనే ఆ వ్యాసాలు ప్రచురించింది.

కల్పమూర్తి: శిల్పం అంటే మీరు దేనితో చేస్తారండీ?

త్యాగతి: లోహం, పాలరాయీ, నల్లరాయీ, ప్లాష్టరు అన్నింటితోనూ చేస్తాను. ఈ ఊళ్ళో దారుశిల్పం నేర్చుకుందామని ఒకటి రెండు సంవత్సరాలు ఉండదలుచుకొన్నాను.

హేమ: అయ్యా త్యాగతిగారూ! నాకూ మిమ్మల్ని బాగా ఎరిగిఉన్న స్మృతి కలుగుతోంది.. కానీ ఎప్పుడో, ఏలాగో చెప్పలేకుండా ఉన్నాను.

త్యాగతి: నీకప్పుడు చాలా చిన్నతనం!

హేమ: మా స్నేహితులను మీకు ఎరుకపరచ అనుజ్ఞ ఇవ్వండి. మా నాన్నగారూ, అమ్మగారూ మీకు చిరపరిచితులేగదా! వీరు తీర్థమిత్రులు. అసలు

పేరు జానకిరామమూర్తి, మా సంఘంలో తీర్థమిత్రులు. ఈఊళ్ళో వీరికి జీవన్‌లాల్, దయాలాల్ కంపెనీలో ముఖ్య లెఖ్ఖదారుపని. వీరు కల్పమూర్తి గారు, నిరుద్యోగులు, పిల్లజమీందారులు. అసలుపేరు శ్రీనివాసరావు, మా సంఘంలో కల్పమూర్తి. వీరు నిశాపతిరావుగారు. అద్భుత గాయకులు, ఉత్తరాది సంప్రదాయంలో అబ్దుల్ కరీంగారితర్వాత వీరే. అసలు పేరు జగపతిరావు, మా పేరు నిశాపతిరావు...

త్యాగతి: జగపతిరావుగారు వీరేనా? వీరిపేరు ఉత్తరాదిని చాలా ప్రచారంలో ఉంది. ఉత్తరాదివారు వీరిపాటంటే చెవికోసుకుంటారు.

హేమ: అయితే ఎంతమందికి చెవులు లేవండి?

అందరూ పకపకా నవ్వినారు. త్యాగతి ఒక్కొక్కరికే నమస్కారం చేస్తూ కరస్పర్శనం చేశాడు.

హేమ: ఈమె సోఫీ! అచ్చమైన ఆంగ్లయువతి. ఈమె తండ్రితాతలనుంచీ ఇక్కడే ఎస్టేటులు కొనుక్కొని భారతీయ జమీందారులయ్యారు. ఈమె ఇంగ్లండులో పుట్టింది. ఇక్కడ వైద్య పట్టభద్రురాలు కాదలుచుకున్నది. సంపూర్ణనామం మిస్ సోఫియా విలియమ్స్. సర్ డబ్ల్యు. విలియమ్స్‌గారి ఏకైకపుత్రిక.

త్యాగ: నమస్కారం మిస్ సోఫీగారూ. క్షేమమా?

సోఫీ: మీరు క్షేమమా?

ఇద్దరూ కరస్పర్శ కావించుకొన్నారు.

హేమ: ఈమె మా లోకేశ్వరి. అసలుపేరు దూర్వాసుల వెంకటరత్నమ్మ గారు. బి. ఏ., ఇంటరులలో మేం ఇద్దరం సహపాఠులం. మా సంఘంలో ఈమెపేరు లోకేశ్వరి.

త్యాగ: నమస్కారం అండీ లోకేశ్వరిగారూ!

లోకే: నమస్కారం శర్వరీభూషణ్ గారూ.

హేమ: మీ రీ ప్రదర్శనం చూచారా?

త్యాగ: మూడుసారులు.

హేమ: మంచిబొమ్మలున్నాయా?

త్యాగ: ఉన్నాయి! బాలబాలికల బొమ్మలు వారి ఈడుకు తగినట్లేఉంటాయి. అందులో కొందరు నిజంగా అత్యుత్తమ కళావేత్తలు కాగల సూచనలు చూపించారు. రండి లోపలికి వెడదాము.

హేమకు ఆ నూత్నపురుషుణ్ణి చూడడంతోటే ఏదో అనిర్వచనీయమైన ఆనందం కలిగింది. కల్పమూర్తి ఈ కొత్తమనిషి చాలా పెద్దమనిషి, మంచి విజ్ఞాని అని అనుకున్నాడు. ఈయనకు ఇరవైఅయిదు సంవత్సరాల ఈడు ఉండ వచ్చును. ఈయన స్నేహపాత్రుడు అనుకున్నాడు. ఎవడుబాబూ వీడు! నియోగులలో త్యాగతి ఇంటిపేరు ఎవరికి ఉందీ? వీడు వట్టి డాబులరాయుడిలా

ఉన్నాడు. వీణ్ణి శాస్త్ర దూరంగానే ఉంచాలి అని అనుకున్నాడు తీర్థ
మిత్రుడు. వీడికి శాస్త్ర సంగీతం అంటే ఇష్టమేమో? అయినా మన సంగీతం
వినాలి. వీడి బడాయి కనుక్కోవాలి మనం! సరే మనకెందుకు ఎవడు ఎవ
డైతే నేమిటి? అని నిశాపతి తలపోసుకున్నాడు. సోఫీ త్యాగతిమోము ఒక
సారి తీక్ష్ణంగా చూచింది. ఇతడు పాశ్చాత్యదేశాలు చూచాడా? మనజట్టుకు
తగినవాడే. ఈయన శిల్పాలుచూసి, ఈతని తాహత్తు ఎంతో గ్రహించాలి
అని అనుకుంది.

లోకేశ్వరిమాత్రం త్యాగతి కళ్ళల్లో తన స్నేహితురాలిని ఆతడు
చూచిన పూజాశాంతులు చటుక్కున చూడగలిగింది. గంభీరమైన ఆతని
కంఠం ఎంతో మధురమైనది అనుకుంది. ఈతనికి భార్యాబిడ్డలున్నారా? అని
ప్రశ్నించుకొన్నది. ముసలాయన వినాయకరావుగారు అమ్మయ్యా, శాస్త్రయితే
అసలుపేరు చెప్పద్దునేమో! "అశ్వత్థామా హతః, కుంజరః!" అనే అబద్ధం
చెప్పడమా? కష్టమే! అనుకున్నాడు. నాతండ్రి శ్రీనాథమూర్తి! ఎంతఠీవిగా
ఉన్నాడు. నా కన్నతల్లి, నా బంగారుతల్లి, నాప్రాణం శకుంతల ఈతనితో
పిల్లలతో నడుస్తువచ్చునుగదా! అని ఆలోచించింది, హేమతల్లి. ఆ ఆలోచన
తట్టగానే, ఆమెకళ్ళనీరు గిఱ్ఱున తిరిగాయి. ఎవరికీ తెలియకుండా కొంగుతో
కన్నీళ్ళు తుడుచుకొంది.

వారందరూ లోనికి పోయినారు. హేమకు ఎందుకో పట్టలేని ఆనందం
కలిగింది. త్యాగతిని ఒక్క నిమిషం వదలలేదు. చక్కగా, మధురంగా,
గంభీరంగా మాట్లాడే ఆతని సంభాషణ వింటూ ప్రదర్శనచిత్రాలూ, వస్తు
వులూ చూచింది. ఆ మనిషిమూర్తి ఎత్తైన పర్వత శిఖర శీతలంగా, హాయిగా
ఉన్నది. చక్కని చామంతి అత్తరు పరిమళము ఆతని మూర్తిలోనుంచి ప్రస
రిస్తున్నది. ఆతనిలో ఏదో మహాశాంతి ఆమెకు తోచింది. ఆ తిరగడంలో
ఆమెకు కొంచెం ఆతనిచేయి తగిలినప్పుడు ఆమె కేదో వివశత్వం కలిగింది.

## 3

శ్రీమతి రుక్మిణీదేవిగారి నాట్యం తంజావూరులో విజృంభించిన ఆంధ్ర
సంప్రదాయనాట్యం. అలరింపు, జతి, తానవర్ణము, కొన్ని పదములు ఆమె
అభినయించినది. ఆ నాట్యంలో ఉండే అందాలు శిల్పదృష్టితో త్యాగతి
వర్ణించి హేమకు చెప్పాడు. "ఉత్తరాది నాట్యాలు అంతకన్న అంతకన్న
లాలిత్యంతాల్చి సంగీతంలా ఎక్కువ మధురమైపోయాయి. మా శిల్పశాస్త్రా
నికి నాట్యం నేర్చుకోడం చాలాముఖ్యం. ఆరునెలలు నేను కథక సంప్ర
దాయం నేర్చుకున్నాను" అని త్యాగతి ఆమెతో అన్నాడు.

"కథక్ అనీ, కథకళి అనీ, భరతనాట్యం అనీ, కూచిపూడి అనీ, మణి
పురం అనీ నాట్యానికి పేర్లుపెట్టారు. ఆ రకాలు చూచాను. అవి అల్లా

ఎందుకుండాలో నాకు తెలియదు. చెప్పేవారూ లేరు. నేను వారినీ, వీరినీ అడిగి తెలిసికోనూలేదు.''

"పేరులు ఎందుకువచ్చాయో, అవి ఎల్లా రూఢి అయ్యాయో, నేను కొంచెం తెలుసుకున్నానమ్మా! అన్ని విధానాలూ నేను బాగా అర్థంచేసుకున్నాను. ఈ పేరులన్నీ ఈమధ్యనే వచ్చాయి. అవి ప్రజలలో వాడుకలోనికి వచ్చి రూఢి అయిపోయాయి.''

హేమా, ఈ నూత్న పురుషుడూ అంత స్నేహంగా మాట్లాడుకోడం హేమ తలిదండ్రులకూ, సోఫీకి తప్ప ఇంకెవ్వరికీ యిష్టంలేకపోయింది. తీర్థమిత్రుడు మండిపోయాడు, నిశాపతి పళ్లు బిగించాడు, కల్పమూర్తికి గుండె నీరసించింది. హేమకు ఏ ఐ. సి. ఎస్‌. భర్తకావాలి అని లోకేశ్వరికి పెద్ద కోర్కె. ఎవరీ త్యాగతి? ఎక్కడనుండి దాపురించాడు అని ఆమెకు భయం అంకురించింది. హేమసుందరీ ద్వితీయుడై త్యాగతి రుక్మిణీదేవి నాట్యంలోని అందాలు చూస్తూ, హృదయం పరవళ్లెత్తగా తక్కిన సకలలోకమూ మరచిపోయాడు.

మహదానందం ఆతని హృదయంలో ప్రతిధ్వనిస్తుండగా, ఆ ప్రతిధ్వనికి హేమ హృదయం శ్రుతిగా దడదడ కొట్టుకుంటున్నది. ఎన్నడూ ఎప్పుడూ కలగని యవ్వనానందం ఆమెను అలిమివేసింది. ఆ ఆనందానికి రుక్మిణీదేవిగారి పాదతాళగతుల రూపము కల్పించినట్లా బాలకు తోచింది. రుక్మిణీదేవి భంగిములలో ఆనందసముద్రవీచికలరేఖలు కనబడినవి. రుక్మిణీదేవి హస్తాభినయంలో సృష్టిలోని సౌందర్యానికి వ్యాఖ్యానాలు గోచరించాయి. రుక్మిణీదేవి కన్నులు తిప్పటలో మానవజీవిత మహారహస్యాలు వర్తిస్తూ దృశ్యమైనవి.

హేమసుందరి ఇదివరకు రుక్మిణీదేవి నాట్యాలు ఎన్నిసారులో చూచింది. ఒక ఉత్తమాంగన నృత్యకళను అత్యంతప్రజ్ఞతో ఆరాధిస్తున్నది అన్న విషయం తప్ప ఆమెకు ఇంకోభావం ఇదివర కెప్పుడూ కలగలేదు. ఇప్పు డేవో అర్థాలు, ఏదో మహత్తరశిల్పం ఆమె బ్రతుకంతా నిండినట్లయినది. హేమ కిదివరకు సంగీతం నేర్చుకోవాలని దీక్ష కలుగలేదు. తండ్రిగారు శకుంతలకు నేర్పించి ఉండడంవల్ల ఈమెకు సంగీతము నేర్పించలేదు. ఆమె ఏ సంగీత సభలకూ వెళ్ళలేదు. రేడియోలో సంగీతం వస్తే ఏదో వినేది. నిశాపతి సంగీతంకూడా ఆమెకంత ఆనందం కలిగించలేదు. ఉత్తరాదిపాటలో గొప్పవాడైన తెలుగువాడు తనకు స్నేహితుడు అన్న బడాయిమాత్రమే ఆమెకు. తెరలువీడి ఎదుట ఒక పరమాద్భుత గాంధర్వలోకం ప్రత్యక్షమైనది.

నిశాపతి సంగీతమంతా ఆమె హృదయంలో మరల స్వనించినది. రుక్మిణీదేవి నాట్యానికి హంగుగా పాడే ఆ నాదస్వరమూ, వాయులీనమూ సర్వ మధురాలూ లయమై, జిడ్డులతో గట్లుపొర్లి ప్రవహించినట్లామెకు తోచినవి. తానెందు కిన్నాళ్ళూ సంగీతం నేర్చుకోలేదో! తానే కళలూ నేర్చుకోలేదు.

కవిత్వం నీరసమని తోసివేసింది. పత్రికలలో కథలూ, పద్యాలూ, పాటలూ, సాహిత్యవ్యాసాలూ, కళాప్రవచనాలూ ఎప్పుడూ చదివేదికాదు. ఎంతసేపూ రాజకీయాలు, దేవుడులేడనే వ్యాసాలు, శాస్త్రసంబంధ వ్యాసాలూ చదివేది. తెలుగుభాష చదువుకోమని లోకేశ్వరి పోరుపెట్టడంచేతా, ఎందుకు వచ్చాయో తెలుగుపేపర్లన్నిటికీ నూటికి ఎనభైపైన మార్కులు రావడంచేతా, ఆమె తెలుగు ఆనర్సు తీసుకుంది. ఆ ఆనర్సు పరీక్షకు సంబంధమైన తెలుగు మాత్రం ఆమె నేర్చుకుంది. అందులో మొదటితరగతేమిటి, విశ్వవిద్యాలయానికి మొదటగానే తాను కృతార్థురాలు కావచ్చును. ఆమెకు తెలుగన్నా, సంస్కృతమన్నా అభిమానం ఉండి ఆ విషయం చదవడం ప్రారంభించలేదు. కేవలం పరీక్ష కోసమే!

అలాంటిది నేడు, తెలుగు ఎంత మధురమైనది! తాను తెలుగులో ఎందుకు కవిత్వం చెప్పరాదు? సంస్కృతం దేవభాష. సంస్కృత సాహిత్యం సాహిత్యలోక పరమావధి, అనే ఆలోచనలు ఆమెను నిండిపోయాయి. భగవంతు ఉన్నాడు. ఆతడు పరమదయాస్వరూపుడు, ఆనందరూపుడు, సౌందర్యనిధి అనే భావాలు ఆమెపై జడివానలా వర్షించాయి. ఎవ్వరో ఇంకో వ్యక్తి తన్ను అలమి తనలో ఇంకిపోయి, తన సర్వస్వము నిండినట్లామెకు తోచింది. అప్రయత్నంగా ఆమె త్యాగతి భుజంమీద చేయివేసింది. త్యాగతి గజగజ వడకిపోయినాడు. ఆతనికి కళ్ళలో నీరు తిరిగినది. కదలక సాలభంజికలా నాట్యం చేస్తున్నట్లే నటించినాడు. ఆ విచిత్ర దినము హేమ ఎన్నడూ మరచిపోలేదు. త్యాగతిని ఎప్పుడూ రమ్మని కోరేది. ఆతనిచే పాఠాలుకూడా చెప్పించుకునేది. ఈనాడు త్యాగతికథ ఇంతవరకూ చదవగానే ఆమెకు భయమూ, సంతోషమూ అన్నీ ఒక్కమారే కలిగాయి.

హేమ త్వరగా స్నానాదికాలు నిర్వర్తించి, భోజనాల ఇంటిలోనికి వెళ్ళి రెండు ఇడ్డెన్లూ, పెసరట్టు ఒకటీ ఆరగించి, కాఫీతాగి తన స్వంత పరిచారికకు తాను పదిగంటలవరకూ ఎవ్వరికీ కనబడనని చెప్పి, తన చదువు గదిలోకి వెళ్ళిపోయింది. అక్కడ రేడియో పెట్టుకొని రికార్డుసంగీతం వింటూ మనస్సులోని ఆలోచనలు పరిపరివిధాలు పోతూఉండగా, త్యాగతికథ తీసింది. వెనకటి పేజీలు మళ్ళీ ఒకసారి తిరగవేసింది. చదవడం ప్రారంభించింది.

## సౌందర్యదీప్తి

మా చిన్నక్క మా అమ్మపోలిక. కొంచెం నాజూకైన అమ్మాయి. నాకన్న మూడు నాలుగేళ్ళుమాత్రం పెద్దదిలా కనబడుతుంది. వడవడ వాగుతుంది. పదిమందితో కలుపుకు తిరుగుతుంది. అందరికీ తల్లోనాలిక. అందరి వ్యాపారాలూ తనకే కావాలి, తన వ్యాపారాలందరికీ కావాలి. రహస్యం దాచుకోలేదు. భర్త తహశీల్‌దారుపని చేస్తున్నాడు. ఇంకేమీ! ఆవిడ

దర్జాకు ఏమీ లోటులేదు. మా చిన్నక్క పేరు అలివేలులక్ష్మి. ఆవిడకు ఇద్దరే బిడ్డలు. ఇద్దరూ కొడుకులే! కూతురుకోసం సరదాపడి ప్రతి అమ్మవారికీ మొక్కుకుంటుంది. మా పెద్దక్కయ్య రెండో కూతురును మా చిన్నక్కయ్య తెచ్చుకొని పెంచింది. ఆమె పెండ్లికి పీటలమీద బందరులో తానూ తనభర్త కోటేశ్వరరావుగారూ కూర్చున్నారు.

ఆమె ఇద్దరి కొడుకులలో పెద్దవాడు స్కూలుఫైనలు చదువుతున్నాడు. రెండవవాడు తర్డుఫారం చదువుకుంటున్నాడు. మా పెద్దబావగారైన కలప టపు మధుసూదనరావుగారు నేనంటే ప్రాణం ఇచ్చేవారు. మా చిన్నబావ దావులూరి కోటేశ్వరరావుగారు మాత్రం నాకు సర్వకాలం నీతులు బోధిం చడం, చివాట్లు పెట్టడం సాగించారు.

'ఒరే బావా! లక్కరాజువారి వంశానికీ, శేషాచలపతిగారి పేరుకూ అప్రతిష్ఠ తెస్తావేమిట్రా?' అని భోజనందగ్గిర నన్నడిగారాయన. మా చిన్నక్క సగ్రమని అందుకుంది.

'ఓహో! దావులూరివారి వంశానికి మీరు ప్రతిష్ఠ తెస్తున్నారుకాదూ! మావాడు లక్కరాజువారి వంశానికి తేకబోతే పరవాలేదు లెండి' అని ముగిం చింది.

'బాగుంది. తమ్ముడంటే ఎంత ఆపేక్ష అమ్మాయిగారికి! తమ్ముడికి నీమీద ఇంతేనా ఆపేక్ష ఉందీ? వెళ్ళి కాశీలో కూచుని, ఉత్తరాలులేక, అందరినీ ఏడిపించి కైలాసము గియలాసమూ తిరిగివచ్చాడు. బలేబలే.'

నేను నెమ్మదిగా ఆమాటలు మాన్పించి, 'బావా! నాగార్జునకొండ శిల్పాలు అంతకన్న ప్రభుత్వంవారు బాగా ఉంచలేరా ఏమిటి? ఆరోడ్డు బాగు చేయించకూడదా?' అని ఎత్తాను.

బావ: అది పల్నాడు తాలూకారా! పైగా ఆ శిల్పాలను బాగాఉంచే బాధ్యత అఖిల భారతీయ ప్రభుత్వంవారిది-గాని మాకేమీ సంబంధం లేదు.

నేను: బావా! నీ తాలూకాలో పూర్వకాలంనాటి విగ్రహాలు ఏవైనా అమ్మ కానికి ఉంటే చూద్దూ! పాతనాణేలుకూడా వదలకు.

బావ: ఒరే శ్రీనాథం! నీకు మొన్న కలకత్తా ప్రదర్శనంలో పదివేలు వచ్చాయిటగా?

నేను: డబ్బు సంపాదించడం ఎంతసేపు బావా! దేశానికి, జాతికీ సేవచేయాలి గాని!

బావ: గొప్ప మానవసేవకుడవు దొరికావు! నిన్నూ, నీ కుటుంబాన్ని పోషించు కొని, ఇతరులను బాధించకుండాఉంటే, అదే దేశసేవా, మానవసేవాను.

చిన్నక్క: కాస్తమాటంటే ఏవో పెడార్థాలు చేసుకుని ఉడుకుబోతుతనం పడతా రెందుకండీ?

బావ : నాకా ఉడుకుపోతుతనం, నీకా? నీతమ్ముడు చిన్నారిచిట్టి, బుల్లాల కూచీ అనుకున్నావా?

మా బావ పకపకా నవ్వాడు. మా చిన్నక్కకు చాలా కోపంవచ్చింది.

చిన్నక్క : ఎందుకండీ ఆ నవ్వు? మా తమ్ముడు వచ్చినప్పటినుంచీ చూస్తు న్నాను, వాణ్ణి ఒక్కరీతిగా దులిపిపోస్తున్నారు!

బావ : ఓసి నీవెఱ్ఱి కాలా! వాణ్ణి నే నేమంటున్నానే! నాకు మా బావమరిది గొప్ప చిత్రకారుడూ, శిల్పీ అంటే గర్వం లేదనుకున్నావా? కాని నా ఆపేక్షకొద్దీ నాలుగుముక్కలు సలహాచెప్పాను. నీకెందుకూ అంతకోపం?

ఇంతట్లో మాఅమ్మ గుమ్మం చాటుకువచ్చి, అల్లుళ్ళ ఎదుటపడి మాట్లాడే అలవాటు లేదుకాబట్టి, చాటునుండే 'అమ్మడూ! అల్లుడుగారుమాత్రం ఏమ న్నారు? ఒక్కడే బావమరది అవడంచేత, ఏదో సంసారం నిలబెట్టమనీ, దేశాలుపట్టి పోవద్దనీ చెప్పారు. అంతకన్న వారేమన్నారు?' అన్నది.

ఓహ్హోహో శ్రుతిమించి రాగాన్ని పడుతోంది అని ఆలోచించుకుని 'బావా నీవు చెప్పిన మాటలూ బాగున్నాయి! అక్కఅన్న మాటల్లోనూ తప్పులేదు. అమ్మా బాగానే చెప్పింది. నేను స్వామిజీని నమ్ముకున్నాను. వారు ఏలా నాకు సలహా ఇస్తే అల్లా చేస్తాను. మీరెవ్వరూ ఏమీ దిగుళ్ళు పెట్టుకోవద్దు' అన్నాను.

బందరు వెళ్ళినప్పుడూ ఇల్లాగే వచ్చింది సంభాషణ. మా పెద్దబావ నేను వెళ్ళినరాత్రే, నన్ను తన ఆఫీసుగదిలోకి పిలిచి 'ఒరే శ్రీనాథం! ఏమిటి నీ ఉద్దేశం? పోయినవాళ్ళను బ్రతికించుకోలేము. శకుంతల అచ్చంగా దేవతే! నువ్వు మళ్ళీ ఒక ఇంటివాడవైతే, ఆదేవి ఎంతైనా ఆనందంపడుతుంది. నువ్వు మళ్ళీ హరిద్వారం అత్తగారితో కలిసి వెళతానంటున్నావు. ఆస్తి అంతా కంగాళీచేసి వదిలావు. మీ పెద్దక్కకు నువ్వు రాసినభూమి, ఏమీ పుచ్చుకోను పొమ్మంది. నువ్వు ఏమనుకున్నావో ఏమోకాని, నువ్వు అల్లా పత్రంరాసి రిజి స్టరీ పంపించిన మర్నాడునుంచీ నెలలు, నెలలు తలుచుకొని ఏడుస్తూఉండేది. నువ్వూ అత్తగారూ వచ్చినదగ్గిరనుంచి కాస్త ఆమాత్రంగా ఉంది. మా మర దలూ, తోడల్లుడూ విషయం నేను చెప్పలేనుగాని, నీ ఆస్తిలో మీ పెద్దక్కకు సంబంధించినంతమట్టుకు ఒక్క సెంటుభూమి ముట్టుకోదు. ఆ మాటతెచ్చావా మళ్ళీ మూర్ఛలూ, హిస్టీరియా ప్రారంభం అవుతాయి' అని కొంచెం సన్న సన్నగా చివాట్లు పెట్టాడు.

"పెద్దబావా! నరసారావు పేటలో మా చిన్నక్కా, చిన్నబావాకూడా నన్ను చివాట్లుపెట్టి వదిలారు. మనం సావకాశంగా కూర్చుని మాట్లాడుదాం బావా! నువ్వు వకీలువు, నీ సలహా నాకు పూర్తిగా కావాలి" అన్నాను.

బందరులో ఉన్నరోజులలో కృష్ణాపత్రికకు వెడుతూ, కృష్ణరావుగారితో మాట్లాడుతూ ఉండేవాడిని. ఆయన భారతీయ శిల్పాన్నిగురించి నాకు పందు

ఒలిచినట్లు చెప్పారు. రోజూ వారి పత్రికలో దర్బారు జరుగుతూవుండేది. వారు గాంధీతత్వాన్నిగూర్చి, శంకరవేదాంతము, అరవిందవేదాంతము సమన్వయంచేసి వెండిపళ్ళెంలో మల్లెపూవులు పేర్చినట్లు చెప్పారు. ఆయనా జైలుకు వెళ్ళివచ్చారు. బంగారంఛాయ, బలమైన స్థూలకాయం, విశాలమైన కాటుకకళ్ళు, గరుడనాసిక, గంభీరమైన ఫాలము, కోర తలపాగా, యవ్వనుని ఉత్సాహమూ, మహాఋషికున్న జ్ఞానమూ, దేశభక్తీ ఆంధ్రులలో మకుటాయమానమైన మనిషి. సభలలో మాట్లాడరు. మాట్లాడితే గోముఖసంభవ దివ్యగంగాఝరీవేగమే! విడిగా స్నేహితులందరూ కూడిన సాయంకాలంలో చిన్నబిడ్డవలె అల్లరీ చేయగలరు, యువకునిలా ఉత్సాహమూ ప్రకాశింపచేస్తారు, మానససరోవరనీలజలస్నిగ్ధత, కైలాస పవిత్రపర్వతమహోన్నతి తమ మాటలలో చూపిస్తారు. ఆయన కృష్ణాపత్రికలోని సంపాదకీయవ్యాసాలు ఆంధ్రదేశానికి భాష నేర్పాయి. నవ్యసాహిత్యపరులకు దారి చూపించాయి. వారి సభలో, కైలాసము, త్రివిష్టపం, ఆయా దేశాల కళలు, ఆచారాలూ, సంస్కృతి అన్నీ మనవిచేశాను. ఇవన్నీ రెండు మూడు వ్యాసాలుగా వ్రాసి తమ పత్రికకిమ్మని వారు నన్ను కోరారు. అది ఆజ్ఞగా శిరసావహించాను.

## 6

కృష్ణాపత్రిక ఆఫీసులోనే పట్టాభి సీతారామయ్యగారిని దర్శించాను. మేధాసంపన్నత్వంలో కుబేరవైభవానికే అప్పిచ్చే అఖిల భారతీయ ప్రఖ్యాత పురుషు డీయన. ఈయన జ్ఞాపకశక్తి ఒక పరమాద్భుత సంఘటన. చిన్నతనాన నుండి ఆయన తెలుసుకున్న రాజకీయవిషయాలు, తేదీలూ పేరులతోసహా జ్ఞాపకం. ఏ విషయమైనా హృదయానికి హత్తుకునేటట్లు చెప్పగలరు. కాని మన సంభాషణ ఆయనకు చప్పగా ఉంటుంది. అడిగే ప్రశ్నలూ చప్పగా ఉంటాయి. అందుచేత ఆయనే సంభాషణ ఎత్తుకునేటట్లు చేయాలి. అంత మేధ ఉండడంచేత, ఆయనకి హృదయం లేదని అపవాదు వేస్తారు. మహాత్మునకు హృదయం లేదంటే ఎంతో ఆయనకు లేదన్నా అంతే. ఇంటిదగ్గిర ఆయన చిన్నబిడ్డలతో ఆడుకొంటూంటే చూచిన నాకు కళ్ళనీళ్ళు చెమరించాయి.

సన్నగా శలాకులా ఆరోగ్యంగా అయిదడుగుల ఆరంగుళాలుంటారు. నెరసిన జుట్టు, మధ్య బట్టతల. నాయకుల మాటలు చేష్టలు ఆయన అభినయిస్తే, అసలు వారినే మూడుమూర్తులా ప్రత్యక్షం చేస్తారు. వైద్యులలో చక్రవర్తి అయినా, న్యాయశాస్త్ర విషయంవస్తే న్యాయవాదులకే పాఠాలు నేర్పుతారు. ఆంధ్రదేశంలో నాయకులైన కోలవెన్ను రామకోటీశ్వరరావుగారిని, కొండా వెంకటప్పయ్యపంతులుగారిని, గొల్లపూడి సీతారామశాస్త్రిగారిని, బులుసు సాంబమూర్తిగారిని, ప్రకాశంగారిని, బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారిని కలుసుకున్నాను. మాట్లాడాను.

ప్రసిద్ధకవులైన వెంకటశాస్త్రిగారిని, కృష్ణమూర్తిశాస్త్రులుగారిని, చిలకమర్తివారినీ, వడ్డాదివారినీ, భాషావేత్తలయిన గిడుగు రామమూర్తిపంతులుగారిని, నవకవులలో ఉద్దండులైన రాయప్రోలు సుబ్బారావుగారినీ, శివశంకరశాస్త్రి గారినీ, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారినీ, విశ్వనాథ సత్యనారాయణగారినీ, నండూరి సుబ్బారావుగారినీ, వేదుల సత్యనారాయణశాస్త్రిగారినీ, కథకచక్రవర్తి మునిమాణిక్యం నరసింహారావుగారినీ, మహాకవి చింతా దీక్షితులు గారినీ, హాస్యరస సామ్రాట్టు మొక్కపాటి నరసింహశాస్త్రిగారినీ, నోరి నరసింహశాస్త్రిగారినీ కలుసుకొని హృదయమార మాట్లాడినాను.

కాటూరి వెంకటేశ్వరరావుగారు మహోత్తమ ప్రౌఢకవి. ఆయనకవ పింగళి లక్ష్మీకాంతంగారు మధురకవిమూర్తి. వీరిద్దరిజంటా జయవిజయుల వంటి జంటే.

దేవులపల్లివారిని కాకినాడలో కలుసుకున్నాను. కబ్జివాణ్ణయినా నన్ను ఎంతో గౌరవంచేసి ప్రేమతో నింపారు. ఆయన ప్రపంచంలో సర్వసౌందర్యాలూ పూజించే సౌందర్యకవి. ఆయన జీవితమే సౌందర్యం. గుంటూరులో వేదుల సత్యనారాయణశాస్త్రిగారిని కలుసుకున్నాను. ఆయన కవిత్వం అమృత ప్రవాహం. అప్పుడే మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారిని కలుసుకున్నాను. ఆయన కవిత్వం గంగాప్రవాహమే. నేను కొల్లిపర వెళ్ళలేదుగాని రేపల్లె వెళ్ళి నోరి నరసింహశాస్త్రిగారిని కలుసుకొని మాట్లాడాను. ఆయనకవిత్వం మిశ్రమపాకం. నన్ను తమ్మునిలా హృదయాని కద్దుకున్నారు. ఏలూరువెళ్ళి నండూరి సుబ్బారావుగారిని కలుసుకున్నాను. వకీలువృత్తిలో సంపూర్ణంగా దిగిపోయి, సాహిత్యసేవ తగ్గిస్తున్నాడాయన. ఆయన ఎంకిపాటలు ఎవరో గంధర్వాంగన పాడినట్లే పాడి, నాకు వినిపించారు. ఆయన పాటలు నాకు వివశత్వం కలిగించాయి. ఎంతో మహోన్నతభావాలు. నాయికా నాయకులు జానపదులు. ఎంకి ఒక దేవతే! వారింటిదగ్గరే నండూరి సుబ్బారావుగారి వేలువిడిచిన అన్నగారు భావరాజు సుబ్బారావుగారిని కలుసుకున్నాను. ఆయన కొవ్వూరు సంస్కృతపాఠశాలా కులపతిత్వం వదలి సత్యాగ్రహంచేసి జైలుకు వెళ్ళివచ్చారు. ఆయన మహాపండితుడు, ఉత్తమకవి. నాకు కవిత్వాన్ని గురించి, శిల్పకళను గురించీ ఎన్నో మహత్తర విషయాలు బోధించారు.

విశ్వనాథ సత్యనారాయణగారు మహాకవి శిరోభూషణుడు. ఆయన ప్రతిభ శాంతమహాసముద్రంవంటిది. ఆయనధార శివసముద్ర కావేరీజలపాతం వంటిది. ఆయన మహాకావ్యాలను సృష్టించగలరని నేనాశించాను. గుంటూరులో తల్లావఝులవారిని దర్శించాను. ఆంధ్రదేశంలో కవుల నందరినీ ఒక సంస్థగా చేయాలని ఆయన ప్రయత్నం. ఆయన సకలభాషావేత్త, మహాపండితుడు, అఖండకవి. ఆయన్ని చూస్తేనే కవిత్వం ఉద్భవిస్తుంది. ఆయన శిల్పమూ నేర్చుకున్నారు. రామిరెడ్డిగారిని, బసవరాజు అప్పారావుగారినీ కలుసు న్నాను. బసవరాజువారు ఒక మహాసంస్థ. ఆయన అతి తీయగా పాడగలడు. కు ఆయన

పాటలు సర్వవిధాలా క్షేత్రయ్యను జ్ఞాపకంచేస్తాయి. రామిరెడ్డిగారి కవిత్వం తీయటిధార. అద్వితీయప్రతిభ. ఆయన బాణి ఆనందవాణే! ఈయన్ను చూచి శ్రీకృష్ణదేవరాయుణ్ణి తలుచుకున్నాను.

ఈ కవులతర్వాత నాకు ఎక్కువ సన్నిహితం అయినవారు కురుగంటి సీతారామయ్యాగారు. ఈయన తంజావూరులో పూడిపోయిన ఆంధ్ర కావ్య మహాసంస్కృతిని బయటకు తీస్తున్నారు. వీరి పాండిత్యము అప్రతిమానము. వీరితో ఉజ్జీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు. ఆయన స్నేహంలో చిన్నబాలుడు. వీరు ఎన్నో మహత్తరగ్రంథాలు తెలుగులోనికి అనువదించారు. వీరిద్దరూ రెండు హిమాలయ శృంగాలు.

ఆరోజుల్లోనే బందరు ఏదో కారణంవల్ల వచ్చిన వేటూరి ప్రభాకరశాస్త్రి గారిని దర్శించాను. ఆయన మహాకవే, ఉద్దండపండితుడే. అంతకన్న ఆయన లోని ఏదోశక్తి ఆయన్ను అపరనాగార్జునాచార్యునిలా కనిపింపచేసింది. నా కథంతా ఆయనకు నివేదించాలని ఏదో ఆవేదనకలిగి మనవిచేశాను. ఆయన 'నాయనా! నీ శకుంతలను నువ్వు ఇంకోరూపంలో కలుసుకుంటావు. ఏమీ సందేహంలేదు! మీ గురువుగారు చెప్పిన మాటలన్నీ నిజం' అన్నారు.

గుంటూరులో శారదానికేతనం అని బాలికా జాతీయ విద్యాలయం ఒకటి ఉంది. అది స్థాపనచేసినవారు పురాణ దంపతులైన లక్ష్మీనారాయణులవంటి లక్ష్మీనారాయణులు. ఉన్నవ లక్ష్మీబాయమ్మగారూ, వారి భర్త ఉన్నవ లక్ష్మీనారాయణగారున్ను ఈ ఉత్తమ విద్యాలయం స్థాపించారు. లక్ష్మీనారాయణగారు బారిస్టరు. గాంధీమహాత్ముని సత్యాగ్రహ సమరంలో వృత్తిమాని జైలుకువెళ్ళి, జైలులో మాలపల్లి అనే నవల వ్రాశారు. ఆ నవల తెలుగునవలాచరిత్రలో రెండవయుగానికి గోపురద్వారం. ఆయన ఎన్నో జానపదగీతాలు పోగుచేశారు. తీయని నుడికారంతో పాటలల్లుతారు.

ఆంధ్రదేశచరిత్రకున్న తెరలన్నీ తొలగించి తీయని భాషలో సమగ్ర చరిత్ర ఇచ్చిన చరిత్రచతురానన చిలుకూరివారినీ; సుందరమూర్తీ, ప్రతిభాశాలి, నవనీతహృదయుడు మల్లంపల్లివారినీ; నిశితబుద్ధిశాలి, దూరదృష్టి గల నేలటూరి వెంకట రమణయ్యాగారినీ; కాలం తెరలు బలవంతంగా లాగిపారవేసే ధృతముష్టి భావోర్వగి భావరాజు కృష్ణారావుగారిని కలుసుకున్నాను. శిల్పికి వెనకాలబలం కవిత్వమూ, సంగీతమూ, నాట్యమూ, చరిత్ర, భారతీయ సంస్కృతీ అవడంవల్ల ఈ మహామహుల కలిసికొన్నాను. ఇంక చూడవలసింది ఆంధ్ర గాయకులను, చిత్రకారులను, శిల్పులనూ.

## 7

ఆంధ్ర సంగీత పాఠకులలో పేరెన్నికగన్నవారు వాగ్గేయకారరత్న హరి నాగభూషణంగారు. ఆయన వాయులీనవాద్యము ఆనందవీచి. కంఠము మధ్యమశ్రుతిస్వరూపం. ఆయన సనాతనాచారి, గాంధీశిష్యుడు. సంగీతం

విద్యగాని కళకాదంటారు. అన్ని కళలూ జగత్కళ్యాణానికి ఉపయోగిస్తే విద్య లవుతాయి. తుచ్ఛానందంకోసం అయితే, వట్టి హీనకళలౌతాయి. కళ అన్నంతమాత్రంలో హీనమనే అర్థంలేదు. 'కల్యత ఇతి కళా' అనికదా!

సంగీతంలో అపరత్యాగరాజు. నాగభూషణంగారు భక్తుడే. కాని ఆవేశి. కొంచెం కోపం. ఆ కోపమే లేకపోతే మూడుమూర్తులా త్యాగబ్రహ్మ అని చెప్పతగిన గాయకుడు. ఆయనపాట వింటూ సర్వమూ మరచిపోయి పరవశత్వంతో కరిగిపోయినాను. ఏ దివ్యామృతమో నన్ను ముంచెత్తింది.

గాయకసార్వభౌమ పారుపల్లి రామకృష్ణయ్యగారు నిజంగా సార్వభౌముడే. ఆయనను వింటేనే కంఠంలో సంగీతదేవి ఆవిర్భవిస్తుంది. వీరితో పాటు వారణాశి బ్రహ్మయ్యగారు, బలరామయ్యగారు సంగీత కళానిధులు. వీరికి నారద తుంబురులు అని పేరు పెట్టుకొన్నాను. యువకుడైన ద్రోవి సత్యనారాయణగారు గానావేశి. ఈయన స్వరావతారమే!

బందరులో కోటయ్యగారనే గానతపస్వి ఉండేవారు. ఆయన కుమారులిద్దరూ చాలా పేరు పొందారు. ఆరోజుల్లోనే తుమురాడ సంగమేశ్వరశాస్త్రి గారి సంగీతం విన్నాను. వీరు అపర సరస్వతీదేవి అవతారమే. ఆయన వీణతోనే ఉద్భవించారా? ఏమి ఆ పరమాద్భుతగానం! ఏ రాగమైనా, ఏ తానవర్ణమైనా, వేదాలైనా సర్వమూ దివ్యరూపంతో ప్రత్యక్షమాయన అంగుళీ తంత్రీ సంయోగంవల్ల.

విజయనగరంలో ద్వారం వెంకటస్వామి నాయుడుగారి ఫిడేలు విన్నాను. ఫిడేలు భారతీవాద్యంకాదు. కాని ముత్తుస్వామి దీక్షితుల కాలంనుండి వాయులీనం భారతీయమైపోయింది. నా కాలేజిదినాలలో గోవిందస్వామిపిళ్ళై గారి వాయులీనం విని ఆశ్చర్యం పొందాను. నేను వెంకటస్వామి నాయుడు గారి పాట విని గంధర్వలోకం ప్రత్యక్షం చేసుకొన్నాను.

సంగీతం ప్రథమంలో జీవితానికి ప్రత్యక్షం అయినప్పుడు మనలోని కల్మషాలన్నీ పైకి ఉబికివస్తాయి. అప్పుడు మనుష్యుడు పశువు. అతనిలోని ఆహార నిద్రాభయమైథునప్రకృతులు శతసహస్రబలంతో విజృంభిస్తాయి. ఆ స్థితిలోనే అనేకులు అధోగతిపాలైపోయారు. ఈ సత్యం అన్ని కళలకూ వర్తిస్తుంది. నాటక ప్రదర్శనంలో కళలన్నీ ప్రాథమిక స్థితిలో ఉండడం చేత కళావేత్తలందరూ పశువులలానే వర్తిస్తారు. అందుకనే సినిమాలలో కూడ నీతీ నియమాలు ఉండవు. ఈ ప్రాథమిక స్థితి దాటిన కళావేత్త స్వచ్ఛభూములలో అడుగులిడతాడు. అప్పు డాతడు ఉన్నత హిమాలయ పథాలలోనే విహరిస్తాడు. ఈ ఆలోచనలతో మా అమ్మగారితో బయలుదేరి హరిద్వారం కైలాసాశ్రమానికి వచ్చాను. మా అక్కగా రిద్దరూ నా ఆస్థి స్వీకరించుమని స్పష్టంగా తేల్చివేశారు. ఈ సంగతులన్నీ స్వామీజీతో మనవి చేసి వారి సలహా అడిగాను.

'నాయనా! ధనం నీకు బరువుగా ఉంటే మీ అక్కగారి దగ్గర కూడా బలవంతంగా ఇవ్వడం ఎందుకు? గర్భదారిద్ర్యంతో క్రుంగిపోతూ ఉన్న కోట్లకొలది భారతీయులు లేరా? వారికి ఉపయోగించే సంస్థ ఒకదాన్ని నిర్మించరాదా?'

'స్వామిజీ! మాబోటి యువకులలో కొన్ని భావాలున్నాయి. అవి కొన్ని తమకు మనవిచేసి ఉన్నాను. భరతదేశం సర్వవిధాలా ఉత్తమస్థితికి పోవాలంటే, బీదలకు నల్లమందు మత్తునిచ్చే ధర్మసంస్థలు మానివెయ్యాలి. వారందరినీ ముష్టి మాన్పించి, వారికి చదువులో, కృషిలో పెద్దకులాలవారితో బాటు సమంగా విద్యాసముపార్జనము, ఆర్థికస్థితి ఉండేటట్లు చెయ్యాలి అని. అన్నదాన సమాజాలు, వస్త్రదాన సమాజాలు, బీదల సహాయసంస్థలు అన్నీ నల్లమందుదానాలు. బీదవారు జీవిత సమస్యలను ఎదుర్కొనే కర్మవీరులు కాకుండా అడ్డం వస్తూ ఉన్నవి. ప్రపంచంలోకల్లా మహోత్తమదేశం కావలసిన చీన ఏలా నిజమైన నల్లమందువల్ల హీనదేశమైందో, అలా భరతదేశం ధర్మం అనే నల్లమందు ఎక్కువ ఆరగిస్తోంది. అల్లాగే బీదవారూనూ. బీదవారు ధనసంపాదకమైన పెట్టుబడిసొమ్ముగా ఈ ధర్మాన్ని చేసుకున్నారు. అదే భారతభూమి అధోగతికి కారణం అని మా నమ్మకం.

'అబ్బాయీ! నీవాదన అంతా నా కర్థం అయింది. కాని తన కాయశక్తిలా పనిచేస్తూ కుటుంబపోషణ చేసుకుంటూ ఉన్న ఒక సంసారి నాశనం అయ్యాడు. అతనికి సహాయంచేసే సంస్థ ఒకటి ఉండాలికదా! సరియైన సమయానికి సహాయం లభిస్తే అతడు అందుకుపోతాడు. లేకపోతే నాశనమేకద! చాలా బీదవాళ్లు చదువుకునేందుకు సర్వవిధాలా సహాయంచేసే సంస్థకావాలి. అదీకాక అన్నదాన సమాజాలు, విద్యాదాన వస్త్రదాన సమాజాలు, నల్లమందు ఇంజెక్షను ఇచ్చేవికావు. ఇచ్చేదాత సదుద్దేశంతో చేస్తున్నాడు. అదీకాక అన్నదానం పుచ్చుకున్న బీదవాడు మానవాభ్యుదయయుద్ధం చేయడానికి బ్రతికి ఉంటాడు. సదుద్దేశపూర్వకమైన ప్రతిపనీ మానవకళ్యాణానికి సోపానం అవుతుంది. నువ్వు వాదించేది కమ్యూనిష్టువాదన. కమ్యూనిష్టులుకోరే సర్వప్రజాసమరాజ్యస్థితి రావాలంటే, ఆ రాజ్యం తీసుకురాగలిగే వీరుళ్ళుంటే గదా! ఒక విద్యాసంస్థ బీదవారికే చదువుచెప్తోంది అనుకో. ఆ బీదవారు కూడా, దేశహీనస్థితి పోవాలని కృషిసల్పే విద్యావేత్తలలో చేరుతారుకదా! అదీకాక వారి విద్యావేత్తృతలో తమ ఇదివరకు బీదస్థితి స్మృతి బలప్రదాన శక్తిగా కలిసిపోయి వారిని మరింత ఉత్తమవీరులుగా చేయకలుగుతుందికదా!'

## 8

నా శిల్పదీక్షకు సర్వతోముఖమైన శక్తి తెచ్చుకోవాలి కాబట్టి చీనా, జావా మొదలైన మంగోలుజాతుల దేశాలు; పెరిషియా, టర్కీ మొదలయిన సిధియనుజాతి దేశాలు; కకేషియనుజాతి యూరోపుదేశాలు; అమెరికాదేశమూ

చూచిరావాలని సంకల్పంచేసుకొని స్వామిజీ సలహా అడిగాను. స్వామిజీ అత్యంత సంతోషంతో అనుమతి ఇచ్చారు. అందుకు ప్రయత్నాలు ప్రారంభించాను. స్వామిజీ సహాయంవల్ల నేను బర్మా, జావా, బలిద్వీపము చూడడానికి ప్రభుత్వంవారు యాత్రాపత్రికలు (పాస్‌పోర్ట్సు) ఇచ్చారు. డచ్చి ప్రభుత్వంవారు, ఫ్రెంచి ప్రభుత్వంవారు అనుమతిపత్రాలు (విసాలు) ఇచ్చారు.

1934 సంవత్సరం మార్చి నెలలో నేను కలకత్తాలో ఓడయెక్కి రంగూనులో దిగాను. రంగూనులో ఒక అరవ హోటలులో మకాంపెట్టి నగరం అంతా తిరిగాను. అక్కడ లక్కపనిచేసే కార్ఖానాలు, దారుశిల్పాలుచేసే కార్ఖానాలు చూచాను. అక్కడ పనివాళ్ళకు కొంతధనం బహుమతిగా ఇచ్చి, ఆ పని నేర్చుకున్నాను. తెల్లటి పాలరాతితో రంగూనులో చక్కటి బుద్ధవిగ్రహాలు చెక్కుతారు. ఇత్తడి, రాగి పాళ్ళు ఎక్కువఉన్న కంచుతో విగ్రహాలు పోతపోస్తారు.

ప్రాచ్యమైన ఆర్యశిల్పానికీ, మంగోలియను శిల్పానికీ చాలా తేడా లున్నాయి. ప్రపంచంలో సృష్టి అయిన వస్తువులన్నీ మూడు ముఖ్యజాతులుగా ఉంటాయని నా వాదన. సత్వ, రజస్, తమోగుణావృతాలయిన వా మూడు జాతులు. లోహంలో బంగారం, వెండి, ప్లాటినమ్ మొదలయినవి సత్వగుణ భూయిష్టాలు. రాగి, మాంగనీసు మొదలైనవి రజోగుణ సంభవాలు. ఇనుము, సత్తు, సీసం మొదలైనవి తమోగుణజాలు. అలాగే జంతువులలో ఆవు, ఏనుగు, లేడి,గుఱ్ఱము సత్వగుణంలోంచి ఉద్భవిస్తే, సింహం, పులి, తోడేలు రజోగుణంలో నుంచీ; ఎనుము, గాడిద, ఎలుగు మొదలైనవి తమోగుణంలోనుంచీ ఉద్భవించాయి. మనుష్యులలో తెల్లజాతివారు సత్వగుణంలోనుంచీ,రంగులజాతివారు రజోగుణంలోనుంచీ, నల్లజాతులు తమోగుణంలోనుంచీ ఉద్భవించారని నా ఉద్దేశం. ఆయా జాతులలో మళ్ళీ మూడేసి అంతర్జాతులు వచ్చాయని, వీనిలోవీనికి కలయికలు కలిగాయని నా దృఢనమ్మకం. మంగోలియను జాతులవారు రహస్యాచార వర్తనులు. మతంలో వారికి గోప్యతాంత్రిక కర్మకలాపం బహుఇష్టము. వారి కళలలోనూ ఈ ఛాయలూ తచ్ఛాయాజనితమైన అలంకారశిల్పమూ ఉంటుంది. వారి బుద్ధుడు అవతారమూర్తియైన శాక్యసింహుడుమాత్రంకాక, లక్షల చేతులు కలిగిన మహాబుద్ధుడు. నేపాలులో, త్రివిష్టపంలో, బర్మాలో, కాంబోడియాలో, జపాను, చీనాలలో ఈ విచిత్రశిల్పం ప్రత్యక్షమాతుంది. బర్మావారికి స్పష్టమై గాఢమైనరంగులు ఇష్టం. గులాబి, పసిమిరంగులు వారికి ఎక్కువ ఆనందం కలుగజేస్తాయి.

బెంగాలువారిలో ఆర్య, నీగ్రో, మంగోలియను రక్తాలు మిశ్రమం అయ్యాయి. అందుకనే బెంగాలువారి రంగులు, రేఖలు, ఆచారాలు శాక్తేయంగా, తాంత్రికంగా ఉంటాయి. బెంగాలువారికి శోకరసం ఎక్కువ ఆనందం ఇస్తుంది. ఈ ఛాయలన్నీ బర్మాలో ప్రత్యక్షం అవుతాయి. బర్మాలోని అలంకారశిల్పం అత్యంతమై, అసలు భావాన్ని ఒకొక్కప్పుడు దిగ

మింగుతూఉంటుంది. దారుశిల్పమూ, వెండినగిషీపని బర్మావారికి బహు ఇష్టం. రంగూను అంతకూ శిరోభూషణం భావేదగాన్ పగోడా. పగోడా అంటే గోపురం. భాషాసాంప్రదాయంలో గోపురం, పగోరంఅయి, ర, డ అవును కాబట్టి పగోడా అయినది. స్తూపాల నే పగోడా అంటారు. రంగూను పగోడా ఎత్తు 318 అడుగులు. బుద్ధధాతువులను తీసుకొనివచ్చి, రంగూను, మాండలే, పెగూలలో స్తూపాలను నిర్మించారు పూర్వ భారతీయ శిల్పులు.

ఆంధ్రులే ఇక్కడకు వలసవచ్చారు. ప్రథమాంధ్రులను క్లింగులని అంటారు. కళింగులే క్లింగులయ్యారు. వారే ఈ బౌద్ధసంప్రదాయాలను ఈ సువర్ణదీవికి తీసుకొనివచ్చారు. ఆతర్వాత కాకతీయులకాలంలో, కాకతీయ రాజకుమారులు సైన్యాలతోవచ్చి పెగూ ప్రాంతం అంతా నెగ్గి, అమరపురం, అవపురం, పెగు నిర్మించారు. వీనిని ఇప్పటికీ తైలింగు అంటారు. రంగూను లోని బౌద్ధస్తూపం 'షేగాను పెగోడా' మహాద్భుతమైన శిల్పరూపం. స్తూప పాదంనుంచి శిఖరంవరకూ బంగారురేకులతో మలామా చేశారు. ప్రార్థన చేసేందుకు స్తూపంచుట్టూ 1400 అడుగుల చుట్టుకొలతను అద్భుతమైన వసారా ఉన్నది. ఈ స్తూపంలోని దారుశిల్పం లోకానందదాయకమైనది. రంగూను, పెగూ, ఆవా, అమరపురం, మాండలేలు దర్శించి, అనేక కళావస్తువులుకొని, హరిద్వారం—స్వామిజీ ఆశ్రమానికి—పంపి మార్చినెలాఖరుకు సింగపూరు వెళ్లాను. సింగపూరులోనూ భారతీయసంస్కృతి అన్నివిధాలా ప్రత్యక్షం అవుతుంది. మలయద్వీపమే మలయా! ఇప్పుడీ ద్వీపవాసులు ఎక్కువమంది మహమ్మదీయులు. చాలామంది చీనావారూ వలసవచ్చారు.

సింగపురంనుంచి జావాలో బటేవియాపట్నం చేరుకున్నాను. బటే వియానుంచి రైలుమీదా స్టీమరుమీదా బయలుదేరి, బోరోబదూరు చేరుకున్నాను. యవద్వీపమునిండా భారతీయులు. ముఖ్యంగా ఆంధ్రుల సంస్కృతి విలసిల్లి పోయినది. కథాసరిత్సాగరంలో ఆంధ్రవణిక్కులు యవద్వీపాదులు వర్తకానికి వలసకు వెళ్ళినట్లు వ్రాసిన ఆ చిహ్నాలు, ఆ రాజ్యాలు ఇప్పటికీ యవద్వీపం అంతా నిండిఉన్నాయి. బోరోబదూరు ఆంధ్రుల సొత్తయిన మహాయానపు బిడ్డ. ఏ ఇక్ష్వాకుల కాలంలోనో, బృహత్పాలాయనుల కాలంలోనో యవద్వీపానికి వలసవచ్చిన ఆంధ్రులు, బోరోబదూరులో ఈ మహానిర్మాణం కావించి ఉంటారు. బోరోబదూరు స్తూపం ఇటుకలతో మన్నుతో కట్టలేదు. ఒక కొండనే స్తూపాకారంగా నిర్మించారు. ఆ కొండలో ఒకప్రక్క తమ ఆంధ్రదేశాన్నుంచి తీసుకొనివచ్చి బుద్ధధాతువును ఆంధ్రులు స్థాపించి ఆ కొండ నంతా పరమాద్భుత శిల్పాకారంగా నిర్మించినారు.

## 9

మంగోలియను జాతులు పసుపుపచ్చగానూ, ఎఱ్ఱగానూ ఉంటారు. బర్మావారు, చీనావారు, జపానువారు, లాప్‌లాండువారు, సైబీరియావారు,

గ్రీన్‌లాండువారు పసుపుపచ్చగా ఉన్నారు. అమెరికా ఇండియనులు ఎఱ్ఱజాతి వారు. భూమిమీద భూభాగం ఏర్పడే టప్పుడే, ఉత్తరఖండంలోనే ఎక్కువగా ఏర్పడిందని నా ఉద్దేశం. శాస్త్రజ్ఞులు అట్లాగే చెప్పుతారు. ఆ ఉత్తర భూభాగము మూడు చక్రాకారపు చీలికలుగా ఏర్పడింది. ఉత్తరసముద్రము, భూమి; మధ్యోత్తరసముద్రము, భూమి; మధ్య దక్షిణసముద్రము, భూమి; దక్షిణసముద్రమూ ఈవిధంగా మధ్యభూమి మహోత్తమ పర్వతమయమైనది; ఉత్తర, దక్షిణ భూములు సమతలాలు, మధ్యమోన్నత పర్వతాలున్నూ. మధ్య భూభాగంలో సత్వగుణులైన ఆర్యు లుద్భవించారు.

మహామేరు (ఇప్పటి పామేరు) దానికి శాఖలు, హిమాలయం, అల్టాయి, సులేమాను, హిందూకుష్‌లలో శుద్ధసాత్వికులు, వేద పవిత్రమంత్రదర్శకులు ఉద్భవించారు. కకాసస్ మధ్యస్థమైన తురుష్క పర్వతాలూ, ఆల్ప్సు పర్వతాలలో రాజసిక సాత్వికజాతి అయిన ఆర్యులు, ఉత్తరఆల్ప్సు అట్లాంటిక్ పర్వతాలలో (అవి ఇప్పుడు సముద్రగర్భంలో ఉన్నాయి) అమెరికా మధ్య పర్వతాలలో తామసిక సాత్వికులు ఉద్భవించారు. అలాగే ఉత్తరభూఖండంలో సాత్వికరాజసికులు చీనాలోనూ, రాజసిక రాజసులు పసిఫిక్ సముద్రంలో మునిగిన భూఖండంలోనూ, తామసిక రాజసులు కనడా, అట్లాంటిక్ యూరపు భాగాలలోనూ ఉద్భవించారు. దక్షిణ భూఖండంలో, దక్కనులో, సింహళంలో, అరేబియా సముద్రగర్భంలో ఇంకిన భూమిలో సాత్వికతామసులు, ఆఫ్రికా, దక్షిణ అట్లాంటిక్ అమెరికా భాగాలలో రాజసికతామసులు, దక్షిణ పసిఫిక్ భాగ, ఆస్ట్రేలియా, బోర్నియో, న్యూజిలెండు దక్షిణ అమెరికా భాగాలలో తామసికతామసులు ఉద్భవించారని నాకు సంపూర్ణ నమ్మకము.

రాజసికార్యుల సంతతివారు ఇప్పటి యూరపుఖండవాసులు. రాజసికార్య సాత్వికరాజసుల మిశ్రమసంతతివారు హిట్టైటులు, సెమిటిక్‌లు, యూదులున్నూ. సాత్వికార్య, సాత్వికరాజసుల సంబంధీకులు సింధుతీరవాసులు, చాల్డియనులు, ప్రాచీన ఈజిప్టువారు. వీరే అసురులు సాత్వికార్య, రాజసిక రాజసుల సంబంధులు ఈనాటి బర్మా, బెంగాల్, ఉరిస్సా, అస్సాంవారు. వీరే ప్రాచీన గాంధర్వులు. సింధుతీరవాసుల సంతతివారు దాక్షిణాత్య వెల్లాలులు, పూర్వాంధ్రాసురులు. తామసిక రాజసులు ఈనాటి అస్సాం నాగులు.

ఈ మిశ్రమాల వైచిత్ర్యం ఆయా దేశాల శిల్పాలలోనూ దృశ్యం అవుతుంది. బోరోబదూరులోని శిల్పంలో ఆంధ్రార్యసాత్వికత్వమూ, యవద్వీప మిశ్రమరాజసమూ సంపూర్ణంగా కనబడుతాయి. కొన్ని శిల్పాలు పూర్తిగా ఆంధ్రార్యులు శిల్పించినవే. ఆ శిల్పాలకు, అమరావతీ నాగార్జునకొండ శిల్పాలకూ ఏమీ తేడాలేదు. బోరోబదూరు బుద్ధుడూ నాగార్జున బుద్ధుడున్నూ ఒకటే! ఈ స్తూపంపైకి వెడుతూంటే మెట్టు మెట్టు ఎక్కుతూంటే, ప్రథమ శ్రేణులలో పక్షులు, జంతువులు లతలూ ఉంటాయి. తర్వాత శ్రేణులలో ప్రకృతిదృశ్యాలు, మానవ జీవిత దృశ్యాలు, ఇంకనూ పైశ్రేణులలో మత

విషయకమైన విషయాలూ శిల్పించారు. ఆపైన శ్రీ ధ్యానబుద్ధదేవుడు ప్రత్యక్షం అవుతాడు. ఈ శిల్పాలన్నీ వరసగా పెడితే మూడుమైళ్ళ పొడుగు ఉంటాయి. మధ్యమధ్య ఉండే బుద్ధదేవుల మూర్తివిధానం గమనిస్తే తూర్పున ఉన్న బుద్ధులు అక్షోభ్యులు. వీరు ధ్యానబుద్ధులు. ఈ బుద్ధమూర్తి దక్షిణ హస్తము భూస్పర్శముద్రలో వడిమోకాలుమీద ఆని ఉంటుంది. నూప దక్షిణపార్శ్వంలో ఉన్న ధ్యానబుద్ధులు వరదముద్రాలంకారులు. పశ్చిమ భాగాన అమితాభబుద్ధులు పద్మాసనస్థులు, చిన్ముద్రా పద్మముద్రాలంకారులు. ఉత్తరమువైపు అమోఘసిద్ధబుద్ధులు అభయముద్రాలంకారులు.

ఇక్కడే ప్రజ్ఞాపరిమితాదేవీశిల్పం ఉండేది. ఈమెను శిల్పించిన మహా శిల్పి యవద్వీపసుందరికిని ఆర్యశిల్పికిని ఉద్భవించినవాడు. ఆమెలో ఆర్య సౌందర్యరేఖలు, గాంధర్వ సౌందర్యరేఖలూ యమునా గంగానదులు సంగ మించి నట్లయ్యాయి. ప్రజ్ఞాపారమిత మన సరస్వతి. గ్రీకుల అధీనీ, ప్రజ్ఞా పారమితలో సావిత్రీత్వమూ ఉన్నది. ప్రజ్ఞాపారమితశిల్పము జగత్ప్రఖ్యాత శిల్పాలలో ఒకటి. ఆమెను నేను ప్రేమించాను, పూజించాను.

ఈ రోజులలో స్త్రీభావాన్ని పూజింపసాగాను. అందమైన స్త్రీ, మధురకంఠి, విలాసాలప్రోవు. వీరందరు నా శకుంతలలోని ఛాయలయ్యారు. ఏ సౌందర్యోజ్వల స్త్రీ అయినా నాలో కామేచ్ఛ ఏమాత్రమూ ఉద్భవించ లేదు. ప్రకృతి సౌందర్యదర్శన పులకితుడై, పరవశత్వం చెందే సౌందర్యో పాసిలా స్త్రీ సౌందర్యోపాసినిమాత్ర మయ్యాను. జగత్ స్త్రీ ఎంత విచిత్ర మైన భావం. వివిధ సౌందర్యాత్మికమైన పరమశబలత్వ మామెలో మూర్తీభ విస్తుంది. ఏ సీమలో ఆమె నర్తిస్తుందో ఆ సీమలోని సౌందర్యాలన్నీ పూలలా ఏరి తన్నలంకరించుకొంటుంది. ఏ కాలంలో తాను నాయిక అవుతుందో, ఆ కాలంలోని సౌందర్యాలు పరీమళాలు చేసి తాను సుభిక్ష అవుతుంది. సామ్రాజ్య భావపూర్ణ స్త్రీలో ఆడపులి అందాలు చూస్తాము. భారతీయ కాంగ్రెసులో వంగోలుసీమ ధవళధేనువును దర్శిస్తాము. సోవియట్ రష్యాలో పొలందున్నే బాడబి కన్నులవిందు చేస్తుంది. కాటకంలో కడుపు వెన్నెముక కంటుకుపోయి, ఎముకల పోగై, చంటిబిడ్డకు పాలులేక, వేలాడే పాలతిత్తులు, కడలిపోయిన భీభత్సంలో కాటకసుందరి, ఆ తల్లే మనుష్యులలోని సర్వకరుణలు స్పందించి ఆతణ్ణి కర్మవీరుణ్ణి చేస్తుంది. బర్మాలో, సింగపూరులో, మంగోలి యనుజాతి స్త్రీ సౌందర్యాన్ని నేను దర్శించాను. ఉత్తమస్థితిలోని స్త్రీలు బర్మాలో చుట్టలు కాలుస్తారు. ఆమెదే నిజమైన బర్మా పరిపాలనం. ఆమె సర్వసంస్థలకు దానధర్మాలుచేసే వ్యక్తి. అలంకారంలో ఆమె ముందు. సంగీత మామె సొత్తు, నాట్యమామె హక్కు. చదువులో ఆమెది మొదటి పంక్తే! భారతదేశంలో వెనక ఏలా సరస్వతి, శారద, గజలక్ష్మి, మందాకినీ, భూమాతా, పొష్యలక్ష్మి, విద్యుల్లతాంగీ అయి స్త్రీ ఉన్నదో, జావాలోనూ

ఆమె అలా ప్రజ్ఞాపారమిత అయింది. జావాకు వలసవచ్చిన భారతీయులచే ఆ ప్రజ్ఞాపారమితాదేవే సకల సంస్కృతీ విలసింపజేసింది.

ఆ భావాలతో బోరోబదూరు శిల్పలక్ష్మికి సాష్టాంగపడ్డాను. సాష్టాంగము నుండి లేచి నిలుచుండగానే డచ్చిభాషలో నన్నొక యవద్వీప పాశ్చాత్య సుందరి 'మీరు బౌద్ధులా ?' అని పల్కరించింది. నాకు డచ్చిభాష రాదు, యవద్వీప భాషా రాదు. నేను తెల్లపోయి ఇంగ్లీషులో 'నాకు మీ భాష రాదు' అని జవాబు చెప్పాను. ఆ బాలికతో ఉన్న ఒక్క పెద్ద డచ్చిదేశసుడు 'మీది హిందూదేశమా ?' అని ఇంగ్లీషులో ప్రశ్నించాడు. ఆ డచ్చి పెద్ద మనుష్యుడు నన్నట్లు పలకరించగానే నాకు ఎంతో గర్వం కలిగింది.

'అవునండి. నేను భారతీయుణ్ణి. శిల్పవిద్యార్థిని. ఆంధ్రుణ్ణి. ఆంధ్రదేశం, మదరాసుకు ఉత్తరంగా ఆరువందలమైళ్లు పొడుగు మూడువందలమైళ్లు వెడల్పున్న భూమి. అక్కడి శిల్పచరిత్ర తూర్పు ప్రపంచాని కంతకూ దేశికత్వం వహించింది. అందులో ఒక చిన్న ఖండమే ఈ శిల్పము' అన్నాను.

'ఆనందం. నేనూ, నాకోమార్తె ఈ బాలికా శిల్పులమే. మేము మీ భరతదేశం యావత్తూ తిరిగి వచ్చాము. ఈబాలిక విల్హెల్మినా. నాపేరు డిజాంగ్. ఈ బాలిక తల్లి హెర్‌ఫాన్ వాగేనార్‌గారి కుమార్తె. వాగేనార్ ఈదేశంలో ఒకరాజు. ఆయన ఒక జావారాజు తనయను పెళ్ళిచేసుకొని, ఆ అమ్మాయి ఆరాజుకు ఒక్క సంతానమే అవడంచేత, తానే జమీందారుడయ్యాడు. ఇదీ మా చరిత్ర. పొద్దుటనుంచీ ఇక్కడే ఉండి, ఈ బొమ్మల ప్రతిరూపాలు లిఖించుకుంటోంటే చూచి, మీ రెవరో తెలుసుకొని, మీకు సహాయం చేయాలని మా అమ్మాయి నన్ను వేపుకుతింది. మీ చిత్రాలు మేము చూడవచ్చునా ?'

'చిత్తం !'

నా చిత్తుచిత్రాల పుస్తకాలు వారి కిచ్చాను. ఆ బొమ్మలన్నీ కొన్ని వందలుంటాయి. తండ్రీ కూతుళ్ళిద్దరూ ఒక అరగంట చూశారు. ఆయన నా మొగంవైపు మాడగానే 'అయ్యా నా పేరు త్యాగతి శర్వరీభూషణ్' అన్నాను.

'అయ్యా భూషణ్‌గారూ ! మీ బొమ్మలన్నీ ఇప్పుడు చూడలేము. ఇక్కడ బంగాళాలో మా నివాసం. మీరు ఇక్కడ ఉండదలచుకొన్నన్ని రోజులు మా ఆతిథ్యం స్వీకరించ ప్రార్థన. మీరు మాతో ఉన్నప్పుడు సావకాశంగా ఈ బొమ్మలన్నీ చూస్తామండి' అని ఆయన నన్ను వేడుకొన్నాడు.

నేను వారితో బంగాళాకు వెళ్ళాను. నా సామానూ బంగాళాలోనే ఉంది. అయితే నా స్వంతవంట మాని వారితో నాకై తయారుచేయించిన శాకాహారం మాత్రం తీసుకుంటూ వారికి అతిథి నయ్యాను.

విల్హెల్మినా బటేవియా కాలేజీలో చదువుకుంది. శిల్పంలో ఎక్కువ ఇష్టం ఉండటంచేత బటేవియా శిల్పవిద్యాలయంలో శిక్ష అలవరచుకుంది.

ఆమె హాలండు, యూరపు, ఇంగ్లండు, ఇండియా, బర్మా, చీనా, జపాను, అంగకర్ వాటు మొదలయిన ప్రదేశాలన్నీ తండ్రితో కలసి మూడేళ్ళు యాత్ర చేసింది. విల్హెల్మినా లిఖించిన చిత్రాలన్నీ చూచినాను. డిజాంగ్ గారు నన్ను వారి శిల్పాలను చూచుటకు బటేవియాలో తమ నివాసానికి రమ్మని ఆహ్వానించారు. నేను ఇండో-చీనాకు వెళ్ళేటప్పుడు బటేవియా ఎల్లాగ వెళ్ళవలసి ఉన్నది గనుక, సరేనని వారి ఆహ్వానము అంగీకరించాను.

డచ్చి వరవర్ణులకున్న ప్రకృతి సౌందర్యపూజ, జావాసుందరులకున్న పారలౌకిక విషయానందము ఆ బాలికలో చక్కగా మిళితం అయ్యాయి. ఆమెలో రెండు అందాలు మేలుకలయికపొంది, ఆమెకు దేవ గంధర్వ సౌందర్యము ప్రసాదించాయి. ఆ బాలికకు ఇంగ్లీషు బాగా అర్థం అవుతుంది. కాని తాను నట్లుతూ మాట్లాడుతుంది. భారతీయశిల్పంలోని రహస్యాలు వాళ్లకు పూర్తిగా తెలియవు. వాన్ అయికు, వాన్ డైక్ మొదలయిన చిత్రకారుల రక్తమూ, ఆంధ్రశిల్పుల రక్తమూ, యవద్వీపవాసుల రక్తమూ ఆమెలో సంయోగంపొంది, భారతీయ శిల్పం అంటే ప్రేమను కలిగించాయి. అది వట్టి అలంకారశిల్పంమాత్రం అనే భావాల్ని కలుగజేశాయి. ఈ రెండుభావాలు ఒక్కొక్కప్పుడు శ్రుతి అవుతాయి. ఒక్కొక్కసారి అపశ్రుతిగా తుపాను పుట్టిస్తాయి. విల్హెల్మినాతోను, ఆమె తండ్రితోనూ నేను మూడురోజులు వాదించాను, బోధించాను. విల్హెల్మినా నా వాదన పూర్తిగా అర్థంచేసుకొని భారతీయశిల్పం నేర్చుకోడానికి సంకల్పించుకొంది. నేను వారితో జావాలోని తక్కిన శిల్పక్షేత్రాలన్నీ తిరిగాను.

బోరోబదూరునుంచి మేము ప్రాంబనాన్ వెళ్ళాము. ఈ గ్రామం సురకర్త నగరజిల్లాలో ఉన్నది. యోగ్యకర్త నగరానికి సమీపం. రెంటికీ రైలుమార్గం ఉంది. ప్రాంబనాన్ అంటే గురువులున్న గ్రామం అని అర్థమట. ఈ మహాగ్రామంలో 157 చిన్న గుళ్లు మూడు కక్ష్యాంతరాలలో ఉన్నాయి. లోని కక్ష్యాంతరంలో ఆరు పెద్ద గుళ్ళు ఉన్నాయి. మధ్య దేవాలయం శివపార్వతులది. శివుడు జగద్గురువుగా, మహాకాలుడుగా విగ్రహాలున్నాయి. దుర్గ, గణేశ విగ్రహాలున్నాయి. బ్రహ్మవిగ్రహమూ, విష్ణు విగ్రహాలూ ఉన్నవి. ఇక్కడ శిల్పం ప్రథమ ఆంధ్ర చళుక్యశిల్పాన్ని పోలి ఉంది. ఈ విగ్రహాలలో ఎల్లోరా మహాబలిపుర విగ్రహాలలోని విజయవాడ గణేశ విగ్రహాలలోని మహోన్నతశక్తి, మహాప్రజ్ఞాత్మికరచన దృశ్యమాతున్నది.

అక్కడినుండి చండిజాగో, విష్ణువర్ధన చాళుక్యుడు నిర్మించిన గుడికి వెళ్ళినాము. చండి అంటే గుడి. ఇక్కడి శాసనాలు దేవనాగరలిపిలో ఉన్నాయి. ఇక్కడ మకరతోరణాలు లేవు. గాంధర్వశిల్పంతో మిళితమైన భారతీయశిల్పం దృశ్యం అవుతుంది. చండిజాగో దగ్గరనే సింగోస్సారి చండి, కిదాల్ చండి, జాబుంగ్ చండీలు ఉన్నాయి.

వీని అన్నిటికన్న ఉత్తమమైన దేవాలయం కేదిరి చండి. ఇచ్చట శిల్పం అత్యంత లాలిత్యం చేకూర్చుకొని యవద్వీపవాసనలు రూపం తాల్చింది. ఈ దేవాలయాలన్నీ తూర్పుజావాలో ఉన్నాయి. ఈలాంటి దేవాలయాలు యవ ద్వీపం అంతా నిండి ఇక్కడకు పూర్వభారతీయులు ఎంత విరివిగా వలస వచ్చే వారో తెలియజేస్తున్నవి. అనేక శిల్పాలు హాలండు, జర్మనీ మొదలైన ప్రదేశాలకు తరలించుకుపోబడినాయి. పాశ్చాత్యులు ఎవరికి తోచినరీతి వారు చరిత్రలు వ్రాస్తారు. భారతీయులకీ అఖండ భారతచరిత్ర అవసరంలేదా? ఆంధ్రు లంతికన్నా అలసులు. ఈ దేశాలే రారు. మన దేశంలో చరిత్ర కారులు దేశాలు తిరుగుతారుగనుకనా! వారు, ఎవరో రాసిన గ్రంథాలు భావాలు చూచి, స్వకల్పిత గాథలతో చరిత్ర నింపుతారు. ఈ దౌర్భాగ్యస్థితి ఎప్పటికి అంతమవుతుందోగదా!

## 10

ఈ యాత్రలన్నీ ముగించుకొని నా స్నేహితులైన డిజాంగ్, విల్హెల్మినా లతో బటేవియా చేరాను. మా యాత్రల పొడుగునా విల్హెల్మినాకూ, నాకూ ఎంతో స్నేహం అయింది. ఒక జాతికీ ఇంకో జాతికీ స్నేహం కుదర్చగల వారు, ఇరుజాతుల్లోని వనితామణులే. భారతీయ నారీమణులు విదేశీయులతో సంపర్కం కలుగజేసుకునే ఆచారం భరతదేశంలో లేకపోవడం ఆ రోజుల్లో నాకెంతో తీరనిలోటు అనిపించింది. విల్హెల్మినా నేనంటే చూపిన గౌరవము, ఆదరణ వర్ణనాతీతము. అమెరికాలో వివేకానందరాజర్షిని గౌరవంచేసి అఖండ స్వాగతంఇచ్చింది అమెరికా నారీమణులు. వారికి చదువు ఉన్నది, స్వేచ్ఛఉన్నది.

భారతీయ స్త్రీ ఒక విదేశీయుని కలుసుకోలేదు, అతనితో మాట్లాడదు. సంస్కృతినిగూర్చి చర్చించలేదు. సరోజినీదేవి, విజయలక్ష్మి, దుర్గాబాయి, కమలాదేవిగార్లవంటి ఏ నలుగు రైదుగురో తక్క విదేశయాత్రికులతో మాట్లాడే వనితలేరీ? మన ఇంటికి వారిని పిలవలేము. మన మతం మనకు అడ్డం. మన ఆడవాళ్ళ హృదయంలో ఉత్తములైన పరదేశీయులతో వారి వారి విజ్ఞానాలను గూర్చి మాట్లాడాలనీ, వారిని హృదయమారగా ఆదరించాలనీ ఉంటుంది. కాని వారికి సావకాశా లెవరు ఇస్తారు?

ఈనాడు మన బాలికలు చదువుకొంటున్నారు. ఈ విద్యావతులైన బాలికల జీవితం ఒక మహోద్యమం అనే విషయజ్ఞానం భారతీయులకు లేనే లేదు. వారికి స్త్రీ పురుష భేదభావ మింకా వదలలేదు. ఆ భావంవల్లనే పురుషుణ్ణి ఆదరించడం మానేస్తారు. ప్రేమించినవానితో మాత్రం ఆ భావం ఉంచుకొని, తక్కినవారు తమతోటి మనుష్యులనే భావం వారి జీవితాల నిండ లేదు. భారతీయ పురుషులలోనూ ఈ తుచ్ఛభావం నశించలేదు. ఒక స్త్రీ తనవేపు చూస్తే, ఒక స్త్రీ తన్ను పలకరిస్తే, ఒక స్త్రీ తనతో ఒంటిగా ఉంటే, ఈ హీన పశుత్వభావాలు పురుషుల హృదయాలను గగ్గోలుపెడతాయికదా!

నేనూ విల్హెల్మినా మాత్రం ఎన్నిసార్లో దేవాలయాలకడకు పోయి బొమ్మలు వేసుకుంటూ ఉండేవాళ్ళం. అలాంటి సంఘటన వచ్చినప్పు డల్లా నా గుండె ఉలికులికిపడేది. నా ఒళ్ళు వేడెక్కేది. ఏవేవో చెడు ఆలోచనలు నన్ను నిండేవి. డిజాంగ్‌గారు తన కుమార్తెను ఒంటిగా నాతో పంపి, నాతో అంతకాలం ఒంటిగా ఉండేటట్లు చేయడంలో, నేనాతని తనయను ప్రేమించవచ్చుననే భావంతోనే పంపారా అనుకున్నాను. ఎంత హీనమైంది నా హృదయం! 'ఈలాంటి ఆలోచనలు భారతీయు లొక్కరికే కలుగుతాయా, లోకంలోని పురుషులందరికీ కలుగుతాయా?' అని ప్రశ్నించుకొన్నాను. నాలో తుచ్ఛభావాలకు తావులేదనుకున్న నాకీ ఆరాటం ఎందుకు? ఈ పశుత్వం ఉద్భవించిం దేమిటికి?

విల్హెల్మినాలో ఏదో సమ్మోహన శక్తి ఉన్నది. ఆమె అందంలో మహత్తరమైన విశిష్టత ఉంది. ఆమె నాలోని సర్వ సౌందర్యపిపాసలు రేకెత్తించింది. ఆమె జావా భాషలో చిత్రమైన పాటలు పాడుతూంటే పది కోకిలల తీయటి గొంతుకలు కలిపి పాడినట్లు నాకు పులకరాలు కలిగాయి. ఆకలిలాంటిదే స్త్రీవాంఛ అని నే నెట్లా అనుకోను? నా శకుంతల వెళ్ళిపోయి నా కనేకవిధాల అడ్డం వస్తూ ఉన్నదా? ఉత్తమ కాగ్యోన్ముఖునికి స్త్రీ వాంఛ అడుగడుక్కీ అడ్డంతగిలే కంటకారణ్యం. అందుకనే భార్య అనే ఉత్తమసంస్థ ఉద్భవించింది కాబోలు! నాకీ దుష్టవివశత్వం మాన్పింది విల్హెల్మినా కన్యయే!

ఒకరోజున మేమిద్దరం చండి కేసరిలో ముఖ్యదేవాలయంలో బొమ్మలు వేసుకుంటున్నాము. విల్హెల్మినా తండ్రి గుడిఅంతా చూచి, ఆప్రాంతాన ఉన్న ఇతర కట్టడాలను పరీక్షచేయడానికి వెళ్ళినాడు.

విల్హె: భూషణ్! మీ దేశంలో చిత్రలేఖనంగాని, శిల్పంగాని అభ్యసించే స్త్రీలు ఉన్నారా? భరతదేశం మేము వెళ్ళినప్పుడు మా కెక్కడా శిల్పవిద్యార్థులు కనబడనేలేదు!

నేను: మీరు శాంతినికేతనం వెళ్ళారా?

విల్హె: రవీంద్రనాథ టాగోరుగారి ఆశ్రమమేనా?

నేను: అవును. అక్కడ చాలామంది విద్యార్థినులు చిత్రకళను, కొందరు శిల్పకళను నేర్చుకుంటున్నారు.

విల్హె: నేనూ, మా తండ్రిగారు అక్కడ విద్యార్థినుల చూచాము. అందరిలో ఒక బెంగాలీ అమ్మాయితో నేను బాగా స్నేహంచేశాను. ఆ బాలిక మీ దేశంలోని యువకులు చాలామందిమీదా, పెద్దవారిమీదా కొన్ని నేరారోపణలు చేసింది. బాలికలు చదువుకోడంవల్ల భారతీయ యువకునిలో పశుత్వం రేకెత్తించిందని ఆమె నాతో చాలాగాఢంగా చెప్పింది. చదువుకొనేందుకు బాలిక సిద్ధమైనదంటే, ఆమె దుష్టబుద్ధితోనే ప్రారంభిస్తుందని

అనేకుల అభిప్రాయమట. కళాశాలలకు యువతులు వెడుతోంటే అనేకులు యువకులు ఈలలు వేస్తారట. యువతులు వినేటట్లు భరింపరాని మాట లంటారట. ఇవి పెద్దలకు చెబితే 'ఆబాలికలలో ఏదో లోటులేకుండా బాలురు అలా అల్లరి ఎందుకు చేస్తారు' అని పెద్ద వారు అనుకుంటారట.

నేను : నీవు చెప్పినవాటిలో చాలా నిజముంది. ఈ విషయాలు పంజాబులో ఎక్కువ. కొత్తగా బాలికలు చదువు ప్రారంభించడంచేత ఈలాంటి సంఘటనలు వచ్చాయి. దేశంలో ఇదివరదాకా బంధుత్వంలేని యువతీ యువకులు మాట్లాడుకోరు. అంత దూరంగా ఉన్న సుందరులు నేడు చదువుద్వారా సన్నిహితులు కాగానే బాలునిలో అప్పుడే పొడచూపి ఉన్న యవ్వనరక్తం ఉప్పొంగి, అతనిలోని పశుత్వం బయటకు వస్తున్నది. కాని మాకూ ఈ ఉద్యమం బాగా ఆచారమై, మా జీవితంలో భాగమైతే మావాళ్ళూ ఎంతో గౌరవం చూపించగలరు. అమెరికా విద్యార్థుల చరిత్ర వింటోంటే, మా హీనత్వమూ కాటుకకొండదగ్గర మసిలా కనబడుతుంది.

విల్హెల్మినా చిరునవ్వునవ్వి 'భూషణ్, నువ్వు నా అందంచూచి మరులు కొన్నావని ఎంచి ఈ ముక్కలనలేదు. నీ మర్యాద, నీ లలితమైన హృదయం, నీలోని విరక్తిభావం చూచి ఆశ్చర్యపడుతూ అన్నముక్కలివి. నువ్వు నేనంటే కొంత ప్రేమ చూపించి, కాస్త దగ్గిరకు చేరితే, ఆ ఆనందం అనుభవిద్దామని రహస్యంగా వాంఛించాను. అంతకన్న నాకు వేరేదుష్టభావాలు కలుగలేదు. ఒక్కసారికూడా నువ్వు నా అందం తేరిపారచూడలేదని నాకు కోపంకూడా వచ్చింది. నాలో యవద్వీప స్త్రీరక్తం ఉంది. మావాళ్లు తలచుకుంటే ఏమనిషి హృదయాన్నైనా చూరగొనే మంత్రా లెరుగుదురట. నాలోని డచ్చిరక్తము నన్ను వాటికి దూరంచేసింది. పట్టలేక ఈరకంగా అడిగాను' అన్నది. నే నాశ్చర్యం పొంది కించపడిపోయాను.

## 11

నా మోమునందు నర్తించిన కించపాటూ, అవమానమూ విల్హెల్మినా చూచింది. నా ప్రక్కకువచ్చి కూరుచుంది. నాచుట్టు చేయివైచి తన హృదయానికి అదుముకొని, కుడిచేతో నా గడ్డంపట్టి, నా మోమెత్తి, 'భూషణ్ ఈ విషయంలో నువ్వొక్కడవే ద్రోహివికాదు. నేనూ ఆ నేరంచేశాను. నాకు నిన్నుగురించి ప్రణయాత్మకమైన ఆలోచనలు కలిగినమాట నిజం. నీ మాటలలో కాని, నీ చర్యలలో గాని ఒక యువతి హృదయం చూరగొనేందుకు చేసిన ప్రయత్నస్పర్శ అయినా లేదు. ఆడవాళ్ళకీ కలలుంటాయి. వనిత తన కలలు గాఢంగా దాచుకొంటుంది. తేల్చదు. లోపల అగ్నిజ్వాలలతో మండిపోతున్నా, పైకి మంచుగడ్డలా కనబడగలదు. నేను బాలికను. మలయారక్తం నాలో ఉంది. నిన్ను వాంఛించాను. నీ జీవితంలో భాగస్వామిని అవుదాము అనుకొన్నాను. నా డచ్చితనము నన్ను హేళనచేసింది.

మన ఈ స్నేహంలో పవిత్రత మనం ఇద్దరం పాడుచేయవద్దు, పాడుచెయ్య్యలేముకూడా! నేను పెళ్ళిచేసుకోబోయే యువకుడొకడున్నాడు. ఈ జీవితంలో, నీ ఈ జావాయాత్రతో మనిద్దరిస్నేహం ఆఖరేమో? మళ్ళీ మన జీవితాలు తారసిల్లుతాయో లేదో! ఈ పవిత్ర క్షేత్రంలో ఒక్కసారి మన కాంక్షను పూర్తించేద్దాము' అని నన్ను గాఢంగా హృదయానికి అదుముకొని, తల వెనుకకువాల్చి అస్పష్ట ధ్వనిలో 'నన్ను గాఢంగా ముద్దుపెట్టుకో' అంది. నేనామెను నా హృదయానికి తనివితీరా అదుముకొని, గాఢమైన చుంబనాలామె పెదవులపై కురిపించాను.

ఇరువురము విడిపోయాము. అదే మాలోని కాంక్షల పుట్టుక, నాశనమున్నూ. అంతకన్న మేము వాంఛించలేదు. మనసుల కలయికమాత్రమే కోరిన మాకు దేహముల కలయిక అవసరమే లేకపోయింది. అక్కడనుంచి మా స్నేహము నానాటికి పవిత్రమైపోయింది. అలాంటి ఉత్తమసంఘటనలే మనుష్యుని జీవితంలోని దివ్య క్షేత్రాలు.

బటేవియా వెళ్ళాము. అక్కడి డిజాంగ్ గారి ఇంటిలో నా మకాం. బటేవియా యాత్ర ప్రథమదర్శనంలో చూచినదానికన్న, ఈనాడు చక్కని రూపంతో ప్రత్యక్షం అయింది. విల్హెల్మినా శిల్పాలలో, చిత్రాలలో ఏదో ఒక మహానుభూతికై నిరీక్షిస్తున్న ఆవేదన ఉంది. జావా పల్లెటూరి దృశ్యాలు ఆమె అనేకం చిత్రించింది. బటేవియా రేవులో ఉన్న ఓడలు, నావలు, సరంగులు, నావికులు, కూలీలు, బజారులు, దుకాణాలు ఎన్నో చిత్రాలామె లిఖించింది. అన్నిటిలోనూ ఆ నిరీక్షణే దృశ్యమౌతుంది.

'దేనికోసం నిరీక్షిస్తున్నావు మినా!' (అది ఆమె తలిదండ్రుల ముద్దుపేరు.)

'నీ చిత్రాలన్నీ ఆ నిరీక్షణే తెలియజేస్తున్నాయి?' అని ఆ బాలికను ప్రశ్నించాను.

'భూషణ్! నేనేమి చెప్పగలను? ఏదో మా జావాకు వస్తుంది. అది ఉపద్రవమో, శుభమో! ఆ నిరీక్షణ నాలో నిండిఉంది. నాతోటి మా ప్రజలందరిలోనూ ఆ నిరీక్షణే చూస్తాను.'

'మినా! నిజం. మన దేశాలన్నీ సంపూర్ణ స్వాతంత్ర్యంకోసం నిరీక్షిస్తునాయి. మీరుమాత్రం హాలండు సామ్రాజ్యం వాంఛిస్తున్నారా? ప్రపంచంలో సామ్రాజ్యకాంక్ష మారణమేఘంలా ఆవరించుకుని ఉంది. అది ఎప్పుడు పోతుందా అని ప్రతి మానవహృదయమూ నిరీక్షిస్తోంది. ఆఖరికి సామ్రాజ్యవాదుల హృదయంలోనూ ఆ నిరీక్షణ అప్పుడప్పుడు కొంచెమయినా తలఎత్తక మానదు.'

'నిజం. భూషణ్! నీ భావం నా కర్థమయింది. నా హృదయం పూర్తిగా గ్రహించావు.'

ఆమె ఒక నిట్టూర్పు విడిచి, నాచేయి స్పర్శించి విసవిస లోనికి వెళ్ళి పోయింది.

ఆమెను వివాహంకానున్న యువకుణ్ణి చూశాను. అతడును డచ్చితండ్రికీ, జావాసుందరికి ఉద్భవించిన మిశ్రమజాతివాడు. విల్హెల్మినా అంటే ప్రాణమే అతనికీ. ఆమె నడచినచోట పూవులు చల్లుతాడతడు. ఆమెనుగూర్చి సగర్వంగా, పూజ్యభావంగా నాతో ఎంతో చెప్పాడు. నే నాతనికి కళలంటే ఏమిటో బాగా నేర్పుకొమ్మనీ, ఆమె కానందం సమకూర్చడమే అతని కర్తవ్య మనీ బోధించాను. ఒక వారంరోజులు వారి ఆతిథ్యం స్వీకరించి ఓడ ఎక్కి సయామూ గ్రహించి ఇండోచీనా యాత్రకు బయలుదేరాను.

## 12

నేను, బోరోబదూరు మొదలైన జావా శిల్పక్షేత్రాలను దర్శించగానే, డిజాంగ్ గారితోను, విల్హెల్మినాతోనూ బలిద్వీపం చూచాను. బలిద్వీపంలో జావాద్వీపంలోకన్నా ఎక్కువ భారతీయాంధ్ర చిహ్నాలున్నాయి. అక్కడి మనుష్యులలో, వారి ఆచారాలలో, ఎక్కువ ఆంధ్రత్వం ఉంది. బలిద్వీపవాసులు పూర్తిగా హిందువులు. వారి శిల్పంలో గాంధారరీతి కనిపిస్తుంది. హిందూ దేవతలనే వారు పూజిస్తారు. వారి నాట్యాలన్నీ కూచిపూడి సంప్రదాయానికి మాతృక అయిన ఆంధ్ర సంప్రదాయానికి ఉద్భవించినవే. ఈ ద్వీపాలలో భారత రామాయణ వీధినాటకాలు ఎంతో ఉత్తమస్థితిలో ఉన్నాయి. ఈ నాటకాలకి వాంగు ప్రదర్శనము లనిపేరు.

జావా రాజులు మహమ్మదీయులైనా వారి ఆచారాలు హిందూ ఆచారాలే. వారిని రాజులంటారు. వారి కోటలలో ఈ రామాయణ భారత నాటకాలు అచ్చంగా మన కూచిపూడి విధానంలో ప్రదర్శింపబడుతాయి. అర్జునుడు, రాముడు వారికి ఉత్తమ నాయకులు.

జావాలో ఆంధ్రదేశపు తోలుబొమ్మలవంటి తోలుబొమ్మలకళకూడా ప్రదర్శిస్తారు. ఆంధ్రదేశంలోవలెనే జావాలోను రామాయణ భారతగాథలు ప్రదర్శిస్తారు. మన తోలుబొమ్మల ప్రదర్శనంలోవలెనే హనుమంతుడు రామాయణంలోనూ, అర్జునుడు భారతకథలోనూ ప్రాముఖ్యతవహిస్తారు. తోలుతో బొమ్మలుచేసి, రంగులువేసి, అలంకరించి, తెల్లని తెరపై కెక్కించి వెనక దీపాలుంచి, ఒక్కొక్కరే సంగీతాలుపాడుతూ, ఒక్కొక్క పాత్ర నాడిస్తూ ఈ ప్రదర్శనం జరుపుతారు. బొమ్మలలో కొంచెం మంగోలియనుతనం వచ్చింది. అయినా డిజాంగుగారితో, విల్హెల్మినాతో ఈ ప్రదర్శనాలకు వెళ్ళినప్పుడు వారికి భారతదేశానికి, యవద్వీపాదులకు ఉండే సంబంధం అంతా, ఆ తోలుబొమ్మలాట, వాంగ్ నాట్యవిధానమూ, సవిమర్శనంగా వ్యాఖ్యానించి చెప్పాను. విల్హెల్మినా ఆశ్చర్యం పొందింది.

:

'భూషణ్! మీ దేశం నేను యాత్రలో తిరిగినప్పుడు ఈ అద్భుతాలు చూపించినవారు లేకపోయారు. ఎన్ని నిధులున్నాయో, మీ నాగరికతలో!' అన్నది.

'అవునమ్మా! భారతదేశాన్ని పూర్తిగా అర్థంచేసుకోవాలంటే, అసలు భారతదేశం చూడాలి. అది ఇంకా తొల్లింటి ఉత్తమరూపంలో కాకపోయినా, ఆ రూపాన్ని సర్వవిధాలా దృశ్యంచేయగలిగే రూపంలో పల్లెటూళ్ళలో ప్రత్యక్షం అవుతుంది.'

'అయితే మీ దేశం మళ్ళా రమ్మంటావా?'

'తప్పకుండా. ఈ పట్టు స్వయంగా నేను మీ కుటుంబానికి దర్శకుణ్ణయి, నా దేశం చూపిస్తాను!'

'కృతజ్ఞులము. ఓహో! ఆ పవిత్రదినంకోసం ఎగురుచూస్తూ ఉంటాను.'

డిజాంగ్: మా అమ్మాయికి పెళ్ళికాగానే, దంపతులిద్దరు 'హనీమూన్' మీ దేశంలోనే గడుపుతారు.

తండ్రి మాటలకు విల్హెల్మినా సిగ్గుపడింది.

నేను బటేవియాలో ఓడ ఎక్కి చక్కని ఓడప్రయాణం చేస్తూ, సైగాను పట్టణంలో దిగాను. అచట మూడురోజులుండి డిజాంగ్‌గారి ఉత్తరాలతో వారి స్నేహితులైన కొందరు ఫ్రెంచి అధికారులను కలుసుకొన్నాను. నాకు ఫ్రెంచిరాదు. కాని ఒక తెలుగు అరవ మద్రాసీ సోదరుడు వీరి కచ్చేరీలో గుమాస్తాగా ఉన్నారు. ఆయన మా ఇద్దరిమధ్యా దుబాసీ అయ్యాడు.

సైగానులో చాలామంది తెలుగువారు, ఎక్కువమంది అరవవారూ ఉన్నారు. సైగానునుంచి బయలుదేరి టోన్లెసాప్ చేరుకున్నాను. టోన్లెసాప్ పెద్ద మంచినీళ్ళ చెరువు. దానిలో సయిమ్‌రీప్ అనే నది పడుతుంది. సయిమ్‌రీప్ నదీసరస్సు ఒడ్డున ఈవలావల అంగోర్ వాట్, అంగోర్ థామ్‌లనే శిల్పక్షేత్రాలున్నాయి. ఆ ప్రదేశాలన్నీ చూచి, ఓడెక్కి ఇండియా చేరి హరిద్వారం వచ్చాను. ఆరు నెలలు ఏకదీక్షతో పనిచేసి, నేను తలపెట్టిన పన్నెండు పంచలోహ ప్రతిమలు తయారుచేశాను. ఈ పనికి సహాయం కాశీనుంచి ఒక మంచి లోహకారుని రప్పించాను. విగ్రహాలు చాలా బాగున్నాయని స్వామీజీ ఎంతో ప్రశంసించారు. ఆ పన్నెండు విగ్రహాలున్నూ; బర్మా, జావా, బలి, కాంభోజ దేశాలలో నేను రచించి సంపూర్ణం చేసిన చిత్రాలు నలభై ఎనిమిదిన్నీ 1935 ఫిబ్రవరి నెలలో ఢిల్లీలో ప్రదర్శించాను. ఆ ప్రదర్శనంకూడా చాలా జయప్రదంగా జరిగింది. బొమ్మలు ఎన్నో కర్చైపోయినవి. ఒక మహారాజు త్యాగతీమందిరమని తన విశాల భవనమాలికలో ఒకటి ఏర్పాటుచేసి, నా చిత్రాలు ఒకేసారి ఇరవై కొన్నారు. విగ్రహాలలో ఎనిమిది కొన్నారు. ఈ అమ్మకంవల్ల నాకు ఆరువేల ఎనిమిది వందల రూపాయలు వచ్చాయి.

స్వామీజీ నన్ను చూచి 'నాయనా! నీ శిల్పవిద్యాభ్యాసం పూర్తి కావాలంటే నువ్వు చీనా, జపాను, అమెరికా, యూరపు, ఈజిప్టు, పరిషియాలు కూడా తిరిగిరావాలిసుమా' అన్నారు.

'స్వామీ! మన సంప్రదాయాలకు పూర్తిగా వ్యతిరేకమయిన పాశ్చాత్య దేశాలకు పోవడం నాకంత ఇష్టంలేదండి.'

'ఓయి వెట్టిశిల్పీ! పాశ్చాత్యులు మనుష్యులుకారా! ఏ మహత్తరశక్తి వల్ల భారతీయులు ఉద్భవించారో, ఆ మహత్తర శక్తివల్లనే సర్వమానవ ప్రపంచమూ ఉద్భవించింది. అందరికీ పశుధర్మము సమానం. మానవధర్మమైన శాస్త్రజ్ఞాన పిపాస సమానం. దివ్యధర్మమైన కళాతృష్ణ సమానం. ఇంక మార్గాలు దేశకాలపాత్రలనుబట్టి వేరవుతాయి. కొన్ని నదులు ఉత్తర సముద్రాలలో, కొన్ని తూర్పు సముద్రాలలో, కొన్ని దక్షిణ సముద్రాలలో, కొన్ని పడమట సముద్రాలలో లయమౌతున్నవి. కొన్ని నదులు మహాసరస్సులలో లయమౌతున్నాయి. ఈనాడు సరస్వతీనది భూమిలోనే ఇంకిపోతున్నది. అలాగే ప్రజాజీవిత ప్రవాహాలున్నూ.'

'స్వామీ! చోరుల జీవితంకూడా ఉత్తమమేనా?'

'దొంగలు నాలురకాలు. ఒకడు తిండిలేక దొంగతనం చేస్తాడు. ఒకడు తిండిఉండి లాభంకోసం దొంగ అవుతాడు. మరొకడు దొంగతనం జబ్బువల్ల చేస్తాడు. ఇంకోడు మంచి చేస్తున్నాననుకొని దొంగతనం చేస్తాడు. ఇంకోణ్ణి చంపడానికి వచ్చే మనుష్యుని చేతిలోని ఆయుధాన్ని, అతనికి తెలియకుండా దొంగతనం చేస్తాడనుకో! దానివల్ల ఒక ప్రాణం రక్షించినవాడయ్యాడా కాదా? అది మంచిదా చెడ్డదా? కనక ఇవన్నీ మనం సమన్వయం చేసుకోవడంలో ఉంది. కారణంలేని సంఘటన ఏమీ ఉండదు. అయినా సమ్యక్ దృష్టి కలిగిన ప్రతివాడూ జీవితంయొక్క సర్వధర్మాలు గరుడుని చూపులతో చూడాలికదా!'

నేను మౌనం వహించి స్వామి మాటలలోని అంతరార్థం గ్రహించుకుంటూ కూచున్నాను.

మా అమ్మగారికి నేను పాశ్చాత్యదేశాలు వెళ్ళడం ఇష్టం లేకపోయింది. స్వామిజీ ఆమెను సమాధానపరచారు.

1915 అక్టోబరు నెలలో బయలుదేరి నేను బొంబాయిమీదుగా ఓడమీద ప్రయాణమై బాస్రా చేరుకున్నాను. పెరిశియా దేశము, మెసపొటేమియా ముందు చూడడం ముఖ్యమనుకున్నాను. పెరిశియా నేటి ఇరాను, పూర్వకాలపు పారశీకము; భరతదేశంతో అత్యంత పురాతన కాలంనుండీ గాఢసంబంధాలు సంపాదించుకున్నది.

వేదకాలంనాటి అసురదేశము, పురాణకాలంనాటి గాంధారము అది. ఈ దేశానికీ ఆంధ్రదేశానికీ ఏదో సంబంధం ఉంది. ఈరోజున ఆంధ్రులు

అయిసరమజ్దా అని అంటూంటారు. అది 'అహురమజడా' యొక్క మారు రూపమేమో? ఇవన్నీ నా విపరీతాంధ్రత్వంలోని వెఱ్ఱికొమ్మలని స్వామిజీ నవ్వుతూ అనేవారు. నేను నా వాదన నిజమనేవాడిని. నిజమయి ఉండ వచ్చునని స్వామిజీ అన్నారు.

బాస్రాలో దిగి, బాగ్దాదుపోయి, అక్కడ మకాం పెట్టుకొని, టైగ్రీస్, యూఫ్రెటిస్ నదీతీరాలలోనూ, దూరంగా ఉన్న ప్రాచీన సుమేరుదేశ, చాల్డియన్ దేశ, అసురదేశ మహాశిల్పాలన్నీ చూచాను. ఎన్నో శిల్పాలు యూరపు ఖండ రాజ్యప్రదర్శనశాలల్లో, అమెరికా ప్రదర్శన శాలల్లో, టర్కీ ప్రదర్శన శాలలలోనూ ఉన్నాయి.

ఈ పూర్వసంస్కృతులు క్రీస్తుపూర్వం 5000 బి. సి. నుంచో, ఇంకా అంతకన్న ప్రాచీనంగానో ప్రారంభం అవుతాయి. అనేకులు పాశ్చాత్యపండితులు, సర్వ ప్రాచీనచరిత్రసామగ్రీ సమగ్రంగా పరిశీలించి, చరిత్రలు వ్రాశారు. గ్రామాల కచట ఊరు, నిప్పూరు, శిరిపూరు, అసూరు అని పేళ్ళు ఉన్నవి. వీరు భరతదేశంనుంచి వలసవచ్చారని పాశ్చాత్య పండితులుకొందరు వాదిస్తారు. సుమేరు పర్వత ప్రాంతంనుంచి సింధుతీరంలో ఉన్నవారుగనుక వీరికి సుమేరు లని పేరువచ్చిందని నా ఉద్దేశం. వీరి దేవుడు సూర్యుడు. సుమేరియనులను సమితి, లేక సెమిటక్ జాతివారు ఓడించి, వారిదేశంలో రాజ్యాలేర్పర్చారు. ఆతర్వాత పరిశియానుంచీ, సింధునదినుంచీ వచ్చారు. ఆతర్వాత పెరిశియను మీడులు ఆ దేశం ఆక్రమించారు. ఈ రాజ్య పరంపరల చిహ్నాలు మహా శిల్పాలై, మెసపొటేమియా పరిశియాలలో ఉన్నాయి.

వీరితర్వాత అసురరాజ్యాలు వచ్చాయి. వారినే అస్సీరియను లంటారు. వీరు సుమేరియనుల తర్వాత వచ్చారు. అక్కడినుండి సెమిటక్ హిట్టయిట్ రాజ్యాలు వచ్చాయి. మన దేశంలో సింధునదీతీరంలో మొహంజదారో బయల్పడిన సంస్కృతికీ ఈ సంస్కృతికీ చాలా చుట్టరికం ఉంది. యూఫ్రటీస్, టైగ్రిస్ నదుల మధ్యదేశమే ఆదాము అవ్వల ఈడెను దేశమట. ఇవన్నీ కొలరోజులలో చూచుకొని, నేను పర్షియాదేశం వచ్చాను. మొదట టెహారాన్ వెళ్ళి అచ్చట విన్నావే చూచాను. దారిలోనే బాబిలోనియా అను పట్టణం చూచాను.

ఇరాన్ అంటే ఆర్యను అన్నమాట. ఇరాన్‌దేశము అంటే ఆర్యదేశమనే! పెరిశియా చుట్టు ఎత్తైన కొండలున్నాయి. ఆకొండలలో రాజులు తమ శవాలను పాతిబెట్టడానికి గుహలు నిర్మించుకొన్నారు. ఆ గుహాముఖాలంతా అద్భుత శిల్పసంస్కృతి నిండి ఉన్నది.

## 14

లోకసౌందర్యము మూర్తికట్టిన లోకశిల్పం దర్శించిన ప్రతి రసహృదయుడూ రాకాచంద్రకిరణకాంతిస్నాతమైన చంద్రశిలలా కరిగిపోతాడు.

గాథ కామేచ్ఛతో సుందరియైన ప్రియురాలి శయనమందిరానికి పోయిన నాయకునిలా ఆర్ద్రజీవియై పోతాడు. బాగ్దాదుపట్టణం వెళ్ళినప్పుడు, ఆ వీథులన్నీ తిరుగుతూ అరబ్బీనైట్సు కథలకు పుట్టినిల్లయిన హారోన్ అలరాషిద్ గారి భవనం ఊహించుకొన్నాను. ఆనాటి దివ్యసుందరుల గాథలు కళ్ళకు కట్టాయి. నిజంగా ఆదేశంలోని వనితలందరూ సుందరులే. సాయంకాలాల్లో వారి మేడలపైన కొందరు బాలికలను చూచాను. అరబ్బీ నైట్సులోని హూరీలు నాముందు నాట్యం చేసినట్లే అయినది.

నన్నూ ఏ ఉత్తమకుటుంబ యోషారత్నమైనా ఈ పూట మా యింటికి భోజనానికి రండి అని పిలిచి చక్కగా ఆ తివాసులపైని కూర్చుండబెట్టి తీయటి షర్బతులను, గోజాపన్నిటిని కలిపి హుక్కా అందిస్తూ, డల్ సిమియరువాద్యం తీగెల తన బంగారు పొడుగాటివేళ్ళతో మీటుతూ దానిమ్మపండుగింజల ఎరుపు పెదవుల కదుపుతూ, బుల్ బుల్ గొంతుకతో పాడుతూ నన్ను ఏ అప్సరోలోకమో తీసికొనిపోవునాఅని ఊహించుకొన్నాను.

నా చిత్రలేఖనాలు, బ్రిటిషుఅధికారి భవనంలో ఉన్న ఒక అరబ్బీ ఉద్యోగి చూచి చాలా ఆనందించాడు. ఆ అరబ్బీ ఉద్యోగి ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయంలో ఎం. ఏ. పరీక్షలో కృతార్థుడైనాడు. ఇంగ్లీషు ఆంగ్లేయులవలెనే మాట్లాడగలడు. ఆయనపేరు ఖాలిద్-ఇబినె ఒమారుగారు. ఆయన ఇంటికి నేను ఒకరోజున తేనీటివిందుకు అతిథి నయ్యాను. ఆయన సహోదరి టర్కీదేశ రాజధాని అంకారాలో బి. ఏ. చదువుకొంటున్నది. ఆమెకు టర్కీలో పరదాలేదు. కాని బాగ్దాదులో పరదా ఉన్నది. ఆమె తన ఇంటిలో చదువుకున్న వారికడను, నూత్నాచారపరులకడను పరదా పాటించదు. సకల అరబ్బీయ రాజ్యాలు కలిసి ఒక ఉత్తమ సంయుక్తరాజ్యం కావాలని ఆమె వాదన. అమెరికా సంయుక్తరాజ్యాలవంటి సంయుక్త రాజ్యసంస్థ ఉండాలని ఆమె వాదించింది. అనేక శాస్త్రవిషయాలలో ఆమెకున్న అసమానజ్ఞానం నాకు ఆశ్చర్యం కలిగించింది. ఆమె చిత్రలేఖనముకూడ అంకారాలో నేర్చుకొనుచున్నదట. తమ దేశములో బయల్పడిన అతి ప్రాచీన నాగరికతలనుగూర్చి బాగా చదువుకొన్నది. ఆమెయే సుమేరు, ఖాల్డియా, అస్సీరియా, ఎలామైటు, ఇరాని యను సంస్కృతులగూర్చి నాతో చాలాకాలం చర్చించింది.

ఇరాఖ్ లో దొరకిన పూర్వసంస్కృతిని పాశ్చాత్యులందరు తమదేశాలకు తరలించుకొనిపోవుట కామె ఎంతయో విచారము వెలిబుచ్చుతూ, తనకే శక్తియుండిన, పాశ్చాత్యదేశాల మ్యూజియంలో ఉండిన శిల్పవస్తుకోటిని తిరిగి తీసుకొనివచ్చి బాగ్దాదులో ఒక పెద్ద ప్రదర్శనశాల నిర్మించి అందులో ప్రదర్శింతుననియు చెప్పినది. ఆమె పేరు అజరా-బిన్-తె-ఒమార్. నేను మీతో పూర్తిగా ఏకీభవిస్తానన్నాను.

అజరా : మీ దేశంలో మా ముస్లింస్త్రీలు ఏస్థితిలో ఉన్నారు?

నేను: మా దేశంలో ముస్లిం స్త్రీలు చాలా వెనుకబడి ఉన్నారు. పరదా పోలేదు. కొంతమంది పెద్దకుటుంబంవారూ, ఉద్యోగులూ పరదాలు తీసి వేశారు. ఖోజాలుమాత్రం చాలా ముందుకు వచ్చిఉన్నారు.

అజరా: మా అన్నగారు చాలాసార్లు బొంబాయి, కరాచీ, ఢిల్లీ మొదలయిన ప్రదేశాలు వెళ్ళివచ్చారు. ఆయన తెలుసుకొన్నవన్నీ నాతో చెబుతూ ఉంటారు.

"నేను ప్రభుత్వ వ్యవహారాలవల్లనూ, సరదాగానూ మూడుసార్లు మీ దేశం తిరిగాను. మా చెల్లెలుకూడా ఒకసారి భారతదేశం తిరగాలను కొంటోంది" అన్నారామె అన్నగారు.

నేను: వారు తప్పకుండా వచ్చి మాదేశం అంతా తిరగాలని నేనూ కోరు తున్నాను. మాలో ఉత్తమ కవి ఇక్బాల్‌గారూ, ఉత్తమ శిల్పి చాగతాయి గారూ ప్రపంచ ప్రఖ్యాతి పొందారు. నాకు మీ అరబ్బీయసంస్కృతిలో, ఏదో పరమ మధురమైన మార్దవము కనబడుతుంది. నిజంగా ఆలోచిస్తే, ఒక సంస్కృతి ఇంకో సంస్కృతికి వ్యతిరేకంగా ఉండగలదా అనుకుంటాను.

అజరా: అక్కడ మా ముస్లింకవులు మీ దేశభాషలలో కవిత్వం ఏమన్నా వ్రాశారా?

నేను: ఎంతోమంది వ్రాశారమ్మా! బంగాలీలో నజురుల్ ఇస్లాంగారూ, గుజ రాతీలో షయదాగారూ, తెలుగులో ఉమర్-ఆలీ-షా గారు కవిత్వాలు వ్రాశారు.

వారిదగ్గర శలవు పుచ్చుకొని అజరాకన్య అందమునకు మనస్సులో జోహారులర్పిస్తూ నా బసకు వచ్చేశాను.

## 15

ఈ పుణ్య ప్రదేశాలలో మహామధురకవి ఒమార్‌ఖయ్యాం జీవించిన పవిత్రప్రదేశాలు ప్రత్యక్షం అవుతాయి అన్న ఏదో పులకరింపు, ఏదో మహాను భూతి నాకు వివశత్వం కలిగించినవి. ఎవరో కొద్దిమంది ఒమార్ పేరు ఎరుగు దురు. ఆ మధురకవి పేరు వారి కవసరములేదు. ఆయన వేదాంతమూ వారి మతానికి దూరం, ఆయన సున్నీ; వారు షియాలు. అతని పేరు ఒమారు, పరిషి యాకు విరోధి అయిన ఖాలిఫ్ ఒమారును జ్ఞాపకం చేస్తుంది ఆ అమృతకవిపేరు.

నేను నిషాపూరు వెళ్ళాను. నిజంగా ఈనాడు ఆ నగరంలో వెనకటి సౌందర్యనిషా లేదు. నేడది నిశాపురం. ఈనాడూ అక్కడ ఒమారు చెప్పి నట్లు చక్కని కుండసామాను చేస్తారు. ఒమారు వర్ణించిన అందమైన బజారులు ఈ రోజున ఏవి? అతను చదివిన మద్రసా ఏది? అతడు వర్ణించిన మైదానం ఎక్కడ? ఒమారు గోరీ చూచాను. అక్కడ ప్రసిద్ధుడైన పరీద్-అద్-దీన్

గోరీనీ చూచాను. ఆయన గోరీ పక్కనే ఇమామ్ "జడాహ-మహరుఖ్" మసీదూ చూచాను. చక్కని నీల గుంబాజ్‌తో ఆ మసీదు సుందరమైన శిల్ప రూపం. ఆ మసీదు ఆవరణలో తోటలో ఒమార్ గోరీ ఉన్నది. ఆతడు తన భవిష్యత్తు చెప్పుకొన్నట్లు ఆతని గోరీ పూవులువర్షం కురిసేచోటనే ఉన్నది. నాకు కన్నీరు తిరిగింది.

నిషాపూర్ అత్యంత పురాతన నగరం. క్రీస్తుశకం మూడవ శతాబ్దంలో నస్సేనియన్ రాజు ఒకడు ఈ నగరాన్ని నిర్మించాడు. నవ షిపూరు, నిషాపూరు అయింది. క్రీస్తుశకం 1038 సెల్‌జుకీ వంశీకుడు టుగ్రిల్ బేగ్ ఈనగరం రాజధాని చేసుకొని రాజ్యం స్థాపించాడు. టుగ్రిల్‌బేగ్‌షా అన్న మనుమడు మాలిక్‌షా కాలంలో నిషాపూరులో ముగ్గురు సహాధ్యాయులు మిత్రులు ఉండే వారు. వారే మహాకవి ఒమారూ, మహామంత్రి నైజామ్-అలీ-ముల్కా, హాషీషిన్ జట్టు (స్వర్గం చూపిస్తానని కోటీశ్వరులకు చక్కని బాలికలున్న భూతల స్వర్గంచూపి వారి ఆస్తిలాగి చంపేవారు) నాయకుడు హిసార్-ఇ-సభాహ యున్ను. ఈ ముగ్గురిలో ఎవరు జీవితంలోముందుగా అభివృద్ధిలోకి వస్తాడో, ఆతడు తక్కినవారికి సహాయం చేయాలని వారు మువ్వురూ రక్తశపథాలు తీసుకున్నారట. ఆ శపథాలు వారు నిలుపుకున్నారు.

ఒమార్ చనిపోయిన కొన్ని సంవత్సరాలకు ఈ పట్టణాన్ని మొగలులు పూర్తిగా దోచి నాశనం చేశారు. ఆ తర్వాత పునరుద్ధరింపబడి మళ్ళీ వృద్ధి పొందింది నగరం. అయినా భూకంపాలు, టర్కోమానుల దోపిళ్ళు ఈ తోటల నగరాన్ని రూపుమార్చి నేటి బీద నగరాన్ని లోకస్మృతిపథానికి అర్పిస్తున్నవి. ఈనాటి ఇరుకు సందులు, దుమ్ము బజారులతో నిండిన ఈ నిషాపురం, ఆనాటి ఒమారు నగరానికి స్మృతిచిహ్నం మాత్రం.

ఒమారు 'రుబియాట్' గ్రంథం చక్కని బొమ్మలున్నది నా దగ్గర ఉంది. అందులో ఒమారు గోరీ తోటలోని గులాబీపూవుల రేకులు కొన్ని ఉంచాను. ఒక చక్కని శిల్పరూపమున మృణ్మయ కలశము, చిన్న ప్రార్థన రత్నకంబళి ఒకటీ, ఇంకను కొన్ని వస్తువులు, ఆ ప్రదేశంలో దొరికిన పూర్వ నాణేలు కొన్ని సంపాదించి, వెంటనే పరిషియను ముస్లిములకు పవిత్రమైన మాషాద్‌పురం చేరుకున్నాను.

ఏది ఒమారు తిరిగిన సారాయిదుకాణం? ఏ తోటలో తిరిగినాడు? వెలుగు కిరణాలు పడిన సుల్తానుగారి భవనగోపురం ఏది? ఎక్కడ ఒమారు? అని ఆలోచించుకొంటూ నాలుగు గుఱ్ఱాల ప్రయాణపు బగ్గీమీద మాషాద్ చేరుకున్నాను. దారిలో హసనాబాద్ చూచి అబ్బాస్‌షా గోరీ చూచాను.

ఇరాన్‌లో షియా ముస్లింలకు మాషాద్ అత్యంత ముఖ్యమైన పవిత్ర ప్రదేశం. ఇక్కడ వారి ఎనిమిదవ ఇమామ్‌రిజాగారి దర్గా ఉన్నది. దీనిని వీరు మక్కాతో సమంగా చూస్తారు. నజాఅలీ నగరంలోని దర్గా, కల్బరా

లోని హుస్సేన్ దర్గాకూడా వీరికి పవిత్ర ప్రదేశాలు. రిజాఇమాం మొహమ్మదు వారి తర్వాత ఎనిమిదవ ఇమాం. ఈయనకు హార్-అరోన్ రషీద్ ఖాలిఫ్‌గారి కూతుర్ని ఇచ్చి వివాహం చేసి గౌరవించారు. అలీ-రషీద్ కుమారుడు మామాన్ గారు రిజాగార్కి విషం యిచ్చి చంపించివేశారు. ఖాలిఫ్ హారోనుగారి గోరీ, రిజాగారి గోరీ దగ్గరే ఉంది.

## 16

నేను మాషాద్‌పట్టణాన్నుంచి ఇంకో పారశీక మహాకవి పుట్టి నివసించిన ప్రదేశం చూద్దామని టస్ నగరం చేరుకున్నాను. టస్ నగరం 'అవెస్టా' పారశీక మతగ్రంథ మంత పురాతనం. ఆ పవిత్ర గ్రంథంలో ఉన్న తుఫా మహానాయకుడు. అతడు తురాన్ దేశ విజేత. ఆయనే ఈనగరం నిర్మించాడట. అలెగ్జాండరు ఈ నగరం దర్శించాడు. మంగోలు లీ నగరాన్ని పూర్తిగా ధ్వంసం చేశారు. కాని నేడు ఎంత శిధిలమై ఉన్నా, పిరదౌసీ మహాకవి ఈ నగరంలో జన్మించి, జీవించిన కారణాన ఈనాటికీ ఈ ప్రదేశం లోకాని కంతకూ పవిత్రం అయింది.

ఒమారుఖయ్యాం మహాకవి అని పారశీక ప్రజలకు తెలియకపోవచ్చును గాని పిరదౌసీని ఎరగని పారశీకుడొక్కడైనా లేడు. నన్నయ్యా, తిక్కన్న, పోతరాజులను ఏలా సర్వాంధ్రులూ పూజిస్తారో అలాగే పిరదౌసీని ఇరానీయులు పూజిస్తారు. పిర్‌దౌసీ క్రీ. శ. 935 సంవత్సరంలో టస్ నగరంలో జన్మించాడు. 1025 లో అక్కడే చనిపోయాడు. బ్రతికిఉన్న 90 సంవత్సరాలలో అనేక సుఖాలు, కష్టాలు, జీవిత విజయాలూ, దుర్గతులూ అనుభవించాడు. గౌరవమూ అగౌరవమూ పొందాడు. ఈ మహాకవి ప్రపంచోత్తమ గ్రంథాలలో 'షానామా' అనే ఉత్కృష్టకావ్యాన్ని రచించాడు.

పిర్‌దౌసీ అంటే 'స్వర్గధామం' అని అర్థం. ఈతడు అత్యంత పురాతనమైన ఇరానియన్ వంశాలవాడు. అరబ్ సంస్కృతిని టస్ నగరమూ, ఇరానూ భరించలేకపోయింది. దేశం అంతా తిరుగుబాటు చేసింది. ఆ తిరుగుబాటు యొక్క దీప్తకంఠమే పిరదౌసీ. ప్రాచీన వీరుల ధీరోదాత్తత, 'మా దేశం గొడ్డుపోలే' దన్న దేశభక్తి అకుంఠితమై, మహాగంభీరమై అతని వాణిలో ప్రవహించింది. ఈ ధీరగాథాలాపనంలో ఈతని పూర్వీకుడు డకీకి కవి. కాని టుర్కోమాన్ హంతకుడొక డాతని ప్రాణం దొంగబాటున గురిచేశాడు. ఆ డకీకి కవి స్వప్నంలోవచ్చి తాను ప్రారంభించిన పని పిరదౌసీని సంపూర్ణం చేయమని కోరినట్లు పిరదౌసీ చెప్పుకున్నాడు.

జరాత్రుష్టునిగూర్చి వేల పద్యాలలో పాడిన డకీకి కవిత్వం తన 'షానామా'లో పిరదౌసి చేర్చుకున్నాడు. ఈ గ్రంథం ప్రారంభించేసరికి పిరదౌసీకి 40 ఏళ్ళున్నాయి. ఒక్క కొడుకూ పోయాడు. ఆ విచార గానమూ, ఈ ఉత్కృష్ట కావ్యంలో శోకరాగాలు పాడుతుంది. ఒక్క కూతురు అతని

జీవితాంతంవరకూ పరిచర్యచేస్తూ బ్రతికిఉంది. ఈ మహాకావ్యం తలపెట్టి పిరదౌసీ గజనీమొహమ్మదు రాజసభకుపోయి, అక్కడ సభారత్నమై అరవైవేల ద్విపదలుగా షానామా రచించాడు. ఆ గ్రంథాన్ని గజనీమొహమ్మదు చాలా గౌరవించి, తగిన పారితోషికమిస్తానని అన్నాడు. కాని గజనీ సుల్తాను అరవై వేల వెండినాణేలుమాత్రం పంపాడట. అరవైవేల బంగారు దీనారాలు వస్తాయని పిరదౌసీ ఆశించాడు. దానితో ఈ డెబ్బదిఏండ్ల ముసలి కవికి కోపం వచ్చి ఆ నాణేలు తన సేవకులకు పంచి తాను దేశంవదలి పారిపోయాడు.

మొదట తన్ను గజనీమొహమ్మదు తన రాజసభాకవిరత్నాలలో ఒకణ్ణిగా తీసుకున్నప్పుడు పిరదౌసీ ఆ సుల్తాన్‌పై అత్యద్భుతమైన పద్యాలల్లాడు. నేడు కోపంతో ఆ భాగం అంతా షానామానుంచి తీసివేశాడు. పైగా గజనీని హేళనచేస్తూ భయంకర హాస్యకావ్యం ఒకటి రచించాడు. పదేళ్లు నిలువ నీడలేక తిరిగి చివరకు లూబరిస్తాను సుల్తాను సభాకవిగా ఆతడు చేరాడు. 'యూసుఫ్‌జులైఖా' అనే కావ్యం రచించి ఆ సుల్తానుకు అంకితం చేశాడు. తన ప్రాణం తన గ్రామంలోనే పోవాలని పిరదౌసీ చివరకు తన టస్‌నగరం చేరి అక్కడ దుఃఖంతో ప్రాణాలు విడిచాడు.

అక్కడ గజనీమొహమ్మదు పిరదౌసీ పారిపోయినప్పటినుంచి కించపడి తన మంత్రిన్నీ, పిరదౌసీ ప్రాణస్నేహితుడూ అయిన ఆల్‌మియమాందీ సలహా పాటించి తనకడనుండి పారిపోయిన ఇరవై ఏళ్ళకు అరవైవేల బంగారు దీనారాలూ ఒంటెలపై ఎక్కించి ససైన్యంగా పంపించాడు. ఆ సమయంలోనే పిరదౌసీ శవాన్ని తీసుకుపోతున్నారు. పిరదౌసీని ఆతని తోటలోనే సమాధి చేశారు. షియా అవడంవల్ల సాధారణ ముస్లిం సమాధి స్థలంలో కొందరు మత కర్తలు అడ్డంపెట్టారట.

ఎక్కడ ఉన్నదీ మహాకవి గోరీ? నగరం అంతా హంపీ శిథిలాలకన్న పాడైన స్థితిలో ఉన్నది. అక్కడ కొందరు ఇది అని నగరపు గోడల దగ్గర ఒక స్థలం చూపించారు. ఆ ప్రదేశమేనని జనశ్రుతి వస్తూఉంది. ఓ మహా కవీ! నీ కవిత్వమే ఆకాశాన్ని అంటే దివ్యభవనం. నీకు నీదేశసులే ఒక భవనం కట్టలేకపోయారా? నువ్వు సర్వదేశాలకు వినిపించిన ఉత్తమకావ్యం మసక మసక లాడక దెసలన్నీ నింపే కాంతై వెలుగుతూ ఉన్నది. ఆ సాయం కాలం ఆ శిథిలాలలో కూరుచుండి పిరదౌసీకి నా హృదయాంజలి అర్పించాను.

## 17

1935 డిశంబరు నెలాఖరుకు ఈజిప్టు చేరాను. పిరమిడ్లు, తీబ్సు, కొనారక, మెంఫిస్ పట్టణాలలో ఉన్న ప్రాచీన ఈజిప్టుదేశ సంస్కృతి దర్శించి, 1936 జనవరిలో గ్రీసుదేశం చేరాను. అథెన్సు, స్పార్టా, ఒలింపసు, కారిస్తు, డెల్ఫీ మొదలయిన ప్రదేశాలు చూచి, ఇస్తంబోలు పట్టణం చూచాను. అక్కడ

నుంచి బెల్‌గ్రేడ్, సోఫియా పట్టణాలు చూచి, ఇటలీ చేరుకున్నాను. ఇటలీలో రోము, వెనీసు, ఫ్లారెంసు, నేపిల్సు మొదలయిన శిల్పక్షేత్రాలు దర్శించి, ఉత్తరాఫ్రికా మొరాకో 1936 మార్చిలో చేరాను. ఫెజ్, ట్యూనిస్, సహారాలో చాలా కొద్ది భాగం చూచుకొని, అక్కడనుండి స్పెయినువెళ్ళి మాడ్రిడ్ పట్టణం, అల్హాంబ్రా మొదలయిన ప్రదేశాలన్నీ చూశాను.

1936 ఏప్రిల్ నెలాఖరున పారిస్ పట్టణం చేరాను. పారిస్‌లో లోవరి ప్రదర్శనశాలలో రోజులుగడపి, మార్సలే, వార్సైల్ రీమ్సు దేవాలయం మొదలైనవి దర్శించాను.

మే ఉత్సవాలకు రష్యా చేరాను. రష్యాదేశంలో శిల్పక్షేత్రాలను చూడడానికి, నవీన సాహిత్య శిల్పం దర్శించడానికి పూర్తిగా ఒకనెలా ఇరవై రెండు రోజులు పుచ్చుకున్నది.

జూను నెలాఖరుకు నార్వేచేరి జూలై పదవతారీఖువరకు నార్వే స్వీడనులు చూచి, ఇంగ్లండు చేరాను. ఇంగ్లండు, స్కాట్లండు, వేల్సు, ఐర్లండులు దర్శించడంలో ఆగస్టు పూర్తయింది. సెప్టెంబరు మూడవ తారీఖున బెల్జియంలో దిగాను. బెల్జియం, హాలండు, డెన్మార్కులు చూచేసరికి అక్టోబరు పదిహేనవ తారీఖు వచ్చింది. మళ్ళీ లండను మహానగరంపోయి, అక్కడ అక్టోబరు ఇరవై తారీఖున ఏర్పాటుచేసిన నా చిత్రలేఖన ప్రదర్శనసమయంలో ఉన్నాను. ప్రదర్శనవిషయంలో అనేకపత్రికలు అనేకరకాలుగా మెచ్చుకుంటూ వ్రాశాయి.

1936 డిశంబరు నెలలో మళ్ళీ నా దేశం చేరుకున్నాను. దేశాలు తిరగడం ప్రారంభిస్తే, అది నల్లమందలవాటైపోతుంది. 1937-38 సంవత్సరాలు రెండూ మా అమ్మగారితో భారతదేశ క్షేత్రాలన్నీ దర్శించాను.

ఇన్ని దేశాలు తిరిగినది నన్ను నేను కర్మవీరుణ్ణి చేసుకొనేందుకే కామా? ఏదో నాలో అసంతృప్తి బయలుదేరింది. ఒక్కొక్క మహాశిల్పమే దర్శించి నా అల్పత్వాన్ని తలచికొని నిట్టూర్పులు పుచ్చాను. నాలో శిల్పశక్తి ఎంత? ఏమి నేను రచించాలి? ఏ మహాభావం మూర్తించగలను? యూరపులో ఈ ఆవేదనే అనేక వెఱ్ఱితలలు వేసింది. డాడాయిజము, సర్ రియలిజము, క్యూబిజము, సింబాలిజము, ప్రిమిటిజము ఇలా అని, వారికేమీ తెలియని, సిమిత హృదయంకాని, సాయి చిక్కని ఆరాటంలో అన్ని వైపులకూ శిల్పులూ చిత్రకారులూ పరుగులిడుతున్నారు. దేశ కాల పాత్రలనుపట్టి మార్పులు రావచ్చును. శిల్పం అంతా ఒకే నది కావాలి. ఆనది కొండల్లో ఒక విధంగా ప్రవహిస్తుంది, బయళ్ళలో ఇంకో విధంగా యానంచేస్తుంది. వేసంకాలంలో నీలజలాలతో కృశాంగి అవుతుంది. వానాకాలంలో మహావేగియై గట్లు పొర్లి ప్రవహిస్తుంది. అంతేకాని సంవత్సరానికో కొత్తనది వానచూరుకాల్వలా బయలుదేరదు! అసంతృప్తి, ఆవేదనా కళలలో సిద్ధిని ప్రసాదించవు. నా దేశం తిరగటము లోనే నా జీవియొక్క స్థాయీభావం ప్రత్యక్షం అయింది. అది దూర

దూరానవే! ఆ సాయిని నాకు సన్నిహితం చేసుకోవడం ఎలాగు? యూరపు నుంచి వచ్చినప్పటినుండీ ఈ అసంతృప్తి నన్ను హత్తుకుపోయింది. ఒక చిత్రము పూర్తిగా రచింపలేను, ఒక శిల్పమూ పూర్తిగా విన్యాసం చేయలేదు. గీతలుగా కొన్ని, రంగులు పులుముడులుగా కొన్ని, రూపంతేలని మూర్తులు, భావంతేలని కలయికలు, స్ఫుటత్వం తాల్చని కంచెసారింపులైపోయినవి.

నేను స్వామిజీదగ్గరకుపోయి, 'స్వామిజీ! నాలోఉన్న కళ నాశనం అవుతున్నదా?' అని అడిగాను.

'ఓయి శిల్పీ! నీలో సగం లోటుగాఉంది. నువ్వు పాశ్చాత్యకళలు దర్శించావు. విల్హెల్మినా, సుశీలలతో చేసిన స్నేహచరిత్ర రహస్యం కొంచెం నాతో చెప్పావు. నీలో లోటయిన ఆ సగమేమిటో నువ్వు గ్రహించలేక పోయావా? నీ యూరపు యాత్రలలో, ఏదో వాంఛ నిన్ను వెంబడిస్తూన్నట్లు భావించాను అని నాతో చెప్పావు. అంగకరువాటులోని నాట్యస్త్రీ శిల్పం దగ్గర కన్నుల నీరు తిరిగినవి అన్నావు. పాలంపేట నృత్యమూర్తిదగ్గర ఏదో మహత్తరమైనబాధ అనుభవించానన్నావు. శ్రీనాథమూర్తీ! నీ పరీక్షాసమయం ఇంకా దాటలేదోయి, నువ్వు నీ అరభాగాన్ని వెదికివెదికి ప్రత్యక్షంచేసుకో! ఆ తపస్సుతో, ఆ దర్శనంతో నీకు సిద్ధి సంభవిస్తుంది' అని స్వామిజీ నాకు ఉపదేశించారు. ఆయన మాటలు నాకేమీ అర్థంకాలేదు.

## 18

నా శకుంతల నన్ను వీడి ఏడు సంవత్సరాలైంది. ఆమె నేను దర్శించిన ప్రతి ఉత్తమ శిల్పంలోనూ నాకు ప్రత్యక్షమయ్యేది. పాశ్చాత్య శిల్పాలలో ఆమె విలాసాలు చూచాను. 1938 ఏప్రిల్‌లో బయలుదేరి చీనా, జపాను దేశాలు దర్శించినప్పుడు, జపాను శిల్పవిన్యాసంలో హృదయమూ, చీనా శిల్పాలలో ఆమె యోగమూ ప్రత్యక్షమయ్యాయి. భారతీయశిల్పంలో నా శకుంతలా దేవి దివ్యత్వమే నా బ్రతుకును పవిత్రంచేస్తూ ఎదుట గోచరించినది.

చీనా జపానుదేశాలు తిరిగితిరిగి మళ్ళీ వస్తుంటే నాకు అంగకరువాటు శిల్పమూ బరోబదూరు శిల్పమూ తిరిగి దర్శించాలని కోర్కె కలిగింది. అంగకరువాటు ప్రయాణం అంతా నా మనోవీధిలో ప్రత్యక్షం అయింది. అంగకరు వాటులో, అంగకరు థోములో పదిహేనురోజులు మకాము వేసి ఆ శిల్పమూ, ఆ గుడుల అందమూ అన్నీ గమనించాను. ఈ శిథిలాలయాలున్న ప్రదేశమంతా, ఒకనాడు మహాపట్టణం. కాంబోడియా లేక కాంభోజ దేశానికి ఇది రాజధానిగా ఉండేది. తమ సంస్కృతిని పరదేశాలలో ప్రజ్వలింపచేసి, అనాగరకమై, రాక్షసమై ఉన్న ఆ దేశాలను నాగరికతతో నింపిన పూర్వ భారతీయులు మహోత్తములుకదా!

ఎక్కడ మలయా ద్వీపము! ఎక్కడి భారతదేశం! ఆస్ట్రేలియా, అమెరికాలను నెగ్గి, అక్కడ రాజ్యాలు నెలకొల్పడానికి పాశ్చాత్యులు ఎంతో కష్ట

పడ్డారు. కాని భారతీయులు ప్రజలను తమవారిగా చేసికొని, వారితో సంబంధ బాంధవ్యాలను నెరపుతూ నూతనరాజ్యాలు నెలకొల్పారు. మలయా, జావా, బోర్నియో, సుమత్రాలన్నీ మలయద్వీపాలుగా పరిగణింపబడేవి. ఇండో చీనాకుకూడా మలయద్వీపమనే పూర్వనామం. ఈ దేశంలోకి భారతీయులు వచ్చేసరికి, అనాగరులైన మంగోలియనుజాతి అన్నాములును, చీనానుండి రాజ్యంపేరను వచ్చిన దక్షిణ చీనావారును ఈ దేశం అంతా నిండిఉండేవారు. భరతదేశ తూర్పుతీరస్థులైన కళింగ, చాళుక్యాంధ్రులు, అంతకుముందు శాతవాహనకాల, తదనంతరకాల ఆంధ్రులును ఇండో-చీనా తీరంచుట్టి చీనాదేశం ఓడ వర్తకానికి వెడుతూ ఈ దేశంలో కొన్ని ప్రదేశాలు తమ మకాములుగా చేసుకున్నారు.

ప్రథమాంధ్రులు ఈ దేశవాసులకు ఖ్మేరులు అని పేరుపెట్టి రాజ్యస్థాపనం చేశారు. వీరు విష్ణుకుండి వంశీకులై ఉండవచ్చును. ఈ రాజ్యవంశీకులు ఖ్మేర రాజ్య కన్యల వివాహమాడి, తమతో వచ్చిన క్షత్రియుల నట్లే చేయించారు. వీరితో బ్రాహ్మణులు వలసవచ్చారు. రాజులలో శ్రుతవర్మ యశోవర్మలు ప్రఖ్యాతి గాంచారు. సముద్రమధ్యదేశమని మన పూర్వీకులు తలవడంచేత దీనికి కంబుజ లేక కాంభోజదేశం అని పేరుపెట్టారు. ఈ కుటుంబాలు రెండై, రెండు రాజ్యాలు స్థాపించాయి. ఆ నూతన ద్వితీయ రాజ్యంపేరు చంప.

తోన్లేసాప్, తోయధి అనదగిన మహాసరస్సు. ఈ ఆంధ్ర వంశీకులే ఇప్పటికి ఫ్రెంచివారికి మాండలికులై ఈ రాజ్యాన్ని రాజ్యంచేస్తున్నారు. వీరి ఆచారాలు తెలుగువారి ఆచారాలే. నొంఫే పట్టణం ఇప్పటి రాజధాని. ఆనాడు అంగకరరాజులు (కవచధరులు) వారి స్థానం అంగకరవాసమనీ, అంగకరధామమనీ ఆ రెండుగా మహాపట్టణం విభజించారు. బ్రాహ్మణులలో ప్రసిద్ధిగాంచినవాడు కాంబుజుడను బ్రాహ్మణుడట. అతడే ఈ రాజ్యము క్రీస్తువెనుక అయిదవ శతాబ్దిలో స్థాపించాడు. తర్వాత దివాకరుడను బ్రాహ్మణుడు పదవ శతాబ్దంలో ఈ రాజ్యం రెండుగా చీలినప్పుడు మళ్ళీ కలపడానికి కారకు డయ్యాడు.

ఇప్పుడు అంగకరధామంలో జయవర్మ క్రీ. శ. 900 లో కట్టించిన గుళ్లు చాలా కనబడుతాయి. ఈ గుడులచుట్టూ ప్రాకారం నాలుగుమైళ్ళ పొడుగు ఉంటుంది. గోడ ఎత్తు ముప్పది అడుగులు ఉంటుంది. ఇక్కడే మహారాజ మందిర చిహ్నాలు కూడా కనబడుతాయి. ఈ ప్రాకారానికి చుట్టూ అయిదు గోపురా లున్నాయి. ఈ గుళ్ళల్లో కాంభోజ దేశస్థాపకుడైన కంబుజ బ్రాహ్మణునియందు భక్తిని తెలపడానికి నిర్మించిన బయాం లేక బ్రహ్మగుడి ముఖ్యమైనది. బ్రహ్మ నాలుగు తలలు చెక్కిన ఏభైశిఖరా లీ గుడి ఆవరణంతా నిండి ఉన్నాయి. లోపల బ్రహ్మ విగ్రహం ఉండేది. తర్వాత బుద్ధవిగ్రహం పెట్టినారు. ఈ గుళ్ళల్లో అలంకారశిల్పం అత్యంత శ్రుతి స్వరూపమై,

శక్తివంతమై ప్రత్యక్షం అవుతుంది. రామాయణ గాథలు, నాట్యస్త్రీలు ఈ గుళ్ళల్లో, మండపాలలో నిండి ఉన్నాయి.

అంగకరవాసంలోను ఖ్మేరశిల్పం, వాస్తుసంపద ఉత్తమంగా ఉంది. ఈ గుళ్ళ ఆవరణ 6080 చతురపు గజా లుంటుంది. ఆవరణచుట్టూ లోతయిన అగడ్త ఉంది. ఇదీ బ్రహ్మగుడే. ఇక్కడా బౌద్ధమతం ప్రవేశించింది. కాంభోజ భాషలో సంస్కృతభాష మిళితమైపోయింది. కాంభోజదేశాన్నుంచి సయామదేశమూ ప్రవేశించింది. రాజులపేరులు సంస్కృతపు పేరులే! ఈ గుళ్ళల్లో నాగము మహోన్నత రూపం పొంది అద్భుత సాక్షాత్కార మిస్తుంది. పదిహేనురోజులుండి, ఆ విగ్రహాల చిత్రాలన్నీ గీసుకొని, ఓడ ఎక్కి మనదేశం చేరుకున్నాను. నా జావా యాత్ర, కాంభోజ యాత్రలు ఎప్పటికీ మరిచిపోలేను.

మా అమ్మగారిని భట్టిప్రోలునుంచి తీసుకుని హరిద్వారం చేరి, ఒక్కొక్క శిల్ప సంప్రదాయం రీతిగా, నేపాలు, టిబెట్టు, బర్మా, జావా, బలి, కాంభోజ శిల్పాలు పంచలోహాలతో అడుగు ఎత్తున పోతపోశాను. విల్హెల్మినా కన్య, సుశీలాదేవి నా శకుంతలలోని అంతర్భాగంలా అనుకున్నాను. కాలం కర్కశ వక్రాలకు శ్రుతిరూపం కల్పించి, సౌందర్యమే మన స్మృతికి తీసుకువస్తూ ఉంటుంది. మనుష్యుడు పశువైననాడు కర్కశుడు; అతడు మనుష్యుడైన నాడు శ్రుతిరూపం పొందుతాడు. దివ్యుడైననాడు సుందరమూర్తే అవుతాడు. దివ్యుడంటే భగవంతుడని నా ఉద్దేశం కాదు, దేవత అవుతాడనీ కాదు. మహోత్తమ మనుష్యుడు అవుతాడని! లోకం అంతా ఉత్తమస్థితిలో ఉండాలనీ, సర్వసమత్వం కావాలనీ ఎంచేవాడే ఉత్తమ మనుష్యుడని నా ఉద్దేశం. కాని ఆ కోర్కెలన్నీ చంపుకొని నేను తంతి ఇవ్వడంవల్ల నన్ను సింగపూరులో కలుసుకొన్న విల్హెల్మినా, డిగాంగులను, విల్హెల్మినా భర్తను చూచినాను. విల్హెల్మినా నాకు నమస్కరించి 'శర్వరీభూషణ్, నీ స్నేహంవల్ల నా శిల్పానికి చిత్రలేఖానికి ఏదో నూతనత్వం, ఏదో మహత్తరసౌందర్యం వచ్చిందనే డచ్చి విమర్శకులు ప్రశంసిస్తున్నారు. నీ గురుత్వం ఎప్పుడూ మరచిపోలేను. నిజమైన జావాతనం నా శిల్పచిత్రాలలో వెల్లివిరిసిపోతున్నదట!' అని కంట ఆనంద బాష్పాలు కమ్ముతుండగా పలికింది. ఆమె రచనలన్నీ నాకు చూపించింది. నన్ను బటేవియా వచ్చి తమ ఇంట్లో ఉండమన్నది. ఆమె భర్తకూడా నన్నెంతో ప్రార్థించాడు. కాని నా దేశంమీద మనస్సు ప్రవర్తిస్తున్న నాకు మా అమ్మ, నా దేశమూ, నా గురువు ఎదుట కనబడుతూ ఉండడంవల్ల వారి కోర్కె పాలింపలేకపోయాను. వారందరు గాఢప్రేమపూర్వకంగా నాకు వీడుకోలిచ్చారు. మా ఓడ సాగింది.

ఆ రాత్రి ఓడ పైతట్టుమీద అడ్డకడ్డీల నానుకొని ఆశ్వయుజ శరత్తాలపు వెన్నెల కెరటాలను, దూరాలను ముత్యాలకాంతిలో తేల్చి ఆడిస్తుండగా నా చరిత్ర అంతా తలుచుకుంటూ నిలుచున్నాను. ఎంతకాలం నా శకుంతలను

వదలి నేను ఈలా శిల్పమనీ, చిత్రమనీ కాలక్షేపం చేస్తూ ఉండను? ఈ జీవితం వృథా అనిపిస్తుంది. రష్యాలో, ఆ కార్మిక కర్షక మహారాజ్యంలోకూడా ప్రేమలేని బ్రతుకు ఎవరు బ్రతుకుతున్నారు? కర్మకు ఎంత పవిత్రత వారు ఆపాదించుకుంటున్నారో, ప్రేమకూ అంత పవిత్రతే ఉందనుకుంటారు. సన్యాసులు ఏ మంత్రబలంచేత స్త్రీ స్నేహం లేకుండా ఉండగలరో? పశుధర్మమైన స్త్రీ సంపర్కం వేరు, పవిత్రధర్మమైన ప్రేమ వేరు. ఏనాడు నా శకుంతల నా జన్మకు స్థాయీభావం అయిందో, ఆనాడే నా బ్రతుకూ సార్థకమయింది. నేడా స్థాయిలేని ఈ జీవితం నాకెందుకు? ఆమెను మరచిపోయేందుకు ఎంతదూరం పరుగెత్తగలను? ఈ లోకం వీడి ఇంకో నక్షత్ర కుటుంబంలోని గ్రహానికి పారిపోతే నా శకుంతలను విడిపోయిన నా దుఃఖం నన్ను వదులుతుందా? శిల్పమూ, చిత్రలేఖనమూ మత్తుమందులే అవుతున్నాయి. స్వామీజీ సన్నిధిని నాకు కొంత ఉపశమనం కలిగేమాట నిజమయినా, ఆతర్వాత ఒంటిగా ఉన్నప్పుడు నా దేవి నాకు మరింత స్పష్టంగా ప్రత్యక్షం అవుతుంది.

కొలంబో చేరి సింహళం అంతా తిరిగాను. అనూరాధపురంలో, సిగిరియాలో, కాండీలో నాకేమి ఉపశమనం కలుగుతుంది? ఈ శిల్పయాత్ర నా ఆవేదన మరింత ఎక్కువచేసింది. మనుష్యుని సర్వజీవిత రసజ్ఞత్వంలోంచి ఉద్భవించిన మహాసౌందర్యం నా శకుంతల సౌందర్యానికి ఏలా సరిపోతుంది అనుకున్నాను? ఎందుకీ అంతులేని యాత్ర?

ఎంతకాలం నేను తిరిగేది
  ఓ దివ్యమూర్తీ
అంతమే నా యాత్ర మాన్పేనా?

శిల్పమంతా నిండిఉన్నది
  చిత్రలేఖన నిండిఉన్నది
నీవులేని బ్రతుకు ఆవల
  భావి ఎందుకు? కళలతపనేలా?
ఓ. దివ్యమూర్తీ
  నన్ను విడిచీ నేను పరుగేలా?

## 19

ఎక్కడికి వెళ్ళినా ఎక్కడ తిరిగినా, నా గురుదేవుడైన కైలాసానంద మహర్షి దగ్గరకు నేను చేరవలసిందే. నాకు ఇరవైతొమ్మిదవ ఏడు వచ్చింది. ఎన్నో బొమ్మలు వేస్తున్నాను, ఎన్నో శిల్పాలు రచిస్తున్నాను. మరి మనశ్శాంతి లేదు. నా శకుంతల నా పక్కన ఉండి నేనీ అఖండ శిల్పయాత్ర చేస్తూ, ప్రపంచ శిల్పచరిత్రలో ఒక్క అణువుగానైనా నా శిల్పాన్ని అర్పించగలిగితే

నాకు ఆవేదన లేకుండా ఉండేది. అందుకనే కాదా అన్ని రసాలలోకి ఉత్తమం శృంగారరసం అన్నారు. లోకకల్యాణంగా, విశ్వశ్రేయంగా కావ్యం, శిల్పం రచించేవారు స్త్రీపురుష ద్వంద్వంగా ఉండే చేయాలి. స్త్రీపురుషు లిద్దరూ కలిస్తే సంపూర్ణ మానవత్వంవస్తుంది. రాధాకృష్ణ, లక్ష్మీనారాయణ, అర్ధనారీశ్వర, వాణీ బ్రహ్మాది భావాలు నాకా రోజుల్లో తరిమితరిమి వెంటవస్తూండేవి. నా శకుంతల నాతో లేనినాడు నాకీ కర్మంతా ఎందుకు ?

ఈ పెద్ద ప్రశ్నతోనే నా గురుదేవుల్ని చేరుకున్నాను. మా అమ్మ అక్కడ నాకోసం ఎదురుచూస్తూంది. నా ప్రయాణం ఒక్కొక్కటి అయినప్పుడల్లా మా అమ్మ ప్రాణాలు స్వామిజీ పాదాలదగ్గర ఉంచుకొని ఉంటుంది. ఆవిడ నాకోసం ఎంత బాధపడుతున్నదో. ఈ బాధలో ధైర్యాలూ వెలుగు నీడల్లా ప్రతి మనుష్యుని జీవితంలోనూ ఉంటాయి. మనుష్యుడు ఈ వెలుగు నీడల్ని తానైనా కల్పించుకుంటాడు, లేదా భగవంతుడైనా కల్పిస్తాడు.

కైలాసాశ్రమంలో నేనూ మా అమ్మ ఒక నెలరోజులున్నాము. స్వామిజీ దగ్గర ఉండి నా శిల్పరచనా, చిత్రరచనా సాగిస్తున్నా, నాలోని ఆవేదన ఏమీ తగ్గదు. రాత్రిళ్లు నిద్రపట్టదు. నా హృదయంలో శాంతి లేదు. నా శకుంతల నన్ను వీడిన రోజుల్లో నేను పడిన నరకయాతనకు, ఈనాటి యీ బాధకు చాలా భేదం ఉన్నది. ఆ నాటిది ఒక కత్తిదెబ్బ వంటిది. బుల్లెట్ చిటుకగొట్టే గదాఘాతంవంటిది. ఒక రైలు ప్రమాదం వంటిది. ఆరు నెలలు తిండిలేని ఆకలిబాధవంటిది. చలిలో బట్టలులేని బీద వాని మహాదుఃఖంవంటిది. ఈ నాటి బాధో ?

హరిద్వారంలో నాలుగునెలలుండి రూరిక్కుగారి శిష్యత్వం చేద్దామని మా అమ్మా నేను పంజాబు రాష్ట్రంలో హిమాలయాలలో ఉన్న కూలూ చేరుకున్నాము. ఒక బంగళా అద్దెకు తీసుకుని అక్కడ మకాంచేసి రూరిక్కుగారి మహాశిల్ప ఛత్రచ్ఛాయలలో శిల్పమూ చిత్రలేఖనము నిజంగా నేర్చుకున్నాను. రూరిక్ గారికి నా జీవితచరిత్ర యావత్తు మనవిచేశాను. వారు తమ అగ్నియోగాన్ని నా కుపదేశించి, తాము వ్రాసిన గ్రంథం ఇచ్చారు. 'వత్సా! నీ చరిత్ర విచిత్రమైనదే! ఏ మహాశిల్పం సాధించుటకు నువ్వు జన్మించావో అది సాగిస్తావు' అని ఆశీర్వదించారు. రూరిక్కుగారి చిత్రలేఖనంలో ప్రాచ్య ప్రతీచీ సంప్రదాయం సంశ్లేషజనితమైన ఒక మహాసంప్రదాయం ప్రత్యక్షమవుతుంది. ఎన్ని గంటలో రోజూ వారి బొమ్మలు చూస్తుండేవాడిని. ఎంతో ఆనందం కలిగేది.

తిరిగి 1939 జూలై నెలలో హరిద్వారం కైలాసాశ్రమంచేరి స్వామిజీ దగ్గర దీపావళివరకు మా అమ్మా నేను ఉన్నాము. దీపావళి వెళ్ళిన రెండు రోజులకు మా అమ్మ నాదగ్గిరకు వచ్చింది.

'నాన్నా ఇప్పటికన్నా నీ యాత్రలు పూర్తి అయ్యాయా!'

'ఏమి చెప్పగలనే, నా జీవితమంతా ఇలా తిరగడమే అవుతుందేమో! నా జన్మ నాకు వృథా అనిపిస్తోంది.'

'అదేమిటిరా? నీకు వచ్చినపేరు, ప్రతిష్ఠ ఇంకెవరికి ఉందా? ఇంతకన్న ఏమి కావాలిరా?'

'ఎందుకమ్మా పేరు?'

ఇంతలో స్వామిజీ మా దగ్గరకు వచ్చారు. ఆయన మోము ఉదయ కాలారుణ కిరణస్నాతమైన కైలాసశిఖరంలా మెరిసిపోతున్నది. ఆయన చిరు నవ్వుతో లేచి, ప్రణమిల్లిన మాఇద్దరినీ ఆశీర్వదించి, కూర్చుండమన్నారు. మేము ఇద్దరం కూర్చున్నాము.

స్వామి: మూర్తీ! నీ బ్రహ్మచర్యాశ్రమం పూర్తి అయ్యే రోజులు వచ్చాయి.

మా అమ్మ ఆనందంతో విరిసిన మోముతో స్వామిజీవైపు చూచింది.

నేనుమాత్రం వారిమాటలకు ఆశ్చర్యం పొందాను. నాకు నా శకుంతలకాక ఇంకెవరు కావాలి? సుశీలాదేవితో నాకు సంభవించిన ఆ తుచ్ఛ దేహసంబంధం చాలు. నా దేహంకోసం ఏ అందమైన బాలికతో సంబంధం పెట్టుకున్నా, గట్టితనంలేని నా మనస్సు విపరీతమైన వేదనపడి నన్ను నాశనం చేస్తుంది. లేదూ, ఒకవేళ ఆ సంబంధం వివాహ స్వరూపంగా వచ్చినా, ఆ వివాహం నామమాత్ర వివాహమే అవుతుంది.

స్వామిజి: మూర్తీ! నామాటలు నువ్వు అర్థంచేసుకోడానికి ప్రయత్నం చేయకు. నువ్వు తిన్నగా మీ అమ్మగారితో నీదేశం వెళ్ళు. అక్కడ శకుంతలాదేవి పేరున నెలకొల్పదలచుకొన్న పాఠశాల విషయం అంతా చక్కని ఏర్పాట్లు చెయ్యాలి కదా! అందుకు మీ కొల్లిపర వెళ్ళు. నీ భార్య ధాతువుమీద నువ్వు నిర్మించిన సమాధి దర్శించు. అక్కడ నీకు ఏవిధంగా తోస్తే ఆరకంగా చేయి.'

'చిత్తం స్వామీజీ.'

మేమిద్దరం కొల్లిపర చేరుకున్నాము.

## 20

మా మామగారి మేడ పాడుపడినట్లుగా ఉంది. ఆ కొన్నాట్లో ఏదో పురాతన కట్టడాన్ని చూస్తున్నాను అనుకున్నాను. మేడలో కొన్ని గదులలో తమ సామానంతా దాచుకుని, తక్కిన భాగమంతా, ఎవరికో ఊరికే కాపురం ఉండమని, మా మామగారిచ్చారట! అక్కడనుండి, నా దేవి స్మృతికై కట్టిన తులసికోట చేరాను. ఈ ప్రదేశాలన్నీ నేనూ శకుంతలా సంచరించినవే! ఇవన్నీ నాకు పవిత్ర ప్రదేశాలు. శకుంతలా పాదస్పర్శాంకితమైన ఈపుణ్యదేశం నాకు పూజార్హం. ఇక్కడే ఆమె పేరున ఉత్తమ స్త్రీవిద్యాలయం

నెలకొల్పాలి. ఆమెకై ఒక దేవాలయం నిర్మించాలి. ఆ దేవాలయంలో నేను నా జీవయాత్ర ముగిసేవరకూ భక్తితో పూజిస్తూ ఉండగలనుకదా అని ఏదో ఒక విచిత్రమైన ఆనందంతో నిశ్చలత పొందగలిగాను.

నేను ఇక దేశంలో చేయవలసింది అదే. ఘనశృంఖలాబద్ధయై తీరని వ్యథతో క్రుంగి ఎముకలప్రోగుమాత్రంగా ఉన్న నా తల్లికి విముక్తి తెచ్చే టందుకు అఖండ సత్యాగ్రహ తపస్సు చేస్తున్న మహాత్మా గాంధీగారికి అనుచరుణ్ణయి శకుంతలాదేవీ నామస్మరణంచేస్తూ నా జీవయాత్ర ముగించవలసి ఉన్నది. నాదేవి మహాత్ముని భగవదవతారమూర్తి అని భావించుకొని, ఆయన ప్రతిరూపాన్ని తాను ఎప్పుడూ పూజించేది. నా శకుంతలకున్న దేశభక్తి నాకు లేకపోయిందే! నాదేశంకోసం నా కళాభిమానం ఆహుతింపలేక పోయానే ఇంతవరకూ. ఎంత స్వార్థపరుణ్ణయి తిరిగినాను! 'మీరు కళలు మానవద్దు, దేశభక్తినీ మానవద్దు. మీ కళలతో మీ దేశాన్ని అర్చించలేరా? కళలతో మానవులకూ, దేశానికీ, భగవంతునికీకూడా పూజ చెయ్యావచ్చు కాదండీ' అని శకుంతల ఒకనాడు నాతో అన్న ముక్కలు విద్యుల్లతా రూపంతో నా హృదయంలో ప్రత్యక్షం అయ్యాయి. అంత చిన్నతనంలో ఎంత ధర్మపూరితమైన ఆలోచనలు నా దేవికి!

ఎంతసేపూ ఆరోజుల్లో, ఆమె దేహాన్నే వాంఛించాను. ఆమె దేహ సౌందర్యమే నామతికి మత్తుకల్పించేది. ఆమె నాకోసం ఎన్ని సిగ్గుచేటు పను లన్నా చేసేది. కాని ఎప్పటికప్పుడు అమృతపు చిరునవ్వులు నవ్వుతూ 'ఇదేమి చిత్రాలండీ! ఇదంతా తప్పుకాదుటండీ?' అనేది. ఆమె సంయోగసుఖం ఒల్లని యోగిని అని కాదుగాని, ఆమె ఆనందం ఏదో ఉత్తమ సిలినందిన భౌతి కానందం. నేను తుచ్ఛ పశుత్వానందం పొందేవాడిని. నా ఆనందంలోనిమత్తు ఆమెకు నవ్వు తెప్పించేది. ఆమె దేహం అణువు అణువునా గాఢచుంబన వర్షంతో తడిపివేస్తోంటే ఆ బంగారుదేహం ముడుచుకొనిపోయినట్లయ్యేది. ఆ దేహంలో ప్రతి అణువూ సిగ్గుపడేది. ఆమె ముద్దులు అమృత స్పర్శలు. నేనెంత ప్రయత్నించినా ఆమె ముద్దులవల్ల నే ననుభవించిన ఆనందం నా ముద్దులవల్ల పొందలేకపోయేవాడిని. ఆమె కౌగిలింతలో అతిగంభీరమైన పరిమళపు ముంపు ఉండేది. నా సంశ్లేషములలో వట్టి గాఢతమాత్రం ఉండేది.

కాలం వెళ్ళినకొలదీ నాలోని పశుత్వం మానవత్వంగా పరిణమిస్తుందని ఆమె అనుకునేది కాబోలు. లలితహృదయులైన కొందరు స్త్రీలు తమ దైవమైన భర్తలు తమవల్ల ఏలాంటి ఆనందం పొందినా తమ కది మహాభాగ్యమనే అనుకుంటారు. నే నెప్పుడైనా నా పశుత్వంవీడి మనుష్యుడనై ఆమెతో చరించినపుడు ఆమె నిజమైన ఆనందంతో పరవశత్వం పొందేది! అలాంటి దేవి నావంటి నిర్భాగ్యునకు ఎందుకు దక్కుతుంది? ఆమె వెళ్ళిపోయినతర్వాత

నా పశుత్వం హరించిందికాబోలు. శిల్పకళ ద్వారా మోక్షంకావాలని కైలాస పర్వతపాద పవిత్ర ప్రదేశంలో నేను అనుభవించిన మహాయోగం నా శకుంతల సహాయంలేకుండా ఎలా కొనసాగించగలను?

మా మామగారూ, అత్తగారూ కొల్లిపర వావలెనే మళ్ళీ చూడలేక మద్రాసులోనే కాపురంపెట్టారట. అక్కడ ఒక మేడ కొనుక్కొని మా మరదలికి చదువు చెప్పిస్తున్నారట. నా శకుంతలవలెనే హేమసుందరి చాలా తెలివైన బాలిక అనీ; చక్కగా పరీక్షలన్నీ విజయం పొందుతూ, బి. ఏ. ఆనర్సు తెలుగూ, సంస్కృతమూ పరీక్ష ఇవ్వబోతున్నదనీ; పదునాలుగో ఏటే స్కూలుఫైనలు పరీక్షకు వెళ్ళి గణ్యమైన విజయం పొందిందనీ; ఇంటరుకూడా మొదటిశ్రేణిలో మొదటి కొద్దిమందిలో నెగ్గిందనీ నాకు కొల్లిపరలో తెలిసింది.

ఇదివరదాకా, మా మామగారినీ అత్తగారినీ చూడలేక పిరికిపందనై, దక్షిణాదియాత్ర చేసినప్పుడుకూడా మదరాసు తప్పించుకొని తిరిగాను. ఈనాడు వారిమేడ మాసుంటే మా మామగారినీ, అత్తగారినీ చూచి, వారి పాదాల మీద పడి నా కంటినీరుతో అభిషేకంచేసి, పొంగిపొరలి రాబోయే నాదుఃఖానికి విడుదల ఇద్దామని ఏదో తీవ్రకాంక్ష పుట్టింది.

కొల్లిపరలో డిశంబరు నెలలో రెండువారాలవరకూ ఉన్నాను. శకుంతలా విద్యాలయం స్థాపించే విధానం అంతా ప్రణాళికలు తయారుచేస్తూ, శారదానికేతనం వెళ్ళి లక్ష్మీనారాయణ దంపతులతో సంప్రదిస్తూ పనిలో మునిగిపోయాను. మా మేనమామ కుటుంబంవారు, మా అక్కయ్యల కుటుంబాలవారూ వెళ్ళిపోయారు. నేనూ, మా అమ్మే మా ఇంటిలో మకాం. ఆ రోజుల్లో నా శకుంతలాదేవి విగ్రహం పంచలోహాలతో పోతపోశాను. శుద్ధ భారతీయ విన్యాసంతో, లలితాదేవి స్వరూపంతో దివ్యమూర్తిలా శకుంతల రూపం తాల్చింది. ఆమె మోములో ఆనాడామెను నేను పూజించిన పవిత్ర ముహూర్తంనాటి గంభీరహాసము ప్రత్యక్షంఅయింది. నా శిల్పజీవితంలో ఆవిగ్రహం పూర్తిఅయిననాడు నేను పొందిన సంతోషం ఇంకెప్పుడూ పొందలేదు. మర్నాడు ఆ విగ్రహం చూస్తూంటే నా మామగారినీ, అత్తగారినీ చూడాలనీ భరింపరాని ఆవేదన కలిగింది. వెంటనే మా అమ్మదగ్గరకు వెళ్ళాను. ఆవిడ ఇదివరకు వారిని రెండుమూడు సార్లు చెన్నపట్నం వెళ్ళి చూచివచ్చింది.

'అమ్మా! నేను చెన్నపట్నం వెళ్ళి మామగారినీ, అత్తగారినీ చూడాలని నాకు బుద్ధిపుట్టింది.'

'తప్పకుండా వెళ్ళు నాన్నా! ఇన్నాళ్ళు నువ్వు వారిని చూడకపోవడం ఏమీ బాగాలేదు. ఇప్పుడైనా నీ కా బుద్ధి పుట్టినందుకు చాలా సంతోషంగా ఉంది బాబూ! వెళ్ళు. నువ్వు దేశాలు తిరిగినప్పుడు నేను రెండుమూడుసార్లు చెన్నపట్నం వెళ్ళివచ్చాను.'

ఆ మర్నాడే బయలుదేరి చెన్నపట్నం వెళ్ళాను. పట్టణంలో మెయిలు దిగగానే ఏవేవో ఆలోచనలు నన్ను సుడిగాలిలా చుట్టివేశాయి. వెళ్ళి తిన్నగా వుడ్‌లాండ్సు హోటలులో మకాం పెట్టాను. ఆరోజు సాయంకాలం ఒక టాక్సీకి ఫోనుచేసి, రప్పించుకొని, గుండె మోగిపోతుండగా, మా మామ గారి ఇంటికి బయలుదేరాను. ఆ దంపతుల నిదరిసీ ఏలా చూడగలనని ఒక భయం, అక్కడ నా శకుంతల కనబడుతుందేమో అన్న ఏదో మతిలేని ఆశ నన్ను కారు ఎక్కుతుండగా వణికించివేశాయి. నా హృదయందగ్గిర ఎప్పుడూ బంగారుగొలుసున వేలాడే శకుంతలబొమ్మ పైకితీసి కళ్ళకద్దుకొని, కారులో కూర్చుని, పొమ్మని కారు అతనికి చెప్పాను.

## 21

తిన్నగా మా కారు వెళ్ళివెళ్ళి ఆళ్వారుపేట నాలుగువీధుల మొగనుంచి, పిఠాపురం దేవోరు భవనానికి ఇవతల కొత్తగా కట్టిన ఒక చక్కని మేడ దగ్గిర ఆగింది. అప్పుడే ఆ మేడముందర ఉన్న పోర్చిలో నిలిచిఉన్న కారు ఎక్కడానికి లోపలినుండి నా శకుంతల ఒక అమ్మాయితో కలిసి వస్తూన్నది.

శకుంతల! శకుంతల! నా తల తిరిగి నా కళ్లు బైరువులుకమ్మి ఒక్క నిమేషం మైమరపు కలిగింది. శకుంతల బ్రతికిఉందా! నిజమా! ఆ అమ్మాయి లిద్దరు నా కారువైపు చూచి, తమ కారెక్కినారు. ఆ కారు వెంటనే సాగి పోర్చి ముందరున్న ఎడమ మార్గంలోనుంచిపోయి చుట్టూఉన్న తోటదాటి గుమ్మందాటి వెళ్ళిపోయింది. నాకు భరింపరాని దుఃఖంవచ్చి, కంటనీరు జల జలా ప్రవహించిపోయింది. నేను గుండె దిటవుపరచుకొని, నన్నూ లోకమునూ వీడి వెళ్ళిపోయిన శకుంతలాదేవి మళ్ళీ ఎలా వస్తుందని, ఆ బాలిక నా మరదలయి ఉంటుందని నిశ్చయం చేసుకున్నాను. కారు ముందుకు జరిగి, వెళ్ళిపోయిన కారు స్థలంలోకి వచ్చి ఆగింది.

మొగం జేబురుమాలుతో బాగా తుడుచుకొని, కండువా సర్దుకొని, మా కారు డ్రైవరు తలుపుతీయగా, కారులోంచిదిగి, మెట్లెక్కి, హాలులోనికి అడుగిడి, అక్కడ ఉన్న సోఫాలో కూర్చున్నాను. ఇంతటిలోకే ఒకబోయీ, హాలులోకి వచ్చి, 'స్వామీ! ఎవరికోసం దయచేసినారయ్యా?' అని నన్ను ప్రశ్నించాడు.

'వినాయకరావుగారున్నారా?'

'చిత్తమయ్యా!'

'స్నేహితు లొకరు గుంటూరు జిల్లానుంచి వచ్చారని చెప్పు.'

'చిత్తం' అని ఆతడు లోపలికిపోయి చెప్పినాడు కాబోలు, వెంటనే ఆయన ఒక కఱ్ఱ చేత ఆనుకుంటూ నడిచివచ్చారు. ఆయన ఎంతో చిక్కారు,

కళ్లు లోతుకుపోయాయి. ఆ విఘ్నేశ్వరత్వమే లేదు. బుగ్గలు వేలాడుతున్నాయి. మొగంలో దుఃఖరేఖలు స్థిరత్వం తాల్చాయి.

నేను లేచినుంచొని వారి పాదాలకు నమస్కరించాను. ఆయన నావైపు తేరిపారచూస్తూ 'కూచోండి బాబూ! మీ పేరు? మిమ్మల్ని ఎక్కడనో చూచినట్లే ఉంది. పెద్దవాణ్ణయ్యాను. జ్ఞాపకశక్తి తగ్గిపోయిందండి.'

'నన్ను ఎక్కడ చూచినట్లున్నారు?'

'మీ మాటకూడా నాకు బాగా తెలిసినట్లే ఉంది. ఉండండి నాయనా. నాయనా! నువ్వు...నువ్వు శ్రీనాథ...మూర్తివి కావూ...?' ఆయన గజగజ వణికిపోయారు.

నేను లేచి ఆయనదగ్గరకు వెళ్లి ఆయన పాదాలదగ్గిర కూర్చుండిపోయాను.

'అవును మామగారూ...నేను...శ్రీనాథమూర్తినే!' మామగారి కళ్ళ నీళ్ళు జలజల ప్రవహించాయి. ఆయన నన్నదిమికొని, మాట డగ్గుతికపడ 'నాయనా...ఎన్నాళ్ళకు...వచ్చావోయి?...అయ్యో!...' అని మాటరాక ఊరుకున్నారు.

నా కళ్ళవెంట ప్రవాహాలు కట్టిన దుఃఖాన్ని దిగమ్రింగి, ఎక్కడలేని ధైర్యంతో 'మామగారూ! దేశాలు తిరిగితిరిగి ఈ నాటికి మిమ్మ కలుసుకోగలిగాను' అన్నాను.

ఆయన తన తీవ్రశోకాన్ని ఆపుకొని 'అయ్యో తండ్రీ! నీకూ మాకూ కలిగిన లోటు ఎన్ని జన్మాలకు పూర్తి అవుతుంది? నేనూ, మీ అత్తగారూ హేమను చూస్తూ ప్రాణాలు నిలుపుకున్నాము. హేమ ఇప్పుడే లోకంతో సినీమాకు వెళ్ళింది.'

'కారుమీద వెళ్ళింది హేమా అండి?'

'అవును!'

'అత్తగారు ఏమి చేస్తున్నారు?'

ఏదో పనిలో మునిగి ఉంటుంది. శకుంతలను తలుచుకొని కుళ్ళిపోని రోజుండా ఆవిడకు బాబూ! ఏదో వ్యావృత్తి పెట్టుకొని, దుఃఖం దిగమింగుతూ ఇద్దరం కాలక్షేపం చేస్తున్నాము.'

'లోకం ఎవరండీ?'

'లోకమా? హేమతో చదువుకున్న అమ్మాయి. మనింట్లో అమ్మాయిలా అయింది. వదలలేక ఇక్కడే ఉండమన్నాం. ఆ అమ్మాయి వెన్నవంటి మనస్సుతో మీ అత్తగారినీ నన్ను కనిపెడుతూంది. హేమకు అక్కగారు మాయమైన లోటు తీరుస్తోంది.'

'అలాగా అండి! అత్తగారికి నేనని ఒక్కసారి చెప్పితే, ఏమి కంగారు పడతారో?'

'అవును నాయనా! నువ్వు బొత్తిగా మారిపోయావు. ఆ నున్నటితనం అంతా పోయింది. మీ అమ్మగారు నీ విషయం అంతా చెప్పింది. ఎంతకాలం నువ్వు అల్లా ఉంటావు? వెళ్ళిన నా తల్లి మళ్ళీరాదుకదా? మీ అత్తగారూ, నేనూ మీ అమ్మగారికి మా కోర్కె ఒకటి చెప్పుకున్నాము. మీ అత్తగారికి, మా తల్లి పోయిన దుఃఖంతోపాటు నువ్వు ఏమయిపోయావో అని దుఃఖమే. నువ్వు దేశాలు తిరగడం, నీ జబ్బుసంగతీ అంతా మీ మామయ్య నాకు ఎప్పటి కప్పుడు ఉత్తరాలు రాస్తూనేఉన్నాడు. ఈపాటికి నువ్వు ఓ ఇంటివాడవై, నా కన్నతల్లి ఆత్మకు శాంతి ఇవ్వవోయి తండ్రీ!'

'అత్తగారికి మీరు వెళ్ళి నిమ్మదిగా నా రాకసంగతి చెప్పుతారా?'

'దగ్గరఉండి వంటలక్కతో వంట చేయిస్తూ ఉంటుంది' అంటూ, ఆయన లేచి కళ్ళు పుచ్చుకొని లోపలికి వెడుతూ 'నువ్వుకూడా రా!' అన్నారు.

నా బుజంమీద చేయివేసుకొని ఆయన నెమ్మదిగా నడుస్తూ, లోపలిహాలు దాటి, హాలువెనుక వసారాలోకి తీసుకువెళ్ళారు. ఇంకో చిన్న హాలులోంచి మేడవెనక ఉన్న వంటఇంటివైపు చూస్తూ 'ఏంచేస్తున్నావు?' అని కేకవేశారు.

'వస్తున్నా!' అని మా అత్తగారు జవాబిస్తూ ఈవలికి మేడనుంచి వంట ఇంటిని కలిపే చుట్టు వసారాలోకి వచ్చారు. నేను కొంచెం వెనక్కుతగ్గి నీడలో నుంచున్నాను.

'మన ఇంటికి చుట్టాలు వచ్చారే.'

'ఎవరండి వారు?' అని ఆమె నావైపు తేరిపారచూచారు.

మా అత్తగారెంత చిక్కిపోయారు! కాంతివంతమైన ఆ కళ్లు కగ్గి పోయాయి. ఫాలంమీద రేకలు! జుట్టు కొంత నెరసిపోయింది!

'ఇతన్ని ఆనవాలు పట్టగలవా? ముందుకురా బాబూ!'

'ఎక్కడో చూచినట్లే ఉంది!'

'నేనూ ఆనమాలు కట్టలేకపోయానే! దేశాలు తిరిగి, తిరిగి వచ్చాడు.'

'ఏమిటి! మూర్తా? మూర్తే!...' అని గభుక్కున కూలబడిపోయారు. నేను పరుగెత్తుకువెళ్ళి చటుక్కున ఆవిణ్ణి పట్టుకు నా తొడమీద ఆవిడతల పెట్టి పడుకోపెట్టుకున్నాను. వంటింటిపక్క సామానుకొట్టులో ఏవో సర్దుతున్న ఒక అరవ వంటబ్రాహ్మణుడు పరుగెత్తుకొనివచ్చి, మేడలోనికి పరుగెత్తి, వాసన మందుసీసా ఆమె ముక్కుదగ్గర పెట్టాడు. మా అత్తగారికి మెలుకువ వచ్చింది.

## 22

మా అత్తగారు నెమ్మదిగా లేచారు. 'నాయనా! శ్రీనాథమూర్తీ! నాతండ్రీ ఎన్నాళ్ళకు మమ్మల్ని చూడడానికి వచ్చావోయి?' అని గద్గద స్వరంతో అన్నారు. నాకూ కన్నీళ్లు తిరిగాయి. నా చేతి సహాయంతో

ఆమె లేచింది. నా ఆసరాతో తూలుతూ ఇవతలి హాలులోకి నడిచింది. అక్కడ ఉన్న తివాసీమీద మేమంతా కూర్చున్నాము.

'దేశాలు తిరిగి, తిరిగి వచ్చానండి అత్తయ్యా!' అన్నాను.

అత్తగారు: ఎన్నాళ్ళకు 'అత్తయ్యా' అనే ముక్క విన్నాను నాయనా! మమ్మల్ని అలా వదలివెళ్ళావు, మీ అమ్మగారిని వదలి ఉందువా?

మామగారు: ఏదో ఇప్పటికైనా వచ్చాడు. అతని దుఃఖం అతనిదీ. ఇంతకు మన బంగారుతల్లి వెళ్ళిపోయింది.

నేను తలవాల్చుకొని మాటలాడలేక ఊరుకొన్నాను.

అత్త: మూర్తీ, నా కెన్నాళ్ళనుంచో ఉన్న కోర్కను నువ్వు పాలిస్తావని ఉవ్విళ్ళూరిపోయాను. లాభంలేదేమోనని భయపడుతూ కళ్ళిపోతున్నాను. మీ మామగార్కీ అదేకోర్క.

మామ: అవును మూర్తీ! మా హేమ పెద్దదయింది. బి. ఏ. ఆనర్సు పరీక్షకు వెడుతుంది. దానికి నువ్వే మూడుముళ్ళూ వెయ్యాలి. ఈ మా కోర్క ఊరికే వచ్చిందికాదు మూర్తీ! ఈ విషయం మీ అమ్మగారికి ఇదివరకే చెప్పాను. అక్కగారు మీ స్వామీజీతో ఈ విషయం అంతా చర్చించిందట. అందుకు వారు సంతోషంతో అనుమతి యిచ్చారుట. ఈ కోర్క మావల్ల నువ్వు వినాలని కాబోలు స్వామిజీ ఈ విషయాన్నిగూర్చి నీతో మాట్లాడను అన్నారుట.

నే నేమీ పాలుపోక కూర్చున్నాను.

మామ: హేమ పెద్దదయింది. పెద్దపిల్లలకు సంబంధాలే దొరకటంలేదు. సంబంధాలు దొరుకుతాయి, దొరకవు అన్న ప్రశ్న లేనేలేదు. ఆరోజుల్లో ఈ ఊరు పారిపోయి వచ్చి హేమ చదువులో పైకివెళ్ళడం ప్రారంభించిన దగ్గరనుంచీ నీకు దాన్నిచ్చేకోర్క మా ఇద్దరికీ కలిగింది.

అత్త: మొగపిల్లలులేని మాకు నువ్వే కన్నకొడుక్కన్న ఎక్కువగా అయ్యావు. ఒకేసారి ఇద్దర్ని పోగొట్టుకోమంటావా మూర్తీ?

మామ: నాయనా నువ్వు రావడంతోటే మొదట భరింపలేని దుఃఖంకలిగింది. కాని ఆ వెంటనే మా శకుంతల బ్రతికివచ్చినట్లే అయింది. అప్పుడే మీ అత్తగారు ఎంత ధైర్యంతో మాట్లాడుతున్నారో చూడు!

అత్త: నాయనా! నాకు భగవంతుడు ప్రత్యక్షం అయి 'ఏంకావాలి వరం' అంటే ఈకోర్క ఒక్కటే నాకు వరం అవుతుంది. నా కింకేమీ వద్దు.

మామ: హేమ పెరుగుతున్నకొద్దీ అచ్చంగా శకుంతల పోలికలన్నీ దానిలో మూడుమూర్తులా ప్రత్యక్షం అయ్యాయి. కాని, అది అవతారమూర్తి. ఇది అల్లరిపిల్ల!

అత్త: హేమకు మేమంటే వెర్రి ఆపేక్షకాని చెప్పినమాట వినదు. గట్టిగా చెప్పలేంకదా నాయనా! ఈ చదువు చెప్పించాము. ఏం చదువులో!

మామ : అన్నీ ఏవో విచిత్ర పద్ధతులే! వీళ్ళనీ వాళ్ళనీ అందరినీ పోగుచేస్తుంది. సినిమాలంటుంది, టెన్నిసు ఆట అంటుంది, షికారులంటుంది, టీపార్టీలంటుంది. ఇదీ ఈనాటివాళ్ళ చదువుల ఫలితం తండ్రీ! నువ్వే మా హృదయంలో హేమకు భర్తవు. మా ఇద్దరికోర్కె తీర్చుబాబూ!

అప్పటికి ఆ ప్రియదంపతులు గుక్క తిప్పుకున్నారు. నాకు అనుకోని ఆలోచింపని అతిక్లిష్టమైన సమస్య ఒకటి తెచ్చిపెట్టారా దంపతులు. స్వామీజీ వరకు ఈ విషయం వెళ్ళిందా? అదేనా ఆయన ముక్కలకు అర్థం! అచ్చంగా శకుంతలపోలిక! ఓహో! నా శకుంతలే తిరిగివచ్చిందా! నా దేవతామూర్తి తిరిగి ప్రత్యక్షం అయిందా! అని ఆవేదన పడిపోయానుగదా హేమను చూడగానే. ఇంత విచిత్రమైన పోలిక వచ్చిందేమిటి? కవలపిల్లలలో నన్నా పోలికలు కొంచెం తేడా ఉండవచ్చును. మెరుములా నాకు హేమ కనబడిన పరిక్షణాలల్లో నాగుండెచలనం ఆగిపోయింది! కైలాసేశ్వరుడు ఈ పోలిక హేమ కెందుకిచ్చాడు? ఇంత విచిత్రమైన పోలిక ఏలా సంభవమైంది. అదే నడక! ఆ చూపులే! మళ్ళీ నాదేవి ప్రత్యక్షం అయింది అనుకున్నా! నేను నమ్మలేదు. నా ఊపిరే ఆగిపోయింది. భ్రమ అనుకున్నా! లోకమే తిరిగిపోయింది...అవెంటనే అత్తగారూ, మామగారూ, ఋషిదంపతుల వంటివారు ఈ మాటలేమిటి?

నా గుండెలో నా కుడిచేయి నా శకుంతలబొమ్మపై వేసి, ఒక్కనిమేషం కళ్ళుమూసుకున్నా! 'మాటియ్యండి నేనే హేమను. హేమే నేను! మీకోసం హేమలో ఎదురుచూస్తూ ఉన్నాను. ప్రాణమూర్తీ! అమ్మకూ, నాన్నకూ మాట ఇవ్వండీ' అని నా హృదయంలో మాటలు మారుమ్రోగినట్లయినది.

'అత్తయ్యా! ఈ విషయం నేనెప్పుడూ అనుకోలేదు. నాకసలు మళ్ళీ పెళ్ళి చేసుకోవాలన్న భావం ఎప్పుడూ కలగలేదు. కాని మీ ఆజ్ఞ పాలించడంకన్న నాకు ఉత్తమమైన కార్యం ఇంకోటిలేదు.

అత్త : నాతండ్రీ! నాకు ప్రాణం లేచివస్తోంది. నాతల్లి తిరిగి బ్రతికివచ్చినట్లే అవుతున్నది. మళ్ళీ నువ్వు మమ్ము విడిచి ఎక్కడకూ వెళ్ళకు తండ్రీ. మీ అమ్మగారిని ఎలా క్షేత్రాలు తిప్పావో అల్లాగే మమ్మల్ని తిప్పుగాని, మా ఇద్దరిని నువ్వు వదలనని మాటయివ్వు మూర్తీ!

మామ : నాయనా! మీ అత్తగారి మాటలన్నీ వేదవాక్యాలు. నీకోసం ఈ తొమ్మిదేళ్ళూ ఎక్కువ కుమిలిపోయింది!

నేను : మామయ్యగారూ! నేను ఇక మీ యిద్దర్నీ వదలి వెళ్ళనండి. ఈ ఊరే వచ్చి మా అమ్మ, నేనూ కాపురం పెడతాం. ఒకటిమాత్రం నాకు తోస్తోంది. నేను ఫలానా అని హేమకు తెలియనీయకండి. అలాంటి ఆలోచన ఎందుకో నాకు ఘట్టిగా తట్టింది. ఎవరో చుట్టం అని చెప్పండి.

ఏ అడయారులోనో ఏ సందర్భంలోనో నాకూ ఆమెకూ పరిచయం కలుగ జేయండి. ఇప్పుడు వద్దు.

మామ : అదీ బాగానే ఉంది. పెళ్ళంటే దాని ఆలోచనలు విపరీతంగా ఉన్నాయి.

అత్త : పెళ్ళే చేసుకోనంటుంది. అదేమాట చిన్నతనాన్నుంచీ! పెళ్ళి అంటే ఏడ్చేది. అతికోపంతో గుడ్డలు చింపుకునేది. నేనూ మీ మామగారూ భయపడి దానిదగ్గర పెళ్ళిమాటే తలపెట్టడం మానివేశాము.

నేను : అందుకనే...ఆమె...నన్ను...పెళ్ళిచేసుకునేటట్లు నేను చేసుకోవాలి కదా!......చదువుకున్న పిల్ల! వాళ్ళకు విచిత్రమైన ఆలోచనలు ఉంటాయి.

మా మామగారూ, అత్తగారూ కొంచెంసేపు మౌనం వహించారు. మా అత్తగారు కన్నీరు కారుస్తూనే ఉంది. కన్నీళ్ళు తుడుచుకుంటూ, 'నాయనా! ఎప్పుడు వచ్చావూ? ఇప్పుడు బందేముందీ? ఎక్కణ్ణుంచీ?' అని ప్రశ్న వేసింది.

'నేను ప్రొద్దున మెయిలులో వచ్చానండి...తిన్నగా మీ ఇంటికి రాలేకపోయాను. అదీ మంచిదే అయింది. వుడ్‌లాండ్సులో దిగాను. కొల్లిపర నుంచే వచ్చాను. అక్కడకువచ్చి రెండునెలలు కావచ్చింది. అక్కడ పాఠశాల పెట్టించాలని ప్రయత్నం చేస్తున్నా' అని జవాబిచ్చాను. మా మామగారు 'నాయనా తిన్నగా ఇక్కడకు వచ్చేసెయి' అన్నారు.

నేను : అలావద్దండి. మనం ఇప్పుడనుకొన్న పని ఆలోచించి చేయాలి. నేను నాలుగ్రోజులుండి, మంచి ఇల్లు మాట్లాడుకొని, ఇంటికివెళ్ళి అమ్మను తీసుకొని వస్తాను. రేపు అడయారు ఉత్సవాలుకదా! అక్కడకు మీరంతా రండి. అక్కడ హేమను కలుసుకుంటాను.

అత్త : నాయనా! నువ్వు ఫలానా అని హేమకు తెలియజేయకపోవడం మంచిదా? సరే ఆలోచిద్దాం...రేపు పదకొండు గంటలకు మాయింటికి రా! అప్పటికే అమ్మాయి, లోకేశ్వరీ వెళ్ళిపోతారు.

హేమా! ఇదీ నాకథ. ఎంతో ఆలోచించి ఈలా చేశాను. నేను మీ బావనని ఒక ఏడాదిపాటు చెప్పకుండా ఉండడం బ్రహ్మయజ్ఞం అంతపని అయింది. మీ పాపారావు బాబయ్య రావడం భగవంతుని ఆజ్ఞలాంటిదయింది. ఆయన ఇంక ఈ నాటకం చాలించమన్నాడు. లోకేశ్వరి ఒక నెలక్రిందటే నేను ఫలానా అని అనుమానపడింది. నన్నడిగింది. నిజం ఒప్పుకొని, కారణం చెప్పాను. ఆమె సంతోషంతో మా కుట్రలో చేరింది. నాపని కుట్రవంటిదే! నువ్వులేని సమయాలలో నేనూ, అత్తగారూ, మామగారూ ఈ విషయాలే మాట్లాడుకొనేవాళ్ళం. నాకు తిరెత్తులో వచ్చిన బిరుదు 'త్యాగతి శర్వరీభూషణ్' అనే పేరుతో అడయారులో నిన్ను దర్శించాను. నీ త్యాగతి ఈలాంటివాడు హేమా!

# తృతీయ భాగము

## హేమకుసుమ సుందరి

### 1

చిత్రమైన త్యాగతి కథ అంతా చదువుకుంది హేమసుందరి. కాబట్టి శ్రీనాథమూర్తి బావకూడా తన్ను వివాహం చేసికో సంకల్పించుకొన్న స్వయం వర నాయకులలో ఒకడా! అప్పుడే అనుకుంది. తాను త్యాగతిని ఆ హిమాలయం కొండలమీదనుంచి దింపాలని సంకల్పించింది. అదివరకే దిగిఉన్నాడు. కల్పమూర్తి వగైరాదులవలే ఇతడూ ఒక డయ్యాడు.

ఆమె మొగం జేవురించింది. ఆడదంటే కబళించే ఇడ్డెనని మగవాళ్ళ ఉద్దేశం. ఆడదే ఎందుకు మగవాళ్ళను ఎన్నుకోకూడదమా? ఆమె లేచింది, కూర్చుంది, మాట్లాడకుండా స్నానానికి వెళ్ళిపోయింది. స్నానంచేసి హేమ సత్యభామలా అలంకరించుకుంది. బావ అని తెలిసికోవడం ఆనందమూ అయింది. త్యాగతి అంటే తాను ఊహించుకొనే ఏవో విచిత్రపథాలన్నీ కరిగిపోయాయి. కాని తన బావ చరిత్ర ఎంత ఉత్కృష్టమైంది. తన అక్క కోసం ఎంత బాధపడినాడు. తనలో శకుంతలాదేవిని చూచాడా? అదీ నిజమే! తాను నూరుపోలికలా తన అక్క! పదిముఖ్యమైనవాటిలోమాత్రం సంపూర్ణమైన తేడా! తన అక్క బ్రతికి ఉంటే? బ్రతికిఉంటే నలుగురు పిల్లల తల్లియైను. ముసలిదానిలా తయారవును. తాను చూట్టంలేదూ, లోకంలో అందమైనవాళ్ళు అనుకున్నవాళ్ళని! తనతో చదువుకున్న అంబుజమ్మ అప్పుడే ఇద్దరిపిల్లల తల్లి. వట్టి ముసలినక్కలా ప్రత్యక్షమైంది. కాలేజీపిల్లగా ఉన్నన్నాళ్లు ఎంత టక్కుల టమారిలా గ్రేటాగార్బోలా, మార్లీనీడీట్రిచ్చిలా, లీలాఛిట్నీసులా ఉండేది? ఇప్పుడు ఐదువందలసంవత్సరాలనాటి ఆడ ముత్తయిదువులా ఉంది.

అదే ఆడదాని బ్రతుకు. మగవాడు టింగురంగా అని ముసలితనం వచ్చే వరకూ పెళ్లికొడుకులానే ఉంటాడు. మగవాడే ఎందుకు బిడ్డలను కనగూడదు? పోనీ ఆడది బిడ్డనుకంటే, పాలివ్వడంవంతు మగవాడిపాలిట ఎందుకు పడలేదో? అయినా తన అక్క దేవతాస్వరూపిణి. ఆమె యౌవనంలో ఏలా ఉన్నదో, బిడ్డలు కన్నతర్వాతా అలాగే ఉండిఉండును. కాని, తన బావ ఇంత మహోత్తమశిల్పి అయిఉండునా? అప్పుడు ఇరువురు కలిసి ఈ దేశాలన్నీ తిరిగి ఉందురేమో?

ప్రపంచంలో ప్రణయమో, ప్రళయమో ఇంత గడబిడ ఎందుకు? రాజ్యాలు, అభ్యుదయం, కళలు, భగవంతుడు అన్నీ వెనకబడుతాయి. ఈ ప్రేమ అనే తేమభావంవల్ల ఎడ్వర్డు చక్రవర్తి రాజ్యం వదులుకున్నాడు. ఓ అమ్మా

యినో, ఓ అవ్వనో చేసుకోనడానికి. యుద్ధం నడిపే నాయకుడు తనకు నచ్చిన ఆడది కనబడితే ఆ రోజు యుద్ధం ఆపాడన్నమాటే. నెపోలియను అంత వీరాధివీరుడు మేరి వారియొవ్స్కావల్ల రష్యాయుద్ధంలో తన్నులుతిన్నాడు, చివరికి నాశనమూ అయ్యాడు.

ఎందుకు స్త్రీలబ్రతుకు ఇలా అయింది? తనబావ శ్రీనాథమూర్తి జీవితం అంతా శకుంతలాభావం నిండి ఉందట? శిల్పం సృష్టించే మొనగాడు తానేనా? అందుకో శకుంతల కావాలా? దానివెనక సుశీలా, విల్హెల్మినా, ఇంకా ఓ వేయిమంది ఆడవాళ్ళా? మహానుభావుడు! తాను శిల్పకళ ఉద్ధరించకపోతే ప్రపంచం తలక్రిందవుతుందా? ఈ నంగనాచి మాటలు ఆడది అనలేదా? సత్యరాజా అపూర్వ చైత్రయాత్రలో ఆడమళయాళం అద్భుతంగా ఉంది. వస్తే గిస్తే ప్రపంచం అంతా ఆ పరిస్థితులు రావాలి. అప్పుడు శ్రీనాథమూర్తులూ, గీనాథమూర్తులూ భోగపురుషులవుతారు, లేదా, వితంతువులై ముక్కులు తెగకోయించుకుంటారు.

రష్యాయే తనకు బాగా నచ్చిందని హేమ అనుకుంది. ఆడది ఎందుకు ఈ కులుకులమిఠారి కావలసివచ్చింది? పక్షుల్లో జంతువుల్లో కులికేది మగపక్షి, మగజంతువూ! పనిచేసే కూలిపిల్ల నలుగురు మగవాళ్ళను పళ్ళూడగొట్టగల బలంకలది కూడా, మగవాడు కనబడేటప్పటికి వాలుచూపులు చూస్తుంది. చిరునవ్వులమాల పెదవులపై వేలాడవేస్తుంది. పయిట జారవిడుస్తుంది. రష్యాలో మాత్రం ఆడది యుద్ధానికి తయారైనా, పక్కనున్న సైనికుడి పెదవులమీద ఇంత అధరామృతం కురిపిస్తూనే విరోధి గుండెల్లో అగ్నివర్షం కురిపిస్తుంది.

ఆన్ వికర్సులో సింక్లెయిరు లూయీ వ్రాసినట్లు, దేశాల సర్వ ఉద్యమాలూ నడిపే స్త్రీలుకూడా పక్కలోకి పశువు కావాలనే అంటారు. కాంగ్రెసు ఉద్యమంలో, ఇంకా అన్ని ఉద్యమాలల్లో, ఉత్తమనాయికలెందరో ఆలాంటి కక్కుర్తులపాలవటం లేదు? కాలేజీ బాలికల చరిత్ర ఒక పీడకలే! ఆడపిల్లలున్నారని మగవాళ్ళంతా బోగంవాళ్ళలా వేషాలు వేసుకుని అందరూ క్లార్క్ గేబుల్, ఫ్రెడ్ ఆస్టెయిరు, ఫ్రెడ్ మాక్ ముర్రే, డాన్ ఆమెచీలు అనుకుంటూ వస్తారు. అందుకు ప్రతిగా ప్రతిబాలిక హెడ్డీలా మేరీ, డయానా డర్బిన్, కాథరైన్ హెప్బరన్ అనే అనుకుంటారు. ఛీ! ఛీ! 'వుమెన్' అనే చిత్రం ఆడవాళ్ళ స్వేచ్ఛా నిరర్థకత్వం చాటడానికి తీశాడు మగాడు. గుడిపాటి వెంకటచలం చచ్చురాతలస్వేచ్ఛ, ఆడది అందరి మొగ వెధవల పక్కలో పడుకునే స్వేచ్ఛ! దేశంలో ఉన్న ప్రతి ఆడదీ ఆ నాగమ్మగారి పక్క పండాలనా ఆయన ఉద్దేశం?

ఇంతకూ తనుమాత్రం ప్రపంచానికి అందాల అందాలబరిణ, చిన్నారి చిలక, పొన్నారి పోక అనిపించుకుందామని ప్రయత్నం చేయటంలేదా? అలా

తనతోటి విద్యార్థినులలో ఎవరు చేయటంలేదు ? నిజంగా ఆలోచిస్తే, సంసారాలల్లో ఉన్న ఆడవాళ్ళే నయమేమో ! నలుగురి బిడ్డలతల్లులు కాగానే అందాల ఊర్వశిలా కనబడాలన్న వాంఛ చంపేసుకుంటారు. బడాయికి మాత్రం చీరలూ నగలూ కావాలంటారు. తన తల్లిసంగతి చూస్తే అచ్చంగా పేదరాసి పెద్దమ్మలా ఉంటుంది. తన అక్క-అత్తగారు జుట్టంతా తీయించుకొని సన్యాసినిలా లేదా ? ఈ ఆలోచనలతో హేమ తల తిరిగిపోయింది. సరే ఇంతకూ త్యాగతి...కాదు...మూర్తి...బావ విషయంలో తన ధర్మం ఏమిటి ?

## 2

శ్రీనాథమూర్తి తన చరిత్ర లోకేశ్వరి చేతులో పెట్టి, హేమకిమ్మని చెప్పిన తర్వాత, మూడురోజులవరకూ మామగారింటికి రాలేదు. రోజూ వచ్చే మూర్తి మూడురోజులు ఎందుకు రాలేదా అని, వినాయకరావుగారు కారుమీద త్యాగరాజ నగరంలో సైదాపేట దరిదాపుగా ఉన్న శ్రీనాథమూర్తి ఇంటికి వెళ్ళారు. శ్రీనాథమూర్తి ఒక చిన్న మేడ కొనుక్కున్నాడు. ఆ మేడ పక్క వేరే ఖాళీసలమూ కొనుక్కున్నాడు. ఆ స్థలంలో శిల్పగృహ మొకటి కట్టించుకొన్నాడు. ఇదివరకే మూర్తి ఇంటికి పది పదిహేనుసారులు వినాయకరావుగారూ వెంకటరామమ్మగారూ వచ్చారు. మూర్తి కట్టించే శిల్పగృహము అప్పుడప్పుడు పర్యవేక్షణ చేస్తూఉండేవారు వినాయకరావుగారు.

ఆయన కారువచ్చి గుమ్మందగ్గిర నిలవగానే త్యాగతి శర్వరీభూషణుడైన శ్రీనాథమూర్తి లోపలినుండి వెంటనే బయటకువచ్చి, మామగారిని ఆహ్వానించి, లోపలికి తీసుకునివెళ్ళి, తన అతిథిమందిరంలో కూర్చుండబెట్టాడు. ఆ అతిథి మందిరం ఎంతో అందంగా ఉంది. అందులో ఒక సోఫాగాని, కుర్చీగాని లేదు. అడుగుఎత్తు కోళ్ళున్న పెద్దబల్లలూ, ఆ బల్లలపై చక్కని బందరు జాతీయ కళాశాల రత్నకంబళ్ళూ; తివాచీల రంగులకూ, లతలకూ శ్రుతికలిపే అందమైన రంగులూ, లతలూ ఉన్న పట్టుదిండ్లూ ఉన్నాయి. లలితంగా నీలవర్ణం పూయబడివున్నవి గోడలు. నాలుగు గోడలకూ నాలుగు పెద్దవి కైలాసశిఖర చిత్రలేఖనాలు ఉన్నవి. బల్లలకు ఎదురుగా అక్కడక్కడ లతలుచెక్కిన మూడు కోళ్ళ పీఠములు, వానిపైన ఆంధ్ర, హిందూ మొదలయిన దినపత్రికలు; భారతి, మోడరన్ రివ్యూ మొదలయిన మాసపత్రికలు; కృష్ణా, సండేటైమ్సు మొదలయిన వారపత్రికలు చక్కగా అమరింపబడి వున్నవి. నాలుగుమూలల నల్లచేవకఱ్ఱల అలంకారశిల్పవిన్యాసయుక్త పీఠికలపై మూర్తి రచించిన మూడడుగుల ఎత్తు రాతి విగ్రహాలు, తాండవకృష్ణుడు, నటేశ్వరుడు, నృత్యసరస్వతి, రంభా నాట్యము విగ్రహాలున్నాయి.

'నాయనా ఈ మూడురోజులూ ఎందుకు మాయింటికి రాలేదోయి' అని వినాయకరావుగారు శ్రీనాథమూర్తిని ప్రశ్నించారు.

'నా చరిత్ర అంతా ఒక పుస్తకంగా రాశానండి. అది హేమకు చదవమని అందచేశాను.'

'అమ్మయ్యో! ఇప్పటికైనా రహస్యం బయలుపరచావయ్యా! ఏడాది ఈ నాటకం నడిపావు. నీ దోషాన్ని మేమూ పాలుపంచుకున్నాము. ఇంకేముంది? మా హేమకు ఏమని జవాబుచెప్పను? నన్ను దూదిఏకేస్తుందయ్యా నాయనా!'

'నేను ఏం చెయ్యాలో నిర్ణయించుకొనే, ఆపుస్తకం ఆమెకు పంపించా మామయ్యగారూ! హేమ నాకోసంగాని, ఏదైనా వంకతోగాని మాయింటికి వచ్చేటంతవరకూ, మీయింటికి రాను.'

'ఏమి టీ జర్మనీయుద్ధం?'

'నేను హేమ హృదయంలోని అభిప్రాయాలతో మహాయుద్ధం చేస్తూనే ఉన్నాను. ఇంతవరకూ హేమదే విజయం! అందుకని ఈ ఎత్తు ఎత్తాను. దీని పర్యవసానం ఏమవుతుందో?'

'ఇందులోమాత్రం మా హేమే నెగ్గకుండా ఉంటుందా?'

'అదే నేనూ అనుకుంటున్నానండి.'

'అయితే ఈలాంటి పని ఎందుకుచేశావుబాబూ?'

'ఇవన్నీ చివరవిజయానికి మెట్లేనండి!'

'ఏమో మూర్తీ! మీ అందరి హృదయాలూ నాబోటివాళ్ళకు అగమ్యగోచరం!'

'మీరు మీకాలంలో మీతాతగారి ఎత్తులకన్న కొత్తఎత్తులు వేయలేదా?'

'ఎత్తులంటే జ్ఞాపకం వచ్చింది. ఈనాటి చదరంగం ఆటవేరు, మా రోజుల్లో ఆట వేరు.'

'మీ ఆటకన్న ఇంక''రకంగా మీ తాతగారి ఆట ఉండేదేమోనండి.'

'సరే మూర్తీ! నీవు యుద్ధయాత్రకై ప్రవేశించిన దేశం నీకే తెలియాలి. కాని హేమ హృదయానికి బాధమాత్రం కలిగించకు తండ్రీ!'

'మామయ్యగారూ! నేను ఆమె హృదయంలో చింతాకు కదలికంత బాధైనా కలిగించను. కాని ఆమే తనంత తాను బాధ కల్పించుకొంటోంది. అది ఒకరోజున ఆమెకు చాలా కష్టం కలిగించే పరిస్థితులవరకూ తెస్తుంది.'

'ఏమిటది మూర్తీ! నీ వేమీ ఆ విషయంలో చేయలేవా? ఆమె కొంచెం బాధపడినా నాపని హుళక్కయిపోతుందిబాబూ!'

'మీ రేమీ గడబిడ పడకండి. నేను నా శాయశక్తులా హేమపై ఈగ వాలనివ్వను.'

'అంతా నీదేభారం మూర్తీ! అన్నీ నీమీదే పెట్టుకుని ఉన్నాను. అమ్మ ఏంచేస్తోంది?'

## 3

నాలుగురోజులు త్యాగతికోసం చూచింది హేమ. అతడు రాకపోవడం తన కవమానమనుకొని మూడోరోజున అందరిమీదా చిఱ్ఱు, బుస్సుమని విసుగు మాటలాడింది. త్యాగతి వట్టి పిరికివాడని అనుకుంది. ధైర్యస్థుడే అయితే మొదటే తాను ఫలానా అని చెప్పి, తన ప్రేమను సంపాదించ ప్రయత్నించ వచ్చుకదా! దానివల్ల ఏమి నష్టంవస్తుందో అని ఆలోచించి, తా నీరకంగా అజ్ఞాతవాసం చేశాడు? ఎంత వెదకినా, తనకుమాత్రం త్యాగతి చేసిన పనిలో అర్థం కనబడలేదు.

ఒకవేళ త్యాగతి, ఎవరో పరాయివాడు అని అనుకుని అతనితో స్నేహం చేయడంవల్ల, అతనిమీద తనకు ప్రేమ కలుగుతుందని ఆలోచించి ఉంటాడు. అయితే తన ప్రేమకోసం ఇంత అసందర్భానికి దిగటంకూడా త్యాగతిలో ఉందికాబోలు. అందుకనే సోఫీ, తీరమిత్రుడు, నిశాపతి, ఇంకా తన సహాధ్యాయులైన కఱ్ఱవాళ్ళు కొందరు, త్యాగతి అంటే డాక్టరు హైడ్, జెకిల్ లాంటివాడు అని అనేవారు. కాని త్యాగతి, తన శ్రీనాథమూర్తి బావ అంత హీను డెప్పుడూ కాడు.' గాంధీమహాత్ముడు తన జీవితచరిత్రలో అన్ని విషయాలు నగ్నంగా చెప్పాడు. ఆలాగే మూర్తిబావా చెప్పాడు. అతని ఆలోచనలూ, అతని జ్ఞానమూ, అతని కళాశక్తీ, అతని హృదయమూ, ఆత్మా నిర్మలమైనవి. లోకప్రఖ్యాతి సంపాదింప పుట్టిన మహాపురుషులలో అతడు ఒకడు. ఆలాంటి ఒక ఉత్తమ పురుషుని పరోక్షంలో న్యాయవిచారణచేసి, శిక్షవెయ్యడానికి ఎవరికి అధికారం ఉంది?

ఒకవేళ తన్ను ప్రేమించా డనుకున్నా, తనలో తన అక్కగార్ని చూచాడు. తన పోలిక అచ్చంగా తన అక్కపోలికే అవడంచేత తన్నతడు వాంఛించాడు. లేకపోతే తనకై తన్ను ప్రేమించకే ఉండునా? అదిమాత్రం నిజమైన ప్రేమ అని ఎలా చెప్పగలం? తన్ను తనుగానే ప్రేమింపని ప్రేమను తానుమాత్రం ఎలా అందుకోగలదు? ఎంతమంది తన్ను భార్యగా, స్త్రీగా వాంఛించటంలేదు? అలాంటి సందర్భంలో తన బావలాంటి ఉత్తముడు తన్ను కోరి, ఆ కోర్కె ఫలవంతం చేసుకొనడానికి, ఏ ఆలోచనపైనో ఈ ఏడాదిపాటూ ఈలా, తనకూ, తన స్నేహితులకుమాత్రం మరుగుపడి ఉన్నాడన్నమాత్రంలో అతడంత దోషమేమి చేసినట్లు? అయినా ప్రేమవిషయాల చర్చ ఇప్పుడు తన కవసరమేమి? తనలో ప్రేమభావమే లేదుగదా! ఏదో భయపడి, తనకడకు ఈ నాలుగురోజులూ రావటంలేదు. ఎంతవీరుడైనా స్త్రీలకడ కుక్కపిల్ల అయిపోతాడు మగాడు. తానే వెళ్ళి తన బావను లాక్కురావాలి. ఈ నిశ్చయానికి ఎప్పుడు వచ్చిందో ఆ వెంటనే ఆ సాయంకాలం తన్ను అప్సరసలా

కై నేసుకుంది హేమ. తన చిన్న కారులో ఎక్కి తానే స్వయంగా త్యాగ రాజనగరం తన బావగారింటికి బయలుదేరింది. బండి శ్రీనాథమూర్తి ఇంటిదగ్గర ఆపింది. లోపలకు దబదబా వెళ్ళింది. 'అత్తయ్యగారూ!' అని కేక వేసింది.

'ఎవరు? హేమా?' అని త్యాగతి తల్లి వంటింటిలోనుంచి బయటకు వచ్చింది. ఆమె హృదయం భయంకర ఝంఝూతాడిత సముద్రంలా అయి పోయింది. ఇదివరకు అత్తయ్యగారూ అన్నమాట వేరు. ఈనాటి పిలుపు వేరు.

'ఏమండీ అత్తయ్యగారూ, మీరు త్యాగతికికూడా తల్లులట కాదూ?' అని హేమ పకపక నవ్వింది.

'అవునమ్మా, అవును. మూర్తిబావా, త్యాగతీ ఇద్దరూ నా కొడుకు లే నే తల్లీ!' అని లోని భయం దాచుకొని, ఆమె చిరునవ్వుతో జవాబిచ్చింది.

'ఇన్నాళ్ళు, మీరుకూడా ఈ రహస్యం నాదగ్గిర ఎందుకు దాచారు?'

'మావాడుదాచే రహస్యం, నేను దాచనక్కరలేదా బంగారుబొమ్మగారూ?'

'మీరూ దొంగలేనా?'

'నేను దొంగనవబట్టేగా నా కొడుకూ దొంగవాడయ్యాడు.'

'అది నేను నమ్మను. కొడుకు దొంగతనాలు నేర్చుకొంటే, అతన్ని రక్షించడానికి తల్లికూడా ఆపని నేర్చుకోక తప్పిందికాదనుకుంటాను.'

ఇంతలో హేమకు వెనక మధుర గంభీరములగు త్యాగతి వాక్కులు 'రేపు మా మరదలుగారు కొంచెం తక్కువశిక్ష విధించవలసిందని ఈ ముఖ్య దోషి ప్రార్థిస్తున్నాడు' అని వినబడినవి.

హేమ చటుక్కున వెనకకు తిరిగింది. శ్రీనాథమూర్తి చేతులు జోడించి తల వంచి, హాసవదనుడై, కొంచెము దేహము ముందుకు వంచి నిలుచుండి ఉండెను. కాని అతని చిరునవ్వులో సీతను అరణ్యాలకు పంపిన శ్రీరాముని దివ్యశోకము నర్తిస్తున్నది.

హేమ పెదవులలో నవ్వు నృత్యముచేస్తున్నది. కన్నులలో పారిజాత పుష్పాన్ని నారదుడు రుక్మిణి కిచ్చిన దృశ్యం చూస్తున్న సత్యభామ కోపము తాండవము చేస్తున్నది.

అతని హృదయంలో అనుమాన భయమూ, ఆమె హృదయంలో అభి మాన క్రోధమూ వానావల్లప్పలాడుతున్నవి. వీరిరువురుని తాపసి వృద్ధకాశికి వలె త్యాగతితల్లి చూస్తున్నది. కొంతవడికి త్యాగతి—

'హేమూ, నా తరఫునా, మా అమ్మ తరఫునా మమ్మా క్షమించాలని ప్రార్థిస్తున్నాను. ఈ దోషమంతా నాది. కాబట్టి ముఖ్యశిక్షంతవ్యుడను నేనే!' అని కొంచెం విచారం రంగరించిన గంభీర వాక్యాలతో ఆమెను ప్రార్థించాడు.

'బావా! ఎంత బాగుంది నిన్నిలా పిలవడం! అమ్మయ్యా, అనేశాను. అనడానికి నాకు చెమటలు పట్టాయి. అంత ప్రసిద్ధికెక్కిన త్యాగతీ శర్వరీ

భూషణ్ గారు సాకు బావ అవడం అనే విషయం నన్ను వణికించింది. మా అక్క లేకపోవడం ఇప్పుడు నా కరమయింది బావా!' అని ఆమె కన్నులనీరు తిరుగ పలికింది. త్యాగతి కన్నులనుంచి వర్షాలు కురియసాగాయి. త్యాగతి తల్లి శోకంతో వణికిపోయి కూలబడిపోయింది. శకుంతలకొరకు దుఃఖము గాలివాన అయింది.

ఎన్ని సంవత్సరాలనుండో అణిగిన ఈ ముగ్గురి శోకమూ ఈనాడు పాతాళం వీడి వచ్చిన పాతాళగంగవలె పైకి పొంగిపోయింది. ఏవేవో భావాలన్నీ ఒక్కసారిగా పూర్వ పవిత్ర స్మృతివల్ల చంద్రకాంతివల్ల చంద్రకాంత శిల కరిగినట్లు కరిగి శోకఝురులయినాయి.

ఈ బాలిక తన జీవితంలో, శకుంతల జీవితంలో ఒకనాడు భాగం పంచుకొన్నది. ఆ చిట్టిశిశువు ఈ రూపాన ఆ జీవితంలో ఇప్పుడు పాలు పంచుకోలేకపోతున్నది, అని త్యాగతి కరిగిపోయినాడు.

ఇన్నాళ్ళు దేశాలు తిరిగి, తనజీవితంలో భాగం పంచుకోక, ఈనాడు ఈ విచిత్రంగా తన బ్రతుకుదారుల ఈ బావ నడయాడడానికి తన అక్క లేకపోవడంకదా కారణమని హేమ వణికిపోయింది.

హేమా శ్రీనాథు లట్లు ఒకరికడ ఒకరు నిలుచుండినప్పుడు మొదటిసారి చూచిన శ్రీనాథుని తల్లికి, కొడుకు కోడలు ఆలాగే నిలుచుండి వేళాకోళాలు చేసుకున్న వెనకటిరోజు ఒక్కసారిగా స్పష్టమై, కూలిపోయిం దామె. అందులో హేమ అచ్చంగా శకుంతల పోలికే.

## 4

శ్రీనాథమూర్తి కన్నీరు తుడుచుకొని, 'హేమా! ఈరోజు మా ఇంట్లో భోజనం చెయ్యాలి. నీవు మా అమ్మవంట ఎప్పుడు చూళ్ళేదు. ఇంటికిపోయి చెప్పిరమ్మని మా బోయివాని కబురంపుతా; నీతో ఎన్నో విషయాలు మాట్లాడాలి. తర్వాత నిన్ను మీ ఇంటిదగ్గిర దిగబెడతానులే! మీ ఇంటిదగ్గిర ఈ విషయాలన్నీ మాట్లాడడానికి తీరదు. అందరి స్నేహితులను చిన్నబుచ్చలేము' అని సవినయంగా చెప్పాడు.

'బావా! అత్తయ్యగారు ఎన్నాళ్ళనుంచి ఉన్నారు ఈ ఊళ్ళో?'

'నేను నీకు అడయారులో కనబడిన రెండు నెలలకు ఈ నగరం అంతా గాలించి, చిన్నదైనా, ఈ అందమైన మేడ కొనుక్కున్నాను. కొని దానిలోకి కావలసిన వస్తువులు చేయించుకుంటూ నెలరోజులున్నాను. ఆ తర్వాతే మా అమ్మను తీసుకువచ్చాను.'

'కాబట్టి మీఅమ్మగారు ఈ పదినెలలనుంచీ చెన్నపట్నంలో ఉంటున్నారన్నమాట.'

'అవును!'

'ఎంతవాడవు బావా నీవు! అత్తయ్యగారు మాఇంటికివచ్చి మాఇంటిలో రెండు మూడు రోజులు ఉండడము ఈ ఇంటిదగ్గరనుంచే నన్నమాట?'

'అవును!'

'మా ఇంటిదగ్గర అత్తగారున్నప్పుడు నీవు వచ్చి వారిని పలకరించకుండా ఉండేవాడవు. వారు నిన్ను పలకరించకుండా ఉండేవారు. మా అమ్మా, మా నాన్నా కూడా యేమాత్రమూ రహస్యం తేలనిచ్చేవారు కాదు. చీమకాలంత అనుమానమన్నా మా కెవ్వరికీ రాకుండా చూచారు మీరంతా. ఎంత రాతి గుండెలయ్యా మీ అందరివీని?'

'రాతిగుండెలో, నేతిగుండెలోగాని, మాకు బ్రహ్మవిద్యే అయింది హేమా! ఈ రహస్యం దాచడానికి!'

'అసలు నీ ధైర్యం చెప్పాలి. నేనూ మనవాళ్ళూ ఈ ఇల్లు మీ ఇల్లనుకో లేదు. నీ కళామందిరమే నీ ఇల్లనీ, నువ్వు ఘోటకబ్రహ్మచారివనీ, నీకు నీ అనేవాళ్లున్నా వారికీ నీకు సంబంధం సన్నదారంవంటిదేననీ, మేము అభిప్రాయ పడి వాదించుకొనేవాళ్ళం!'

త్యాగతి పకపక నవ్వుతూ 'ఈవాళ ఈ ఇల్లు మాది అని ఎల్లా తెలిసింది నీకు?' అని అడిగాడు.

'మా నాన్నగారు నాకు రహస్యం అంతా చెప్పారు. అందమైన ఆ ఇల్లు ఎవరిదయ్యా అని ఒకసారి నీ కళామందిరంలో నిన్ను అడిగాను. జ్ఞాపకం ఉందా? అప్పుడేమన్నావు నువ్వు?'

''ఏమన్నాను, 'మా స్నేహితులదే, ఆ ఇల్లు ఎప్పుడో కొని నా కళా మందిరానికి కలుపుకుంటాను' అన్నాను.''

'ఓయి బావా, ఏమిటి ఈ సినిమా కథ అంతా!'

'అదే నీతో చెప్పాలి, రా! నా చదువుల గదికి. అమ్మా! హేమకు అన్నీ వేపుడుకూరలు కావాలి. గోంగూరపచ్చడి మా ఇష్టం. కందిపొడి శేరులు శేరులు గుటకాయస్వాహా చేస్తుంది. వంకాయ పచ్చిపులుసు ఉల్లిపాయ లతో జుర్రుతుంది. ఇక నీ ఇష్టం అమ్మా!'

'నాయనా! మీ ఇద్దరూ మాట్లాడుకుంటూ ఉండండి. వంటకాగానే పిలుస్తాను' అని త్యాగతి తల్లి లోనికి వెళ్ళింది. బోయివాడు త్యాగతి సైకిలు ఎక్కి మైలాపురం కబురుచెప్పడానికి వెళ్ళాడు. త్యాగతీ, హేమా ఆ చిన్న మేడలో పైనవున్న త్యాగతి చదువులగదికి పోయారు.

మేడమీద గదులన్నిటిలో ఆ గదే కొంచెం పెద్దది. గదిచుట్టూ గోద్రెజ్ బీరువాలు—కిటికీలు, ద్వారాలు తప్పించి తక్కిన గోడలను కమ్మివేస్తూ—అయి దడుగుల ఎత్తున అద్దాల తలుపులున్న ఆ బీరువాలు అలంకరించి ఉన్నాయి.

నేలంతా బందరు జాతీయ కళాశాల రత్నకంబళ్లు, అక్కడక్కడ పరుపులు, పెద్ద అజంతా దిండ్లు. పైకప్పు నీలంరంగూ, అజంతా అలంకార శిల్ప చిత్ర లేఖనమూ. ఆ బీరువాల పైన అయిదారు సుఖపద్మాసనమూర్తులైన సరస్వతీ, లక్ష్మీ, బాలాత్రిపురసుందరీ, శ్వేతతారా, ప్రజ్ఞాపారమితా మొదలగు దేవీవిగ్రహాలు తిబెత్తువి, నేపాలువి, బర్మావి, బలి, జావా, కాంబోడియా, చీనా, జపానువీ అలంకరించి ఉన్నాయి. ఎనిమిది కిటికీలకు, నాలుగు ద్వారాలకు జపాను, చీనా, జావా తెరలున్నాయి. అగదికి చుట్టి మూడువైపులా వరండాలున్నాయి. ఆ వరండాలలో చక్కని సోఫాలు, సోఫాకుర్చీలు మూడువైపులాఉన్నాయి. ప్రతి సోఫా పక్క సోఫాకుర్చీపక్కనా చిన్న అజంతా పీఠాలు పుస్తకాలుంచుకోడానికి ఉన్నాయి. ఆ పదునాలుగు బీరువాలలో సంస్కృత, ఇంగ్లీషు, రష్యా, జపాను, జర్మనీ, డచ్చి, ఫ్రెంచి, బంగాలీ, హిందీ, చీనా, ఉర్దూ భాషలలో వేదాంత, కావ్య, చరిత్ర, విజ్ఞానగ్రంథా లున్నాయి. త్యాగతి ఆ భాషలన్నీ ఈ తొమ్మిదేండ్లనుండీ నేర్చుకుంటున్నాడు.

'ఇదీ నా గ్రంథాలయం. నా కళాగ్రంథాలయం ఇదివరకు ఎన్నిసారులో నీవు చూచినదేకాదా! పైన సోఫాలో కూర్చుందామా, లేక లోపల ఈ పరుపులమీద అధివసిద్దామా?' అని త్యాగతి ప్రశ్నించాడు.

'పైన ఆ సోఫాలమీదే కూర్చుందాము. ఇక్కడ ఆ పుస్తకాలలోని వాళ్ళూ, ఆ విగ్రహాలూ మన సంభాషణ వినడానికి వచ్చి కూర్చున్న పరాయి వాళ్ళలా నాకు కనబడుతారు బావా! అది అలా ఉంచు. ఇంత అందమైన మేడ, ఈ అపురూపమైన వస్తువులు, ఇంత చక్కని పుస్తకాలయం, ఈ మనోహరమైన అలంకారాలూ ఇన్నాళ్ళనుంచీ మాకు చూపించకుండా ఏలా ఉన్నావయ్యా!' ఆమె ప్రశ్న కొంచెం బాధతో మిళితమయ్యే ఉంది.

## 5

ఇద్దరూ పై వరండాలో ఆ సాయంకాలాల్పారుణకాంతులలో చేరి ఒక సోఫాకుర్చీపైనా అధివసించారు. త్యాగతి ఒకసిగరెట్టు వెలిగించాడు.

'హేమా! నేనేమీ రహస్యం దాచకుండా నా జీవితచరిత్రా, నా హృదయమూ, అన్నీ నా గ్రంథంలో వ్రాశాను. ఈ ఏడాదినుండీ నీ యీ ఆనందమయ జీవితచరిత్ర గమనిస్తున్నాను. నువ్వు నీ మనస్సును నా విషయంలో అనాచ్ఛాదితంగా ఉంచుకో, అంతే నేను కోరేది.'

'అంటే నీ భావం ఏమిటిబావా?'

'ఏమీలేదు. నేను నీకన్న పన్నెండేడుల పెద్దవాడిని. ముసలివాడిని. నువ్వు చిన్నపిల్లవు. నీ ఆశయాలు వేరు, నా ఆశయాలు వేరు. నేను అన్ని తలదెబ్బలూ తిని, బొప్పెలుకట్టిన శిరస్సుకు తలటోపీ అలంకరించుకొంటున్నాను. నువ్వు ఇప్పుడే విరిసిన హిమాలయపుష్పంలా ఉన్నావు. అందుచేత నువ్వు

తలిదండ్రుల కోర్కె పరిపాలించాలని ఆలోచించిగాని, బావ దుఃఖానికి ఉప శమనం కలుగచేద్దామని అనుకొనికాని, దేవీస్వరూపిణియైన అక్క ఆత్మకు నివేదన ఇద్దామనిగాని ఆలోచనలతో తొందరపడవద్దు, అని ఆత్మపూర్వకంగా నిన్ను కోరుకుంటున్నాను.'

'మీరంతా కలసి, ఈ కట్ట పన్నడం ఎందుకూ? ఆ తర్వాత ఆ కట్టంటే లెక్కచేయకు అని నాకు ధైర్యము చెప్పడం ఎందుకు? ఈ విచిత్రం ఎక్కడైనా ఉందయ్యా?'

'మానవజీవితాలు ఒకదానికొకటి సంబంధంలేకుండా ఉంటాయా హేమా? ఆ సంబంధాలవల్ల ఇతరులకు బాధ కలిగించుకోకుండా జాగ్రత్త పడాలిగాని!'

'ఏవో వేదాంత రహస్యాలు మాట్లాడక స్పష్టంగా మాట్లాడుదూ?'

'నేను నీ బావనయ్యాను. నా జీవితంలోని ఉత్తమ భాగాన్ని పోగొట్టు కొన్నాను. ఆ భాగం మీ అక్క అవడంవల్ల నీకూ నాకు సంబంధం ఏర్ప డింది. ఆ సంబంధంవల్ల నీ జీవితానికీ నా జీవితానికీ సంపర్కాలు, పరస్పర అభిమానాలూ, సహాయాలూ కావలసివస్తాయి.'

'తెలుగులో మాట్లాడవయ్యా అంటే, అరవంలో మాట్లాడుతా వేమిటి బావా!......ఎంత సులభంగా వస్తోంది 'బావా' అని నా నోటివెంట! నా చిన్నతనానికీ, ఈ ఈడుకీ మధ్య ఉన్న సంవత్సరాలన్నీ ఒక్కసారిగా మాయమైపోయాయి!'

'హేమా! నా కథ అంతా నీ స్నేహితులకు చెప్పు. కాని మీ అమ్మగారి నాన్నగారి ఉద్దేశాలూ నా భావమూ ఎవరికీ తెలియనీయకు. నా జీవితచరిత్ర గ్రంథం ఎవ్వరికీ యివ్వకు. మీ లోకేశ్వరినిమాత్రం చదువుకోనీ!'

'అప్పుడే ఆజ్ఞలు ప్రారంభించావూ!'

'అదేమిటి!' త్యాగతిగుండె ఒక్కగతి తప్పింది.

'ఏమీ లేదు. మీ మగవాళ్ళల్లో ఆడది నా వస్తువన్న భావం ఎంత ఉదార హృదయంకలవాళ్ళకీ పోదని నా ఉద్దేశంలే!'

'అయ్యోరామా! ఇంతేనా నన్ని న్నాళ్లూ అర్థంచేసుకున్నది!'

'ఆ! బాగా అర్థంచేసుకున్నా! ఏడాది మానవ్రతాన్ని నీ కట్టను దాచు కోడానికి ఆయుధంగా ఉపయోగించుకొని, ఈ నాడు ఆ దొంగతనం బయలు పడితే, దానికి పవిత్రభావాలు కల్పించేందుకు లాయరులా వడవడవాగే ఉప న్యాస వాక్ఝురీవేగం నా కర్థమయిందిలే బావా!'

అని హేము మూతి ముడుచుకొని చటుక్కున లేచి, ఆ డాబా వరండా గోడ నానుకొని ఇంటిచుట్టూ పూవులతో నిండివున్న చేమంతుల జాతుల్ని గమ నిస్తూ నిలుచుంది. ఆమెలో నిర్వచింపలేని మహావేదన ఆవిర్భవించింది.

అనేక విధాలుగా తన కుటుంబానికి బంధువైన కుటుంబంవాడై, అంతకు మించి తన తండ్రి ప్రాణస్నేహితుని కొమరుడై, తన అక్కకు ఆత్మలు కలిసిపోయిన భర్త, తన్ను ఏదో విచిత్రంగా అర్థంచేసుకొని, ఏడాదిపాటు ఈ విచిత్ర నాటకం ఆడినాడే? ఆమెకు కోపము పొంగిపొర్లివచ్చింది.

త్యాగతి ఆలోచించుకున్నాడు. తాను చేసిందంతా తప్పనుకున్నాడు. శకుంతలలేని తన జీవితం చుక్కానిలేని పడవనుకున్నాడు. శకుంతలా లేదు! హేమసుందరి తన్ను ఎప్పుడూ సరిగా అర్థంచేసుకోలేదు. కానీ! ఏది ఏమయితే తనకేమి?

త్యాగతి మౌనియై, తలవాల్చుకొని ఆ కుర్చీలో కూర్చున్నాడు. ఆతనికి ఒకదానివెంట ఒకటి ఆలోచనలు తరుముకొని వచ్చాయి. స్పష్టరూపంలేని ఆ ఆలోచనలు మాయమయ్యాయి. శకుంతల చిరునవ్వుతో ఎక్కడో మేఘాలలో నిలుచుండి కనబడింది. శకుంతలా ఎందుకు నన్నిన్నివిధాల ఆరాటం పెడతావు? అని అనుకుని ఆ దేవినే గమనిస్తూ తల వాల్చుకొని కన్ను మూసికొనే అలా కూర్చున్నాడు త్యాగతి.

ఇంతలో ఆమె విగ్రహం మాయమైపోయింది. ఒక్క పెద్ద నిట్టూర్పువదలి తలెత్తి హేమసుందరి నిలుచుండిన ప్రదేశం చూచాడు. ఆమె అక్కడలేదు. ఆమె ఎక్కడికి వెళ్ళింది? మూడు వరండాలు, డాబాలు చూచాడు. గ్రంథాలయంలోనికి వెళ్ళాడు శ్రీనాథమూర్తి. హేమ అక్కడ ఒక చదువుల పరుపు మీద వాలిపోయి, దిండులో మోముదూర్చి వెక్కి వెక్కి ఏడుస్తున్నది.

శ్రీనాథమూర్తి తెల్లబోయి, 'హేమా! అదేమిటమ్మా! నేను రాక్షసుణ్ణి! నన్ను క్షమించు. నీ జీవితంలోంచి నేను ఈనాడు వెళ్ళిపోతాను. నువ్వు నన్ను మళ్ళీ చూడగలిగేస్థితి వచ్చి రమ్మన్ననాడే వస్తాను' అన్నాడు.

## 6

హేమ కళ్ళనీళ్లు తుడుచుకొని లేచి, క్రిందకుదిగి వెళ్ళబోతూఉంటే, శ్రీనాథమూర్తి 'హేమా! నీవు మొహం కడుక్కోవాలంటే, ఈ మేడమీద ఒక స్నానాలగది ఉంది ఈలారా' అని అక్కడకు దారి చూపినాడు. హేమ వెళ్ళి మొగం కడుక్కొని లోపలికివచ్చి, శ్రీనాథమూర్తి పడకగదికి ముందు చిన్నగదిలో ఉన్న అద్దంముందర పీఠికపై కూర్చుని తన చేతిసంచి తెరచి అందులో ఉన్న చిన్న బంగారుభరిణెలోని పౌడరు మొగమునకు చిన్న కుచ్చుతో అద్దుకుంది. ముందుజుట్టు సర్దుకుంది.

ఇంతవరకు శ్రీనాథమూర్తి వరండాలో నిలుచుండి ఆకాశాన కమ్మిన నక్షత్రాలను చూపులేని చూపుతో చూస్తూ, ఆలోచనలేని భావాలు కమ్ముకు రాగా, వానిని క్రుంగిపోయిన మనస్సుతో గమనిస్తూ ఉన్నాడు.

హేము అంతా సర్దుకొని త్యాగతితో మాట్లాడకుండా క్రిందకు దిగి వెళ్ళింది. అక్కడనుండి, ఆ చిన్న మేడముందున్న తన చిన్న ఓపెల్ కారు దగ్గరకు పోయి, దానికి ప్రాణోద్దీపన చేయబోయే సమయంలో, శ్రీనాథమూర్తి తల్లి రంగనాయకమ్మగారు వంటగదిలోంచి పరుగెత్తుకొని కారుదగ్గిరకు వచ్చి, 'హేమూ వెళ్ళిపోతున్నావా?' అన్నారు.

రంగనాయకమ్మగారి గొంతులోని బాధ హేముకు సముద్రపు కెరటంలా కొట్టింది. ఎంతో సిగ్గుపడి ఆ బాలిక, 'లేదండి అత్తయ్యా! కారులో పెట్రోలు కావలసినంత ఉందో లేదో చూస్తున్నాను' అని ఒక చిన్న అబద్ధం చెప్పి, వెనక్కు తిరిగి వచ్చి తొడుక్కున్న కాలిజోళ్లు మళ్ళీ విప్పి, వంటింటిలోకి వెళ్ళి పోయింది. ఎందువల్లనో కోపం వచ్చిందనిన్నీ ఆమె ఆ కోపంతో వెళ్ళిపో బోయి, తన మాటల కాగి, ఏదో వంక చెప్పినదన్న నిజము రంగనాయకమ్మ గారూ గ్రహించకపోలేదు.

తను బావతో కలిసి భోజనము చేయుటా, చేయకపోవుటా ? అని హేమ వంటింటిలో రంగనాయకమ్మగారు వేసిన పీటపై కూర్చుండి ఆలోచింపసాగినది. కూర్చున్న పీట అంతా అలంకారశిల్పమయము. అలాంటి పీట లక్కడ నాలు గున్నవి. ఆ నాలుగూ ఉత్తమ శిల్పి ఎవరో రచించి ఉన్నాడు. కోళ్లు మూడంగు ళముల ఎత్తే అయినా, అవి వివిధ భంగిమలలో ఉన్న ఏనుగులతో నిండి ఉన్నవి. పైబల్లమీద అంతా వెండిలతల నగిషీపని కఱ్ఱలో పొదిగించబడి ఉంది.

ఆపని హేమసుందరి దీక్షతో గమనించడం చూచి, 'అమ్మాయీ! ఆ పీటలన్నీ మీబావే స్వయంగా చేశాడు' అన్నది.

ఆముక్కలకు హేమ ఆశ్చర్యం పొందినది. ఏమిటీ విచిత్రపు మనిషి. ఇంత అందమైన పని భోజనపు పీటలపైకూడా చేసినాడు! ఈ ఆలోచన ఆమెకు త్యాగతిపైన కోపాన్ని తగ్గించింది.

ఇంత చదువుకొని, తన బావ జీవితాన్ని తాను అపార్థం చేసుకొనేటంత హీనురాలయింది. తాను వివాహసంస్థే పనికిరాదని వాదిస్తూన్న అతి నాగరికు రాలై, ఏమో ఎందుకో తన బావపైన ఆగ్రహించడమా? తాను తన బావను పెళ్ళిచేసుకుంటే చేసుకుంటుంది, లేకపోతే లేదు. అంతమాత్రానికి, ఏదో చదువురాని మొద్దులా, హృదయపథాల మంచు గప్పినదానిలా, చిన్నబిడ్డలా ఆ వెక్కి వెక్కి ఏడవడం ఏమిటి? తన త్యాగతి, తన శ్రీనాథమూర్తిబావ మహో త్తమ పురుషుడు. అలాంటివానితో ఏదో కాస్త ఆనర్సులో నెగ్గిన కొంచెం ఎఱ్ఱగా బుఱ్ఱగా ఉన్న తాను, దేశసేవ, సారస్వతసేవ, సంఘసేవ, కళాసేవ చేయలేని తాను, పిచ్చిమనిషిలా ఏడవడమా? ధైర్యంలేక, పిరికిఅమ్మాయిలా పారిపోవ డానికి సిద్ధం అయిందే! ఇదా తనబడాయి? కల్పమూర్తిదగ్గిర, తీరమిత్రునితో, నిశాపతిఎదుట డాబులుకొట్టడంమాత్రం తనకు తెలుసునా? తనకుమాత్రం భాగ్యవంతురాలనని ఉన్న గర్వానికి లెక్క ఉందా? తన అందానికి, తన

భాగ్యానికి చేరినవాళ్లెక్కడ! అకుంఠిత దీక్షతో సంఘానికి తన సర్వస్వము అర్పించే తనబావ ఎక్కడ!

ఆడతనం ఎన్ని రంగులువేసినా పోదు! ఆడవాళ్లూ, వారి నరాల జబ్బులూ ఒకటే! బడాయి ఎక్కువ! ఛీ! ఛీ! తనకే బుద్ధి ఉంటే, వెళ్ళి తన బావ కాళ్ళమీద పడాలి. అతను తన్ను పెళ్ళిచేసుకుంటేనే తనజన్మ సార్థకం అవుతుంది. ప్రేమా? తానెవరిని ప్రేమిస్తున్నదీ తనకే తెలియదు. ప్రేమ లేకపోతే భార్యగా బావకు సేవచేయడంకన్న తనకు మహోత్తమభాగ్యం ఏమున్నది? బావ ఏమిచేయమంటే తానదేచేస్తుందిగాక!

హేమ లేచి 'అత్తయ్యా! నేను వెళ్ళి బావను తీసుకొనివస్తా' అన్నది.

రంగనాయకమ్మగారు చిరునవ్వునవ్వుతూ 'వెళ్లు తల్లీ వెళ్లు' అంది.

రంగనాయకమ్మత్త ఎంత ఉత్తమురాలు. ఆతల్లి పుణ్యమే ఈబావ!

'ఏతార చాయలో నినుగాంచె' అని రాయప్రోలు సుబ్బారావుగారన్నట్లు బావను కన్నది. ఈ ఇంటిలో తాను కోడలై, తన బావ ప్రేమను తాను పాలిస్తూ ఉండడంకన్న ఉత్తమం ఏముంది? అనుకుంటూ మేడమీదకు గబగబ మెట్లెక్కి వెళ్ళి, 'బావా! బావా!' అని పెద్ద కేకలువేస్తూ, నవ్వుతూ ఆతని గ్రంథాలయ మందిరంలోకి వెళ్ళింది. ఆత డక్కడ లేడు. ఆతని పడకగదిలో లేడు. అత్తగారి పడకగదిలో లేడు. అలంకారపు గదిలో లేడు. వరండాలలో లేడు.

ఆమెకు ఏదో భయంవేసింది. తిన్నగా క్రిందకు దిగి, 'బావ మేడమీద లేరండి అత్తయ్యా!' అని వంటింటిలోకి వెళ్ళి చెప్పింది.

రంగనాయకమ్మగారు ఈవలకు వచ్చి 'ఒసే ముత్యాలూ!' అని కొల్లిపర నుంచి తమతో వచ్చిన పనిమనిషిని పిలిచింది.

'ఇక్కడున్నానండి' అంటూ ముత్యాలు వచ్చింది.

'అయ్యగా రేరీ?'

'ఆరు బొమ్మలమేడ కెళ్ళారండి' అని ముత్యాలు జవాబుచెప్పింది.

'నేను వెళ్ళి తీసుకువస్తా నత్తయ్యా!' అని హేమ ఈ మేడ తోటలో నుంచి, ఆ మేడ తోటలోనికి ఆ ఫిబ్రవరి చేమంతుల అందాలలో స్నాత అగుతూ, గబగబ చందాల నడకలతో వెళ్ళింది.

రెండు తోటలకు మధ్యనున్న చిన్న తలుపు తెరుచుకొని, ఆ బాలిక దీపాలతో వెలిగే ఆ శిల్పభవనంలోనికి పోయింది. ఇదివరకే ఆమెకు ఆ శిల్ప భవనం అత్యంత పరిచితము.

'బావా! ఎక్కడున్నావు?' అని ఆమె వణికే హృదయంతో లోనికి వెళ్ళింది.

త్యాగతి చిత్రమందిరంలో పద్మాసనంమీద కూరుచుండి, రెండు చిత్రాలు పక్కపక్కనే ఎదుట పెట్టుకొని కన్ను లరమూతలుగా, ఏదో ధ్యానముద్రలో ఉన్నాడు. ఆతని కన్నులు నీరు తిరుగుతూ నిశ్చలకాసారాలలో సుడు లలమిన ట్లున్నాయి.

## 7

హేము వచ్చినట్లు త్యాగతి గ్రహించనే లేదన్నట్లు తదేక దీక్షతో పద్మాసనం వేసుకొని ఉన్నాడు. హేము మెల్లగా వెళ్ళి, ఆతని ప్రక్కను కూర్చుండి ఆ రెండు చిత్రాలు చూచింది.

ఆ రెండు చిత్రాలు హేమవే! కాదు ఒకటి హేమే కాని, హేమ కాదా ఏమిటి? అన్నట్లూ ఉంది. ఆమె ఆతని కన్నులలోని నీరు గమనించి హృదయంలో వణకిపోయింది. పైకి లేని ధైర్యం తెచ్చుకొని 'బావా! ఈ రెండు బొమ్మలూ ఎప్పుడు వేశావు?'

హేమకు తెలియకుండా కంటనీరు తుడుచుకొని, కొంచెం డగ్గుతికతో 'హేమూ! ఒకటి మీ అక్కది. ఆమె నన్ను వదలి వెళ్ళబోయే ముందు సితి. రెండవది నీవు ఒకరోజున భోజనశాలలో పీటమీద కూర్చుండి, చక్కని మాటలు చెప్పుతున్న నాటి దృశ్యం.'

'అది నీ జ్ఞాపకశక్తివల్ల వేసినదేనా ఏమిటి?'

'అవును హేమూ!'

'సరే! ఇప్పుడీ చిత్రాలు అల్లా ఉంచి, విషాదాంత నాటకంలో, ఆఖరు అంకంలో నాయకుడు పెట్టిన మొగం మానేసి, రా భోజనానికి! అత్తయ్య గారు కనిపెట్టుకొని ఉన్నారు.'

'వస్తున్నా హేమూ!' అని త్యాగతి లేచాడు. ఆ చిత్రాలు రెండూ చిత్రాల అట్టల పుస్తకంలో పెట్టి, తాళ్ళు ముడివేసి, ఆ అట్ట తీసుకునిపోయి బీరువాలో పెట్టి తాళం వేసినాడు. తలుపులు వేసుకుంటూ, ఎలక్ట్రిక్ దీపా లార్పుకుంటూ, చేతిలోని ఎలక్ట్రిక్ టార్చి దీపం మీట నొక్కి దొడ్డిలోకివచ్చే పక్కవాకిలి తలుపువేసి, హేమసుందరికి దారిచూపిస్తూ, ఈవలి ఇంటికి తీసుకునివచ్చాడు.

వారిద్దరు చేతులు, కాళ్ళూ, మొగమూ కడుక్కొని, తువాళ్ళతో తుడుచు కొని వచ్చారు. త్యాగతి హేమును గదిలోకివెళ్లి అక్కడ తానుంచిన చీరా, రవికా భోజనానికి బట్టలు మార్చుకోమని కోరినాడు.

హేమ: అవి మా ఇంటిదగ్గరనుండి తెప్పించావా బావా?

త్యాగ: లేదుతల్లీ! అవి ఎక్కడివో నీ వా గదిలోకి వెళ్ళు గ్రహిస్తావు.

హేమసుందరి చటుక్కున త్యాగతివైపు చూసి, 'బావా! పేరుతో పిలవక 'తల్లీ' అని పిలుస్తావే! నీ కథకూ, ఆ పిలవడానికీ, ఏమీ శ్రుతి కలవదు.

అల్లా పిలవదలచుకున్నావా, ఆ పిలవడంలో ఉన్న అసలు భావం మరచిపోకుండా, నీవు నాకు నీకథ రాసియిచ్చిన ఉద్దేశం పూర్తిగా మరచిపో! ఇంకోరకంగా పిలు' అన్నది.

త్యాగతి తెల్లబోయి, హేమసుందరివైపు ఒక్కక్షణం తేరిపారచూచి, కన్నులు మూసికొని 'క్షమించు హేమా! ఈ నాలయిదురోజులనుంచీ, నన్ను నేనే మరచిపోతున్నా! దీనికంతకూ నేనే పెద్ద అపరాధిని' అనుకుంటూ నెమ్మదిగా నడచి తనకై ఉంచుకొన్న క్రిందనున్న ఒక చిన్నగదిలోకి వెళ్ళిపోయాడు.

హేము తన మాటలకు తానే ఆశ్చర్యం పొంది, నేనిల్లా అయ్యానేమిటి అనుకుంటూ త్యాగతి చూపించిన గదిలోకి వెళ్ళింది. ఆ గది ఒక శయన గృహంలా ఉంది. అందులో నిలువెత్తున తానే ఒక పాలరాతి విగ్రహమై నిలుచున్నట్లు పడమటిగోడకు దగ్గరగా, మధ్యగా ఒక పాలరాతి పీఠంమీద ఒక విగ్రహం నిలుచుని ఉంది. దక్షిణంవైపు అందాల మూపైన పందిరిమంచం ఉంది. ఉత్తరంవైపు బల్లలున్నాయి. వాటిపైన చక్కని కలంకారీ దుప్పట్లు పరచి ఉన్నాయి. ఆ బల్లపై బంగారూ, వెండి సామాను, అత్తరుదానూ, గంధపు గిన్నే, తాంబూల కరండమూ, పన్నీటిబుడ్డీ, కుంకుమ భరిణీ, పండ్ల పళ్ళేలూ, పూవుల సజ్జలూ ఉన్నాయి. తూర్పుగోడకూ పడిమటి గోడకూ పందిరిమంచానికీ ఈవలావల నిలువుటద్దాలున్నాయి. గోడలపై త్యాగతి, చిన్ననాడు రచించిన రాధాకృష్ణ, సీతారామ, సుభద్రార్జున, ఉత్తరాభిమన్యు, పార్వతీపరమేశ్వర, ఉషానిరుద్ధ, రతీమన్మథ చిత్రాలున్నవి. ప్రతి దంపతుల చిత్రాలలోను ప్రేమమయమైన అద్భుతసంఘటన ఒకటి చిత్రితమై ఉంది.

ఇవన్నీ పరిశీలించి చూస్తూ, ఆ గదిలోనుండి తూర్పుగా ఇంకొక గదిలోనికి ఉన్న ద్వారం తెర ఒత్తిగించి, ఆ గదిలోనికి వెళ్ళింది హేము. ఆ గది దంపతులు తమ వస్త్రాదులు, ఇతర వస్తువులు ఉంచుకొనే గది. ఆ గది తూర్పు గోడకు రెండు కిటికీ లున్నాయి. ఆ కిటికీలకు ప్రక్కనే రెండు అలంకారపు బల్లలముందు చక్కని కుర్చీపీట లున్నాయి. ఆ బల్లలకు పెద్దపెద్ద అద్దాలున్నాయి. ఒక బల్ల స్త్రీల అలంకారపు బల్ల. రెండవది పురుషులది. ఒకటి తన అక్కది ఉంటుంది. రెండవది తన బావది ఉంటుంది. అందులో తూర్పు గోడపైన నిలువెత్తు ఛాయాపటంలో తన అక్కా, బావా వధూవరులుగా తీయించుకొన్న ఫోటో పెద్దదిగా చేయబడిన బొమ్మ ఉన్నది. ఉత్తరపు గోడ మీద ఆ దంపతుల గర్భాదాన మహోత్సవమునాటి జంట చిత్రము, నాలుగు అడుగుల ఎత్తున పెద్దది చేయబడి ఉన్నది. దక్షిణపు గోడమీద అంత పెద్దదే తన బావ అక్కను పూజచేయుచున్నట్లున్న పటమున్నది.

తన అక్కగారి చిన్నఫొటో అద్దములోఉన్న బట్టల బీరువా ఉత్తరపు గోడవైపున ఉంది. దక్షిణపు గోడవైపున తన బావగారి చిన్నఫొటో అద్ద

ములో ఉన్న బట్టల బీరువా ఉన్నది. ఆగ్నేయమూలను బావగారికి కాబోలు మాసినబట్టలు వేయుటకు గవాక్షములున్న కఱ్ఱపెట్టె ఉన్నది. ఈశాన్యమున అక్కగారి పెట్టె ఉంది. అక్కగారి పెట్టెలన్నీ అక్కగారి బీరువాప్రక్క ఉంచబడినవి. బావగారి తోలుపెట్టెలూ ట్రంకులూ ఆయన బీరువాప్రక్క ఉన్నాయి.

ఈ గదిలోనుండి ఉత్తరంగా ఒక గుమ్మం ఉన్నది. అది ఒక చిన్న స్నానాలగదిలోనికి దారి. అందుండి పడమటివైపున దేహబాధా నివారణపు గదిలోనికి దారి ఉన్నది.

అలంకారపు గదిలో అక్కగారి బీరువాకు తూర్పుగా బట్టలు వ్రేలాడ దీయు నాలుగుకఱ్ఱల పొడుగాటి స్టాండున్నది. అలాగే బావగారి బీరువాకు తూర్పుగా ఒక స్టాండుఉన్నది. తన అక్కగారి స్టాండుపైన ఒక చక్కని వంగ పండు ఛాయ బెంగుళూరు చీరా, వంగపండు ఛాయ బెంగుళూరు రవికా ఉన్నవి. స్నానాల గదిలో వేడినీళ్ళూ, గంధపుసబ్బూ (వెండిపెట్టెలో) ఉన్నవి. స్నానాల పొడీ పెద్ద తువాళ్ళూ ఉన్నవి. వేడినీళ్ళలో సువాసనకూ ఆరోగ్యము నకూ వేసుకొను పొడిగల వెండి డబ్బా ఉంది. ఈ గదులలో అన్నీ ఆకుపచ్చ దీపాలున్నవి. అలంకారపు గదిలో కాంతిగల ధవళదీపాలే ఉన్నవి.

హేమసుందరి చటుక్కున నీళ్ళుపోసుకొనవలెనని తలచి, తలుపు వేసు కొని కంఠస్నాన మాచరించినది. స్నాన మాచరించి, అక్క చీర కట్టుకొని, రవిక ధరించి, బీరువా నిలువుటద్దములోనూ, బల్ల అద్దములోను చూచుకొని, దొనదొన కన్నీరు కార్చినది.

'అక్కా ఈ ఆనందం వదలి ఎందుకు వెళ్ళావు? నీకూ నీభర్తకూ ఎంత ప్రాణమే!' అని కుళ్ళిపోయినది. వెంటనే స్నానాలగదికి పోయి మొగం కడుక్కొని తుడుచుకొని, తల దువ్వుకొని, బొట్టు పెట్టుకొని, గది యివతలకు వచ్చినది.

శ్రీనాథమూర్తి తలుపునకు ఉన్న తెర వత్తిగించి వచ్చిన హేమను చూచి 'అయ్యో!' అని గబగబ ముందు హాలులోనికి పోయి సోఫాపై కూల బడ్డాడు. హేమ తెల్లబోయి వంటింటిలోనికి పోయింది. హేమను చూచి రంగనాయకమ్మగారు నిలువునా కూలబడిపోయినారు.

## 8

కూలబడిపోయిన రంగనాయకమ్మగారి దగ్గరకు హేమ పరుగెత్తుకుని పోయి, 'అత్తయ్యా! ఏమిటి, ఏమిటి?' అంటూ మోముపై నీరు చల్లినది. వెంటనే రంగనాయకమ్మగారికి మెలకువ వచ్చినది. ఆమె లేచి కూరుచుండి, 'హేమా చటుక్కున ఎందుకో నాతల తిరిగినది. ఏమీ భయంలేదు. మీ ఇద్దరికీ వడ్డిస్తాను. మీ బావను పిలు తల్లీ!' అని అన్నది.

హేమకుసుమ 'అత్తయ్యా! నేను మా అక్కచీర కట్టుకొని వస్తే అచ్చంగా శకుంతల అనుకొని, మీరూ, బావా కంగారుపడిపోయినారు. నన్ను పదిపుటాలు వేసినా మా అక్కను కాలేను. నేను వెళ్ళి బావను తీసుకువస్తాను, ఉండండి' అని ముందుహాలులోనికి వెళ్ళింది.

కంటనీరు కారిపోతూఉండగా త్యాగతి సోఫాలో కూలబడి ఉన్నాడు.

'ఏమయ్యా త్యాగతీ! నీకేమన్నా మతిపోయిందా! రా! ఆడవాళ్ళకన్న అధ్వాన్నమైనావేమి!' అని హేము త్యాగతి భుజంమీద చెయ్యివేసి అడిగినది. త్యాగతి లేచి, కంటనీరు తుడుచుకొని, డగ్గుతికతో 'హేమా! ఈలాంటి హృదయవేదనలు వస్తూనేఉంటాయి. ఏదైనా ఒక విషాద సంఘటన జరిగినప్పుడు, ఈలాంటి బాధలు రాకుండా ఉంటాయా!' అని మళ్ళీ క్రిందనున్న స్నానాలగదికి పోయి మొగము కడుక్కొని, తువాలుతో తుడుచుకొని వంటింటిలోకి పోయి, పీటపై కూర్చున్నాడు.

హేము వచ్చి, తన పీటపై కూర్చుంది. రంగనాయకమ్మగారు వడ్డన చేసింది. రెండు వేపుడుకూరలూ, కొబ్బరికాయ పెరుగుపచ్చడీ, గోంగూర పచ్చడీ, ఉల్లిపాయ పచ్చిపులుసూ, ఆవడలూ, పరమాన్నమూ, పిండిమిరియమూ, చారూ, పెరుగు వరస వరసగా వడ్డించింది.

హేమ: అత్తగారూ! పండగ అనా ఏమిటి ఇన్ని చేశారు?

రంగ: నువ్వు రావడమే పండగ తల్లీ! ఎప్పుడో నీ చిన్నతనంలో ఆరేళ్ళ పిల్లవై ఉన్నప్పుడు, మా ఇంటికి భోజనానికి వచ్చేదానవు. ఇన్నాళ్ళైన వెనక ఈమాత్రం చేస్తే ఒక గొప్పచే! నాకేమీ తృప్తిలేదు తల్లీ!

త్యాగతి: మా అమ్మ అయిదు నిమిషాలలో ఆరు రకాలు పిండివంటలు చేయడమూ, అబ్బే అనడం, మామూలే, హేమా!

హేమ: అత్తయ్యగారి వంట ఎంత చక్కగా ఉంది! మా ఇంటిలో ఈపాపు రుచి ఏది? ఏదో మా వంటలక్క వండుతుంది. ఇంత గొడ్డుకారం పారేసో, ఇంత ఉప్పుసముద్రం చేసో, మా ఇంట్లో కర్చు తగ్గిస్తూ ఉంటుంది. మా నాలుకలు బండబారిపోయాయి.

రంగ: వదినగారు దగ్గిర ఉండి చెబుతూనే ఉంటారే?

హేమ: అసమానం చెపుతో కూర్చుంటారా ఎవరైనా అత్తయ్యా? ఇంక నేను కాలేజీకి వెళ్ళే రోజుల్లో, మా అరవయ్యరు నాకూ, లోకానికి వేరే చేసేవాడు. అరవ వంటలు మనం ఎరగమా! ఎప్పుడూ ఆ ఉప్పుచప్పని కూరలే. నే నందుకనే ఊరగాయల పనే పట్టిస్తూ ఉంటాను.

వారిద్దరి భోజనాలు అయ్యేసరికి తొమ్మిదిన్నర అయింది. హాలులోకి పోయి తివాశీమీద కూర్చుండినారు. వారి పనిమనిషి తాంబూలపుపెట్టె తెచ్చి, వారి దగ్గిర ఉంచింది. హేము తమలపాకులకు సున్నంరాసి, బావగారికి ఆకులూ, వక్కపొడుమూ, సువాసన ద్రవ్యాలూ ఇచ్చింది. తానూ వేసుకుంది.

హేమ : బావా! మనం ఇద్దరం ఈవేంటనే ఏదైనా సినిమాకు పోదాం వస్తావా ?

త్యాగ : సినిమా! ఏసినిమా ?

హేమ : ఏదో సినిమా. లేదా, సముద్రపు ఒడ్డుకు షికారుకు పోదాం!

త్యాగ : సరే! మా అమ్మతో చెప్పిరా! మా బోయీని తీసుకొని వెడదాం. సినిమా చూస్తున్నసేపూ కారులో ఉంటాడు. అయితే నువ్వు మా ఇంటిలోనే పడుకోవాల్సి వస్తుందేమో!

హేమ : అలాగే పడుకుంటాను.

త్యాగ : సినిమానుంచి వచ్చేటప్పుడు మామయ్యగారితో చెప్పివద్దాం!

హేమ : అల్లాగే! లోకాన్నికూడా కొనుక్కువస్తాను.

ఇద్దరూ, బోయీ వెనక కూర్చుండి ఉండగా, కారు ఎక్కారు. హేమ తనపక్క త్యాగతి కూర్చుని ఉండగా, కారు వేగంగా నడుపుకొంటూ వెస్ట్ ఎండ్ సినిమాకు కారు పోనిచ్చింది. ఆరోజు సినిమా 'పిగ్మలియాన్' అనే చిత్రము. ఒక గ్రీకు శిల్పి ఒక అద్భుత సుందరమూర్తి అయిన జవ్వనిని శిల్పించి, ఆ శిల్పసుందరి అందానికి తానే ముగ్ధుడై ప్రేమించాడు. అతని ప్రేమ దేవతలను కలచివేసే మహాదుఃఖతపస్సయింది. అప్పుడు దేవతలు ప్రత్యక్షమై విగ్రహాన్ని వనితను చేశారు. అతని కోర్కె నెరవేరింది. ఆ కథను ఈ కాలానికి సమన్వయంచేసి బెర్నార్డుషా మహాకవి ఒక నాటకం రాశాడు.

ఆ కథలో ఒక ఇంగ్లీషు భాషావేత్త అయిన మహాపండితుడు భాషలోని యాసలూ, గ్రామ్యాలూ ఎందుకు వచ్చాయి? ఎల్లా వస్తాయి? అనే సమస్యను పరిశోధిస్తూ కూలివాళ్ళల్లోనూ, నికృష్టజీవులలోనూ తిరుగుతూ ఉంటాడు. అప్పుడొక బాలిక మాట్లాడే కర్కశపు గ్రామ్య భాషను గమనిస్తూ ఉండగా ఒక పెద్దమనిషితో పందెము వచ్చినది. ఆ పరిసరాలనుబట్టి భాష ఉన్నతి పొందడము, హీనస్థితికి పోవడము జరుగుతుందని భాషావేత్త వాదన. దానిపై వారిద్దరూ పందేలు వేసుకుని ఆ బాలికచే స్వచ్ఛమైన భాష మాట్లాడించగలనని భాషావేత్త ఆ బాలికను తన ఇంటికి తీసుకొనిపోయాడు. అతి ప్రయత్నంచేసి అతడు ఆ బాలికకు ఉత్తమ సంస్కృతీ, ఉత్తమ భాషా నేర్పుతాడు. బాలిక సంపూర్ణంగా మారిపోయి, ఏదో పెద్ద కుటుంబములో జన్మించిన సుందరివలె పెరుగుతుంది. నిద్రపోయే ఆ బాలిక హృదయం మేల్కొంది. ఆమె తన గురువునే ప్రేమిస్తుంది. ఈ నవీన పిగ్మలియాను తాను సృష్టించిన ఈ బాలికను తానే ప్రేమిస్తాడు. ఈ గాథను అత్యంత రసవత్తరంగా అమెరికా హాలీవుడ్డు వారు చిత్రంతీశారు. మానవ జీవిత సమస్య త్యాగతి గుండెను కదిపివేసింది. హేమా ఆలోచనలోపడింది.

తిరిగి వస్తూఉంటే హేమ 'బావా! నేను ఆలోచించిన కొలదీ మగవాని అహంభావానికి అంతులేదు అని అనుకోవలసివస్తుంది' అని ప్రశ్నార్థకమైనమాట

అన్నది. 'నీ ఉద్దేశం ఏమిటి?' అని కదా ఆమె మాట. తా నేమి చెప్పగల నని త్యాగతి అనుకున్నాడు.

'నువ్వలా అనుకోడానికి కోటి కారణాలు ఎప్పుడూ ఎదురుగా కన బడుతూ ఉంటాయి.'

'సరేలే, నీ గోడమీద పిల్లివాటపు కబుర్లు! సాగారి రాతల్లో మగవాడే, స్త్రీని తయారుచేశాడు, అని చూపించకపోతే, ఒక స్త్రీ మూరుఖుడైన ఒక కూలివానిని చూచి, వాణ్ణి ఎంతో నాగరికత కలవాణ్ణిగా మార్చి, వాణ్ణి తాను ప్రేమించి బాధపడినది అని చూపించకూడదూ?'

'అవును అలానూ రాయవచ్చును. ఏదైనా అసలు సత్యాన్నే ప్రదర్శి స్తాయి కాదా?'

'నేను అసలు సత్యంమాట తేనేలేదు. మగవాళ్ళకు అంతరాంతరం లోనూ, వాచ్యంగానూ ఉన్న 'మేమే గొప్ప' అనే అహంభావం వాళ్ళ రాతల్లో, చేతల్లో, మాటల్లో, పాటల్లో వ్యక్తం అవుతూ ఉంటుందని నా వాదన.'

'నిజమే! ఏ కారణంచేతనో పురుషుడు ప్రతి విషయంలోనూ ముందుగా పని ప్రారంభించాడు. అతనికి స్త్రీ ప్రేమ అన్నింటికన్న ముఖ్యం. అందుచేత తాను విడదీయ దలచుకొన్న ప్రతి సమస్యకూ తన్ను నాయకుణ్ణి చేసుకుం టాడు. తాను భావించుకొన్న స్త్రీని నాయికను చేస్తాడు. ఈవిధంగానే స్త్రీయే కావ్యాలు అల్లడం ప్రారంభిస్తే, ప్రతి సమస్యకూ తను నాయికను చేసుకొని, తన హృదయంలో ఉన్న ఆశయ పురుషుణ్ణి నాయకుణ్ణి చేస్తుంది. 'సాఫో' కవయిత్రిని చూడు, తరిగొండ వెంకమాంబను, మీరాబాయిని చూడరాదూ!'

'అందరు స్త్రీకవయిత్రులు నువ్వన్నట్లు చేయరుబావా! ప్రసిద్ధికెక్కిన పెరల్ బక్కు 'గుడ్ ఎర్తు' ను రాసింది. ఆమె నాయకుడి గాథను రాసింది. నాయికలు ఇద్దరయ్యారు. ఆ కథ పెరల్‌బక్కు రాయవచ్చును, లేదా సింక్లెయిరు లూయీ రాసినా రాయవచ్చును.'

కారును ముందుకు సాగించి మైలాపూరు బీచికి పట్టించింది హేమ.

## 9

ఫిబ్రవరిలో రాత్రిళ్లు చలి పూర్తిగా తగ్గదని, శ్రీనాథమూర్తి కారు ఎక్కేటప్పుడే ఒక చిన్న శాలువ తీసుకువచ్చాడు. సముద్రతీరంలో వారు కారులోంచి దిగగానే, హేముచుట్టూ ఆ శాలువ కప్పాడు మూర్తి.

హేము పకపక నవ్వి అప్పుడే ఉదయించు చంద్రుణ్ణి చూస్తూ, 'నువ్వూ, నేనూ, చంద్రుడూ, సముద్రమూ, నిశ్చలతా, చలీ, ఈ చక్కటి రాత్రీ! ఏదో సినిమాలో దృశ్యంలా ఉంది' అన్నది.

విషాదగర్భితమైన చిరునవ్వు నవ్వుతూ త్యాగతి, సముద్రతరంగాలలో స్నానం పూర్తిచేయించి పైకి తేలిపోయే చంద్రుణ్ణి చూచాడు.

'ఏమోయి బావా! ఆ చంద్రుడూ, నువ్వూ ఒకేవిధంగా ఉన్నట్లే కనబడతారేమిటి నాకు!' అని హేమ ఇంకా నవ్వుతూ ముందుకు నడిచింది.

'ఎన్ని నక్షత్రకాంతలున్నా, ఆతడు ఎప్పుడూ ఒంటిగా ఉంటాడనా?'

'మాట్లాడితే నీకు పురుషులు స్త్రీలై తోస్తున్నారేమిటి బావా? నీకు తారలే కావలసివస్తే, ఈ ఊరునిండా సినిమాతారలే!'

'నేను ఎప్పుడూ ఒంటివాడినే హేమా!'

'జంట దొరకని మహాప్రళయపుటింటిలో ఒంటిగా ఉయ్యాల లూగే వాడవా?'

'బసవరాజు అప్పారావుగారి ఆ పాట ఎంతో అందంగా ఉందికాదా హేమా?'

'నాకు పిగ్మిలియాన్ కథ ఎదుటగా ఆడుతూనే ఉంది బావా! బసవరాజువారి పాటమీదకు పోవటంలేదు.'

'మగవాళ్ళ అన్యాయం తలుచుకుంటూ, మండిపడి పోతున్నావు కాబోలు?'

'ఆ! నేనే ఫిగ్మిలియాను అవుదామని ఉంది. ఏ బోయినో చేత పుచ్చుకొని, వాడికి సంపూర్ణసంస్కార మిచ్చి, కులం సంప్రదాయం, పుట్టుక గొప్పదనం అన్నీ హుళక్కి అని చూపించదలచుకొన్నాను.'

వాళ్ళిద్దరూ సముద్రపు అలలకు కొంచెం దూరంలో, ఇసుకఒడ్డున కూర్చున్నారు, త్యాగతి పక్కగా చేరింది హేమ.

'ఈ మాటలన్నీ ఎందుకుగాని బావా! నువ్వు అన్ని దేశాలూ తిరిగావు. మొత్తంమీద నీకు గలిగిన ముఖ్యభావం ఏమిటి?'

వాళ్ళిద్దరూ ఆ కెరటాలు చూస్తూ కూరుచున్నారు. శాలువ తనచుట్టూ కప్పుకొని హేమ జరిగి త్యాగతిని ఆనుకుని కూర్చుంది.

ఏమిటీ విచిత్రమైన బాలిక! ఈమెకు జీవితం అంటే ఆవగింజంతైనా అర్థమైందా! ఒకమాటు అగ్నిశిఖలా భగుమంటుంది. ఇంకోసారి అతిరులా అలుముకుపోతుంది. తాను ఈ బాలికను వివాహం చేసుకొని ఆనందం అనుభవించకలడా? ఈ బాలికలోని చంచలత్వాన్ని నాశనంచేయగల శక్తి తనకు ఉందా? ఆమెలో భక్తీ, ప్రేమా, జీవిత మహాఝంఝామారుతాన్ని ఎదుర్కొగలిగే ధీరత్వమూ ఉద్భవింపచేయగల మగవాడు వేరే ఉన్నాడా? ఎందుకు వచ్చిందో ఆమెనోటివెంట ఒంటి చంద్రుని భావం. తా నివి అన్నీవదిలి తిన్నగా స్వామిజీ దగ్గరకు చేరుకొని, నిజమైన శాంతినిచ్చే తురీయాశ్రమం పుచ్చుకొని, జీవిత సత్యాన్ని అన్వేషించే ప్రయత్నంలో దీక్ష పూనగూడదా?

'బావా! నీ పూర్వకాలపు మానం జబ్బు మళ్ళీ ప్రవేశించిందా? నేనూ నా చరిత్ర రాశానులే! అది నువ్వు చదువు.'

'అదికాదు హేమా! నేను మదరాసు వచ్చాను. ఏడాదిపాటు మళ్ళీ జీవించాను. ఇక్కడ దారుశిల్పమూ, దంతశిల్పమూ విన్యసించడం నేర్చుకున్నాను. ఒక్క మాటలో, ఒక్క కనురెప్ప వాల్పులో నీ జీవితానికి అడ్డం వచ్చేపని ఏమీ చేయలేదు. నీ స్నేహితురాంద్రతో, స్నేహితులతో నువ్వు స్వేచ్ఛానందంతో ఒక్క మధురమైన ఆటగానే, నీ జీవితం వెళ్లబుచ్చుతో ఉంటే, ఆ ఆనందం పుడిసిళ్ళ జుర్రుకొన్నాను. నీకు మన చుట్టరికం తెలియజేయకుండా; నీతోనూ, నీ స్నేహితులతోనూ, నీ ఈడు యవ్వనునిలా స్నేహం చేసి; నాలో ఉబికివచ్చిన అనుమానాలూ, జీవిత వైముఖ్యమూ నాశనం చేసుకొని, నా కర్తవ్యం నిర్మలరూపంతో ప్రత్యక్షం చేసుకొన్నాను. ఇంక నేను నా కర్మయోగంలో పూర్తిగా ప్రవేశించాలి. నాకు నువ్వు అనుజ్ఞ ఇస్తే మా స్వామిజీ ఆశ్రమం చేరుకుంటాను.'

హేము తెల్లబోయింది. తలతిప్పి త్యాగతి ముఖంవైపు ఒక్కనిముషం తీక్ష్ణంగా చూచింది. 'సరే బావా! నిన్ను మదరాసు వచ్చి, నేను ఉండమన లేదు; తొమ్మిదేళ్లు మా కెవ్వరికీ కనబడకుండా దేశాలు తిరగమని నే ననలేదు. నీ ఇష్టమైతే నీ గురువుగారి ఆశ్రమానికే కాదు, ఉత్తరధ్రువం వెళ్లు. మధ్య నా కెందుకు? నేనా నీకు ఆజ్ఞలు ఇచ్చేదాన్ని? ఈ తొమ్మిదేళ్లూ నా అనతి మీదే ఉన్నావా?' అన్నది.

ఆ మాటలలోని కోపమూ గ్రహించాడు. ఆమె ఆ కోపపుమాటలలో కూడా తొణికిసలాడ్డే తేనెలూ హృదయమారగ్రోలుతూ త్యాగతి.

'హేమూ నే నేది మాట్లాడినా తప్పు అర్థం చేసుకుంటూ వేమి కర్మం?' అన్నాడు.

'ఇక్కడ ఓ అబ్బాయి ఇల్లు కొనుక్కున్నాడట. శిల్పాశ్రమం కట్టించాడట! ఇవన్నీ వదలి, గురువు దగ్గరకు వెళ్లి ఉన్న కుఱ్ఱవాడు దెబ్బలాడలేక పరుగెత్తుకువెళ్ళి తల్లి కొంగులో దాక్కున్నట్లు వాళ్ళ గురువుగారి జాబ్రా గడ్డల వెనక దాక్కుంటాడట!'

త్యాగతి ఆమె మాటలకు పకపక నవ్వాడు. 'నీ కోపమూ అందంగా ఉంటుంది' అన్నాడు.

'నువ్వు నన్ను పొగడనక్కరలేదు. ఒక అమ్మాయిని తన వలలో వేసుకొని, 'పెళ్ళి' అనే పేరుతో తన బానిసను చేసుకుందామని సంకల్పంతో ఆ తాయిలంగారే మదరాసులో ఏడాది మకాం పెట్టి, ఆ అమ్మాయి ఏమీ తెల్పకుండా ఉంటే, వాళ్ల గురువుగారి దగ్గరకు పరుగెత్తుతాడట. నిశాపతి నంది పర్వతాలకు వెడితే, త్యాగతి హిమాలయాలకు పారిపోతాడట. కల్పమూర్తి వింధ్యపర్వతాలకు దౌడుతీస్తే, ఇంక ఇక్కడ స్వచ్ఛంద ప్రణయవాదిని అని

బడాయిలు కొట్టుకునే చక్కని పెళ్ళామున్న తీర్థమిత్రుడూ నేనూ మిగలాలా? నే నేమన్నా ఝాన్సీలక్ష్మీనా, లోకంతో ఒంటిగా దెబ్బలాడటానికి?'

'హేమా! నేను వట్టి వాజమ్మనే! వేళాకోళంగా అంటే అంత కోప్పడతావేం' అన్నాడు త్యాగతి. ఈ బాలిక ఎంత నవీన యుగ హృదయ. మోమోటమి లేకుండా కళ్ళు విరిచినట్లు చెప్పేసింది. నిర్భయం! ఇంత హంగామా చేసి, అతి గోప్యంగా అతి జాగ్రత్తగా తాను సంచరిస్తే, రెండు మాటలలో తేల్చిపారవేసింది. ఇంక తానుమాత్రం తన పూర్వవిధానానికి ఏ రీతిగానూ, అణువుకూడా తప్పకుండా సంచరించాలి. ఇక తన కర్తవ్యం తన కళే! వీలయినంత జాగ్రత్తగా హేమను ఆమె ఎవరినో తానిష్టపడిన యువకుణ్ణి వివాహం చేసుకునేవరకూ, కనిపెట్టి ఉండడమే తన యోగం అనుకున్నాడు.

'వెడదామా హేమా?'

'నేనంటే అప్పుడే విసుగు వస్తోందా బావా? అవును, నేను శిల్పిని కాను, నీతో కళలనుగూర్చి చర్చించను. పోనీ అంత సంగీతమూ నేర్చుకొని ఒక్క పాటైనా పాడను. పాటలనుగూర్చీ సాహిత్యాన్నిగూర్చీ నిన్ను ప్రశ్నలువేయను. వేదాంతమునుగూర్చి చర్చించలేను. 'ఇన్ని దేశాలు తిరిగారు బావగారూ, ఆయా దేశాల విచిత్రాలు చెప్పండి' అని అడగను. ఎంతసేపూ సీతాకోకచిలుకలా ఇక్కడా అక్కడా వాలడమూ, టెన్నిసూ, సినిమాలూ, బాతాకానీ, బ్రిడ్జి ఆటా, స్నేహితులూ, స్నేహితురాండ్రూ, బీచిషికార్లూ, దొంగతనంగా అప్పుడప్పుడు సిగరెట్లూ, తుక్కునావల్సూ, ఇంతేగా నా జీవితం. ఈ సోడాబుడ్డితో నీకు విసుగుకాదా మరి?'

'హేమా!'

'మళ్ళీ ఇంకో ఉపన్యాసం ఇవ్వడానికి సిద్ధం అవుతున్నావూ?'

త్యాగతి పకపక నవ్వాడు. హేము తన బావగారి రెండు చెంపలు తన అత్యంత మృదులమై, పరమ సౌందర్య రేఖలతో చెన్నారే చిన్న హస్తాలతో అదిమి పట్టుకొని, అతని కళ్ళల్లోకి తేరిపారచూచి, 'బావా! నీవంటి ఉత్తమ పురుషునకు నేను తగిన మరదలను కాను సుమా?' అని అంటూ చెంపలు వదిలి, 'వెద్దాం లే' అంటూ లేచి కారుదగ్గరకు గబగబ నడవడం ప్రారంభించింది.

## 10

మరునాడు ఉదయం తీర్థమిత్రుడు హేమసుందరి ఇంటికి వచ్చాడు. హేము ఇంకా ఇంటికి రాలేదు, లోకేశ్వరీ లేదు.

పనిమనిషి, 'వాళ్ళిద్దరినీ రాత్రి త్యాగతిగారు తన ఇంటికి తీసుకుపోయారండీ. అమ్మాయిగారు ఆరింటిలోనే భోయినముండీ! అక్కడే ఆరు పడకంట' అని తీర్థమిత్రునితో చెప్పింది.

ఆతడు తెల్లపోయాడు. ఆతని ముక్కుపుటాలు విప్పారినవి. త్యాగతి తన హేమకు టోపి వేశాడన్నమాటే! వృద్ధజంబుకము! దొంగ! హీనుడు! నికృష్టుడు! ఎవడు వీడు? హేమసుందరిని తనకు కాకుండా చేయగలవాడు? తన శక్తి ఎరగడు గాబోలు. ఈ దద్దమ్మా, ఈ శిల్పిగాడా, ఈ ముసలిగాడిదా తనకు అడ్డం వచ్చేది? ఆతడు చిరునవ్వు నవ్వుకున్నాడు.

ఒక్కొక్క కొత్త మన్మథవిజయం, ఒక కొత్త రుచి సమకూరుస్తుంది. తాను ధరించిన స్త్రీ హృదయమాలకు అఖండ దాక్షిణాత్య సినీ ఆకాశ ధళం ధళకమైన కనకలతా, ఒక్కొక్క బొమ్మకు లక్షరూపాయలు తక్కువ కాకుండా పుచ్చుకునే తారారాణికూడా కొలికి పూసలైనారు. ఎందుచేతనో హేమే తన రసికత్వానికి దాసురాలు కా తప్పించుకొంటోంది. రతీనాథుని అస్త్రాలూ తనదగ్గిర ఎన్ని ఉన్నాయో, అన్నీ ఉపయోగించినా, పక్కనుంచి జారిపోతోంది. ఈ అమ్మాయి ఒక విచిత్ర స్త్రీజాతికి చెందిఉండాలి! పాత మంత్రాలు ఇచట పారవు.

లోకేశ్వరి విషయంలో కొంచెం ప్రయత్నించిన మాట నిజం. కాని ఆ తెలివితక్కువ దద్దమ్మ తనంటే ఒ పురుగులా చూస్తుంది. తన శక్తులలో దిట్టమైనవి కొన్ని ఉపయోగిస్తే లోకేశ్వరి ఈనాటికి... కాని అసలు వస్తువుకోసం చూస్తూ ఈ వడీల గొడవ తన కెందుకు? నాయికను కరిగించలేక దూతికను పట్టుకున్నట్టవుతుంది. తాను హేమతో స్నేహం ప్రారంభించిన ఈ రెండేళ్ళనుంచీ, జర్మనీయుద్ధం చేయవలసివస్తోంది. ఒకపక్క ఆపందిగాడు కల్పమూర్తి, ఓపక్క లోకేశ్వరి, నిశాపతీ ఒకడూ. నిశాపతి తనసంగతి, తన యుద్ధ కార్యక్రమం గ్రహించిన అసాధ్యుడు. అందుకనే తా నతిజాగ్రత్తగా ఉండవలసి వచ్చింది. తీరమిత్రుడైన జానకిరామమూర్తి ఆ ఉదయం హేమసుందరి చిత్రానికి ఎదురుగుండా సోఫాలో కూర్చున్నాడు. హేమసుందరి ఎవరికైనా మతి పోగొట్టగల బాలిక. ఈ అందం వినాయకరావుగారి కూతురు కెల్లా వచ్చిందో అనుకున్నాడు.

'త్యాగతి'ట ఏమిటీ చచ్చుపేరు. 'శర్వరీభూషణ్' చచ్చురకం బెంగాలీ పేరు. ఏడాదినుంచీ వీడి భోగట్టా ఏమీ తెలిసిందికాదు. చిన్నతనంలో వీళ్లందరినీ బాగా ఎరుగునట. దేశాలన్నీ తిరిగాడట. యూరపుకూడా వెళ్ళాడని అప్పుడప్పుడు తేలింది. వీడు హేమ జీవితరంగంలో ప్రవేశించినప్పటినుంచీ హేమ చాలా మారిపోయింది. నిన్న త్యాగతిగారి ఇంటికివెళ్ళి, వీళ్ళిద్దరూ పడుకోవడ మేమిటి? వాడు వట్టి బ్రహ్మచారికదా? ఏదో ఉంది. అసలు ఈ రెండుమూడు రోజులూ హేము ఈ లోకంలో లేదు. తాను వచ్చిన సంగతీ, వెళ్ళిన సంగతీ లెక్కచేయండే! కల్పమూర్తి ఈ రెండు మూడు రోజులూ వాజమ్మలా తెల్లబోయి తిరుగుతున్నాడు.

హేముతో పలకరిస్తే ఎక్కడో మనస్సుపెట్టుకొని కట్టె విరిచినట్లు మాట్లాడింది. నిన్న సాయంకాలం ఒకర్తే తన ఓపెల్ కారుమీద ఎక్కడికో వెళ్ళిందంటే సోఫీ ఇంటికేమో అనుకున్నాడు తాను. ఇంతలో కల్పమూర్తి కారు ఆరుస్తూ, గుమ్మంముందు పోర్చిలో ఆగినట్లు చప్పుడైంది. కల్పమూర్తి లోనికి వచ్చాడు.

'ధీరం, నువ్వా?'

'మూర్తీ! నిన్న సాయంకాలం ఎక్కడికి వెళ్ళిందో హేము తెలుసా?'

'ఎక్కడికో ఒకర్తే వెళ్ళిందంటే, కాబోలు ననుకొని, రాత్రి ఎనిమిదింటి వరకూ చూచి చక్కాబోయాను.'

'త్యాగతిగారింటికి వెళ్ళింది. అక్కడే భోజనమట!'

'త్యాగతి హోటలునుంచేగా కారియరు తెప్పించుకొంటాడు. ఆ భోజనానికి హేము వెళ్ళవలసిన అగత్యం ఏమివచ్చింది చెప్మా? నాతో లోకేశ్వరి హేము ఎక్కడికి వెళ్ళిందో తనకు తెలియదని చెప్పిందే!'

'లోకేశ్వరి నీతో చెప్పిందా? అయితే వాళ్ళిద్దరినీ తీసుకువెళ్ళలేదన్న మాట త్యాగతి?'

'త్యాగతి తీసుకువెళ్ళట మేమిటయ్యా?'

'వాళ్ళ పనిమనిషి లోకేశ్వరిగారినీ, హేముగారినీ త్యాగతి వచ్చి రాత్రి తనింటికి తీసుకువెళ్ళాడని చెప్పిందేమిటి?'

'నాతో లోకేశ్వరి నిన్నరాత్రి ఎనిమిదిన్నర గంటలకు హేము తన చిన్న కారుమీద ఒకర్తే ఎక్కడికో వెళ్ళిందని చెప్పింది.'

'ఈగొడవంతా ఎందుకూ? ఇద్దరం లోపలికిపోయి కనుక్కుందాం రా!'

ఈ మాటలంటూఉండగానే, హేముకారు చప్పుడైంది. వాళ్ళిద్దరూ హాలులోంచి గుమ్మందగ్గరకు రెండంగుళ్ళముల ముందుకు వెళ్ళారు. లోకేశ్వరి వెనుకసీటులో ఉంది. ముందు కారునడిపే హేముప్రక్క, త్యాగతి కూర్చుని ఉన్నాడు. తలుపులు తీసుకొని హేమూ, త్యాగతీ ఒక్కసారిగా దిగారు. లోకేశ్వరి తర్వాత దిగింది.

హేము దిగుతూనే 'హల్లో! ధీర్! హల్లో కల్ప్! మీఇద్దరి మొహాలూ వెలవేసినట్లున్నాయే! అవి చూస్తే, మాకోసం విరహతాపం పడుతున్నట్లుందే మీరు?' అన్నది. పెద్దకారు డ్రైవరు వచ్చి హేము కారును గారేజీలోనికి నడుపుకుపోయాడు.

లోకేశ్వరి మాట్లాడకుండా తనగదిలోనికి వెళ్ళిపోయింది. హేము త్యాగతినిచూచి 'బావా! నిన్నరాత్రి నాకు మీ ఇంటిదగ్గర భోజనమైతే, ఈ పగలు నీకు మాఇంటిదగ్గర భోజనం! మా సుందరమ్మగారి వంట నువ్వు ఈ రోజు రుచిచూడాలి. మీ అమ్మగారికి సైకిలుమీద వెళ్ళి...ఉండు మా కారును పంపించి అత్తయ్యగారినే ఇక్కడకు రమ్మంటాను' అన్నది.

'మా అమ్మ మాకు మామూలుగా కట్టే టాక్సీమీద వస్తోందిలే! నేనూ, మా అమ్మా ఈ రోజు ఇక్కడ ఉండటానికి అప్పుడే నిశ్చయించుకొన్నాములే!' అని చిరునవ్వు నవ్వాడు త్యాగతి.

తీర్థమిత్రునికీ, కల్పమూర్తికీ వీరిద్దరిమాటలూ ఏమీ అర్థంకాలేదు. 'బావా' ఏమిటి అని ఇద్దరూ అనుకున్నారు.

'త్యాగతిని మీకు మళ్ళీ ఎరుకపర్చాలి! ఈయన మా బావ! ఇన్నాళ్ళనుంచీ ఏదో దేశాలు తిరుగుతున్నాడనుకున్న మా బావ! శ్రీనాథమూర్తి' అన్నది హేమ.

కల్పమూర్తి: మీ బావ అంటే? శకుంతల భర్త శ్రీనాథమూర్తిగారా?

త్యాగతి: అవునండి కల్పమూర్తిగారూ! అని నిమ్మదిగా కల్పమూర్తి చేయి అందుకున్నాడు. ఆతని మోములో విషాదరేఖలు ప్రసన్నతతాల్చినవి. ఆతడు తలవాల్చి 'నేను మా మామగారినీ అత్తగారినీ చూడడానికి వచ్చాను. ఏలా వచ్చానో, ఆలా వెళ్ళిపోదా మనుకుంటున్నాను' అని తెలిపినాడు.

తీర్థమిత్రుడు: మీరు ఈ ఏడాదీ మా కెవరికీ తెలియకుండా ప్రచ్ఛన్నంగా ఉన్నారా?

త్యాగతి: అవునండీ.

తీర్థ: ఆ ఉండడంలో మీ ఉద్దేశం?

త్యాగతి: అది నా రహస్యంలెండి.

తీర్థ: మీ రహస్యమా? ఏమిటా రహస్యం? ఏదో నాటకమో నవలో అన్నట్లు ఉన్నది. పదిరోజులు రహస్యం, నెలరోజులు! ఒక్క ఏడాదా!

త్యాగతి: ఎవరి రహస్యాలు వారికి ఉంటాయి కదాండి. ఒక్క ఏడాదికాదు, జన్మంతా రహస్యంగా ఉండాలని ప్రయత్నం చేసినవారు లేరా?

కల్ప: మా జిల్లాలో ఒకాయన సంసారం వదలి వెళ్ళి, పదేళ్ళు దక్షిణాదిని ప్రచ్ఛన్నవేషంగా ఉండి, చివరకు ఇంటికి వచ్చాడు. ఎంతమందో ఆయన కోసం వెదికి, ఏమీ కనిపెట్టలేకపోయారు.

తీర్థ: అలాంటి విచిత్రాలు ఉంటాయి కాబోలు!

హేమ: 'నేను స్నానంచేసి వస్తాను. మీ రందరూ మాట్లాడుతూ ఉండండి. తీర్థం! నువ్వేమీ పెద్ద ఆశ్చర్యంలో పడి మా బావను హడలగొట్టకు. ఏలాగో దొరికాడు. మళ్ళీ ఏ దేశమో పోయాడా అంటే, కొంపలు మునుగుతాయి' అని ఆమె పరుగెత్తినది.

## 11

త్యాగతి వినాయకరావుగారి అల్లుడనీ, చనిపోయిన పెద్దమ్మాయి శకుంతలమ్మగారి భర్త అని, నెమ్మదిగా ఆ యింటిలోని నౌకర్లందరకూ, పనికత్తెలకూ, వంటవాళ్ళకీ తెలిసింది. వంటలక్క ఏడాదినాడు త్యాగతిగారిని

చూచి, వెంకట్రామరాజ్యలక్ష్మమ్మగారు మూర్ఛపోయినదృశ్యానికి అర్థం తెలిసింది. ఆనోట ఆనోట త్యాగతిగారికే చిన్నమ్మాయి హేమసుందరిగారిని ఇస్తారని గుసగుసలుగా తెలిసింది. అసలే నాకర్లందరకు త్యాగతిగారంటే ఎంతో ప్రాణం. అతనిలోని తేజస్సు, అతనిలోని నమ్రత, శివి, ఉదార హృదయం, ఆయన శక్తులు, నాకర్లందరకూ గౌరవమూ ప్రేమా కలిగించాయి. నేను వారందరికీ త్యాగతి అత్యుత్తమ పురుషుడే అనిపించినది.

లోకేశ్వరి స్నానంచేసి, బట్టలు ధరించి, తిన్నగా తన గదిలో పూజా పీఠం దగ్గరకు వెళ్ళింది. అక్కడ శకుంతల ఫొటో, పార్వతీ, లక్ష్మి, అన్న పూర్ణాదేవిల విగ్రహా లున్నాయి.

'శకుంతలక్కా! హేము బావగారిని తెలుసుకుంది. నువ్వే నన్ను రక్షించావు. నీ చెల్లెల్ని కూడా రక్షించవూ? నువ్వే పార్వతివి, అన్నపూర్ణవు, లక్ష్మీదేవివి, సరస్వతీదేవివి! హేమును గురించే నాకు భయం. శకుంతలాదేవీ! నీ ఇష్టంవల్లనేకదా, శ్రీనాథమూర్తి బావగారు హేము దగ్గరకు వచ్చారని తన గ్రంథంలో వ్రాసుకున్నారు!' అని కళ్ళనీళ్ళు తిరుగుతుండగా ఫాలాన్ని ఆ పీఠంమీద ఆనించి ప్రార్థించింది.

హేమసుందరి తాను త్యాగతిని వదలివెళ్ళి స్నానంచేస్తూ తన అందాన్ని చూసుకుంది. తెలుపుగులాబీల ఆ బంగారు వళ్ళు, బిగువులు తిరిగిన తన వక్షోజాలు, గులాబీరంగుల చూచుకాలు, వంకలుఎంచలేని అంగరేఖలు ఇది తన ప్రథమ సంపద! అందంలో నసీముకాని, మెహతాబ్ గాని, బీనాకాని, రేణుకాదేవిగాని, లీలాచిట్నీస్‌గాని, వనమాల, బీగంపారా, నర్గీస్, కాంచన మాలలుగాని ఎవ్వరూ తనకడ మైలుదూరంలోనైనా ఉండడానికి అర్హత ఉందో లేదో! ఖర్షీద్, సుబ్బలక్ష్మి, రోమలా, దేవికారాణి, కన్నన్‌బాలా, వసుంధర, జయమ్మలకున్న ఆకర్షణశక్తికన్న తనకు నూరురెట్లు ఎక్కువ ఉన్న దన్నమాటా నిజం. తాను ఆనర్సులో మొగవాళ్ళందరినీ మించి, విశ్వవిద్యాలయానికి మొదలుగా జయమంది, పతకాలూ గౌరవమూ సంపాదించింది.

మూడునెలలైంది తన్ను వివాహంకాగోరి, ఒక అరవయ్యరు ఐ. సి. ఎస్., రాయబారము పంపించాడు. కాని తన తల్లిదండ్రులకూ తనకూ ఏమీ యిష్టం లేకపోయింది. సర్వవిధాలా పురుషునికి భోగ్యవస్తువుగామాత్రం తన్ను తాను తయారు చేసుకుంది. ధనం ఉంది, చదువు ఉంది, అందం ఉంది, సంగీతం బాగా వచ్చు, ఏవో పాటలు రాస్తుంది, వ్యాసాలు రాసింది, రేడియోలో మాట్లాడింది, పాటలు పాడింది, ఒకటి రెండు రేడియో నాటకాలలో పాల్గొంది, అంతమాత్రాన తాను జీవిత కర్తవ్యం ఏమి నిర్వర్తిస్తున్నది?

పురుషుడు జీవిత ధర్మం నిర్వర్తిస్తున్నాడు! నిర్వర్తించి? ఆలా జీవితంలో కర్మయోగి కావడమే మనుష్యుని ధర్మం. ఆడది? ఆడది మొగవాడికి చేదోడు, వాదోడు; అతని పురుషత్వానికి నాయిక. అతని కుటుంబం, బిడ్డలను

వృద్ధిచేయడం అంతేగా! వంట వండిపెట్టడం; ఆతనికి పక్కవేసి; అతని బిడ్డలకు పాలిచ్చి, బువ్వపెట్టి, వాళ్ళకు నీళ్ళుపోసి, బట్టలు కట్టి, పాఠశాలకు పంపి, వాళ్ళకు అపతువస్తే ఆదుపులియై; రాత్రిళ్ళు నీళ్ళు పోసుకొని, తల దువ్వుకొని, బొట్టు పెట్టుకొని, పువ్వులు పెట్టుకొని, పడకగదికి తయారై, అతని కామదాహానికి పెదవుల అమృత మిచ్చి, దేహమే భోజనంగా అర్పించి; అలసటపడి నిద్రపోయి, మధ్య పాలబిడ్డ ఏడిస్తే పాలు కుడిపి; తెల్లవారగట్ల లేచి, పాచిపని చేసి, చేయించి, కాఫీ ఉపహారాదులు పురుషునికి అర్పించి, వంటకు తయారై, భోజనం ఆ మగవాడికి పెట్టి, అతడు వంటకాలు బాగున్నాయంటే సంతోషించి, అతడు వెళ్ళాక వంటిల్లు కడిగి, సర్ది, ఏవో రెండు మెతుకులు నోట్లో వేసుకొని; కొంచెం మేనువాల్చి, లేచి, రాత్రి భోజనానికి బియ్యం బాగుచేసుకొని, పప్పులు అవి బాగుచేసి, ఇతర పనులు చేసుకొని, పక్కయింటి అమ్మలక్కలతో నాలుగు కబుర్లు చెప్పి, వాళ్ళనీ వీళ్ళనీ ఆడిపోసుకొని;—తెలివితక్కువదైతే, ఇంటిపక్క ఉండే ఓ వెధవయ్య కళ్ళకబళింపులకు గుటకలు మ్రింగి, హడలి బేజారై; పెరిగి, జుట్టు అక్కడక్కడ నెరసి, అత్తగారై, కూతురుకాంక్షలతో తన కాంక్షలు మిశ్రమంచేసి, అపేక్షలతో అల్లుళ్ళను మంచి, కోడళ్ళను కత్తులు నూరి; అమ్మమ్మయై, బామ్మై, పళ్ళూడి మనుమరాళ్ళనూ మనుమలనూ ఆడించి; విధవయై బుఱ్ఱ గొరిగించుకొని, వంగిపోయి, వెఱ్ఱి ఆచారపరురాలై, ఆపేక్షలు మరచి, అందరికి గుండెలో నిదై్ర, చావురాక, కష్టాలు రుచిచూచి, ఏడ్చి, చివరకు కళ్ళల్లో నీళ్ళులేక క్రుంగి, మునిమనుమల మనుమరాండ్ర బాధలకు లోనై, ఇనిమనమల నెత్తి, ఇతరులు తన చావుకోర, తన చావుకై తాను దేవుళ్ళ ప్రార్థించి, పండై, ముగ్గి ముగ్గి, రాలిపోయి, గంపెడు సంసారపు తల్లి తల్లిగా పొగడ్తలనందే, ఆడదాని జీవితమేనా తానూ అనుభవించేది!

తన స్నానాలగదిలోనే తానొక నిలువుటద్దం అమరించుకొన్నది, ఆమె అనుకుంది: ఆడదానికి తన అందం తాను చూచుకొని ఆనందించే వెఱ్ఱి ఉంది. తన అందం ఆడవాళ్లు చూచి ఆనందించాలి. మగవాడు చూచి ఆనందించాలి. అనాచ్ఛాదితమైన తనదేహం సంపూర్ణంగా చూచి స్త్రీలు ఆనందించాలని కోరుతుంది, లేక అసూయతో ఉడికిపోవాలని కోరుతుంది. ఆచ్ఛాదితానాచ్ఛాదితంగానో సంపూర్ణనగ్నంగానో తన దేహం ఆ పురుషుడు చూడడంలేదని తాను మామూలుగా ఉన్నట్టు నాటకమాడుతూ, దర్శనం ఇస్తుంది. చటుక్కున ఎవరో చూస్తున్నారేమో అన్నట్లు నటించి, కంగారు పడినట్లుగాగాని, ఏమీ ఎరగనట్లు గాని సంపూర్ణాచ్ఛాదితం చేసుకుంటుంది. పరదాలో ఉండి తొంగి చూస్తుంది. తన వారు లేనప్పుడు పరదా తీసివేస్తుంది. లోకాన్ని ఆశ్చర్యంతో తిలకించే బిడ్డలా నటిస్తుంది. పెద్ద కళ్లతో ఏమీ ఎరుగని లేడిలా చూస్తుంది, కళ్లు అరమూతలు మూస్తుంది. నిర్భయంగా ఉన్నట్లు అభినయించి, మగవారితో మాట్లాడుతుంది. మగవాడు తగిలినట్లు ఉలిక్కి పడుతుంది. తగిలినా. ఏమీ

ఎరగనట్లు ఆవులా తనదారిని పోతుంది. స్త్రీ పొగడ్త వాంఛిస్తుంది, మాటలు లేని మెచ్చుకొనుట కుబ్బిపోతుంది. ధూపం కోరుతుంది. చిరుకోరికలతో గవ్వలాడుతుంది. పెద్ద కోర్కెలను రంగూను మోలుమేను పెట్టెలలో పెట్టి, అడుగున దాచుకుంటుంది. మనస్సు ఘనిఘిక్కులోతులలో మాత్రం దాచుకుంటుంది. అది గాలికి ఎప్పుడైనా పైకి తొంగిచూస్తే అది ఎవరిదా అని తానే ఆశ్చర్యం వ్యంజనము చేస్తుంది. అబద్ధములూ ఆడుతుంది. అవి నిజాలంటుంది. నిజాలని భ్రమింపజేస్తుంది. తానే నమ్ముతుంది. కావని అనుమానపడుతుంది. మెరుములా జ్వలిస్తుంది. గాలిలా ప్రసరిస్తుంది. చినుకులా అణగిమణగిపోతుంది. చంద్రుడై శాంతి, సూర్యుడై కాంతి, తారయై భ్రాంతి మగవాని జీవిత పథాలలో కమ్మివేస్తుంది.

త్యాగతి ఒకనాడనినట్లు స్త్రీ మాయ, మాత; స్త్రీ బాలిక, ప్రౌఢ, అవ్వ; స్త్రీ చీకటి, స్త్రీ ఆకాశం; స్త్రీ అమృతమూ మరణమూ.

ఏమిది! తన ఆలోచనలకు అంతులేదని హేమ అనుకొన్నది. 'స్నానం చేసేటప్పుడు సతులకు, నిద్రపోయే పురుషులకు ఆలోచన లెక్కువ' యని త్యాగతి అన్నాడు. అతడే 'స్త్రీ మొదట తన్ను ప్రేమించుకొంటుంది, ఆ తర్వాత పురుషుణ్ణి ప్రేమిస్తుం' దన్నాడు. స్త్రీ తన కాంక్షలను చంపుకో గలిగినట్లు పురుషుడు చంపుకోలేడట. స్త్రీ ధరించడంలో భూమి అన్న పెద్దల వాక్యంలో తప్పులేదని త్యాగతి ఒకనాడు వాదించి తన్ను ఒప్పించాడు.

స్నానం పూర్తిచేసి, అలంకారపు గదిలోనికి పోయి, ఏదో చీర చుట్టుకొని తల దువ్వుకొంది. ఇంతకూ తన్ను తాను ప్రేమిస్తోందా? ఇంకెవరినన్నా ప్రేమిస్తోందా? ఆమె చిన్న పట్టులాగు మొదట తొడిగి, తెల్లటి పట్టుపరికిణీ తొడిగి, పైన ఉల్లిపొరలాంటి, పాముకుబుసంలాంటి తెల్లని మజిన్ చీర, చక్కని లతలూ, అంచులూగలదానిని ధరించింది. తెల్ల పట్టుబాడీ తొడిగింది. ఆపైన తెల్లని బాడిస్ తొడిగింది. అప్పుడే వస్తున్న తెల్లని జాజిపూలు జడపైన ధరించింది. ముత్యాల జూకాలు పెట్టుకుంది. మెళ్ళో రవ్వల అడ్డిగె, ముత్యాల తారహారం ధరించింది. చేతులకు ముత్యాల గాజులు, ముత్యపు టుంగరము పెట్టుకుంది. అలంకారపు గదిలోని నిలువుటద్దాలలో చూచుకొంది. తలుపు తీసుకొని, 'లోకం' అని కేకలువేస్తూ బయటకు వచ్చింది.

## 12

'ఎందుకే హేమా!' అని ప్రతివచన మిస్తూ లోకం తనగది వీడి వచ్చింది; హేమాన్ని చూచి, లోకేశ్వరి ఆనందంలో ఉప్పొంగిపోయింది. ఈ అలంకరించుకోవడం త్యాగతికోస మని లోకేశ్వరికి తెలుసును. వీళ్ళిద్దరూ కలిసి, త్యాగతీ వాళ్లు కూచున్న హాలులోకి వెళ్ళారు.

వీళ్ళిద్దరూ వెళ్ళేసరికే త్యాగతి కల్పమూర్తితో నెమ్మదిగా 'ఎనిమిది సంవత్సరాలు దేశాలన్నీ తిరిగి, మాఊరు చేరుకునేసరికి మా మామగారిని, అత్త

గారినీ, హేమను చూడాలని ఆపజాలని కోర్కె పుట్టింది. వెంటనే ఈ ఊరు వచ్చి వీరిని కలుసుకొన్నాను. హేమను పెళ్లి చేసుకోవలసిందని వారిద్దరూ కోరారు. గురువు ఆజ్ఞ అదే! మా చుట్టాలందరూ కోరిందీ అదే! కాని హేమ హృదయం తెలుసుకోకుండా ఏలాగు? బావగారిని వివాహం చేసుకోవడము ధర్మంగా ఎంచి, హేమ ఒప్పుకోవచ్చును. లేదా! హేమకు ఉన్న అత్యంత నవీనాభిప్రాయాలతో నిరాకరించవచ్చును. అందుకని ఈ నాటకం నడిపాను. ఈ విషయం మీ హృదయంలోమాత్రం వుంచుకోండి' అని చెప్పినాడు. కల్పమూర్తికి ఒక రకమైన సంతోషము, ఓర్వలేనితనమూ రెండు వెలుగు నీడలులా ప్రసరించాయి. లోకేశ్వరీ హేమసుందరులు హాలులోనికి రాగానే త్యాగతీ, కల్పమూర్తీ ఇద్దరూ లేచారు. తీర్థమిత్రుడు అక్కడ లేడు.

హేమ: శ్రీనాథమూర్తిబావా! మనం కాలక్షేపంకోసం ఏ పేకాటో ఆడుకోవాలనీ, తుక్కు నవలలు చదువుకోవాలనీ, బాతాఖానీ వేసుకోవాలనీ, కునుకుపాట్లు పడాలనీ, మొదలయిన కార్యక్రమం అంతా కట్టివేయదలచుకొన్నాను. ఈ క్షణంనుంచి హేమకుసుమసుందరి ఏమవుతుందో చెప్పుకో! నా పేరు ఇక్కడనుంచి హేమకాదు 'భీమ' కాదలచుకొన్నది. నేనూ ఓ అయిదేళ్ళ ప్రణాళిక వేశాను—మా బావదగ్గిర చిత్రలేఖనం, శిల్పం నేర్చుకోవడం, రుక్మిణీ అరండేలుగారి కళాక్షేత్రంలో నాట్యం నేర్చుకోడం, ఆంధ్రమహిళాసభలోకి రోజూ వెళ్ళడం, బాలికలకు చదువు చెప్పడం- జీతం గీతం జాంతానై, దుర్గాబాయమ్మగారికి సర్వవిధాలా సహాయం చేయడం, మా బావదగ్గిర ప్రపంచజ్ఞానం నేర్చుకోవడం—ఇదీ నా పంచవర్ష ప్రణాళిక!

త్యాగతి 'సెహబాస్' అని చప్పట్లు కొట్టాడు. అందరూ పకపక నవ్వారు.

త్యాగతి: హేమా, ఈ నిశ్చయం మళ్ళీ మార్చుకోనని ప్రతిజ్ఞ చేస్తావా?

హేమ: మా అక్క స్మృతిసాక్షిగా ఇదే నా ప్రమాణం బావా!

కల్పమూర్తి: బావా అనడమే అలవాటయినట్లు మాట్లాడుతోంది హేమం!

హేమ: ఏయి అబ్బాయీ! నన్ను 'హేమం గీమం' అని పిలవొద్దు, హేమసుందరి అను.

లోకేశ్వరి: మళ్ళీ ఆ సుందరిమాత్రం ఎందుకే? 'భీమశక్తి' అని పేరుంచుకోరాదూ?

త్యాగ: నేను ఆ పేరును బలపరుస్తున్నాను!

కల్ప: నేనూను!

అందరూ చప్పట్లుకొట్టి పకపక నవ్వారు. ఇంతట్లో తోటలోనికి వెళ్ళిన తీర్థమిత్రుడు అక్కడికి వచ్చాడు.

తీరమిత్రుడు: ఏమిటి హేమం ఈ గడబిడ అంటానూ? త్యాగతిగారు మీ బావగారట. ఏమండి త్యాగతిగారూ! నా అభినందనాలు స్వీకరించండి.
త్యాగతి: స్వీకరించాను, కాని ఎందుకండీ ఆ అభినందనాలు?
తీర: మా హేమకు మీరు బావగారుగా?
కల్ప: అది అంతగొప్ప ఉద్యోగమా ఏమిటి?
హేమ: అందుకు మా బావకి జీతం ఎంత ఇస్తానని నీ ఊహ తీర్!
లోకేశ్వరి: 'ఓ మరదలా!' అని పిలిచే హక్కు! అంతకన్న పెద్దజీతం ఏం కావాలే?
హేమ: చాలా బాగుంది. అయితే రోజుకు ఒకసారికన్న ఎక్కువగా నన్ను 'మరదలా!' అని పిలవకు బావా!
లోకే: అది సగం జీతమే! నీచేత 'బావా' అని పిలిపించుకోడం తక్కిన సగం జీతం.
హేమ: అయితే నేను మా బావను, రోజుకు ఒకసారికన్న ఎక్కువసార్లు 'బావా!' అని పిలవకూడదన్నమాట. లేకపోతే ఇండియా వైస్రాయికన్న మా 'బావకు' జీతం ఎక్కువౌతుందన్నమాట.
త్యాగ: ఈ ఉద్యోగంలో ఉన్న విధులు?
తీర: మీ మరదలుతో కూడాతిరుగుతూ, చాకిరీలు చేసిపెడ్తూ ఉండడం.....
హేమ: దద్దమ్మ పనులకు నువ్వు మొదలురకపువాడవు. కల్పమూర్తి వీటిల్లో నిసిందాయే. మాబావ వట్టి ఉత్తరాదివాడు. ఇంకా వీటిల్లో కొత్త! ఇక నాకు కావలసింది మా బావగారి గురుత్వం. ఏం బావా! నాకు శిల్పం, చిత్రలేఖనం, బహుభాషాకోవిదత్వం నేర్పుతావా?
తీర: అంతకన్న ఆయనకు ఏంకావాలి? ఉత్తమ గౌరవోద్యోగం?
కల్ప: మన్ని పది పుటాలు వేసినా అవి రావుగా మనకు.
లోకే: తీరమిత్రుడుగారు తలదువ్వుకోడం, పౌడరు అద్దుకునే విధానాలు, జుట్టుకు రంగులువేసే విధానాలు అన్నీ బాగా నేర్పగలరు.

తీరమిత్రుడు లోపల మండిపోతున్నాడు. వీళ్ళంతా ఏకమయ్యారు. త్యాగతి చంటికుఱ్ఱవాడా?

ఈ ఆలోచన గ్రహించాడా అన్నట్లు త్యాగతి చిరునవ్వుతో, కల్పమూర్తి లోకేశ్వరి హేములవైపు చూచి, 'మీరందరూ ఇవాళ తీరమిత్రుడుగారి పని పట్టేరేమిటి? ఆయన బక్కవాడు, సున్నితమైన హృదయం కలవాడు. నేను బండవాణ్ణి నాపైన సాగించండి మీ 'బ్లిట్జు' అన్నాడు.
హేమ: సరే కానుకో బావా!
త్యాగ: ఇప్పటికి నువ్వు 'బావా' అని పిలవడం ఇరవైయ్యోసారి.
హేమ: నువ్వు ఇవాళే నీ ఉద్యోగంలో చేరుతున్నావుకాబట్టి నిన్ను కొంచెం మధ్యపెట్టడానికి మొదటిరోజున జీతం ఎక్కువ ఇవ్వదలచుకొన్నాం.

త్యాగ: నువ్వు రోజువారీ జీతం ఇవ్వదలచుకొన్నావా?
హేమ: నెలవారి జీతమే గాని రోజువారీ బహుమతి!
త్యాగ: పేకబెత్తం బహుమతిమాత్రం చేయకు, ఆటల్లో జాజిపూవులు ఇస్తో ఉండు.
తీర: ఆ పువ్వులన్నీ గుండెదగ్గిర జేబులో ఉంచుకొని త్యాగతిగారు నిట్టూర్పులు విడుస్తూ ఆనందం పొందుతూ ఆకాశమంటుతారు.
త్యాగ: పూలవాసన నూసి పొంగిపోయానే!
గుండెకాడెట్టుకొని మండిపోయానే!
తీర: మండిపోవడం ఏంకర్మమయ్యా!
త్యాగ: విరహతాపం ఎక్కువై!
లోకే: మేమంతా అరటి ఆకులు, పచ్చకర్పూరం, మంచుగడ్డా వేసిన మంచి గంధం, వట్టివేళ్ళ తడికలు జాగ్రత్త చేయాలా?
త్యాగ: అవి నా విరహాగ్నికి వీవనలవుతాయి.
కల్పమూర్తి: ఏమిటో, మీరు మాట్లాడే భాష నాకు ఏమీ అర్థంకావటంలేదు.
త్యాగ: మేం మాట్లాడేది తెలుగుభాష. అందులో శిష్టవ్యావహారికంకూడా!
తీర: శిష్టమో క్లిష్టమో, ఈలాంటి వ్యావహారిక భాషలన్నీ వచ్చి స్వచ్ఛమైన తెలుగుభాషను రొంపిలో ఊరతొక్కుతున్నాయి.
త్యాగ: ఆ రొంపి, కస్తూరి పన్నీరు కలవడంవల్ల కలిగిన రొంపి. అవును, తీరమిత్రుడుగారు పేపర్లకు ఎప్పుడైనా వ్యాసాలు రాస్తే, శుద్ధ వ్యాకరణయుక్తంగా రాసి రొంపులు, బురదలు తగలకుండా పొడిగావుండే సహారా ఎడారి ఇసుకలో జాగ్రత్తచేస్తున్నారు.
తీర: రొంపికన్న ఇసుక నయంకాదా అండి!
త్యాగ: ఇసుక, బూడిద, బుగ్గి చాలా మంచివి. బురదలో రొంపిలో కమలాలు, కలవలూ పుడుతూఉంటాయి.
తీర: నత్తలూ, పురుగులూ, దోమలూకూడా పుడతాయి.
త్యాగ: సృజనాశక్తి అంటూ ఉన్నవాటిలో ఏవైనా పుట్టవచ్చును. మృత్యురూపమైన ఇసకలో, బుగ్గిలో పుట్టుకేది? నిత్యమరణమే.
తీర: లుకలుకలాడే నీచప్రాణులు పుట్టడంకన్న, పుట్టకుండా ఉండడం ఉత్తమం కాదా?
త్యాగ: అందుచే మానవజాతి కంతకూ ఒక్కసారిగా పొటేషియం సైనైడ్ ఇస్తారా?
తీర: పుట్టకుండా ఉండడం మేము కోరుతాముగాని, చావెందుకు కోరాలి?
త్యాగ: అవును. చావును వేరేకోరట మెందుకు? పుట్టుకను మానిపిస్తేనే చాలు.
హేమ: మా తీరమిత్రుడికి కోపం వస్తోంది బావా! అతను భోజనానికికూడా పోవాలి.

## 13

భోజనాలైన వెనుక హేమా, శ్రీనాథమూర్తీ, వినాయకరావుగారూ, లోకేశ్వరీ లోపలి హాలులో కూర్చుండి, తాంబూలాలు వేసుకుంటున్నారు.

హేమ బావగారిని చూచి, 'బావా నాకు నువ్వు ముహూర్తం చూచి శిల్పమూ, చిత్రలేఖనమూ ప్రారంభించు. నేను నీ శిల్పశాలకు రమ్మంటే అక్కడకు వస్తాను; ఇక్కడకు నీవు రాగలిగితే ఇక్కడకు వచ్చినా సరే' నన్నది.

వినాయకరావుగారు: అమ్మడూ, నువ్వు బావ దగ్గరకు వెళ్ళి నేర్చుకోవడం ఉత్తమం కాదటే! అక్కడ పుస్తకాలుంటాయి. బావ వేసిన బొమ్మలూ, తయారుచేసిన విగ్రహాలూ ఉంటాయి. అవి కాకుండా ఆతడు సమకూర్చుకొన్న అందమైన విగ్రహాలూ, చిత్రలేఖనాలూ అన్నీ ఉన్నవి.

హేమ: నాన్నా! నేనుకూడా విగ్రహాలూ, చిత్రలేఖనాలు సమకూర్చుకో వద్దూ?

వినా: అట్లాగే తల్లీ! నే నెప్పుడన్నా వద్దంటానా?

లోకేశ్వరి: వివిధదేశాల వాద్యాలదారులూ సమకూర్చుకోవాలి.

శ్రీనాథ: శిల్పరూపంలో ఉన్న వస్తువులు, శాసనాలు, నాణేలు, తాటియాకు పుస్తకాలు, అన్నీ చేర్చుకోవాలి. ఆ కళ్ళతో చూడడం ప్రారంభిస్తే మనకు నిజమైన కళాస్వరూపంకల వస్తువులు కనపడుతాయి.

లోకే: త్యాగతిగారూ! నేనూ మిమ్మల్ని 'బావగా' రనడం ప్రారంభించ వచ్చునా?

శ్రీనాథ: అదేమిటమ్మా లోకం! 'బావగారు' అని అతిగౌరవం చేయాలా? చాల్లే! అల్లా అయితే నేను పలకనే పలకను. 'బావా' అంటే చాలు.

హేమ: లోకానికి మాబాగా చెప్పావు బావా!

లోకే: కోతికి కొబ్బరికాయ కోరికినట్లు ఎల్లాగైతే నీకు ఓ, బావ దొరికాడు, అస్తమానం బావా గీవా అంటూ కూర్చుంటానికి.

హేమ: ఆ కొబ్బరికాయలో సగం ముక్కను నువ్వూ పుచ్చుకో! పట్టి కురిడీ కాయ, నే నొక్కదాన్నీ నమలలేను బాబూ!

వినా: ఇద్దరూ తినేస్తే ఏమి బాగుంటుందర్రా. నలుగురికీ దేవుడి ప్రసాదం పంచాలిగాని.

హేమ: బావ ఏ దేవుడికి నైవేద్యం ఇచ్చిన కొబ్బరికాయమ్మా?

వినా: కైలాసేశ్వరుడికి!

శ్రీనాథ: ఓహో నేను పారిపోవాలి బాబూ! ఈ బాలికలందరూ నన్ను పంచుకుతింటారు కాబోలు.

వినాయకరావుగారు పకపక నవ్వారు. అందరూ నవ్వారు. ఈ రెండు మూడు రోజులనుంచీ తండ్రిగారెంతో సంతోషంతో ఉండడం హేమ చూచింది. అసలు ఏడాదిక్రిందట త్యాగతి వచ్చినప్పటినుంచీ తలిదండ్రులలో

మార్పు రావడం కనిపెట్టింది. కొంచెం చిరునవ్వు నవ్వడం; కాస్త ప్రపంచం అంటే ఏమిటో చూడటము; ఒకటీ, రెండు తెలుగుసినిమాలకు రావడం ఇవన్నీ కాలాన్నిబట్టి వచ్చిన మార్పు లనుకుంది. తన తలిదండ్రు లిద్దరూ తన బావను ఎంత ప్రేమించేవారో! తన అక్కనూ అక్కలో సగం జీవితమైన బావనూ అమ్మా, నాన్నా అద్భుతంగా ప్రేమించి ఉంటారు. లేకపోతే, ఈ చక్కని మార్పు వచ్చిఉండదు అని హేమ ఆలోచనలో పడింది.

వినాయకరావుగారు భోజనం చేయగానే కాసేపు పడుకుంటారు. ఆయన లేచి, తన గదిలోకి వెళ్ళారు. త్యాగతికి మేడమీద ఒక గదిలో పక్క వేసినారు. దానికి చుట్టాలగది అని హేమ పేరుపెట్టింది. ఆ గదిలో విశ్రమించడానికి త్యాగతి వెళ్ళి అక్కడి మెత్తటిపరుపు, తెల్లని దుప్పటి పరచి ఉన్న మంచంమీద మేను వాల్చాడు. రాత్రి హేమా, తానూ, లోకేశ్వరీ తెల్లవారగట్ల నాలుగింటివరకూ మాటలాడుకుంటూనే ఉన్నారు. తన దేశాటనంలోని వింతల్నీ, విచిత్రాల్నీ గురించి వారిద్దరూ ప్రశ్నలువేయడం, తాను చెప్పడం అలా ఎంతో ఆనందంగా వెళ్ళిపోయింది. ఏదో జరుగుతుందని ఆలోచించి, ఏడాదిపాటు పాండవాజ్ఞాతవాసం చేస్తే, ఉత్తర అభిమన్యకుమారుణ్ణి ఉద్వాహం అవుతుందా? లేక నీ దారిని నువ్వు పోవయ్యా అని పంపించివేస్తుందా? ఏమో అంతా భవిష్యద్గర్భంలో ఉంది. మనుష్యుడు ఉత్తరక్షణంలో ఇది చేస్తాడని మనం చెప్పగలమా? అతని మనస్సు మనస్తత్వశాస్త్రానికికూడా అతీతము. తన మనస్సు తా నెఱుగలేనివాడు ఇతరులను గురించి ఏమి చెప్పగలడు? కొంచె మెచ్చుతగుగా చెప్పగలమేమో మనస్సు పోకడలు! 'ఆ పని జరిగితే జరగవచ్చును, లేకపోతే లేకపోవచ్చును' అనగలం.

హేమ తిన్నగా తన గదికి వెళ్ళింది. మంచంమీద వాలింది. 'ఫాను' మీట నొక్కింది, పడుకొని కళ్ళుమూసుకొంది. తాను అలా అనేకవిధాలుగా సంచరిస్తోందేమి? తనది వట్టి చంచలహృదయమా? ఒకమాటు బావమీద కోపం. ఒకమాటు ఏదో వర్ణించరాని అపేక్ష. ఒకమాటు తాను చేసేపని సరియైనది అని అనుకోవడము, ఇంకోసారి అంతా అసంతృప్తే! ఒకసారిఇంట్లో ఉండ బుద్ధిఉండదు. ఇంతట్లోకే ఇంట్లోనే ఏవో తీయని కలలుకంటూ నిదురపోవ కోర్కె! స్త్రీలు బిడ్డలుకనే యంత్రాలా? ఆడది వంటచేసిపెట్టే ఇక్కి కుక్కరా? పనిచేసే దాసీదా? పురుషుని కామతృప్తితీర్చే భోగినా? ఎవరో కొందరు స్త్రీలు భారతదేశంలోకూడా దారిచూపించాలి. సరోజినీదేవి బిడ్డలను కనికని విసుగెత్తి, ఆ పనిమాని దేశసేవకు దిగింది. కమలాచట్టోపాధ్యాయిని ఒక కొడుకును కంది. భర్తతో ఏమి సౌఖ్యము అనుభవించింది? పెళ్ళి రద్దు చేసుకొని, ఆవిడ దేశసేవకు దిగింది. విజయలక్ష్మీ పండిట్ బిడ్డలను కన్నది, ఆమె ఆ పని మానుకొని దేశసేవకు దిగింది. దుర్గాబాయమ్మ మొదటినుంచీ బిడ్డల గొడవ పెట్టుకోలేదు. తల్లిగా ఉంటే దేశసేవ చేయలేము. భార్యగా

ఉంటే ఎంత తెలివైన స్త్రీ అయినా, భర్తకు బానిసకావాలి. అంటే తన ఉద్దేశం, స్త్రీ పదహారణాలు భార్య కావాలని! ఎనిమిదణాలు దేశసేవకాని, సంఘసేవకాని, కళా సేవగాని చేస్తూ తక్కిన ఎనిమిదణాలు భార్యగా ఉండ వచ్చునా? రెండూ కుదరవు! పోనీ స్త్రీ పురుషు లిద్దరూ ఒకేరకం పని చేస్తూ, లోకకళ్యాణంకోసం పాటుపడరాదా అంటే హుళక్కి! తాను పెరల్ బక్, మదాంక్యూరీ, బీట్రీస్ వైటు మొదలగువాళ్ళ కథలు వినలేదా?

పోనీ రష్యాలో ఆడవాళ్ళస్థితి చాలా బాగుందికాదా? భార్యాభర్త లిద్దరూ ఉద్యోగాలలో ఉండి తమ సోవియట్ రాజ్యానికి సేవచేయటంలేదా అంటే! అసలు పెళ్లి ఎందుకు! ఆడదానికి ప్రథమకర్తవ్యం ఉద్యోగవృత్తి? వృత్తి సమస్య పరిష్కారం అయితే ఆవెనక వివాహం సంగతి చూడవచ్చును! పెద్దగకం స్త్రీకి వివాహం ప్రతిబంధకమే! ఉత్తమ పురుషుల కది ప్రతిబంధ కము కానప్పుడు ఉత్తమ స్త్రీలకది ప్రతిబంధక మౌతుందా? ఉత్తమ పురుషు లకూ ప్రతిబంధకం కాలేదా? డాన్టే, షేక్స్పియరు, గథీ ముగ్గురు మేరు పర్వతాలలాంటి పాశ్చాత్య సాహిత్యవేత్తల వివాహ జీవితం ఏమయినది? అలాగే నెపోలియన్, జూలియస్‌సీజరు, అలెగ్జాండర్ మొదలైనవారి వివాహ జీవితం ఏమంత చక్కనైనది? ప్రస్తుతం తనకు వివాహంగొడవ అక్కరలేదు. బావగారి దగ్గర అన్ని కళలూ నేర్చుకోవాలి. సంఘసేవకోసం మహిళాసభలో చేరాలి! ఆతర్వాత చూసుకోవచ్చును. అయినా ఒకసారి తీర్థమిత్రునితో కలిసి నిదానంగా ఆలోచించాలి. ఈలాంటి ఆలోచనలు ఒకదాని వెనక ఒకటి తరుముకురాగా నెమ్మది నెమ్మదిగా హేమసుందరి నిదురకూరింది.

## 14

హేమ మంచి ముహూర్తం తండ్రిగారిచేత పెట్టించుకొని, త్యాగతికి శిష్యరికం ప్రారంభించింది. విఘ్నేశ్వర పూజాదికాలు అయిన వెనక,

'గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః
గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ
తస్మై శ్రీ గురవే నమః,

అని ఆమెచే చెప్పించి, శ్రీనాథమూర్తి తన మరదలికి శిల్పచిత్రలేఖన విద్య ప్రారంభించాడు. ఆ రోజుననే ఆంధ్రమహిళాసభలో సభ్యురాలై, గౌరవ ఉపాధ్యాయినిగా చేరింది హేమ. హేమను వారందరూ కలిసి వారంరోజులలో సహాయకార్యదర్శినిగా ఎన్నుకొన్నారు. హేమ ప్రసిద్ధ చిత్రకారిణి, ఉత్తమ గాయకురాలు, ఫిడేలుపై మధుర గాంధర్వము ప్రవహింప చేయు శ్రీమతి కమలాదేవిగారితో స్నేహం ప్రారంభించింది.

కమల : కళోపాసనకన్న ఉత్తమజీవితం ఏముంటుంది హేమసుందరీదేవీ!

హేమ : లోకం మాడిపోతూ ఉంటే, కళ అని కూర్చుంటే ఏమి ప్రయోజనం? రోము తగులబడిపోతూ ఉంటే, నీరో చక్రవర్తి లైరువీణపై ప్రళయాగ్ని తాండవగీతం వాయించడం ప్రారంభించాడుట.

కమ : లోకంలో బాధలు లేకుండా ఎప్పుడుంటాయి! లోకం జీవించిఉన్నది. కాబట్టి, క్షణ క్షణం మార్పు పొందుతూ ఉంటుంది. ఆ మార్పులో ఆవేదన మిళితమై ఉంటుంది. ఆవేదన కళకు ఉద్దీపన కావాలికాని, కళా జీవితాన్ని చంపేసేటట్లయితే, లోకంలో కళలు ఉద్భవించకుండా ఉండును కాదటమ్మా?

హేమ: అది కాదమ్మా అక్కా! మనుష్యులందరూ ఉత్తమ జీవితాన్ని ఆశిస్తారు. కళాజీవితమే ఉత్తమ మయితే, అందరూ ఆ కళాజీవితాన్ని ఆశిస్తారుగదా! అప్పుడు మానవజీవితం ఏమైపోవాలి?

కమ : అందరూ కళాజీవితాన్ని ఆశించేమాట నిజం, కాని అది అందరికీ లభ్యంకాదు. పూర్వజన్మ సుకృతంవల్ల ఆ కళాశక్తి కొంతమందికే లభిస్తుంది. నేనెన్ని తంటాలైనా పడుతున్నాను. నాకా కళాశక్తి దూర దూరాన్నే ఉంటూ ఉంది.

హేమ : మీ నమ్రత అలా ఉంచండి, మీరు గానంలో, చిత్రలేఖనంలోను నిపుణులు. కాని పూర్వజన్మ సుకృతం ఏమిటి? పూర్వజన్మం ఉందనీ, అక్కడి సుకృత దుష్కృతాలు ఈ జన్మకీ వస్తూవుంటాయనీ ఎలా నమ్మడం? ఈ నమ్మకానికి శాస్త్రాధారం ఏది?

కమ : ఈ లోకంలో మనం నమ్మే అనేక విషయాలకు శాస్త్రాధారం ఏది? అయినా వానిని సత్యాలుగా మనం నమ్ముతున్నాము, ఆచరిస్తున్నాము.

హేమ : ఏవవి?

కమ : ఇప్పుడు మీకూ నాకూ స్నేహం కలిసింది. ఆ స్నేహానికి శాస్త్రాధారం ఉందా?

హేమ : నేను మీ సంఘంలో చేరానుకనుక మీకూ నాకూ స్నేహం అయింది.

కమ : చేరితే ఏమి? నాబోటి సభ్యురాండ్రు యాభైమంది ఉన్నారు. వారంద రితో కూడా ఎందుకు స్నేహంకాలేదు?

హేమ : మీరు కళామూర్తులు కాబట్టి, మీకూ నాకూ స్నేహం కుదిరింది.

కమ : నాతోబాటు కళాసేవ చేసేవారు ఏడెనముండుగురు ఈ సంఘంలో సభ్యురాండ్రుగా ఉండిరాయెను. వారితో మీకు బాగా సంపర్కం కలుగు తున్నదాయెను. అయినా వారందరితోనూ మీకు స్నేహంకలిగిందా?

హేమ : మీ వ్యక్తిత్వము, నా వ్యక్తిత్వానికి సంబంధం కలదికాబట్టి మీకూ నాకూ స్నేహం కలిగింది.

కమ : ఆ వ్యక్తిత్వం పూర్వజన్మ సంస్కారఫలితమే.

హేమ : కుటుంబ, దేశకాల ప్రభావంవల్ల కాదా?

కమ: అది ఉండదనా! అలాంటి సంపర్కంలో మా చెల్లెలూ ఉండవచ్చును. ఆమె గుణం ఎందుకు వేరుకావాలి? అదే ఇద్దరు కవలలు పుట్టితే, జన్మంలో ఏ ఐదు నిముషాలో తేడాగదా, తక్కినవన్నీ ఒక్కటే ఉంటాయి. అయినా గుణగణాలలో వ్యక్తిత్వంలో తేడాలు ఉంటున్నాయా లేదా?

హేమ: మీరు చెప్పే విషయాలు శాస్త్రంవల్ల నిర్ధారణ కావాలికదా!

కమ: అవి శాస్త్రంవల్ల నిర్ధారణ చేసినప్పుడు ఆయా శాస్త్రాల మార్గాన ఈ సిద్ధాంతాలకు వచ్చి ఉండిరి.

హేమ: ఒక్క విషయం అల్లాంటిది చెప్పండి.

కమ: వేదంలో ఎన్నో సత్యాలున్నాయి. అవన్నీ ఈరోజుకు నిజమేకద! జ్యేష్ఠ పెద్దనక్షత్రం అన్నారు. విష్ణుమండలానికి తారకాగోళాలన్నీ వెడుతున్నాయన్నారు. అవన్నీ నిజమని ఈరోజు శాస్త్రకారులు ఒప్పుకున్నారా లేదా?

హేమ: ఏమండీ అక్కగారూ, మీరూ అచ్చంగా మా బావకుమల్లేనే వాదిస్తున్నారే.

కమ: ఎవరు మీ బావ?

హేమ: త్యాగతి శర్వరీభూషణ్ గారు.

కమ: అల్లాగా! ఆయన ప్రపంచ ప్రఖ్యాతిగన్న శిల్పి! మొన్న మదరాసు కళాసంఘంవారు ఏర్పాటుచేసిన శిల్ప చిత్రకళా ప్రదర్శనంలో మూడు ప్రథమ బహుమానాలు పొందారు. మూడుకన్న ఎక్వరూ ఎక్కువ పొందకూడదన్నారు. కాని, అన్ని ప్రథమ బహుమానాలూ ఆయన కొట్టేయవలసిందే!

ఆంధ్రమహిళా సభాభివృద్ధికోసం పనిచేయాలని ఆవేదనతో హేమ పట్నం అంతా తన కారుమీద తిరగడం, సభ్యురాండ్రను చేర్పించడం పెట్టుకుంది. నాలుగువందలమంది వివిధ విద్యాలయాలలో, కళాశాలలలో చదువుచున్న బాలికలను చేర్పించింది.

వసంతోత్సవాలు తలపెట్టి దుర్గాబాయమ్మగారితో కలిసి వసంతనాట్యం, వసంత నాటిక, వసంతపు ఆటలు, పోటీపందేలు, వసంత చిత్రశిల్పకళాప్రదర్శనం అన్నీ ఏర్పాటుచేసింది. ఆంధ్రులకు వసంతోత్సవం సంవత్సరాదినాడే బాగుంటుందని చెప్పింది. తాను నాట్యం నేర్చుకోవడం ప్రారంభించింది. నాట్యం నేర్చుకొనడానికి అసలు ఆంధ్రసంప్రదాయానికి బిడ్డ అని తంజావూరి విధానం; శిథిలమైన ఆంధ్ర సంప్రదాయము, కూచిపూడి విధానమనీ అదీ నేర్చుకొనసాగించింది. రాక్షసి పట్టుదల! తాను 'వనదేవి' యట. లోకేశ్వరి వసంతుడట. సోఫీ పారిజాతమట. మహిళాసభ బాలికలు కొందరు పూలబాలికలట. అలా వసంతనాటిక వ్రాయసాగింది. హేమ గీతానృత్యనాటకం తానే తయారుచేసుకుంది. త్యాగతిచేత దిద్దించుకుంది. తన సొమ్ము వేయి

రూపాయిలు కర్చుకోసం అంచనా వేసుకుంది. హేమా, కార్యదర్శినీ, దుర్గాబాయమ్మగారూ, కమలాదేవిగారూ, ఇతరులూ కలిసి ఇంకో పదిహేనువందలు వసూలుచేశారు. ఆంధ్ర కవయిత్రుల గోష్ఠి అని పెట్టింది.

ఆంధ్రదేశ ప్రసిద్ధ కవయిత్రులు—చావలి బంగారమ్మగారు, తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు, బసవరాజు సౌదామినిగారు, ద్రోణంరాజు లక్ష్మిబాయమ్మగారు, పులవర్తి కమలాదేవిగారు, కాంచనపల్లి కనకమ్మగారు, మధునాపంతుల రుక్మిణమ్మగారు, ఇందుమతీదేవిగారు, పులుగుర్త లక్ష్మినరసమాంబగారు మొదలైనవారిని, ఇప్పుడు నవ్యనవ్య మార్గాల కవిత్వం చెప్పే బాలికలను పోగుచేసి, కావ్యగోష్ఠి ఏర్పాటుచేసింది. రోజుకు ఇరవై నాలుగు గంటలయితే, హేము మూళ్ళెఆరు గంటలు పనిచేయడం మొదలుపెట్టింది. అలంకరించుకోవడం మానింది. బీచి షికార్లు పోయాయి. సినిమాలు మాయమయ్యాయి. ఒక్కొక్కప్పుడు ఇంటిదగ్గిర భోజనమే మానింది. బలవంతంచేసి వాళ్ళమ్మగారిని తీసుకుపోయేది. సోఫీని లాక్కుపోయేది. లోకేశ్వరిని ఎత్తుకుపోయేది.

త్యాగతిని 'బావా, నాకీ పదిరోజులూ సెలవియ్య' మని అడిగింది. మూడు శిల్పాలు పూర్తికానివీ, ఒక బొమ్మ పూర్తి అయినదీ తాను రచించినవి ప్రదర్శనంలో పెట్టదలచుకొంది. తాను చిత్రించిన మూడు దృశ్య చిత్రాలు, భారతీయ విధానాన రచించిన చిత్రమూ ప్రదర్శనంలో ఉంచుటకు నిశ్చయించింది. రేపు సంవత్సరాది అనగా ఆ రాత్రల్లా ప్రదర్శనం ఏర్పాటయిన మహిళాసభా బాలికాపాఠశాల మందిరములోనూ, మహిళాసభ ఆవరణలో, పందిళ్ళలో, తాత్కాలిక రంగస్థలంలోనూ దానవిలా తిరుగుతూ, పనిచేస్తూనే ఉంది. అన్నీ పూర్తిచేసుకొని, తెల్లవారుతోందనగా ఇంటికి వచ్చి, తాను రెండుగంటలు నిద్రపోతాననీ, సరిగ్గా ఆరున్నరకు లేపమనీ తల్లితో చెప్పి, పక్కమీద వాలి కళ్ళుమూసుకొని చిన్నబిడ్డలా నిద్రపోయింది.

## 15

తూర్పు సముద్రతరంగాలపై అరుణరాగాల నర్తిస్తూ, లోకంలో దారుణ యుద్ధరక్తరాగం ఇంకా ఎరుపుచేస్తూ, నూతన మామిడిపూవుల వాసనలతో మొదుగపూవుల దీప్తవర్ణంతో వృష సంవత్సరాది ఉదయించింది. ఆరున్నరకు తల్లిని లేపమన్నదిగాని, ఆరింటికే లేచింది హేము. అరగంటలో తలంటి నీళ్ళుపోసుకొన్నది. లోకేశ్వరిమాత్రం మహిళాసభ పాఠశాల హాస్టలు విద్యార్థినులకు తెల్లవారగట్లనే తలంటుపోయిస్తూఉండి, తానూ అక్కడే తలంటు పోసుకుంది. ఏడుగంటలకు పెళ్ళికూతురులా హేమ ముస్తాబు చేసుకుంది. పెద్దకారులో తాను కొత్త చింతపండు, కొత్త బెల్లం, చెరుకుముక్కలు, వేపపువ్వు, అరటిపండు, మామిడి ముక్కలతో తయారుచేయించిన సంవత్సరాది పచ్చడిని పెట్టించి, తానూ తన తల్లి బయలుదేరారు. సోఫీ పందిరి దగ్గరే కలుసుకున్నది.

ఆరు టాక్సీలలోనూ, తన కారులోనూ, సోఫీ కారులోనూ, ఇంకను ఆంధ్రమహిళామణుల కారులలోనూ విద్యార్థినులు, ఉపాధ్యాయినులు, కార్య వర్గమువారు, దుర్గాబాయమ్మగారూ, వారి తల్లిగారూ, తక్కిన కుటుంబమూ అందరూ ఏడున్నర గంటలకు ప్రదర్శన మందిరముకడకు పోయినారు. అందరికీ పచ్చడి పంచినారు. అక్కడకు ఎందరో ఆంధ్రవనితామణులూ అరవ సోదరీ మణులూ, ఇతర స్త్రీలూ వచ్చినారు. ప్రదర్శనము తలుపులు వేసియుంచి, ఆ తలుపులకు ఉమ్మిడివారిచే తయారుచేయించిన వెండితాళము వేయబడినది. మామిడి తోరణాలు, పూలమాలలు ఆ ప్రదేశమంతా అలంకరించారు. అగరు వత్తులనుండి పరిమళధూపాలు సర్వదిశలకు ప్రసరిస్తున్నవి.

శ్రీమతి దుర్గాబాయమ్మగారు శ్రీ ఆనందనగరం మహారాణీగారిని ప్రదర్శనం ప్రారంభించవలసినదని, మహిళాలోకానికి వారి నెరుకపరుస్తూ వారి సేవ ఉగ్గడించారు. లలితకళలన్నీ సుందరీమణుల సొత్తే అనిన్నీ, సంగీతం విషయంలో ఆంధ్రవనితలు దక్షిణాదివారికీ ఉత్తరాదివారికీ చాలా వెనుకబడి ఉన్నా, శిల్ప చిత్ర లేఖనాలలో భారతదేశంలో ఆంధ్రస్త్రీలు బెంగాలీవారితో సమంగా ఉన్నారనీ, అందుకు నిదర్శనము శ్రీమతులు రత్నాల కృష్ణాబాయి గారు, కమలాదేవిగారూ, దిగుమర్తి బుచ్చికృష్ణమ్మగారూ, దామెర్ల సత్యవాణి గారూ, సీతాకుమారిగారూ, జంగం లక్ష్మీబాయమ్మగారూ, హేమసుందరీదేవి గారూ మొదలైన సోదరీమణులు ఉన్నారనియూ; ఈ ప్రదర్శనం ఇంత విజయవంతంగా జరగడానికి కమలాదేవి, హేమసుందరీదేవిగార్ల ఉత్తమ కృషేననీ మహారాణిగారు ఉపోద్ఘాతముగా చెప్పినారు. 'సోదరీమణులారా! చిత్రలేఖనము, కవిత్వము, శిల్పము, సంగీతము, నాట్యము, ప్రకృత్యనుకరణంగా ఉండవలెనా, లేక ఆశయ భావపూరితమై, పూర్వ సంప్రదాయాత్మికంగా ఉండవలెనా అనే ప్రశ్న ఒకటీ; రచనావస్తువు కళాకారులకు ఉత్తమమని తోచిన విషయం ఏదైనా ఉండవచ్చునా లేక దేశానికి ఆర్థికంగా, రాజ కీయంగా ఉపయోగించే విధానంగా ఉండవలెనా అనే రెండవప్రశ్నా; ఇవి కళాప్రపంచంలో కళాస్రష్టలను కలతపెట్టున్నవి. నా ఉద్దేశంలో ఆ సమస్య లన్నీ రాజకీయ, సాంఘిక మతవిషయిక వేదాంతులకు వదలి, ప్రస్తుతము ఆంధ్ర వనితామణులు చిత్రలేఖనాది సర్వ లలితకళల్లోనూ సిద్ధహస్తులు కావడమే ప్రధాన ఆశయంగా ఎంచుకోవలసినదని కోరుతున్నాను.

'కళావేత్తలయిన ఆంధ్ర సోదరీమణులు రచించిన శిల్ప చిత్రాదికాలూ, కళావస్తువులూ ఆంధ్ర స్త్రీలేకాని, వారికి శతాధికంగా ప్రోత్సాహం ఇవ్వవలసి ఉంది. మీ రందరు మన సోదరీమణుల కళావైభవం చూడాలని ఉవ్విళ్ళూరు తున్నారు. మీ ఉత్సాహానికి నేను అడ్డం రాదలచుకోలేదు. ఈలాంటి ప్రదర్శనాలు ప్రతి సంవత్సరము చెన్నపట్నంలోనూ, ఇతర పట్టణాలలోనూ విరివిగా జరుగుతూ ఉండాలని ఆశిస్తూ, ఈ ప్రదర్శనం తెరుస్తున్నాను' అని

మహారాణీగారు ముగించారు. సభ్యూరాండ్రందరూ హర్ష కరతాళ ధ్వనులు మిన్నుముట్టించారు.

శ్రీ రాణీసాహెబాగారు తమ కందిచ్చిన రజిత కరండములోని, వెండి తాళంచెవితో ఆ వెండితాళం తెరచి తలుపులు తోసినారు. తలుపులు వెనక్కుపోగానే గుమ్మంలో అడుగిడిన రాణీగారి తలపై పూలవర్షము కురిసింది. లోకేశ్వరి సోదరీమణు లందరిపైనా పూలజల్లులు కురిపించింది. గుమ్మానికి ఈవలావల నలువురు బాలికలు నిలుచుండియుండిరి. లోపలికి పోయే ప్రతి సదస్యురాలికి ఒకరు గంధమూ, ఒకరు అత్తరూ, ఒకరు పుష్పదామమూ, ఒకరు బొట్టునూ అర్పిస్తున్నారు.

ఆ విశాలమందిర సౌందర్యం చూచి, ప్రేక్షకురాండ్రందరూ ఆశ్చర్యం పడిపోయారు. హేమసుందరి తన బావగారైన త్యాగతిగారి ఇంట్లోనూ, అతని శిల్పాశ్రమంలోనూ ఉన్న సర్వదేశాల ప్రాచీన అర్వాచీన శిల్పాలూ, సర్వదేశాల పురాతన చిత్రలేఖనాలూ, అధునాతన చిత్రాలూ, అజంతాచిత్రాల ప్రతిరూపాలూ, రాజపుత్ర చిత్రాలు, పళ్ళెలు, సెమ్మాలు, జేగంటలు, రత్నకంబళ్ళు, కరండాలు, కలశాలు, దంతపేటికలు, గంధపు పేటికలు, దంతశిల్పాలు, మంచిగంధపు శిల్పాలు, తామలపాకు దానులు, అడకతెరలు, ఆటసామానులు, చదరంగపు బల్లలు, తెరలు, దుప్పట్లు, తలగడలు మొదలగు అలంకారపు సామానూ; శిల్పపు పనితనంగల బల్లలూ ఆ మందిరానికి సౌందర్య రేఖలు తీర్చేటట్లు అలంకరించినది. ఇక ఆంధ్రకళావిదుషీమణులు రచించిన చిత్రాలు అత్యంత మనోహరంగా అమరింపబడి ఉన్నాయి. మొదటి బహుమానాలు, ద్వితీయ బహుమానాలు, విశేష బహుమానాలు పొందిన శిల్ప వస్తువులు, చిత్రాలు, చిత్రాలక్రింద వ్రాసి ఉంచబడినవి. కళావస్తువులగురించి చిన్న పొత్తము అందముగ అచ్చొత్తింపబడినది. అందులో బహుమతులందిన శిల్పాదికాల ప్రతిరూపాలుకూడా ఉన్నాయి. ఎంత తొందరగా చూద్దామన్నా ఎవ్వరికీ కాలవ్యవధి చాలలేదు. పదింటికి ఉగాది ప్రార్థన ఉన్నది. ప్రారంభసభ ఉన్నది. అందుకై తీరికగా చూడవచ్చునని ప్రేక్షకురాండ్రు సభాస్థలం చేరుకున్నారు.

పదిమంది యువతులు వీణ, వేణు, నాదస్వరము, ఫిడేలు, సారంగి, ఇస్రాజ్, సితారు, మాండలీను, తాంబూరా, వయోలా వాద్యాలు వాయిస్తూ ఉండగా, నలుగురు బాలికలు,

'వృషాగమన కషాయితమై
గొంతు విడివడగ
కొసరికొసరి పుం
స్కోకిలరావము
దెసలముసరెనే.'

అంటూ ఉగాదిపాట పాడిరి. శ్రీమతి దుర్గాబాయమ్మగా రంత లేచి, వేదిక పైకి వెళ్ళి, ఆ ఉత్సవానికి అధ్యక్షతవహింప దయతో అంగీకరించిన ఢిల్లీలో వాసంచేస్తూ ఒక జాతీయ దినపత్రికకు సంయుక్త సంపాదకురాలైన ప్రసిద్ధ ఆంధ్రమహిళ శ్రీమతి పద్మినికుమారి, పిహెచ్. డి. గారిని అధ్యక్షపీఠ మలంకరింప కోరినారు.

## 16

అధ్యక్షురాలు పీఠ మలంకరించుటకు వేదికపైకి వచ్చుటతోడనే హేమ కుసుమసుందరి పుష్పదామం వారిమెడ నలంకరించింది. కంకణక్వణిత కరతాళధ్వనులు చెలరేగాయి.

దుర్గాబాయమ్మగారు అధ్యక్షురాలినిగూర్చి, మహిళామండలికి వారు చేసిన సేవనుగూర్చి ప్రశంసావాక్యాలు చెప్పి, కంఠమెత్తి గంభీరంగా మహిళోద్యమం భారతదేశంలో మొదట ప్రారంభించింది అనిబిసెంటుగారనిన్నీ; ఆ ఉద్యమం నానాటికి వృద్ధిపొంది, ఇప్పుడు సర్వభారతీయ మహిళా మహాసభ ఏర్పడి, అందుకు రాష్ట్రరాష్ట్రానికి, మండలమండలానికి శాఖలు వెలసి, మహత్తరమైన సంస్థగా పరిణమించినదనిన్నీ; దేశం అంతా ఈనాడు మహిళా సంఘాలు, స్త్రీలకు క్లబ్బులు, కళాశాలలు, ఒక విశ్వవిద్యాలయము, సేవా సంఘాలు వనితలకు ఉదయించాయనిన్నీ; ఈ సకల ఉద్యమాల ఫలితంగా భారతదేశంలో జాతీయ స్వాతంత్ర్యాది పవిత్ర ప్రయత్నాలలో స్త్రీలు పురుషులతోబాటు, ఒక్కొక్కప్పుడు వారికన్న అధికంగా దేశసేవ చేస్తున్నారనిన్నీ; పతితస్త్రీల ఆశ్రమాలు ముత్తులక్ష్మిరెడ్డిగారూ, యామినీ పూర్ణతిలకమ్మగారూ మొదలగువారు స్థాపించి, దీన సోదరీమణుల నెందరినో ఉద్ధరిస్తున్నారనీ; ఈ సర్వకృషి ఫలితంగా నేడు భారతదేశంలో, స్త్రీలకు వోటూ, శాసనసభా సభ్యత్వమూ, మంత్రిత్వమూ, చదువూ, ఉద్యోగాలూ, న్యాయవాదిని, వైద్యురాలు, ఉపాధ్యాయిని మొదలైన వృత్తులెన్నియో లభిస్తున్నవనీ; ఈ కృషి ఫలితంగానే శారదాశాసనము వచ్చిందనీ; అందువల్ల దేశంలో ఎంతో మార్పు కలిగిందనీ; స్త్రీలకు ఆస్తి, బహుభార్యాత్వ నిషేధమూ, విడాకుల శాసనమూ రాగలవనీ; తామందరూ ఇంతవరకు చేసిన ప్రయత్నం వట్టి నాందిమాత్రమేననీ, ఇంకనూ కొన్ని వేలరెట్ల ఉత్సాహంతో స్త్రీలందరూ నడుంకట్టుకొని ప్రయత్నం చేయాలనీ; అప్పుడుగాని స్త్రీల ఆశయాలు నెరవేరవనీ చెప్పతూ ఈ నూత్న సంవత్సరం మనల నింకో మెట్టు పైకి తీసుకవెళ్లుగాక అన్న కోర్కెకు హేమ కుసుమసుందరీదేవివంటి తెలివైన బాలికలు ఈ సంఘంలో చేరటమే దృష్టాంత మనీ, ఈ ఉత్సవానికి ఆమె కారకురాలనీ, ఈ శుభోత్సవవేళ వారికందరికీ, మహారాణీ సాహేబాగారికీ, ప్రసిద్ధురాలైన అధ్యక్షురాలికీ స్వాగతమనీ చెప్పి కూరుచున్నారు.

హర్ష ధ్వనులు సముద్రతరంగ ఘోషలై మిన్నుముట్ట అధ్యక్షురాలు లేచి తమ ఉపన్యాసం ప్రారంభించారు.

'దుర్గాబాయమ్మగారూ! మహారాణీగారూ! సోదరీమణులారా! ఒక్కొక్క మహాయుద్ధమూ ఒక్కొక్క మహోద్యమమూ, ఒక్కొక్క అఖండమైన సాంఘిక వ్యవస్థా అన్నీ ఒకదానితో ఒకటి గాఢసంబంధంతో ఉదయిస్తాయి. ఇప్పుడు ప్రపంచములో ప్రళయయుద్ధం చెలరేగుతున్నది. మన దేశానికి తూర్పుఖండంలోకూడ మహాభయంకర ప్రళయం రాబోతున్నది. అమెరికా అధ్యక్షులు అది రాకుండా జపానువారి తలతిక్క మాన్పాలనీ, సంప్రతింపులవల్ల శాంతి సుస్థిరం చేద్దామనీ, ప్రయత్నం చేస్తున్నారు. కాని నా ఉద్దేశంలో వారి ప్రయత్నం నిష్ఫలమవుతుందనే. మనదేశంకూడా యుద్ధ దావానలంలో మండిపోవచ్చును. ఈలాంటి ప్రళయం వచ్చే ఈ రోజుల్లో స్త్రీలను ఎదుర్కొనే సమస్యలు రెండున్నాయి.

'ఒకటి: స్త్రీ యథాప్రకారంగా ఆదర్శగృహిణియై, అందుకు తగిన చదువు నేర్చుకుని, చక్కని భార్యయై, భర్తకు 'కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ, శయనేషు రంభా, క్షమయా ధరిత్రీ' అయి ఆతనికి బిడ్డల్ని కని, పెంచుతూ, వంటచేసి పెడుతూ ఉండడమా; లేక తనదారి తాను చూచుకొని, తన కామతృప్తికి, ఉత్తమ కార్యమైన జాతి అభివృద్ధికీ, తనకు నచ్చిన పురుషునితో తాత్కాలిక సంబంధమో, స్థిరసంబంధమో ఏర్పాటుచేసికొని, జాగ్రత్తగా, ఆరోగ్యశాస్త్రోచితంగా బిడ్డలను కంటూ, వారిని ఉత్తమ విధానాన పెంచుతూ తానుకూడ ఈ జగల్లీలా మహానాటకంలో పురుషునితో సమంగానో, ఇంకా అంతకన్న ఉత్తమంగానో కార్యయోగినియై లోకచరిత్రను కొనసాగించడమా? ఇది ఒక సమస్య.

'ఇక రెండవ సమస్య: ఇది పూర్తిగా మనదేశానికి సంబంధించింది. మన దేశంలో అన్ని మతాలూ ఉన్నాయి, అన్ని వర్ణాలు ఉన్నాయి. ముఖ్యమైన హిందూమతంలో కొన్నివేల అంతశ్శాఖ లున్నాయి. బ్రాహ్మణులంటే— వంగబ్రాహ్మణులు, బీహారు బ్రాహ్మణులు, ఆంధ్ర, మిథిల, మహారాష్ట్ర, తమిళ, మళయాళ, కన్నడ, గుజరాతు, సింధు, పంజాబు, గౌడ, కాశీ, కాశ్మీర, రాజపుత్ర, లక్నో, అస్సాం, సరస్వతీ బ్రాహ్మణులని ఉన్నారు. వీరందరికీ ఏమీ సంబంధాలు లేవు. ఇంకా ఒక్కొక్క రాష్ట్రంలో ఉన్న బ్రాహ్మణులలో అంతరాంతరశాఖ లున్నాయి. ఒక్క ఆంధ్రులలో చూడండి. ఆరువేల వారు, ప్రాజ్ఞ్నాడులు, కరణకమ్మలు, నందవరీకులు, గోలుకొండవ్యాపారులు, ఋగ్వేదులు, సామవేదులు, యాజ్ఞవల్క్యులు, ఆరాధ్యులు అనే నియోగి శాఖలూ ఏవిధమైన సంబంధాలు లేకుండా ఉన్నయి. వెలనాట్లు, తెలగాణ్యులు, కాసరనాట్లు, వేగినాట్లు, మురికినాట్లు అనే వైదికశాఖ లున్నాయి. వీరిలో వీరికీ ఈ అంతశ్శాఖలకూ ఇతరశాఖలతో సంబంధాలు లేవు. శ్రీవైష్ణ

వులు, గండికోటులు, మంగళంపాదులు, గంగవరంవారు, హెబ్బారువారు, మండయం, తుమ్మకొండ, వడఘళై తెంగలైలు, నియోగి వైష్ణవులు, అష్ట గోత్రులు, ఆంధ్ర వైష్ణవులు శాఖలుగా ఉన్నారు. ఆరామ, పేరూరు, తుమ్మ కొండ ద్రావిళ్లు అనే భేదాలుగల ద్రావిళ్లు ఉన్నారు. మధ్వులున్నారు. ఇది ఆంధ్రదేశంమాట. ఈలాగే ప్రతిరాష్ట్రంలోని బ్రాహ్మణులలో అంతశ్శాఖ లున్నాయి.

'శాఖాభేదాలు ఇలాగే క్షత్రియులలో, వైశ్యులలోను ఉన్నవి. రాష్ట్రాల సంబంధాలు లేవు. ఇంక శూద్రులలో సచ్ఛూద్రులనీ, సాధారణ శూద్రులనీ రెండు తేడాలు. ఆ సచ్ఛూద్రులలో కొన్నివందలు తేడాలు, సాధారణ శూద్రులలో కొన్నివందలు తేడాలున్నాయి. ఆంధ్రదేశంలో సచ్ఛూద్రులలో రెడ్డి, వెలమ, కమ్మ, కాపు, మున్నూరుకాపు, తెలగ, ఆదివెలమ, ముదిరాజు అనేవా రున్నారు. రెడ్లలో మోతాడ, పాకనాటి, వంటరెడ్లు, భూమంచి రెడ్లు వగైరా ఎందరో ఉన్నారు. కమ్మవారిలో పెద్దకమ్మవారు, చిన్నకమ్మ వారు ఉన్నారు.

'ఈలా కోటితేడాలతో ఉన్న మనదేశం ఆ తేడాలనన్నీ అల్లాగే ఉంచు కొని, నాశనమైపోవడమా, లేక మతము వ్యక్తిగతము, జాతిగతము కాదు; వివాహ, సాంఘిక, రాజకీయ, ఆర్థికాది వ్యవహారాలలో మతాన్ని బలంకోసం ఉపయోగిస్తూ ప్రతిబంధకం కాకుండా చేసుకోవడమా? ఇది రెండవ సమస్య.

'మహిళామణులారా! ఈ సమస్యలు లోకకల్యాణప్రదంగా స్త్రీలే పరిష్కరించగలరు. స్త్రీలే శాసనసభలకు ప్రతినిధురాండ్రు కావాలి. అప్పుడు యుద్ధాలు తలెత్తవు, మతకలహాలు పోతాయి, వర్గకలహాలు నాశనం అవుతాయి. ఈ నూత్న సంవత్సరము స్త్రీ ఉద్యమాలను, విజయగోపురద్వారంకడకు తీసుకొని పోవుగాక. నన్ను మీ రీ మహోత్సవానికి అధ్యక్షురాలినిగా చేసినందులకు మీకు కృతజ్ఞురాలను, నమస్కారములు. మీ కందరకు నా నూత్నవత్సరాభి వాదాలు!' అని ముగించారు. సభ్యురాండ్రు హర్షధ్వానులతో ఆశలు నింపారు.

ఇంతలో హేమ లేచి 'స్త్రీ' అని తాను వ్రాసినపాట చదివింది. నూత్న సంవత్సరంమీద పాటకూడా ఆమె రాసిందే.

'స్త్రీ'

'నిదురలేవే సోదరీ!
కదురుకనవే సోదరీ!
ఉదయ మందె శుభోద్యమంబిది
అదె వినంబడె తూర్యనాదము
ఆలసిస్తావా ?
నిదరలేవే......

'సర్వ విద్యలు నీవి కావే
సర్వకర్మలు నీవి కావే
పర్వజేయు సుపర్వ వీథిని
ఖర్వదీక్షా కాంతిపుంజము
నిదరలేవే......
పురుష హృదయము తట్టి పిలువుము
పురుష ధర్మము బోధ చేయుము
పొలతి దారికి పురుషు డేలా
నిలువగలడో అడ్డమె తానూ
నిదురలేవే......'

అని దీప్తమధురకంఠంతో హేమ పాడింది.

## 17

సంవత్సరాది సాయంకాల కార్యక్రమంలో, మొదట ఒక పండితురాలు పంచాంగశ్రవణం చేసి అందరూ అక్షతలు ప్రసాదించారు. తరువాత కవయిత్రుల గోష్ఠి జరిగింది. అందరికీ వెండి కుంకుమ భరిణెలూ, రవికెలగుడ్డలూ, ధారివాల్ శాలువలూ బహుమతు లిచ్చారు.

అప్పు డొక యువతి లేచి హాస్యరసప్రధానంగా సంవత్సర ఫలితాలు, 'ఈ వత్సరము, సన్న చీరలు మాయమౌతాయి. ముతకచీరలు నూటికి నూట యాభైపాళ్ళు ఖరీదులు పెరుగుతాయి. ఈ సంవత్సరానికి రాజు లేడు, మంత్రి లేడు. సేనాధిపతి, అర్ఘాధిపతి, గోపాలుడు ఎవ్వరూ పురుషులు లేరు. అందరూ యుద్ధానికి పోవడముచేత, వారి వారి భార్యలే ఆయా పదవులను అలంకరించారు. రాజు గురువుకాడు గనుక ఆతని భార్య తారాదేవి రాణీ అయింది. అందు చేత సినీమాతారలకు ఎక్కువ డబ్బువర్షం కురుస్తుంది. స్త్రీలకు మేష్టరుపనులు ఎక్కువౌతాయి. మంత్రి పత్ని శుక్రుని భార్య తపస్సుచేసుకొంటూ ఉండడం వల్ల, దేవయానే ఆపని చేస్తూ, బ్రాహ్మణుల కెవ్వరికీ మంత్రాంగాలు ఉండ కూడదని శాసించింది! బ్రాహ్మణుల బాలికలు అందరూ నూతుల్లో, గోతుల్లో నదుల్లో, కాలవల్లో పడి అపర యమాతులకు రాణులవుతారు. సేనాధిపత్ని, శనిగారి భార్య నిద్రలో ఉండడంవల్ల, ఆడవారు ఒకర్నొకరు తిట్టుకోరు. తెల్ల రంగంటే ఎక్కువ ఇష్టపడతారు' అని చెప్పుతూ సభ్యురాండ్రను నవ్వులలో ముంచెత్తింది!

బహుమతులు వచ్చినవారి కందరికీ ఖరీదుగల వెండివస్తువులను అధ్యక్షు రాలిచే సభవారు ఇప్పించారు. ఆవెనక పలువురు సభ్యురాండ్రు విడాకుల చట్టం, బహుభార్యాత్వ నిరసనా, కట్నాల నిరసనా, స్త్రీలకూ బాలికలకూ

వేరే కళాశాలలు ఉండకూడదనీ, కుమార్తెలకు సమానాస్తిసంక్రమణ ఉండాలనీ, భర్త ఆస్తి భార్యకు సంపూర్ణమైన హక్కులతో రావాలనీ మొదలైన విషయాలనుగురించి ఉపన్యసించారు. ఆవెనుక అందరూ రంగస్థలంనుంచి దిగి, ప్రేక్షకస్థలంలో అధివసించారు. నాట్యనాటకాది కార్యక్రమం ప్రారంభం అయింది. రెండు తెరలు ఈవలావల నుంచి వచ్చి రంగస్థలాన్ని కమ్మివేసినవి. ఆ తెరలు గాఢనీలమైనవి. ఆ తెరలకు పూలఅంచులూ, మధ్య కమలాలూ మెలమెలలాడుతూ ఉన్నవి.

అయిదు నిముషాలు నిశ్శబ్దం ఆవహించింది. ఏమిజరుగుతుందో అన్న నిరీక్షణలో ప్రేక్షకురాండ్రూ, వేరే ప్రత్యేక స్థలములో ఆసనములు చూపబడిన పురుష ప్రేక్షకులూ మౌనం వహించారు. అక్కడక్కడ అమరింపబడిన విద్యుచ్చామరముల స్వనం మాత్రం శ్రుతిలా వినబడుతూంది. అప్పుడా నిశ్చలతలో ఒక్క జేగంట 'ఖంగ్' మని మ్రోగింది. దానిని అనుసరిస్తూ శంఖారావం, వివిధ వాద్యాల ధ్వనులు ఒక్కరాగం ఆలపించాయి. రెండు తెరలూ ఈవలావలకు మాయమైనాయి. ప్రేక్షకుల స్థలంలో దీపాలు ఆరిపోయాయి. రంగస్థలంలో అస్పష్ట దీపకాంతులూ, బూడిదరంగులతో వెనక తెరలూ, పక్క తెరలూ ఉన్నాయి. ఒక మొండిచెట్టు బొమ్మ రంగస్థలం మధ్యనే ఉన్నది. అప్పుడపశ్రుతి అనిపించే ఒక విషాద వాద్య మేళనము అస్పష్టంగా ప్రారంభమైనది. పోనుపోను కొంచెం స్పష్టమైనది. అంతలో వణికిపోతూ ఒక వృద్ధుడు తెల్లటి గడ్డంతో, నల్లటిదుస్తులతో ప్రవేశించి, కఱ్ఱపుచ్చుకొని వంగిపోయి తిరుగుతూ,

'వెళ్ళిపోయే ముసలి ఏడును
కుళ్ళిపోయిన పాత కాంక్షను
మళ్ళి ఎప్పుడో నాకు మీకూ
కళ్ళతో చూపుల్ !

విక్రమాబ్దై వేగ లేచితి
ఆశ్రమాలూ కోటిచేసి ప
రాక్రమంతో వాజినైతీ
రప్య చొచ్చాను !

పాతమాటల చివరిపల్కును
తాత గీతం తుది స్వరాన్ని
పాడుకొనుచూ, వణకిపోతూ
కాలమునపోదున్'

అని పాడుతూ అంతకన్న అంతకన్న అస్పష్టమగు కాంతులలో తిరిగి కూలిపోయినాడు. అందరూ చూస్తూఉండగా దీపాలన్నీ ఒక్కసారిగా ఆరిపోయినాయి. రంగస్థలంలో గులాబిరంగులు ప్రసరించాయి. మోడుచెట్టున చిగుర్లు

ప్రసరించాయి. లేత జేగురు ఆకులు గాలిలో ఆడుతున్నాయి. అప్పుడొక బాల ప్రవేశించింది. ఆమె వేషం కోకిలవేషం!

'నేనె కోయిలనమ్మ!
నేనె ఆశను కొమ్మ!
కొమ్మ కొమ్మల తిరిగి
'కో' యందు 'కో! కో! కో!'

పిలుతు నూత్నోత్సాహ
కలిత మధుపాయులను,
తలతు నా దేవుని వ
సంతమూర్తిని ప్రేమ.

నేనె వైతాళికుడ
నేనె ప్రస్తావనను
తన్వి! నాందీ సూత్ర
ధారుణ్ణి నేనే!'

అని పాడి 'కోకో' అంటూ నిష్క్రమించింది. కాంతులు స్పష్టమయ్యాయి. ఆకులూ కొమ్మలూ చెట్టుకు తోచినవి. జంత్రమేళము పూర్ణస్వనయుక్తమైనది. అప్పుడు వివిధ వర్ణ, వస్త్ర, పుష్పాలంకారయుక్తలై ఎందరో బాలికలు పాడుతూ ప్రవేశించారు. వారు పూవుల కన్యలు.

మల్లిక: స్త్రీలకు మాత్రం హక్కులు లేవా
సిగ్గులు లేవా పురుషులకూ?

మాధవి: వనితకు మాత్రం ఆస్తి వలదటే
ప్రాణం మానం పడతికి లేదా?

శేఫాలి: మహిళకు శక్తులు లేవనకే?
మహిషమర్దనీ మహిళేగా!

మాలతి: కళలు లలితవే! చదువులు చెలివే!
కర్మలలోనూ కామినె ప్రథమం!

అంత దీపాలు వంగపండుఛాయదాల్చి రంగస్థలంలో దీపాలైనవి.

## 18

వంగపండుచాయతో నిండిన ఆ రంగస్థలంలోనికి వనదేవి వేషాన నాట్యం చేస్తూ హేమ ప్రవేశించింది. ఆమె చీర వంగపండుచాయ, రవిక ఆకుపచ్చ. ఆమె అలంకారాలన్నీ పూవులమాలలూ, ఆకులూ. పూల బాలికలందరూ ఒక ప్రక్క నాట్యరూపంగా నిలిచి ఉండిరి.

వనదేవి : వనదేవినే నేను
వినుడమ్మ సుమసతులు
వనిత హక్కులు కోరు
దినమువచ్చె నేడు.

మగవాని ఆజ్ఞలో
మసిలితిమి ఇన్నాళ్లు
మన ధర్మముల మరచి
మాయ ముంచెను నరుడు
వన......

ఆర్యనారీ ధర్మ
మడుగంట చేశాడు
వేదకాలంమాట
చేదయ్యె ఆతనికి
వన......

వెనక చూపులు మాని
వెళ్ళాలి ముందుకే
బెదురు చూపులు మాని
కదలండి ముందుకే!
వన......

ఆమె అభినయం వైదుష్యంలో కొంచెం లోటయినా, చాలా మనోహరంగా ఉంది. నాట్యము, నృత్తము ప్రేక్షకులను రంజింపజేశాయి. ఆమె కంఠంలో ఎన్ని ఆకాశాల లోతులో, ఎన్ని ఉదయాల కాంతులో, ఎన్ని పూర్ణిమల మాధుర్యాలో ఉన్నాయి. ఇంతట్లో సోఫి పారిజాత కుసుమ వేషంలో వచ్చింది. ఆమె వేషం, ఇతరుల వేషాలు ఈలా ఉండాలని త్యాగతే నిర్ణయించి, చిత్రం లిఖించి ఇచ్చాడు. సోఫీ మదరాసులో ఉన్న ముఖ్య ఆంగ్లకుటుంబ బాలికలతో బాటు ఒపెరా (గీతానాటికలలో) నాయిక వేషం వేస్తూఉండేది. ఆ వేషాలలో గులాబీకన్య వేషం ఒక నాటికలో వేసినది. ఆ వేషానికి కొన్ని మార్పులుచేసి శ్రీనాథమూర్తి పారిజాతకుసుమ వేషం వేశాడు సోఫీకి. ఆమె పాడవలసిన పాట శ్రీనాథమూర్తి పదిరోజులు కష్టపడి సాధ్యమైనంతవరకు తెనుగు నుడికారం పోకుండా ఆమెకు నేర్పాడు. పారిజాతపుష్పం నాట్యంచేస్తూ,

"సఖీ! వనదేవీ!
వచ్చితినమ్మా పారిభద్రమును, సఖీ, వనదేవీ!
స్వర్గమునుండీ తెచ్చితి నేనొక
సందేశం భువి వనితలకూ!

ధర్మం మరచిన స్వేచ్ఛ కోరుటే
తలపబోకుడీ భువికాంతల్ !

ధర్మం పోతే, నీతులు పోతే,
తరుణుల మనసులు గతులుతప్పితే,
శ్రుతిలోపించిన జగజ్జీవనం
గతిమాలినదై వెతలకు సాకు

పూవులన్నీ : ఏమిటి నీతీ
ఏమిటి జాతీ
జాతి నీతులే
సతులకు విషముల్
నీతిపేరునా పురుషులు విషమూ
జాతిపేరునా మతములు విషమూ

వనదేవి : మా నీతులు మేం నిర్మిస్తామూ
మా ధర్మం మేం నిలుపుకొందుమూ
పురుషుడు పలికే ధర్మమె విషమూ
పురుషుడు వ్రాసిన నీతే విషమూ !

[ ప్రవేశం లోకేశ్వరి వసంతుని వేషంలో ]

వసంతుడు : ఓ చెలీ ! వనకన్యా !
ఓ దివ్యసుందరీ !
నీ కొరకు వెదుకుతూ
నీకొరకు విరహినై
నిలువెల్ల పులకిస్తు
కలలు కంటూ వస్తి
ఓ చెలీ ! వనకన్యా !

మాలతి : ఈ వేస మిది యేటి
ఎవరోయి నువ్వూ ?
పొగ రెక్కి విరహమని
పొగులుచున్నావూ ?

మాధవి : ఎవరోయి పురుషుడా
ఎవరోయి నువ్వూ !
మారాణి మాటెత్తి
మతి లేని ఆటా ?

మల్లిక : ప్రేమ మాటల వదరు
ప్రియుడ వెవరోయీ?
కన్నుగానని మత్తు
గంతులా ఇచటా?

శేఫాలి : మా చెలిని వెదుకుతూ
మసలబోకోయి
తెలిసె నీ పోకిళ్లు
తొలగిపోవోయీ

వనకన్య : నిలు నిలు మోయీ!
కలుషిత హృదయా!
వలపుమాటలిక
పలుకకుమోయీ!

అన్నివాడలా
అగ్ని కమ్మినది
ప్రళయ కాలమే
ప్రణయావసరమ?
నిలు నిలు మోయీ
కలుషిత హృదయా

పూర్వ ధర్మములు
బుగ్గయినాయీ
కొత్త భావములు
ఎత్తె మొలకలూ
నిలు నిలు మోయీ!
కలుషిత హృదయా!

## 19

వసంత : నేనె పూర్వమును
నేనె నవ్యమును
పూర్వము లేకే
నవ్య మెచ్చటే?
మూడుకాలములు
ముడిగొన్న క్షణం
నిత్యనూతనం
సత్యం నేనే

వయసువారకం
ఆశనిరాశా
నామాంతరములు
నాకె శుభాంగి
నేనె వసంతం
నేనె అనంతం
నేను లేనిదే, నేను రానిదే
నిత్యమృత్యువై నీవు నిలుతువే!
పురుషుడు లేనీ పొలతి ఎందుకే
నారికి నరుడు నరునకు నారీ!

వనదేవి : రావోయి ఆమని, రావోయి నా ప్రియుడ
నను చేరి జగతికే నవ్యసృష్టియరా!

కోకిల : కో! కో! కోకోకో కోకోకో కోకోకో! కోకోకో!
ఆకు రాలినవెంట అమరు ఎఱ్ఱని చిగురు
అణగిపోయిన వత్సరము వెంట వృషవచ్చె కో! కో! కో!

పూవులు : మా నాథులు భృంగాలూ
మాకై పాడుతువచ్చారూ

వనదేవి, వసంతుడు : పోయినది చీకటీ
పోయినవి గొలుసుల్లు
ధర్మస్వాతంత్ర్యమ్మె
దశ దిశలు వెలిగించె.

వాద్యమేళం తారాశ్రుతికి వెళ్ళి ఆగిపోయినది. సృష్టిస్వరూపమైన వీణాతానం మాత్రం వేగవంతమై వినిపిస్తుండగా, పూలజల్లులను పుష్పబాలలు వనదేవీ వసంతులమీద జల్లుతుండగా తెరలు రంగస్థలాన్ని కప్పాయి. తెర ముందుకు మంగళహారతులతో బాలికలువచ్చి సభ్యులాంధ్రపై అక్షతలుచల్లారు.

హేమకుసుమసుందరీదేవిని ఆంధ్రమహిళాలోకం అంతా ప్రశంసించింది. సంవత్సరాది ఉత్సవాలకు కల్పమూర్తి, తీరమిత్రుడూ, వినాయకరావుగారూ, శ్రీనాథమూర్తి మొదలయినవారు చాలామంది పురుషులు వచ్చినారు. 'స్త్రీలోకం ఎక్కడికి వెడుతోం'దని కొందరు పురుషు లనుకొన్నారు. 'మా బాగా మనందరికీ చెప్పుచ్చుకు కొట్టినా'రని కొందరు నవనాగరికు లనుకొన్నారు. స్త్రీలలోనూ ఆశ్చర్యము పొందినవారు, సంతోషించినవారు, 'ఏమో' అనుకున్నవారు, పెదవి విరిచినవారూ ఉన్నారు. కాని ఏదిఏమైనా నాటకాది ప్రదర్శనా లన్నీ చాలా అందంగా జరిగాయనిమాత్రం అందరూ ఆనందించారు. మొత్తంమీద హేమ నాటిక అందరినీ ఆలోచనలో ముంచింది. నాటకాన్ని

గురించీ, ప్రదర్శనల్నిగురించీ పత్రికలన్నీ ప్రశంసించాయి. ఉగాది ఉత్సవం వెళ్ళిన రెండురోజులకు పేపర్లన్నీ తీసుకుని, ఉదయం పదిగంటలకు లోకేశ్వరితో కలిసి హేము త్యాగతి ఇంటికి వచ్చింది. శ్రీనాథమూర్తి తన శిల్పభవనంలో ఉన్నాడని రంగినాయకమ్మగారు చెప్పగానే, ఇప్పుడే వస్తామని బయలుదేరి ఇద్దరూ మూర్తిబావతో మాట్లాడడానికి శిల్పభవనానికే వెళ్ళారు. శిల్పభవనం అజంతా చిత్రలేఖనంలో కనబడే భవనవిధానంగా, అమరావతీ నాగార్జున కొండ శిల్పాలలో దృశ్యమయే భవనవిధానంగా నిర్మింపబడిఉంది.

## 20

ప్రాంగణంలో మధ్య నాల్గు స్తంభాలు అచ్చంగా అజంతా స్తంభాలు. ప్రాంగణ ముఖరూపం అజంతా చైతన్యప్రాంగణ ముఖంలా ఉన్నది. వితానము అర్ధచంద్రాకృతి. మధ్య చైత్యభాగానికి ఈవలావల విహారప్రాంగణాలు, చైత్య మందిరంలోనికి పోవుటతోడనే ఎదుట చక్కని స్ఫటికశిలానిర్మిత బుద్ధవిగ్రహము త్యాగతి పోతపోసిన పంచలోహాత్మక పద్మంపై ప్రత్యక్షమవుతుంది. ఆపద్మము పాలరాతి పద్మపీఠంమీద ఉన్నది. ఆ పీఠానికి ఈవలావల పద్మలతాకార ములు, దీపవృక్షాలైన సెమ్మెలు ఉన్నవి. వానిప్రక్క ధూపకరండా లున్నవి. విగ్రహానికి ముందు పీఠాలపై పుష్పకరండాలు, రజిత జలకలశాలూ ఉన్నవి. వానికిముందు చిరుతపులితోళ్లు పరచిఉన్నాయి. చీనాదేశపు విగ్రహాలూ, కల శాలూ పీఠికలపై ఈవలావల గోడల పొడుగునా అక్కడక్కడ అమరింపబడి ఉన్నాయి. వానికిముందు పూజాకలశాలూ పూవుల పళ్లెరాలూ ఉన్నాయి. ఆ మందిరంలో వితానమూ అర్ధచంద్రాకృతిగానే ఉన్నది. వితానంమీద లతలూ, కుడ్యాలూ అన్నిటిమీదా బుద్ధజీవిత గాథలు మనోహరంగా చిత్రితమై ఉన్నాయి. పైన వితానంపై నాలుగు కాంతాయనాలు నీలవర్ణపు గ్లాసు, ఫలకా లతో పొదిగింపబడి ఉన్నాయి. విగ్రహానికి ముందున్న మందిరభాగమంతా ఆక్రమించే బందరు ఆంధ్రజాతీయ కళాశాల పెద్ద రత్నకంబళి పరచిఉన్నది.

ఈ చైత్యమందిరం పొడుగు ముప్పదిఆరడుగులు. వెడల్పు పద్దెనిమిది అడుగులు! పైన అర్ధచంద్రాకృతిగా ఉండే వితానమంతా కాంక్రీటుతో తయారుచేసినదే. చైతన్యమందిరానికి సింహద్వారం కాకుండా మూడువైపులా గోడలకు మధ్యగా మూడు ద్వారా లున్నాయి. ఆ ద్వారాలకు మూడు టిబెట్టు తెర లున్నాయి. ఒకదానిపై అమితాభ బుద్ధమూర్తి చిత్రించి ఉంది. అమితా భుడూ, అమితాభుని సేవింపవచ్చిన బుధులూ, అర్హతులు, బోధిసత్వులు, పద్మా లలో ఆ దివ్యపథంలో కాంతిమేఘాలమధ్య గోచరమాతున్నారు. ఈ తెర ఎడమచేతివైపు గుమ్మానికి ఉంది. కుడిచేతివైపు, అంటే బుద్ధవిగ్రహానికి ఎడమ వైపు గోడకున్న గుమ్మానికి ఉన్న తెరపై సిద్ధార్థచిత్ర మున్నది. బుద్ధదేవుని వెనక అలంకారరూపమైన బోధవృక్షము ఉన్నది. క్రింద కామదేవుడు, ఆతని

కొమార్తలు రాక్షసులు, పిశాచాదులు ఉన్నారు. పైన దేవులున్నారు. పద్మాలు పద్మలతలు మేఘాలు అలంకారస్వరూపంగా ఉన్నాయి. విగ్రహం వెనక ఉన్న గుమ్మం తెర శ్వేతతారాదేవి విగ్రహముతో ఉన్నది. ఆ చిత్రం వర్ణనాతీత మనోహరంగా ఉన్నది. పద్మాలూ, లతలూ, దేవిని కొలిచే పరివార దేవీస్వరూపాలూ ఆ తెరపై చిత్రింపబడి ఉన్నాయి.

ఈ చైత్యమందిరంలో కుడివైపు గుమ్మంలోనుంచి వెడితే, కళాగ్రంథాలయంలోనికి వెడతాము. ఎన్నో భూర్జపత్రగ్రంథాలూ, జపాను చీనా గ్రంథాలూ, పాశ్చాత్య భాషలలో గ్రంథాలూ, తాళపత్ర గ్రంథాలూ, దేవనాగరి లిపిలో తెలుగు లిపిలో గ్రంథాలూ, శిల్ప చిత్రలేఖన నాట్య సంగీతాలనుగూర్చి ఉన్నాయి. ఈ గదికి ప్రక్క చైత్య మందిరాన్ని అంటి ఇంకో గది ఇంతే వైశాల్యంది ఉంది. ఆ గదిలో గ్రంథాలు చదువుకునే అమరింపు లున్నాయి. అవలివైపు ఇలాగే రెండు గదు లున్నాయి. ఒకటి త్యాగతి శిల్పమందిరము, రెండోది చిత్రమందిరము. ఇటు చదువుకొనే గది వెనక, అందులో సగం వైశాల్యం ఉన్న గదిలో త్యాగతి శిల్పచిత్ర సామగ్రి ఉంచుకొనే గది. అవతలివైపు అంతే కొలత ఉన్న గది విద్యార్థులు నేర్చుకొనేందు కున్నది. ఈ చిన్న మేడ ఏభైనాలుగడుగుల సమచతురస్రము. వెనకప్రక్క ఈ ఏభైనాలుగడుగుల పొడుగునా వసారా ఉంది. ముందుభాగంలో విహారరూపంలో ఉన్న మందిరాలు రెండూ ఈవలావల, మధ్య చైత్యానికి, వసారా లేకుండా ముందుకు చొచ్చుకువచ్చిన వితానా లున్నాయి. తలుపులు, వాతాయనాలు అన్నీ అజంతా విధానంలో ఉన్నాయి. శిల్పచిత్రమందిరా లన్నింటిలోనూ, గ్రంథపఠన మందిరంలోనూ ప్రాచీన రాజపుత్ర, మొగలు చిత్రలేఖనాలు, ఈనాటి వివిధ దేశ చిత్రలేఖనాలూ ఉన్నవి.

ఈ శిల్పభవనం వెనుక చక్కని భవనం ఒకటి ఉన్నది. అది ఏభైనాలుగు అడుగుల పొడవు, ముప్పది ఆరడుగుల వెడల్పూ ఉంటుంది. రెండు పొడుగాటి హాలులుగా అది భాగింపబడి ఉంది. ఒకటి శిల్పచిత్ర ప్రదర్శనశాల, రెండవది శిల్పకర్మాగారము. ఈ కర్మాగారము రెండు భాగాలుగా విభజింపబడి ఉంది. ఇవతల శిలాశిల్ప కర్మాగారం, అవతల లోహశిల్ప కర్మాగారం.

ఈ రెండు భవనాలూ నిర్మించడానికి శ్రీనాథమూర్తికి ముప్ఫైఎనిమిదివేల రూపాయ లైనవట! తాను నివసించే మేడ ఎనిమిదివేలకు కొన్నాడు. శిల్ప భవనాల స్థలం నాలుగువేల రూపాయ లైనదట. తల్లి కూడదీసిన రూపాయలూ, తన ఆస్తిగా ఉంచుకొన్న భూమి అమ్మగా వచ్చిన రూపాయలూ తాను రచించిన శిల్ప చిత్రలేఖనాలు అమ్మగావచ్చిన రూపాయలూ, అన్నీ కర్చుపెట్టినాడు. త్యాగతి ఇప్పటి దైనందినపు కర్చు తల్లిగారికీ అక్కగార్లకూ తానిచ్చిన ఆస్తుల ఆదాయములోనూ, బొమ్మలవల్ల వచ్చిన ఆదాయమువల్లనూ!

హేమసుందరీ, లోకేశ్వరీ కారుదిగి శ్రీనాథమూర్తి శిల్పమందిరంలో పనిచేసుకుంటూ ఉండగా వెళ్ళినారు. లోకేశ్వరి కొంచెంసేపుండి వెళ్ళి పోయింది.

త్యాగతి : హేమ్! ఏదైనా బొమ్మపై పనిచేస్తావా ?

హేము : చేస్తాను బావా! కాని ఉగాదినాటి మా గీతనాట్యం ఎల్లా ఉందో విమర్శనాపూర్వకంగా నీ అభిప్రాయం చెప్పావు కావేమీ ?

త్యాగతి : ఈ రెండుమూడు రోజులనుంచీ చెబుతున్నానుగా హేమూ !

హేము : ఆ చెప్పావులెద్దూ ! 'బాగుంది! అద్భుతంగా ఉంది! చాలా చక్కగా ఉంది' అనేగా నువ్వు చెప్పింది. ఇలాంటి అభిప్రాయాలు ప్రతి వెంకమ్మా వెంకయ్యా ఇవ్వనే ఇచ్చారు. దీనికన్న మా తీరుడు నయం, ఆఖరికి మా కల్పమూర్తి నయం.

త్యాగతి మౌనంతో 'విప్లవస్త్రీ' అనే బొమ్మ రచిస్తున్నాడు. తలెత్త కుండా బొమ్మను విన్యసిస్తూనే, 'వాళ్ళిద్దరూ ఏమన్నారేమిటి ?'

హేము : వాళ్ళ అభిప్రాయాలు నీ కెందుకు ? నీ అభిప్రాయం చెబుదూ !

త్యాగతి : ఒకమ్మాయిగారు తాను నిర్వహించిన మహాకళాకార్యాన్ని అందరూ మెచ్చుకోవాలని ఆవేదనపడిపోతోందిట.

హేము : అందరూ మెచ్చుకొంటే ఎవరికెక్కువాలి, మెచ్చుకోకపోతే ఎవరి కెక్కువాలి ?

త్యాగతి : ఇంక ఏంకావాలి ?

హేము : పోదూ అంతా బడాయే! నీ అభిప్రాయం అడుగుతున్నానుగదా అని గర్వం నీకు మరీనీ !

## 21

త్యాగతి తలెత్తి తీక్ష్ణంగా హేమవైపు చూశాడు. 'హేమా! నువ్వు నాట్యం నిన్న మొన్నే ప్రారంభించినా, ఎంతో నేర్చుకొన్నదానిలా నాట్యం చేశావు. నాట్యంలో, అభినయంలో ఏవైనా లోట్లు అప్పుడప్పుడూ వచ్చినా, అవి నా కళ్ళలాంటి దుర్భిణీయంత్రంకళ్ళవాళ్ళకి తెలుస్తాయేమో! నీ చక్క దనమూ, నీ సంగీతజ్ఞానమూ నాటకానికి ఎంతో అందం తీసుకువచ్చాయి! లోకేశ్వరి వసంతునిలా, సోఫీ పారిజాతంలా బాగా అభినయించారు. రంగ స్థలమూ, అలంకారమూ, దీపాల విధానమూ అన్నీ బాగున్నాయి' అని చెప్పాడు.

హేము : వారే, వా! అసలు నాటకం అందం చెప్పవయ్యా అంటే, అన్నీ బాగానే ఉన్నాయి అంటావేగాని...

త్యాగతి : హేమూ! పాటలు బాగున్నాయి. చిన్న నాటకమైనా పొందికగా నడిచింది. ఈనాటి నాటకాలా ? అవి నాటకాలు కావు. నాటక

ప్రదర్శనం అంటే ఎవ్వరికీ శ్రద్ధలేదు. రంగస్థల సౌందర్యం అవసరంలేదు. దీపాల గొడవ అక్కరలేదు. అలంకారాలు, ఉచిత వేషాలు ఏమీ మన వాళ్ళకక్కర్లేదు. ఇంతకూ మనవాళ్ళ దారిద్ర్యం ముఖ్యకారణం అనుకో.

హేము : నువ్వు చెప్పినదంతా బాగానే ఉంది బావా! కాని నేను రాసిన నాటక రచననుగూర్చి చెప్పవేల? కవిత్వం ఎల్లా ఉంది? పాట లెల్లా ఉన్నాయి? భావా లెల్లా ఉన్నాయి?

త్యాగతి : పాటలు బాగున్నాయి. చిన్నదైనా గీతానాటిక బాగా నడిచింది. ప్రాచీన భావాలు పోవాలనీ, పోతున్నాయనీ; మాతృభావాలు రావాలనీ, వస్తున్నాయనీ; స్త్రీల బానిసత్వం పోవాలనీ, స్త్రీ పురుషుల కలయిక స్వాతంత్ర్యేచ్ఛమీద ఆధారపడిఉండాలనీ నువ్వు అందంగా అంటే రస వంతంగా రచించావు. అది మంచికావ్యాలల్లో ఒకటి. కాని నీ భావాలలో చాలా భావాలు నాకు సరిపోవు.

హేము : ఏమిటా భావాల కొరత? ఆడది బానిసగా ఉండాలనేనా నీ భావం?

త్యాగతి : ఏమిటమ్మా బానిస, బానిసంటావు. ఏమిటా బానిసత్వం?

హేము : బానిసకాక మా జీవితం ఏమిటి? తల్లిదండ్రుల ఒద్దికలో పెరుగుతుంటాము.

త్యాగతి : కాక స్వేచ్ఛగా పెరగాలనా?

హేము : మాట కడమ రాకు. ఇంతట్లో పెళ్ళంటారు. వారు ఏర్పాటుచేసిన ఓ కుఱ్ఱవెధవనో, ముసలివెధవనో పెళ్ళిచేసుకోవాలి. చెప్పిస్తున్న ఏదో చచ్చుచదువూ అంతటితో సమాప్తి. ఇక మొగుడుకుంక అధికారం ఆనాటి నుంచీ! వాడు గుమాస్తా అయితే ఈవిడ గుమాస్తా! వాడు ఉపాధ్యాయు డైతే, ఈవిడ ఉపాధ్యాయిని! వాడు ఎక్కడికన్నా తీసుకువెళ్తే వెళ్ళడం, లేకపోతే పేడలా పడిఉండడం. వాడు చస్తే ఈవిడ వెధవముండ! బోడి గుండూ! ఎవరికీ ఎదురు పోకూడదు! పొద్దున్నే ఎవరి మొగమూ చూడ కూడదు! తెల్లబట్టలు! నగలులేని మోడు! వంటముండ, దాసీముండ, బోడిముండ.

త్యాగతి : అంత కోప మేమిటి?

హేము : ఆడది వీధిముఖం చూడకూడదు. వీధిలోకి వస్తే ఆడది విచ్చలవిడిగా తిరిగేది! సినీమాకు వెళ్ళే ఆడదయితే బరిమీద పడిందంటారు. ఒక్కర్తీ రైళ్ళలో ప్రయాణం చేయకూడదు! ఒకవేళ వెళ్ళినా, ఆడవాళ్ళ పెట్టెలో ప్రయాణం చేయాలి. అన్ని సౌకర్యాలూ మగవాళ్ళకా? మొదటి తరగతులూ, సభలకు వెళ్ళడం, వాహ్యాళులకు వెళ్ళడం, ఆటల పోటీ పందేలలో పాల్గొనడమూ! మొగుడనే రాక్షసుడే ఉంటే ఆటకట్టా?

త్యాగతి : ఏమిచెయ్యమంటావు?

హేము : యేమేమి చెయ్యాలో మీరు చెప్పరు! మీకు ఆడవాళ్ళ గొడవలే అక్కర్లేదు. పెళ్ళాలయితేనే కావాలేం!

త్యాగతి : మేము ఎంత జాగ్రత్తగా ఆలోచించి చెప్పినా పురుషులుగానే ఆలోచించి చెప్తాము కాదా!

హేమ : ఓహో! ఏం గర్వమూ? ఏమి అహంభావమూ? అయితే, మీరు హరిజనులు కారు, హరిజనోద్యమంమీద మీ అభిప్రాయం ఎందుకిస్తారు? ఎందుకయ్యా ఈ డాబులు మాట్లాడుతావు?

త్యాగతి : హేమూ! నీకు కోపం వస్తే చెప్పలేను. కుర్రవాళ్ళు చదువుకొనే రోజుల్లో, వాళ్ళకు వాళ్ళ ఇష్టంవచ్చిన స్వేచ్ఛ ఉందనా? వివాహ విషయంలో వాడిమాట సాగుతుందనా? వాడి ఉద్యోగం విషయమైకూడా వాడికి స్వేచ్ఛ ఉందనా?

హేమ : లేదయ్యా! అట్లాగే ఒప్పుకుందాము. కాని వాడికి మొదటినుండీ ఉండే స్వేచ్ఛ ఆడవాళ్ళకి ఇవ్వవద్దంటావా?

త్యాగతి : హేమూ! నీ వాదనలన్నీ చక్కగానే ఉన్నాయి. ప్రాపంచికంగా ఆలోచిస్తే, నా స్వాతంత్ర్యం నువ్వు తీసుకోవాలంటే నేను నీకన్న బలహీనుణ్ణవాలి కదా! ప్రకృతి విషయం ఆలోచిద్దాం. ప్రస్తుతం ఆడవాళ్లు బలహీనులు. అన్నిదేశాలల్లో ఉండే పురుషులు ధర్మమో, న్యాయమో, మంచో, చెడ్డో ఆలోచించి స్త్రీలకు వారు కోరినవన్నీ ఇవ్వాలి. స్త్రీలు పురుషులు ఇష్టపడకపోతే ఒక్క స్వేచ్ఛ తీసుకోలేరు. స్త్రీలకు దేహబలం తక్కువ, ఆవేశబలం ఎక్కువ. ఏ విషయంలోనైనా స్త్రీలు పురుషులకు లోకువ. వంట చేయడంలోనూ గొప్ప వంటవారు పురుషులే! సంగీతంలో ఆడవారి గొంతుకలు బాగుండవచ్చు కాని, పాండిత్యం, గంభీరతా మొగవాళ్ళదే. శాస్త్రజ్ఞానంలో ఎవ్వరో ఒక్క మదాంక్యూరీ తప్పి పుట్టింది. కవిత్వంలో మొల్లలూ, సాఫోలూ, పెరల్ బక్కులు, తిక్కన్న, తియాక్రిటిస్, ఆట్టన్ సింక్లెయర్లముందు దివ్వటీముందు దీపాలు. రాజ్యాలు పాలించిన చక్రవర్తినులలో ఒక్క రుద్రాంబ తప్పితే, తక్కినవాళ్ళ చరిత్ర జుగుప్సాకరము. అలాంటప్పుడు స్త్రీలు కోరే స్వేచ్ఛ ఎందులో? ఇష్టం వచ్చిన పురుషునితో అవినీతిగా సంచరించడంలోనా? డబ్బు తగులబెట్టి, మూడు కాయలూ, ఆరు పళ్ళుగా జీవితం పాడుచేసుకోవాలనా? ఏమిటీ ఆడవాళ్ళకు కావలసింది?

హేమ : అలా మాట్లాడాలి. గోముఖవ్యాఘ్రుం బయలుపడింది. రంగు పూసుకుంటేమాత్రం చిరుతపులిచుక్కలు పోతాయా? వ్రతంచేసే పెద్దపులి మాంసభక్షణ మానుతుందా? ఏమి చూచావు నువ్వు రష్యాలో? దేశాలన్నీ తిరిగి ఏమిటి నువ్వు కనిపెట్టింది?

త్యాగతి : రష్యాలో నేను చూచిందా? స్త్రీలకు సమాన ఓటు ఉంది. స్త్రీలకు ఉద్యోగా లన్నిటిలో సమానాధికారం ఉంది. బిడ్డలను పెంచే దాదిభవనా లున్నాయి. ప్రభుత్వోద్యోగాలలో ఆడవాళ్ళెంతమందో

ఉన్నారు. అన్ని వృత్తులలోనూ ఉన్నారు. వివాహం స్త్రీ రద్దుచేసుకోవచ్చు, పురుషుడు రద్దుచేసుకోవచ్చు. వివాహం రద్దువిషయంలో ఎవరి తప్పైతే, వారిమీద పిల్లల పెంపకం బాధ్యత ఎక్కువ పడుతుంది.

హేమ: ఆ రకంగా ప్రతిదేశంలోనూ ఉంటే ఏం తప్పువచ్చింది!

త్యాగతి: ఈ విషయంలో రెండు దృశ్యాలనుగూర్చి నీకు వర్ణించి చెబుతాను. తర్వాత నీ అభిప్రాయం చెప్పు.

## 22

హేమ బావగారికి దగ్గిరిగా జరిగి, అతను విన్యసిస్తున్న బొమ్మను పరిశీలనగా చూస్తూ, 'ఎప్పుడూ ఆడవాళ్ళ బొమ్మలే నువ్వు వేసేది' అన్నది. 'తమ కామవాంఛ తెలుపుకోడానికీ, తమ స్త్రీవాంఛ తీర్చుకోడానికి, వ్యంగ్యంగా స్త్రీలమీద కవిత్వం; స్త్రీలను ద్రోహులుగా రచించడం; స్త్రీలను చిత్రించడం; స్త్రీలనుగూర్చి కథలు వ్రాయడం; సినిమాతారల బొమ్మలు గదినిండా ఉంచుకోవడం; స్త్రీలకు—చిలకలకొలికి, లలిత, సుందరి, నతనాభి, ఆకాశమధ్య, చకోరస్తని, చపలాక్షి, కురంగాక్షి, రంభోరు, ఘనజఘన, కుందరదన, హంసయాన, బింబాధరి, పల్లవపాణి—ఈరకం పేర్లుపెట్టి దేహం అంతా కబళింపు చూపులతో చూస్తూ, గ్రంథాలన్నిటినీ నింపడం; ఈరకం జావకడిపనులు చేస్తున్నారు కవులూ, శిల్పులూ వగైరావారంతానూ' అని హేళనగా నవ్వింది.

త్యాగతి: హేమూ, నీభావాలేమిటో స్పష్టంగా చెప్పు!

హేమ: నా భావాలా? నావి రష్యాభావాలు. నాకు ఈ పూంజీదారుల సంస్కృతీ, విజ్ఞానమూ ఇంతటితో అంతరించి, ఇక్కడనుంచైనా నిజమైన సర్వప్రజారాజ్యం రావాలి. సర్వప్రజాసంస్కృతీ కావాలి అని గాఢవాంఛ బయలుదేరింది.

త్యాగతి: కోటీశ్వరులు తమ ఇళ్ళనిండా కళావస్తువులు పరచుకోడం; తమ కోసం కవిత్వం వ్రాయించుకోడం; తమ దానధర్మాలు మెప్పించుకోడం; శాసనాలు చెక్కించుకోడం; డబ్బిచ్చి కృతులు పుచ్చుకోడం; సుబ్బిశెట్లు షష్టిపూర్తి ఉత్సవాలు చేసుకోడం; రఘురామచౌదరి కూతురి పెళ్ళికి లక్షరూపాయిలు కర్చుచేసి ఏభైవేలు కట్నమూ, ఏభై యకరాలు పెళ్ళికూతురికి వధూకట్నం, లాంఛనాలకు వెండి బంగారు వస్తువులకు ముప్ఫైవేలియ్యడం; పెళ్ళిఉత్సవాలకు కాంతాఆప్టే, విశ్వనాథభాగవతారు, సైగల్ కచ్చేరీలు, బాలసరస్వతి డాన్సు పెట్టించడం; అందుకు తన తోటివాళ్ళను, పెద్ద ఉద్యోగస్తులను పిలవడం; భోజనాదికాలకు నలభైవేలు కర్చుచేయడం, ప్రతిపూటా ఆరు పిండివంటలూ, ఎనిమిది కూరలూ, పది పచ్చళ్ళూ, సాంబారూ, మజ్జిగపులుసూ, మైసూరు రసమూ చేయించడం, బాతుమాంసాల బియ్యాలూ, రాజనాలూ, ఢిల్లీ భోగాలుమాత్రమే ఉపయో

గించడం; వచ్చిన అతిథులు తినలేక అజీర్తులతో ఆవేదనపడడం; వీళ్ళందరికి ప్రత్యేకం ఒక ఎం. బి., బి. ఎస్. నూ, ఒక వైద్యశాలనూ పెళ్ళిశాలలో ఏర్పాటుచేయడం; ఊరంతా రొంపి అవడం; దేశదేశాల లక్షాధికార్లు, రాజకీయ నాయకులు, సంఘ నాయకులు, మహాకవులూ పిలవబడడం, కవి పండిత సన్మానం జరగడం, ఒక్కొక్కరికి నూటపదార్లు వగైరాలు ఇవ్వడం, మైసూరు బేండూ, వెంకటరంగమాణిక్యంపిళ్లై సన్నాయి మేళమూ రావడం మొదలైన ఈ పూంజీదారుల అసత్య, హింసాత్మక దౌర్జన్యపూరిత, గందరగోళాలు పనికిరావంటావు నువ్వు. అంతేనా?

హేము : ఎంత లెక్చరిచ్చావోయ్ బావా! ఎంత విచిత్రంగా చిత్రించావోయ్ బావా!

త్యాగతి : ఓ మరదలా! ఇంక నీ అభిప్రాయం సాగనీ. నేను నీ భావాలన్నీ సరిగ్గా వ్యాఖ్యానం చేశానా?

హేము : నీ వ్యాఖ్యానం అంతా నాకు నచ్చలేదులే!

త్యాగతి : నీ అభిప్రాయం సాగనీ!

హేము : జాతీయవాదులమని బయలుదేరి ఈ బిర్లాలు, ఈ అంబాలాల్ సరాభాయిలు, ఈ బజాజులు ఓ గుడికట్టీ, ఓ పాఠశాల తెరచీ, హరిజన నిధికి రెండులక్షలు ఇచ్చీ, వీరిని అంటే బీదలరక్తం పీల్చే వ్యాపారులను మనం నాశనం చేయాలి.

త్యాగతి : నిజం హేమూ! పాశ్చాత్య సామ్యవాదదృష్టిప్రకారం నువ్వన్న మాటలు నిజం.

హేము : ప్రాచ్యభావనప్రకారం నిజంకాదా?

త్యాగతి : కాదు.

హేము : ఏమిటా ప్రాచ్యభావం? అప్రాచ్యభావం?

త్యాగతి : మహాత్మా గాంధీగారి అభిప్రాయాలూ, రామకృష్ణ పరమహంసగారి అభిప్రాయాలు తెలుసుకోలేదా?

హేము : తొంభైఏళ్ళ గుడ్డిముసలమ్మ భావాలు, నూటముప్పైఏళ్ళ తొక్కుగారి భావాలు నా కక్కర్లేదు.

త్యాగతి : కారల్‌మార్క్సు ఇప్పటిదాకా బ్రతికి ఉంటే పదహారేళ్ళ బాలకుమారుడా? లెనిన్ ఇప్పటిదాకా బ్రతికి ఉంటే పన్నెండేళ్ళ పాలూరే బాలకుడా?

హేము : వాళ్ళవి నిత్యసత్యాలు!

త్యాగతి : బీదతనం లేకుండా చేయడమా, వారి నిత్యసత్య భావం?

హేము : కాదు. అందరికీ పనీ, అందరికీ తిండీ, అందరికీ బట్టా, అందరికీ ఇల్లూ! ఒకరికి హెచ్చూ ఒకరికి తగ్గూ ఉండకూడదు. ప్రపంచంలో ధనం ప్రపంచంలో మనుష్యు లందరిదీ!

త్యాగతి : జంతువులది కాదా ? జంతువుల్ని తినాలీ ! జంతువుల్ని సరదాకు నాశనం చేయాలీ ! మనుష్యుడు మానసికంగా ఎక్కువ బలవంతుడు; అందు కని జంతువులు, క్రిమికీటకాదులు వారి చెప్పుచేతల్లో ఉండాలీ! మనుష్యులలో ఎక్కువ బలవంతుల జట్టు తయ్యారైతే, తక్కినవాళ్ళు వాళ్ళ చెప్పుచేతలలో ఉండాలీ ? అక్కడ ధర్మం వేరేం ! అది తాత్కాలిక ధర్మమా ! అది సరియైన సామ్యవాదమా ! అవసరమైతే, ఎవరు సామ్యవాదానికి భయంకర శత్రువులో వాడితో సంధిచేసుకోవాలీ, ఆ పూంజీ ఫాసిస్టువాడు తనలాంటి ఇతర సామ్యవాద విరోధుల నందరినీ నాశనంచేసి, తన అప్రతిమాన అవిచ్ఛిన్న పూంజీతత్వంక్రింద తక్కిన సామ్రాజ్య పూంజీదారులను బానిసలనుచెయ్యాలి ! అది సామ్యవాద రాజనీతా ! ప్రకృతి శాస్త్రసత్యానికీ మానవమన స్తత్వసత్యం అతీతమా ! అధ్యాత్మం ఈ ధర్మాన్ని నడపలేదా? ఒక సత్యమూ ఇంకో సత్యమూ సామ్యవాద సత్యకోటిలో దెబ్బలాడుకో వచ్చా ! అవి తాత్కాలిక సామ్యవాద ధర్మాలా ?

హేము : ఇదంతా సామ్యవాద నిరసనా ?

త్యాగతి : సామ్యవాద మేమిటి ? దేన్నీ నిరసించలేను. సామ్రాజ్యతత్వం ధనేశతత్వంమీద ఆధారపడి ఉండి, ధనేశరాజ్యంలో కొన్ని రాజ్యాలు బానిస రాజ్యాలను స్థాపించినవి. ధనేశుల ధనం తిని, వారి భోగంలో పాలుపంచుకొని, వారి తృప్తికి సామ్రాజ్యవాది అగు కవిగాయకాదులూ, వేదాంతులూ, వేదాంతమూ కళాదిసంస్కృతీ ఉద్భవింపచేస్తారు. 'నిషీ' అనే వేదాంతి బంగారపు జుట్టు నీలికళ్ళు తెల్లటి 'బ్లాండు' జాతిదే! మానసిక ఆధ్యాత్మిక భౌతిక శక్తులన్నీ వారివేనని వాదించాడు. అల్లాగా హెర్బర్టుస్పెన్సరు, డార్వినూ శక్తిగల ప్రాణే బ్రతుకుతుందనే ప్రామాణ్య వచనం ఉద్భవింపచేశారు. కిప్లింగ్ కవి 'పడమట పడమటే తూరుపు తూరుపే ! ఈ రెండూ ఎప్పుడూ కలవవు' అని కవిత్వం వ్రాశాడు. ఈ ధనేశ వేదాంతము తెల్లజాతి సామ్రాజ్యవేదాంత మయింది. మన భారత దేశంలో ధనేశ వేదాంత మంతలేకపోయినా కొద్దిగా ఉంది.

హేము : అమ్మయ్యా కొంతైనా ఒప్పుకొన్నాడు.

త్యాగతి : ఉండు తొందరపడకు ! ఆ ధనేశ వేదాంతము 'పూర్వకర్మ సముపార్జితం విత్తం భోగం' అన్న మెట్టవేదాంతాన్ని పుట్టించింది. యజ్ఞయాగాది కర్మలలో రాజసూయం, అశ్వమేధం ప్రోత్సహింపజేసింది. 'అన్నం కోసం దేవతలను ప్రార్థించాలనీ, ఆ దేవతలకోసం యజ్ఞమనిన్నీ' అన్న భావంమాత్రం ధనేశభావం కాదుసుమా !

హేము : బాగుంది బావా. కానీ, కానీ. మా బావ నా ఉద్దేశంవాడే అని నేను తీరమిత్రునితో అన్నాను. కాదని వాదించాడు. అతనివెఱ్ఱి అతనిది. నువ్వు పూంజీభావం కలవాడవట. నీ వేదాంతం పూంజీవేదాంతం అట. అతడు—

త్యాగతి: రాయిష్టు! ఆ కథంతా నాకు తెలుసులే! రాయిష్టుల సంస్కృతీ, వాదనా, వేదాంతవాదనా నాకు పూర్తిగా తెలుసు.

హేము: అదిగో. నీకూ కల్పమూర్తికీ తీర్థమిత్రుడంటే అంత ఉడుకుబోతు తనమేమి? అంత కోపమేమి?

త్యాగతి: నాకు ఆ రెండూ లేవు. ఆతనీ భావాలన్నీ సంపూర్ణంగా నిరసిస్తా. అంతే. విను—ఏ రష్యాలోనో ఒక ఇంగ్లీషువాణ్ణిగాని ఒక అమెరికావాణ్ణిగాని అన్యాయంచేస్తే, ప్రాణద్రోహంగాని, రాజద్రోహంగాని చేస్తే వాళ్లని గురించి ఇంగ్లండు అమెరికాలలో ధనేశులూ, వేదాంతులూ ధనేశులకవులు నానా అల్లరిచేసి వారి రాయబారులద్వారా 'జాగ్రత్త' అనే విషయం ఆ రష్యా వగైరాది రాజ్యాలకు తెలియజేస్తారు. అవతల తామే ఓ డయ్యర్ దోమలను నలిపినట్లు వేలకొలది బిడ్డలనూ స్త్రీలనూ పురుషుల్నీ వృద్ధుల్నీ కాల్చికాల్చి, చంపిచంపి, జలియన్‌వాలాబాగ్‌లో గుండ్లు అయిపోవడంవల్ల ఊరుకుంటే, మాట్లాడరు. జావాలో, బర్మాలో, ఆఫ్రికాలో, అమెరికాలో నీగ్రో మొదలయిన ప్రజల్ని గొంగళిపురుగులకన్న నీచంగా చూస్తారు. ఇది ధనేశసామ్రాజ్యతత్వ వేదాంతము.

హేము: చాలోయి బావా! నిన్ను ఆపళంగా ఆడపిల్లవైతే ఒక ముద్దు పెట్టుకొని ఉందును.

త్యాగతి: నీపుణ్యమా అని అలాటి పొరపాటుపనులుమాత్రం చేయక.

## 23

మరదలు హేమ ఆమాట అనగానే త్యాగతి ఏదో ప్రతివచనం అన్నా, అతని జీవితం మూలమూలలా కదిలిపోయింది. తన గురుదేవుడు తనకీ అగ్ని పరీక్ష యెందుకు పెట్టినాడు? తాను గృహస్థాశ్రమమే స్వీకరించవలని ఉంటే, తన గురుదేవుడే ఇంతకన్న ఒక పల్లెటూరి కుటుంబపు అమ్మాయిని తనకు నియమిస్తే, తాను పెళ్ళాడిఉండేవాడే! హేము ఒక పెద్ద సంస! ఈమె తన వలనగానీ, హేమవలన తానుకానీ ఆనందం పొందగలగడం సంభవమా? ఎలాగు ఆ క్లిష్టసమస్య విడిపోయేది? కాని తాను హేమను ప్రేమిస్తున్నాడే. హేమూ శకుంతలా ఒకటే మహాభావంయొక్క స్త్రీ అవతారాలన్న విషయం తనకు మెరుములా తోచినప్పుడు తాను పొంగి, పులకించి, సర్వభువనవ్యాప్తి నందినట్లు, దివ్యత్వ మందినట్లు, ఆనందపరిపూర్తి దర్శించినట్లు తనకు అనుభూతి కలిగిందే!

హేము: బావా! ఓ బావా! కానియ్యవయ్యా నీ ఉపన్యాసం! మనవాళ్ళ వేదాంతానికీ, మన భారతీయ జీవితానికీ ఏమీ సంబంధంలేదు. వేదకాల వేదాంతం పూజారివర్గంవారయిన బ్రాహ్మణులది. అందుకనే వేదాలలో ధర్మశాస్త్రాలలో అందరూ బ్రహ్మపుత్రులనీ, తాము పెద్దన్నయ్యలై పుట్టారనీ చెప్పారు.

త్యాగతి : ఆ తర్వాతనో దేవీ!

హేమ : ఘట్టుగా అన్నావు! నువ్వూ నేనూ కలిసి ఓ నాటకం ఆడాలి. సరే విను. అక్కడినుంచి ఆ బ్రాహ్మణరాజ్యం ఉపనిషత్తు మెట్టవేదాంతానికి దిగితే, శ్రీకృష్ణుడు వచ్చి రాజుల వేదాంతం భగవద్గీతలో చెప్పాడు. అది బలంచేశాడు తర్వాత వచ్చిన బుద్ధుడు. ఆ తర్వాత గాంధీవచ్చి కోమటి వేదాంతం ఇచ్చాడు. ఇప్పుడు సర్వసమానత్వమైన శూద్రరాజ్యం వచ్చింది.

త్యాగతి : దాని కెవరు వేదాంతగురువు ?

హేమ : ఎం. ఎన్. రాయి!

త్యాగతి : అతడా! ఆతడు పూర్వాశ్రమంలో బ్రాహ్మణుడు! ఆతని నిజమైన పేరు నరేంద్ర భట్టాచార్యుడు. బెంగాలు పంచపలీనోపాధ్యాయులలో భట్టోపాధ్యాయుల వంశంవాడు. ఈ ఆశ్రమంలో పేరుమారి శూద్రపేరైన మణీంద్రనాథరాయి అయింది.

హేమ : నీ వెటకారాలు మానెయ్యి. ఆతడు స్వచ్ఛమైన శూద్రుడని తీర మిత్రు డన్నాడు. తీర్ చాలా చదువుకొన్నాడు. మేము రాయి మానస పుత్రీపుత్రకులం కాము. మీరుమాత్రం వట్టి గాంధీ బానిసలు.

త్యాగతి : అయితే మీ వేదాంతం ఏమిటి ? మీ రే పక్షీయులు ?

హేమ : మా పార్టీ, మా స్వంత పార్టీ! ముందుముందు మా పక్షానికి ఎక్కువ బలం వస్తుంది. మా పక్షంపేరు 'స్వచ్ఛస్వేచ్ఛాపక్షం.' మాది స్వచ్ఛ స్వేచ్ఛావాదం! మాకు జాతులులేవు, మతాలు లేవు, దేవుళ్లు లేరు. నీతి అనేది మానవుని ఇష్టంమీద ఆధారపడి ఉంది. సంఘానికి వ్యక్తిధర్మం నిర్ణయించే అధికారం లేదు. సాంఘిక ధర్మసూత్రం నిర్ణయించే అధికారం ఉంది.

త్యాగతి : అదే అనుకున్నాను. నీ వేదన అంతా అర్థమయింది నా కిప్పుడు. నీ నాటకమూ అర్థమయింది. నీకూ స్వేచ్ఛాప్రణయవాదం నచ్చింది, వాద నకు ప్రియనాయకుడు ఒక్క తీరమిత్రుడే అనుకున్నా!

హేమ : కాదు బావా. నువ్వు ముసలమ్మలా వాదించక. నిజమైన భావం— విను మరీ, ఆ బొమ్మమాని. మా నిజమైన భావం ఏమిటంటే— ఈ ప్రగతి స్థితిలో వివాహం అడ్డువస్తుందని.

త్యాగతి : ఇంకా!

హేమ : ఇంకా లేదు గింకాలేదు! అన్ని పనులు మహోత్తమంగా చేయగల వారు సంఘం మీది, ఆస్తి మీది, రాజ్యం మీది, ప్రపంచం మీది, అనేగా ఆలోచన! నేను నావిషయం బాగా నిశ్చయించుకోలేదు. నాకు వివాహం ఆడాలని లేదు. అమ్మా నాన్నా బాధపడతారని ఊరుకున్నా! నాకు వివాహమూ కామవాంఛా భరించలేనివి కాలేదు. అయితే, ఏమి చేయాలని ఓ పెద్ద సమస్య ఉంది. రెండుమూడుసారులు కామవాంఛ కలిగింది. అది చంపుకున్నాను.

హేము త్యాగతి భుజంమీద చేయి వేసి, 'బావా!' అంది. త్యాగతి 'హేమూ! ఆ మాటలు చెబుతూ నా భుజంమీద చేయి వేయకు!' అని అంటూ చిరునవ్వు నవ్వాడు.

త్యాగతి ఆముక్క అన్నాడు. అతనిలోని నరాలు ఏదో వివశత్వం పొందినాయి. ఇంతలో ఏదో ఉప్పొంగు ఒక్కమాటుగ అతనిలోని తపసు, శాంతి, ప్రేమ, పూజ కలిసి మహోతరంగంలా ఆకాశం అంటాయి. ఆ ముక్క హేము అనడంలో అర్థం ఏమిటి? కాని తన బావను మళ్ళీ ఆలోచింపనిస్తేనా హేము?

హేమ: బావా! ఏమిటి ఆలోచన?

త్యాగతి: హేమూ, మనకు తెలిసో, తెలియకుండానో, మాట లంటాము. మాటలు మాటలతో పోవు. జీవితంలోంచి వచ్చిన మాటలు జీవితంతో గాఢసంబంధం కలిగిఉంటాయి. నువ్వు చటుక్కున 'నువ్వు ఆడపిల్లవైతే నిన్ను ముద్దుపెట్టుకు ఉందును' అన్నావు. ఆ మాటలు నువ్వు ఎంత అనాలోచితంగానో అన్నావు. ఆలాంటి మాటలు అనడంలో నీవెనక ఉన్న ఇరవైఏళ్ళ జీవితమూ ఉంది. నీ తల్లిదండ్రులు నిన్ను అల్లారుముద్దుగా పెంచారు. వాళ్లు ఒక దెబ్బతిని ఉండడంచేత నీ ఇష్టమే నీ ఇంట్లో రాజ్యం అయింది. నీమాట శాసనం అయింది. నీభావాలు అనేక ప్రళయాలకు, గాలివానలకు లోనవుతున్నాయి. కాని ఈ గాలివానల్లోంచి నిదానం, ఉత్తమమార్గ పరిశోధనా రావాలని నువ్వు ప్రయత్నిస్తే నాకు సంతోషమే! నువ్వు 'బోల్షివిజము' అని ఓ మాటంటావు. 'గాంధీమహాత్ముని దారి' అని ఓమాటంటావు. నీలో ఈ రెండూ లేవు. మహాత్ముని దారంటే, 'బోల్షివిజానికి, ఆధ్యాత్మికతత్వం రంగరిస్తే అయిన మహోత్కృష్టభావం.' కాని అది నీలో ఎక్కడుంది? నీలో వట్టి నాశనతత్వం ప్రస్తుతం విజృంభించి ఉంది. మీబోటివాళ్లే కొందరు ఎక్కువ ధనవంతులై ఫ్రాంసులో ఇది ప్రారంభించారు. ఈతత్వం అమెరికా కోటీశ్వరులది. 'మేం గొప్పవాళ్ళం. మేం దేవతలం' అనే భావమే వరసా వావీలేని స్త్రీపురుషుల కలయికలుగా మారింది. 'అదే మీ మతానికి పరమావధి. కాబట్టి, మనుష్యులలో కొందరు మాత్రం గొప్పవారు, తక్కినవారు నీచులు' అన్న తత్వం ఈమతం అంతా నిండి నిబిడీకృతం అయిఉంది. మీ మతం హిందూదేశం అంతా అల్లుకుని చదువుకున్నవాళ్ళల్లో పాకింది. తెలుగువాళ్ళల్లో కొందరు గురువు లున్నారు. అందులో మీ తీర్థమిత్రు డొకడు. అతనంత భయంకర రాక్షసుడు ఇంకోడు లేడు...'

హేము కళ్ళెఱ్ఱచేసి, మొగం కందిపోగా, వణుకుతూ శక్తిలా లేచింది. 'షీ నోర్ ముయ్! నీకు ఈ వాగుడంతా వాగమని ఎవరధికారం ఇచ్చారు? నీ జీవితం అంత ఛండాలపు జీవితం కాదు, మా తీర్థమిత్రునిది! నీకన్న ఎన్నో

ఏళ్ళ చిన్నదాన్నయిన నన్ను కబళిద్దామని నువ్వు చేసిన దొంగపన్నట నాకు అర్థంకాలేదనుకున్నావు! ఇంక నీమొగం చూడకూడదు' అని త్వరత్వరగా పోయి కారులో కూర్చుంది. 'పోనీయ్ తీర్థమిత్రుని ఇంటికి' అన్నది. డ్రైవరు తిన్నగా కారును తీర్థమిత్రుని ఇంటికి పోనిచ్చాడు.

## 24

తీర్థమిత్రుని ఇల్లు ట్రిప్లికేనులో ఉంది. అతడు నల్లతంబి వీధిలో ఉన్న ఒక మేడ పైభాగం అంతా అద్దెకు పుచ్చుకుని ఉన్నాడు. బి. ఏ. పట్టము పుచ్చుకుని తర్వాత జి. డి. ఏ. పరీక్షలో కూడా నెగ్గి, చెన్నపట్నంలో ఈ కంపెనీ, ఆకంపెనీలలో పనిచేసి, ఇప్పటికి మూడేళ్ళనుంచి జీవన్‌లాల్ దయారాం కంపెనీలో ముఖ్య అక్కౌంటెంటుగా చేరాడు. అతనికి రెండు వందల ఏభైరూపాయల జీతం ఇస్తున్నారు.

భార్యపేరు నరసమ్మ. ఈత డామెపేరు బాగాలేదని 'కనకలత' అని పేరుపెట్టి 'లతా' అని పిలుస్తాడు. వారిరువురకు ముగ్గురు పిల్లలు కలిగినారు. ఇరువురు కుమారులు, ఒక కొమరిత. తీర్థమిత్రుడు పొట్టివాడు. అయిదడుగుల నాలుగంగుళా లుంటాడు. కనకలత పోతపోసిన బంగారు విగ్రహం. ఒత్తైన ఉంగరాలుతిరిగిన జుట్టు. పిరుదులవరకూ వేళ్ళాడే జడ. చారెడేసి కళ్లు. కనుముక్కుతీరు ఆ కళ్లకు శ్రుతిగా అందంగా ఉంటుంది. బంగారు శలాక లాంటి కాయశరీరంమనిషి. ఏ హేమసుందరికో, ఏ కాంచనమాల లాంటివారి అందాలకు తగ్గుగాని, చక్కనిచుక్క అయిన వనిత. తీయటి గొంతుక. చిన్నతనంలో సంగీతం చెప్పించారు. ఆమె ఆ కృతులే ఆ పాటలే ఎప్పుడూ పాడుకుంటూఉంటుంది. ఇరవైనాలుగేళ్ళ ప్రౌఢాంగన అయినా ఎప్పుడూ పదెనిమిదేళ్ల పడుచుప్రాయపు బాలికలా కనబడుతుంది. ఎక్కువగా మాట్లాడదు. కాని ట్రిప్లికేనులోని ఎన్నో తెలుగు గృహలక్ష్ములతో తల్లో నాలికలా మెలుగుతూ ఉంటుంది.

కనకలత అనేక రకాలైన చేతిపట్లు కుడుతుంది. అనేక రకాలైన నూలు అల్లికలు, ఊలుదారం అల్లికలు అల్లుతుంది. ఆ చుట్టుపక్కలవారైన అరవ బాలికలూ తెలుగు బాలికలూ ఆవిడ దగ్గరకు కుట్టుపని నేర్చుకోడానికి వస్తూ ఉంటారు. వీరిదగ్గిరా, వారిదగ్గిరా అనేక విధాలైన పిండివంటలు నేర్చుకుంది. ఇవన్నీ తెలియనివారికి నేర్పుతూ ఉంటుంది. చేతికుట్టుపనియంత్రం సంపాదించి, తన రవికలు, బాడీలు, తన బిడ్డల చొక్కాలు, కోట్లు, లాగులు, తన భర్త షర్టులు, బనీనులు అన్నీ అందంగా కుడుతుంది. ముగ్గురు బిడ్డలూ బంగారు బొమ్మలు, పాలతో కడిగిన ముత్యాలులా ఉంటారు. మొదటి కాన్పు ఆడపిల్ల, రెండుమూడు కాన్పులు మగపిల్లలు. ఆ పిల్లల అందానికి ఎంతమందో వాళ్ళను ఎత్తుకొని వదలరు. పెద్దమ్మాయికి తొమ్మిదేళ్ళు. పెద్ద కుఱ్ఱవాడికి ఆరేళ్లు, రెండవవాడికి మూడో ఏడు. ఈ మధ్యనే కనకలతలకు నెలతప్పింది.

తీర్థమిత్రుడు పెండ్లయినప్పుడు భార్య కాపురానికివచ్చిన మొదటి రోజుల్లో ఆమె అందానికి తన ప్రాణమే అర్పించినట్లయిపోయినాడు. ఆనాటి నరసమ్మకు భర్త రూపెత్తి వచ్చిన మన్మథుడే! ఆరోజుల్లో భార్యాభర్తలిద్దరూ కలిసి నుంచుంటే చుట్టాలందరికీ ఎంతో ఆనందంగా ఉండేది.

తన భార్య పొంకాల శరీరాన్ని ఆమె గాఢనిద్రలో ఉండగా నెమ్మదిగా దిగంబరినిచేసి చూసి అతి పశుత్వగాఢకాంక్షతో ఆమెను తినేసేవాడు. భర్త యొక్క అతిపురుషత్వాన్ని చూచి కనకలత సిగ్గుపడేది. ఆమె లోపల ఆనందం పడినా, అతని అతిపురుషత్వ విదిత్వ కర్మాదుల కామె అలా తన్నప్పగించుకొని ఊరుకొనేది. తీర్థమిత్రుని అతిపురుషత్వ దాహానికి పుత్తడిబొమ్మయిన భార్య చాలలేదు. భార్యతో పొందు రెండు మూడు సంవత్సరాలాతన్ని ఇతర ప్రపంచాన్ని కన్నెత్తి చూడనీయలేదు. అప్పటికి భార్య తన పూర్తి సొత్తయినది. అతని పురుషత్వం ఎప్పుడామెను కోరితే—ఆకాలం ఉదయమయ్యేది, మధ్యాహ్నం అయ్యేది, సాయంకాలం అయ్యేది, ఏకాలమైనా—ఆమె మాట్లాడక ఏదో పనిమీద వెళ్ళినట్లు వారి పడకగదిలోనికి పోవలసినదే! ఒక్కొక్కసారి అతని అతిపురుషత్వం ఆమెను దినానికి ఎనిమిది తొమ్మిదిసారులు వాంఛించేది. ఆమె కిక్కురుమనక కామపు సామానులా తన్నప్పగించుకునేది.

అతని కామ దావాగ్నికి భార్య పాతదయిపోయినది. ఆమెకు ప్రథమ సంతానము కలిగినది కూడా. ఇంక పనిమనుషులు, వైద్యాలయంలో దాదులు, యూరేషియన్ భామలు, మింటుస్ట్రీటులోని అప్సరసలు, సముద్రపు ఒడ్డు మత్స్యగంధులు, ఒకరనేమిటి ఎందరో వృక్షాలై, చిన్న పొదరిండ్లయి, కంకటమహీజాలై, చిట్టి అడవులై, మహారణ్యాలై ఆహుతి అయినారు. ఆ సమయంలో ఒక స్నేహితునివల్ల ఈతనికీ అప్పుడు ఇంటరు పరీక్షకు చదివే హేమసుందరికి పరిచయం కలిగింది. ఆ పరిచయం జరిగిన క్షణంలో జానకిరామమూర్తి అనే తీర్థమిత్రుని ఎదుర్రొమ్ముపై ‘స్త్రీ’ అనే దివ్యకామామృత కలశం ఎదురుగా ప్రత్యక్షం అయి మెత్తని చిగురుజొంపముల ముష్టితో ధామ్మని గుద్దినట్లయినది. ఈ కలశం వాంఛించిన అసురనాయకులలో మహానాయకుడయ్యాడతడు. అప్పటి పదహారేళ్ళ బాలకుమార్తె అయిన హేమ అప్పుడే పాలసముద్రపు అమృతపు జిడ్డులలోనుంచి ఉద్భవించిన లక్ష్మీబాలలా ఉంది. ఈ బాలకు తానే విష్ణువో లేక రావణాసురుడో కావాలనుకున్నాడు జానకిరామమూర్తి. ఈ బాలకే తన రసికత్వ మహారసాల ముఖ్య శాఖాగ్ర సుందరమైన జహంగీరు పండు కావాలనుకున్నాడు.

తన రసిక మహాపాండిత్యాన్ని, ఈ బాలిక సౌందర్యము సవాలు చేస్తున్నదని అతడు భావించాడు. అంత అందగత్తెఅని తాను గర్వంపడే తన భార్య ఈ లేత నునుముగుద ఎదుట షాంపేను ద్రాక్షామృతముముందు తాటి కల్లయిపోయినదని భావించుకున్నాడు. అంత పెద్దకళ్ళూ, అంత చక్కని

హేమలో గులాబీలో వాసనలా ఒదిగిపోయాయి అనుకున్నాడు. ఆమె ఆ అందం, ఒకలక్ష గులాబీలు విరిసిన తోటలోని ఉదయకాలంలా ఉంది అని అత డనుకున్నాడు. ఆమె ఆ లేత యవ్వనం మొదట పండిన నాజూకుపసందు మామిడిపళ్ళ ముక్కలు కోసి బంగారు పళ్ళేన పెట్టినట్లుంది అని అతడు ఉప్పొంగిపోయాడు. ఆ క్షణంనుంచి తీర్థమిత్రుడు అనేక కామదేవాలయాలు మరిచిపోయాడు. అవి గ్రామదేవతలు, ఇది మధుర మీనాక్షీ దేవాలయం, తాను సుందరేశ్వరుణ్ణి అని కావ్యం అల్లుకున్నాడు.

## 25

కల్పమూర్తి ఆరువేల నియోగివంశరత్నాకర ముక్తాఫలము. అసలు పేరు చెన్నూరి శ్రీనివాసరావు. అతనిది కృష్ణాజిల్లా గుడివాడ తాలూకాలోని పామఱ్ఱు. మంచి వసతిగల ఆస్తి. సాలుకు ఖరీదుల తక్కువరోజులలో నాలుగువేల రాబడి వచ్చేది. ఈ యుద్ధంరోజులలో పదివేల రూపాయల రాబడి వస్తూంది. తండ్రి చిన్నతనంలో పోయాడు. ఒక్కడే కొడుకు. తల్లి సుబ్బమ్మగారు, కొడుకును చూచుకోవడంలో దుఃఖంమరచి గుడివాడలో చదువు చెప్పించింది. కల్ప మూర్తికి చిన్నతనాన్నుంచీ ఆటలు మహాయిష్టం. ఊలుబంతి ఆటలో మధ్యగా నాయకుడై అతడు నడిపే జట్టుకు ఓటమేలేదు. ఫుట్‌బాలు ఆటలో సెంటర్ ఫార్వర్డుగా తన హైస్కూలు తరఫున ఆడుతూఉంటే, ఏ ఉన్నత పాఠశాల జట్టూ పదిమైళ్ళదూరాన కైనా రావడానికి వీలులేదు. ఒక్కసారిగా అయిదారుగురు ప్రయివేటు మాష్టర్లు చదువుచెప్పేవారు. వారందరూ కలిసి ఇతని విద్యానౌకను స్కూలుఫైనలు రేవుకు నెట్టారు. అక్కడ నుంచి ఓడ కదలలేదు. ఎల్లాగయితే రెండేళ్ళకు ఏమి మాయచేశారో చుట్టాలు పక్కాలు కల్పమూర్తికి ప్రపంచజ్ఞాన విద్య నేర్పి మామూలు విద్య ఆపుచేయించారు.

మదరాసు క్రికెట్టు జట్టులోనో, టెన్నిస్‌లోనో ఆడి పేరు సంపాదించా అని కల్పమూర్తి మద్రాసు కాపురం పెట్టినాడు. క్రికెట్టులో మదరాసు జట్టులో బౌలింగులో బంతి కొట్టడంలో అసమానప్రతిభ చూపిస్తూ నాయుడు, మంకాడ్, మర్చంట్ ఇలాహీ అయిపోయాడు. ఇప్పుడు యాభైకి తక్కువకాని పరుగులు చేస్తాడు. ఆట పూర్తయ్యేసరికి నాల్గయిదు వికెట్లు తింటాడు.

టెన్నీసులో ముఖ్యయోధుడు. అఖిలభారతీయ టెన్నీస్ పందేలలో దిట్ట మైన వాడుగా పేరు సంపాదించాడు. ఇలాంటి ఒక పందెం జరిగేటప్పుడు కాలేజీ బాలికలకు పోటీవచ్చి డబుల్స్‌లో సోఫీ హేమా విజయం కావించి నారు. సోఫీ సింగిల్స్‌లో నెగ్గింది. హేమను ఓడించిందంటే జబ్బుపుష్టి దమ్ము ఉన్న సోఫీకొక్కదానికే చెల్లు. ఆ సమయంలో కల్పమూర్తికీ హేమాకు స్నేహంకలిగింది. హేమ అప్పుడు బి. ఏ. ఆనర్సు మొదటతరగతి చదువుకుంటున్నది. హేమను ఆట డ్రెస్సులో చూచిన కల్పమూర్తి గుండె

పదిహేను నిమిషా లాగిపోయింది. అతడే ఏ కావ్యనాయకుడో అయిఉంటే, ఆ కోర్టులో విరుచుకు ప్రణయమూర్ఛలో పడిపోయేవాడే! ఆమె నానారాజ్య ఒలంపిక్ టెన్నిస్ ఆటలోని బంగారు గిన్నె బహుమానమై అతనికి తోచింది. బ్రాడుమాన్ గారిని ఓడించగల క్రికెట్టు ఆట మూర్తి కట్టివచ్చినట్లాతనికి హేము ప్రత్యక్షం అయింది. ఆమె పదివేల రూపాయల ఖరీదుగల టెన్నిస్ బ్యాటు అని ఉప్పొంగిపోయాడు. ఆమె ఈతని అద్భుతమూర్తిని చూసి ఆటకు తగిన పురుషుడే అనుకొంది.

హేము నియోగి బాలిక. పెళ్ళికాని అమ్మాయి. తన గోత్రానికి తగిన గోత్రం అని తెలుసుకోగానే అతడు హిమాలయ పర్వతంలా ఆకాశం అంటాడు. వెంటనే ఆమె బి. ఏ. ఆనర్సు చదువుకొంటోంది అనగా పసిఫిక్కు లోతుల్లో పడి ఊరుకున్నాడు. అయితే ఏమి? చదువూ, ఆటలనేర్పూ రెండూ ప్రయాగ క్షేత్రం కాగలవని అతడు ధైర్యం తెచ్చుకొని హేమతో స్నేహం వృద్ధిచేసు కున్నాడు. అతడు మైలాపురం దగ్గర గోపాలపురంలో మంచి మేడ కొను క్కున్నాడు. హేమచేతనే ఆ మేడంతా అలంకరింపించాడు. ఆ బాలిక కొనుమన్నదల్లా కొన్నాడు. ఆమె ఇది మంచిదంటే స్టుడిబేకర్ కారు కొన్నాడు. అతడే స్వయంగా నడుపుకొనేవాడు. అతడు జిర్రున చీది ఎరు గడు. ఇంతకన్న హేముకు తగినభర్త ఎవరు? అని అనేకులు పెద్దలతో సంప్రతించి సంబంధ నిశ్చయానికి వినాయకరావుగారితో ముచ్చటింపించినాడు. వినాయకరావుగారు 'మా అభ్యంతరం ఏమీలేదయ్యా మా అమ్మాయి ఇష్టమే' అన్నారు.

ఇంక హేమను అడిగే దెట్లా? అతనికి ఎవరన్నా భయంలేదు. అందరూ స్నేహితులే. తండ్రిగారు పత్రాలరూపంగా, బ్యాంకులలో డిపోజిట్టుల రూపంగా నిల్వవేసి వెళ్ళిన ధనబలం అంతా అతని వెనకాల ఉంది. విగ్రహం అపోలో విగ్రహం. ఏ గడ్డుపని ఎవరికి అవసరం వచ్చినా అది అతిసమర్థతతో నిర్వహించగలడు. ఇంతకన్న ఆ ఆటలసుందరిభర్తకు కావలసిన గుణగణాలు ఏమిటిగనకా?

శ్రీనివాసరావుకు కల్పమూర్తి అని పేరుపెట్టింది హేమ. హేమ అందరికీ పేరుపెట్టింది. అంటే అవి రూఢియైపోయాయన్నమాటే! శ్రీనివాస రావు తెలివితేటలలో నిర్వికల్పమూర్తి అట! కాని కల్పించినపని సాధించ డంలో అసమానప్రజ్ఞ సంకల్పమూర్తి అట. అందుకని 'కల్పమూర్తి' అయినా డట. జానకిరామమూర్తి నారీ తీర్థయాత్రాపథికుడట. అందుకని అతడు 'తీర్థ మిత్రు'డట. ఇంతలో నిశాపతి స్నేహం సంభవించింది హేమకు.

జగపతిరావు స్వచ్ఛమైన శుక్లయజుర్వేది బ్రాహ్మణుడు. ఇంటిపేరు కొప్పర్తివారు. సన్నంగా పొడుగ్గా వుంటాడు. అతని నలుపు అమావాస్య చీకటి! పాతాళలోకం! మైనపు గోరువంక, కోకిల! ఆ కోకిలలా అతనిపాట

తీయతనాల రాశి! మైనపు గోరువంక గొంతులా అతని కంఠము సర్వశ్రుతులూ ప్రోగుచేసుకొంది! పాతాళలోకంలోని నాగకన్యల పాటలా అతని రాగాలలో సర్వసమ్మోహాలూ కూర్చుకుంది. అమావాస్య నిశిలోని సముద్రం హోరులా అతని గాంధర్వాన ఎవ్వరు ఊహింపలేని లోతులున్నాయి.

హేమ బి. ఏ. ఆనర్సు ప్రథమపరీక్షయిన వేసంకాలంలో గోక్లేహాలులో జరిగిన జగపతిరాయ సంగీతసభకు హాజరయింది. అతని పాటలోని మాధుర్యం ఆమెను ఆనందమూర్ఛలో ముంచింది. ఇంకేముంది హేమే కోరి అతనిస్నేహం వాంఛించింది. హేమను నిశాపతి చూచాడు. అతని కంఠంలోని సంగీతం ఎడారిలో ఇంకినట్లయింది. ఆమె సౌందర్యపరమస్వచ్ఛత దర్శించాడు. అతని గొంతులో వేయివేల మాధుర్యాలు వరదల పొంగుల్లోవలె పరవళ్లెత్తుతు ప్రవహించి వచ్చాయి.

జగపతిరావు సంగీతచరిత్ర సుందరీ విజయపరంపరే! అతని గాంధర్వ మాధుర్యమత్తతలో ఎందరో వివిధదేశాల సుందరు లాతని హృదయంపై వాలి పోయారు. అతనికి అంతగా విషయమాసక్తి లేదు. సుందరులు తనచుట్టూ తేనెటీగలలా ముసరడమే అతడు కోరాడు. వారిపూజ అతడు కోరాడు. ఒకరిద్దరు గాంధర్వబాలలు, వేశ్యావృత్తిపశువు లాతన్ని తమ భోగవాంఛలు తీర్చేటట్లు చేయగలిగారు. అంతే. కాని ఆ ఆడ సాలీళ్ళ గూడులలోంచి జగపతిరాయుడు ఎల్లాగో తప్పించుకు పారిపోయివచ్చాడు. అల్లాంటి జగపతి హేమను చూడగానే ఈ బాలిక పదిలేల సితారు తీగలలోని పంచమస్వరపుంజ మనుకొన్నాడు. ఈ బాలిక సరస్వతీ హస్తలీలాశుక మనుకొన్నాడు. జగపతి ఆ నాటినుంచీ మదరాసే తన ముఖ్యమకాం చేసుకున్నాడు. హేమ పకపకనవ్వుతూ 'నిశాపతిరావుగారూ' అని అతన్ని పిలిచింది. అదే అతని పేరయి కూర్చుంది.

## 26

హేమ తనకారును తిన్నగా తీర్థమిత్రుని ఇంటికి తీసుకుపొమ్మని డ్రైవరుకు చెప్పి వెనకసీటులో కూలిపోయి కూర్చున్నది. కారు తీర్థమిత్రుని ఇంటిదగ్గరకు వెళ్ళేసరికి కల్పమూర్తి కారు అక్కడున్నది. హేమ ఆ కారును చూడలేదు. డ్రైవర్ను తీర్థమూర్తిగా రున్నారేమో చూడమన్నది. ఆ రోజు ఆదివారం కాబట్టి తీర్థమిత్రుడు ఇంటిదగ్గరే ఉంటాడని ఆమెకు తెలుసును.

డ్రైవరు వెళ్లగానే, అతనివెంట తీర్థమిత్రుడు ఉరుక్కుంటూ కారు దగ్గరకు వచ్చినాడు. అతనివెంటనే కల్పమూర్తి ఇవతలికి పరుగెత్తుకొని వచ్చినాడు.

తీర్థ: హేమా! ఏమిటి అల్లా ఉన్నావు?

కల్ప: హేమా ఒంట్లో జబ్బుగా ఉందా?

తీర్థమిత్రుడు హేమవైపు తీక్షణంగా చూశాడు. వేటాడే పులికి, ఎదుట ఉన్న హరిణ హృదయం పూర్తిగా అవగతం అవుతుంది. అతనికి హేమ

హృదయం అంతా ఒక్క నిముషంలో అరమైంది. తనస్నేహంలో దాగివున్న మహాద్భుత శక్తులన్నీ ఉపయోగించికూడా హేమును లొంగదీయలేకపోయాడు ఈవరకు. ప్రపంచాద్భుత సుందరి అయిన ఈ బాలికను నిదానంగా సర్వ శక్తులు ఉపయోగించి ఓడించాలి. ఈ బాలిక మన సత్వం అనేక వర్ణాల కలయిక, అనేక పరిమళాల కూడిక, అనేక రేఖల పొందిక! ఈ నిధిని పొందడానికి ఎంతకాలం తపస్సుచేస్తే ఏమి? వివిధ సిద్ధులను సముపార్జించటానికి తమ తలలను బలియిచ్చిన మహాయోగులు లేరా? అప్పటికీ అయిదారు సారులు తాను కొంత కొంత ముందుకుసాగాడు. ఆ పురోగమనం అంతటితో ఆగిపోవడమే కాకుండా మళ్ళీ వెనకటికన్న వెనక్కు వెళ్ళవలసివచ్చింది. ఒకసారి ఆమెను కాగిలించుకున్నంత పనిచేశాడు. ఒకసారి ఆమెను చిన్నబిడ్డలా ఎత్తి ఒక చిన్నకాల్వ దాటాడు. ఒకసారి ఆమెను తోటలో పెదవులమీదనే చుంబించబోయాడు. అప్పుడామెకు విపరీతమైన కోపం వచ్చింది.

ఆ మర్నాడు తానామె నొంటిగా కలుసుకున్నప్పుడు ఆమె బిగుసుకుపోయి మొగము చిట్లించుకొని 'తీర్! నువ్వు, నన్ను కామోద్దేశంతో ముట్టుకోడం ఏమీ ఇష్టంలేదు. అది పెద్దపాపం అని నేను యిలా చెప్పడంకాదు. నా మనస్సు అలాంటి పనులవల్ల బాధపడుతోంది. ఇకముందు నీకూ నాకూ స్నేహం ఉండాలంటే ఏవిధంగానూ నన్ను ముట్టుకొనడానికి ప్రయత్నించకు. నిన్న నీవర్తనం నాకు చాలా మనోవైకల్యం కలిగించింది. నేను నా నోరు డెటాల్ నీటితో కడుక్కోవలసివచ్చింది. నీవే ఇంకా ఈలాంటి వెకిలితనం కనబరిస్తే, నువ్వు మాయింటికి రావద్దు. నీ మొహం నాకు కనుబరచవద్దు. నాకు యిష్టమైతే నేనే నిన్ను వెదకికొంటూ వస్తాను' అని అన్న ముక్కలు తీర్థమిత్రుని బ్రతుకునకు మహత్తరమైన అవమానం అయినాయి. అప్పటినుంచీ తీర్థమిత్రుడు హేమును ముట్టుకోలేదు.

ఇప్పుడు హేమును చూడగానే తీర్థమిత్రునికి ఇదే తనకు ప్రసాదించబడిన దివ్యసమయము అని తోచింది. ఈ ఆలోచనకు అంతా అతని మనస్సులో రెండు చిటికెలకాలం పట్టింది. అతడు నీలిపట్టుతాబితా కట్టుకొని, ఒక చక్కని టర్కీతువాలు వల్లెవాటు వేసుకొని తన దబ్బపండుచాయకు మరింత కాంతి వచ్చేటట్టుగా హేముదగ్గరకు పరుగెత్తుకొని వచ్చాడు.

హేము : ఈ సాయంకాలం నీతో మాట్లాడవలసిన అంశాలు చాలాఉన్నాయి. నువ్వూ నేనుమాత్రం మాట్లాడాలి. నేను నీ కోసం నా చిన్నకారుమీద వస్తాను. మనం తిన్నగా చెంగల్పట్టు పోయేదారిలో కొంతవరకుపోయి ఎక్కడో ఆగి విషయాలన్నీ మాట్లాడుకోవాలి. నువ్వు సైదాపేట రైలు గేటుదగ్గిర నిల్చునిఉండు అని హేము అతనికిమాత్రం వినబడేటట్లు చెప్పి, 'కల్పమూర్తీ! మాయింటికి వెడదాము. నీభోజనం అయిందా' అని అడిగింది.

కల్పమూర్తి: ఇంకా చేయలేదు హేమూ!

హేమ : రా నాతో ! మా యింట్లో భోజనం చేద్దుగాని.

తమ తమ కారులమీద వారిద్దరూ హేమ ఇంటికి చేరారు.

హేమ గదులన్నీ మేడమీద ఉన్నాయి. ఒకగది హేమ చదువుకొనేది. ఒకటి హేమ స్నేహితులు కూర్చునేది. ఒకటి హేమ గ్రంథాలయం. ఒకటి హేమ అలంకరణగది. ఒకటి హేమ పడకగది. ఆ గదులన్నీ హేమ ఎంతో అందంగా అలంకరించుకొంది. దక్షిణవైపున ఆమె పడకగది, అలంకరణగది ఉన్నాయి. తూర్పున అతిథి మందిరమూ ఉంది. మధ్యహాలు రేడియోగది, ఆమె స్నానాల గదికి అలంకరణగదిలోనుంచి దారిఉంది. పడక గదిలోనుండి అలంకరణ గదిలోనికి దారి ఉంది.

హేమ తల్లిదండ్రుల గదులు, లోకేశ్వరిగది, పూజామందిరము, అతిథి మందిరము, సేవకులగది, గ్రంథాలయంగది అన్నీ క్రిందనే ఉన్నాయి. హేమ మేడచుట్టూ సర్వ పుష్పాలచెట్లు, కొబ్బరి, దానిమ్మ, మామిడి, సపోటా, దబ్బ, నిమ్మ, జామచెట్లూ ద్రాక్షపందిళ్ళూ ఉన్నాయి. తోటంతా రెండెకరాల వైశాల్యం గులాబి జాతులు, చేమంతులు, మల్లి, జాజిజాతులు మాధవీమాలతీ లతాకుంజాలు, కనకాంబర కుసుమాంబర నీలాంబర జాతులు ఆ తోటంతా విలసిల్లుతున్నాయి. కొబ్బరిచెట్లు ఎప్పుడు గెలలతో నిండి ఉంటాయి. ఆంధ్ర మామిళ్ళలో జహంగీరు, నాజూకుపసంద్, ఇమాంపసంద్, పంచదార కలశ, చిన్నరసం, చెరకురసం మొదలయిన జాతులున్నాయి.

## 27

హేమ, కల్పమూర్తి భోజనంచేశారు. లోకేశ్వరి అప్పటికప్పుడే భోజనంచేసి తనగదిలో చదువుకుంటున్నది. వీళ్ళిద్దరూ భోజనంచేసి, హాలులోకి వచ్చేసరికి ఇంతట్లో తంతివార్తాహరుఁ డొకడు, "లోకేశ్వరీదేవి, శ్రీ వినాయక రావుగారింట్లో" అన్న తంతివార్తను కొనివచ్చాడు.

హేమ, "లోకం నీకేదో తంతి వచ్చిందే" అని కేక వేసింది. లోకేశ్వరి గబగబ పరుగెత్తుకొనివచ్చి, వణుకుతూ, ఆ తంతి కవరు తీసికొని, లోపలికి పరుగెత్తుకొని వెళ్ళి, కవరువిప్పి వణుకుతూనే చదువుకుంది.

లోకేశ్వరి కంగారు, వణుకూ చూచి, హేమ భయపడి, లోకేశ్వరి గది లోకి వెళ్ళింది. ఆమె కుర్చీలో కూలబడి కొంచెం నవ్వుతూ, కొంచెం ఏడుస్తూ ఉన్నది. హేమను చూడగానే లేచి వచ్చి, ఆ బాలిక హేమను కౌగిలించుకొని, "హేమ్" అని మాటరాక ఊరుకుంది.

"ఏమిటే లోకం, ఏమిటి కంగారు? ఆ టెలిగ్రాం నేను చూడవచ్చునా?" అని అడిగింది.

"ఆఁ! తప్పక" అంటూ సిగ్గుపడుతూ కంటినీరు తుడుచుకుంటూ, చిరునవ్వుతో మోము ప్రఫుల్లమైపోవ ఆ తంతివార్త హేమకు ఇచ్చింది. "ఢిల్లీ-11 ఏప్రిల్-ఉదయం-7-20.

లోకేశ్వరి, వినాయకరావుగారి ఇంట్లో, 24 డెన్మోర్ గ్రౌండ్సు-లోకం నువ్వు దేవకన్యవు-ఆరు నెలలనుండి-నా-మనస్సు-నీ-మీద-లగ్నం-నీకు-ఉత్తరం-రాయడానికి-సిగ్గు-పడ్డాను-నీ-పేరు-నాకు-సంతత-దేవి-నామ-స్మరణ-నీ-ఉత్తరం-దివ్య-ఆనంద-పరం-త్వరలో-ముహూర్తం-మామగారిని-సంప్రతించి-ఏర్పాటు-చేయి. హేమను-మామగారిని-అత్తగారిని-త్యాగతి-కల్పమూర్తిని-అడిగాను-పెద్ద ఉత్తరం వెంటనే-మామగారికి-ఉత్తరం-నీ-పాదాలకడ-మోకరించి-నీ-ప్రియ-అతి-ప్రియుడు నిశాపతి" అని తంతివార్త రెండు కాగితాలలో ఉంది.

హేమ లోకేశ్వరివైపు తీక్షణంగా చూచింది. కొంచెం అపహాసం ఆ పెదవుల ఎడమభాగంపై ప్రసరించింది.

హేమ : ఇదా కథ! ఎన్నాళ్ళనుంచి ఈ నాటకం నడుస్తూంది? నాతో చెప్పడం అవమానం అనుకొన్నావు కాబోలు! అచ్ఛా! నీకు నా మనః పూర్వకాభివందనాలు!

హేమ మాటలో నిండివున్న హేళనఅంతా లోకేశ్వరి గ్రహించింది. ఆమె గభుక్కున లేచి, హేమ దగ్గరకువచ్చి, ఆమె రెండు చేతులూతీసి, తన రెండుచేతులలో పట్టుకొని, "హేమా నీతో చెప్పలేదని కోపమా? హేమా! నేను మొదటినుంచీ నిశాపతిని ప్రేమించాను. అతను నా మొగమైనా తిన్నగా చూసేవాడు కాదు. అలా ఆ రహస్యం నా హృదయంలో దాచుకుని ఉంటిని. అతడు నిన్ను ప్రేమించేవాడు. నువ్వు అతన్ని ప్రేమిస్తున్నావో లేదో నాకు తెలియలేదు. అలాగే భగవంతుని ప్రార్థిస్తూ నా హృదయంలోని భావాన్ని అక్కడే చంపేసుకోవాలని ప్రయత్నంచేస్తూ, సాధ్యంకాక లోపల కుములుతూ, భగవంతుడు మీ ఇద్దరినీ కలుపుగాక అని కోరుతూ ఉండేదాన్ని. కాని నాకు అతని చరిత్ర నెల్లూరునుంచి మాచుట్టం ఒకాయన ఉత్తరం రాశాడు. అంత గొప్ప సంగీతపాటకుడైన అతడు ప్రవరాఖ్యునిలా ఉంటాడని అనుకోలేదు సుమా! కాని మా చుట్టం రాసిన చరిత్రవంటి చరిత్ర నిజమైఉంటుందా అనీ, ఆకాశంలోనుంచి కురిసే వర్షబిందువువంటి నిర్మల చరిత్రగల నా హేమ అతని గుణం మంచిదికాకపోతే ఎలా స్నేహము చేయగలదనీ అనుకున్నాను. రహస్యంగా కంటినీరు కడవలు కార్చాను. హేమా! ఆ రోజులన్నీ నాకు యమయాతనే! అతడు నిన్ను ప్రేమిస్తున్నాడు, నేను అతన్ని ప్రేమిస్తుంటిని. నా ప్రాణం పోయినా, వేయిమంది లోకేశ్వరులను బలియిచ్చినా నా హేమకు సూది మొనంత కష్టం రాకూడదు. ఇదీ నా ఆవేదన. ఇంతట్లో ఏమి వచ్చిందో

నిశాపతి వెళ్ళిపోయాడు. సోఫీ అడిగిన ప్రశ్నకు నువ్వు సమాధానం చెప్పావు. దానితో నా గుండెల్లోంచి ఒక హిమాలయ పర్వతము తీసివేసినట్లయింది.

హేమ: ఓహో! ఒక కథలాగే ఉంది నీ చరిత్ర. నువ్వు నన్ను పొగడా అక్కర్లేదు. నీ ప్రేమచరిత్ర నాకు చెప్పనూ అక్కర్లేదు. నా గుణం వాన బిందువూ కాదు, మంచుబిందువూ కాదు. మన రోడ్డుపక్క బురదగుంటలో నీటిబిందువు. నా గుణంతో సరిపోలిస్తే అది రెండుసార్లు బట్టీపట్టిన బిందువు లాంటిది. నిశాపతిని పెళ్లి చేసుకో, మరి ఇంకొర్ని చేసుకో నా కవసరం లేదు, అని అతికోపంతో విస విస మేడమీదికి వెళ్ళిపోయింది.

ఏమిటీ విచిత్రమని లోకేశ్వరి అనుకుంది. ఎందుకు హేమకు కోపం? తా నేమి చేసింది? హేమ తన హృదయాంతరాల్లో నిశాపతిని ఏమన్నా ప్రేమిస్తున్నదా? అయితే తాను వెంటనే హేమ నిశాపతుల జీవితంలోంచి మాయమైపోవలసినదే! ఈ తరుణంలో భగవంతుడే తనకు శక్తి ఇవ్వవలసి ఉంది. లోకేశ్వరి హేమవెంట మేడమీదకు వెళ్ళాలా లేక వెళ్ళకుండా ఉండాలా? అని తటపటాయించింది.

లోకేశ్వరి చామనఛాయ కలది. అయినా ముఖం స్పష్టమైన రేఖలతో మనోహరంగా ఉంటుంది. దేహరేఖలూ స్పష్టమై పూర్ణత తాల్చి ఉంటాయి. లోకేశ్వరి స్త్రీలలో స్త్రీ. ఆమె వ్యక్తిత్వం దర్శించిన ఏ పురుషుడైనా, ఉత్తమ ప్రేమభావా లల్లాఉంచి, ఆ బాలిక దేహాన్ని వాంఛిస్తాడు.

లోకేశ్వరి ఆలోచించుకొని, ఆలోచించుకొని, నెమ్మదిగా మేడమీదకు వెళ్ళింది. హేమ తన మంచంమీద బోర్లగిల పడుకునిఉంది. లోకం వెళ్ళి, "హేమ! నీ మనస్సులోనిదంతా నాతో చెప్పు. ఇన్నినాళ్ళ స్నేహమూ వట్టిదేనా?" అని ఆమెచుట్టూ చేతులువేసి ఆమెపైవాలి తన గుండెకు అదుముకొంది.

హేమ: ఏమో లోకం, నాకు స్నేహితులు లేరు, చుట్టాలు లేరు, మొండిలా నే నొక్కదాన్నే ఉన్నాను.

లోకం: అదేమిటి హేమ! నేను తీర్థమిత్రుని విషయం చెప్పలేనుగాని, కల్పమూర్తి, త్యాగతి, సోఫీ, నేనూ నువ్వంటే మా ప్రాణం అర్పించడానికి సిద్ధంగా ఉన్నామే!

హేమ చటుక్కున లేచి కూర్చుంది. 'ఏమిటి తీర్థమిత్రునకువచ్చిన లోటు?' అని తీవ్రంగా అడిగింది.

లోకేశ్వరికి కష్టంతోచి కొంచెం చురుకుగానే, "అతడు ఇప్పటికి రెండేళ్ల క్రింద ఒకసారి నన్నుగబుక్కున కౌగిలించుకొని, 'ప్రాణేశ్వరీ నువ్వు అపర రతీదేవివి నీతోనే నా జీవితం' అన్నాడు. అప్పుడు అతన్ని తీవ్రంగా అదలించి నా మొగం చూడకన్నాను. అవమానంచేత చచ్చిపోయాను. ఈ మధ్య ఆరునెలలక్రితం ఒకసారి లోకం శృంగారాధిదేవీ! నా కోర్కె తీర్చకపోతే,

నీ పాదాలకడ ప్రాణం విడుస్తాను' అన్నాడు. మోకరించాడు. నాకు పట్ట రాని కోపంవచ్చి అతని మొగంమీద తన్నాను" అని చెప్పింది.

'మంచిపని చేశావు! నువ్వు అతనికి ఏదో ఆశకొలిపావు. అందుకని అలా అన్నాడు. ఇక్కడనుంచి నాదగ్గర అతన్నేమీ అనడానికి వీలులేదు. నీకు యిష్టంలేకపోతే నాతో మాట్లాడటం మానెయ్యి' అని హేమ మళ్ళీ మంచంమీద వాలింది.

## 28

లోకేశ్వరి ఆశ్చర్యపడుతూ క్రిందికి దిగింది. హేమకు ఏమిటి ఈ విచిత్రస్థితి! తీరమిత్రుడంటే అంత ఇష్టమా? లేక ఇతరుల భావాలకు వ్యతిరేకాభిప్రాయ మివ్వడం అనే ఒక గయ్యాళి మనస్థితి ఉంది. ఆ మనస్థితిలో పడిందా హేమ? అనుకుంటూ లోకేశ్వరి కించపడిన హృదయంతో తన గది లోనికి పోయింది.

తాను వినాయకరావు, వెంకటరాజ్యలక్ష్మమ్మగార్ల అనుమతితోనే నిశాపతికి ఉత్తరం రాసింది. అంతకుముందే నిశాపతి తన భావాన్ని వ్యంగ్యంగా తెలియజేస్తూ ఎంతో చక్కని ఉత్తరాలు వ్రాశాడు.

### మొదటి ఉత్తరం

20 వీధి, లక్నో

ప్రియమైన లోకేశ్వరీ! 4-10-1945

మిమ్మల్నందరినీ వదలివచ్చి నాలుగు నెలలయింది. నేను ఎందుకంత విచిత్రంగా మారిపోయానో ఈపాటికి మీ కందరికీ అర్థమైఉంటుంది. నాకు సంగీతంలో ఎంతశక్తి ఉందో అంత స్త్రీవిషయ నీరసహృదయముంది. గొప్ప సంగీతపాఠకులకు అనేక జనానాల తలుపులకు గడియలుండవు. కాని, నేను ఏ కుటుంబంలో స్త్రీనీ నా నీచత్వంతో అధఃపతితురాలిని చేయలేదు అని సర్వవిశ్వం సాక్షిగా నీతో మనవిచేస్తున్నాను. ఎవరో కొందరు పెద్దరకం పుణ్యాంగనలు నాతో గాఢస్నేహంగా ఉండేవారు — అంతే!

అలాంటిది హేమకుసుమసుందరీదేవిని చూడగానే నాకు యుగాలనాటి స్నేహితురాలనిపించింది. ఆమెతోటి స్నేహం, నన్ను పూర్తిగా మార్చింది. ఆమెను ప్రేమించాను అనుకున్నాను. సర్వలోకాలు నేను త్రివిక్రముడనై పొంగిపోయాను అనుకున్నాను. నా మనస్తత్వమే పూర్తిగా మారిపోయింది. ఆ బాలిక ఎప్పుడు నన్ను "కాదు" అని అన్నదో నందిపర్వతాలకు పారి పోయాను. ఆ నందిపర్వతాలలో ఒక నెల జీవచ్ఛవంలా పడిఉంటిని. నా జీవితాన్ని ఏ కొండమీదనుంచో క్రిందికి త్రోసుకొని సహస్రశకలాలు చేసు

ఉందామనీ, ఆ వార్తవిని హేమా, మీరూ బాధపడతారని ఊహించుకొన్నాను, కోపంతో మండిపోయాను, ఏడ్చాను.

అప్పుడు నన్ను రక్షించింది నువ్వూ, త్యాగతీని. అంటే, నువ్వు ఓరాత్రి నా సంగీత కచ్చేరి యైనతర్వాత మనం అందరమూ హేముగారి ఇంటికి వస్తూన్నప్పుడు నాతో, "నిశాపతీ! నీ గొంతుక, నీ దివ్యసంగీతము భగవంతునికి ఒక మహానివేదన. జన్మలో ఈ రెండూ చాలు. ఇంక ఏవి లేకపోయినా జన్మ ఎత్తినందుకు సార్థకత దొరికినట్లే" అన్నావు. ఆ ముక్కలు కోటి మెరుముల కాంతితో నా జన్మను వెలిగిస్తున్నాయి.

నేను నందిపర్వతాలకు పారిపోయి వచ్చేటప్పుడు త్యాగతి నన్ను రైలు ఎక్కిస్తూ, "నిశాపతీ! ప్రపంచంలో భౌతిక వాంఛలు తీరినా ఒకటే, తీరకపోయినా ఒకటే. భౌతికవాంఛలో మనోవాంఛ కలిసిపోయినప్పుడు ఆ గాఢ వాంఛ తీరలేదన్న బాధ ఎక్కువ అవుతుంది. అదీ తీరకపోయినంతమాత్రాన మనం పశువులమై—అంటే భౌతికవాంఛ కోరిన పశువు అది తీరలేదని బెంగ పెట్టుకొని చచ్చిపోదు. చూడూ ఆ వాంఛను మర్చిపోవాలి. మనం మరవ లేనిది భౌతిక, మానసిక, ఆధ్యాత్మికములు సంగమించిన వాంఛనే!" అన్నాడు. ఆ మాటలు నాకు మొదట అర్థం అయ్యాయికావు. తర్వాత ఆ మాటలే నాకు పదేపదే జ్ఞాపకంవచ్చాయి. జ్ఞానవంతుణ్ణయి, దేశాలు తిరిగాను. అంత కన్న అంతకన్న హేము నాకు సహోదరి అన్నభావం ఎక్కువైంది.

లోకేశ్వరీదేవీ! ఈ మూర్ఖుణ్ణి మరచిపోకు. నీకు నా సంగీతముపై ఉన్న గాఢాభిమానాన్ని ఈ దీనునిమీదకూడా కాస్త ప్రసరించు.

త్యాగతిని, కల్పమూర్తిని, హేమును, అత్తగార్ని, మామగారిని అందరిని అడిగినాను.

ఇట్లు, నీ ప్రియమిత్రుడు,
నిశాపతి

ఆ ఉత్తరాన్ని లోకేశ్వరి కళ్ళకద్దుకొని, ముద్దుపెట్టుకొని హృదయంకడ దాచుకొంది. ఈ ఉత్తరంవచ్చిన రెండు నెలలకు నిశాపతికడనుండి రెండో ఉత్తరం బొంబాయినుండి వచ్చింది. ఆ ఉత్తరంలో, "లోకేశ్వరీదేవీ! నీతో ఎన్నో చెప్పాలి! నీ జీవితం ఉత్తమం—అది ముందు ఏలా మారుతుందో? ఏలా మారినా నీవు మారవు. హేమకుసుమదేవి చాలా గొప్ప వ్యక్తి అవుతుంది" అన్నమాటలు లోకేశ్వరి హృదయాన్ని గాలివాననాటి సముద్ర కెరటాలలో ఎగిరించి పడవేశాయి. ఆమె కేదో సంతోషము, ఏదో భయమూ రెండూ కలిగాయి.

1941 మార్చి నెలలో నిశాపతి ఢిల్లీనుంచి మూడవ ఉత్తరము లోకేశ్వరికి వ్రాసినాడు. అందులో, "లోకేశ్వరీ! నాకీ నెలలన్నీ నీవే సర్వకాలమూ

జ్ఞాపకం వస్తున్నావు. నీ ఉత్తరాలు ఒక మైసూరు చందుగా పెట్టెలో పెట్టు కున్నా. మనం అందరం కలసి హేమసుందరిగారి తోటలో తీయించుకొన్న ఫొటోలోంచి నీ బొమ్మను వేరే తీయించి బంగారు ఫ్రేములో పెట్టుకున్నా. అందుకు నన్ను నువ్వు కోపపడకు" అన్న ముక్కలు లోకేశ్వరిని ఏ లోకాలకో తేల్చుకొనిపోయాయి. ఆ ఉత్తరాలు మూడూ తీసుకొని లోకేశ్వరి త్యాగతి కడకు పోయింది. అతనితో తన హృదయం నిశాపతిపై లగ్నమైఉన్న విష యమూ, ఒకనాడు తనకేమీ ఆశలేకపోవుటూ, తన కాశకలిగిన విషయమూ అతనితో చెప్పుకొన్నది.

త్యాగతి : లోకేశ్వరీ! నువ్వు నిశాపతికి ఉత్తరంరాయి. నీ హృదయము నీవు విప్పి రాయి. నేనూ రాస్తాను. అతను నువ్వంటే దేవతగా భావిస్తున్నాడు. కాని అతన్ని అర్థంచేసుకోలేవేమో నని భయపడుతున్నాడు. మీ ఇరువురి దాంపత్యమూ నాకు పరమఇష్టము.

ఈ చరిత్ర అంతా లోకేశ్వరి హృదయంలో సినీమా చిత్రంలా ప్రసరించి పోయినది. ఇంక హేముకు కోపమెందుకు కలగాలి. ఈ విషయము త్యాగతితో చెప్పిన మరునాడే వినాయకరావుగారికి, వెంకటరామరాజ్యలక్ష్మమ్మగారికీ తాను మనవిచేసింది. వారెంతో సంతోషించి, లోకేశ్వరి వివాహము తమ ఇంటనే మహావైభవంగా తాము జరిపించాలనుకొంటున్న కోర్కె, నేటికి ఈ దేశసమయం వచ్చినందుకు తమ ఆనందానికి మితిలేదన్నారు. ఆ విషయమూ లోకేశ్వరి నిశాపతికి రాసింది.

"మీరు రాసిన మూడుత్తరాలూ నాకు భగవద్గీత, రామాయణం, భారతం వంటివి! మీ ఉత్తరాలలో మీరు, నా జీవితంలో నేను పెన్నిధానం అనుకునే మార్పు రాగలదనే సూచన చేసినారు. నా మనస్సు, ప్రాణం, జీవితం మీకు ఇదివరకే లగ్నమైఉన్నవి. ఈ మాటలు త్యాగతిగారు నేను వ్రాయాలని చెప్పడంచేత, సిగ్గువిడిచి రాస్తున్నా. మీరు నాకు దేవతలు. మీ బొమ్మను నేనూ విడిగా తీయించుకొని పూజిస్తున్నా!..." ఆలాఆలా ఏమేమిటో తాను రాసింది. ఆ ఉత్తరం రాస్తుంటే తనకు చెమటలు పోసినాయి.

పెట్టెలో దాచుకొన్న నిశాపతి బొమ్మను తీసి కళ్ళకద్దుకొని మళ్లీ పెట్టెలో పెట్టుకొన్నది లోకేశ్వరి. కల్పమూర్తి ఇంటికి వెళ్ళిపోయినాడు. త్యాగతి మాటలు లోకేశ్వరికి కోటి శక్తులు ప్రసాదించినవి. ఎన్ని ఉత్తరాలో చింపి, చివరకు ఆ ఉత్తరం రాసింది. అదివరకే త్యాగతి ఉత్తరం నిశాపతికి అందింది. లోకేశ్వరి ఉత్తరం అందగానే అతడు తంతి నిచ్చాడు.

## 29

మద్రాసునుండి బొంబాయి మెయిలు అతివేగంతో వెళ్ళిపోతున్నది. ఆ వేసంకాలంలో నక్షత్రాలూ, ఇంజను పొగగొట్టంనుండి వచ్చిన నిప్పుకణాలూ

కలిసిపోతున్నాయి! ఆ బండే నిప్పుకణాలను ఆకాశంవరకూ ఎగజిమ్ముతోంది. ఆ కణాలు నక్షత్రాలై ఆకాశంలో నిలిచిపోతున్నాయికాబోలు! పట్టాలపైన వెడుతున్నా బండి ఎల్లావెళ్ళుతోందో, వెనక్కే వెడుతోందో, ముందుకో అనుకుంటారు యాత్రికులు. బండినిండా అతి ఒత్తిడిగా జనం మనస్సంతా కమ్ముకుంటున్న ఆలోచనలులా ఉన్నారు. హృదయాలు మండుతున్నట్లు భరింపరాని ఉక్క! ప్రతి బండిలోనూ యుద్ధసంబంధపువారైన సైనికులు, ఇంజనీర్లు, కూలీలు, గుమాస్తాలు యూనిఫారం దుస్తులతో ఉన్నారు. వెళ్లుతోన్నది చావుకో, విజయానికో వాళ్ళ ఉత్సాహం వాళ్ళది. యుద్ధం అంతా ఒక వీర నాట్యమే వారికి! వాళ్లంతా పాటలు పాడుతున్నారు; అల్లరిచేస్తున్నారు. అక్కడక్కడ మూడవతరగతి పెట్టెలలోమాత్రం సాధారణ యాత్రికులు స్థలంకోసం దెబ్బలాడుకుంటున్నారు.

ఇంజను దేశనాయకుడులా, కథానాయకుడులా మహావేగంతో వెడుతూంది. అది ఇనపజంతువు. దాని హృదయం అగ్ని; దాని శక్తి ఆవిరి. మెల్లమెల్లమెల్లు ముందుకు రైలుపట్టాదారిమీద ప్రసరించే దానిచూపు అఖండ కాంతివంతమైన ఒకటే కన్ను. అది ఏకాక్షి. లోకసంహారిమాత్రం కాదు! మహావేగంతో వెళ్తున్న బండిలో మధ్యగా ఒక మొదటితరగతి పెట్టె. ఇద్దరు మాత్రమే కూర్చునేగది అది. అందులో ఈపక్కనుంచి ఆపక్కకు ఒకటే మెత్తటి పరుపున్న సీటు. పైన ఒక సీటు ఉంది. అలాంటి పెట్టెలలో భార్యాభర్తలు ప్రయాణంచేస్తారు. ఆ పెట్టెలలో ఈచివర కూర్చుని హేమ! ఆచివర కూర్చుని తీర్థమిత్రుడు!

హేమ ఆలోచనలు కాళరాత్రో, తుఫానో, సుడిగుండాలో, గట్లు తెగిన వరదలతో నిండిపోయిన చెరువో! హేమ హృదయంలో పెద్ద వడగాలో, వడగళ్ళవానో, కన్ను కనబడని మంచో, గజగజలాడిస్తూ గడ్డకట్టించే చలో!

రైలు కదిలింది—మదరాసు స్టేషనులోంచి—రైలు కదిలింది! ఆదివరదాకా ఉన్న హేమస్థితి—సంపూర్ణంగా మారిపోయినది. ఏదో ధైర్యంతో—నిశ్చయ—దృఢనిశ్చయ హృదయంతో వచ్చి రైలు ఎక్కింది. రైలు ఎక్కడం టక టకమని ఎత్తుమడమల పాదరక్షలు చప్పుడు చేసుకుంటూ వచ్చి—ఎక్కింది...ఎవరో మహారాణిలా వచ్చి ఎక్కింది...ఎవరో పెద్ద ఉద్యోగస్థురాలులా ఎక్కింది. తీర్థమిత్రుడు...భార్య వెంటవచ్చే భర్తలా...ఉండాలని...ప్రయత్నించాడు. స్త్రీదళాల నాయకురాలివెంట ఆర్డర్లీలా—అయి ఊరుకున్నాడు...పెద్ద ప్రభుత్వోద్యోగస్థురాలివెంట—గుమాస్తాలా—అయి ఊరుకున్నాడు.

'తీర్థ్, అన్ని ఇంగ్లీషు...తెలుగు పేపర్లు...ఇన్ని వార...మాస...పత్రికలు పట్టుకురా' అని హేమ పర్సులోంచి తీసి ఇన్ని పదిరూపాయల నోట్లు ఆతని చేతులలో పెట్టింది.

'ఇదిగో' అన్నాడు. హిగిన్ బాథమ్స్ దగ్గిరకు పరుగెత్తాడు.

అందరూ ఆమెను చూచేవారే! ఓహో ఎవరీ మహారాణి అనుకున్నారు. వచ్చే సైనికుడు-వెళ్ళే సైనికుడు ఆ పెట్టలోకి చూడడమే!

విద్యుచ్ఛామరాలు ఎంత గాలి విసురుతున్నా ఆమెలో ఏదో వేడి మూలాన...చెమటలు...చెమటలు! ఆమె చిన్న జేబురుమాళ్లు...ఎనిమిది తడిసి పోయాయి! రైలు కదలదేమి? ఏడీ...ఈఫూల్...ఏపనికి వెళ్ళినా...డాబుల ఆడపిల్ల...కులుకులు...అతి తెలివి?—ఏమిటీ ఉక్కపోత? ఏప్రిల్ ఆఖరివారం లోనే...త్యాగతి...ఏం చేస్తూ ఉంటాడు...ఏడిశాడు!...ఏడుస్తూ ఉంటాడు... అమ్మ!...అమ్మ ఎంత నీరసం?...ఏమిటి? గడియారం...గంటకో నిముషం చొప్పున...జరుగుతోందేమిటి?...ఇక పది నిముషాలలో రైలు కదులుతుందని ...వచ్చినా...పదినిమిషాలు పదివందల నిముషాలుగా...మారాయా? అమ్మయ్య ...ఈలవేశాడు...గార్డు - గంట...వచ్చాడయ్యా...ఈ జడ్డు...ఒహో తీర మిత్రుడు అందంగా నే ఉంటాడు! రైలు కదిలింది. కదలడంతో టే ఆమె పట్టి జావకడిలా ఓమూల కూలిపోయింది.

తీరమిత్రుడు ఫిలిప్పైన్సు పట్టించిన టోజోలా ఆనందంతో ఉప్పొంగి... ఆ రైలు తన కేర్పరచిన స్పెషలుబండిలా భావించుకున్నాడు. ఓహో ఇప్పటికి ...ఈ మూడుఏళ్ళ...మహోత్తమ కృషి...ఈనాటికి...ఫలించబోతోంది! ఈ ప్రపంచాద్భుత సమ్మోహనాంగి తన ప్రేయసీ—తానూ—అయిదు వేలు —పట్టుకువస్తోంది—చక్కని హోటల్సు—బొంబాయి-టాజ్ మహల్ చాలా అద్భుతంగా—ఉంటుంది—ఒకసారి తనలో ఈ బాలిక—కరిగిపోతే ఇక ఎప్పుడూ తనదే—తనదేనండయ్యా—ఈ కోటిపూవుల బాలిక—కోటి సినిమా తారల నిధి—ఈ కోటికోటి సువాసనలమూర్తి తనది... ఈమే! తానే! ఒక పడకగదిలో—ఇదివరదాకా — ఊహించుకొన్న — ఆమె సర్వాంగాలూ, ఆకులలోని గులాబిపూవు రేకలులా, ఆ పందిరిమంచంమీద నగ్నంగా— సిగ్గుగా—తన్ను ఆహ్వానిస్తూ—పవళించి ఉంటే తాను—నగ్నంగా—! రైలు వేగంగా వెళ్ళిపోతోంది- అతివేగంగా అతి మహా వేగంగా—వాయువేగ— విద్యుత్ వేగ—కాంతివేగ—ఆకాశగోళ వేగంగా—వెళ్తోంది—తీరమిత్రుని కాంక్షలు—ఊహలు—ఉప్పొంగు భావాలు — వేగంగా — అతివేగంగా వెళ్ళుతున్నాయి.

ఇంతసేపూ కుంగిపోయి కిటికిలోంచి హేమ చూస్తోంది. తీరమిత్రుడు ఆమెను కబళిస్తున్నాడు చూపులతో—కోర్కెలతో—తమిమీరిన భావాలతో- హేముకు దగ్గరగా చేరాడు. హేము దగ్గరగా కూర్చున్నాడు. అతని కళ్ళు యెరుపెక్కాయి! అతని ఊర్పులు వేగవంతం అయ్యాయి!

హేము తీరమిత్రునివైపు తిరగకుండానే, "తీర్! నా ఆలోచనల కేమీ భగ్నం కలిగించకు. బొంబాయి వెళ్ళి నా అనుమతి అయినదాకా నన్ను ముట్టుకోవద్దు. మన ఒప్పందానికి భంగం కలిగించకు" అన్నది.

# 30

హేమ కోపంతో వెళ్ళిపోయిన మరుసటిక్షణంలో త్యాగతి నిట్టూర్పు వదలినాడు. అతనికి మిన్నంటిన విచారము వచ్చినది. తాను చేసిన పనులన్నీ తెలివితక్కువవే. మదరాసులో మరదలను తనభార్యగా చేసుకొనడానికి ఈ ఇల్లు కట్టించుకోడం, ఆ ఇల్లు కొనడం. ఇక్కడే తాను శాశ్వతంగా ఉందామని ఎంచుకొన్నాడు కాబోలు? మనుష్యుల మూర్ఖత్వ ప్రవాహం అర్థంలేకుండా ప్రవహిస్తూ ఉంటుంది. తాను కైలాసానంద భారతీస్వామీజీ గురుపాదులను ఆశ్రయించి ఈ బాధలన్నింటినీ తప్పించుకోవలసినదే! ఎందుకీ ఆరాటము? ఎందుకీ వ్యర్థప్రయత్నం? ఎందుకీకతలు? ఎందుకు స్వామీ ఈ అయంపటాటోపం?

నెమ్మదిగా లేచాడు. అతని కళ్ళల్లో నీరు తిరిగింది. తలుపుతీసుకొని బౌద్ధచైత్యంలో ప్రవేశించాడు. బౌద్ధమూర్తి ఎదుట సమాలింగితభూతలు డయ్యాడు. లేచి కూర్చున్నాడు. పద్మాసనం వేసుకొని మనస్సు కుదుట పరుచుకోడానికి ప్రయత్నం చేశాడు. అతని మనస్సు తన ఇష్టంవచ్చినట్లే పోయింది. . తన్ను గోముఖవ్యాఘ్రంగా పోల్చింది. అందులో అంతా సత్యం. తన ఈడుకు ఆ పసిబిడ్డను వివాహం చేసుకోటానికి ప్రయత్నం చేయడం ఏమిటి? పురుషులంత హీనజంతువులు ఈ సృష్టిలోలేవు! హేమ చెప్పిన మాటలన్నీ నిజం. తన శకుంతల పోలికతో ఉన్న ఈ బాలిక దేహం వాంఛించి తా నెన్నిటికైనా సిద్ధపడ్డాడు. హేమ దేహాన్ని వాంఛించాడు. హేమ తెలివితేటలను వాంఛించాడు. హేమ వ్యక్తిత్వాన్ని వాంఛించాడు. ఎందుకు తనకీ అర్జున విషాదయోగం? చాలు తన శృంగార నాయకత్వం. అంతా చాలు! చాలు భగవంతుడా చాలు!

ఆత డక్కడనుండి లేచి, తల్లిదగ్గరకు వెళ్ళి, "అమ్మా, మనం వెంటనే హరిద్వారం పోవాలి! నా మనస్సులో నేను భరింపరాని బాధ తయారయింది. గురుదేవులను చూడకపోతే నాకు ప్రాణాలు నిలువవు. ఎల్లుండి ఉదయం ఇద్దరం కలిసి స్వామీజీదగ్గరకు ప్రయాణం!" అన్నాడు.

రంగనాయకమ్మగారు తెల్లబోయి కొడుకును చూచి, 'నాన్నా, స్వామీజీ శిష్యరికం స్వామిజీ వారిచ్చిన ఆదేశాలను పరిపాలించటంలో లేదు కాబోలు. ఇంత మనస్సును లోబర్చుకోలేనివాడ వయ్యావేమిటిరా నాన్నా?' అన్నది.

శ్రీనాథమూర్తి సిగ్గుతో మోము వంచుకొన్నాడు. "ఏదో మనస్సులో ఆవేదనలో అన్నాను. నాకు అన్నం పెడ్తావా?"

రంగ : మడికట్టుకురారా! హేమ వచ్చినట్లుంది. నాతో చెప్పకుండానే వెళ్ళిపోయిందేమిటిరా?

శ్రీనాథ: హేము వచ్చింది. నాతో మాట్లాడుతూ కూర్చుంది. ఏదో శాస్త్ర వాదనవచ్చి కోపంతో వెళ్ళిపోయింది.

రంగ: దానితో నీ కస్తమానం వాదనెందుకురా నాన్నా!

శ్రీనాథ: అమ్మా హేము ఈనాటిపిల్ల. ఎం. ఏ. కూడా! ఏ విషయమూ వాదించి ఒప్పించాలి. వాళ్ళ మనోగతులు వేరు. అందుకని ప్రతివిషయం ఆలోచించి హేమును నేను మంచి అనుకున్న దారిలో పెట్టడానికి ప్రయత్నంచేస్తున్నాను. ప్రయత్నం నెగ్గదేమో అన్న నిరాశ నాకు లేక పోలేదు.

రంగ: ఏమోరా నాన్నా. నాకు మీ పద్ధతులు ఏమీ నచ్చవు. ఏమిటో అంటారు. ఏమో చేస్తారు. ఏమి అనబోతారో, ఏమి చేయబోతారో, మాకు ఏమి ఆలోచించినా మనస్సుకు తట్టనే తట్టదు.

శ్రీనాథ: అమ్మా, నేను ఏమీ చెప్పలేను. కైలాసేశ్వరుని ధ్యానించుకుంటూ కూర్చుంటాను. ఆతర్వాత ఆయన ఇచ్ఛ.

అని శ్రీనాథమూర్తి భోజనం చేశాడు. మూడురోజులు ఎడతెగని ప్రార్థన చేసుకుంటూ ఉండేవాడు. బుద్ధమూర్తి వెనకఉన్న గదిలోనికిపోయి తలుపు వేసుకొని గంటలు ఉండేవాడు.

హేము తనపై కోపగించి అతివేగంతో వెళ్ళినరోజు ఆదివారం. ఆ ఆదివారం తర్వాత బుధవారం రోజున, చటుక్కున కల్పమూర్తి కారువేసుకొని ఎనిమిది గంటలకు త్యాగతి ఇంటికి వచ్చాడు. “త్యాగతిగారూ! ఒకసారి ఈలా వస్తారా? అత్యంత రహస్యవిషయం మాట్లాడాలి” అన్నాడు.

త్యాగతి: “ఏమిటది?” అని అడుగుతూ కల్పమూర్తితో వరండాలోనికి వచ్చాడు.

కల్ప: హేమును తీర్థమిత్రుడు ఎక్కడికో తీసుకుపోయాడు.

త్యాగతి గుండె ఆగిపోయింది. ‘ఆc!’ అన్నాడు. ఆతని మెదడులో మహారౌద్రాగ్నిజ్వాల లొక్కసారి గుప్పుమన్నాయి.

ఆ అత్యంత విపాదసంఘటన సమయంలోనూ భయంకర యుద్ధం ముందు ఏమీ చలించని సేనానాయకుడిలా ఆతడు ఒక్క సెకండులో గంభీర శాంతి వహించాడు. “ఈ సంగతి ఎవరికీ తెలియలేదుగదా?”

కల్ప: ఎవ్వరికీ!

త్యాగ: మీ కెవరు చెప్పారు?

కల్ప: తీర్థమిత్రునీ హేమును తీసుకువెళ్ళిన టాక్సీ మనిషీ, వినాయకరావుగారి డ్రైవరూ కలసి మా యింటికి వచ్చారు.

త్యాగతి: వాళ్ళెక్కడకు వెళ్ళినట్లు?

కల్ప: బొంబాయి మెయిలు ఎక్కారట!

త్యాగతి: ఎలా తెలిసింది?

కల్ప: టాక్సీవాడికి ఏదో అనుమానంవేసి, సెంట్రల్ స్టేషనులో వాళ్ళిద్దరూ సామాను పట్టించుకుని లోనికి వెడుతూంటే వాళ్ళిద్దరూ చూడకుండా లోపలికి వెళ్ళి బొంబాయి మెయిలులో ఎక్కుతూండగా చూశాడట. ఆ వెంటనే వాడు మన హేమగారి డ్రైవరింటికి వెళ్ళి తన అనుమానం చెప్పాడట. వాళ్ళిద్దరూ హేమగారిఇంటికి వెళ్ళి అక్కడ లోకాన్ని కనుక్కుంటే, లోకం వెళ్ళి హేమ గదిలో చూస్తే, హేమ గదిలో బల్లమీద లోకం పేరుతో ఓ కవరుందిట. ఆ కవరులో తాను తీర్థమిత్రుని గాంధర్వం చేసుకోబోతున్నాననీ, ఆ విషయం జాగ్రత్తగా తన తల్లిదండ్రులతో చెప్ప వలసిందనీ లోకాన్ని హేమ కోరిందట! లోకం వెంటనే ఆ టాక్సీమీద మా ఇంటికి వచ్చింది. నేనూ, లోకం నీకోసం పరుగెత్తుకొనివచ్చాం.

త్యాగ: లోకం ఏది?

కల్ప: నా కారులో ఉంది.

శ్రీనాథమూర్తి ఒకసారి కళ్ళు మూసుకొని కైలాసేశ్వరుని ధ్యానించాడు. ఒకసారి శకుంతలను ధ్యానించాడు. కల్పమూర్తీ! నీ కారులో గుంతకల్లు వరకూ వెళ్ళివచ్చేందుకు పెట్రోల్ సిద్ధంచేయి. లోకేశ్వరీ! ఇంటిదగ్గరకుపోయి మా అత్తగారితో మామగారితో మనం అంతా తిరుపతి కారుమీద వెళ్ళి వద్దామని బయలుదేరామని చెప్పు. పోదాముపద. నేనూ వస్తున్నాను. నీదగ్గర డబ్బుఉంటే అంతా జేబులో వేసుకురా. నాదగ్గిర రెండువందలున్నాయి, అవి పట్టుకువస్తున్నాను" అని చెప్తూ లోపలకు పరుగెత్తాడు.

## 31

ఆరాత్రి బొంబాయి మెయిలు బయలుదేరడం 6-45 గంటలకు. అందుకై హేమ పగలు పదిగంటలనుండి చల్లగా సర్దుకుంటూ ఉంది. తన పేరున బాంక్‌లో ఉన్న పన్నెడువేలలో డిపాజిట్లు రెండూ నాలుగువేలకూ, మూడు వేలకూ ఉన్నాయి. తక్కిన అయిదువేలూ తాను తీసివేసుకుంది. ఇంటిదగ్గిర తన స్వంత ఇనపపెట్టెలో పదమూడువందల రూపాయలున్నాయి. ఆ పద మూడు వందలలో, నాలువందల రూపాయిలు తీర్థమిత్రునికిచ్చి బొంబాయికి రెండు మొదటితరగతి టిక్కెట్లు కొని రిజర్వుచేయించమంది. తీర్థమిత్రునికి ఇచ్చిన నాలుగువందలు పోను తక్కిన తొమ్మిదివందలూ ఇంకా అయిదు వందలతో తోలుపెట్టెలు, పరుపుచుట్ట, హోల్డ్‌ఆల్, దిండ్లు, దుప్పట్లు, తువాళ్ళు చీరలు, జంపర్లు, లోనిలాగులు, బాడీలు, జేబురుమాళ్ళు వగైరా సామానంతో కొంది. అవన్నీ తీర్థమిత్రునే జాగ్రత్తచేయమంది. జంపరు వగైరాలు మంగళ వారమే అర్జెంటుగా కుట్టేటట్టు ఏర్పాటుచేసింది. ఇంటిదగ్గిరనుంచి ఒక వస్తువూ తీసుకునిరాదలచుకోలేదు. అనుమానాస్పదమౌతుందని ఆమె భయం.

అప్పటికీ కొన్ని చీరలు, జంపర్లు, అలంకారపు పెట్టెలు, చిన్న అన్నీ నెమ్మదిగా తీర్థమిత్రుడికి జేరవేసింది.

* * * *

ఆదివారం సాయంకాలం తాను తీర్థమిత్రునితో చెప్పినట్లుగా, హేమ బయలుదేరి అతణ్ణి సైదాపేట రైలుగేటుదగ్గిర కలుసుకొని, చెంగల్పట్టుదారి పట్టించింది తన కారును.

తీర్థమిత్రుడు హేమ తనకా కబురు చెప్పినప్పటినుంచీ ఈ లోకంలో లేడు. ఏదో మహామన్మథలోకంలో ఉన్నాడు. అతడు ఎగరవేసిన వక్రవాత్స్యాయనపతాక ఆకాశంలో కామదేవలోకానికి సమీపంవరకూ విజృంభించి పోయింది. అతనిపై మన్మథుడు మామూలు పూలబాణాలు వేయలేదు. ఇప్ప పువ్వులు, గసగసాల పువ్వులు, నాభిపువ్వులు, కసింతపువ్వులు, పుంఖానుపుంఖాలుగా దబ్బాటు వర్షంగా కురిపించాడు. అతనికి మదనజ్వరం 112 డిగ్రీలవరకు వెళ్ళింది.

ఇదివరకు తాను మన్మథమహాసామ్రాజ్య నిర్మాణం చేయడంలో పొందిన విజయాలు ఏగ్రీసు టర్కీ యుద్ధమో వంటివి. ఈరోజు పొందబోయే విజయం 1914 యుద్ధంవంటిది. ఈ హేమకుసుమసుందరీ దేహమే తాను నిర్వహింపబోయే కామరాజసూయయాగానికి యజ్ఞవేదిక. తనలోని కందర్ప రసజ్ఞత ఇంధనాలు. అందుకు మంత్రాలు తానూ హేమా మాట్లాడబోయే ప్రణయ వాక్యాలు. తనకు వచ్చే పురోడాశము హేమ మెత్తటి గులాబీ మొగ్గల పెదవుల్లోని సుధారసము. ఈ రాజసూయానికి బలి త్యాగతి శిశుపాలుడు. ఉడికిపోయే దుర్యోధనుడు కల్పమూర్తి.

సాయంకాలం కలియుగ మన్మథునిలా వేషం వైసేసుకొని, ఒళ్ళు చెక్కు చెదరకుండా ఉండాలని ట్రిప్లికేనునుంచి టాక్సీ వేసుకుని తీర్థ సైదాపేట చేరాడు. సాయంకాలం ఆరుగంటలకు హేమ తనకారుతో చక్కా వచ్చి, తలుపు తెరచి తీర్థమిత్రుని ఎక్కుమని, మళ్ళీ కారు నడుపుకుని చెంగల్పట్టు దారిపట్టింది. అతివేగంగా నడుపుకుంటూ పదిహేను మైళ్ళు వెళ్ళి కారు ఆపుచేసి దిగింది. తీర్థమిత్రుడూ దిగాడు. 'తీర్థ! నేనూ, నువ్వూ కలిసి బొంబాయి ప్రయాణం. నేను నీతో రావడం నా ఆవేదన చల్లార్చుకోనడానికే. అయినా నాకు యిష్టం వస్తే, నేను నీకు పెళ్ళితంతులేని భార్యను అవుతాను. అదీ బొంబాయిలో. అక్కడయినా నా ఇష్టంవస్తేనే. ఆ విషయంలో నేనేమీ నిశ్చయానికిరాలేదు. నేను నన్ను నువ్వు ముట్టుకోవచ్చు నన్నదాకా ముట్టడానికి వల్లకాదు. ఇవి నా షరతులు. ఇష్టం అయితే సరే అను, లేకపోతే, తిరిగి వెళ్ళిపోదాం' అన్నది.

తీర్థ: నాకు పరమఇష్టం. ఓహో! నా తపస్సు ఎన్నాళ్ళకు ఫలించింది! ఈలోగా ఒక్కసారి...

హేమ: ఛట్! వెధవ మొగతనం, నువ్వూనూ! నేనన్నమాటలు అలినిశ్చయంతో అన్నవి.

తీర: సరే, సరే! కాని ఓస్వప్నరాణీ! ఓ మహోజ్వల...
హేమ: ఫూల్, నోరుముయ్యి. నాకు ఈ ఉప్పుచప్పని, దొంగమాటలు అక్కర లేదు. వెనక్కుపోదాం.

అంటూ హేమ కారు ఎక్కింది. తీరమిత్రునికి వేయి మధురకలశాలు అతని తలపై దేవతలు గుమ్మరించినట్లయింది. ఏలా ఎక్కి కారుమీద కూర్చున్నాడో హేమకు దగ్గరగా జరిగి ఆమెను అంటుతూ కూర్చున్నాడు. 'తీర్! దూరంగా జరుగు. నా మాటలు వేళాకోళాలు కాదు' అని పళ్ళు బిగించి హేమ అన్నది. కథ అడ్డంగా తిరుగుతుందేమోనని తీరమిత్రుడు దూరంగా జరిగి కూర్చున్నాడు.

హేము సైదాపేట దగ్గిర అడయారు నది వంతెనమీద కారు ఆపుచేసి తీరమిత్రుని దిగమని, 'తీర్! నేను నీచేతికి టిక్కెట్లు వగైరాలకు డబ్బు ఇస్తాను. మనం బుధవారం ప్రయాణం. ఈలోగా సోమ మంగళవారాలు బీచిదగ్గిర కలుసుకోడం. అక్కడ నా సామాను నీకు అందిస్తాను' అని చెప్పింది.

ఆమె ఏర్పాట్ల ప్రకారం అన్నీ జరిగాయి. కాని రైలు కదలడంతోటే ఆమె చుట్టూఉన్న సర్వప్రపంచం ఒక్కసారి కుంగినట్టయింది. రైలుచక్రాలు తిరిగినకొలదీ, వానితోపాటు ఆమె ఆలోచనల భ్రమణమూ ఎక్కువైంది. రైలుచక్రాలు పట్టాలమీదనడుస్తున్నాయి. ఆమె ఆలోచనచక్రాలు శూన్యంలో నడుస్తున్నాయి. రైలుక్రింద చప్పుడుకూ, ఆమె హృదయం చప్పుడుకూ ఎక్కడా శ్రుతి అందడంలేదు. తీరమిత్రుని మొగంవైపు చూడలేకపోయింది. రైలు ఎక్కడకు పోతోంది? ఈ రైలు ఇంకో రైలుని ఢీకొని ముక్కలై పోతుందా? అందులో తానూ ఖండఖండాలుగా పడి ఉంటుందా?

## 32

రైలు అతివేగంగా పరుగుపెడుతున్నది. చిన్న పేటలు వెనక్కి మెరుములా మాయమౌతున్నాయి. చిన్న స్టేషనులు కనబడటం, ఇంతట్లో మాయమవడం! కొత్తకాలం అవడంవల్ల ఇంకా చీకటు రానేలేదు.

స్త్రీలకు భయంలేదా? ధైర్యంలేదా? ఇలా ఒక పురుషునితో పారిపోవడమా! చెన్నపట్నంలోనేఉండి, తాను తనకిష్టమువచ్చిన పురుషునితో నిర్భయముగా ఎందుకు జీవించలేక, ఈలా రహస్యంగా దొంగలా ఈ తీరమిత్రునితో పారిపోవడం? అని హేముకు తిరిగితిరిగి ఆ ఆలోచనే వచ్చింది. తాను తలిదండ్రులకు భయపడింది. త్యాగతికి భయపడింది. స్నేహితులకు భయపడింది. త్యాగతా? తనతల్లినికూడా తీసుకు దుఃఖాన్నుండి పారిపోయాడు. ఒక్కడూ తిరిగాడు. నీరసించిన మనస్సుతో సుశీల అనే ఆ అమ్మాయితో ఒకసారి...! అన్నీ పురుషునిలా చేశాడు. అదీ పురుషత్వం! ఏదో ఆశయం పెట్టుకున్నాడు. దానికై ఆస్తు లమ్మాడు. దేశాలు తిరిగాడు. మనస్సులో వచ్చిన భావాలన్నీ తనకు వ్రాసి చూపించాడు.

తానో! పిరికిపందలా ఈలా పారిపోయి వస్తోంది! తల్లిదండ్రుల సంగతి ఆలోచించిందా? వాళ్ళు తనమీద సర్వభారమూ ఉంచి, తనకు సర్వస్వతంత్రాలూ ఇచ్చి తనకై బ్రతుకుతూఉంటే, వాళ్ళవిషయం ఆలోచించకుండా... ఎందుకు ఇల్లా తాను తీర్థమిత్రునితో పారిపోయి వస్తూన్నట్లు? తన సర్వస్వం వదలి, ఆతన్ని అనుసరించేటంత ప్రణయం తీర్థమిత్రుడంటే ఉన్నదా?

ఓ హేమా! నువ్వు వెఱ్ఱిదానవు, నువ్వు చచ్చుదానవు! నువ్వు జజ్జమ్మవు. మగవాళ్ళకోసం ప్రాకులాడే జావకడి ఆడదానవు. మగవాడి చూపులు నిన్ను ఆనందంతో చూస్తే నువ్వు ఉప్పొంగిపోతావు. మగవాడి కోటు చివర నీ చీరను స్పృశిస్తే నువ్వు స్వర్గలోకం అందుకున్నా ననుకుంటావు. హేమకు తలతిరిగింది. తాను చదివిన చదువు దద్దమ్మ చదువు. ఎవరైనా చదవగలరు. ఎవరైనా పరీక్షలలో నెగ్గగలరు. ఒక్క గొప్పచిత్రమైనా వేయలేకపోయింది. ఒక సంగీత సభ పండితుల ఎదుట చేయలేకపోయింది. ఒక్కగ్రంథమైనా రాయలేక పోయింది. తనకంటె లోకేశ్వరినయం. పరీక్షలలో జయమంది, పాఠశాలో పాధ్యాయిని అయి, వంగోలులోఉన్న తన బీదకుటుంబానికి డబ్బుపంపి, పోషిస్తోంది. రేపు నిశాపతిని—జగత్ ప్రఖ్యాతికన్న జగపతిరావును—పెళ్ళిచేసుకోగలుగుతోంది! ఇంక భాగ్యవంతుల బాలిక అయిన తాను తండ్రి తనకై పెంచినడబ్బు చచ్చుపుచ్చు కర్చులు చేస్తూ, రక్తంపీల్చే దోమ జీవితం జీవిస్తోంది.

ఓహో! ఏమి గొప్ప ఆడది! స్త్రీ జీవితం తా నట ఉత్తమం చేయడానికి ...సంకల్పించుకొన్నదట! తనకోసం చెన్నపట్నం మకాం పెట్టుకొని, ఒక్క మాటవల్లనైనా, ఒక్క చూపువల్లనైనా, ఒక్క చేతవల్లనైనా మనస్సుకు ఈషణ్మాత్రం నొప్పి కలిగించకుండా, తన్ను దివ్యప్రేమకాంతితో నింపిన తన బావ అంటే వెఱ్ఱికోపం పడి, చెవులమీద కోపంతో ముక్కు కోసుకొన్నట్లు, తా నీ తీర్థమిత్రునితో, ఒక అతిబలహీనురాలైన ఒక స్త్రీ లేచి పారిపోయి నట్లు లేచి వెడుతోంది. తన తలిదండ్రులు ఈ సంగతి గ్రహించగానే చచ్చిపోయేమాట నిశ్చయం. అనుమానం లేదు. ఎంత చక్కని కూతురు తాను! ఎంత గొప్ప కూతురు! తాను అపరరుద్రమదేవి అనుకొంది! తాను అపర మృత్యుదేవి! తాను తీర్థమిత్రుని నిజంగా ప్రేమిస్తోందా? తీర్థమిత్రుణ్ణి ఏమీ అనకూడదని తన బావతో దెబ్బలాడి వచ్చి, ఇతనితో తాను లేచిపోతోంది.

మహాప్రళయం లోకాన్ని ఆవరిస్తుంటే, తాను చేయవలసిన కర్తవ్యం ఆలోచించుకోలేదు. పైగా ఒక నీరసపు ఏకాంకిక రాసి పురుషులను తిట్టించింది. ఛీ! హేమా! నువ్వు పరువులేనిదానవు. ప్రతిష్ఠలేనిదానవు. నీవన్నీ వట్టి డాంబికాలు. నీ ఆవేశాలు, నీ కోపాలు, నీ గడబిడలు, నీ సంవత్సరాది ఉత్సవాలు ఒక పిచ్చిదాని చేష్టలు. పెద్దకూతురు పోతే, నిన్ను దేవకన్యలా పెంచిన తలిదండ్రుల విషయం ఇంతైనా ఆలోచించని అతి అమానుష, స్వలాభ పూరిత హృదయంకల రెండవకూతురువు. నీ అందం నువ్వు చూసుకున్నావు.

నీ డాబులు నువ్వు పలుకు తున్నావు! నువ్వు నిన్ను చాటుకున్నావు. నువ్వు రాక్షసివి. పిశాచివి. తన తండ్రి పువ్వులా పెంచాడు. లోభి తన ధనాన్ని కాపాడుకొనేటట్లు తల్లి తన్ను కాపాడింది. వారికి తా నేమి ప్రతి ఇచ్చింది?

కల్పమూర్తి కుక్కకన్న, గుఱ్ఱంకన్న ఎక్కువగా తన్ను అనుసరించాడు. తన కనుసన్నల ఆజ్ఞను, ఒక పూర్వకాలపు సుల్తాను ఆజ్ఞలను బానిసలు నిర్వర్తించినట్లు నిర్వర్తించాడు. త్యాగతి మహోన్నత పురుషుడు. తన అక్క పేర లలితకళాశాల నిర్మిస్తాడట! ఆతడు పర్వతము, మహానది, సముద్రము, నిర్మలాకాశం!

ఇంతమంది ఉత్తములను ఏడిపించి తాను సఱ్ఱున ఈ తీర్థమిత్రునితో పారి పోయి వస్తోంది! తీర్థమిత్రుడంటే తన కేమీ ప్రేమలేదు. లేదని నిశ్చయం. ఎందుకని ఇతనితో...ఈలా...లేచిపోవడం?

కల్పమూర్తీ! నీతో లేచిపోతానంటే, అతడు ప్రాణం వదిలేస్తాడు. త్యాగతితో అంటే ఒక చిరునవ్వు నవ్వి చంటిబిడ్డను మారాము తీర్చినట్లు తీరుస్తాడు. ఈతడు పండులాంటి బిడ్డల సంగతీ ఆలోచించక, బంగారు బొమ్మలాంటి భార్య విషయం తలపెట్టక తనతో కామవాంఛ తీర్చుకోడానికి, 'రా' అంటే సిద్ధమై వచ్చాడు. తానో! తాను దేశసేవ చేస్తుందట! మానవ సేవ చేస్తుందట! తాను బోల్షివిక్కట! స్టాలిన్, లెనిన్, మార్క్సుల మానసిక శిష్యురాలట! పరిశుద్ధమైన అగ్నిలాంటి బోల్షివిజానికి ఈ కళంకం ఎందుకు ఆపాదించడం? తన ధ్యాగతి... తన త్యాగతా? ఛీ! అలా అనుకోడానికి తనబోటి దద్దమ్మ తగునా?

ఛీ! ఛీ! తన ఈ చచ్చు ఆలోచన లేమిటి? ఏం తప్పుచేశానని? తన ఇష్టం—తన రాజ్యం—ఎవరయ్యా ఈ విశాల ప్రపంచంలో తాను చేసిన పనిని తప్పు అని అనగలవారు? ఈ సంఘమట! పాడు సంఘం! ప్రతివ్యక్తి స్వాతంత్ర్యానికి అడ్డం. తా నొక పెద్ద డిక్టేటరా? మనుష్యుల జీవితాలు, కుటుంబాల జీవితాలు తన రాక్షసిచేతుల్లో నలిపివేసే భయంకర ఢాకిని ఈ సంఘం. ఎన్నివిధాల ఈ సంఘాన్ని నాశనం చేయాలో అన్నివిధాలా చేయాలనే కాదా తా నీ రకంగా చేస్తున్నది. అందులో ఈ సంఘం స్త్రీ పురుష సంబంధం విషయాల్లో మరీ మహామారణ పిశాచా! ఆ విషయంలో ధైర్యమున్న వీరనారులు ఏది సంఘం వద్దంటుందో అది అల్లాచేసి సంఘాన్ని నాశనం చేయాలి! సంఘంలో అరాజకత్వం తీసుకురావాలి! ఆ సంఘ రాక్షసత్వానికి ఎవరు తోడు పడతారో వారు ఎవరైనా సరే నాశనం కావాలి. తన తండ్రి నాశనం కావాలి. తన తల్లి నాశనం కావాలి. ఆమె బిడ్డలు నాశనం కావాలి. కల్పమూర్తి, లోకేశ్వరి, సోఫీ అంతా నాశనం కావాలి, తీర్థమిత్రుడు నాశనం కావాలి. తా నొక్కర్తే ఈ అఖండ స్మశానంలో ఈ మండే కాష్టాలు, ఈ కుళ్లే శవాలమధ్య నుంచోని, కొత్తసంఘం సృష్టిస్తుందీ! ఆహా అందుకు పురుషు డేడీ? ఎవరు? తామాలోకంతోపాటు...చావనీ...చావనీ...కొత్త సంఘం...

రైలు వేగంగా వెళుతూ చెవులు గింగురంటూ కూతకూసింది. హేముకు మెలకువ వచ్చింది. ఒక్కసారిగా లేచింది. నూటఇరవై రూపాయలు విలువ గల తన చేతిసంచి తీసింది,—ఏదో వెడనవ్వు, వికారపు మెరుగులు ఆమె మొగం ప్రసరించి, ఆమె మోమును భయంకర రేఖలతో నింపాయి. ఆ సంచి లోంచి వందరూపాయలవి నాలుగు నోట్లు తీసింది. అవి చేతితో పట్టుకుంది. రైలుపెట్టె తలుపుతీసి గుమ్మందగ్గర నిలుచుంది. రైలు తిరువెల్లూరు స్టేషను లోకి వచ్చి నిలిచింది. హేము తలుపు తీసినప్పుడు తీర్థమిత్రుడు హేమువైపు చూచి, 'జాగ్రత్త హేమూ!' అన్నాడు. హేము అలా నుంచోడం చూశాడు. నోట్లు చూడలేదు.

ఇంతలో గార్డు ఈలలు, స్టేషను గంటలు మ్రోగాయి. రైలు కదలడం ప్రారంభించబోయే ముందు హేము గుమ్మంలో నుంచే తీర్థమిత్రుని వైపు తిరిగి, 'క్షమించవోయ్ నన్ను. నేను పిరికిదాన్ని. ఇవిగో ఈ నాలుగు వందలూ' అంటూ ఆ నోట్లు సీటుమీదికి విసిరివేసి, క్రిందికిదిగి తలుపువేసి, తనసంచి చేతిలో విడిగా పట్టుకొని ఉన్న రైలుపెట్టె తాళంచెవితో రైలుకదిలి వెడుతుండగా తాళంవేస్తూ, 'నువ్వు దిగకు. నేను వెళుతున్నా. నాకు ధైర్యం చాలదు, పైగా నీమీద నా కేమీ ప్రేమలేదు' అంటూ రైలు వేగంకాగా ప్లాటుఫారంమీద నిలుచుండిపోయింది.

## 33

రైలువేగం ఎక్కువైంది. తీర్థమిత్రుడు తెల్లబోయాడు. వెంటనే హేముదిగిన గుమ్మందగ్గరకు వచ్చి తలుపు లాగితే రాలేదు. కిటికీలోనుంచి తొంగిచూశాడు. హేము ప్లాటుఫారం మీదనుంచి స్టేషనులోనికి వెళుతూంది. రాక్షసి! పిశాచి! అల్లా తన్ను అవమానపరిచి పారిపోయింది. ఈ మూడు రోజుల పని ముక్కలే! ఈలాంటి దొంగస్త్రీలను, పాడుస్త్రీలను బలవంతంగా పాడుచేసి నాశనం చేసేగాని లోకం బాగుపడదు. తన మగతనానికి తీరని అవమానం వేసింది. పోతేపోనీ. ఏదో నాలుగువందల సంపాదన అయింది. ఈ పెట్టెలూ మొదలయిన హేమూ సామానూ తనదే! రాక్షసి!

... ... ... ...

హేము రైలు కదలగానే వెనక్కు పోయింది. తిరువళ్ళూరునుంచి ఎనిమిదింటి కొకబండి, ఎనిమిదిన్నరకు ఒక బండి చెన్నపట్నం పోతాయి. అప్పుడైంది గం. 7-40 లు. ఆమె గడియారం చూచి, వెంటనే టిక్కట్లు అమ్మే స్థలానికిపోయి, మదరాసుకు సెకండుక్లాసు ఇమ్మని, కొనుక్కొని, తిన్నగా అవతలి ప్లాటుఫారము మీదకు వంతెన మీదనుంచి దాటి అక్కడ సిద్ధంగాఉన్న బండిలో, స్త్రీల రెండవతరగతిపెట్టె ఎక్కి కూర్చుంది.

ఆ పెట్టెలో ఇద్దరు యూరోపియను బాలిక లెవరో ఉన్నారు. వారిద్దరూ హేమువైపు తేరిపార చూచారు. ఒకామె హేమునుచూచి, 'మీరేనా,

స్త్రీల టెన్నిస్ పందెంలో సోఫీగారితో కలిసి మొదటిగా వచ్చింది' అని అడిగింది. 'అవును' అని హేమ నెమ్మదిగా అన్నది. ఆ ముక్కలు మండి పోయే హేమ హృదయాన్ని చల్లార్చినాయి. ఆమెకు కంటినీరు తిరుగ బోయింది. కాని అతికష్టంతో ఆ అశ్రువులు కళ్ళవెనకే ఆపుచేసికొని, ఒక చిరునవ్వు నవ్వింది.

బొంబాయి మెయిలులోంచి దిగటంతోటే, హేమకు కోటిబరువులు తలపైనుండి దొర్లి పాతాళంలో పడినట్లయింది. ఆమెకు కలిగిన స్వేచ్ఛా భావం స్వచ్ఛమైంది. ఆమె ఎన్ని యుగాలనుంచో తన్ను కట్టిన గొలుసును తానే నిశిత మహాపరశువుతో ఖండించిన ట్లయింది. ఏ బానిసత్వాన్నుండి తన్నుతాను విముక్తి చేసుకుంది? తననుండి తన్నే విముక్తి చేసుకున్నానని ఆమె ఆనందంతో ఉప్పొంగింది. తానే స్వప్నం తాల్చని, అర్థంకాని కుదురు కనని, భావశృంఖలాలను వేసుకొని తన చేతులకు, కాళ్ళకు, హృదయానికి, మనస్సుకు, జ్ఞానానికీ లంకెలు పోగుచేసుకొంది. తనచుట్టూ తానే గోడలు కట్టుకుంది.

తన బావ త్యాగతి ప్రోత్సాహంవల్ల, ఎన్నో వేదాంతగ్రంథాలు చదివింది. అవి తన మెదడులో అరగలేదు. భౌతికంగా స్వేచ్ఛ ఎవ్వరికీ లేదు. తాను తండ్రికి కుమార్తె కాకుండా ఎలా ఉండగలదు? ఆయన వెనక భట్టిప్రోలువారి తరాలెన్నో ఉన్నాయి. తనకూ తన తల్లికీ ఉన్న సంబంధమూ అంతే. తాను భారతీయ నారి కాక ఎట్లు? తన బంగారుదేహం పాశ్చాత్యాచ్ఛారుణ శరీరం ఎల్లా అవుతుంది? ఈలా ఎవరికైనా కుటుంబ, సంఘ, జాతి, దేశాల లంకెలుండనే ఉంటాయి. గాలి, నీరు, భోజనం లంకెలు! దేశకాల పాత్రలు లంకెలు! 'ఇంక భౌతికమైన స్వేచ్ఛ అంటే ఈ లంకెలతో శ్రుతి సామ్యస్థితికలిగి ఉండడమే' అన్న త్యాగతి మాటలు అఖండ సత్యవాక్కులు.

ఎవరైతే ఆ సామరస్యం కావాలనే పాడుచేసుకుంటారో, వారు తమకు తామై నిజమైన శృంఖలాలు తగిలించుకొంటారు. మనం చైతన్య రహితంగా పడిఉండడం అర్థంలేని స్వేచ్ఛ. చైతన్యం రాగానే ఆస్వేచ్ఛకు మనమే భంగం కలిగించుకొని శ్రుతిని సమకూర్చుకుంటే మాట్లాడుతాము, నడుస్తాము. ఆ శ్రుతి పోతే తల్లక్రిందుగా పడతాము. అడవి పెరగడం అయిదు నిమిషాలు. అడవి భూమిని వ్యవసాయభూమిగా చేయడం, ఆ భూమిని వ్యవసాయభూమిగానే ఉంచడం ప్రకృతికి అసత్యస్వేచ్ఛ తీసివేసి, నిజమైన స్వేచ్ఛ ఇవ్వడం. స్వేచ్ఛ అంటే మెదడును ఇష్టంవచ్చినట్లు పోనివ్వడం కాదుగదా! అయితే అది పిచ్చి అవుతుంది. కట్టుబాటులు నియమాలు నిజమైన స్వేచ్ఛ!

స్త్రీకూడా దేశానికి ప్రపంచానికి అభ్యుదయ కృషి అర్పించాలి. అది నియమాలతో జరగాలి. రైలుపట్టా తప్పితే రైలుకు స్వేచ్ఛలేదు. ఆవిరి ఇంజనులో లేక ప్రపంచం అంతా ప్రవర్తిస్తే దానికి స్వేచ్ఛా? మనుష్యునికీ అంతే!

తన నిరర్థక జీవితానికి ఈ శుభముహూర్తాన్నుంచీ స్వస్తి! తన శ్రీనాథమూర్తి బావతో కలిసి...తన శ్రీనాథమూర్తి బావా! ఉత్తమపురుషుడు. తనబావ ఉత్తమపురుషుడు అంటేనే ఇన్నాళ్ళనుంచీ తాను పూజించింది. ఆతన్నే తాను ప్రేమించింది. అతడే తన కుడిచేయి. అతడే తన జీవితానికి తరణి. అలాంటి బావను తాను ఎన్నిరకాలుగా బాధించింది. అతనితో చేయించరాని పనులు చేయించింది. అతని మనస్సు నొప్పించింది. తనవంటి తుచ్ఛురాలిని అతడు స్వీకరిస్తాడా! అతని ప్రతిఅణువూ తాను ప్రేమించింది. అతని ప్రతిమాటా తాను ప్రేమించింది. ఆ ప్రేమకాంతిలో తాను నిల్వలేకపోయింది.

'ఇప్పుడు టెన్నిస్ ఆడుతున్నారా? ఈ ఏడు టెన్నిస్ పందేలలో ఆడ్తారా? నిరుడు మీరూ ఒక పొడుగు పెద్దమనిషి, స్త్రీ పురుష జట్లు పోటీ పందేలలో మొదటి బహుమానం పొందారుకాదూ!' అని ఆ యూరేషియను బాలికలలో ఒకామె అడిగింది.

రైలు విల్లివాకం వచ్చింది. 'అవునండి. ఈ సంవత్సరం పందేలలోనూ పాల్గొనాలనే ఉంది' అని హేమ అన్నది. ఏమిటీ మధ్యమధ్య స్వప్నభంగం అని హేమ అనుకొంది. కాని వారూ తన బావను గూర్చిన స్వప్నంలో భాగమే అయ్యారు.

శ్రీనాథమూర్తి బావ ఎంత చక్కని టెన్నిస్ ఆడాడు! అతన్ని ఈ ఏడు ప్రోత్సాహంచేసి, టెన్నిస్ తాను ఆడించగలుగునా? ఛీ! ఛీ! ఎలాంటి పిచ్చి ఆలోచనలు? అతన్ని నానా దుర్భాషలాడి అతని ప్రేమను కాలితో తన్ని, ఒక హీనపశువులా, స్త్రీ ప్రేమను ఏమాత్రమూ గౌరవంతో చూడని ఒక నర నామక పశువుతో లేచిపోయి, అతనికి తనదేహంయావత్తూ అర్పించడానికి సిద్ధమైన తనని తనబావ దగ్గరకు రానిస్తాడా? రానివ్వకేం! ఒకనాడు సుశీలనాతడు చేరదీయలేదా? ఆ చేరనియ్యడం, ప్రభుత్వంవారి రక్షవంటిది. ఆ బాధనుంచేగా అతడు దేశాలన్నీ తిరిగి కైలాసం పారిపోయాడు! ఇప్పుడాతడు సంపూర్ణ పురుషుడు. అతనికి కావలసింది సంపూర్ణ స్త్రీ. తాను పదోవంతు స్త్రీయైనా కాదు.

ఇంతట్లో రైలు పెరంబూరు వచ్చింది. రైలు చెన్నపట్నం చేరుతోంది. తాను పారిపోయిన సంగతి, తన నీరసపు కాంక్షలు తలిదండ్రులకు తెలియ లేదుకదా! తలిదండ్రులకు ఆవార్త పిడుగులా సోకి నాశనం చేయలేదుగదా! లోకేశ్వరి ఏమనుకుంటుంది? కల్పమూర్తి ఉత్తముడు. అతడేమనుకుంటాడు? ఒకరిని గురించి ఒకరు ఏమనుకుంటారు? ఏమనుకుంటే ఏమి? 'ఏమనుకుంటారో!' అనే నీరసభావం భయం లోకాన్ని పూర్వకాలం నుంచీ తగలేసింది. మహాత్మాగాంధిజీకి లోకం ఏమనుకుంటుంది అనే ప్రశ్నలేదు. మనస్సు నిర్మలంగా ఉంచి, మన నడవడిని మనమే నిర్ణయించుకోవాలి. ఏమనుకుటుంది లోకం? అన్న గుడ్డిభయం పనికిరాదని ఎన్నిసారులో అన్నాడు. తానూ తన జీవితంలో తన్ను పరిశోధించుకుంటున్నది.

## 34

ఈ టెన్నిస్ తార ఏదో ఆలోచనలో ఉన్నదనీ, అందుకోసం జవాబులు సరీగా చెప్పటం లేదనీ ఆ యూరేషియను బాలిక లనుకున్నారు. ఎందుకు త్రివెల్లూరు దాకా వచ్చింది ఈమె ?

తన జన్మఅంతా ఒక పెద్ద ప్రహసనం అయిందని హేమ అనుకుంది. ఇంత వేళాకోళమై వెక్కిరింతలై ఇంతడబ్బు నీటిలా కర్చుచేస్తే కాని నిజం తెలియలేదు హేమకు. కొంతకాలం ఆలోచనలు ఏమీ లేకుండా పడిఉంది. మదరాసు స్టేషను వచ్చింది. హేమ లేచి, ఆ యూరేషియను బాలికలను క్షమాపణ అడుగుచు తా నత్యంత ముఖ్యమైన కార్యం విషయంలో మనస్సు లగ్నంచేసుకొని ఉండడంవల్ల తాను వారితో మాట్లాడలేక పోతినని చెప్పకొని, వీధిలోకి వచ్చి తిన్నగా ఒక టాక్సీని పిలిచి, అందులో అధివసించింది.

అప్పటికి రాత్రి 9-20 గంటలయింది. తిన్నగా ఇంటికి వెళ్ళి, ఇంటిలో అడుగుపెట్టింది. హాలులో వినాయకరావుగారూ, వారి డాక్టరుగారూ, పలువురు సేవకులు ఉన్నారు. పోర్చిలో కారు ఎవరిదా అంటూ లోపలికివచ్చింది హేమ !

తండ్రి హేమను చూచి ఒక్క ఉరుకునలేచి 'నాన్నా ! నాన్నా ! ఎక్కడికి వెళ్ళావు ?' అంటూ మొగంతిరిగి కుర్చీమీద కూలబడ్డాడు. డాక్టరుగారు రెండడుగులలో వారిదగ్గరకు వెళ్ళి, 'ఏమిటండీ ఈగడబిడ వినాయకరావుగారు ? మీరుకూడానా ?' అని అంటూ వెంటనే తన మందులపెట్టె కడకు ఉరికారు.

హేమ భయభ్రాంతయై గజగజ వణుకుతూ తండ్రి దగ్గరకు పరుగెత్తింది. డాక్టరుగారు వినాయకరావుగారి ముక్కుదగ్గిర హేమను ఒక సీసా వాసన చూపించమని చెప్పి, నాలుగు చుక్కలు 'నక్స్‌వామికా', ఇరవై చుక్కలు 'స్పిరిట్స్ అమ్మోనియం అరొమేటికా' వేసి నీళ్ళుకలిపి, కళ్ళు తెరచిన వినాయకరావుగారిచేత తాగించారు.

హేమ కళ్ళనీరు కారిపోతుండగా, 'నాన్నాగారూ ఏమిటీ కంగారు ?' అని తండ్రి పక్కను కూర్చుండి అడిగింది. వినాయకరావుగారికే కళ్ళనీళ్ళు తిరిగాయి. ఆయన దీనంగా కుమార్తెవంక చూస్తూ, 'మీ అమ్మ చావుబ్రతుకులలో ఉంది నాన్నా !' అన్నారు.

'అమ్మా !' హేమకు పట్టరాని దుఃఖం వచ్చింది. ఆమె అనుకున్నట్లే అయింది. ఈ మహావిషాదాని కంతకూ తానే నాయకురాలు అని ఆమె అమ్మకూ అర్థమైపోయింది కాబోలు. ఏలాఉంది తల్లికి ? ఆమె అతిదీనవదనంతో డాక్టరుగారి వైపుకు చూచింది.

డాక్టరుగారు హేమను చూచి, 'ఏం పరవాలేదమ్మా. మీ అమ్మగారిని బ్రతికించే భారం నాది' అన్నారు. 'నేను లోపలికి పిలువనంపగానే మీ అమ్మగారి దగ్గిరకు రా ; ఈలోగా మీ నాన్నగారితో మాట్లాడుతూ ఉండు'

అని డాక్టరుగారు లోపలికి వెళ్ళారు. హేము తండ్రివంక తిరిగి, 'నాన్నగారూ, ఏమిటీ గడబిడ అంతాను? అమ్మకు జబ్బేమిటి?' అని అతిదీనంగా అడిగింది.

వినాయకరావుగారు కొమరితవంక తీక్ష్ణంగా చూచి, 'నాన్నా, నువ్వు ఎక్కడనుంచి వస్తున్నావు?' అని ప్రశ్నించారు.

'నాన్నగారూ, నన్నిప్పుడేమీ ప్రశ్నించకండి. ఒక్కటి. మీరు నన్ను గురించి అనుమానపడవలసిన కారణం ఏమీలేదు. సర్వదేవతల సాక్షిగా నేను శకుంతల చెల్లెలిని, వెంకట్రామరాజ్యలక్ష్మమ్మగారి కూతురను. నా దేహము, నా ఆత్మ సీతాదేవి అవతారంలా నిర్మలాలు.' అంటూ దొనదొన కంటినీరు వెల్లువగా వస్తూవుంటే తుడుచుకొంది. వినాయకరావుగారు మరి మాటాడలేదు. కుమార్తెను దగ్గరగా తీసుకొని గుండెకదుముకున్నారు. ఆయన ఒక పెద్ద నిట్టూర్పు విడిచి, నిరర్థ్యంతరంగా కారిపోయే కంటినీరును తుడుచుకోవడం మానివేశారు.

డాక్టరు లోపలికి వెళ్ళినప్పటికి ఒక నర్సు రాజ్యలక్ష్మమ్మగారికి పరిచర్య చేస్తూ ఉన్నది. డాక్టరుగారు వెళ్ళి మంచందగ్గిర కుర్చీమీద కూర్చున్నారు. రాజ్యలక్ష్మమ్మగారి చేయితీసుకొని, నాడి పరీక్ష చేస్తూ 'రాజ్యలక్ష్మమ్మగారూ! ఇప్పుడు మీ వంట్లో ఇందాటికన్న నయమేనా?' అని అడిగారు.

రాజ్య: (నీరసంగా సన్నని గొంతుకతో) నయమేనండి. ఎందుకండి నయం డాక్టరుగారూ?

డాక్ట: ఈపాటికి వాళ్ళు వస్తూ ఉండవచ్చును.

రాజ్యలక్ష్మమ్మగారు 'ఎవరండీ' అంటూ నీరసంగా ఆ డాక్టరుగారివైపు మొగం తిప్పింది.

డాక్ట: మనవాళ్ళే!

రాజ్యలక్ష్మమ్మగారు మాట్లాడకుండా డాక్టరుగారి వైపు చూస్తున్నది.

డాక్ట: మీ నాడి చాలా బాగుంది. అచ్చా! వీరందరూ ఎప్పుడూ తిరగడమే! ఇంకా వచ్చారుకాదేమో?

రాజ్య: ఎవరండి?

డాక్ట: మనవాళ్ళేనండి హేము వాళ్ళూనూ!

రాజ్య: హేమా? హేము...?

డాక్ట: హేము నాతో చెప్పింది. నలుగురం కలిసి ఇక్కడే ఒకదగ్గిర ఊరు చూసి పదిలోపుగా వస్తామని. ఇంకా వచ్చిందికాదే?

రాజ్యలక్ష్మమ్మగారు మాటలేకుండా తెల్లబోయి చూస్తున్నది.

డాక్టరు నాడి పరీక్ష చేస్తూ, కొంచెం నాడి ఒడుదుడుకుపడడం కనిపెట్టి 'ఆఁ... హేము ఇంకా వచ్చిందికాదు. పోనీ లోకేశ్వరి ఎక్కడకు వెళ్ళిందో? హేము సరిగా పదిలోపుగా వస్తానని నాతో చెప్పింది. త్యాగతిగారూ, ఆమె ఒక కారులో కూర్చుని ఉన్నారు. నర్సు, నువ్వువెళ్ళి అమ్మాయి వచ్చిందేమో చూడు.'

రాజ్య : అమ్మాయి రాదండి. మీతో పదింటిలోపుగా వస్తానందా?
డాక్టరు : (రాజ్యలక్ష్మమ్మగారి మాటలు విననట్లు నటించి) త్యాగతిగారూ ఆమాటే అన్నారు. ఎప్పుడు నాకు వాళ్ళిద్దరి కారు కనబడింది చెప్మా? ఆరున్నర...కాదు...ఆరూ ఇరవై ఇంటికి...ఆఁ...అవును ఆరూ ఇరవై ఇంటికే!

నర్సు నవ్వుతూ లోపలికి వచ్చింది. డాక్టరుగారూ రాజ్యలక్ష్మమ్మగారూ నర్సువైపు చూచారు.
నర్సు : త్యాగతిగారు తమ అత్తగారిని చూడవచ్చునా అని అడుగుతున్నారు.
డాక్ట : త్యాగతిగారూ చూడవచ్చును, హేమగారూ చూడవచ్చును.
నర్సు : తండ్రీ కూతుళ్ళిద్దరూ కంగారుపడుతూ కూరుచుని ఉంటే, రాజ్యలక్ష్మమ్మగారికి బాగా కులాసాగా ఉందని చెప్పానండి డాక్టర్.
రాజ్య : (కొంచెం దృఢపడిన కంఠంతో) తండ్రీ కూతుళ్ళిద్దరూనా?
డాక్ట : ఏ తండ్రీ...మన ఇంట్లో ఉన్న తండ్రే. వినాయకరావుగారూ... అయితే నర్స్, హేమగారూ వచ్చారేమిటి?
నర్సు : వారంతా వచ్చి పదినిముషాలయిందనుకుంటాను.
డాక్ట : అంతా అంటే?
నర్సు : త్యాగతిగారు, కల్పమూర్తిగారు, లోకేశ్వరిగారు, హేమగారూ.
రాజ్య : మా హేమ వచ్చిందా! (ఆమెగుండె చాలా వేగముగా మోగుతున్నది.)
డాక్టరు : నర్స్, వాళ్ళంతా ఎక్కడికి వెళ్ళినట్లు?
రాజ్య : ఎప్పుడూ ఏదో చోటుకు షికారు వెడుతూనే ఉంటారండి. (ఆమె నాడి చాలా నిదానత పొందింది.)
డాక్టరు : నర్స్! నువ్వు ఇక్కడ కూర్చో, వాళ్ళ నలుగుర్నీ లాక్కునివస్తాను.

డాక్టరు హాలులోకి వచ్చాడు. డాక్టరుగారు హాలులోకి వచ్చేసరికి, హేమ తండ్రిదగ్గిర కూర్చుని ఉంది. లోకేశ్వరి వినాయకరావుగారి అవతల పక్కగా నిల్చుని ఉంది. త్యాగతి బల్లదగ్గిర నిలుచుండి, ఆ హాలులో ఉన్న నూనెరంగుల చిత్రాలు చూస్తూ ఉన్నాడు. కల్పమూర్తి ఒక కుర్చీలో కూర్చుండి సిగరెట్టు కాల్చుకుంటూ పైకి చూస్తున్నాడు.

డాక్టరుగారు త్యాగతిని చూచి, 'ఏమండీ త్యాగతిగారూ, మీ అత్తగారు మిమ్మల్ని రమ్మంటున్నారు. మీ నలుగురు ఈ ప్రపంచం అంతా చక్కర్ కొట్టి వస్తున్నారని రాజ్యలక్ష్మమ్మగారితో చెప్పాను సుమండీ! ఆ ముక్కలే జాగ్రత్తగా చెప్పండి వారితో.' అంటూ, 'రండి అందరూ. త్యాగతిగారూ, హేమగారూ, హేమగారి కారులో కూర్చునికాదూ నాకు కనబడింది? అప్పుడు సాయంకాలం ఆరున్నర అయివుంటుంది. సాక్ష్యం బాగా చెప్పకపోతే జడ్జీగారి తీర్పు వ్యతిరేకం అవుతుంది. లోకేశ్వరిగారూ, మీరు కారు వెనకసీటులోనా?' అన్నారు.

అందరికీ అర్థమైంది. అందరూ లోనికి వెళ్ళారు. రాజ్యలక్ష్మమ్మగారి దగ్గరకు హేము వెళ్ళి, 'అమ్మా, ఏమిటే ఈ గడబిడ? బావా, నేనూ, వాళ్ళూ షికారు వెళ్ళి వచ్చాము' అన్నది. రాజ్యలక్ష్మమ్మగారి గుండెనుంచి కోటి బరువులు తీసివేసినట్లయింది. త్యాగతి అత్తగారి చేయి తీసుకుని నాడిచూసి, 'అత్తయ్యగారూ, మా అమ్మకోసం కారు వెళ్ళింది. ఈపాటికి వస్తూ ఉంటుంది. నాడి చాలాబాగా ఉందే! ఇంకా నయం. నేనూ హేమా వీళ్ళూ మా ఇంటి దగ్గిర భోజనంచేసి, సినిమాకు వెడదా మనుకున్నాము. హేమే ఏదో బెంగగా ఉందని చెప్పి సినిమా ప్రోగ్రాం మానిపించింది' అని అన్నాడు.

## 35

హేము తల్లిపక్కలో అలాగే ఆమె చేయిపట్టుకుని కూర్చుంది. కొమరిత చేయిపట్టుకొని రాజ్యలక్ష్మమ్మగారు నిదురపోయారు. నెమ్మదిగా దగ్గరగా జరిగి, హేము కదలకుండా అలాగే కూర్చుంది. ఏదో మహత్తరమైన శాంతి ఆమె జీవితం అంతా ప్రసరించినట్లయింది. ఆమె చిన్నబిడ్డ అయినట్లు తోచింది, అల్లా తనతల్లి దేవతలా నిదురపోతోంటే చూస్తూన్న హేము హృదయంలో వేసవికాలంలో సముద్రపుగాలి తిరిగిన వెనక దేశంఅంతా సుఖం ప్రసరించు తున్నట్లు, ఆనందం అలుముకున్నది. తాను ఏలా తీరమిత్రునితో అలా వెళ్ళి పోడానికి సంకల్పించుకొన్నట్లు? ఎందుకు అలా త్రివెల్లూరు స్టేషనులో దిగి పారిపోయి వచ్చినట్లు?

త్యాగతి, కల్పమూర్తి, లోకేశ్వరి అవతలికి వెళ్ళిపోయారు. వారు ముగ్వురు హాలులోకి రావడంతోటే గ్రంథాలయం గదిలో ఉన్న టెలిఫోను మోగింది. త్యాగతి ఆ గదిలోకి వెళ్ళి టెలిఫోను చెవిదగ్గర పెట్టుకొన్నాడు.

త్యాగతి: 'హల్లో! నేను త్యాగతీ శర్వరీభూషణుణ్ణి. ఇది వినాయకరావుగారి ఇల్లు. ఆ! నేను తీరమిత్రుడుగారిని బాగా ఎరుగుదును. ఊఁ! ఏమిటీ? తీరమిత్రుడుగారి భార్య, చీర అంటించుకొంటే మీరు వెళ్ళి గొంగళీకప్పి ఆర్పినారా? వెంటనే ఆస్పత్రిలో చేర్చాలి, ఇదిగో కారు తీసుకువస్తున్నా. ఎవరో లేడీడాక్టరుగారు వచ్చారా? మంచిది. ప్రాణాపాయం లేదుగద? ఇదిగో వస్తున్నా, అక్కడే చెప్పొదురుగాని, అంతట్లో ఆస్పత్రికి అంబ్యులెన్సుకు ఫోనుచేయండి! ఆఁ.'

త్యాగతి ఫోను పెట్టివేసి, హాలులోకి రెండడుగులు వేసి, కల్పమూర్తిని, లోకేశ్వరిని, తనతో రమ్మని, మామగారితో కారు తీసుకువెళ్ళుతానని చెప్పి, ముగ్గురూ కలిసి ట్రిప్లికేను వెళ్ళారు. వీరు అక్కడికి వెళ్ళేసరికి అంబ్యులెన్సు కారూ వచ్చివుంది. ముగ్గురూ మూడంగలలో మేడెక్కారు. ఒక లేడీ డాక్టరుగారున్నారు. నౌకరు, నర్సులు కనకలత గదిలో ఉన్నారు. లోకేశ్వరి లోనికి పోయింది.

కనకలత ఎడమచేయీ, వీపూ కాలింది. ఆమె నిస్పృహాలో అతిసీర సంగా ఉంది. లోకేశ్వరి లేడీడాక్టరుగారి మొగం చూచి, 'అమ్మా, మా హేముకూడా వస్తానంది. వాళ్ళమ్మ కేదో జబ్బుచేయడంవల్ల రావడానికి వీలులేకపోయింది' అన్నది. కనకలత కళ్ళు తెరచి లోకేశ్వరిని తీక్షణంగా చూసింది. లోకేశ్వరి కనకలత దగ్గరగా వెళ్ళింది. 'హేము ఎక్కడికీ వెళ్ళ లేదా' అని కనకలత ప్రశ్నించింది.

'కనకం, మేమంతాకలిసి మహాబలిపురం వెళ్ళి వచ్చాం. మీ ఆయన తన కంపెనీ పనిమీద బొంబాయి వెడుతూంటే మేమంతా సాగనంపే వెళ్ళాం. హేమును పిలవనంపనా?' అని లోకేశ్వరి అంది. కనకలత మోమువిడింది. 'వద్దులే' అని నీరసంగా అంది.

వెంటనే ఆమెను జనరల్ ఆస్పత్రికి అంబ్యులెన్సుమీద తీసుకుపోయారు. లోకేశ్వరీ, త్యాగతీ, కల్పమూర్తీ కూడా జనరల్ ఆస్పత్రికిపోయి పొయ్యిలో నిప్పుకొంగు అంటుకొని ఈ ఆపత్తు జరిగిందని అక్కడచెప్పి, ఆమెను వైద్యాలయంలో ప్రవేశపెట్టించారు. కట్లుకట్టగానే లోకేశ్వరి కనకలతతో "కనకం, నీభర్తను నువ్వు అనవసరంగా అనుమానించావు అని నా ఉద్దేశం. నువ్వు ధైర్యంతో ఉండు. నీవు ఏమీ అనుమానానికి తావులేదు. భగవంతుని సాక్షిగా చెబుతున్నాను. నువ్వుబ్రతకాలి సుమా! పండులాంటి నీబిడ్డల్ని మరిచిపోకు. నీభర్త పూర్తిగా మారిపోయే రోజులు వచ్చాయి. నేనూ వివాహం చేసుకుంటున్నాను తెలుసునా?" అన్నది.

'ఎవరిని?' అని కనకలత అడిగింది.

'నిశాపతిగారిని' అంటూ లోకం చిరునవ్వుతో ఉప్పొంగింది. కనకలతా నవ్వింది. 'రేపువచ్చి నీ దగ్గిరే ఉంటా' నని చెప్పి లోకేశ్వరీ, త్యాగతీ, కల్పమూర్తీ వెళ్ళిపోయారు.

త్యాగతి తన ఇంటికి వెళ్ళాడు. ఆతనికి రాత్రంతా నిదురలేదు. ఏస్టేషనులో హేము దిగివచ్చింది? త్రివెల్లూరు దగ్గిర అయి ఉంటుంది. సెంట్రల్ స్టేషనులో అయితే ఆవరకే వచ్చి ఉండవలసింది. అటు తీరమిత్రునిభార్య దేహం కాల్చుకుంది. ఉత్తమ యిల్లాలు. పండువంటి భార్యను ఆ రాక్షసుడు గంగలో కలిపివేయడుకదా? ఇదా ప్రపంచధర్మంకై జీవితనటన? హేము తిరిగి రావడానికి ఏమిజరిగింది? హేముకూ తీరమిత్రునికీ ఎంతవరకూ వెళ్ళింది? హేము తీరమిత్రునికి తన దేహం అర్పించుకుందా? ఆమెగతి ఏమిటి? ఎక్కడికి పోతోంది ఈ సంఘం? వారిద్దరూ మర్యాదలు అతిక్రమిస్తే వారిదరికీ వివాహం ఒక్కటే గత్యంతరం అవుతుంది. అప్పుడు కనకలత ఏమవుతుంది?

ఈ నాటకంలో తానే ప్రతినాయకుడు అయ్యాడు. తానువచ్చి హేమును వివాహం చేసుకొనడానికి ప్రయత్నించకుండా ఉంటే? ఆ ప్రయత్నించడమూ ఏదోపిచ్చిరకంగానే! తన్ను తాను నాటకంలోలా తెలుపుకో

కుండా ప్రయత్నించేసినట్లు. దీనితో ముక్కుపచ్చలారని హేమకు ఒక విప్లవస్థితి వచ్చిపడింది. తానసలు మదరాసే రాకుండా ఉంటే, ఏది ఎట్లా జరిగిఉండునో ? ఎదురుగుండా తాను ఉంటే హేము మనస్సును ఇంకా పాడుచేసినవాడవుతాడు. ఏదో వంకపెట్టుకొని తానీ ఊరునుంచి మకాం ఎత్తేయాలి. చాలు! తానింతవరకు ఇతర జీవితాలను దగ్ధంచేసింది చాలు! ఇక్కడనుంచైనా తానితరుల జీవితాలతో సంబంధం కలుగజేసుకోకుండా మిగిలిన జీవితం గడిపినన్నాళ్ళు గడపవలసిందే!

ఇందులో ఎవ్వరికీ ఆవేశాలు ఉండకూడదు. హేము ఎంతబాధపడిందో ? ఏదో ఆడుతూ, పాడుతూ, అల్లరిచేస్తూ బాలికాత్వం ఇంకా వీడనిబాలకు ఏవేవో వెఱ్ఱిసమస్యలన్నీ పెట్టి అనవసరపు కలతలు తీసికొనివచ్చాడు తాను. ...ఈ రోజు కనకలత జీవించకపోతే ఆచావుకు తానే కారణం అవుతాడు. కావలిస్తే లోకేశ్వరి పెళ్ళికి ఒకసారి వచ్చి చూచిపోవచ్చును.

ఆ మర్నాడు త్యాగతి తల్లి హేముగారి ఇంటిదగ్గరనుంచి వచ్చీ రాగానే ఆమెను చూచి, 'అమ్మా! మనం కొల్లిపర వెళ్ళాలి. నేను పెట్టదలచుకొన్న శకుంతలా లలితకళాశాల అలా ఉండిపోయింది. ఇంక వెళ్ళి పనిప్రారంభిస్తాను.'

రంగ: నాన్నా, ఈ ఇల్లూ అవీ ?

త్యాగ: ఇవి ఇలాగే ఉంటాయి. నేను మధ్యమధ్యవస్తూ ఉంటాను. ఆ కళాశాల బాగా పని ప్రారంభించగానే ఇక్కడికి వచ్చేస్తాను. ఇక్కడ పురుషులకు లలితకళాశాల ఏర్పాటుచేస్తాను. నువ్వు అత్తగారికి బాగా కులాసాకాగానే కొల్లిపర వచ్చేయి. లేదా ఇక్కడే ఉండటం మంచిది.

రంగనాయకమ్మగారు ఏమీ మాట్లాడలేకపోయింది. సరేనని తలఊపింది. తల్లిభావం త్యాగతి గ్రహించాడు. అయినా తన ధర్మం తాను నెరవేర్చాలి గదా! ఆ సాయంకాలం పెట్టే బేడా అన్నీ సర్దుకొని, తల్లిని హేముగారింటి దగ్గర దిగవిడిచి, సెంట్రల్ స్టేషనుకుపోయి కలకత్తా మెయిలు ఎక్కాడు.

## 36

కనకలత ఒళ్ళు కాల్చుకున్న మర్నాడు ఉదయానికే తీరమిత్రుడు చెన్నపట్నం వచ్చాడు. హేమసుందరి త్రివెల్లూరు స్టేషనుదగ్గర దిగిపోతుందని అతను కలలోనైనా అనుకోలేదు. అతడు మండిపోయాడు. అతికోపంతో అతడు ఏడ్చాడు. రైలులో నుంచి ఉరుకుదా మనుకున్నాడు. అలా ఉరకడం చూసేవా రెవరూ లేక మానివేశాడు. మాట్లాడకుండా ఆ మెత్తటి సీటుమీద పడుకొన్నాడు. దొర్లాడు. చేతికి దొరికిన పండు దొర్లుకు పడిపోయింది. తన మగతనానికి ఎంత తీరని అవమానం! తన చరిత్రలో ఈలాంటిది ఎప్పుడూ జరగలేదే. షడ్రసోపేతమైన భోజనం పెట్టి, ఆ విస్తరి మళ్ళా లాగివేసినట్లయింది!

హేము వట్టి దద్దమ్మ; ధైర్యంలేని పిరికి చచ్చమ్మ. ఇలాంటి వాళ్ళను కాళ్ళూ చేతులు కట్టేసి, చీరలు, జంపర్లు, బాడీలు ఒలిచి, బలవంతంగా...

నాశనం చేయాలి. కానీ, తాను ఇంతటితో వదులుతాడా ఆ వలువలరాక్షసిని ? దీనిలోని సౌందర్యరసం యావత్తూ పీల్చి, ఆ త్యాగతికి పిప్పిమాత్రం వదలాలి. ఏమో ! హేమువంటి చదువుకున్న బాలిక తనకు లొంగుతుందా? పైగా ఉద్యోగానికీ ముప్పు రావచ్చును. ఏ త్యాగతికో కోపం వచ్చిందంటే, ప్రాణం పోయి ఊరుకుంటుంది. ఇప్పటికే వాళ్ళు మండిపోతూ ఉంటారు. రైలు ఆర్కోణం వచ్చింది.

ఎన్నో ఆనందాలు ఊహించుకొన్నాడు తాను. అసలు హేము ఈ బొంబాయి ప్రయాణం ఏర్పాటుచేస్తే తానెందుకు ఒప్పుకోవాలి? ఈ లాంటి బాలికలతో తెరచాటున...సంచరించాలిగాని, ఈ విధంగా బరిమీద పడితే. ఎన్నో ముప్పులు వస్తూ ఉంటాయి. హేము దిగి వెళ్ళిపోవడమే మంచిదయింది. తన మేనేజరుకు ఈలాంటి విషయం తెలిసిందా తన పని క్షవరం. తానూ చల్లగా తిరిగి మదరాసుకు పోతే, అటునుంచి నరుక్కురావచ్చును. అన్నీ సర్దుకొని తీర్థమిత్రుడు రేణిగుంటలో దిగాడు. బొంబాయినుంచి వచ్చే మెయిలు తెల్లవారగట్లకు వచ్చినది. అందులో ఎక్కి తెల్లవారగనే మదరాసువచ్చాడు. మదరాసు సెంట్రల్‌లో టాక్సీకారు చేసుకొని అతడు ఇంటికి చేరాడు.

ఇంటిలో అడుగు పెట్టగానే, క్రిందనున్న ఇంటియజమాని ఇల్లు వదలిపెట్టి వెళ్ళిపోవలసిందని నెల నోటీసు చేతిలో పెట్టాడు. ఆలోచనకు తావులేక తీర్థమిత్రుడు మేడపైకి వెళ్ళగానే పిల్లలందరూ ఘొల్లుమన్నారు. తీర్థమిత్రుని అయిదు ప్రాణాలు పైకెగిరిపోయాయి. క్రిందటి రాత్రిరాత్రే లోకేశ్వరీ, కల్పమూర్తి, త్యాగతీ పిల్లలకోసం, ఆ ఊళ్ళోనే ఉన్న తీర్థమిత్రుడుగారి దూరపు చుట్టాలలో ఒకాయననూ, అతని భార్యనూ, బిడ్డలనూ, అతని అక్కగారినీ తీసుకువచ్చి తీర్థమిత్రుడుగారి ఇంట్లో దిగబెట్టారు.

ఆ చుట్టపాయన వరండాలో కూర్చుని ఆరోజు పేపరు చదువుకొంటున్నవాడు తీర్థమిత్రుడు పైకి రాగానే, 'ఓరి పశువా! ఎంతపని చేశావురా ?' అన్నాడు. పిల్లలు ఘొల్లుమంటూనే ఉన్నారు. తీర్థమిత్రుని చుట్టపాయన అక్కగారు వంటింటిలోనుంచి వచ్చి 'నాయనా! వచ్చావు. ఇంతకన్న పెళ్ళాన్ని బిడ్డల్ని ఒక్కసారే విషమిచ్చి చంపేయలేకపోయావూ!' అని కళ్ళనీళ్ళు పెట్టుకున్నది. తీర్థమిత్రుడు కాళ్ళు చచ్చుపడి అక్కడ ఒక కుర్చీమీద చతికిలపడ్డాడు.

చుట్టపాయన : నాయనా ! నీ భార్య నిన్నుగూర్చి చీర అంటించుకుంది. జనరల్ ఆస్పత్రిలో చావుబ్రతుకులమీద ఉంది.

చుట్టపాయన అక్క : నయమే ! పిల్లల్ని తన్తో కలుపుకొని అంటించుకొంది కాదు ! ఎందుకు నీబోటివాళ్ళు పుట్టి ?

తీర్థమిత్రుడు మాటలురాక తెల్లబోయి చూస్తున్నాడు. చుట్టపాయన చూపులు మండిపోతున్నాయి. చుట్టపాయన అక్క కళ్ళనీళ్ళు తుడుచుకొంటు

న్నది. తీరమిత్రుని ఆడపిల్లలిద్దరూ తండ్రిదగ్గరకువచ్చి, అతని ఒళ్ళోవాలి... 'అమ్మ చచ్చిపోయింది నాన్నా! అమ్మ ఏది నాన్నా? అమ్మ కావాలి నాన్నా! అమ్మను తీసుకురా నాన్నా!' అని గుండెలు అవిసేటట్లు ఏడవడం ప్రారంభించారు.

చుట్టపాయన: నీ భార్య నీ మీద ఏదో అనుమానంపడి, చీర అంటించుకుంది. కాని వెంటనే గొంగళీకప్పి, ఇంటిఆయన ఆర్పివేయడంచేత బుజం క్రింది భాగమూ, ఎడమ రెక్కా కాలాయిట. వెంటనే మూర్ఛపోయిందట. ఆయన వెంటనే పరుగెత్తి, వినాయకరావుగారి ఇంటికి ఫోనుచేస్తే, వాళ్ళెవరో కారుమీద వచ్చారుట. ఇంటాయనే జనరల్ ఆస్పత్రివాళ్ళకూ లేడీ డాక్టరుకూ ఫోనుచేస్తే, వాళ్ళు అంబ్యులెన్సు కారు తీసుకువచ్చారట. మీ ఆవిణ్ణి వాళ్ళంతా ఆస్పత్రికి తీసుకుపోయి ప్రవేశపెట్టారట. ఒక కారుమీద శ్రీనివాసరావుగారూ వారూ మాకోసం వచ్చి, మమ్మల్ని తీసుకువచ్చి ఇక్కడ దిగబెట్టి వెళ్ళారు. ఇప్పుడు నేను ఆస్పత్రికి వెళ్ళి ఎల్లా ఉందో కనుక్కు వస్తాను. నువ్వు పిల్లలదగ్గర ఉండు. సాయంకాలం నీ కిష్టమైతే, డాక్టర్లు ఒప్పుకుంటే వెళ్ళి చూచివద్దువుగాని.

తీరమిత్రుడు కళ్ళనీళ్ళు కారిపోగా వెక్కి వెక్కి ఏడ్వు ప్రారంభించాడు. తనచేతులారా భార్యను చంపుకున్నాడు. తాను హంతకుడు. ఉరిశిక్షకు పాత్రుడు. తీరమిత్రుని చుట్టం ఎందుకీ దొంగ ఏడ్పులు ఈ బుడిబుడి దుఃఖాలు, అని అసహ్యించుకుంటూ వైద్యాలయానికి వెళ్ళాడు. దారిలో అతనికి తీరమిత్రుని గురించి ఆలోచనలే. ఈలాటి నీరసపు కుంకలకు మాట్లాడితే ఏడుపులు! వాళ్ళ విచారాలు, వాళ్ళ ప్రేమలు నీటిలో రాతలు. మెత్తటి బురదహృదయాలు వీళ్ళవి. పెళ్ళాం చస్తే పెద్దపెట్టున లోకం దద్దరిల్లేటట్లు ఏడుస్తారు! ఆమర్నాడో, ఆ మరుసటినాడో ఇంకోపిల్లను పెళ్ళిచేసుకుంటారు. జానకిరామమూర్తి (తీరమిత్రుడు) వంటివాళ్ళు తెల్లబొద్దింకలు. ఆ ఆలోచనవల్ల అతనివళ్ళు జలదరించింది.

జనరల్ ఆస్పత్రిలో నరసమ్మ (కనకలత) చావుబ్రతుకులమీద ఉందనీ నిస్పృహ ఎక్కువవడంవల్ల వచ్చిన హృదయాఘాతం (షాక్) తగ్గటంలేదనీ, గ్లూకోజు మొదలైనవి ఎన్ని ఇచ్చినా రోగి కోలుకోవటం లేదనీ తెలిసింది. అలాంటి బంగారుబొమ్మ ఈలాంటి వేధవకు ఎందుకు దక్కుతుందని అనుకుంటూ ఆచుట్టం మైలాపూరువెళ్ళి సమాచారం యావత్తూ లోకేశ్వరితో మాత్రం చెప్పి ట్రిప్లికేను వెళ్ళిపోయాడు.

తన చుట్టం తన భార్యవిషయం ఏమీ దాచకుండా తనతో చెప్పగానే జానకిరామమూర్తికి ఆవేదన ఎక్కువైంది. ఏమిటి చెయ్యాలి? కోటిమంది దేవుళ్ళకు మొక్కుకున్నాడు. ఏదేవుడూ మనస్సుకు తోచడు. వెంకటేశ్వరుడా! పార్థసారథీ! కపాలేశ్వరా! ఎవ్వరూ పలకరు? క్రిందపడి దొర్లాడు.

ఆతన్ని చూసి బిడ్డలు గొల్లుమన్నారు. ఇంటివారు ఏమయింది అని మేడ మీదకు పరుగెత్తుకు వచ్చారు. నరసమ్మగారికి ఏమీ భయంలేదనీ, జరిగిన ఉపద్రవానికి జానకిరామమూర్తి బెంగపెట్టుకొని ఏడుస్తున్నాడనీ ఆచుట్టం చెప్పాడు. ఆ చుట్టమే ఏలాగో సముదాయించాడు జానకిరామమూర్తిని.

వెంటనే పారసారధి కోవెలకు పెద్దబిడ్డలనిద్దరిని తీసికొని పరుగెత్తివెళ్ళి జానకిరామమూర్తి పదిహేను నారికేళాలు కొట్టి, సహస్రనామార్చనచేసి, తన భార్య బ్రతికితే మహాభోగం చేయిస్తానని మొక్కుకున్నాడు. కాని తన మొక్కును భగవంతుడు మెచ్చుకుంటాడా అన్న భయంతో బిడ్డలచేత మొక్కించాడు. తొమ్మిదేళ్ళ ఆ పెద్దమ్మాయి, 'పారసారథీ, మా అమ్మను బ్రతికించు. నేను నీకు నా ఉంగరం ఇస్తాను తండ్రీ' అని మొక్కింది.

# 37

త్యాగతి తిన్నగా కొల్లిపరవెళ్ళి తన ఇంటిలో మకాం పెట్టాడు. అక్కగార్లకు, మేనమామకు రావలసిందని కోరుతూ ఉత్తరాలు రాశాడు. ఒకగది శకుంతలపేర ఏర్పరచుకున్నాడు. తాను శకుంతల విద్యాలయానికి వేసిన ధనం బాగా పెరిగింది. విద్యాలయానికని తాను నిర్దేశించి ఉంచిన తోట కృష్ణ కాలవ పక్కనే ఉన్నది. అక్కడ నూయితవ్వితే గంగాజలంవంటి నీరు పడుతుంది. పనివాళ్ళను పిలిపించాడు.

శ్రీనాథమూర్తి వచ్చాడని, ఆతని చిన్ననాటి స్నేహితులు చాలామంది చూడడానికి వచ్చారు. సూరపరెడ్డి ఇప్పుడు తెనాలిలో వకీలుగా ఉన్నాడు. వెంకట్రామయ్యచౌదరి ఎం. బి., బి. ఎస్. పరీక్షలో విజయంపొంది తెనాలిలోనే వైద్యవృత్తి చేస్తున్నాడు. వాళ్ళతో ఒక రోజల్లా ఆనందంతో గడిపాడు. అతని చిన్ననాటి కథలన్నీ జ్ఞాపకం వచ్చాయి. 'ఒరే మూర్తీ! రారా తెనాలి. మా ఆవిణ్ణి చూడలేదు నువ్వు. మా పిల్లల్ని చూడలేదు. నువ్వు రాసే కథలు, పాటలు, శిల్పకళను గూర్చిన వ్యాసాలు పత్రికలలో చూస్తూ, నీబొమ్మల ప్రతిరూపాలు చూస్తూ, మన చిన్ననాటి ఆటలు తలుచుకొంటూ, మా ఆవిడకు చెప్తూ ఉంటాను. మా ఆవిడ బి. ఏ. ప్యాసయిన ఆవిడే!' అని వెంకట్రామ చౌదరి అన్నాడు.

సూరపురెడ్డీ బలవంతం చేశాడు. వాళ్ళతోపాటు తెనాలిపోయి త్యాగతి మూడురోజు లున్నాడు. రెండురోజులు చౌదరిగారి ఇంట్లో మకాం. ఒకరోజు రెడ్డిగారి ఇంట్లో మకాం. వెంకట్రామ చౌదరీ, ఆయనభార్య సరళాదేవీ, సూరపురెడ్డీ, త్యాగతీ ఒకరోజున చౌదరిగారి ఇంట్లో సాయంకాలం టీకి చేరారు. ఫలాహారాదులై త్యాగతీ, చౌదరీ సిగరెట్లు వెలిగించారు. రెడ్డి చేబ్రోలు ఆకు చిన్న తోలుసంచిలో పెట్టుకున్నది తీసి చుట్టచుట్టుకొని వెలిగించాడు.

సూర : ఒరేమూర్తీ, ఎన్నిదేశాలు తిరిగావురా? ప్రస్తుతం ఏమి చేయదలచుకొన్నావు?

త్యాగతి : శకుంతలా లలితకళాశాల పెట్టించదలచుకొన్నాను.

సరళ : ఏమండీ మూర్తిగారూ! మీ ఆవిడ పేరున లలితకళాశాల పెట్టించడం ఎంతో సంతోషంగా ఉందండి నాకు. మీ ఆవిణ్ణి నేను చూడలేదు. కాని మీరు వేసిన బొమ్మ, తయారుచేసిన శిల్పం, ఆమె ఫోటో అన్నీ చూస్తే ఆవిడ అత్యద్భుత సుందరీమణి అని నాకు తోచింది.

వెంక : నీకు తోచడం ఏమిటి! శకుంతల మా చిన్నతనంలో మాతో ఆడుకొనేది. ఆ అమ్మాయి అందాలముద్ద. సుగుణాల ప్రోవు.

సరళ : అందుకనే శ్రీనాథమూర్తిగారు ఇంతవరకు ఆమెనే ధ్యానిస్తూ, ఆమె స్మృతికోసం జీవిస్తున్నారు. అయితే లలితకళాశాల అంటే ఏం పెట్టాలని మీ ఉద్దేశం?

త్యాగతి : లలితకళలు ఒకదాని కొకటి అతిసన్నిహిత సంబంధంకల పంచనదీ పరివేష్టితమైన పంజాబు వంటివి.

సూర : అది కాదురా. ఆ కళాశాలలో ఎవరు చేరుతారురా! శారదా నికేతనానికే, విశ్వవిద్యాలయ పరీక్షలు లేకపోతే ఎంతమంది చేరేవారని నీ ఉద్దేశం?

త్యాగతి : ఒరే రెడ్డీ, నీవి ముసలమ్మల భావాలు. సంవత్సరానికి ఒకరైనా ఆ కళాశాలలో శిక్షణ పొందితే చాలు, ఆ కళాశాల పెట్టిన ఉద్దేశం నెరవేరుతుందనే నా ఆశయం.

వెంక : ఇంతకు ఎలా ఏర్పాటుచేస్తావు? ఎవరు ఆ కళాశాల అధ్యక్షత వహించేది? ఎవరు అందుకు ఆచార్యులు?

త్యాగతి : మీ ఆవిడవంటి ఏ ఉత్తమురాలో అందుకు అధ్యక్షత వహించకూడదా?

సరళ : నేను తప్పకుండా మీ కళాశాలలో పనిచేస్తా సుమండీ.

త్యాగతి : మీకు కృతజ్ఞుణ్ణి. అయిదు కళలు—సాహిత్యం, చిత్రలేఖనం, శిల్పం, సంగీతం, నాట్యం అన్నీ ఉంటాయి. ఆ కళాశాలలో సాధ్యమైనంతవరకు స్త్రీలే ఆచార్యపీఠాలు అధివసిస్తారు సరళాదేవిగారూ...

సరళ : నన్ను 'గారూ గీరూ' అనకండి మీరు.

త్యాగతి : నన్ను 'మీరూ గీరూ' అనకమ్మా! నాకూ, చౌదరికి, రెడ్డికి ఉన్న స్నేహం అలాంటిది.

వెంక : ఇన్నాళ్ళనుంచీ ఒక ముక్క రాశావూ! నీగతి ఏమయిందో మాకు రాయడంగాని, మాగతి ఏమయిందో నువ్వు తెలిసికోడంగాని ఏమీ లేకుండా నీ ఇష్టంవచ్చినట్లు తిరిగావు. మీబాపనాళ్ళెప్పుడూ అంతేలెద్దూ.

త్యాగతి : తెచ్చావూ బ్రాహ్మణ అబ్రాహ్మణ సమస్య! ఈ ప్రపంచంలో ఉన్న అన్ని కష్టాలకూ బ్రాహ్మణులే కారణం అని అనేకమంది మిత్రులు

అనుకుంటారు. అది లోక దౌర్భాగ్యం. బ్రాహ్మణుల సంఖ్య తక్కువ. వాళ్ళని అణచివెయ్యాలంటే తక్కినవారికి అయిదు నిమిషాలు పట్టదు. బ్రాహ్మణులు ధనవంతులూ కారు, ఆస్తివంతులూ కారు. బలంలేని ఒక శాఖ విషయంలో 'అదిగోరా! అదిగోరా! బ్రాహ్మణుడు' అని అడిలిపోవడం ఎందుకు ?

వెంక : ఒరే మూర్తీ, బ్రాహ్మణుడు సహపంక్తిని భోజనం పెట్టడు.

త్యాగతి : మదరాసు గవర్నరు పెట్టాడూ!

వెంక : మనం గొప్పవాళ్ళం అయితే, మన్ని భోజనానికి పిలువడానికి వీలుందిగాదురా ?

త్యాగతి : నిజమే, అంత గొప్పవాడవైతే. బ్రాహ్మణుడు సంఘసంస్కర్త అయితే నిన్ను సహపంక్తికి భోజనానికి పిలవవచ్చుగాదా అంట!

వెంక : కాని బ్రాహ్మణశాఖ బ్రాహ్మణేతరులను దగ్గరకు రానివ్వరుకాదట్రా.

త్యాగతి : అవునురా, మన్ని తెల్లజాతి దగ్గరకు రానిస్తూందిరా ? మనదారిని మనం వృద్ధిపొందడం చూచుకోవాలి. ఈ శాఖాభేదాలు మనదేశానికి తీరని కొరతే, కాదని నేను అనను. దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు అనినట్లు భారతదేశంలో హిందువులందరూ బ్రాహ్మణులైతేనే జాతి అత్యంత పురోభివృద్ధి పొందుతుంది. అందుకు మనదేశం అంతా ఏ ఉన్నతమైన బోల్షివిజమో రావాలి! మహాత్మాజీఇజం అల్లాంటిదనే నా ఉద్దేశం.

రెడ్డి : మహాత్మాజీ ధనికులను అల్లాగే ఉండమని, వారు బీదలతరఫున ట్రస్టీలనీ వాదిస్తారుకాదట్రా ?

త్యాగతి : ఆయన ఉద్దేశంలో ధనికులు పూంజీతత్వం వదలాలనే. అది భౌతిక విప్లవంద్వారా కాకుండా నైతిక విప్లవంద్వారా తీసుకురమ్మనే ఆయనబోధ!

వెంక : సంగీతాలకు చింతకాయలు రాల్తాయా ?

త్యాగతి : కాని డప్పులకు పెద్దపులులే బెదురుతాయి, చెట్టెక్కి కోస్తే చింతకాయలూ వస్తాయి. అంతేకాని తుపాకులు పుచ్చుకొని కుందేళ్ళను చంపి, చింతకాయల కోసం చింతచెట్టు యావత్తూ నరికితే ఎల్లాగురా ?

సరళ : ఈ సమస్యలన్నీ అవేపోతాయి. దేశం మారుతోంది. మార్పువచ్చి తిరుగుతోంది. పాకిస్తాను అంటేగాని, ముస్లింసోదరులు హిందువులతో సమత్వం పొందరు. అలాగే బ్రాహ్మణులను తిడ్తేనేగాని సాంఘిక సమస్యలు విడవవు. మూర్తిగారూ, మాది భావదాస్యం. బ్రాహ్మణభావం వదలలేము. అందుకని అదంటే కోపం. ఆంగ్లదాస్యం వదలలేము; అందుకని అదంటే కోపం. ముందర మా కమ్మవారు, కాపువారు, రెడ్లు, వెలమవారు వివాహాది సాంఘిక విషయాలల్లో ఒకటైపోతే బ్రాహ్మణులు ఏం చేస్తారు ? ఉద్యోగాలకోసం ఈ ఏడ్పంతా! బ్రాహ్మణేతరులలో కమ్మ

వారు వగైరా, చాకలి వగైరాలతో పెళ్ళిళ్ళు పంక్తిభోజనాలూ చేస్తారా? పనిచేసేవారు లేరు. వాగే వాజమ్మలు ఎక్కువ. రెడ్డి మంత్రయ్యాడని కమ్మవారూ, వెలమలూ, కాపులూ మండిపోయారు. ఇంక చాకలివారు, మంగలివారు, కమ్మరివారు, గొల్లవారు, గాజులబత్తులు, జక్కులవారు, కుమ్మరివారు, ఉప్పరులు, దొమ్మర్లు, కరణిబత్తులు, పద్మశాలీలు, ఏనాదులు, మాలలు, మాదిగలు, ఎరుకలు ఈ వగైరాలంతా ఏకమైతే ఎంత బాగుంటుంది!

## 38

హేమసుందరికి తన బావ కొల్లిపర వెళ్ళినాడని, అతను వెళ్ళిన సాయంకాలం తన ఇంటికి వచ్చిన, రంగనాయకమ్మగారు తన తల్లితో చెబుతోంటే విన్నది. వెంకట్రామరాజ్యలక్ష్మమ్మగారు చాలావరకు ఆరోగ్యం పొందారు. అయినా కొన్నాళ్ళవరకూ పూర్తి విశ్రాంతిగా పండుకొని ఉండాలని డాక్టరు ఆజ్ఞ.

తానూ తీరమిత్రుడూ రైలెక్కగానే, టాక్సీకారు నడిపే డ్రైవరు హేముగారి పెదకారు డ్రైవరుతో చెప్పాడనీ, అతడు తన సైకిలుమీద వెంటనే తమ ఇంటికివచ్చి లోకేశ్వరిని 'హేముగారేరి' అని అడిగి, ఆమె ఎక్కడికో వెళ్ళిందంటే, టాక్సీడ్రైవరు చెప్పిన కథ లోకేశ్వరితో చెప్పాడనీ; ఆ విషయం పరిశీలనచేయ డానికి కంగారుపడుతూ లోకేశ్వరి హేము గదిలోకి వెడితే, హేము లోకేశ్వరికి రాసిన ఉత్తరం చూసి, లోకేశ్వరి వెక్కి వెక్కి ఏడ్చిందనీ; తూలుతూ లోకేశ్వరి తన గదిలోకి వెళ్ళి శకుంతల ఫోటో దగ్గిర కూలబడి, ప్రార్థించి, తమ కారు వేసుకుని కల్పమూర్తి దగ్గిరకు పోయిందనీ; లోకేశ్వరి తన గదిలో ప్రార్థిస్తున్నప్పుడు డ్రైవరు ఈవిషయం హేము పరిచారిక వీరమ్మకు చెప్పాడనీ; ఆతర్వాత వాడు కారుమీద వెంటనే లోకేశ్వరిని తీసుకుపోయాడనీ, వీరమ్మ గోలపెడుతూ, బావురుమంటూ రాజ్యలక్ష్మమ్మగారి దగ్గిరకు వెళ్ళి ఆ విషయం చెప్పిందనీ, దానితో తన తల్లి కెవ్వున కేకవేసి, పడిపోయిందనీ; వినాయకరావుగారు గబగబ వచ్చి, వీరమ్మచెప్పినమాటలు విని, ఆయన భార్య అవస్థచూచి మొండిధైర్యం తెచ్చుకొని, ఈ విషయంఎవరితో చెప్పవద్దని వీరమ్మకుచెప్పి, అలా చెబితే దాని బుజ్జ చిదుకకొడ్తానని, వెళ్ళి డాక్టరుకు ఫోనుచేశాడనీ; డాక్టరుగారు వచ్చే లోగా ఏవో నీళ్లు జల్లుతూ కళ్ళనీళ్ళు కారుస్తూ కూరుచున్నారనీ; డాక్టరుగారు వచ్చి వైద్యం ప్రారంభించారనీ; వినాయకరావుగారు తూలి పడిపోబోయి, మొండిధైర్యం తెచ్చుకొని, హాలులోకి వెళ్ళి కుర్చీమీద చదికిలబడ్డారనీ; ఈ లోగా డాక్టరుగారు తా సెరుగున్న మంచి నర్సుకోసం తన కారు పంపించి రప్పించారనీ; ఆ తర్వాత తానూ, త్యాగతీ వగైరా వచ్చామనీ; జరిగిన దంతా లోకేశ్వరి ఆరాత్రే హేముతో చెప్పింది.

లోకేశ్వరి కల్పమూర్తి గలిసి త్యాగతిదగ్గిరకు పరుగెత్తారుట. త్యాగతి గుంటకల్లులోనో, కడపలోనో హేమును కలిసి వెనక్కు తీసుకువద్దామని

సంకల్పించి కల్పమూర్తి కారును బాగా పెట్రోలువేసి సిద్ధంచేయమని; తాను రెండువందల రూపాయిలు పట్టుకవచ్చి, కారులో తాను కల్పమూర్తితో వస్తూ డ్రైవరుతో—ఇదంతా తన ఏర్పాటేననీ, ముందు సోఫీ, తీర్థమిత్రుడూ, హేమ పంపి వెళ్ళడం తాము తర్వాత కారుమీద వెళ్లడం ఏర్పాటుచేశాననీ చెప్పాడుట—డ్రైవరూ నమ్మినట్లే కనబడ్డాడుట. అయినా తన్ను యింటిదగ్గర జాగ్రత్తగా కనిపెట్టమంటూ దిగబెట్టడానికిన్ని సోఫీని తీసుకవెళ్లడానికిన్ని నిశ్చయం చేశాడుట త్యాగతి. తామంతా కల్పమూర్తి ఇంటికి వచ్చారుట. అక్కడ కల్పమూర్తి తన కారుతీసి వేయిరూపాయిలు జేబులోవేసుకొని బయలుదేరాడుట. లోకాన్ని, కారునూ ఇంటిదగ్గర దిగబెట్టడానికి తమ ఇంటికి వచ్చారుట. రాగానే హేమను చూచి ఆశ్చర్యంపొందారుట. లోకేశ్వరికి కలిగిన ఆనందం వర్ణనాతీతమట. పెద్ద బరువు తీసినట్లయి వెక్కి వెక్కి ఏడ్పు వచ్చిందట లోకేశ్వరికి. లోకేశ్వరి వెంటనే తనగదిలోకి పరువిడి అక్కడ ఫొటో ఎదుట సాగిలపడి మొక్కకొని ఆనందంతో కన్నీళ్లవెల్లువలయిందిట.

ఈ కథంతా హేమ తెల్లవారగట్ట నాలుగింటికి తన గదిలో కూర్చుని ఉండగా తిరువళిక్కేణి నుంచి వచ్చిన లోకేశ్వరి చెప్పి, హేమను బిగియార కౌగిలించుకొంది. హేమా కన్నీరు మున్నీరై లోకేశ్వరి కౌగిలిలో కుంగిపోయింది. మూడున్నర గంటలవరకూ హేమ తల్లి గదిలోనే ఉంది. ఆవిడ ఒళ్లు తెలియకుండా నిదురపోవటం చూచి నర్సు వెళ్లిపొమ్మని సన్న చేసింది. హేమ పిల్లిఅడుగులు వేస్తూ, తండ్రిగారుకూడా వారిగదిలో గుఱ్ఱుపెట్టి నిదురపోవడం చూచి, తన గదిలోకి వెళ్లింది. ఆ బాలిక గదిలోకి వచ్చిన వెంటనే లోకేశ్వరీ ఆ గదిలోకి వచ్చింది.

లోకేశ్వరి వచ్చి రావడంతోటే హేమను కౌగిలించుకుంది. లోకేశ్వరి కళ్లనీరు కారుతుండగా జరిగినదంతా చెప్పింది. హేమ మంచంమీద వాలిపోయి, 'లోకం! నా జన్మ వృథా అనుకుంటూ. ఒక్కటి మాత్రం దాచకుండా నీతో చెబుతా. నేను తెలియకుండా మా బావనే ప్రేమిస్తున్నాను. కాని ఆ ప్రేమవల్ల నాకు బానిసత్వం వస్తుందని నాహృదయాంతరాలభావం కలిగిందేమో, లేదా అతని అఖండ ప్రేమకు నేను తట్టుకోలేకపోయానో ? నేను ఏమీ ప్రేమించని తీర్థమిత్రునితో పారిపోయాను. అదీ రహస్యం! నేను నా దేహం ఏ తుచ్ఛ వాంఛతోనూ అపవిత్రం చేసుకోలేదు లోకం ' అని కుళ్లిపోయింది.

'ఓసి వెఱ్ఱితల్లీ! నువ్వు ఎప్పుడూ' ఏరకంగానూ అపవిత్రం చేసుకోగలవని ఎవ్వరూ అనుకోలేదు. నువ్వు శకుంతల చెల్లెలివి. శకుంతలకు మూడు మూర్తులా అపరావతారానివి. శకుంతల నాకు దేవి. నా కథ చెప్తావిను. చుట్టాలింటిలో ఉండి నెల్లూరులో చదువుకున్నాను. ఆ తర్వాత నాకు ప్రెసిడెన్సీకాలేజి విద్యార్థినీ వేతనం వచ్చింది. ఆ కళాశాలలో చదివితే ఎక్కువ లాభం. ఎవరింటిలో ఉండను ? ఈ ఆదను పోగొట్టుకుంటే ఏలాగు ? అని

ఏడ్చాను. మదరాసు వచ్చి ప్రెసిడెన్సీ కళాశాలలో చేరాను. క్వీన్ మేరీ కళాశాల హాస్టలులో చేరాను. కొందరు రెడ్డిప్రభువు లిచ్చిన చందాలతో కొంతకాలం గడిపాను. ఎందుకో మొదటినుంచీ నేనంటే గాఢప్రేమ చూపావు. మీ ఇంటికి తీసుకువచ్చేదానవు. నన్ను నువ్వు మీ కారుమీద తీసుక వచ్చిన మొదటిరోజునే శకుంతల బొమ్మ చూశాను. మీ ఇద్దరి పోలికా అత్యం తాశ్చర్యం కలుగజేసింది నాకు. నీదేనా ఆ ఫోటో అని అడిగాను, జ్ఞాపకం ఉందికాదూ! మీ అక్క శకుంతలదన్నావు. నా కా ఫోటోలో కనబడిన వ్యక్తి ఒక దేవతే అనిపించింది హేమూ. అప్పుడే ఎందుకో ఆమెకు నా మన స్సులో మొక్కుకున్నాను. నువ్వు నన్ను తీసుకువచ్చిన నాల్గయిదు సారులు ఆ చిత్రం నాకు దేవతాచిత్రంలా కనబడి మనస్సులో నమస్కరించుకొనేదానిని. తలిదండ్రులు అతి బీదవాళ్లు. తిండి సగం తినీ సగం తినక కాలం గడుపు తున్నారు. హేమూ, చదువులో మునిగి జీవించి ఉంటినిగాని మా బీదతనం నా గుండె పగిల్చి నాకు చిన్ననాడే చావు తెచ్చి ఉండును. ఒకనాడు శకుం తల బొమ్మ నాతో పెదవులు కదిపి 'చెల్లీ' అని పిలిచినట్లయింది. నాకు కన్నీరు బొటబొట కారాయి. అవి తుడుచుకొంటూంటే మీ నాన్నగారు వచ్చి 'అమ్మాయీ, వెంకటరత్నం! నువ్వు మా యింటిలో ఉండిపో. మా హేముతోపాటే నువ్వు. తల్లీ, నా మాట విను. మీ పిన్నీ, నేనూ ఈ విషయం ఎన్ని సార్లో అనుకున్నాం. మాకు ఒక్క హేమేకదా! మా దేవత శకుంతల వెళ్ళిపోయిందికదా! మేం ఇద్దరం పెద్దవాళ్ళమవుతున్నాము. మా హేము ఒంటరి అయిపోయిందికదా! నువ్వు మా అమ్మాయివికావూ?' అన్నారు. పిన్ని దగ్గరకు బాబాయిగారు తీసుకువెడితే, ఆమె కళ్ళనీళ్ళతో నన్ను బ్రతిమాలింది. హేమూ! అప్పుడు నువ్వూ నన్ను ఎంత బ్రతిమాలినావో, నువ్వు మరిచిపోయి ఉంటావు. అంత ఉత్తమ కుటుంబం మీది. ఆ నాటినుంచీ మీ అందరి ప్రేమసముద్రాలలో నేను మునిగిపోయాను!'' అని లోకేశ్వరి ఊరుకుంది.

హేము: 'లోకం, నువ్వు నా చిన్నక్కవే. నాకు మాఅక్క పోయిన లోటు ఏమీ లేకుండా నీ ప్రేమతో ముంచావు. డబ్బు ప్రేమనుకొనగలదా లోకం! అదృష్టం ఉన్నవారికే అదిప్రాప్తం!'

హేము అతి దుఃఖముతో కరిగిపోయింది. లోకేశ్వరి హేమును అతి గాఢంగా తన హృదయానికి అదుముకుంది.

ఆ సాయంకాలం శ్రీనాథమూర్తి కొల్లిపర వెళ్ళిపోయినాడని రంగ నాయకమ్మత్తగారు ఇంటికివచ్చి చెప్పారు. హేము చల్లగా తోటలోకి జారి ఆ పూలచెట్లమధ్య కూర్చొని కుంగిపోయింది. ఇంతలో లోకేశ్వరి నిశాపతి దగ్గరనుంచి వచ్చిన టెలిగ్రాం అక్కడకు పట్టుకువచ్చింది. సోఫీ తనకారు దిగి 'హేమూ' అంటూ తోటలోకి పరుగెత్తుకువచ్చింది.

## 39

సోఫీ హేము దగ్గరకు పరుగెత్తింది. ఈ మధ్య సోఫీ హేముగారింటికి ఎక్కువగా రాలేదు. దానికి కారణం తా నీ వేసవికాలం తండ్రిగారితో కలిసి ఇంగ్లండు వెడదామని; ఆ సందర్భంలో ఏర్పాట్లు చేయడానికి తానూ తన తండ్రీ ప్రభుత్వాజ్ఞలు మొదలయినవాటికోసం ఉత్తరాలు వ్రాయడం, దరఖాసులు పెట్టడం వగైరాలలో ఉన్నామనీ; అవి వచ్చాయనీ; ఇంతట్లో లోకేశ్వరికి పెళ్ళి అనే సంగతి తెలిసిందనీ, పైగా తాము ఆఫ్రికామీదుగా వెళ్ళవలసి వస్తుందని తెలిసిందనీ, అలా వెళ్ళడంకూడా ప్రమాదకరం అని ప్రభుత్వంవారు తెలిపారనీ, ఆ కారణాలచేత ప్రయాణం ఆపేశామనీ; వేసవికాలంలో ఊటీలో గడుపుతామనీ హేముతో చెప్పి హేమును గట్టిగా కౌగిలించుకొని, 'హేమ్, ఏమిటే అల్లా దిగులుపడి ఉన్నావు?' అని ప్రశ్నించింది.

హేము: సోఫీ నీ కన్ని సంగతులు లోకం చెప్తుందిలే!

లోకేశ్వరి మొదటినుంచి చివరదాకా జరిగిన విషయాలన్నీ చెప్పింది సోఫీకి.

సోఫీ: నేను తీరమిత్రుడు ఎప్పుడూ మంచివా డనుకోలేదు. కాని మన మనస్సు నిర్మలంగా ఉంటే వేయి తీరమిత్రుళ్ళు మన్నేం చేస్తారే?

లోకం: తీరమిత్రుడంటే హేముకు లెక్కలేదు. తా నేదో తప్పుచేశానని కుళ్ళిపోతోంది.

సోఫీ: ఒసే హేమూ! నీ ఇల్లు బంగారంకానూ. నువ్వు కుళ్లడం ఎందుకు? నువ్వేమన్నా స్త్రీపురుష సంబంధవిషయంలో తొందరపడ్డావు కనకనా? మీ హిందువుల్లో ఈ రోజున పెళ్ళికాకుండా ఎదిగున్న పిల్లలుండటం తటస్థించింది. మా ఇంగ్లీషువాళ్ళల్లో అనాదినుంచీ గొడవలు ఇవేగా! మా ఆంగ్లబాలికలు ఎన్నితప్పులో చేసి దిద్దుకుంటూ ఉంటారు. ఒకప్పుడు దిద్దుకోలేక కుళ్ళిపోతారు. ప్రతిజాతికీ ప్రతిదేశానికీ ఈ సమస్యలు అనేక రకాలుగా వస్తూనేవుంటాయి. అందుకు నీ కీ బెంగెందుకే హేమూ?

లోకం: మనుష్యుని జీవితం ఆనందమయంగా ఎప్పుడైనా ఒక పదినిముషాలు పాటో, పది రోజులపాటో ఉంటే ఉండవచ్చునేమో? ఆ తర్వాత విచారంలో, ఆవేదనలలో పడిపోతాము. వెలుగునీడలే జీవితం కెరటాలూ లోతులూ?

హేము: ఏదో టెలిగ్రాం వచ్చిందేమిటి నీకు?

లోకం: నిశాపతిగారు రేపు సాయంకాలం గ్రాండ్‌ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌కు వస్తారట.

హేము: అప్పుడే నిశాపతిగా రయ్యాడూ నీకు? (చిరునవ్వు నవ్వింది)

లోకం: (నవ్వుతూ, సిగ్గుపడుతూ) నిశాపతీ అని పిలవనా?

సోఫీ: మావాళ్లలో మొదట మిష్టర్, తర్వాత ఇంటిపేరు మాత్రం, తర్వాత అసలుపేరు. పెళ్లయితే ఒరే! ఒసే!

హేము: అదీ ఒక అందమే!

లోకం: సోఫీ, రేపు హేము త్యాగతిని బావా అనే పిలుస్తో ఉంటుందికాబోలు!

సోఫీ: ఒరే బావా! అని అంటూవుంటే బాగా ఉంటుంది.

ఇంతట్లో హేము స్నేహితురాలూ, ఇంకా కళాశాలలో చదువుకుంటున్న సీతాకుమారి 'తోడిదొంగ లందరూ చేరారూ?' అంటూ వచ్చింది.

సోఫీ: సీతా! బొత్తుగా కనపడ్డం మానేశావేమిటే?

సీతా: పరీక్షల గొడవల్లో పడ్డానా? అవి అయ్యాయి. ఆ తర్వాత, ఒక విషయం కొంచెం మార్కులు తక్కువగా వస్తాయన్న భయంవేసి నాన్నతో చెప్పాను. అందుకు తగిన ఏర్పాటులు చేశారులే మా నాన్నగారు!

లోకం: బి. ఏ. పరీక్షలిచ్చికూడా మార్కుల గొడవేటే!

సోఫీ: వీళ్లంతా మార్కిస్టులే లోకం.

అందరూ పకపక నవ్వారు, హేము చిరునవ్వు నవ్వింది.

సీతా: ఒసే హేమూ! కల్పమూర్తిగారి రాయబారం విషయం విన్నావా?

లోకం: ఏదో నేను విన్నానే, తమ అందాలరాణిని ఆతడు గ్రహించాలని తమ తండ్రిగారికి రాయబారం పంపారనీ, తమ తండ్రి అయిన అడ్వకేటుగారు, బి. ఏ. పరీక్షకు వెళ్ళిన సీతాకుమారి నేమిటీ, స్కూలుఫైనలు నెగ్గలేని కల్పమూర్తి వివాహం వాంఛించడ మేమిటి అని ఆశ్చర్యం పొందారనీ.

సోఫీ: కల్పమూర్తి సుగుణాలప్రోగు. అత్యంత సుందరాకారుడు. నేను హిందూబాలికనైతే అతన్ని ఎగనెత్తుకుపోయి ఉందును.

లోకే: ఒసే సీతా! కల్పమూర్తి కేమిటే? మొన్న హేము కల్పమూర్తిని అమెరికాకుపోయి ఏ వ్యవసాయంలోనో, ఏవ్యాయామంలోనో ఒక డిగ్రీ వేసుకురావోయి అంది. కల్పమూర్తి ఉబలాటపడ్డాడు. వాళ్ళమ్మ ఒప్పుకుంటేనా? అదీకాక బరోడా మహారాజు అతని టెన్నిస్ క్రికెట్టు ఆటలు చూసి, తన సంస్థానంలో స్కౌటు అసిస్టెంటు కమిషనర్ ఉద్యోగం ఇస్తామని రమ్మన్నారు. అది ఎరగవుకాబోలు. ఆ తర్వాత మొన్న వారి అంతరంగిక కార్యదర్శి కల్పమూర్తికి ఉత్తరం రాశాడు. నేను ఒప్పుకోనాయనా అంటే, త్యాగతి దగ్గరకు సలహాకుపోయాడు. త్యాగతి జాతీయవాదీ, గర్భగాంధేయుడు! ఆతడు నీ కెందుకయ్యా ఉద్యోగం? అన్నాడుట. మొగం ఇంతచేసుకొని వచ్చాడు.

సోఫీ: త్యాగతి ఎప్పుడూ అంతేలెద్దు. కల్పమూర్తికి ఇష్టంలేని సలహాఎందుకు?

సీతా: ఎప్పుడూ చదువేనా ఏమిటి, మనిషియొక్క ఉచ్ఛనీచాలు నిర్ణయించేది?

సోఫీ: ఓహో! సీతకు కల్పమూర్తి...

సీతా : ఛట్ ! ఊరుకో స్పోఫీ !

లోకే : నీఉద్దేశం మాదగ్గిర దాచడ మెందుకే? అయినా ఇప్పుడు మించి పోయిందేమిటి ? ఆయన బరోడా ఉద్యోగం ఒప్పుకోవచ్చును.

సీతా : నిన్న త్యాగతిగారు మానాన్నగారితో మాట్లాడారుట. బరోడా ఉద్యోగం ఒప్పుకోమనే అందరూ నిశ్చయించారుట.

సోఫీ : చాలాబాగుంది. ఇవాళ అన్నీ శుభవార్తలే.

లోకే : కల్పమూర్తి ప్రియురాలా! సం-కల్పమూర్తి ఇల్లాలా!

టెన్నిస్ బాటు చేతబట్టి ఠీవిగా పోయేటి, కల్పమూర్తి ప్రియురాలా,
సం-కల్పమూర్తి ఇల్లాలా!
తోటంతా గంతువేసి దొడ్డంతా దొర్లివేసి
మాటలతో భర్తగార్ని మరిపించే మురిపించే
కల్పమూర్తి ప్రియురాలా! సం-కల్పమూర్తి ఇల్లాలా!

అందరూ చప్పట్లు కొట్టారు. సీతాకుమారి వచ్చి 'ఒన్సుమోర్' అన్నది.

సోఫీ : మొగుడుమీద పాట...మళ్ళీ వినాలనికాబోలు 'ఒన్సుమోర్' అంటోంది.

హేమ చిరునవ్వునవ్వుతూ 'లోకం! నిశాపతి ఎక్కడమకాం ?' అని అడిగింది. 'ఉడ్‌లాండ్స్‌లో ఉంటాను అని కూడా ఈ టెలిగ్రాంలోనే ఉందే' అని సోఫీ టెలిగ్రాం కాగితం చూస్తూ అన్నది.

సోఫీ : ఇంతకూ తీర్థమిత్రుడి పెళ్ళానికి ఎల్లాఉందే లోకం ?

లోకం : సాయంకాలం అతడు నేను జనరల్ ఆస్పత్రిలో ఉండగానే వచ్చాడు. భార్యనుచూచి జరిగినదంతా చెప్పాడు. హేము మహాతమ బాలిక అని కళ్ళనీళ్ళు కారిబోతుండగా భార్యతో గోలపెట్టాడు. ఆ అమ్మాయి తేరుకుంది. కాల్పులు త్వరలోనే మానాయనీ, ఆవిడకు షాక్ తగ్గి సాధారణ స్థితిలోకి వచ్చిందనీ వారం రోజులలో ఆమె ఇంటికి వెళ్ళ వచ్చుననీ డాక్టరుగారు చెప్పారు. అమ్మయ్యా అని వచ్చేశాను.

సీతా : ఒసే లోకం, నాకు ప్రేమ అంటే ఏమిటో తెలియదు; నేను పురుషుణ్ణి మాత్రం వాంఛించా, అతడు ఇల్లా ఉండాలి, అల్లా ఉండాలి అని కలలు కంటూ ఉండేదాన్ని. ఆ కలలే నాకు ఆనందం ఇచ్చేవి. పురుషుణ్ణి వాంఛిస్తానుగాని హేమూ! ఫలానా పురుషుడని లేదు నాకు. నాకు నచ్చిన భర్తవస్తే, అతన్ని ఆనందంలో ముంచగలను, నేను కావలసినంత ఆనందం పొందగలను.

సోఫీ : భేష్ ! నాకు నువ్వు బాగా నచ్చావే !

హేము : ప్రేమ అనే భావం కొంతమందికి ఇష్టం! దానికోసం ప్రాణాలాడు తారు, ప్రాణం ధారపోస్తారు. ప్రేమ అనేది విషం! ఎందుకంటే తక్కువ

మోతాదులో విషమే మందు. ఎక్కువైతే ప్రాణం తీస్తుంది విషము. అలాగే ప్రేమ ఎక్కువైతే ప్రాణికి విషమే!

సీతా : ఇవాళ హేము వేదాంతం మాట్లాడుతోందేమిటి ?

సోఫీ : అమ్మాయిగారి హంగామా చూసి, నాయకుడు హడలి బేజారై పారి పోయాడు.

హేము : సోఫీ!

సోఫీ : ఏం ? నిజం చెబితే నిష్ఠురమటే! నీలో ఏ మాత్రమన్నా గౌరవం ఉంటే, నీలో త్యాగశీలం ఉంటే నిజమైన ప్రేమ ఉంటే, వెళ్ళి అతని కాళ్ళ మీద పడు.

లోకే : ఛీ, నీమాటలూ నువ్వూనూ! హేము తెలివితక్కువది కావచ్చును గాని, హీనురాలుమాత్రం కాదు.

సోఫీ : ఇందులో హీనత్వంమాట ఎక్కడ వచ్చిందే! నేనే హేమునైతే నా ప్రేమే నాకు సర్వస్వమూ! నా జీవితం అంతా ఆ ప్రేమలోనే ఆనంద మయం చేసుకుంటాను. ఆ ఆనందం నాకు బలంకాగా లోకంలో నేను ఆడవలసిన పాత్రధారణ చేసి, లోకోద్ధరణ మహాసౌధనిర్మాణంకోసం నా పరికరాలు సిద్ధంచేసికొంటాను.

సీతా : నాకు మీరు మాట్లాడేదేమీ అర్థంకావటంలేదు.

లోకే : ఒసే సీతా! నీవు గృహిణివి, భార్యవు, ఇల్లాలివి! నీభర్త రాక్షసుడు కాకపోతే నీజీవితం హైరోడ్డులా వెళ్ళిపోతుంది. కాని అందరి స్త్రీలూ అల్లా ఉంటారుటే!

సీతా : అర్థం చెప్పవే అంటే కాంబ్రిడ్జి డిక్షనరీ అంతా చదువుతావేమిటే.

లోకే : నీమాట ముందు చూద్దాం. కల్పమూర్తి విషయం నువ్వేమంటావు.

సోఫీ : అది సిగ్గుపడుతోంది! ఊరికే దాన్ని వేపుకుతింటావేం? నువ్వు నిశా రాణివిగనక, వెన్నెల కుమారివి అవుతున్నావుగా, కొండెక్కి కూర్చుం టావు నీకేం! సీతా చెప్పవే?

సీతా : అదదీ! ఇందాకటినుంచీ మహావాగుతోంది! ఓ నిశారాణీ నీకు జోహారు లమ్మా!

> 'వచ్చాడే మాబావా
> ఢిల్లీనుంచీ, కల్లోనుంచీ
> నల్లనిరూపం నాలుగు కాళ్ళతో
> వచ్చాడే మాబావా!'

లోకేశ్వరి సీతాకుమారిని కొట్టబోతే సీత పక పక నవ్వుతూ తోటలోకి పరుగెత్తింది.

# 40

భోజనం చేసిన తర్వాత హేమకుసుమ తోటలోనికి పోయి అక్కడ సేవ కుడు వేసిన పడకకుర్చీపై పడుకొన్నది. సోఫీ, సీతాకుమారీ వెళ్ళిపోయారు. పది రోజులకన్న ఎక్కువ కాలం మనస్సు ఏపనిమీదా లగ్నంకాదు. స్థానం తప్పిన తార అనంతపథంలో ఏగతుల సంచరిస్తుందో ఎవరికెరుక? చంద్రుడు ఈ చతుర్దశినాడు పంచదశకళానిధియై అమృతమూర్తై వెన్నెలకరుళ్ళు హేమ హృదయంలోనికి ప్రవహింపచేస్తున్నా, ఆమె వేదనాగ్ని ఆ వెన్నెల ప్రవాహా లనే ఆహుతికొంటున్నది.

చంద్రుడు అమృతమూర్తి! ప్రేమనిధి! కళాపూర్ణుడు! కళావేత్తలకు ఆమూర్తిలో నుంచే మహాప్రజ్ఞ ప్రవహించి వస్తుంది. ఆ బింబంలోంచి అనిర్వచ నీయమైన కాంతు మహావేగంతో వెడలివచ్చి ప్రేమికుల బ్రతుకంతా నింపు తుంది. చంద్రుడు సౌందర్యమూర్తి. అతని ప్రియురాలు చంద్రిక సౌందర్య మూర్తి. సౌందర్యారాధనకు ఫలము ప్రేమ. ప్రేమకుసిద్ధి ప్రియసంగమము. ఆ సంగమంలో శిఖరితస్థితి ప్రతివారి జీవితంలో ఒక్కసారె వస్తుంది. అప్పుడు ఆ దంపతులు బ్రహ్మానందస్థితి ఒక్కనిమేషమాత్రం పొందగలరు. ఆక్షణం అనంతమై శాశ్వతమౌతుంది. కాని, ఆ సంగమానికి పునాది, స్త్రీ పురుషు లిరు వురూ దైహిక మానసిక ఆత్మసౌందర్యాలలో ఉన్నతులు కావాలి. ఆమూడూ ఒకొక్కరిలో దివ్యశ్రుతిస్వరూపమైన రాగమౌతుంది. ఒకరిప్రేమ రెండవ వారికి మూర్ఛన అవుతుంది; రాగతాళయుక్త కీర్తనలో అంతరతమైన రెండు వేగాలూ అప్పుడు సంగమించి చంద్రబింబమధ్యస్థామృతబిందు సిద్ధిని పొందు తాయి. ప్రేమయొక్క పరమస్వచ్ఛభావం లలితకళ. ఆ లలితకళాయోగానికి సిద్ధి ప్రియసంగమం. అందుకనే లక్ష్మీనారాయణస్థితి హృదయంలో, శివ పార్వతీస్థితి దేహంలో, వాణీధాతృస్థితి వాక్కులో, చంద్రచంద్రికాస్థితి సర్వంలో మూర్తీభవించి ప్రేమతపస్వీతపస్వినులకు ప్రత్యక్షం అవుతాయి.

ప్రాణమూర్తి సూర్యుడు. సూర్యకళ అతనిబిడ్డ. కాంతిరహితుడై స్థాణు వైన చంద్రుని బ్రతుకులో ఆబాల అతని ప్రియురాలై లయిస్తుంది. అప్పుడు వారిరువురి సంగమానందంలోంచి అతడు సుధామూర్తిగా, ఆమె చంద్రికగా ప్రత్యక్షం అవుతారు... ఈ నిత్యశృంగార కావ్యము ప్రతినెలా విశ్వానందంకోసం ప్రదర్శింపబడుతోంది. ఈ నాయికా నాయకుల స్థాయీభావంలోంచి, లోకా నందమూర్తులు శశికళలు ఉద్భవించి భూమిలోని ప్రేమికులను కలతపెట్టి ప్రేమ తపోదీక్ష వారికి వరమిస్తారు. ఆదీక్షలో జగజ్జీవుల శృంగారనాటకాలు ప్రారంభం.

ఈ శృంగారాలకు ఉపాంగాలు మానవుల ఇతర ప్రయత్నాలు. ఒకజీవి బ్రతుకుకు ఆసించడం ఆజీవి ముఖ్యదీక్ష. కాని అది స్వలాభస్వరూపమే అవు తుంది. ఆ బ్రతుకుకోసం...ఆహారం, నిద్ర రక్షణలు. అవే ఆర్థిక, రాజకీయ

పారిశ్రామిక సమస్య లయ్యాయి. ఇవి ప్రతిజీవికీ వ్యక్తిగతమైనవి. ఇన్ని ప్రయత్నాలుచేసి, ఇన్ని కష్టాలకూ పాలవుతూ, ఓడిపోతూ, నెగ్గుతూ ప్రయాణం చేసిన జీవికి చివరకు చావు తప్పదు. కాబట్టి ఆరికాది సమస్యలు రెండవ రకమే అయ్యాయి. ముఖ్యసమస్య జీవికి శాశ్వతత్వం అనుగ్రహించే మిథునత్వం. సంగమంవల్ల జాతి జీవిస్తుంది. జాత్యభివృద్ధి అమృతత్వం అవుతుంది. అందుకని స్త్రీలకు పురుషవాంఛ, పురుషులకు స్త్రీవాంఛ అనే మిథునభావం...అత్యంత ప్రాముఖ్యమైన సమస్య అయింది. అదే శృంగారం! అందుకే సౌందర్యారాధన! లలితకళారూపం. సౌందర్యార్చన భావం వాణీ బ్రహ్మలు, స్త్రీపురుష ప్రేమభావం లక్ష్మీనారాయణులు, వారి రతిభావం అర్ధనారీశ్వరులు. అంతతో కుమారజననం. అది జాతివృద్ధి భావం. ఇంతవరకు శివుడు మృత్యువు మహాకాళుడున్నూ, పార్వతి మహాకాళి. ఇప్పుడే శివుడు మృత్యుంజయుడు; మహాకాళి, అమృతమూర్తియైన లలిత.

ఇంతవరకు మధురంగా పొంగిపోతూ హేమ ఆలోచనలు ఉప్పొంగాయి. ఆ బాలిక అప్పుడు ఆ ఆలోచనభారం భరించలేక ఒక్క గంతున కుర్చీ నుండిలేచి, తోటంతా గబగబ తిరిగింది. తనకు చంద్రస్పర్శ ఎక్కువై, మతి పోయిందేమో. ఈ పిచ్చి ఆలోచనలు వచ్చాయేమిటి? ఈ ఆలోచన లిట్లా రావడం మూర్తిబావ కళావేదాంత బోధ! ఈలాంటి వెఱ్ఱివేదాంతాలు నూరిపోసేవాడేమిటి తనకు? ఆతడు తనకు చంద్రుడా? తానాతని చంద్రికా? అయితే అక్క ఎవరు? అక్కా అతనూ ఎంత ప్రేమించుకునేవారో అతడు వ్రాసి తనకిచ్చిన ఆతని స్వీయచరిత్రలో స్పష్టంచేశాడు. తన అక్కను అణువణువు ఆతడు ప్రేమించాడు. పూజించాడు. ఓహో! ఆ ప్రకరణము చదువుతోంటే తాను ఏలోకాలకో తేలిపోయింది.

నిజమైన ప్రేమ ఒకసారే వస్తుందనుకుంటాను పురుషుని జీవితంలో స్త్రీ జీవితంలోనూ! ఆలా గాకపోతే ఏదో జన్మలోనన్నా వస్తుంది. అలా వచ్చినవెనక మరొక పురుషుడు స్త్రీకిగాని, మరొక స్త్రీ పురుషునికిగాని ప్రేమ నిధానాలు కాజాలరు. ప్రపంచంలో ఒక్కటే యమునాగంగాసంగమం. అది శాశ్వతంకూడా. ఇప్పటికి నేను నాబావను ప్రేమిస్తున్నాను ఆనేవిషయంనిశ్చయం అయింది. నాబావ నన్ను ప్రేమించలేకపోతే నా ప్రాణాలు మరుసటి ముహూర్తంలో పోవడం నిశ్చయం. నా బాల్యక్రీడాకాలం దాటింది. నే నిపుడు సంపూర్ణ స్త్రీని, ప్రేమపుంజాన్ని. నా ప్రేమచే జగమెల్ల పులకింతు అని కాకలీస్వనాలతో మాటాడుతూ తోటంతా మతిలేనిదానిలా హేమసుందరి తిరిగింది. తన బావ తన స్వామిగాకుండా ఏలా మనగలదు? తన బావ తనలో తన అక్కను చూచాడు. మా అక్క 'మా టియ్యండి, నేనే హేమను, హేమే నేను!' అని అన్నట్లు తన బావకు తట్టినట్లు రాస్తాడు కూడా! ఏదో పరమరహస్యం ఈ ప్రేమలో ఉన్నది. తాను చేసిన తెలివి

తక్కువ పనివల్ల బావకు కోపంవచ్చి వెళ్ళిపోయాడా ? తన శీలం శంకించాడా? ఈ రహస్యమూ తాను తేల్చుకుంటుంది. అయితే బావ ప్రేమను సాధించడం? ఆ ప్రేమబలంలో తానూ తన బావా ఈ లోకకల్యాణంకోసం తమ సర్వస్వమూ అర్పించి దేశసేవ, మానవసేవ చేస్తారు గాక. తానూ మహాత్మా గాంధీగారి కడకు పోయి, దేశసేవారహస్యం తెలుసుకుంటుంది. తాను సమస్త దేశాలూ పోయి నిజమైన ప్రజాపాలన, నిజమైన ఆర్థిక సమత్వ రహస్యాలు నేర్చుకుంటుంది. ఈ రెండు పవిత్రధర్మాలు ఎక్కడ ప్రయోగం అవుతాయో ప్రయాణించి పరిశోధించి ఆ ప్రదేశం తెలుసుకుంటుంది. స్త్రీల హక్కులూ స్త్రీ ధర్మాలూ, బాధ్యతలూ సంపూర్ణంగా దేశానికి తగినట్లు నిర్ణయించుకొని తన స్నేహితురాండ్రతో కలిసి తానా పనినే తపస్సు చేసుకుంటుంది.

ఈలోగా తన బావ దగ్గరకు తానే వెడుతుంది. పూర్వకాలపు నాయికలా తాను నాయకుడికోసం ఎదురుచూస్తూ, కుళ్ళిపోతూ విరహతాపం పడుతూ ఉండదలచుకోలేదు. హేమకు ఏదో ఆనందం కలిగింది. ఆ తోటలో ఉన్న పూలచెట్లపై వంగి ఆ పరిమళాలన్నీ ఆఘ్రాణించింది. తలెత్తి,

'ప్రేమదేవుడ వీవు చంద్రా
కామదేవుని మేనమామవు !
చంద్రికకు ఆత్మేశ్వరుడవు
నేను చంద్రిక నీవు చంద్రుడు'

అని పాడుకుని ఆ వెన్నెలను పెదవులతో చుంబించి లోనికి పరుగెత్తింది. తండ్రిగారి దగ్గరకు పోయి, ఆయన మోమును తన రెండు హస్తాలతో పుణికి, చెంపలు పట్టి మోము తన వైపు తిప్పుకొని 'నాన్నగారూ...' అని పిలిచింది.

'ఏమిటి తల్లీ ?' అని ఆయన ప్రశ్నించారు.

'నాన్నగారూ ! నేను బావను తప్ప ఎవ్వరినీ పెళ్ళిచేసుకోదలచుకోలేదు. బావ నన్ను చేసుకోకపోతే...'

'ఆఁ ! ఆఁ ! అంతటితో ఆపు. సరే బావనే చేసుకోతల్లీ ! నేను వద్దంటానా' అన్నారాయన. ఆయన హృదయం ఆనందంతో పొంగిపోయింది. పైకి ఏమీ తేల్చని ముఖంపెట్టి 'అత డేమంటాడో ?' అన్నారు.

'ఏమంటాడూ...'

"అదేమిటో 'డూడీ !' అని అంటావు అతన్ని !"

'పెళ్ళయినదాకా నా యిష్టం ? నేను ఎల్లుండి ఉదయమే అత్తగారిని తీసుకుని కొల్లిపర వెడ్తాను. ఉదయం పూర్ణిమయినా నా నక్షత్రం పునర్వసుకు స్వాతి పరమమైత్ర తార ! బావే ఒకనాడు నాతో జ్యోతిష్యాన్ని గూర్చి మాట్లాడుతూ ప్రేమయాత్రికులకు పూర్ణిమ ఉత్తమోత్తమదిన మన్నాడు.'

# భరత వాక్యం

## 1

## మంగళ గీతం

నేనూ మా రంగనాయకమ్మ అత్తగారూ గ్రాండుట్రంకు ఎక్స్‌ప్రెస్‌లో ఆడవాళ్ళ రెండవతరగతి ఎక్కాము. దారిలో కాలం వెళ్ళబుచ్చడానికి అనేక ఇంగ్లీషు నవలలు, ఇంగ్లీషు మాసపత్రికలు కొన్నాను. మా అత్తయ్యగారు చదువుకొనేందుకు కొన్ని వేదాంతగ్రంథాలు తెచ్చుకున్నారు. తెల్లవారగట్లనే వంటయిపోవడంవల్ల మేము భోజనంచేసే రైలెక్కానాము. మధ్యాహ్నానికి టిఫిన్ కారియరునిండా మా అమ్మ ఏవో పెట్టించింది. రైలు కాఫీహోటలుకూడా ఉండనే ఉంటుందాయను.

సాయంకాలం నాలుగున్నరకు తెనాలి చేరుకునేసరికి పదిరోజులు పట్టినట్లేఉంది నాకు. ప్రేమ అంటే ఇట్లాగే ఉంటుంది కాబోలు! మా బావ నాకు కనబడతాడా? మా బావ నన్ను చూస్తాడా? మా బావ, అయిదడుగుల తొమ్మిదంగుళాల మనిషి. యోగమూ, ఆరోగ్యమూ, ఉత్తమజ్ఞానమూ అతని విశాలఫాలంలో, వెడదరొమ్ములో, ఏనుగుకుంభస్థలాలలాంటి భుజాస్కంధంలో, కండలుకట్టి, నునుపులుతేరి, అతని అందమైన చేతుల్లో పొడుగాటి వేళ్ళల్లో గోమూరకటిలో చంద్రబింబంలోని వెన్నెలలా, బంగారంలోని కాంతిలా, తామరపూవులోని మస్సృణత్వంలా, మరువపు మొక్కల పరిమళంలా చుట్టూ ప్రసరిస్తూ ఉంటాయి. ఎంతతీయని, గంభీరమైన మందరపుకంఠ మాతనిది.

ఆతని ప్రేమ గంగాఝురి కాగలదు. అతని ప్రణయము నిశ్చలతచే లోనికి చొచ్చుకొనివెళ్ళే హిమాలయ శిఖరంలా స్వచ్ఛమై, దివ్యోన్నత రూపమై, నిత్యమై ఉండగలదు. ఆతని కామం కాళిదాస కవితవలె దివ్యానందపూరితం కాగలదు. ఆతని పూజ నిత్యనీలనిర్మలాకాశపథాత్మికమై ప్రసరించగలదు. ఆతడు మోహనమూర్తై తల్పంమీద కూర్చునిఉంటే... నేను ఆతని పాదాలకడ మోకరించి, ఆతని కళ్ళల్లోకి చూస్తూ, ఆతని రెండుచేతులూ నా హృదయానికి అదుముకుని, నాజీవిత సర్వస్వమూ నిండిఉన్న ప్రేమను ప్రేమగీతిగా మలచుకొని దివ్యలయగా నా బ్రతుకు స్వనిస్తూఉంటే, వినిపిస్తాను. ఆతడు నా చేతులు రెండూ తీసుకొని తన హృదయానికి అదుముకుంటాడు. అప్పుడాతని అనన్యప్రేమ విశ్వాకృతిలో స్పందిస్తూఉంటే నేనా శ్రుతిలో లీనమైపోతాను! ఆతని ప్రేమ ఆనందరాత్రియగు అమృతమేకాదు. నా జీవితానికి మహత్తరశక్తి ప్రసాదించి, నేను నిజమైన స్త్రీనై, సర్వమానవకోటికి సేవచేయగలదానినై; సర్వ శిశులోకానికి సేవచేయగల మాతనై, సర్వ మహిళామండలానికి సేవచేసే భక్తురాలనై; సర్వ పురుషజాతికీ సేవచేసే

సోదరినై, నా భర్తను, నా పురుషునకు, నా ప్రియునకు, నా స్వామికి అర్ధదేహాన్నై, స్త్రీనై, ప్రియురాలినై అతని ప్రేమసముద్రం తరిస్తూ, నా ప్రేమసముద్రంలో అతన్ని తరింపజేస్తూ ఓలలాడింపజేయగలను. ఇద్దరం ఒక మహాచరిత్ర రచిస్తాం!!

ఈలా ఆలోచించుకుంటూ, ఒకమాటు రైలువేగం గమనిస్తూ, ఆ గంటలన్నీ అతి నెమ్మదిగా ప్రవహిస్తోంటే మతిలేకుండా పుస్తకాలు తిరగవేస్తూ, నాబావను భావించుకుంటూ, కాంక్షిస్తూ రాబోయే మా దాంపత్యాన్ని ఎదుట ప్రత్యక్షం చేసుకుంటూ, ప్రయాణం ఎలాగో...ఎలాగో చేశాను.

రైలు దిగినవెంటనే తెనాలిలో శ్రీనాథమూర్తిబావ చుట్టాల ఇంటికి వెళ్ళాం. అక్కడ స్నానం చేశాము. వారుపెట్టిన ఫలహారాదులు నోట వేసుకొన్నాము. నాజుట్టు పొగవేసి ఆరవేసుకొన్నాను. ఆరగానే వదులుజడ వేసుకొన్నాను. పువ్వులు తెప్పించుకొని అలంకరించుకొన్నాను. పొందూరు ఖద్దరుచీర ఖాదీదుకాణంనుంచి తెప్పించుకొని ధరించాను. సాయంకాలం ఏడుగంటలకు మావాళ్ళు కుదిర్చిన టాక్సీవచ్చింది. ఆ కారులో కొల్లిపర ప్రయాణం చేసి రాత్రి ఎనిమిదింటికి చేరాము. మాతో మా చుట్టాలవారి అబ్బాయి, ఆతనిభార్యా, చిన్నబిడ్డడూ మా రంగనాయకమ్మత్తగారి ప్రోత్సాహంవల్ల కొల్లిపర వచ్చారు.

నా బావగారి ఇంటిదగ్గిర దిగాము. నా కేదో సిగ్గు అలుముకుపోయింది. ఆ ఇల్లు నేను చిన్నతనంలో చూచినా, అంతా కొత్తగా ఉంది. నాలో ఏదో క్రొత్తతనం ఆవహించినట్లయింది.

మా బావ ఇంట్లో లేడు. అతడు గుమ్మందగ్గిరకు, నన్ను లోపలికి ఆహ్వానిస్తూ రాలేదని, గుండెగభుక్కుమన్నది. కాని అదీ మంచిదే అనుకున్నాను.

'అబ్బాయిగోరు యినాయికరావుగోరి తోటలోకి ఎళ్ళారండి' అని ఎవరో చెప్పారు. ఇల్లంతా గడబిడగా ఉంది. భట్టిప్రోలునుంచి శ్రీనాథమూర్తిబావ మేనమామకొడుకు సుబ్రహ్మణ్యమూ, అతని భార్యా వచ్చారుట. మా బావగారి ఇద్దరు అప్పగార్లూ బిడ్డలూ ఇంటినిండా కళకళలాడుతూ ఉన్నారు. ఇల్లంతా పెళ్ళివారిల్లులా ఉంది.

నేనూ రంగనాయకమ్మత్తయ్యా కారు దిగగానే వెంకటరంగమ్మ వదినగారూ, అలిమేలు వదినగారు 'అమ్మ వచ్చిం' దంటూ పరుగుల్లో వచ్చారు. నన్ను చూచి 'శకుంతలా!' అని తెల్లపోయారు. రంగనాయకమ్మత్తయ్య 'శకుంతల చెల్లెలు హేమును ఎరుగరటర్రా!' అన్నారు. వాళ్ళిద్దరు నన్ను కౌగిలించుకొని ఎన్నో ప్రశ్నలవర్షాలు కురిపించారు. 'ఎప్పుడో చిన్నతనంలో చూచాను. 'అచ్చంగా శకుంతలే!' 'అమ్మా! నువ్వూ తమ్ముడూ చెన్నపట్నంలో కాపురం పెట్టినతర్వాత, ఒకసారైనా మమ్మల్నక్కడకు తీసి

కద్దేనా ?' అంటూ వాళ్ళిద్దరూ ఏవేవో అన్నారు. పిల్లలందరూ అమ్మమ్మా అంటూ మా రంగనాయకమ్మత్త మీదకు ఎగబడ్డారు. ఆవిడ తెనాలిలో కొని తెప్పించిన పూలు, మిఠాయి పొట్లాలూ, నేను తెప్పించిన బిస్కటు డబ్బాలూ, బొమ్మలూ, పిప్పరమెంటు బిళ్ళల డబ్బాలు పిల్లలందరికి పంచి యిచ్చారు.

'అమ్మా, హేమా వచ్చారని తమ్ముణ్ణి తీసుకురారా, సుబ్బులూ!' అని అలివేలు వదినగారు సుబ్రహ్మణ్యంగారితో చెప్పి పంపిస్తోంది. ఆ మాటలు వింటూ ఏదో భయంతో వణికిపోయాను.

రంగనాయకమ్మత్తగారు 'హేమకు మేడమీద గది ఒకటి ఇవ్వండత్తా' అంది. అలివేలు వదినగారు 'సుబ్బులూ నీగదిపక్కగదిలో హేము సామాను పెట్టించరా' అని చెప్పింది.

నా సామాను మేడమీదికి తీసుకుపోయి మేడమీది గదిలో పెట్టారు. అక్కడ డీజ్లు దీపం వెలుగుతోంది. నేను ఒక్కదాన్నీ ఆ గదిలో ఏలా ఉంటాను గనుక, శారద అనే మా బావ రెండో మేనకోడలుకూ నాకూ అగది ఏర్పాటయింది. శారదకు ఇరవై ఏళ్లు ఉంటాయి. నాకన్నా ఏడాది పెద్దదనుకుంటాను. ఇంతవరకు పిల్లలెవరూ లేరు. అనేకమంది దేవుళ్లకు మొక్కుతున్నారు. పూజలు, వ్రతాలు, జపాలు చేయిస్తున్నారట. కానీ ఏమీ లాభంలేకపోయింది. ఆ అమ్మాయి నన్ను వింతమృగాన్ని చూచినట్లు చూసింది. నా చీరకట్టే విధానాలూ, నేను తలదువ్వుకొనే విధానమూ, అన్నీ కొత్తగానే ఉన్నాయి ఆమెకు. ఆ అమ్మాయి అక్కగారు సరోజనికి ఇరవై మూడు ఏళ్ళు ఉంటాయి. నలుగురు బిడ్డలతల్లి.

ఇంతట్లో మా బావను తీసుకుని సుబ్రహ్మణ్యంగారు చక్కావచ్చారు. నేను హాలులో కుర్చీమీద కూర్చుని ఏదో పుస్తకం చదువుకుంటున్నానన్న మాటేగాని, మనస్సు దానిమోద లేనేలేదు. బావ రాగానే, 'హేమా! ఎప్పుడు వచ్చావు ? అమ్మ నువ్వూనా ? పొద్దునే బయలుదేరి వచ్చారా ?' అని అడిగాడు. నాకు మాట రాలేదు. ఊరికే తలఊపుతూ నిలుచున్నాను.

## 2

## సిరాజసం

నన్ను చూచిన మాబావకు మోము తెల్లపోయింది. అది నేనుమాత్రం గ్రహించాను. మా బావ దేహవర్ణం నాచాయకన్న రెండు డిగ్రీలు తక్కువ; కాసుబంగారంచాయ అనవచ్చును. నాచాయ బాగాపండిన దబ్బపండు చాయలో గులాబిపూవుచాయ కలిపినట్లుంటుంది. అలాంటి అతనిమోము చాయ ఒక్కసారి తెల్లబడిపోయింది. ఇంతట్లో అత డేదో గంభీర మౌనముద్ర వహించినాడు.

రాత్రి మేమందరం గలిసి భోజనాలు చేశాము. నాకు మాబావ వెండి కంచం పక్కనే వెండికంచం వేశారు. మా కొంటివదినలు చేసినపనది. సుబ్రహ్మణ్యంఅన్న ఎదురుగుండా కూర్చుంటే, అతనిపక్క అతనిభార్య కూచుంది. వెంకటరంగమ్మ అలివేలు వదినలూ, సరోజినీ పిల్లలకోళ్ళలా తమ చిన్నబిడ్డలను చుట్టూ పెట్టుకొని కూర్చున్నారు. పెద్దపిల్లలు విడివిడిగా కూర్చునారు.

మా బావ కొల్లిపర వస్తూనే మనుష్యులను పంపి తన అక్కలను, సుబ్రహ్మణ్యంగార్నీ, అతని భార్యనూ రప్పించాడట. మేము సాయంకాలానికి వస్తామనగా ఆ ఉదయమే సుబ్రహ్మణ్యమూ, అలివేలు వదినగారూ, పది పదకొండు గంటలకు వెంకటరంగమ్మ వదినగారున్నూ వచ్చారు.

మా బావపక్కనే కూరుచుండి కిక్కురుమనకుండా భోజనంచేశాను. ఎందు కాతనిమోము తెల్లబోయింది? ఆతడు నేనంటే అనుమానిస్తున్నాడా? నా కంత భోజనం సయించలేదు. మా బావ చల్లగా భోజనం చేశాడు. మా అలివేలు వదిన ఒకటే వాగుడు. నన్ను లక్షవేళాకోళాలలో ముంచింది. నేను నవ్వుమాత్రంతో భోజనం ముగించాను. భోజనంచేసి మండువాముందు ఆరుబైట సావడిలో కుర్చీలలో కూర్చుని తాంబూలాలు వేసుకుంటున్నాము.

మా బావ నావైపుచూచి, 'హేమా! నిశాపతి వచ్చాడా?' అని అడిగాడు.

ఆ ప్రశ్న నాలోని భిడియాన్నీ కుములుకుంటున్న దుఃఖాన్ని మాయం చేసింది.

'నిన్న సాయంకాలానికి వచ్చాడు బావా! లోకేశ్వరీ నిశాపతుల ఆనందం వర్ణనాతీతం!'

'కాదామరి! వివాహముహూర్తం ఎప్పుడు?'

'వైశాఖశుద్ధమందుట. నేను పూర్తిగా తెలుసుకోలేదు.'

మా బావ తాంబూలం వేసుకొని, లేచి నెమ్మదిగా వీథిలోకి జారాడు. విపరీత వేదన నా హృదయంలో మొలకెత్తింది. అయినా ధైర్యం వీడక, శారదా సుబ్రహ్మణ్యాలతో, మా అక్కసమాధి చూద్దామని బయలుదేరాను.

మా అక్కసమాధి మామిడితోటలో నిర్మించారుట. అక్కడకు అంతకు ముందే ఉదయించిన కృష్ణపాడ్యమి చంద్రుని కాంతిలో, నెమ్మదిగా అడుగులు వేస్తూ తోటలోనికి బయలుదేరాము. శారద 'అత్తయ్యా! నీకీ ఊరు బాగా జ్ఞాపకంలేదా?' అని అడిగింది.

'లేదు శారదా! నేను మిమ్మల్నెవరినీ ఎరగను. మా అమ్మగారివైపు వాళ్లు చెన్నపట్నం వచ్చేవారు. నా ఆరవఏటనే కాదూ, ఈ ఊరువదిలి చెన్నపట్నం వెళ్లామూ!'

‘నేను మా మూర్తిబావ చెన్నపట్నంలో ఉంటూన్నప్పుడు మూడు నాలుగు సారులు వచ్చానుగాని మీ యింటికి రాలేదు’ అని సుబ్రహ్మణ్యం అన్నాడు.

మాతోట వచ్చింది. ఆ తోటలో చక్కని ఎత్తయిన తులసికోట దగ్గరకు వెడుతూంటే నాకు కళ్లు గిఱ్ఱున తిరిగిపోయినవి. అక్కా! నువ్వు లేక పోవడం నా జన్మ కిలాంటి విచిత్ర చరిత్ర ఉదయించింది. ఏ లోకాలలో ఉన్నావు అక్కా? ఏ వెలుగు రూపంతో ఉన్నావు? అని నా హృదయాంతరాలలో కుంగిపోయాను.

మేము ముగ్గురమూ ఆ సమాధి దగ్గరకు వెళ్లేసరికి అక్కడ మా బావ ఆ సమాధి కెదురుగా పద్మాసనంలో అధివసించి ఉన్నాడు. అతన్ని చూచి మేము మువ్వురమూ ఆగిపోయినాము. ఆ ప్రదేశంలో చెట్లేమీ లేవుకాని, ఆ సమాధి బృందామందిరమును చుట్టి వెనుకగా ఎన్నియో పుష్పనికుంజాలున్నవి. ఆ సమాధిపైన ఆలయమందిరం కట్టించడానికి పునాదులు తీసిఉన్నాయి. అక్కడక్కడ రాళ్లూ, సున్నమూ మొదలైనవి ఉన్నాయి. ఇవన్నీ తర్వాత చూడగలిగాను నేను.

వెళ్ళగానే, ఆ సమాధీ మాబావే మాకు కనబడుతా! నెమ్మదిగా వెళ్ళి, నా కాలి చెప్పులు వదలి, మాబావపక్క కూచున్నాను. ఎదురుగుండా మా అక్కసమాధి. నా హృదయంలో ప్రార్థనలేదు, విచారములేదు, ఆవేదన లేదు. ఏదో శాంతి నన్నలుముకుంది. అవిరళమైన నిశ్చలత, అననుభూతమైన తృప్తి, అనధిరహితమైన ఆనందము నన్నలమివేశాయి. చంద్రబింబరహితపూర్ణ జ్యోత్స్నార్ద్రిత పరమపదమధ్యస్థ పద్మాసనావసిత పురుషునిచెంత నే నధివసించి యున్నాను. ఎదుట ఒక మహామందిరం. ఆ మందిరములో నేనూ, నా ఎదుట మోకరించి మాబావా!

ఎక్కడనుండో వీణాస్వనాలు అస్పష్టంగా వినిపిస్తున్నవి. అవి ప్రవహించి మాదగ్గరకు, దగ్గరకు వస్తున్నవి! ఇవన్నీ కరిగిపోయాయి. మా బావ, నేనూ మా అక్క సమాధిదగ్గిర కూర్చుని ఉన్నాము. నన్ను ఎవరో ‘హేమా!’ అని పిలుస్తున్నారు. నిద్రలో ఉన్నవారికై పిలుపు! సగం మెలకువవచ్చి కలలుకంటున్నవారికై పిలుపు! మెలకువ వచ్చిన వారిని పిలుపు! నాకు మెలకువ వచ్చింది. హేమా, అంటూ మా బావ నావైపు తిరిగి పిలుస్తున్నాడు. అతని మాటలలో ఏదో భయం, ఏదో ఆవేదన వ్యక్తం అవుతున్నది.

‘ఆ!’ అంటూ అతనివైపు తిరిగాను.

బావ: హేమా, ఎందుకు వచ్చావు? నేను నీ జీవితాన్ని చెరువు చొచ్చిన మదపుటేనుగులా కదిల్చిపారవేశాను.

నేను: బావా, నీకోసం వచ్చాను. అతి చిన్నతనపు క్షుద్రత్వంతో నా హృదయం నేను తెలుసుకోలేక పారిపోయాను.

బావ: దానికేమి హేమా. ఎవరి ఆత్మను వారే దర్శించుకోవాలి. కాని నా దుష్టత్వం నిన్నింతవరకూ వెంటాడించింది. నీ జీవితం నీది, నీ ప్రేమ నీది అని తెలిసి ఉండీ, నిన్ను వాంఛించి కృత్రిమవేషంతో, దురాశయంతో నీజీవితం భగ్నంచేయడానికి మదరాసు వచ్చాను.

బావ మాటలు నాకు శూలాలైనవి. గుండె రక్తసిక్తమైపోయింది. అతని బుజాలు రెండూ పట్టుకుని కళ్ళనీళ్ళు కారిపోతూ ఉండగా, అతని కళ్ళల్లోకి చూస్తూ నా పెదవులు వణుకుతూ ఉండగా, 'బావా, నా అక్క సమాధిసాక్షిగా చెబుతున్నాను. నేను నాదేహాన్ని అణుమాత్రం పంకిలం చేసుకోలేదు. నామనస్సులో అలా రైలులో వెళ్ళేటప్పుడు నీమీద నిష్కారణమైన కోపం ఒక్కటే ఉంది. ఇంకేమీ లేదు బావా. నాజీవితం అంతా నీమీదే ప్రేమే నిండిఉంది. అందుకనే నేను నాకు తెలియకుండా నువ్వు వచ్చేటంతవరకూ ఎదురుచూస్తూ మదరాసులో ఉన్నాను కాబోలు. ఈ ప్రేమ నేను పుట్టినప్పటినుంచీ ఉండి ఉండాలి. ఈనాడు, నా శిశుత్వంరోజులు, బాలికాదినాలు జ్ఞప్తికి వస్తున్నాయి. అంత చిన్నతనంలోనూ మా అక్క ప్రేమలోనూ, నీ ప్రేమలోనూ నేను జీవించాను. అంతే! నిన్నువదిలి ఉండలేను. నేను అర్హురాలను అనితోస్తే నన్ను నీ హృదయంలోనికి తీసుకో. లేదా, నాజన్మ అంతా సన్యాసమే! దూరాన్నుండి నిన్నే పూజించుకుంటూ—భగవంతుడు నాకిచ్చిన శక్తితో మానవ నారాయణసేవ చేస్తూ కాలం గడుపుతాను' అని గద్గదస్వరంతో పలికాను.

మా బావ నాకేసి ఆ వెన్నెలలో తేరిపార ఒక నిమేషమాత్రం చూచినాడు. మరు నిమేషం నాబావ నన్ను తన హృదయాని కదుముకుని గాఢంగా కౌగిలించాడు. నా మోమెత్తి నాకళ్ళల్లోకి చూస్తూ నా కన్నీళ్ళు తన కండువాతో తుడుస్తూ 'హే...మం!...క్ష...మిం...చు' అని నా పెదవులు ముద్దు పెట్టుకున్నాడు.

## 3

# మహదాశీర్వచనం

నా బావ నన్ను ముద్దు పెట్టుకున్నాడు; నన్ను హృదయాని కదుముకున్నాడు; నా కళ్ళరెప్పలు చుంబించినాడు. అలాగే పది నిముషాలు మేమిరువురమూ చైతన్యరహితులమై ఉన్నాము. అతడు లేచి, నన్ను లేవదీసినాడు. నా బావ నాకు వరమిచ్చిన ముద్దులు బంగారుపళ్ళేన అమరించిన ఏట్టిని

కాబూలు దానిమ్మగింజలులా ఉన్నాయి. నాలో అమృత ప్రవాహాలు ప్రవహింపచేసి నాకు దివ్యత్వమిచ్చి నన్ను లోకలోకాలు ఆవరింపచేసినవి. నాకు పరవశత్వము కలిగి, నా చెలికానిముందు, నా భర్తకడ, నా స్వామి ఎదుట, నా ఆత్మేశ్వరుని పాదాలపై సాష్టాంగమయ్యాను. అతడు నన్ను చేతులుపట్టి పైకెత్తి మరలమరల నా నేత్రాలు, నా కంఠము, నా నుదురు, నా చెవులు, నా పెదవులు, నా చిబుకము, చెంపలు ముద్దులిడగా మేము ఇద్దరం మా అక్క సమాధి దేవాలయానికి సాష్టాంగపడినాము.

*

వెనక్క తిరిగి ఆ వెన్నెట్లో నా బావా నేనూ తిరిగి మా యింటికి వస్తున్నాము. మాలో మాటలులేవు, మాకు సంభాషణ స్ఫురింపదు. మాచుట్టూ కోకిల 'కో' అన్నది ఒకవేపు, ఒకప్రక్క ఊలకోడి కూసింది; వేరేఎడ దూరంగా పొలాల్లో మనుష్యుల పాటలు. దూరాన యూరోపులో, ఆఫ్రికాలో, శాంత అట్లాంటిక్ మహాసముద్రాలలో దారుణ సంగ్రామధ్వనులు. దగ్గర నా దేశంలో స్వాతంత్ర్యములేని ఆర్తనాదం, కమ్ముకువచ్చే కాటకఘోషా. చీనాలో నిశ్శబ్దంగా రాక్షసత్వాన్ని ఎదిరిస్తూ భయంకరయుద్ధాలు చేస్తూ, ఆ రాక్షసత్వానికి ఆహుతి అవుతూ చీనా జాతీయత.

*

మేము ప్రేమమూర్తులమై ఇంటికి చేరాము. ఇంటిల్లిపాదీ మేము ఒక్క మానవవ్యక్తిగా ఒకరిలో ఒకరమై నడిచిరావడం చూచారు కాబోలు. మాపై ఆనందవీక్షణాలు పన్నీటిజల్లులా కురిసినవి. తిన్నగా మేము లోపలికిపోయి, ఇతరులు చూస్తున్నారన్న భయంలేక, మారంగనాయకమ్మత్త ఎదుట మోకరించి మాతలలు ఆమె పాదాలమీద ఆన్చినాము.

ఈ యుగాలబాధ తమలో ఇనుడ్చుకొని చిరునవ్వుతో తాను నడుస్తూ తన బిడ్డల నడిపిస్తూ కూలుతూ కుంగుతూ వేయిరెట్లు బలంతో తిరిగి లేస్తూ విజాతీయుల దాడుల భరిస్తూ, సర్వకష్టాలూ ఆనందంతో గ్రహిస్తూ, నూతన పుత్రకుల హృదయాల కదుముకుంటూ, లోకానికెప్పుడూ దివ్యసంగీతము వినిపిస్తూ ప్రయాణించే భారతధాత్రివంటి మహాఇల్లాలు ఆ తల్లి. ఆ తల్లి కన్నీటినవ్వుతో, వణుకుతూ మా ఇద్దర్నీ లేవదీసి మాటలులేని దివ్యమంత్రాల మమ్ము ఆశీర్వదించి తన హృదయానికి మమ్మిద్దరనూ అదుముకొంది.

*

మా బావ తలపెట్టిన స్త్రీ లలితకళాశాలలో సంగీతపీఠము, సాహిత్యపీఠము, చిత్రవిద్యాపీఠము, శిల్పపీఠము, నాట్యపీఠము, భవననిర్మాణపీఠము, లోకజ్ఞానపీఠము, కళాస్వరూప వృత్తివిద్యాపీఠము అని ఎనిమిది శాఖలుంటాయట. లోకజ్ఞానపీఠంలో ప్రాథమిక, మాధ్యమిక, ఉత్తమవిద్యాభాగాలు

మూడుంటాయట. భూగోళశాస్త్రము, ప్రజాశాస్త్రము, రాజకీయ, ఆర్థిక, పదార్థవిజ్ఞాన, రసాయనిక, పారిశ్రామిక శాస్త్రాలు, వైద్యారోగ్య శాస్త్రాలు, చరిత్ర వ్యవసాయశాస్త్రము మొదలయినవి ఉంటాయట. కళాస్వరూప వృత్తి విద్యాశాఖలో—లక్క-బొమ్మలు, కజ్జబొమ్మలు పింగాణీలు, తివాసీ నేతలు, శాలువపట్టు, శిల్పచర్మకారకత్వము, అద్దకము, అల్లిపేకబెత్తపు అల్లిక, కర్ర సామాను, కంచు మొదలైన లోహాలతో శిల్పవస్తువులు తయారు, పుస్తకముల కట్టు, బైండింగు, చేతికాగితముల తయారు, ఫొటో అచ్చులు తయారు మొదలయిన పనులన్నీ నేర్పుతారుట.

అందరూ ఖద్దరు వడకాలట, ఖద్దరు కట్టాలట. ఇంక కళలవిషయం చెప్పనవసరమే లేదుకదా. ఇది మహాప్రయత్నము. మాబావ ఎల్లా విజయం పొందుతాడో! నాకు మా తలిదండ్రులు నా వివాహంనాడు ఇవ్వదలుచుకొన్న ముప్పయి ఎకరాల మాగాణిభూమీ, ఇతరధనాలు అన్నీ మా అక్క కళాశాలకు ఇవ్వాలని ఆరాత్రే సంకల్పించుకొన్నాను. ఈ విషయం రాత్రి బావా నేనూ మేడమీద మాట్లాడుకొన్నప్పుడు చెప్పాను. మాబావ దిగ్గునలేచి నాచేతులు రెండూ పట్టుకొని, "నువ్వు శకుంతల చెల్లెలివి, శకుంతలవూ, నా హేమవూను!" అన్నాడు.

ఆరాత్రి మా బావను నిద్రపోనీయలేదు. నేను నిద్రపోలేదు. నాకు తక్కిన ప్రపంచమంతా లేనేలేదు. నాకు చంద్రుడు లేడు, వెన్నెలలేదు. నాకు నాబావ త్యాగతిమాత్రం ఎదుట. నా అదృష్టాన్ని నేను నమ్మలేక పోయాను. ఈ ఉత్తమ పురుషుడు నాకు భర్తా? నాది ఎంత ఉత్కృష్ట జన్మ. ఐరోపీయనుపరపీడనం నాశనమవడం తథ్యం; జగత్తులో త్వరలో ధర్మం నెలకొలుపబడి తీరుతుంది అనుకున్నాను.

బావను చూస్తూ అల్లా కూచున్నాను. నా కుర్చీ అతని కుర్చీకి అతి దగ్గరగా జరుపుకున్నాను. ఏదేని వంకతో ఆతనిచేతులుపట్టి, ఏ మాటలఘోర ణిలోనో ఆతని చెంపలు పుణికి, ఏ యాదాలాపాననో ఆతని ఒత్తు నల్లటిజుట్టును నిమిరి, ఆతని ఒళ్ళోకి వాలి, ఆతని కంఠముచుట్టూ చేతులుచుట్టి, అతిసంతోషం తెలపడానికి అతని నుదురు చుంబించి, శరీరం వేడెక్కి పరవశత్వం అలుముకొని పోయి, ఆతని పెదవులను గాఢంగా చుంబించాను.

## 4

## సేసలు

నా వివాహము చెన్నపట్నంలోనే అయింది. మా చుట్టాలు ఎక్క డెక్కడివారూ వచ్చారు. నా వివాహంతోపాటు లోకేశ్వరి వివాహమూ అయింది. ఉదయలగ్నంలో మా వివాహం. లోకేశ్వరి నిశాపతుల వివాహం

రాత్రిలగ్నంలో జరిగింది. లోకేశ్వరి చుట్టాలు, నిశాపతి చుట్టాలు అందరూ కిటకిటలాడిపోయారు. మా మేడ చుట్టుపక్కల మేడలు నాలుగు విడిదలు ఏర్పాటుచేశారు. ప్రసిద్ధాంధ్రగాయకుల కచేరీలు, నారాయణదాసుగారి హరికథాకాలక్షేపం, కూచిపూడివారి నాట్యం, బాలసరస్వతి నాట్యమూ, ఇద్దరు ఉత్తరాది గాయకుల సంగీతసభలు ఈ రెండు పెళ్ళిళ్ళ ఉత్సవాలరోజులలో ఏర్పాటయినవి. చెన్నసగరంలో ప్రసిద్ధులందరూ ఈ వివిధసభలకు వేంచేశారు. నలభీమపాకాల విందు అర్పించారు మా నాన్నగారు. లోకేశ్వరికి వివాహకాలంలో మా నాన్నగారు రెండెకరాల మాగాణి పసుపూ కుంకంక్రింద చదివించారు. వేయిరూపాయల నగలిచ్చినారు. ఈ మహాహోత్సవాలు జరిగిన మూడురోజులూ నా కేదోలోకంలో విహరిస్తున్నట్లే ఉంది. అది గంధర్వలోకమో! స్వర్గలోకమో!

మా బావ రాజకుమారుడులా వచ్చి పెళ్ళిపీటలమీద కూర్చున్నప్పుడు, నా మెళ్ళో మంగళసూత్రం కట్టేటప్పుడు చిరునవ్వుతో మైగుబాళింపులలో మేము ఇరువురము తలంబ్రాలు పోసుకునేటప్పుడు, నేను ఒక లోకోత్తర వధువునని అనుకున్నాను. మా బావ నాకుమాత్రం వినబడేటట్టు "అతివ సతీకకోన్నమితయై విభునావల నేసచల్లె" అని పద్యం చదివినాడు. నాకు చిరునవ్వూ, సిగ్గూ పొంగి పొర్లుకువచ్చాయి. పెళ్ళియి ప్రథమ గృహప్రవేశానికి మా బావ త్యాగరాజనగరం ఇంటికి వెళ్ళాము.

నిశాపతి లోకేశ్వరులూ మా బావగారింట్లోనే గృహప్రవేశమైనారు. నిశాపతి త్యాగరాజనగరంలో సర్వోదయ పాఠశాల కెదురుగా ఒక చిన్న మేడ కొనుక్కున్నాడు. లోకేశ్వరీ నిశాపతీ అక్కడ కాపురం ఉంటారట.

ఈ రోజులలో ఏకరాత్ర వివాహములవలెకాక మా వివాహంతంతు నాలుగురోజులు నడచింది. రెండవరోజున సదస్యమయినది. మూడవరోజున శేషహోమమయినది. శేషహోమమయిన వెనుక నాలుగవనాడు నాకబలి జరిగింది.

అక్కడనుంచి మా బావగారింటికి గృహప్రవేశానికి వచ్చాము. అమరు నాటి ఉదయం నన్నలంకరిస్తున్నారు మా పెద్దవదినెగారు. అప్పుడు బావ లోపలికి వచ్చి, "హేమూ, ఒకసారి ఇల్లారా" అని పిలిచారు. నేను వెంటనే లేచి "ఎందుకూ" అని మా బావదగ్గరకు వచ్చాను. బావ నన్ను పిలిస్తే, ఏవో దివ్యరాజ్యాలన్నీ నాకు అందినట్లే అవుతుంది.

"అబ్బా! సిగ్గన్నాలేదు అత్తయ్యకు" అంది శారద, పకపక నవ్వుతూ. నేను బావవెనకాలే వెళ్ళాను. బావ నన్ను తన శిల్పమందిరములోనికి తీసుకొనిపోయారు. అక్కడ మే మిద్దరమూ బుద్ధభగవానునకు ప్రణుతులర్పించాము. నా చేయి పట్టుకుని బావ నన్ను ఆ విగ్రహం వెనకాల ఉన్న గుమ్మముదగ్గరకు తీసుకువెళ్ళినారు. ఆ తెర ఒత్తిగించి తాళంతీసి, తలుపులు తెరచి, లోపలికి నానడుము చుట్టూ చేయివేసి తీసుకువెళ్ళినారు.

ఎదురుగా ఒక లోహ పద్మాసనముమీద పంచలోహమూర్తులు రెండు ఉన్నాయి. ఆ విగ్రహాలు రెండూ ఒకేపోలిక. కొంచెం తేడా ఉందేమో! ఒక విగ్రహం నా మూర్తే! రెండవ విగ్రహం మా అక్క ప్రతిమ! ఆ విగ్రహాల ముందు పూజాపరికరాలన్నీ ఉన్నాయి. అత డా విగ్రహాల ఎదుట మోకరిస్తే నేనూ మోకరించాను. సువాసనధూపాలతో, వెండిపూవులలో అమరింపబడిన విద్యుద్దీపాలతో ఆ మందిరము దేవలోకంలోని మందిరంలా ఉంది.

"హేమా! శకుంతలా నువ్వూ నా ఆశయమూర్తులు. శకుంతల నీలో సంపూర్ణరూపంతో ఉంది. మీ ఇద్దరూ ఒకటే! నా సర్వస్వం ఏ అణువూ మినహాయింపులేక నీకు ఇదివరకే అర్పించుకొన్నా! శకుంతలాపూజ, నీపూజ దినదినమూ చేస్తూనే ఉంటున్నాను. నా సర్వేశ్వరీ, నా కళామూర్తీ! నీతో నేను మానవాభ్యుదయంకోసం మన ప్రేమను అంకితం ఇస్తున్నాను. ఇప్పుడే ఆ అంకితం అంటూ ఆ రెండు విగ్రహాలకూ షోడశోపచారపూజ తన భార్యయైన నాతో కలిసి అర్పించారు.

పూజ అయినతర్వాత మేము ఇద్దరం బావ శిల్పగృహంలోకి వెళ్ళి కూర్చున్నాము. మా బావ నే కూర్చున్న సోఫాదగ్గిర క్రిందగా కూర్చొని నా ఒళ్ళో తలపెట్టి నా నడుంచుట్టూ చేయివేసి, "హేమా! నా ప్రేమలోకాలూ విశ్వాలూ ఆవరించే వెలుగువు. ఆ వెలుగుమధ్యంలోనూ నువ్వే, ఆ వెలుగుకు మూలంగానూ నీవే అయివున్నావు! హేమా! నువ్వే శకుంతలవు. నీలో శకుంతల లీనమైపోయింది. నన్ను ప్రేమించవేమో అని ఒకొక్కసారి మానవమాత్రుణ్ణవడంచేత అధైర్యంకలిగి సప్తపాతాళాలకీ కుంగిపోయేవాడిని. ఒక్క మాటలోగాని చూపులోగాని నేను ప్రేమిస్తున్నాను అని నీకు తెలియకుండా సంచరిస్తూ, నిన్ను ప్రతినిమేషమూ, ప్రేమిస్తూ ఉంటిని. నా శిల్పదేవీ! నా కళాపద్మాసనాధిష్ఠానమూర్తీ! ఈనాటికికదా నీయీ భక్తుని అనుగ్రహించావు" అన్నాడు. మా బావ కళ్ళవెంట అమృతమే బాష్పాలై ప్రవహించింది.

'బావా! నువ్వు నన్నెంత మహోత్కృష్టంగా ప్రేమిస్తున్నావో, అంత మహోత్తమంగా నేనూ నిన్ను ప్రేమిస్తున్నాను. నేను పుట్టినప్పటినుంచీ మా అక్కలాగే నిన్నుమాత్రమే ప్రేమించాను కాబోలు. అది ఇప్పుడు నాకు అతి స్పష్టమై, ప్రత్యక్షమైంది' అని నేను సోఫానుంచి దిగజారి మాబావ ఒళ్ళోకి వాలాను.

వెన్నెల ప్రవాహాలు, వెన్నెల తరంగాలు, వెన్నెల మున్నీర్లు, వెన్నెల గభీరాలు విరిగిపడే నీలాల రేఖలు, ఒరుసుకుపోయే నీలాలదూరాలు. ఆ రాత్రి మేడమీద నేనూ, నాబావా! నా బావను ఎంత గాఢంగా చూడగలను? నా బావను ఎంత దగ్గిరగా అదుముకోగలను? ఇద్దరం మా గదిముందు వరండాలో వెన్నెల్లో నుంచున్నాము. మేమిద్దరమూ ఆ వెన్నెల అంతా ఒక్కటిగా చేరిన ఒక్క దివ్యకిరణమైపోయాము.

"ఓం అసతోమా సద్గమయ,
తమసోమాజ్యోతిర్గమయ,
మృత్యోర్మా అమృతం గమయ."

